చారిత్రక సామాజిక నేపథ్యంలో

# తెలుగు సాహిత్య చరిత్ర

రచన

డా॥ ముదిగంటి సుజాతా రెడ్డి

**రోహణమ్ పబ్లికేషన్సు - 4**

2-2-1105/21 రోహణమ్

తిలక్ నగర్, హైదరాబాదు - 500044

# అభిప్రాయం

మనకు ఇంతవరకే చెప్పుకోదగ్గ ఆంధ్రసాహిత్య చరిత్రలున్నాయి- సమగ్రంగానూ, సంగ్రహంగానూ. కొన్ని సాహిత్య విద్యార్థులకు పాఠ్యగ్రంథాలుగా ఉపకరించేవి. మరికొన్ని పరిశోధన జిజ్ఞాస మూలధాతువుగా పండితులను ఉద్దేశించి రాసినవి. ఆయాకాలాల రాజులను బట్టి రాజవంశాలను బట్టి, మహాకవులను బట్టి యుగవిభజన జరిగింది.

డా॥ ముదిగంటి సుజాతారెడ్డిగారు ఆంధ్రదేశ చారిత్రక సామాజిక నేపథ్యాన్ని ఎన్నుకుని ఈ తెలుగు సాహిత్య చరిత్ర రచించారు. ఈవిడ చేసిన యుగ విభజన కూడా ఆయాకాలాల మహాకవుల పేరిటనే జరిగింది. అయితే ఆధునిక యుగానికొచ్చేసరికి వీరేశలింగం, కృష్ణశాస్త్రి గార్ల పేర్లతో యుగాలను నిర్దేశించడం ఈవిడ చూపిన విలక్షణ దృక్పథం. శ్రీ శ్రీయుగం అనడంలో ఎవరికీ విప్రతిపత్తి ఉండదనుకుంటాను. ఆ తరువాత వెలువడిన సాహిత్యోద్యమాలనూ, ధోరణులనూ వీరు శ్రీశ్రీ యుగంలోనే చేర్చారు.

డా॥ సుజాతారెడ్డిగారు కొన్ని స్వచ్ఛందమైన అభిప్రాయాలు ప్రకటించారు. ఉదాహరణకు ప్రసన్న కథా కవితార్థయుక్తిని వివరిస్తూ అర్థయుక్తికి "చమత్కార పూర్ణమైన మాటలు కలిగి వుండటమే" అని అర్థంచెప్పారు. నన్నయ చెప్పిన "రుచిరార్థసూక్తి"ని వక్రోక్తిగా వ్యాఖ్యానించారు. ఇలాంటి చర్చనీయాంశాలతోపాటు "తిక్కన కాలంలోనే అదేశ్యాలు 'తరాజు' వంటి పదాలు తెలుగులో చేరాయి" అని ప్రకటించారు. తిక్కన వాడిన "త్రాసు" అనే పదం "తరాజు" అనే ఫారసీశబ్దం నుంచి పుట్టింది. శ్రీనాథుని నాటికే "కాగితం" ప్రవేశించిందని ఈవిడ అన్నది నిజం "కాగితం" అనే మాట కూడా "కాగజ్" అనే ఫారసీ శబ్ద భవం.

1950 తరువాత అభ్యుదయ కవులు ఏ రకంగా నెహ్రూప్రభావంతో విశ్వశాంతిని ప్రబోధించే కవితలు రాశారో డా॥సుజాతారెడ్డిగారు వివరించడం ఎంతో సముచితంగా ఉంది. స్త్రీవాద రచనల్లోని అశ్లీల పదాలతో పాటు దళిత కవుల రచనల్లోని కొన్ని అసభ్యపదాలను ఉదాహరించడం డా॥సుజాతారెడ్డి వస్త్వాశ్రయ విమర్శనా దృష్టికి నిదర్శనం. ఈ గ్రంథం ముగింపులో "మధ్యలో నవల, కథానికలు, విమర్శలు తెలుగు కవిత్వాన్ని కొంతవరకు వెనుకకు నెట్టాయి" అని సుజాతారెడ్డిగారు చేసిన ప్రకటన పాక్షిక సత్యం మాత్రమే. తెలుగునాట ఆధునిక కవిత్వం అన్ని దశల్లోనూ అగ్రేసరంగా ఉంది. దృక్పథాలు మారొచ్చు. ధోరణులు మారొచ్చు. కవిత్వం మాత్రం స్తబ్ధమైపోలేదని నా అభిప్రాయం. వెయ్యేళ్ల తెలుగుసాహిత్య చరిత్రను 420 పుటల్లో పఠనీయశైలిలో అందించిన డా॥ సుజాతారెడ్డిగారి కృషి అభినందనీయం.

జ్ఞానపీఠ పురస్కార గ్రహీత, పద్మభూషణ్

**డా॥ సి. నారాయణ రెడ్డి**

(సినారె)

# ఆహ్వానించదగిన

# మరో సాహిత్య చరిత్ర

తెలుగులో సాహిత్య చరిత్రలు చాలానే ఉన్నాయి. అందులో కొన్ని ప్రామాణికమైనవి, ప్రసిద్ధమైనవి కూడా. "మరల నిదేల రామాయణంబు" అన్నట్టు మళ్లీ ఇంకో సాహిత్య చరిత్ర ఏమిటి? అనే ప్రశ్న అడగటానికి వీలుంది. అయితే 'నా భక్తి రచనలు నావి' వంటి సమాధానాలు ఇక్కడ చెల్లవు. శ్రీమతి ముదిగంటి సుజాత గారికీ సంగతి బాగా తెలుసు. అందుకే ఇది ఇంకో సాహిత్యచరిత్ర అయినా పూర్వ గ్రంథాల కన్నా కొంత భిన్నంగా రచించారు. ఇంగ్లీషులో చెపితే another history of literature with a difference.

మనకున్న చాలా సాహిత్య చరిత్ర గ్రంథాల్లో సమకాలిక సాహిత్య చరిత్ర ఉండదు. సమకాలిక చరిత్రలో నిర్ణయాలు చేయటంలో క్లేశాలున్నాయి.. ఒక పట్టాన సమకాలికులను ఒప్పించలేము. అందులో ఆయా ధోరణులతో గాఢ పరియమో, పాత్రో ఉన్న వాళ్లను అసలు మెప్పించలేము. అక్కడిదాకా ఎందుకు? ఇంకాసేపట్లో నేను ఈగ్రంథకర్త్రితో పేచీ పెట్టుకోబోతున్నాను. పేచీలొస్తాయని సమకాలాన్ని వదిలెయ్యలేం. ఇంకోమూడేళ్లు గడిస్తే ఇంకో శతాబ్దంలో కొచ్చిపడతాం. అప్పుడొక శతాబ్దాన్ని కాని, శతాబ్దంలో కొంత భాగాన్ని కాని వదిలెయ్యటం కుదరదు కదా।

ఇంతకు ముందు వచ్చిన సాహిత్యచరిత్రల్లో సాహిత్యవిమర్శ పాలు ఎక్కువ ఉండేది. సాహిత్యవిమర్శ ఎక్కువ అభివృద్ధి కాని దశలో అట్లాంటి పుస్తకాలు అవసరం ఉండేది. అట్లాగే కర్తృత్వ కాలాదికాల చర్చలతివిస్తృతంగా ఉండేవి. అప్పుడా 'నిర్ణయాలు ప్రాథమిక దశలో ఉండటం వల్ల ఆ చర్చలవసరమయ్యేవి. ఇవాళ రంగనాథరామాయణ కర్తృత్వం గురించి కాని, నన్నెచోడుడి కాలాన్ని గురించి గాని విస్తృత చర్చలు అవసరంలేదు. ఇప్పుడు కొత్తగా దొరికే సాక్ష్యాధారాలేమి ఉండవు . ఉన్న నిర్ణయాల్లో ఏవో ఒకటి ఎన్నుకోటం తప్ప

కొత్త నిర్ణయాలు చెయ్యటానిక కొత్త సమాచారం ఏమీలేదు. అందువల్ల ఈనాటి విద్యార్థికి కావల్సింది ఈ చర్చలు కావు. మన సాహిత్యవారసత్వం ఏమిటో సంక్షిప్తంగా విప్పి చెప్పే గ్రంథాలు. సుజాతగారు ప్రయత్నించింది సరిగ్గా అట్లాంటి గ్రంథంకోసమే లక్ష్యశుద్ధి ఉంది కాబట్టి సఫలమయ్యారు కూడా.

నాకు ఈపుస్తకంలో ప్రప్రథమంగా నచ్చిందొకటి ఉంది. పూర్వ సాహిత్య గ్రంథాల్లో తెలుగు భాషా చరిత్రను దాదాపు వదిలేస్తారు. ఒకరిద్దరు పట్టించుకున్నా ఆ చరిత్ర చాలా వరకు ఊహలమీద ఆధారపడి ఉంటుంది. తెలుగుభాషా చరిత్రపై ఈ శతాబ్దంలో ముఖ్యంగా ఉత్తరార్థంలో చాలా పరిశోధన జరిగింది. ఆ ఫలితాలను ఆరంభం, ప్రాఙ్నన్నయ యుగం అనే అధ్యాయాల్లో విద్యార్థు లకవసరమనుకున్నంత వరకు సుజాతగారు సమకూర్చారు.

పూర్వ సాహిత్యచరిత్రల్లో రాజకీయ చారిత్రకాంశాల ప్రస్తావన తక్కువుండేది. కవిత్వవేది రాజకీయాంశాల ప్రమేయాన్ని గుర్తించారు. సుజాతగారి పుస్తకంలో ఈ అంశాల సమన్వయం సమర్థనీయంగా ఉంది.

పూర్వ సాహిత్య చరిత్రగంథాల్లో తెలంగాణ ఒక అజ్ఞాత ప్రాంతంగా కనిపించేది. సాహిత్య చరిత్ర అంతా తెలంగాణేతర ప్రాంతంలో జరిగిందా? అని (అవసరంకొద్దీ కొంత అతిశయోక్తి వాడినందునకు క్షమించండి) అనుమానం వచ్చేది. సుజాత గారి పుస్తకంలో ఆ లోపం చాలా వరకు తీరింది. పూర్తిగా తీరాలంటే ఇంకా పరిశోధన జరగాల్సి ఉంటుంది. వేములవాడ భీమకవిని గూర్చి రాసిన చోట సుజాతగారు చాలా మౌలికంగా ఆలోచించారు. అట్లాగే నన్నయగారు నానారుచిరార్థ సూక్తి నిధి అని చెప్పుకోటంలో ఉద్దేశించిన అర్థాన్ని వక్రోక్తిపరంగా రమణీయంగా వ్యాఖ్యానించారు.

శ్రీనాథయుగాన్ని గురించి రాసిన అధ్యాయం చాలా మౌలికంగా చదువుకోటానికి ఆహ్లాదకరంగా ఉంది. ఈ అధ్యాయంలో సుజాతగారు కొన్ని సరసమైన ఊహలు చేశారు. పోతన, మొల్ల రామభక్తులు కావటానికి రామానుజాచార్యుల ప్రథమ శిష్యుడు రామానందుడు దక్షిణ దేశం నుంచి ఉత్తర

దేశంపోతూ రామభక్తిని ఆంధ్రదేశంలో ప్రచారం చేశాడనేది ఒక ఊహ. పోతన స్నానం చేసిన గంగ ధర్మపురి దగ్గర గోదావరి అయిఉంటుందనే ఇంకో ఊహ. దీనికాధారం తెలంగాణాలో గోదావరిని గంగ అనటం. పోతన కావటానికి భక్త కవే అయినా మూలంలో లేని యుద్ధ వర్ణనలలో చూపిన వాస్తవికత, శృంగార వర్ణనలలో చూపిన కల్పనలను సుజాతగారు ప్రదర్శించారు.

సుజాతగారు మహాకవుల పేరిట యుగవిభజన చేశారు. సాహిత్య చరిత్రను మహాకవులు నిర్మిస్తారు అన్న గుప్త భావన ఇందుక్కారణం అనుకుంటాను. నా మట్టుకు నాకు సాహిత్య చరిత్ర నిర్మాణంలో మహాకవులకు, అల్పకవులకూ, అసలు కవులు కానివారికీ పాత్ర ఉంటుంది. ఈ విషయంలో వీరు సంప్రదాయ మార్గాన్నే అనుసరించారు. ఆధునిక సాహిత్యంలో వ్యక్తుల పేరిట యుగవిభజన అసలే కుదరదు. ఉదాహరణకు కృష్ణశాస్త్రి యుగం అన్నాం అనుకోండి. జాషువా, త్రిపురనేని చలం, ఏమవుతారు? శ్రీ శ్రీయుగం అన్నామనుకోండి కుటుంబరావు గోపీచందులేంకావాలి? మరి విశ్వనాథయుగం లేదేం? నవ్యసంప్రదాయయుగ కర్తకాదా ఆయన? ప్రాచీన కాలంలో కూడా ఈ యుగవిభజనలు ఎంతవరకు పయోగిస్తాయో చెప్పలేం. ఒక గొప్ప కవినో, రచయితనో యుగకర్త చెయ్యటం అంత సమజంసం కాదు. ప్రబంధయుగంలో శ్రీకృష్ణదేవరాయలను ఎందుకు నాయకుణ్ణి చెయ్యాలి? పెద్దన, తిమ్మన, రామరాజు భూషణుడు తక్కువవాళ్లా? ప్రబంధాలకు అసలు నమూనాగా నిల్చింది వసుచరిత్రయే.

ఇక ఆధునిక యుగానికి వస్తే - కన్యా శుల్కంలో రసధ్వని కన్నా వస్తుధ్వని ఉందన్నారు. ఆ మార్గంలో రాయని జీవితమంత నాటకాన్ని ఏదో ఒక రసానికో ధ్వనికో కుదించటం ఏం న్యాయం? ఊహా ప్రేయసి సిద్ధాంతం భావ కవులందరి పట్ల వర్తించదు. నాయని వత్సల ఊహా ప్రేయసి కాదు. శ్రీశ్రీ 1933 నాటికే భావకవిత్వ ధోరణిలో పద్యాలు రాయటంలేదు. అతని ప్రభవ 1928లో అచ్చయింది.

1950 దశకంలో కవులు శాంతిగానం చెయ్యటానికి నారాయణరెడ్డి మార్గం అనేది కారణం కాదు. అప్పటి ప్రచ్ఛన్న యుద్ధం ప్రపచంరాజకీయాల్లో శాంతి

యుద్ధం (Peace offence) అనేదాన్ని ఒక మార్గంగా సోవియట్ కూటం రాజ్యాలు అవలంబిచాయి హిందీ- రూసీ భాయ్ భాయ్, హిందీ- చీనీ భాయ్ భాయ్ రోజులవి. అది మనకమ్యూనిస్టులూ, కవులూ ప్రచారం చేశారు. శాంతిమార్గం కూడ కమ్యూనిస్టు కవుల మార్గమే. ఈ శాంతియుద్ధం తృతీయమార్గానుయాయుల అభివృద్ధికి అనుకూలంగా కనిపించింది.

1970 వరకు అరసం మానవతావాదం, దిగంబర కవిత్వం రూపాలతో కొనసాగింది అనటం సరికాదు. (పే..390) దిగంబర కవులు అరసం కవులను చాలా హేళన చేశారు. విరసం వారు శ్రీశ్రీని విరసం యుగకర్త అనలేదు. అందువల్ల విరసంకు కూడా యుగ ఆరంభకుడు యుగకర్త శ్రీశ్రీ అయినాడు అనటం సమజంసం కాదు.

విరసం వాళ్లకు జాతీయం కన్నా అంతర్జాతీయం మీద దృష్టి ఎక్కువ (పే. 392) అనే మాటను అరసం, విరసం రెండూ ఒప్పుకోవు. కమ్యూనిజం అంతర్జాతీయ సిద్ధాంతం. జాతీయ సమస్యలపైన అంతర్జాతీయ పరిస్థితుల ప్రభావం ఉందని కమ్యూనిస్టులంతా విశ్వసిస్తారు. ఈ నమ్మకం ఇప్పుడు కమ్యూనిస్టులకు మాత్రమే పరిమితమైనదికాదు.

సెక్సు, జండర్ అనే పదాలను గురించి (పే. 400) ఇంకాస్త వివరణ ఇచ్చి ఉండాల్సింది. సెక్సు, జండర్ అనే మాటలను స్త్రీవాదులు వేరు వేరు అర్థాల్లో ప్రయోగిస్తారు. సెక్సు ప్రకృతి సిద్ధమైనది. జండర్ సమాజం ఆరోపించింది. ప్రవర్తనలో కనిపించే ఆడతనం, ఆ సమాజంలో విధించిన ఆడపనులు సహజ సిద్ధాలుకావు. పితృస్వామ్య సమాజం విధించినవి. ఇవి స్త్రీని పురుషుడికవసరమైన స్త్రీగా తయారు చెయ్యటానికి ఉద్దేశించినవి.

రంగనాయకమ్మ గారి జానకి విముక్తి స్త్రీవాద ధోరణిని చిత్రించిన మొదటి నవల (పే.401) అంటే రచయిత్రీ ఒప్పుకోరు. స్త్రీవాదులూ ఒప్పుకోరు. ఎవరి కారణాలు వారివి.

స్త్రీవాదంలో స్త్రీ శరీరాన్ని ద్వేషించడం కన్పిస్తున్నది (పే.402) అన్నారు. స్త్రీవాదులు స్త్రీ శరీరాన్ని ద్వేషించరు. ప్రేమిస్తారు. దోపిడీ చెయ్యటాన్ని ద్వేషిస్తారు.

జయప్రభ "సూర్యడు కూడా ఉదయిస్తాడు" అనే కావ్య కర్తృత్వంలో విశ్వనాథ సూర్యనారాయణకు భాగం ఉంది. దీంట్లోనూ,యుద్ధోన్ముఖంగా అనే పుస్తకంలోనూ స్త్రీవాద కవితలు లేవు.

స్త్రీవాద కవిత్వాల్లో "అశ్లీలత"ను, దిగంబర కవుల 'జుగుప్సతో పోల్చటం అంగీకార యోగ్యం కాదు. దిగంబర కవిత్వంలో 'అశ్లీలత' స్త్రీని అవమానించేది. స్త్రీ వాదంలో 'అశ్లీలత' స్త్రీని ఆవిష్కరించేది.

నవ్య సంప్రదాయం అనే ప్రయోగంతో నాకేభావం లేదు. ఇది ఉద్యమం కాదు. ఏక కాలంలో జరిగింది కాదు. నవ్య సప్రదాయ కవులనీ ఈ విమర్శకులంటున్న ఆ కవులకు ఆ స్పృ హ ఉన్నట్టు దాఖలాలు లేవు.

చూశారా? ఆధునికయుగం దగ్గర కొస్తే ఎన్ని పేచీలో! ఎవరు రాసినా సమకాలీన సాహిత్యం గురించి పేచీలు తప్పవు. అయినా సుజాతగారు ప్రజాస్వామ్యాన్ని గౌరవించేవారు కనక, నేను భేదించే అంశాలుంటాయని వారికి తెలిసినా నన్ను ఒక ముందుమాట రాయమన్నారు. ఆ సంప్రదాయాన్ని మన్నిస్తూ నేను గౌరవించే అంశాలతో పాటు భేదించే అంశాలను కూడా ఇక్కడ ప్రస్తావించాను. అట్లాంటి సౌకర్యాన్ని కల్పించినందుకు సుజాతగారికి కృతజ్ఞుణ్ణి.

ఆఖరుగా ఒకమాట. పై అభిప్రాయ భేదాలు ఈ పుస్తకం విలువ తగ్గించవు. నేను ప్రస్తావించిన వాటిని నచ్చకపోతే నిరాకరించే హక్కు, నచ్చితే స్వీకరించే అవకాశం, ఎప్పుడూ ఉన్నాయి. ఇంత ప్రయోజనకర పుస్తకాన్ని మనసారా ఆహ్వానిస్తున్నాను.

**- చేరా**

11-10-1996.

# సంగ్రహ సాహిత్య చరిత్ర

సోదరి డా॥ ముదిగంటి సుజాతారెడ్డిగారు సంతత సాహిత్యాలనుశీలనం చేసే విదుషీమణి. వారు రచించిన ప్రతిరచనా ఒక ప్రత్యేకతను సంతరించుకొని వుంటుంది. అది వారి సాహిత్యాని కబ్బిన సౌరభం.

'చారిత్రక సామాజిక నేపథ్యంలో తెలుగు సాహిత్య చరిత్ర' వారి యిప్పటి తాజా రచన. పట్టభద్రస్థాయిలో చాలమంది సీనియర్ ఉపన్యాసకులు పద్య గద్య నాటక భాగాలను చెప్పటానికే ఇష్టపడుతూ ఉంటారు. సాహిత్య చరిత్రను అనుభవంలేని జూనియర్లకు ఇస్తూ వుంటారు. అలా ఇచ్చేవారి అభిప్రాయమేమంటే- సాహిత్య చరిత్రపాఠంలో ప్రత్యేకంగా చెప్పేదేముండదనీ, సాహిత్య చరిత్రల్లో ఉన్న అంశాలను క్రోడీకరించి చెప్పటమేననీ భావించటమే. ఈ భావం వలన విశ్వవిద్యాలయాలలో సాహిత్య చరిత్ర బోధనకు తీరని అన్యాయం జరిగిపోయింది. సాహిత్య చరిత్ర చెప్పగలిగిన ఉపన్యాసకులే ఒక కావ్య ప్రయోగాన్ని నిగ్గు తేల్చి చెప్పగలడు. సాహిత్య వికాసంలో ఆ కావ్యం- లేదా- ఆ రచన ఎటువంటి పాత్ర నిర్వహించిందో నిరూపించగలడు. నేను సాహిత్య చరిత్ర చెప్పిన అధ్యాపకుణ్ణి. అందువల్ల అలా చెప్పేవారిని చూచినా, సాహిత్య చరిత్రను ఏదో రూపంగా వ్రాసేవారిని చూచినా కొండంత గౌరవం, అభిమానం. సోదరి డా॥ సుజాతారెడ్డిగారిని నేను అందుకు అభిమానిస్తున్నాను, అభినందిస్తున్నాను.

'నేపథ్యం' అనే మాట శీర్షికలో విలువైనది. దానికి రెండు మూడు రకాలుగా అర్థంచెప్పుకొని ముందుకు సాగవచ్చు. కొందరు దీనిని ఉదాసీన నేపథ్యంగానే గ్రహిస్తారు. నాటకరంగం మీది ఒకే రంగుగల పెద్దతెరలాగా. ఆయాకాలాలలో తెలియవచ్చే చారిత్రక, సామాజిక పరిస్థితులను వివరిస్తారు. అదేకాలంలో వెలువడిన వివిధ ప్రక్రియల ప్రయోగాలను పేర్కొంటారు. వాటిని కార్యకారణాలుగా గానీ, ప్రేరక ప్రేరణ ద్రవ్యాలుగా గానీ అన్వయించే శ్రద్ధ తీసుకోరు. అందువలన చారిత్రక సామాజిక నేపథ్యం సాహిత్య చరిత్రకు ఎలా దోహదపడిందో ఈ పద్ధతిలో స్పష్టంకాదు.

చారిత్రకాది నేపథ్యం సాహిత్యచరిత్రకు ఎక్కడెక్కడ ఎప్పుడెప్పుడు రచనకు తోడ్పడిందో అక్కడక్కడా చెప్పే పద్ధతి రెండోది. ఇది సమయానుకూల రచన. ఒక

యుగ చైతన్యం మొత్తం చారిత్రకాది నేపథ్యం మీదనే ఆధారపడి ఉంటే దానిని మొత్తంగా అన్వయించటానికి వీలుంటుంది. లేదా యుగచైతన్యాన్ని రూపుకట్టించే రచనలకైనా సమన్వయించటానికి అనువౌతుంది. అదేదీ నిరూపింపబడనప్పుడు ఇది పాక్షిక సమన్వయమే అవుతుంది.

కొందరు చారిత్రక సామాజిక నేపథ్యమే సాహిత్య గతికీ, ప్రగతికీ, సృష్టికీ, వికాసానికీ మూలకారణమనీ, ఏకైక కారణమని భావించేవారున్నారు. ఆ దృష్టితో సాహిత్యంలో వచ్చే పరిణామాలను వ్యాఖ్యానించేవారున్నారు. కాని, ఆ నేపథ్యంకంటె అతీతమైన అస్తిత్వాన్నీ వ్యక్తిత్వాన్నీ సంతరించుకున్న సాహిత్యం ఆయాయుగాలలో ఆవిర్భవించే వాస్తవాన్ని ఆ దృక్పథం అన్వయించి చెప్పలేకపోతోంది.

ఇక మిగిలింది మరొక ప్రశ్న. సాహిత్య చరిత్రలో పరిణామంగాని, వికాసంగాని జరగటం సహజమే. అయితే, అది ఆ క్రమంలోనే ఎందుకు సాగుతోంది? దానికి ప్రేరకశక్తులేమిటి? అనే ప్రశ్నలు మిగిలిపోతుంటాయి. ఇంతవరకు వెలువడిన సాహిత్య చరిత్రలు చారిత్రకంగా - కాలక్రమంగా వచ్చిన మార్పులను చెప్పటానికి యత్నిస్తున్నాయే కాని, అవి ఆ క్రమంలోనే ఎందుకు వెలువడుతున్నాయి అనే ప్రశ్నకు సమాధానం సంతృప్తికరంగా చెప్పలేకపోతున్నాయి. సాహిత్య వికాసంలో చారిత్రక సామాజిక నేపథ్యం కంటె లోతైన అంతర్గతసూత్రం ఒకటి ఉంటుంది. దాన్ని ఆవిష్కరిస్తే తప్ప సాహిత్య వికాసచరిత్ర సాధ్యంకాదు. "సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు"లో నేనీ దృక్పథాన్నే బలంగా ప్రతిపాదించాను.

డాక్టర్ సుజాతారెడ్డిగారు తెలుగు సాహిత్య చరిత్ర వ్రాశారు. కాని ఇది సాహిత్య వికాస చరిత్రకాదు. వికాస చరిత్ర వ్రాయకపోవటం దోషంకాదు కాని, నేడు కావాలసింది వికాసచరిత్ర. అయితే, సాహిత్య చరిత్ర రచనలో వారు కొన్ని ప్రత్యేకతలు ప్రపంచించారు. ఉదాహరణకు ఒకటిరెండు.

1. యుగ విభాగంలో ఏకవాక్యత పాటించటం ఒక విశేషం. యుగాలను యుగకర్తలతో పిలవాలనే నియమాన్ని రచయిత్రి పెట్టుకోటం వల్ల ఈ సౌలభ్యం ఏర్పడింది. శివకవి యుగాన్ని ఈ సందర్భంలో నన్నయ తిక్కన మధ్యయుగమని పేర్కొన్నారు. ఆధునిక సాహిత్య చరిత్రకు వీరేశలింగం యుగం, కృష్ణశాస్త్రీయుగం, శ్రీశ్రీయుగం - అని విభజించి ఒక విధంగా సాహసమే చేశారు. భారతదేశ

స్వాతంత్ర్యోద్యమ చైతన్యం మోసుకొని వచ్చిన కవిత్వానికి గాని, కవిత్వేతర ప్రక్రియలకు గాని చోటు లేకపోవటం అంత సంతృప్తినీయకపోవచ్చును. ప్రాచీనసాహిత్యంలో లాగా నవ్యసాహిత్యయుగంలో కూడా కవితకే పట్టంకట్టడం గతానుగతికంగా వస్తున్న మార్గం.

2. రచన పఠిత చేత చదివించేదిగా ఉండటం మరో విశేషం.

3. సాహిత్య చరిత్రలో కృషిచేసిన పండితులనేకమంది ఎన్నో నూత్నాంశాలను ఇంతకు పూర్వమే ప్రతిపాదించి ఉన్నారు. వాటిని పేర్కొంటున్నప్పుడు ఆయా విమర్శకుల పేర్లను పేర్కొనడం పరిశోధనాత్మకమైన సాహిత్య చరిత్ర రచన పద్ధతి. అయితే, డా॥ సుజాతారెడ్డిగారు 'సాహిత్య చరిత్ర సంగ్రహం' అనే పద్ధతిలో వ్రాసారు కాబట్టి మొదటి నుండి చివరి దాకా ఒకే కథగా సాగుతుంది.అక్కడక్కడా కొందరలా భావిస్తారు. మరి కొందరిలా భావిస్తారు - అని పేర్కొనటం సంగ్రహరచన లక్షణాలే.

సాహిత్య చరిత్ర కర్తకు ఏయే యుగాన్ని గురించి, ఏయే ప్రయోగాన్ని గురించి, పరిణామాన్ని గురించి, రచయితను గురించి ఎంతెంత, ఎలా చెప్పాలనో ఒక నిశ్చితాభిప్రాయం ఉండాలి. యుగాలను, కవులను, రచనలను, ప్రభావాలను, ప్రక్రియలను విలువకట్టటానికి శాస్త్రీయమైన ప్రమాణాలుండాలి. ముఖ్యంగా ప్రక్రియను గురించీ, అదిపుట్టటానికి కారణమైన అంతర్గత సూత్రాన్ని గురించీ ఒక అవగాహన ఉండాలి. డా॥సుజాతారెడ్డిగారు స్పష్టమైన అవగాహన, అభివ్యక్తి గల రచయిత్రి. సాహిత్య చరిత్రను సంగ్రహంగానైనా వ్రాయగలిగారంటే - నేటి వరకూ వచ్చిన, ఇంకావస్తున్న పరిణామాలను గురించి వివరించారంటే- ఆమెసాహిత్యాన్ని సంతతాధ్యయనం చేస్తున్నారన్నమాట అధ్యాపనం చేస్తున్నారన్నమాట!

ఈ రచన చదవగానే అలనాటి ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారి ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారి సాహిత్య (వాఙ్మయ) చరిత్ర సంగ్రహాలు జ్ఞాపకం వచ్చాయి. ఆ వరుసలో నిలిచిన సోదరి డా॥ ముదిగంటి సుజాతారెడ్డిగారిని మనసారా అభినందిస్తున్నారు.

హైదరాబాదు,
2.11.1996.

**జి.వి. సుబ్రహ్మణ్యం**
(జీవియస్)

# నా మాట

తెలుగు సాహిత్య చరిత్రను అధ్యయనం అధ్యాపనం చేస్తున్నప్పుడు సాహిత్య సృష్టిపై రాజకీయ సామాజిక శక్తుల ప్రభావాన్ని అంచనా వేయడం గాని ఎటువంటి నేపథ్యంలో ఎటువంటి సాహిత్యం పుట్టిందనిగాని చెప్పేపద్ధతిని మనం అనుసరించడం లేదనిపించింది. ఆలోటు నాకీ రచనకు ప్రేరణనిచ్చింది. చరిత్ర మీద నాకున్న అభిమానం కూడా నా ఈ రచనకు దోహదం చేసింది.

చుట్టూ వున్న రాజకీయ సామాజిక పరిస్థితుల ప్రభావం కవి మీద పనిచేస్తుంది. అదే విధంగా కవి చైతన్యం అతని చుట్టూవున్న సమాజాన్ని సంస్కృతిని తద్వారా చరిత్రను ప్రభావితం చేస్తుంది. కవి కవితోద్గారంలోని భావజాలంలోను కవితాక్రమ పరిణామ వికాస రూపంలోను అప్రత్యక్షంగా బాహిర శక్తులు ప్రభావం చూపుతాయి. ఒక కవి ముందున్న కవులకన్నా ఉత్తమంగా గొప్పగా వ్రాయాలనుకుంటాడు. దాని అంచనా కవిత్వక్రమపరిణామ వికాస చరిత్ర అవుతుంది. శృంఖలా పద్ధతిలో ఈ ప్రభావం అంటె రాజకీయ సామాజిక ప్రభావం కవి మీద, కవి ప్రభావం రాజకీయ సామాజిక పరిస్థితుల మీద పనిచేస్తాయి. "కదిలేది కదిలించేది, మారేది మార్పించేది" నవకవనానికి కావాలన్నపుడు చరిత్ర సమాజం ప్రభావం కవి మీద వుండడమే కాక చరిత్రను సమాజాన్ని కవి నడిపిస్తాడని శ్రీశ్రీ భావించినట్లుగా తెలుస్తున్నది.

నాఈ తెలుగు సాహిత్యచరిత్రలో యుగవిభజనను కవుల పేరిట చేసాను. ఆయా కాలాల్లో తమ వ్యక్తిత్వం పాండిత్యం కవిత్వం కావ్యాలతో ప్రభావితం చేసిన కవుల పేరిట యుగాల పేరు పెట్టాను. ఉదా॥కు - శ్రీకృష్ణదేవరాయల యుగంలో శ్రీకృష్ణదేవరాయలు చక్రవర్తిగా కవిచక్రవర్తిగా తన ప్రభావాన్ని చూపాడు. భాష, భావప్రకటన వక్రోక్తుల క్రమవికాసం కవిత్వ పరిణామం ఫలితంగా అతని కాలంలో తెలుగులో ప్రబంధప్రక్రియ వికసించింది. ఆయన స్వయంగా ప్రబంధాన్ని వ్రాసాడు. ఆయన కంకితంగా ప్రబంధాలు వ్రాసిన కవులు ప్రబంధ ప్రక్రియకు ఒక రూపాన్ని

చ్చారు. ఆ తర్వాత ప్రబంధ ప్రక్రియ ఇంకా వికసించి ప్రౌఢరూపాన్ని ధరించింది. పిల్లమను చరిత్రలు పిల్లవసు చరిత్రల రచనలకు మూలాలైన ప్రబంధాలు వ్రాసిన పెద్దన రామరామ భూషణుల వంటి ప్రతిభవున్న కవులు ఈ యుగంలో వున్నారు? వాళ్ళపేరిట ఈ యుగాన్ని పిలువవచ్చునని కదా! అంటె ప్రతిభ ఒక్కటె యుగకర్తగా నిలవడానికి సరిపోదు. యుగకర్త అయిన కవి ఆ యుగాన్నంతటిని ప్రభావితం చేసి ఆ యుగంలోని కవులకు స్ఫూర్తినిచ్చి ఆదర్శంగా నిలచేవాడై వుండాలి. ఆయుగంలోని కవితాప్రక్రియావైశిష్ట్యాన్ని నడిపించగలిగిన వాడు కావాలి. అందుకే పోతన ప్రతిభగల కవి అయినా అతని కాలం శ్రీనాథుని యుగంగానే చెప్తున్నాం. అదే విధంగా కృష్ణశాస్త్రియుగం అనడం వల్ల కాల్పనికతతో కూడిన భావకవితాలక్షణమంతా బాగా ప్రతిఫలిస్తున్నది. ఆ కాలానికి గురజాడనో రాయప్రోలునో యుగకర్తగా చేస్తే ఆ యుగ లక్షణం పూర్తిగా ప్రతిఫలించడం లేదేమో అని నాకనిపించింది. రాయప్రోలు భావ కవులకు ఆదర్శంగా నిలిస్తే గురజాడ అభ్యుదయ కవులకు ఆదర్శంగా నిలిచాడు. కాబట్టి ఆ మహానుభావులను నవ్యకవితోద్యమానికి మూలవిరాట్టులుగా నవ్యరీతులను నూతన ప్రమాణాలను సృష్టించి ఇచ్చిన గురువులుగా స్వీకరిస్తే బాగుంటుదని నాకనిపించింది.

దక్షిణ భారతంలో నాయకరాజుల పాలనలోనూ ఆంధ్రప్రాంతంలో బ్రిటిషు పాలనలోనూ తెలంగాణాలో కుతుబ్‌షాహీల పాలనలోనూ జరిగిన సాహిత్య సృష్టిని గురించి చెప్పి ఆ తర్వాత కాలాన్ని వీరేశలింగం యుగంగా చెప్పాను. రాజకీయంగా సామాజికంగా ఆయుగావతరణ యుగపరివర్తన జరిగిన తీరును వివరంగా చెప్పాను. అది పునరుజ్జీవనం సంఘసంస్కరణోద్యమాలు దేశాన్ని జాతిని పునర్జీవితం చేసిన కాలం. వాటికి ఆంధ్రదేశంలో నాయకుడు వీరేశలింగం. అతనికి ముందున్న కాలం ముఖ్యంగా 18వ శతాబ్దం ఉత్తర భాగం 19వశతాబ్దం పూర్వభాగంలో బ్రిటిషు పాలనలో అప్పటి రాజకీయ సామాజిక వాతావరణ ప్రభావంతో మౌలికత లేని సాహిత్యం వచ్చింది. సాహిత్యం తన చైతన్యశక్తిని పోగొట్టుకుంది. అప్పటి రాజకీయ సామాజిక సంధి కాలంలోని కవుల నిరాశానిస్పృహలు శతకాల్లో ప్రతిబింబించాయి.

ఎప్పుడైతే పునరుజ్జీవనోద్యమం సంఘసంస్కరణోద్యమాల చేత జాతి పునర్జాగృతమైందో అప్పుడు నవ్యసాహిత్యోద్యమం కూడా సాగింది. నూతన చైతన్యం వీరేశలింగం యుగంలో పుట్టి నవ్యసాహిత్యావిర్భావానికి కారణమైంది.

19వ శతాబ్దం చివర, 20వ శతాబ్దారంభంలో వ్యాహరిక భాషావికాసానికి కృషి చేసిన వాళ్ళెందరో వున్నారు. కాని వ్యావహారిక భాషోద్యమం అనగానే దానికి మూలస్తంభంగా నిలచిన గిడుగు రామమూర్తి పంతులు గుర్తుకు వస్తాడు. ఉద్యమాన్ని నడిపేవాళ్ళు చాలా మంది వున్నా పథనిర్దేశం చేసి ఉద్యమం విచ్ఛిన్నం కాకుండా అందరినీ ఒక్క తాటి మీద నడిపే వ్యక్తి ఒక్కడే వుంటాడు. ఉద్యమం బహునాయకత్వంతో చీలికలతో సఫలం కాని సందర్భాలెన్నో చరిత్రలో వున్నాయి. భారతస్వాతంత్ర్య సమరం గాంధీజీ రాకపూర్వం పాయలుగ ప్రాంతీయంగా వుండింది. గాంధీజీ నాయకత్వంలో ఏకోన్ముఖంగా జాతీయోద్యమంగా నడిచి ధ్యేయాన్ని సాధించింది. చరిత్రలో వ్యక్తులు ప్రధానం కాకూడదు. కాని వ్యక్తులు చరిత్రను మలుపు తిప్పిన సందర్భాలనేకం వున్నాయి. రష్యాలో ప్రజావిప్లవం లెనిన్ నాయకత్వంలో ఫలించింది. అదే విధంగా మావో నాయకత్వంలో చైనా చరిత్ర మనకు తెలిసిందే. అట్లా వ్యక్తులు ప్రధానం కాకపోయినా చాలా సార్లు ఉద్యమాలు విప్లవాలు వ్యక్తుల సామర్థ్యాన్ని బట్టి సఫలం కావడం విఫలం కావడం జరుగుతుంది. ఈసాహిత్య చరిత్రలో వ్యక్తులకు ప్రాధాన్యాన్నిచ్చి యుగాలకు పేర్లు పెట్టాను. ఆయా యుగాల్లోని కవితోద్యమాలకు వాళ్ళు ప్రతినిధులుగా నాయకులుగా వున్నారు. కాబట్టి యుగవిభజనను సాహిత్యచరిత్రలో కవుల పేరిట చేయడం సమంజమని నాకనిపించిది.

ఈ తెలుగు సాహిత్య చరిత్రలో 410 పేజీలో సోవియట్ రష్యాలో స్త్రీ పురుషసంబంధాలకు సంబందించిన ప్రయోగాన్ని గురించి చర్చించాను. ఆ ప్రయోగాన్ని గురించి నేను శ్రీ ఎస్. వి. శేషగిరి రావు రచించిన "ఎండ్ ఆఫ్ కమ్యూనిస్టు యుటోపియా" అనే పుస్తకంలో చదివాను. మానవుని మనస్సులోని

కొన్ని అనురాగాలు అనుబంధాలు సహజమైనవి వ్యక్తిగతమైనవి - ఇతరులతో పెంచుకోలేనివి వుంటాయని దానివల్ల తెలుస్తున్నది.

నా ఈ తెలుగు సాహిత్య చరిత్రలో స్థలాబావం వల్ల కొందరు కవులను గురించి కొన్ని విషయాలను గురించి సంగ్రహంగా చెప్పవలసి వచ్చింది. కొన్ని వదిలేయవలసి వచ్చింది. ఈ బృహత్ రచనలో నా అశ్రద్ధ వల్ల కొన్ని, అచ్చుయంత్రం వల్ల కొన్ని దోషాలు దొర్లాయి. వాటిని కొన్నిటిని సవరణ పట్టికలో ఇచ్చాను. సహృదయ పాఠకులు ఆ పట్టికను చదివింతర్వాతనే ముందుకు సాగాలని అభ్యర్థిస్తున్నాను.

నా ఈ తెలుగుసాహిత్య చరిత్రకు తమ అభిప్రాయలను తెలుపుతూ ముందుమాటలు వ్రాయమని అర్థించగానే స్నేహాభిమానంతో వ్రాసి యిచ్చిన పద్మభూషణ డా.సి. నారాయణరెడ్డి (సినారె)గారికి శ్రీ చేకూరి రామారావు (చేరా) గారికి డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం (జీవియస్) గారికి నా హృయపూర్వకమైన కృతజ్ఞతాభివందనాలు తెలియజేస్తున్నాను. వారి అభిప్రాయాల వేదిక వల్ల నా పుస్తక గౌరవం పెరిగిందని భావిస్తున్నాను.

నా ఈ రచనలోనూ ముద్రణలోనూ చేదోడుగా నిలిచిన నా భర్త ఆచార్యగోపాలరెడ్డిని స్మరించకపోతే "నామాట" అసంపూర్ణంగానే వుండిపోతుంది.

ఇక నా ఈ తెలుగు సాహిత్యచరిత్ర ప్రచురణార్థం ఉడుత సహాయంగా 5000/- రూ॥లు ఇచ్చిన తెలుగు విశ్వవిద్యాలయాధికారులకు నా కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

2-11-96 **ముదిగంటి సుజాతా రెడ్డి**

# విషయ సూచిక

# సవరణల పట్టిక

| పేజి | వరుస | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 85 | 11 | శ్రీమతి పండితుడు | శ్రీపతి పండితుడు |
| 160 | 19 | తిక్కన కాలంలోనే ఉర్దూ నుంచి తరాజు వంటి పదాలు తెలుగులో చేరాయి | తిక్కన కాలంలోనే తరాజు వంటి అన్య దేశ్యాలు తెలుగులో చేరాయి. |
| 290 | 7 | కంకటి పాపరాజు | కంకంటి పాపరాజు |
| 308 | 7 | కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రి సనాతన ధర్మాభిమానం పరవస్తువేంకటరంగాచార్యుల వంటి వాళ్ళు క్రైస్తవ మత ప్రచారాన్ని ఎదిరించారు. | కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రి సనాతన ధర్మాభిమానం చూపారు. పరవస్తు వెంకట రంగాచార్యుల వంటివాళ్ళు క్రైస్తవ మత ప్రచారాన్ని ఎదిరించారు. |
| 321 | 9 | అదిగో ద్వారక అవిగో ఆలమందలు | అదిగో ద్వారక ఆలమంద్లలవిగో |
| 323 | 18 | గురజాడ అప్పారావు జననం 1865 | గురజాడ అప్పారావు జననం 1862 |
| 324 | 12 | నీటగిరి పాటలు 1910లో ప్రకటించాడు | నీటగిరి పాటలు 1907లో ప్రకటించాడు |
| 327 | 4 | వేదుల సత్యనారాయణ శర్మ | వేదుల సత్యనారాయణ శాస్త్రి |
| 364 | 12 | బానిస యాజమానుల వ్యవస్థ, పెట్టుబడిదారీ వ్యవస్థ | బానిస యాజమానుల వ్యవస్థ, ఫ్యూడల్ వ్యవస్థ పెట్టుబడిదారీ వ్యవస్థ |
| 372 | 24 | కాని వచన కవితలో విప్లవ కవులు పాటపాడే గేయపద్ధతిని | కాని వచనకవిత స్థానంలో విప్లవకవులు పాటపాడే పద్ధతిని |

| | | | |
|---|---|---|---|
| 389 | 4 | విప్లవకవులు చాలామంది సాయుధ పోరాటంలో | విప్లవకవులు కొందరు సాయుధ పోరాటంలో |
| 390 | 13 | 1970 వరకు అరసం మానవతావాదం దిగంబర రూపాలతో కొనసాగింది | 1970 వరకు అభ్యుదయత్వం మానవతావాదం దిగంబర రూపాలతో కొనసాగింది. |
| 391 | 12 | 1996 జనవరిలో విరసం నాల్గవ మహాసభలు హైద్రాబాదులో జరిగాయి. దళితవాదులు స్త్రీవాదులు ఆ సభలకు హజరు కాలేదు. | 1996లో జనవరిలో నాల్గవ సభలు హైద్రాబాదులో జరిగాయి దళితవాదులు స్త్రీ వాదులు సక్రియులై పాల్గొన లేదు. |
| 392 | 18 | -విప్లవ కవులు వ్రాసిన పాటలు పల్లెపల్లెలకు వ్యాపించాయి. | -విప్లవ కవులు వ్రాసిన కవితలు పాటలు పల్లెపల్లె లకు వ్యాపించాయి. |
| 393 | 3 | ఉద్యమం, నెల బాలుడు | ఉద్యమం నెల బాలుడు, నెలవంక |
| 403 | 14 | -విమర్శకులు పత్రికా రచయితలు స్త్రీవాద సాహిత్యాన్ని బాగా "ఎక్స్ పోజ్" చేసి - | -విమర్శకులు పత్రికా రచయితలు స్త్రీవాద సాహిత్యానికి బాగా "ఎక్స్ పోజన్" ఇచ్చి |
| 404 | 21 | సౌదామిని, రాజ్యలక్ష్మమ్మవంటి వాళ్ళు - | చావలి బంగారమ్మ, విశ్వ సుందరమ్మ, రాజ్యలక్ష్మమ్మ వంటివాళ్ళు - |
| 409 | 10 | పి. సత్యవతి కథలు "ఇల్లలకగానే పండగేనా" సంపుటిగా వచ్చాయి. | పి. సత్యవతి కథలు ఇల్లలుకగానే" -సంపుటిగా వచ్చాయి. |

# 1. ఆరంభం

తెలుగుభాష ద్రావిడ భాషా కుటుంబానికి చెందిందనడం నిర్వివాదాంశం. ప్రాచీన కాలంలో "తల్లి సంస్కృతంబె యెల్ల భాషలకును" తెలుగుకు కూడా తల్లి భాష సంస్కృతమే అని అనుకున్నారు. భాషలను అధ్యయనం చేయడం సమాన లక్షణాలుగల భాషలను ఒక కుటుంబంగా ఏర్పరచడం 19వ శతాబ్దంలోనే ఆరంభమైంది. భారతదేశానికి ఉద్యోగిగా వచ్చిన విలయం జోన్స్ (క్రీ.శ. 1778 ప్రాంతం) సంస్కృతం గ్రీకు లాటిన్ పారశీ భాషల నిర్మాణంలో పోలికలున్నాయని బయటపెట్టాడు. తర్వాత మాక్స్‌ముల్లర్ వంటి జర్మన్ పండితుల చేత భాషాధ్యయనం కొనసాగి తులనాత్మక భాషాధ్యయనం, భాషాశాస్త్రాల ఆవిర్భావం జరిగింది. ప్రపంచ భాషలన్నీ వాటి నిర్మాణ సారూపత్యలను బట్టి ఏడు ప్రధానమైన భాషా కుటుంబాలుగా విభజింపబడినాయి. ఏడింటిలో ద్రావిడ భాషా కుటుంబం ఒకటి.

దక్షిణ భారతంలో మాట్లాడబడే తమిళం తెలుగు కన్నడం మలయాళం లిఖిత సాహిత్యంతో కూడిన భాషలు. ఇవిగాక 12 ఆదివాసులు మాట్లాడే భాషలను ద్రావిడ భాషా కుటుంబానికి చెందిన భాషలుగా రాబర్ట్ కాల్డ్వెల్ మొదటిసారిగా గుర్తించాడు. అంతకుముందే డచ్చివాడైన రాస్మస్ క్రిష్టియన్ రాస్క్ (క్రీ.శ 1787-1832) దక్షిణభారతం భాషలను, సంస్కృతం

నేర్చుకొన్నాడు. దక్షిణభారతం భాషలు సంస్కృతం కన్నా భిన్నమైనవని గుర్తించాడు. ఆయన ఆ భాషలను ద్రావిడ అని కాక మలబారిక్ భాషలని పిలిచాడు. 1816లో ఎ.డి. క్యాంబెల్ వ్రాసిన "ఏ గ్రామర్ టు తెలుగు లాంగ్వేజు" అన్న పుస్తకం పీఠికలో ఫ్రాన్సిస్ ఎల్లిస్ దక్షిణభారతం భాషలు ఒక్క కుటుంబానికి చెందినవని సంస్కృతంతో వాటికి జన్యజనక సంబంధం లేదని చెప్పాడు. బిషప్ రాబర్ట్ కాల్డ్వెల్ 1856లో "ఎ కంపారిటవ్ గ్రామర్ ఆఫ్ ద ద్రవిడయన్ లాంగ్వేజస్ " అనే గ్రంథం వ్రాసి ద్రావిడ భాషల ఏకకుటుంబత్వ సిద్ధాంతాన్ని సమగ్రంగా చర్చించి సోదాహరణలతో నిరూపించాడు. అప్పటి నుంచి ఆ భాషలకు ద్రావిడ భాషలనే పేరు స్థిరపడింది. ఆ కాలంలో కాల్డ్వెల్‌తోపాటు చాలామంది పండితులు ద్రావిడ భాషలు సిథియన్ లేదా తురేనియన్ భాషా కుటుంబానికి చెందినవని భావించారు. ద్రావిడ భాషలకు టర్కీ భాషతో, ఫిన్నిష్ భాషతో యూరపులోని మూల వాసులు మాట్లాడే బాస్క్‌భాషతో - ఇట్లా ఎన్నో భాషలతో సంబంధాన్ని నిరూపించడానికి భాషాశాస్త్రజ్ఞులు ప్రయత్నం చేసారు. క్రీ.పూ. 3000 నాటిదైన మొహంజదారో హరప్పా తవ్వకాల్లో దొరికిన మట్టిసీళ్ళ మీద వున్న చిత్రలిపిని ఇంతవరకు ఎవరూ చదువలేకపోయారు. ఆ భాష సంస్కృతం అని కొందరంటే మరికొందరు అది ద్రావిడ భాష అని అంటున్నారు. ఒకవేళ అది ద్రావిడభాష అని తేలితే ద్రావిడభాషల ప్రాచీనత ధ్రువపడుతుంది. మధ్య తూర్పు ఏషియాలోని సుమేరియన్ నాగరికత (క్రీ.పూ. 3000) అవశేషాల్లో దొరికిన మట్టి ఫలకాల్లో వున్న సుమేరియన్ల భాషకు ద్రావిడ భాషకు సంబంధముందని ద్రావిడులు అక్కడి నుంచి వలస వచ్చిన వారని చారిత్రకులు కొందరంటున్నారు. దేవుళ్ళకు మొక్కుబడులు, వెంట్రుకలు అర్పించడం, పూజలు మొదలయిన మత విశ్వాసాల్లో కూడా సామ్యాలు కన్పిస్తున్నాయి. మొహంజదారో సీళ్ళు కొన్ని అక్కడ దొరికాయి. కాబట్టి ఆ రెండు జాతులకు రాకపోకలు వ్యాపార సంబంధాలున్నాయని

తెలుస్తున్నది. దాన్ని బట్టి ద్రావిడులు అక్కడి నుంచి వచ్చిన వాళ్ళు కాకపోయినా భాషల ఆదానప్రదానాలు తప్పక జరిగి వుంటాయి.

సంస్కృతం మీద వేదకాలం నుంచే ద్రావిడభాషా ప్రభావముందని పండితులు నిరూపించారు. ముఖ్యంగా సంస్కృతంలోని మూర్ధన్యాలు ద్రావిడం నుంచి చేరినవన్నారు. మీన, పండు అనే పదాలు ద్రావిడమే అని తేల్చారు. శృంగవేరం (అల్లం) లోని వేరం "వేరు" అనే ద్రావిడ పదము అన్నారు. ప్రవాళం ద్రావిడ భాషలోని పవడం, పవష్టం నుంచి ఏర్పడిందన్నారు. ద్రావిడభాషలోని మాంబళం సంస్కృతంలో "ఆమ్రఫలం" అయిందన్నారు. డా. హెచ్, గుండర్టు 1869లో జర్మన్ ఓరియంటల్ జర్నల్‌లో "ద్రవిడియన్ ఎలిమెంట్స్ ఇన్ సంస్కృత్" అనే వ్యాసంలో అటువంటి పదాల పట్టికనిచ్చాడు. 1894లో కిట్టెల్ తన కన్నడ ఆంగ్లభాషానిఘంటువు పీఠికలో అటువంటి పదాల పట్టికనొకటి ఇచ్చాడు. కాల్డ్వెల్ కూడా తన ద్రావిడ భాషల తులనాత్మక పరిశీలన గ్రంథంలో సంస్కృత భాషలో చేరిన ద్రావిడ భాషా పదాలను పరిశీలించాడు. బైబిల్‌లో ప్రసిద్ధుడైన రాజు సాలమన్ (క్రీ.పూ. 10వ శ.) కు సమర్పించిన వింతవస్తువుల్లో కోతి, నెమలి వంటి వస్తువులున్నాయి. అయితె వాటికి వాడిన పదాలు ద్రావిడపదాలని పండితులు గుర్తించారు. దాన్ని బట్టి ద్రావిడభాష ప్రాచీనత తెలుస్తున్నది. టి.బరో, ఎమ్.బి. ఎమాన్యు పండితులు కూర్చిన "ద్రవిడియన్ ఎటిమాలజికల్ డిక్షనరీ" (1961) చూస్తే ఎన్నో సంస్కృతధాతువులు ద్రావిడం నుంచి వెళ్ళి చేరినవని తెలుస్తున్నది. అందుకే చిలుకూరి నారాయణరావు "ఆంధ్రభాషా చరిత్రము"లో తెలుగు సంస్కృత జన్యమని నిరూపించడానికి చాలా సామగ్రి దొరికింది.

"ద్రావిడ" పదమే ద్రామిడ —> ద్రమిడ —> తమిళ గా మారిందని కొందరంటారు. అటాకాక తమిళ పదమే దమిళ —> దమిడ —>

దవిడ —> ద్రవిడ —> ద్రావిడగా రూపొందిందని కొందరి అభిప్రాయం. ద్రావిడ పదం మహాభారతంలో జాతిపరంగాను, భరతుని నాట్యశాస్త్రంలో భాషా పరంగాను వాడబడింది. వేదాల్లో పేర్కొనబడిన 'ఫణి' జాతికి చెందినవాళ్ళే ద్రావిడులని ఒక అభిప్రాయముంది. పశ్చిమ ఏషియాలో ఫోనీషియన్లు అనే జాతి వ్యాపారజాతిగా క్రీ.పూ. 2000 నాటికి కన్పిస్తుంది. వాళ్ళు 'ఫణి' జాతి వాళ్ళే అని చారిత్రకుల అభిప్రాయం. తమిళంలో "పణం" అంటె ధనమనే అర్థముంది. తెలుగులో పణం పెట్టడం అని వాడుతున్నాం. మొత్తం మీద "ద్రావిడ" పేరుతో ఒక ప్రాచీన జాతి వుండేదని వాళ్ళు భాషా సంస్కృతులున్నవాళ్ళని తెలుస్తున్నది. ఆ 'ద్రావిడ' పదమే దక్షిణభారత భాషలకు పేరుగా స్థిరపడింది.

ద్రావిడ భాషలన్నీ ఒక మూలభాష నుంచి పుట్టాయని సోదరభాషలని ఆ భాషల మూల భాషకు "మూలద్రావిడ"మని పరిశోధకులు పేరు పెట్టారు. ఇరాన్ ఆఫ్ఘనిస్తానం పాకిస్తాన్ నేపాల్ నుంచి మొదలుకొని కన్యాకుమారి వరకు ఆదివాసులైన జాతులు ద్రావిడ భాషలను మాట్లాడే వాళ్ళున్నారని భాషాశాస్త్రజ్ఞులు గుర్తించారు. ద్రావిడులు భారతదేశంలోని మూలవాసులైన జనులా లేక బయటి నుంచి వచ్చిన వాళ్ళా అనే విషయంలో చారిత్రకులు ఏకాభిప్రాయానికి రాలేకుండా వున్నారు. అదేవిధంగా ద్రావిడ భాషల క్రమ పరిణామ చరిత్ర విషయంలోను పండితుల్లో అభిప్రాయం భేదముంది అనాగరిక ఆదివాసుల భాషలనుంచే ద్రావిడ భాష అభివృద్ధి చెంది క్రమంగా తమిళం తెలుగు మొదలయిన సాహిత్య భాషలుగా రూపొందిందని కొందరంటారు. అట్లాకాక నాగరికులు గొప్ప సంస్కృతిగల జనులైన ద్రావిడుల భాషయే క్రమంగా వివిధ సాహిత్య భాషలుగా, ఆదివాసుల భాషలుగా రూపొందిందని మరి కొందరంటారు. ఈ విధంగా ద్రావిడ జాతి భాషల మూలం గురించి ప్రాచీనతను గురించి క్రమ పరిణామాలను గురించి తేలని అభిప్రాయ భేదాలున్నాయి. మొత్తం మీద మూలద్రావిడ భాష

ఒకటి వుండేదని, తమిళం తెలుగు, కన్నడం, మలయాళం భాషలు ఇంకా ఆదివాసులు మాట్లాడే 70 కి పైగా భాషలు దానికి సంబంధించినవే అని అవన్నీ ద్రావిడ భాషా కుటుంబానికి చెందినవని అందరూ అంగీకరించిన వాదం. అయినా ఆంధ్రదేశంలో కొందరు పండితులు తెలుగు సంస్కృత జన్యమే అని నిరూపించడానికి ప్రయత్నించారు. పోప్, టి.యం.శేషగిరి శాస్త్రి, చిలుకూరి నారాయణరావు మొదలయిన పండితులు తెలుగు సంస్కృతం నుంచి పుట్టిందని వాదించారు. కోరాడ రామకృష్ణయ్య, వజ్ఝల చినసీతారామస్వామి శాస్త్రి, గంటిజోగి సోమయాజి మొదలయిన వాళ్ళు ద్రావిడ భాషావాదాన్ని అంగీకరించి తెలుగు మూలద్రావిడం నుంచి వచ్చిందని వివరించారు.

మూలద్రావిడ భాషా లక్షణాలను తమిళం ఎక్కువగా నిల్పుకుందని అంటారు. తెలుగు కన్నడ మలయాళ భాషలు ఎక్కువ సంస్కృత భాషాసాహిత్యాలచేత ప్రభావితమయ్యాయి. అన్నిటి కన్నా తమిళంలో ముందుగా సాహిత్య సృష్టి జరిగింది. క్రీస్తుశకారంభం నుంచే తమిళంలో కావ్య రచన జరిగింది. క్రీస్తుపూర్వమే జరిగిందని కొందరు పడితులంటారు. జైన బౌద్ధులు సంస్కృతభాష సంపర్కంతో తమిళభాషను సాహిత్యభాషగా రూపొందించారు. తమిళంలో సంస్కృత పదాలు చాలా తక్కువని కొందరి అభిప్రాయం కాని చాలా సంస్కృత పదాలు తమిళం ధ్వని ఉచ్చారణలతో మారిపోయి భాషలో ఇమిడిపోయాయి. ఉదా. కు "పిచ్చై" - సంస్కృత "భిక్ష" నుంచి వచ్చింది. భిక్షపతి అని శివునికి పేరు. అది తమిళంలో "పిచ్చాండార్" అయింది. తెలుగులో "పిచ్చయ్య" అంటారు. తమిళంలో ప్రేక్షకులను "రసిగర్" అంటారు. అది సంస్కృత "రసిక" పదమే. తమిళంలో తొల్కాప్పియం వ్యాకరణం సంస్కృత ఐంద్రవ్యాకరణం ఆదర్శంగా కూర్చబడిందంటారు. ఉత్తరభారతం నుంచి వచ్చిన అగస్త్యునితో తమిళ సాహిత్యచరిత్ర ఆరంభమౌతుంది. తమిళంలో భాష నుడికారం,

భావాలసొంపు, ప్రక్రియలు కొన్ని స్వతంత్రంగా రూపొందాయి. నిజమే కాని "దేశి"తో పాటు సంస్కృతం అంటే "మార్గ" పద్ధతి కూడ తమిళంలో చాల చోటు చేసుకుంది. తెలుగులో సంస్కృత పదాలు చాలా చేరాయి. వాటి ఉచ్చారణ మారకుండా మూల ఉచ్చారణ రూపంతోనే చేరాయి. అందువల్ల తమిళంలో కన్నా తెలుగులో సంస్కృతపదాలు మణిప్రవాళ రూపంగా కనిపిస్తాయి.

శాతవాహనరాజు హాలుడు కూర్చిన గాథాసప్తశతిని బట్టి క్రీ.శ మొదటి శతాబ్దం నాటికే తెలుగుభాష వుందని తెలుస్తున్నది. క్రీ.పూ. 250 నాటిదైన అమరావతి స్తూపం శిథిలాల్లో దొరికిన ఒక శిలాఫలకం మీద "నాగబు" పదం కన్పించింది. "నాగబు" లోని "బు" ప్రథమావిభక్తి ఏకవచన ప్రత్యయమని వేటూరి ప్రభాకర శాస్త్రిగారు అన్నారు. దాంతో తెలుగు భాష ఉనికి క్రీ.పూ. 3వ శతాబ్దానికి చేరుకుంది. ఋగ్వేదానికి చెందిన ఐతరేయ బ్రాహ్మణం (క్రీ.పూ. 1500) లో "ఆంధ్ర" జాతి పేరు వుంది. జాతి వున్నదంటె జాతికి ఒక భాష కూడా వుండి వుంటుంది. క్రీస్తుపూర్వం నుంచి వున్న ఆంధ్రజాతి, భాష క్రీ.శ. 6వ శతాబ్దం నుంచి శిలాశాసనాల్లోకి ఎక్కి కన్పిస్తున్నది. క్రీ.శ. 9వ శతాబ్దంలో సాహిత్య భాషగా ఏర్పడి క్రీ.శ. 11వ శతాబ్దంలో కావ్యావతరణ జరిగింది. అటువంటి యుగ యుగాల తెలుగు సాహిత్య విశిష్టతను, సాహిత్య క్షేత్రంలో కృషివలురైన కవులను, వికసించిన ప్రక్రియలను రాజకీయ సామాజిక నేపథ్యంలో ఈ "తెలుగు సాహిత్య చరిత్ర"లో పరిశీలించడం జరిగింది.

* * *

# 2. ప్రాఙ్నన్నయ యుగం

నన్నయతోనే ఇప్పుడు లభించే తెలుగు సాహిత్య చరిత్ర ఆరంభమౌతున్నది. కాబట్టి నన్నయకు పూర్వమున్న కాలాన్ని ప్రాఙ్నన్నయ యుగం అనడం జరుగుతున్నది.

ఆంధ్రుల రాజకీయ సామాజిక చరిత్ర శాతవాహన కాలం నుంచే లభిస్తున్నది. శాతవాహన రాజులు క్రీ.పూ. 225 నుంచి క్రీ.శ. 225 వరకు దక్షిణాపథాన్ని - దానిలో భాగమైన ఆంధ్రదేశాన్ని పాలించారు. క్రీ.పూ. 225 నాటికి పూర్వం ఆంధ్రుల రాజకీయ సామాజిక సాంస్కృతిక సాహిత్య స్థితులను తెలుసుకోడానికి మనకు ఆధారాలేమి లేవు.

శాతవాహన వంశాన్ని పురాణాలు ఆంధ్రులని ఆంధ్రభృత్యులని చెప్పాయి. శాతవాహన పదం పురాణాల్లో లేదు. దాన్ని బట్టి శాతవాహనులు ఆంధ్రజాతిని పాలించే వారనో లేదా ఆంధ్రజాతివారైన భృత్యులనో అర్థం చెప్పుకోవచ్చును. ఏదో విధంగా వాళ్ళకు ఆంధ్రులతో సంబంధముంది. ఆంధ్రదేశంలో నడిబొడ్డున వున్న విజయవాడకు దగ్గర శ్రీకాకుళం వుంది. అక్కడ ఆంధ్రవిష్ణువు దేవాలయం వుంది. ఒకవేళ శాతవాహన మూలపురుషుడే ఆంధ్రవిష్ణువుగా వెలిసాడేమో. అట్లా అయితే శాతవాహనుల రాజ్యారంభం ఇక్కడే విజయవాడ గుంటూరు ప్రాంతాల్లో కృష్ణానదీతీరంలో జరిగి వాళ్ళ రాజ్యం ఉత్తర పశ్చిమ ప్రాంతాలకు విస్తరించిందని తర్వాత వాళ్ళ రాజధాని

శ్రీకాకుళం నుంచి పైఠన్ (ప్రతిష్ఠానపురం)కు మారిందని చెప్పవచ్చును.

శాతవాహన వంశం వాడైన సింధుకుడనే రాజు కాణ్వవంశంలో చివరివాడైన సుశర్మను ఇప్పటి కరీంనగర్ జిల్లాలోని ధవళకట్ట దగ్గర అంతమొందించి స్వతంత్ర రాజ్యాన్ని స్థాపించాడని చారిత్రకులు నాణాల ఆధారంగా చెప్తున్నారు. శాతవాహనుడు అనే రాజు కొడుకు సింధుకుడు అని - ఆ సింధుకుడే సిముకుడని చారిత్రకుల అభిప్రాయం. సిముకుడు స్థానిక నాయకుడైన నాగుల రాజు కూతురు నాగానికను తన కొడుకు శాతకర్ణికిచ్చి పెళ్ళి చేసి రాజ్యసుస్థిరతను సాధించాడు. ఆంధ్రప్రాంతంలో ప్రాచీన కాలంలో నాగజాతి వుండేదని వాళ్ళ చిన్న చిన్న రాజ్యాలుండే వనడానికి ఆధారాలున్నాయి. నాగులతోపాటు యక్షరాక్షస సిద్ధ విద్యాధర కిన్నరకింపురుష జాతులు పురాణాల్లో చెప్పబడినాయి. వాళ్ళు కూడా ఈ ప్రాంతాల్లో వుండవాళ్ళు. ఋగ్వేదానికి చెందిన ఐతరేయబ్రాహ్మణంలో విశ్వామిత్రుడు తన మాట వినని కొడుకులను ఆంధ్రపుండ్ర శబర పుళింద మూతిబజాతులు - ఆర్యభూములకవతల నివసించే దస్యుల్లో కలిసిపొండని శపించినట్లుగా వుంది. ఈనాటి గోండులు కోయలు చెంచులు సవరలు మొదలయిన జాతులు వాళ్ళ వారసులై వుంటారు. వాళ్ళనే పురాణాలు నాగయక్షాది జాతులుగా చెప్పాయేమో. ఆదిమజాతులకు చెందిన ప్రజలు వేలకొద్ది సంవత్సరాలుగా సంస్కృతీకరణం చెందుతూ నాగరిక సమాజంలో చేరి పోతూనే వున్నారు. అయినా ఇంకా మారుమూల అరణ్యాల్లో ఆ జనులు ఇప్పటికీ గిరిజనులుగా మిగిలిపోయి వున్నారు.

"అనాది జాతుల్లో ఆంధ్రజాతి కూడా ఒకటని ఐతరేయబ్రాహ్మణం వల్ల తెలుస్తున్నది." ఆంధ్రజాతిని, ఆ జాతి నివసించే భూములను పాలించడం చేతనే శాతవాహనులకు ఆంధ్రరాజులని పేరు వచ్చివుంటుంది. శాతవాహనులు మొదట మగధరాజులకు సామంతులుగా వున్నారు. అందుచేత

"ఆంధ్ర" జాతిని - భూమినేలే భృత్యులు - సామంతులైన రాజులనే అర్థంలో శాతవాహనులను పురాణాలు ఆంధ్రభృత్యులని చెప్పి వుంటాయి." ప్రాచీన కాలంలో అనేక రాజులు రాజవంశాల వలనే శాతవాహనులు అంచెలంచెలుగా భారతదేశంలోకి ప్రవేశించిన ఇరానియన్ ఆర్యజాతికి చెందినవాళ్ళయి వుంటారు. "ఇరానియనార్యులు అగ్న్యారాధకులు. అందుకే శాతవాహనులు యజ్ఞయాగాది కర్మలను అభిమానంతో అనుష్ఠించారు. అగ్న్యారాధకులు తమ తమ అభిరుచులననుసరించి బ్రాహ్మణ ధర్మాన్ని క్షాత్రధర్మాన్ని అనుసరించడం జరిగేది. అందుకే ప్రాచీన జాతుల్లో చాలా మందిని బ్రాహ్మణులా క్షత్రియులా అని స్పష్టంగా చెప్పడం క్లిష్టంగా వుంటుంది. శాత వాహనుల విషయంలోనూ అదే జరుగుతున్నది. శాతవాహనుల మూలం ఏదైనా ప్రాంతీయమైన ఆదిమజాతులకు చెందిన నాయకులతో వైవాహిక సంబంధాలను పెట్టుకొని భారతీయతను సంతరించుకున్న వాళ్ళు.

శాతవాహనరాజుల కాలంలో ఆంధ్రదేశంలో పల్లెలు పట్టణాలు సుస్థిరంగా ఏర్పడినాయి. పాడిపంటలతో పల్లెలు వర్తక వాణిజ్యాలతో పట్టణాలు సుసంపన్నంగా ప్రశాంత వాతావరణంతో వున్నాయని గాథాసప్తశతని బట్టి తెలుస్తున్నది. వ్యాపారులు దేశంలోని వివిధ ప్రాంతాలతో, విదేశాలతో వర్తకం చేసే వాళ్ళు. వాళ్ళు నకరములు, నిగమములనే పేరుతో సంఘాలుగా ఏర్పడ్డారు. "'నకరము' పదం నుంచే "నగరము" అనే పదం ఏర్పడి వుంటుంది. గ్రామం 'గ్రామణి' అనే అధికారి ఆధిపత్యంతో గ్రామపంచాయితీల పాలనతో వుండేది. ప్రజలు సంపూర్ణ స్వేచ్ఛాస్వాతంత్ర్యాలతో వుండే వాళ్ళు. శాతవాహనుల నాణాలు ఆంధ్రదేశంలో చాలా దొరికాయి. వాళ్ళు సీసం, పోటీను అనే మిశ్రలోహం నాణాలు కొద్దిగా దొరికాయి. బంగారు నాణాలు దొరకలేదు. కాని రోమన్ బంగారునాణాలు దొరకడం చేత ఆ కాలంలో విదేశాలతో ఎగుమతి దిగుమతి- వ్యాపారం బాగా సాగిందని చెప్పవచ్చును.

శాతవాహన రాజులు స్వయంగా వైదిక కర్మలనుసుష్ఠించినా అంతఃపు రస్త్రీలు వణిజులు బౌద్ధాన్ని అభిమానించారు. సామాన్య ప్రజల్లో బలులు జాతరలతో కూడిన మతమొకటి వున్నా వాళ్ళలోకి కూడా బౌద్ధమతం కొంతవరకు చొచ్చుకొని పోయింది. బౌద్ధమత ప్రభావం వల్లనే ఆ కాలంలో దేవీదేవతల భక్తిమతం వికసించి వైదికమతం స్థానంలో ప్రవేశించడం ప్రారంభమైంది. శైవం వైష్ణవం ఆ విధంగా వికసించి వ్యాపించిన మతాలే.

శాతవాహనుల తర్వాత ఈనాటి నాగార్జున కొండ గుంటూరు ప్రాంతాలను ఇక్ష్వాకులు పాలించారు. అయోధ్య ఇక్ష్వాకువంశం వాళ్ళమని వాళ్ళు చెప్పుకున్నారు. వాళ్ళు మొదట శాతవాహనులకు సామంతులుగా వుండి శాతవాహనుల వినాశంతో స్వతంత్రులై క్రీ.శ. (225-300) మధ్యకాలంలో ఆంధ్రదేశాన్ని పాలించారు. శాతవాహనుల లాగానే ఇక్ష్వాకువంశంలో రాజులు వైదిక కర్మలను అభిమానించి అనుష్ఠించారు. అంతఃపురస్త్రీలు బౌద్ధాన్ని అభిమానించారు. ఇక్ష్వాకులను పురాణాలు శ్రీ పర్వతీయులని శ్రీ పర్వతీయాంధ్రులని చెప్తున్నాయి. "శ్రీశైలం పర్వతశ్రేణులకు శ్రీ పర్వతమని పేరున్నట్లు శాసనాధారాలు సాహిత్యాధారాలున్నాయి. ఆంధ్రులు నివసించే శ్రీపర్వత ప్రాంతాన్ని పాలించడం చేత వాళ్ళు శ్రీపర్వతీయులు శ్రీ పర్వతీయాంధ్రులని పిలువబడివుంటారు.

శాతవాహనుల కాలంలో "ప్రాకృతభాషకు పట్టం" కట్టబడింది. శాతవాహనులు ఇక్ష్వాకులు తమ శాసనాలను ప్రాకృతంలో వేయించారు. నాణాల మీద ప్రాకృతమే వుంది. రాజభాష ప్రాకృతం. శాతవాహనరాజులు ప్రాకృతకవుల నాదరించారు. అనేక ప్రాకృత కృతులీ కాలంలో వ్రాయబడినాయి. "ప్రాకృతం భాషా సాహిత్యాలకి కాలం స్వర్ణయుగం." అదే కాలంలో ఉత్తరభారతంలో ఉజ్జయినిని పాలించిన విక్రమాదిత్యుడు అతని తర్వాత క్షత్రపులు సంస్కృత భాష నభిమానించారు. మొట్ట మొదటి

సంస్కృతశాసనం క్షత్రపరాజు వేయించాడు. క్రీ.పూ. మొదటి శతాబ్దంలో కాళిదాసు వంటి కవులు తమ సంస్కృతరచనలతో సంస్కృత సాహిత్యంలో స్వర్ణయుగాన్ని సృష్టించారు. ఆ తరుణంలో దక్షిణంలో శాతవాహనులు ప్రాకృతాన్ని అభిమానించారు. ఆ కాలంలోనే తెలుగు మీద ప్రాకృతభాషా ప్రభావం బాగా పడివుంటుంది. శాతవాహనుల పాలనలో ఈనాటి మహారాష్ట్ర ప్రాంతం కూడా వుంది. కాబట్టి ద్రావిడభాషలైన తెలుగు కన్నడభాషల ప్రభావం మహారాష్ట్ర ప్రాకృతం మీద పడింది. ఆ ప్రభావం ఈనాటి మరాఠిభాషలోను కన్పిస్తున్నది. మహారాష్ట్రులు పంచద్రావిడుల్లో ఒకరుగా పరిగణింపబడడానికి ఆనాటి ప్రభావమే కారణం కావచ్చును.

శాతవాహనరాజుల్లో కుంతల శాతకర్ణి (క్రీ.పూ. 38-30) గొప్ప ప్రాకృతాభిమాని. అతని ఆస్థానంలోనే "బృహత్కథ" అనే గొప్ప ప్రాకృత కథాకావ్యాన్ని వ్రాసిన 'గుణాఢ్యుడు' వున్నాడు. బృహత్కథ భారతరామాయణాల పక్కన గౌరవం పొందిన కావ్యం. అది ఇప్పుడు దొరకడం లేదు. దాని సంస్కృతానువాదాలున్నాయి. దానిలోని కథలు సంస్కృతకావ్య నాటకాలకు ఇతివృత్తాలయ్యాయి. బృహత్కథను క్రీ.శ. 9 వ శ.లో బుధస్వామి, క్రీ.శ. 10 వ శ.లో క్షేమేంద్రుడు, క్రీ.శ. 12 వ శ.లో సోమదేవ సూరి సంస్కృతీకరించారు. "పెరుంగదై" పేరుతో బృహత్కథ ప్రాచీనకాలంలోనే తమిళంలోకి అనువదింపబడింది. బృహత్కథలోని ఇతివృత్తం ఆధారంగా తెలుగులో క్రీ.శ. 1500 ప్రాంతంవాడైన నారనసూరన "ఉదయనోదయం" కథాకావ్యం వ్రాసాడు. అది ఇప్పటికీ అముద్రితంగానే వుంది.

శాతవాహనరాజుల్లో హాలుడు (క్రీ.శ. 19-24) మరో ప్రాకృతాభిమాని. హాలుడు స్వయంగా కవి. అతనికి కవివత్సలుడని కీర్తివుంది. దాదాపు 350 మంది కవుల, కవయిత్రుల గాథలను, స్వయంగా తాను వ్రాసిన

గాథలను ఏరుకొని హాలుడు "గాథాసప్త శతి"ని కూర్చాడు. ప్రాకృత పద్యానికి "గాథ" అని పేరు. దానిలో 700 గాథలున్నాయి. అందుకే దాని పేరు "గాథాసప్తశతి". హాలునిపేర దీన్ని "హాల గాథాసప్తశతి" అని కూడా అంటారు. కొండవీడునేలిన పెదకోమటి వేమారెడ్డి "సప్తశతీసారటీక" పేరుతో గాథాసప్తశతిలోని నూరుగాథలను ఎన్నుకొని టీకను వ్రాసాడు. అతని ఆస్థానంలో వున్న శ్రీనాథుడు "శాలివాహన సప్తశతి" పేరుతో "నూనూగు మీసాలనూత్నయవ్వనం"లో గాథాసప్తశతిని తెనిగించాడు. కాని అది దొరకడం లేదు.

హాలుని "గాథాసప్తశతి"ని అనుకరిస్తూ అనుసరిస్తూ సంస్కృతంలో ఆర్యాసప్తశతి, అమరుకశతకం వంటి రసవంతమైన ముక్తకకావ్యాలు వచ్చాయి. గాథాసప్తశతిలో సమకాలికసమాజం ముఖ్యంగా పల్లెల్లోని కర్షక జీవితం ప్రకృతి ప్రజాసంస్కృతి ప్రతిఫలించింది. "అమృతమ్ ప్రాకృత కావ్యమ్" అనే ఉక్తి గాథాసప్తశతి వల్లనే వచ్చిందంటారు. సంస్కృతంలోనే కాక తమిళంలో కూడా మూడవ సంగమయుగంలో "అగనానూరు పురనానూరు, తిరుక్కురళ్" వంటి పద్యసంకలనకావ్యాలు గాథాసప్తశతిని పోలినయి వచ్చాయి. పురనానూరులో వివిధ వర్ణాలకు వృత్తులకు చెందిన కవుల కవితలున్నాయట. ఈ సంకలన కావ్యాల్లో సమకాలిక తమిళ సమాజం బాగా ప్రతిబింబించింది. అటువంటి ముక్తక కావ్యాలు తెలుగులో శతకప్రక్రియ తప్ప వేరే రాలేదు.

"హాలుని ఆస్థానంలో వున్న కుతూహలుడనే కవి "లీలావతి" అనే ప్రాకృతకావ్యాన్ని వ్రాసాడు." హాలుడు సింహళరాకుమారిని వివాహమాడే కథ దీనిలో వుంది. అటువంటి రాజుల వివాహవిలాసాన్ని వర్ణించే పరిణయకావ్యాలు ఒక ప్రక్రియగా సంస్కృతంలోను తమిళంలోను వచ్చాయి. తెలుగులో దక్షిణాంధ్రయుగంలో రాజుల వివాహాలను వర్ణిస్తూ కావ్యాలు

యక్షగానాలు చాలా వ్రాయబడినాయి.

కుంతల శాతకర్ణి ప్రాకృతప్రేమి. అతనికి సంస్కృతం రాదు. అతని రాణి సంస్కృతజ్ఞురాలు. ఒక రోజు ఇద్దరు జలక్రీడలు చేస్తుండగా రాజు రాణిని నీళ్ళతో కొట్టాడు. అప్పుడామె "రాజన్ ! మోదకైస్తాడయ" అన్నది రాజు సంస్కృతం రాకపోవడంతో తప్పుగా అర్థం చేసుకొని 'మోదకై' అంటె లడ్డూలనుకొని లడ్డూలను తెప్పించి ఆమె పైకి విసిరాడు. రాణి అన్నమాటలకు మా + ఉదకైః = మోదకైః తాడయ - అంటే - "నీ కొట్టవద్దు" అని అర్థం. రాజు అజ్ఞానానికి రాణి నవ్వింది. రాజు కోపంతో వెళ్ళిపోయి పండితులను పిల్చి తనను సంస్కృతజ్ఞునిగా చేయమని అడిగాడు. అప్పుడు ఆస్థానపండితుడు గుణాఢ్యుడు రాజును ఆరు సంవత్సరాల్లో సంస్కృతజ్ఞునిగా చేస్తాననగా రాజాస్థానంలోని మరో పండితుడు శర్వవర్మ రాజును ఆరు నెలల్లో చేస్తానని అన్నాడు. ఒక వేళ శర్వవర్మ అట్లా చేయగలిగితే తాను సంస్కృతం ప్రాకృతం దేశభాషలు - మూడు భాషలను పరిత్యజిస్తానని గుణాఢ్యుడన్నాడు. శర్వవర్మ ప్రత్యేకంగా కాతంత్రమనే వ్యాకరణాన్ని వ్రాసి రాజును తాను అన్నట్లుగానే ఆరు నెలల్లో సంస్కృతజ్ఞునిగా చేసాడు. అప్పుడు గుణాఢ్యుడు తన ప్రతిజ్ఞ ప్రకారం మూడు భాషలనొదిలేసాడు. అందుకే అతడు ఈ మూడు భాషలు కాక మరో భాష - పైశాచీప్రాకృతంలో బృహత్కథను వ్రాసాడు. పైశాచీభాష పిశాచాల భాష కాదు. అది వింధ్యప్రాంతాల్లో సామాన్యజనులు మాట్లాడుకునే భాష. దాన్నే గుణాఢ్యుడు తన కావ్యభాషగా ఎన్నుకున్నాడు. గుణాఢ్యుడు పరిత్యజిస్తానన్న మూడు భాషల్లో "దేశభాష" అన్నది దేశీయులైన ప్రజల భాష అని అది తెలుగుభాష అని పండితుల అభిప్రాయం. దాన్ని బట్టి దేశభాష తెలుగు ఉనికి తెలుస్తున్నది. హాలుని గాథాసప్తశతి (క్రీ.శ. 1వ శతాబ్దం) లోని గాథల్లో కొన్ని తెలుగు పదాలు చోటు చేసుకున్నాయి. ఉదా. పిల్ల (పీలుఅ) అత్త, అక్క, అమ్మి, పత్తి (ఫలహి), పొట్ట, కరణి, అద్దం, పంది, కంటె,

చట్టన (చటు అం), పొరాణి (పాఅర్వాణ) పున్నమి (పుణ్ణిమ) మొహము - మొదలయిన పదాలు తెలుగు భాష ఉనికిని ధ్రువపరుస్తున్నాయి.

శాతవాహనరాజు గౌతమీపుత్ర శాతకర్ణి (క్రీ.శ. 78-102) కొన్ని నాణాల మీద రెండుభాషలున్నాయి. ఒక భాష ప్రాకృతంకాగా మరోభాష 'దేశి'. "గోతమి పుతస సిరి సతకణిస" అన్నది ప్రాకృతం. "గోతమి మగకు తిరుహతకణి" అన్నది దేశి. 'స్య' అనే సంస్కృత షష్ఠీ విభక్తిప్రత్యయం ప్రాకృతంలో "పుతస, సతకణిస" అని 'స'గా మారింది. దేశిలో 'కు' అనే షష్ఠీవిభక్తి ప్రత్యయం వుంది. అది తెలుగుభాషా ప్రత్యయమే. 'మగ' అంటె కొడుకు అని అర్థం. తమిళ కన్నడంలో వలెనే తెలుగులోను 'మగ' అంటె కొడుకనే అర్థముండేదేమో. ఇప్పుడు మగవాడు —> మగాడు, మొగుడు అనే అర్థాలు మిగిలాయి. ఇక్ష్వాకుల ప్రాకృత శాసనాల్లో 'తలవర' అనే బిరుదం కన్పిస్తున్నది. తలవర తెలుగు పదం ఇప్పుడది 'తలారి'గా రూపాంతరం చెందింది.

పై ఆధారాలను బట్టి తెలుగుభాష ఉనికి బయట పడగా ఇక్ష్వాకుల తర్వాత ఆంధ్రదేశాన్ని పాలించిన పల్లవ, బృహత్పలాయన, శాలంకాయన, ఆనందగోత్రజుల, విష్ణుకుండినుల శాసనాల్లో కొన్ని గ్రామాల పేర్లు వ్యక్తుల పేర్లు తెలుగు భాషలో వున్నయి కన్పించి తెలుగుభాష ప్రజల వ్యవహారంలో వున్నదనే సత్యాన్ని బలపరుస్తున్నాయి.

ఇక్ష్వాకులు బలహీనులైన తర్వాత ధాన్యకటకం రాజధానిగా పల్నాడు ప్రాంతంలో పల్లవులు తలెత్తారు. క్రీ.శ. 3 వ శ. ఉత్తరార్థం నుంచి క్రీ.శ. 5వ శతాబ్దాంతం వరకు వాళ్ళు పల్నాడును పాలించి, తర్వాత కాంచీపురానికి రాజధానిని మార్చుకొని మహాసామ్రాజ్యాన్ని నిర్మించారు. పల్లవులు పల్నాడులో పుట్టి పెరిగినవాళ్ళని పల్లవుల జన్మస్థలం కాబట్టి

లది పల్నాడు అయిందని కొందరు చారిత్రకులంటారు. కాని "పల్లవులు - పల్నాడు" పేర్లలో సామ్యముంది కాని సంబంధమేమీ లేదు. పలై - నాడు = పల్నాడు అని ఏర్పడివుంటుంది. "పలై" అంటె తమిళంలో - అంటే ప్రాచీనద్రావిడంలో సారవంతం కాని ఊసరభూమి అని అర్థం వుంది. పల్నాడు అప్పుడూ ఇప్పుడూ రాళ్ళు రప్పలతో కూడిన నిస్సార భూమియే. 'కర్ణాటక' అనే పదం 'కర్నాడు' నుంచి ఏర్పడిందంటారు. కర్నాడు అంటే కరై + నాడు అని అర్థం చెప్తారు. 'కరై' అంటె ద్రావిడ భాషలో ఎత్తైన భూమి అని అర్థం. సముద్రతలం కన్నా బాగా తేలిన ఎత్తైన భూమి కాబట్టే కర్నాడు అయింది. కర్నాడు సంస్కృతీకరింపబడి "కర్ణాటకం" అయిందని అంటారు.

శాతవాహనులు ఇక్ష్వాకుల వలెనే పల్లవులు ఉత్తర భారతం నుంచి వచ్చిన వాళ్ళనే వాదముంది. వాళ్ళు "పహ్లావు" లనే అగ్న్యారాధకులైన ఇరానియనార్యులని చారిత్రకులంటారు. అందుకే వాళ్ళు క్షత్రియులా బ్రాహ్మణులా అని తేలనివాదంగా తయారైంది. "వర్ణో వృణో తే" వరింపబడునది కాబట్టి వర్ణం - అని "యాస్కుడు" నిర్వచనం చెప్పాడు. తమ ఇష్టానుసారం బ్రాహ్మణధర్మాన్ని క్షత్రియధర్మాన్ని వరించడం - ఆచ రించడం మనకు అనేక పురాణాల్లో వంశచరిత్రల్లో కన్పిస్తుంది. అందుచే ప్రాచీన కాలంలో క్షత్రియబ్రాహ్మణవర్ణాల్లో వివాహసంబంధాలుండేయి. ఉజ్జయినిని పాలించిన క్షత్రపులు ఇరానియనార్యులే. వాళ్ళు తమను తాము క్షత్రపావనులమని చెప్పుకున్నారు. క్షత్రపావనులే కొంకణ దేశం వచ్చి చితపవన్ బ్రాహ్మణులైనారు. క్షత్రపావన —> క్షతపావన —> చిత్ పవనగా మారింది. ఉత్తర భారతంలో ఇప్పటికి "బ్రహ్మక్షత్రి"యులున్నారు. వాళ్ళు బ్రాహ్మణులతో క్షత్రియులతో సంబంధాలు చేస్తారు.

" గుజరాతులోని గిర్నారులో రుద్రదామనుడనే క్షత్రపరాజు క్రీ.శ. 150లో

వేయించిన శాసనం సంస్కృతశాసనాల్లో మొట్టమొదటిది. ఆ శాసనంలో సౌరాష్ట్రానికి రాజ్యపాలుడుగా పహ్లావుడైన సువిశాఖుని ప్రసక్తి వుంది. దాన్ని బట్టి పహ్లావులు ఉత్తరభారతంలో రాజోద్యోగులుగా వుండి క్రమంగా దక్షిణానికి వచ్చి రాజ్యాన్ని స్థాపించారేమో. పహ్లావ శబ్దమే పల్లవగా మారి వాళ్ళ వంశనామమైవుంటుంది. పల్లవులు మొదట బౌద్ధమతాన్ని అభిమానించారు. తర్వాత పౌరాణిక హిందూమతంలోని శైవవైష్ణవమతాలను అభిమానించారు. అందుకేనేమో పల్లవుల మొదటి శాసనాలు ప్రాకృతంలోను తర్వాత శాసనాలు సంస్కృతంలోను వున్నాయి.

కృష్ణానది దక్షిణతీర ప్రాంతంలో పల్లవులు పాలిస్తున్న కాలంలో ఉత్తర తీరప్రాంతంలో బృహత్ఫలాయనులు కోడూరు రాజధానిగా (క్రీ.శ. 300-325) పాలించారు. వాళ్ళు పౌరాణిక హిందుమతాన్ని ముఖ్యంగా శైవాన్ని అభిమానించారు. వాళ్ళ రాజ్యంలో బౌద్ధం క్షీణదశలో వుంది.

బృహత్ఫలాయనుల తర్వాత వేంగీపురం రాజధానిగా శాలంకాయనులు వేంగీరాజ్యాన్ని (క్రీ.శ. 300-480) పాలించారు. వాళ్ళ శాసనాలు దొరికాయి. వాటిల్లో ప్రాచీనమైయి ప్రాకృతంలోను అర్వాచీనమైనయి 5 సంస్కృతంలోను వున్నాయి. శాలంకాయనులు మొదట వైదికమతాన్ని అభిమానించి అశ్వమేధం చేసారు. తర్వాత పరమమాహేశ్వరులు భాగవతులయినారు. బౌద్ధమతమన్నా అభిమానం చూపారు. బర్మాలో బౌద్ధమతవ్యాప్తికి మొదటి నందివర్మ కారణమంటారు.

శాలంకాయనులకు సమకాలికులుగా కృష్ణానది దక్షిణప్రాంతాన్ని (కర్మ రాష్ట్రాన్ని) ఆనందగోత్రజులు పాలించారు. వాళ్ళ 3 శాసనాల్లో ఒక్కటి ప్రాకృతంలో ఒకటి సంస్కృతంలో మరొకటి ప్రాకృత సంస్కృతమిశ్రితంగా వున్నాయి. దాన్ని బట్టి క్రమంగా ప్రాకృతం తన ప్రాధాన్యాన్ని కోల్పోయి

దాని స్థానంలో సంస్కృతం ప్రాధాన్యాన్ని సంపాదిస్తున్నదని తెలుస్తున్నది. బౌద్ధమతం క్షీణించిన కొద్ది ప్రాకృతం వాడుక తగ్గిపోయి సంస్కృతభాష వ్యాప్తి అధికం అయింది. బౌద్ధమతం స్థానంలో క్రమంగా పౌరాణిక శైవవైష్ణవ మతాలు ఆదరణలోకి వచ్చాయి.

శాతవాహనుల తర్వాత ఆంధ్రదేశంలో సామ్రాజ్యాన్ని నిర్మించి దక్షిణా పథపతులుగా పేరు పొందినవాళ్ళు విష్ణుకుండినులు. క్రీ.శ. 420-612 మధ్యకాలంలో పాలించారు. వీళ్ళు "భగవత్ శ్రీపర్వత స్వామి పాదానుధ్యా తస్య" అని చెప్పుకున్నదాన్ని బట్టి శైవాభిమానులని తెలుస్తున్నది. ఇక్ష్వాకుల కాలం వరకు శ్రీపర్వతం బౌద్ధమతానికి కేంద్రంగా వుండి. క్రమంగా శ్రీ పర్వత శ్రేణిలోని శ్రీ శైలం విష్ణుకుండినుల నాటికి మల్లన పేరుతో శివుడు వెలసిన క్షేత్రంగా ప్రసిద్ధి చెందింది.

ఇక్ష్వాకుల కాలంలో శ్రీపర్వతం అంటే ఈనాటి నాగార్జునకొండ ప్రాంతం గొప్ప బౌద్ధక్షేత్రంగా ప్రసిద్ధి కెక్కింది. అక్కడే ఇక్ష్వాకుల రాజధాని విజయపురి వెలిసింది. అక్కడి సంఘారామాలను చైనా సింహళం మలయా గాంధార మొదలయిన దేశాల నుంచి భిక్షుకులు వచ్చి దర్శించేవాళ్ళు, అక్కడి బౌద్ధవిశ్వవిద్యాలయంలో విద్యలనభ్యసించే వాళ్ళు. అక్కడనే శాతవాహన రాజు యజ్ఞశ్రీ శాతకర్ణి కాలంలో (క్రీ.శ. 174-203) ప్రసిద్ధ బౌద్ధాచార్యుడు నాగార్జునుడు నివసించాడు. అతని అండదండలతో అక్కడ మహాయానశాఖ వర్ధిల్లింది. హీనయానశాఖలో బుద్ధుని పాదాలను మాత్రం పూజిస్తారు. మహాయానశాఖలో బుద్ధుడు భగవదవతారంగా భావింపబడి పూజలనందుకున్నాడు. మహాయానశాఖలోనే బౌద్ధ శిల్పకళ బుద్ధుని మూర్తుల రూపకల్పనతో బాగా వికసించింది. మహాయానశాఖ ప్రభావంతోనే భగవత్ప్రేమ భక్తి పూజలతో కూడిన శివవిష్ణువులను పూజించే భక్తిమతం వర్ధిల్లింది. బౌద్ధమతక్షీణించడంతో అనేక బౌద్ధక్షేత్రాలు ఇక్ష్వాకుల

తర్వాత క్రమంగా శైవవైష్ణవ క్షేత్రాలుగా మారాయి. శివ విష్ణుపూజలతో కూడిన పౌరాణిక హిందూమతం వికసించింది. దేవతార్చన విధులను ఉత్సవాదులను వివరించే వైఖానస పాంచరాత్రాలు మొదలయిన 18 వరకు ఆగమ గ్రంథాలు ఆ కాలంలోనే సంస్కృతంలో వ్రాయబడినాయి. బౌద్ధజైన శ్రమణులకు సన్యాసులకు ఇచ్చే భక్తి గౌరవాలకు పౌరాణిక హిందూమతంలో బ్రాహ్మణులు పాత్రులయినారు. భక్తితోపాటు బ్రాహ్మణ భక్తి హిందూమతంలో భాగంగా ప్రవర్తిల్లింది.

ఆంధ్రదేశంలో బౌద్ధం క్రీ.శ. 3,4 శతాబ్దాల వరకు ఆదరణను పొందింది. నాగార్జునుడు బుద్ధపాలితుడు, ఆర్యదేవుడు, భావవివేకుడు, దిజ్ఞాగుడు మొదలైన బౌద్ధాచార్యులు ప్రపంచ ప్రఖ్యాతి పొందినవాళ్ళు ఇక్కడ నివసించారు. వాళ్ళు బుద్ధుని పూర్వవతారాలుగా బోధిసత్త్వులుగా ప్రసిద్ధి చెందారు. వాళ్ళందరూ కూడా సంస్కృత భాషలోనే తమ బౌద్ధదార్శనిక గ్రంథాలను రచించారు. అంటే క్రీ.శ. 3,4 శతాబ్దాల నాటికి ప్రాకృతం బౌద్ధుల అభిమానానికి కూడా దూరమైంది. వాళ్ళు కూడా హిందూ ఆచార్యులతో శాస్త్రచర్చల కోసం శాస్త్రరచనలకోసం సంస్కృతాన్నే స్వీకరించవలసి వచ్చింది. అంతేగాక ప్రజల వాడుక భాష ప్రాకృతం మార్పుచెంది క్రమంగా వివిధ అపభ్రంశభాషలు వ్యాప్తిలోకి వచ్చాయి. అపభ్రంశభాషలు ప్రాంతీయభేదాలతో 27 వరకున్నాయి. వాటిల్లో కార్ణాట, కాంచ్య, ద్రావిడాది భేదాలు కూడా వున్నాయి. ఈ అపభ్రంశ భాషల్లోనే ఉత్తరభారతంలో బౌద్ధసిద్ధులు తమ రచనలు చేసారు. అటువంటి తరుణంలో, అందరికి అర్థమయ్యే ఒక ప్రామాణిక భాషగా సంస్కృతానికి ఎక్కువ గుర్తింపు వచ్చి ప్రాధాన్యతను పొందింది. శాస్త్రభాషగా సంస్కృతానికి గుర్తింపు వచ్చింది. జైన బౌద్ధులు కూడా దాన్ని స్వీకరించవలసి వచ్చింది. విష్ణుకుండినులు అశ్వమేధం నరమేధం వంటి వైదిక క్రతువులను కూడా అనుష్ఠించారు. కాని అప్పటికే వైదిక క్రతువులు అర్థవిహీనమై అర్చనలతో కూడిన పౌరాణి

కమతమే ప్రాముఖ్యంలోకి వచ్చింది. విష్ణుకుండినుల కాలంలో బెజవాడ దగ్గర ఇంద్రకీలాద్రి, ఉండవల్లి, మొగల్రాజపురం మొదలైన హిందూదేవతల శిల్పాలతో కూడిన అనేక గుహాలయాల నిర్మాణాలు జరిగాయి. ఆ కాలం లోనే బౌద్ధ పంచారామాలు హిందూ క్షేత్రాలుగా మారాయి. చేజెర్లలోని కపోతేశ్వరాలాయం శైవక్షేత్రంగా మారింది. భీమారామం, అమరారామం, శ్రీపర్వతం, మొదలయిన బౌద్ధక్షేత్రాలు శైవక్షేత్రాలుగామారి తర్వాత శైవ భక్తి ఉద్యమాలకు కేంద్రాలయ్యాయి.

విష్ణుకుండినులు సంస్కృతాభిమానులు వాళ్ళ శాసనాలన్నీ సంస్కృతంలోనే వున్నాయి. వాళ్ళకాలంతో ఆంధ్రదేశంలో సంస్కృత కవులుండి వుంటారు. ఆ వంశంలోని మూడవ మాధవవర్మకు 546-611 కు జనాశ్రయుడనే బిరుదముంది. గుణస్వామి రచించిన "జనాశ్రయ ఛందోవిచ్ఛితి" అనే సంస్కృత ఛందోగ్రంథం అతని పేరు మీదనే వ్రాయబడిందని పండితులు అభిప్రాయం. దానిలో సంస్కృత ఛందస్సులతో పాటు "శీర్షకం" పేరుతో సీసపద్యం ఇంకా గీతపద్యాలు వివరింపబడినాయి. దాన్ని బట్టి అప్పటికి దేశి ఛందస్సులు వ్యాప్తిలో వున్నాయని చెప్పవచ్చును.

శాతవాహనులు ఇక్ష్వాకుల కాలంలోనే అంటె క్రీ.శ. 3,4 శతాబ్దాల వరకు తెలుగు భాష ప్రాకృత ప్రభావానికి గురయింది. ఆ తర్వాత సంస్కృతప్రభావంతో తెలుగు భాష సాహిత్యభాషగా రూపొందింది. తెలుగు మీద ప్రాకృతప్రభావం ఈనాడు అంతగా అంచనాకు రావడం లేదు. కాని బాగా పరిశీలిస్తే ఈనాడు మనం దేశ్యమనకునే పదజాలమెంతో ప్రాకృతం నుంచి వచ్చి చేరిందిగా గుర్తించవచ్చును. ఉదా.కు "బ్రాహ్మణ" సంస్కృత పదం "పాఱమణ" గా వికృతి చెంది తెలుగులో పాఱగా మాత్రమే మిగిలింది. తమిళంలో "బాఱమణ" అని వుంది. తెలుగులో "డు" పుంలింగ ఏకవచన ప్రత్యయాన్ని చేర్చి "పాఱడు" అని కూడా

వాడబడింది. ఆ విధంగా సంస్కృతపదాలు వికృతి పొంది తెలుగులో ప్రవేశించమే కాక ఎన్నో ప్రాకృత పదాలు, వికృతి పొందిన ప్రాకృత పదాలు తెలుగులో చేరాయి. ఉదాహరణకు

| | | |
|---|---|---|
| గర్దభః ——> | గడ్డహో ——> | గాడిద |
| తీక్ష్ణః ——> | తిక్క ——> | తిక్క |
| కటుః ——> | కారో ——> | కారం |
| వక్రః ——> | వంకో ——> | వంక, వంకర |
| కర్ణికారః ——> | కణ్ణేరో ——> | గన్నేరు |
| శుష్క ——> | సొక్కా, సుక్క ——> | సుక్కి, స్రుక్కి, సొక్కి, చిక్కి పోవడం |
| స్పృహా | సోయి ——> | సోయి |
| పుష్ప ——> | పుప్ప ——> | పువ్వు, పూవు,పూ |
| సుందరం ——> | అందం ——> | అందం |
| పఠ ——> | పాట ——> | పాట |
| శబరః ——> | సవర ——> | సవర |
| శ్మశానం ——> | మసాణం ——> | మశాణం |
| పౌర్ణమి ——> | పున్నమి ——> | పున్నమి |
| ఆగ్రహం ——> | అక్కసు ——> | అక్కసు |
| అపూపం ——> | అప్ప ——> | అప్ప |
| ఆమ్ర ——> | అమ్మ ——> | ఆవ౯ (కాయ) |
| స్నేహం ——> | నేహం ——> | నెయ్యం నేయి, నెయ్యి |
| అంగులీయం ——> | ఉంగరం ——> | ఉంగరం |
| హంస ——> | అంచ ——> | అంచ |
| రాజు ——> | రావు ——> | రావు, రాయ(డు), రాయు(డు) |
| రత్న ——> | రవుణ ——> | రవ౯ణ, రమణ |
| స్తావకః ——> | థువఓ ——> | తువ్వాయి |
| మృత్తిః ——> | మట్టి ——> | మట్టి |
| ఉష్ట్ర ——> | ఉట్టె ——> | ఒంటె |
| పర్వతం ——> | పాడా ——> | పాడు (ఊర్ల పేర చివర) (కన్పించే 'పాడు' ఇదే) |

ఆశ్చర్యం ——> అచ్చెరువు ——> అచ్చెరువు

ఆశ్చర్యం ——> అక్కజం ——> అక్కజం

వృద్ధిః ——> ఉడ్డి ——> ఒడ్డి, వడ్డి

శ్మశ్రు ——> మంసు ——> మీస, మీసం

అర్పణం ——> అప్పనం ——> అప్పగింత

పియూషం ——> పేఉసం ——> పాయసం

ఆత్మా ——> అత్తో ——> అత్త

ప్రతిపత్ ——> పడివఆ ——> పాడ్యమి

అప్సరాః ——> అచ్చరఆ ——> అచ్చర

ఆర్ద్రికం ——> అల్లమ్ ——> అల్లం

శుల్కః ——> సుంగో ——> సుంకం

-> ధాయి ——> దాయి

శుభ్రం ——> సుబ్బరం ——> సుబ్బరం

గర్తః ——> గట్ట ——> గుంట

శృంఖలం ——> సంకలం ——> సంకెళ్ళు

మలినం ——> మయిలమ్ ——> మైల

ఆర్య ——> అజ్జ ——> అయ్య

భోజనం ——> భోణం ——> బోనం

అగ్ని ——> అగ్గి ——> అగ్గి

అంగారః ——> ఇంగలం ——> ఇంగలం

గేహం ——> గేము ——> గేము

సంస్కృతం ——> సక్కఒ ——> సక్క, సక్కన, సక్కగా, చక్కన, చక్కగా

ఆజ్ఞ ——> ఆణ ——> ఆన, ఆనతి

మృత్యు ——> మిత్తి ——> మిత్తి

స్థానం ——> తాణం ——> తాన, తలం

(నా దగ్గర అనడానికి తెలంగాణాలో నాతాన అని వాడుతారు)

చిక్కణం ——> చిక్కణం ——> చిక్కన, చిక్కగా

నిర్మలం ——> నిమ్మళం ——> నిమ్మలం

(మెల్లగా అనడానికి నిమ్మలంగా అని తెలంగాణాలో లాడుతారు)

రిక్త ——> ఉత్త ——> ఉత్త (ది)
వర్ధమాన ——> వడ్డెమాన, ఒడ్డెమాన ——> ఒడ్డె, ఒడ్డెమాన
(వరంగల్ దగ్గర వర్ధమానపల్లెకు ఒడ్డెపల్లి అని పేరు)

సర్పం ——> సప్పం ——> పామ్ —> పాము
శ్రీ ——> సిరి ——> సిరి, సిరులు

ఇట్లా ఎన్నో పదాలు ప్రాకృతం నుంచి తెలుగులో చేరాయి. బూచి, చిక్కన, అల్లం, చక్కన, అప్పగింత ఒంటె - వంటి పదాలెన్నో దేశ్యాలుగా భావింపబడ్తున్నాయి. చాలా పదాలు అదే అర్థంలో వున్నా కొన్ని పదాలకు అర్థభేదం కలిగింది.

ప్రాకృత భాషలోని ధ్వనులు, ఉచ్చారణలు కూడా తెలుగులో ప్రవేశించాయి, "న,ల" స్థానంలో 'ణ, ళ' పలకడం. ఉదా. ఆనతి —> ఆణతి, అన్న —> అణ్ణ, వినియన —> వినియణ, ఏలుచు —> ఏళుచు, ఏలూరు —> ఏళూరు.

తెలుగులో కన్పించే దంత్యచజలు ఇతర ద్రావిడ భాషల్లో లేవు. మహారాష్ట్రి ప్రాకృతంలో దంత్యచజలు వుండి మరాఠీలోకి వచ్చాయి. మరాఠీలో దంత్య చజల ప్రయోగం ఇప్పటికీ చాల ఎక్కువ. తెలుగులో ఇప్పుడు దంత్య చజలు నశిస్తున్నాయి కాని మొన్నటి వరకు దంత్య చజలు విస్తృతంగా వుండేయి. ఇప్పటికి వర్ణమాలను నేర్పేటప్పుడు వాటిని నేర్పుతున్నారు.

తెలుగులో వాడు, అతడు, రవణ మొదలయిన పదాల్లో అనునాసికోచ్చారణ చాల ప్రచలితంగా వుండేది. అనునాసికోచ్చారణకు చిహ్నంగా

అరసున్నాను వ్రాసేవాళ్ళు. ప్రాచీన శాసనాల్లో అరసున్న వ్రాయడం కష్టం కావడం చేతనేమో అరసున్న స్థానంలో అనుస్వారాన్నే చెక్కేవాళ్ళు. కాని అనుస్వారం వుండవలసిన చోట తర్వాత వర్ణాన్ని ద్విత్త్వంగా వ్రాసేవాళ్ళు. అనునాసికోచ్చారణ వుండవలసిన చోట ద్విత్త్వం వుండేది కాదు. ప్రాకృతంలో ఇప్పటికి అనునాసికం వుంది. ఇప్పటి హిందీలోను అనునాసికోచ్చారణ వుంది. దాన్ని ఁ గా వ్రాస్తారు. గ్రామ —> గాఁవ్. భ్రమర —> భవఁర్. 'మ' స్థానంలో అనునాసికోచ్చారణతో కూడిన 'వ' చేరడం ప్రాకృతంలో జరిగి ఇప్పటి హిందీ మొదలైన దేశ భాషల్లోను నిలిచి వుంది. తెలుగులోను 'మ' స్థానంలో 'వఁ' పలకడం వుంది. దాంతోపాటు మూలద్రావిడంలో నిండు సున్నా వున్నచోట దాన్ని తేల్చి అనునాసికంగా పలకడం తెలుగులో జరిగిన మార్పు. దేశ్య పదాల్లో అనునాసికోచ్చారణ వున్న పదాలు. ఉదా. వాఁడు, అతఁడు, ఊఁదు, ఆఁబోతు, ఆఁకలి, వాఁపు, గోఁచి మొదలయినయి. ద్రుత 'న'కారం చాలాచోట్ల అనునాసికంగా ఉచ్చారణలో మారుతుంది. ఉదా. చేఁగొను, చావఁజూచు పూచెఁగలువలు. ఇతర ద్రావిడ భాషల్లో అనునాసికోచ్చారణ లేదు. తెలుగులోనే వుంది. అది ప్రాకృతం నుంచే తెలుగులోకి వచ్చింది. ఇప్పుడు ఆధునిక ప్రామాణిక భాషలో అనునాసికం వ్రాయడం గాని ఉచ్చరించడం గాని లేదు. తొలగిపోయింది. కాని తీరాంధ్రంలో అనునాసికోచ్చారణ ఇంకా వాడుక భాషలో వుంది. ఉదా.కు భీమన —> భీవఁన, రాముడు —> రావుఁడు. కామేశ్వరి —> కావేఁశ్వరి మొదలయిన ఉచ్చారణలు ఇంకా వున్నాయి.

ప్రాకృతంలో 'ద్య, ధ్య'లను 'జ,జ్జ'లుగా 'త్య' ను 'చ్చ'గా ఉచ్చరించడం వుంది. ఆ ఉచ్చారణ ప్రాకృత ప్రభావం వల్ల తెలుగులోకి ప్రవేశించింది. ఉదా. ఉద్యోగం —> ఉజ్జోగం, మధ్య —> మజ్జ. సంధ్య —> సంజ. పత్యం —> పచ్చెం. సత్యం —> సచ్చెం. శషలకు బదులుగా 'స' వాడటం

తెలుగులో ప్రాకృత ప్రభావం వల్లనే జరిగింది. ప్రాచీనశాసనాల్లో కూడా ఇది కన్పిస్తుంది. ఉదా. కు అశ్వమేధంబు —> అస్వమేధంబు దోషంబు —> దోసంబు సంయుక్తాక్షరం ద్విత్త్వంగా మారడం ప్రాకృతం నుంచే తెలుగులోకి వచ్చింది. ఉదా. అగ్ని —> అగ్గి, మృత్యు —> మిత్తి. 'బభ'లు 'వ' గామారడం ప్రాకృతంలో వుంది. ఉదా. శబర —> సవర. అభినవ —> అవినవ. పద్మనాభ —> పద్మనావ. అయితే ఈ మార్పు తెలుగులోను ప్రచలితంగా కాకున్నా కొన్ని పదాల్లో ప్రాకృత ప్రభావం వల్ల ప్రవేశించింది. ఉదా. శబర —> సవర. బీభత్సుడు —> వివ్వత్సుడు భీమ —> వీమ —> వేమ. ఖ, ఘ, ఛ, ఝ, థ, ధ వంటి మహాప్రాణాక్షరాలు ప్రాకృతంలో అల్పప్రాణాలు కావడం వుంది. ప్రాకృత ప్రభావం వల్లనో ద్రావిడభాషలో మహాప్రాణాక్షరాలు లేకపోవడం వల్లనో తెలుగులోను ఇది కన్పిస్తుంది. ఉదా. ముఖం —> మొగం, కథ —> కత, విఘ్నం —> విగ్నం.

క్రీస్తు శకారంభంలో కూర్చబడిన గాథా సప్తశతిలో కన్పించే తెలుగు పదాలను బట్టి తెలుగుభాష అప్పటికే ప్రజల వ్యవహార భాషగా వున్నదని తెలిసింది. ఇక క్రీ.శ. 3వ శతాబ్దారంభం నుంచి కొన్ని ప్రాకృత సంస్కృత శాసనాల్లో గ్రామాల పేర్లు వ్యక్తుల పేర్లు తెలుగుభాషకు చెందినవయి కన్పించి తెలుగు భాష వ్యవహారంలో వుందని చాటుతున్నాయి.

శాతవాహనులు ఇక్ష్వాకులు పల్లవులు ఆనందగోత్రజులు, బృహత్ఫలాయనులు శాలంకాయనులు విష్ణుకుండినులు వేయించిన ప్రాకృత సంస్కృత శాసనాలు ఎక్కువగా దానశాసనాలు. దానమియ్యబడిన భూమి ఎక్కడుందో సరిహద్దులేవో దానమిమిచ్చిన వాళ్ళెవరో తీసుకున్నవాళ్ళెవరో వివరాలు చెప్పేటప్పుడు గ్రామాల వ్యక్తుల పేర్లు తెలుగు భాషకు చెందనయిగా వున్నాయి. వేపురకే (వేపూరు) - (శాతవాహన రాజు శ్రీ పులోమావి మ్యాకదోని శాసనం క్రీ.శ. 200) తాన్టికొన్ట (తాడికొండ) కంగూరు - (ఆనందగోత్ర

జుల శాసనాలు క్రీ.శ. 3 వ శ.) కూడూర (గూడూరు), కొండముడి (బృహత్ఫలాయనుల శాసనాలు క్రీ.శ. 3వ శ.) విజిపఱ, ఓమ్‌గోడు, కణ్డకూర - (పల్లవుల శాసనాలు క్రీ.శ. 4 వ శ.) ఏళూర (ఏలూరు), ప్రాలూరు, చెఞ్చురువ గ్రామే, కురువాడ (శాలంకాయనుల శాసనాలు క్రీ.శ. 5వ శ.) కుణ్డూరు, పులిమ్బూరు (పొలమూరు) రేగొణ్ట (రేగొండ) - (విష్ణుకుండినుల శాసనాలు. క్రీ.శ. 5వ శ.) ప్రాచీన శాసనాల్లో చెప్పబడిన ఏలూరు, రేగొండ, ఒంగోడు వంటి గ్రామాల పేర్లు ఇప్పటికి నిలిచి వున్నాయి. ఆ శాసనాల్లో గ్రామాల పేర్ల చివర కనిపించే పఱ్రు, పాక, కొండ, వాడ, ఊరు, రేవు, చెరువు, కోడు మొదలయిన పదాలు, ప్రత్యయాలు దేశ్యమైన తెలుగు పదాలు. ఆ శాసనాల్లో గోలశర్మ, కొట్టిశర్మ, దొడ్డిస్వామి, అగ్గిజ్జ, వేణిజ్జ, భావజ్జ, నందజ్జ మొదలయిన తెలుగు పేర్లు కన్పిస్తున్నాయి. 'అజ్జ' శబ్దం 'ఆర్య' సంస్కృత పదానికి ప్రాకృత రూపం 'అజ్జ'యే తెలుగులో "అయ్య, అయ" గా మారింది. ఇక్ష్వాకుల నాగార్జున కొండశాసనంలో రెమ్మణ, నాగమ్న, వీరమ్న అనే పేర్లు కన్పిస్తున్నాయి. అణ్ణ —> అణగా మారి రెమ్మణలో వుంది. నాగమ్న వీరమ్న పేర్లు నాగమన్న వీరమన్న పేర్లకు రూపాంతరాలు.

ఈ విధంగా తెలుగు ప్రత్యయాలు పదాలు మాత్రం ఇంతవరకు కన్పించగా క్రీ.శ. 575లో పూర్తిగా తెలుగులోనే వేయబడిన రేనాటి చోళరాజు శాసనం దొరికింది. అప్పటి నుంచి 11 వ శతాబ్దంలో నన్నయ భారత రచన వరకు తెలుగు క్రమక్రమంగా ఎదుగుతూ శాసనాల్లో కన్పిస్తున్నది. ప్రాఙ్నన్నయ యుగాన్ని తెలుగు సాహిత్య చరిత్రలో మూడుదశలుగా విభజించ వచ్చును - 1) క్రీ.శ. 575 కు పూర్వమున్న దశ. ఈ కాలంలో తెలుగు భాషకు సంబంధించిన ప్రత్యయాలు పదాలు గ్రామాల, వ్యక్తుల పేర్లు నాణాల మీద గాథాసప్తశతి కావ్యంలో ప్రాకృత సంస్కృత

శాసనాల్లో కన్పిస్తున్నాయి. 2. క్రీ.శ. 575 నుంచి క్రీ.శ. 848 వరకు మరో దశ. ఈ కాలంలో తెలుగులో వేయబడిన శాసనాలు లభించాయి. అవి కేవలం గద్యంలో వున్నాయి. 3. క్రీ.శ. 848 నుంచి నన్నయ భారత రచన వరకు మూడో దశ. క్రీ.శ. 848లో తెలుగు మొట్టమొదట పద్యశాసనం వేయబడింది. ఈ దశలో తెలుగు సాహిత్య భాషగా రూపొందింది. ఈ కాలంలోనే కొంత సాహిత్యం కూడా వచ్చి వుంటుంది. కాని ఆ సాహిత్యమేది నిలువలేదు.

బాదామి రాజధానిగా ఏలిన పశ్చిమచాళుక్య రాజు రెండవ పులకేశి క్రీ.శ. 617లో ఆంధ్రదేశంలోని వేంగిని ఆక్రమించుకొని విజేత అయిన తన తమ్ముడు కుబ్జవిష్ణువర్ధనుని రాజప్రతినిధిగా వుంచాడు. కుబ్జవిష్ణు వర్ధనుడు క్రీ.శ. 624 లో స్వతంత్రుడై వేంగిని పాలించాడు. అతని వంశజులే చరిత్రలో వేంగిచాళుక్యులుగా తూర్పు చాళుక్యులుగా ప్రసిద్ధి చెందారు. తూర్పు చాళుక్యులు 4-5 శతాబ్దాల సుదీర్ఘకాలం ఆంధ్రదేశాన్ని పాలించారు.

ఇక్ష్వాకుల నాగార్జునకొండ ప్రాకృత శాసనంలో మహాసేనాపతి మహాతలవర "ఖందచలికి" పేరు కన్పిస్తున్నది. చలికి-సలికి-సల్కి అన్నవి చాళుక్య పదానికి ప్రాకృతరూపాలు. ఆ శాసనాన్ని బట్టి చాళుక్యులు సేనాపతులుగా వుండి క్రమంగా రాజ్యస్థాపన చేసారని చెప్పవచ్చును. ఇక్ష్వాకుల లాగానే చాళుక్యులు అయోధ్యానగరం నుంచి వచ్చామని రాముని వంశజులమని చెప్పకున్నారు. బిల్హణుడు "విక్రమాంకదేవ చరిత్ర"లో చాళుక్యులను శూద్రులుగా వర్ణించాడు. కాని బాదామినేలిన చాళుక్యులు తాము సూర్యవంశజులమని చెప్పకున్నారు. వేంగి నేలిన చాళుక్యులేమో చంద్రవంశజులమని చెప్పకున్నారు. ఒక్క శాఖకు చెందిన వాళ్ళు ఈ విధంగా విరుద్ధంగా ఎందుకు చెప్పకున్నారో తెలియదు. చాళుక్యులు అనేక శాఖలుగా విస్తరించి గుజరాతు మొదలుకొని వేంగివరకు పాలించారు.

ఏ దేశంలోనైనా చాళుక్యులు సంస్కృతంతో పాటు దేశభాషలనభిమానించి వాటి వికాసానికి దోహదం చేసారు.

మును మార్గకవిత లోకం,
బున వెలయగ దేశి కవితఁ బుట్టించి తెనుం
గును నిలిపిరంధ్ర విషయం
బునఁజనఁజాళుక్యరాజు మొదలుగ పలువుర్"

అని నన్నెచోడకవి - చాళుక్యుల దేశికవితాభిమానాన్ని కీర్తించాడు.

ఆంధ్రదేశంలో వేములవాడ చాళుక్యుల ఆస్థానంలో కన్నడంలో ఆది కావ్య రచన జరిగింది. వేంగిచాళుక్యులు తెలుగులో ఆదికావ్య రచనకు ప్రోత్సాహాన్నిచ్చారు.

తూర్పు చాళుక్యుల వేంగిరాజ్యం తీరాంధ్రానికి మాత్రమే పరిమిత మైంది. తెలంగాణా రాయలసీమ ప్రాంతాల్లో పశ్చిమచాళుక్యులకు, రాష్ట్రకూటులకు, పల్లవులకు, చోళులకు సామంతులుగా అనేక రాజవంశాలు పాలించాయి. రాయలసీమలో రేనాటి చోళులు (క్రీ.శ. 500-850) బాణులు (క్రీ.శ. 795-911) నొలంబులు (క్రి.శ. 770 -975) వైదుంబులు (క్రీ.శ. 910-970) పాలించారు.

రేనాటి చోళులు రాయలసీమలో సప్తసహస్రగ్రామ సమన్వితమైన కడప, కర్నూలు చిత్తూరు ప్రాంతాలను పాలించారు. రేనాటి చోళులు చంద్ర వంశజులమని కరికాల వంశజులమని చెప్పుకున్నారు. వాళ్ళు మొదట పల్లవులకు తర్వాత పశ్చిమ చాళుక్యులకు సామంతులుగా వున్నారు. రేనాటి చోళరాజులు దాదాపు 300 సంవత్సరాలు పాలించారు. 13 మంది రాజులున్నారు. బాణులు, నొలంబులు వైదుంబులు కూడ పల్లవులకు పశ్చిమ చాళుక్యులకు పశ్చిమగాంగులకు అదనును బట్టి సామంతులుగా

వ్యవహరిస్తూ వాళ్ళ బిరుదనామాలను తాము ధరించారు. చారిత్రకంగా వాళ్ళ చరిత్ర మహత్త్వపూర్ణమైంది కాకపోయినా తెలుగుభాషా సాహిత్య చరిత్రలో వాళ్ళకు మహత్త్వపూర్ణమైన స్థానముంది.

క్రీ.శ. 6 వ శ.వరకు తెలుగుభాషా పదాలు మాత్రమే దొరికాయి. ఆంధ్రదేశాన్ని పాలించిన రాజులు ప్రాకృత సంస్కృతభాషనభిమానించి ఆ భాషల్లోనే శాసనాలు వేయించారు. అంటె ఆ భాషలే రాజభాషలుగా అధికారభాషలుగా వ్యవహారంలో వున్నాయని చెప్పవచ్చును. అటువంటప్పుడు రేనాటి చోళులు తెలుగునభిమానించి తమ శాసనాలను తెలుగులో వేయించిన మొదటి శాసకులయ్యారు. వాళ్ళు తెలుగులో వేయించిన శాసనాలు 33 వరకు దొరుకుతున్నాయి. వాటిల్లో క్రీ.శ. 575 నాటిదైన ధనంజయుడు వేయించిన కలమళ్ళ శాసనం తెలుగులో వేయబడిన మొట్టమొదటి శాసనం. ధనంజయుని కొడుకు పుణ్యకుమారుడు వేయించిన ఎర్రగుడిపాడు శాసనం. (క్రీ.శ. 600) రెండోది.

ధనంజయుని కలమళ్ళ శాసనం చాలా చిన్నది. దానిలో చాలాభాగం నశించింది. ఆ శాసనం కింది విధంగా వుంది.

కల్ము (త్తు) రా
జు ధనంజ
యున్డు రేనా
ణ్డు ఏళన్
చిఱుంబూరి
రేవణ కాలు (పం)
పు చెనూరు కాజు
అఱి కఞా (ఊ) రి
ణ్డ వారు ఊరి
పఞ్చ (మ)

హా పాతకస
(కు)

ఈ శాసనం కన్నా పుణ్యకుమారుడు వేయించిన ఎర్రగుడిపాడు శాసనం తెలుగులో సంపూర్ణంగా అర్థవంతంగా వున్న మొదటి శాసనం. శిలకు మొదటి వైపు

స్వస్తిశ్రీ ఎరిక
రాజుల్ల
కుణ్డికాళ్ళు (ని) వబుకా
ను ఇచ్చిన పన్నస
దుజయరాజుల
ముత్తురాజులు నవ
ప్రియ ముత్తురాజులు
వల్లవ దుకరజులు శక్తి
కాను ఇచ్చి (న) పన్నస్స

శిలకు రెండో వైపు -

కొట్టుంబున పా
ఱకు కుణ్డికాళ్ళు
ళా ఇచ్చిన పన్నస
ఇరవది యాది నా
ల్కు మఱున్తుఙ్లు నేలు

ఈ శాసనంలో సమాపకక్రియ లేదు. క్రియాజన్య విశేషణాలతో కూడిన కర్మాంత వాక్యాలు మూడు వున్నాయి. పై శాసనంలాగా కాక ఈ శాసనం పూర్తిగా దొరికింది. "ఎరికల్లు నేలే ముత్తురాజు ధనంజయుడు రేనాడును ఏలుచుండగా చిరంబూరుకు చెందిన రేవణకాలు అనే వ్యక్తి పంపున చెనూరి గ్రామానికి చెందిన కాజు......." అని వాక్యంతో ధనంజయుని కలమళ్ళ శాసనం అసంపూర్తిగా వుంది. చివరిలో పంచమహాపాతకుడగునని - ఈ ధర్మాన్ని చెడగొట్టేవారికి పాపం చెప్పబడినట్లుగా మిగిలిన అక్షరాలను బట్టి

చెప్పవచ్చును. "ఎరికల్" రేనాటి చోళుల రాజధాని అని ముతు లేదా ముత్తురాజు అనేది మహారాజు బిరుదం వంటిదని చారిత్రకులంటున్నారు. రేవణకాలులో క్రాల్లు ఈనాటి "గారు" కు పూర్వరూపం. సంస్కృతంలో "పాద" శబ్దం గౌరవసూచకంగా వాడబడుతుంది. "పాద" ను అనువాదం చేసి తెలుగులో "కాలు" శబ్దం వాడేవాళ్ళు. "కాలు" "గారు" గా మారింది.

పుణ్యకుమారుని ఎర్రగుడిపాడు శాసనం చదువగానే అర్థం కాదు. ఆనాటి పదజాలాన్ని తెలుసుకోవాలి. "నివబు" ప్రాకృత పదానికి 'నివాప' అని సంస్కృత పదం. జలాంజలి అని అర్థం. దేన్నైనా జలాంజలితో దానం చేయడం ఆచారం. ముత్తురాజు అంటె బిరుదం. దుకరజు అంటె దుగరాజు అని - దానికి యువరాజు అని అర్థం. పన్నస లేదా పనస అంటె పన్ను చెల్లించనక్కరలేని భూమి. "కొట్టుంబు" కు పల్లె అని అర్థం. ఇరవదియాది నాల్కు మఱున్తుఋ్లు అనేది భూప్రమాణం. అంత భూమిని కుణ్డికాళ్ళు అనే వ్యక్తి - పాఱ - బ్రాహ్మణునికి దానం చేస్తూ వేసిన శాసనమిది. దాని సాక్షులు ముగ్గురు - దుజయరాజుల ముత్తు రాజులు, నవప్రియ ముత్తురాజులు, పల్లవ దుకరాజులు.

పై శాసనంలో లేఖకదోషాలు కొన్ని వున్నాయి - దీర్ఘానికి హ్రస్వం వ్రాయడం - సక్షి, అనవసరమైన చోట ద్విత్వాక్షరం వ్రాయడం - పన్నస్స, 'స' కు బదులుగా 'శ' వ్రాయడం - శక్షి. అనుస్వారానికి బదులుగా వర్గ పంచమాక్షరం వ్రాయడం ఆనాడు వుండేది. "కుణ్డికాళ్ళు పాఱకు, రాజుల్ల", అనే పదాల్లో "కొట్టంబున" సప్తమి. షష్ఠీ విభక్తి ప్రత్యయాలు ఇచ్చిన పన్నస - అని క్రియావిశేషణ రూపంతో వాక్యం పూర్తయింది. సమాపక క్రియ లేదు. అంటె శాసనాల్లో పాటింపబడే పద్ధతే అది. అంతేగాని ఆనాడు వాక్యరచనలు, సమాపక క్రియలు లేవని కాదు.

క్రీ.శ. 575 - 848 మధ్యకాలంలోని శాసనాలను పరిశీలిస్తే ఆనాటి తెలుగు భాషలో కొన్ని విలక్షణ వర్ణాలు, పదజాలం కన్పిస్తున్నది. ఆనాడు తెలుగుభాషలో 'ష్జ' అనే ఉచ్చారణ గల 'ఴ' వర్ణం వుండేది. అది కాలక్రమంగా డ ల ళ ర ద గా పదాల్లో మారిపోయింది. నన్నయ నాటికి ఆ వర్ణం లేదు. తమిళంలో "ష్జ" ఉచ్చారణతో కూడిన ఆ వర్ణం ఇప్పటికి వుంది. కన్నడంలో పూర్వముండేది. ఆధునిక కన్నడంలో లేదు ఉదా...

చోఴ —> చోళ, చోడ, చోర, చోల

ఏఴన్ —> ఏలన్

నోఴంబు —> నోలంబు,

ఴెందులూరు —> దెందులూరు. 'ఴ' పదాదిలో సంయుక్తాక్షరంలోను ప్రయోగింపబడింది. క్ఴింద,క్ఴొచ్చె,వ్ఴచ్చె. ఇవి క్రమంగా - క్రింద, క్రొచ్చె, వ్రచ్చె గా మారాయి. న్టు 'న్ట' అనే వర్ణాలు ఆనాటి శాసనాల్లో కన్పిస్తున్నాయి. ఉదా. ధనంజయున్టు, పాతకున్టు, తాన్టికొన్ట. న్టు, న్ట క్రమంగా ండు, ండగా మారాయి. ఉదా. ధనంజయుండు, పాతకుండు, తాడికొండ. ప్రథమా విభక్తిలోని 'డు' ప్రత్యయం ప్రాచీనకాలంలో 'న్టు'గా వుండేది. ఉదా. ధనంజయున్టు —> ధనంజయుండు —> ధనంజయుడు. ఈనాటి 'వాడు' పదం 'వాన్టు'గా వుండేది. వాన్టు —> వాన్డు —> వాండు —> వాఁడు —> వాడుగా మారింది. ఆనాటి భాషలో కన్పించే విలక్షణతలు - స శ ష ల్లో ఒకదానికొకటి వ్రాయడం, అనుస్వారానికి బదులుగా వర్గ పంచమాక్షరం, వ్రాయడం, న, ల కు బదులుగా ణ, ళ లు ఎక్కువగా వ్రాయడం మొదలయినవయి. మిశ్రసమాసాలు చాలా కన్పిస్తున్నాయి. ఉదాహరణకు --- పోర్ముఖరామ, వసన్తపోటి, కణ్డసామి. మనోవల్లభి, వనజనేత్రి వంటి

వ్యాకరణ విరుద్ధ పదాలు ఆనాడు వాడుకలో వుండేయి. ప్రాచీనశాసనాల్లో సమాపక క్రియలు లేవని కొందరన్నారు. కాని ఎత్తించె, దీవియవెట్టె, క్రొచ్చె, పొడిచిపడియెన్, కొణిరి. వ్రాసె, నిల్పె, ఇచ్చిరి, ఇచ్చి నాణ్డు మొదలయిన సమాపక క్రియలు కన్పిస్తున్నాయి. సమాసాలు లేని చిన్న చిన్న వాక్యాల రచన వుంది. కర్మణి ప్రయోగాలు, సంస్కృత మర్యాదననుసరించి యత్తదర్థక వాక్యాలు వున్నాయి. యడాగమం సరళాదేశాలున్నాయి.

ఈ కాలంనాటికి తెలుగులో చాల ప్రాకృత పదాలు వచ్చి చేరాయి. శాసనాల్లో చాలా ప్రాకృత పదాలు కన్పిస్తున్నాయి. నివబు, దుగరాజు, కొమర, కమ్మర, బెజవాడ, బోయ, బెజయరాజ, జాత్ర - జాతర, బటార, దన్నకడ, అస్వమేదంబు, అచ్చెర్వు, కొట్టంబు, పనస, కన్న (కృష్ణ), దమ్మపురంబు, బారనసి మొదలయినయి. అంతేగాక కుణ్డికాళ్ళు, ఇఱ్ఱుకాను, ఆడ్లుపట్టు, పసిణ్డిముడ్లు, బోలు (గ్రామాధికారి) బూత (భుక్తః) బచ్చు (వైశ్య) వంటి వింతపదాలు వున్నాయి. ఉచ్చారణలో ఆనాటి వ్యవహారానికి దగ్గరగా వుండేటట్లు వ్రాయాలనే ప్రయత్నం వల్ల కూడా కొన్ని పదాలు వింతగా కన్పిస్తున్నాయి.

ఈ కాలంలో సంస్కృత సమాసాలు కూడా వచ్చి చేరడం దీర్ఘసమాస రచన చేయడం కూడా ఆరంభమైంది. ముఖ్యంగా బాణ వైదుంబుల శాసనాల్లో అటువంటి రచన కన్పిస్తున్నది. "జగత్త్రియాభివన్దిత సురాసు రాధీశ పరమేశ్వర ప్రతీహారీకృత మహాబలి కులోద్భవ" అని బాణరాజుల శాసనారంభం. వైదుంబులు వీరులు. వీరుల జ్ఞాపకార్థం వాళ్ళు వేయించిన "వీరకల్లు"లు దీర్ఘసమాసంతో ఆరంభమైనాయి. ఉదా. "అనేక సమర సంఘట్టనోపలబ్ధ జయలక్ష్మీ సమాలిఙ్గత వక్షస్థల........." బాణ వైదుంబులు వాళ్ళ సమకాలికులైన తూర్పు చాళుక్య రాజులు తెలుగులోనే శాసనాలు వేయించారు. ఇవన్నీ గద్యంలోనే వున్నా ఆ గద్యంలో అక్కడక్కడ రగడ

మహాక్కర వంటి ఛందోఛాయలున్నాయని పండితులు గుర్తించారు.

క్రీ.శ. 6-9 శతాబ్దాలనాటి తెలుగు భాష నన్నయనాటి తెలుగు భాషకన్నా ఒకటి రెండు విలక్షణోచ్చారణలతో వున్నా ఇప్పటి ఆధునిక భాషకన్నా విలక్షణంగా కన్పించినా సంపూర్ణ భావ ప్రకటనలతో వికసించిన రూపంలో వుందని సాహిత్యదశ ఆరంభమైందని బూదరాజు రాధాకృష్ణ "తెలుగుభాషా చరిత్ర" (పేజి 101) లో అన్నారు.

తెలుగులో పద్యశాసనం మొదటిసారిగా క్రీ.శ. 848 లో గుణగ విజయాదిత్యుని కాలంలో వేయబడింది. వేంగి చాళుక్యరాజు మూడవ విజయాదిత్యునికే గుణగవిజయాదిత్యుడని పేరు. (క్రీ.శ. 848-891) గుణకె నల్ల - అంటె కన్నడంలో గుణాలచేత అందమైన వాడని అర్థం. ఆంధ్రదేశంలో రాజులు కన్నడభాషలో బిరుదాలు ధరించడం అప్పటి నుంచే ప్రచలితంగా వుంది. గుణగ విజయాదిత్యుడు మహాపరాక్రమశాలి. అనేక విజయాలు సాధించి రాజ్యాన్ని సుస్థిరంగా పాలించాడు. కొన్ని శతాబ్దాలు పాలించిన వేంగీచాళుక్యరాజుల్లో కొందరు మాత్రమే ప్రశాంతవాతావరణంలో సుస్థిరపాలన చేయగలిగారు. ఆ సుస్థిర పాలనలోనే కళలు సాహిత్యం పోషింపబడినాయి. గుణగ విజయాదిత్యుని సేనానులలో పండరంగడు ఒకడు. సేనాని పండరంగు వేయించిన అద్దంకి శాసనం (క్రీ.శ. 848) తెలుగులో మొదటి పద్యశాసనం. అంతకుముందు వేంగిరాజులు తెలుగులో గద్యశాసనాలు వేయించారు. జయసింహ వల్లభుడు వేయించిన విప్పర్ల గ్రామశాసనం (క్రీ.శ. 841) తీరాంధ్రంలో దొరికిన మొట్ట మొదటి తెలుగు శాసనం. సేనాని పండరంగడు తెలుగులో రెండు శాసనాలు వేయించాడు. (సంస్కృతంలో పండితుడనే పదానికి రూపాంతరమైన "పండ" పదాన్ని ఇప్పటికీ ఉత్తరభారతంలో వాడుతారు.) పండరంగు వేయించిన శాసనపద్యాలను పండరంగు రచించాడని నిడదవోలు వేంకటరా

వుగారి అభిప్రాయం. పండరంగు వేయించిన రెండు శాసనాలు పద్యంలోనే వున్నాయి. మొదటిసారిగా గణబద్ధమైన ఛందోరచన ఆ శాసనాల్లోనే కన్పిస్తున్నది. వీటిల్లో మొదటిది అద్దంకి శాసనం. దానిలో ఒక తరువోజు పద్యం నాలుగు పంక్తుల గద్యం వున్నాయి. ఆ తరువోజ పద్యం ----

పట్టంబు గట్టిన ప్రథమంబు నేణ్డు
బలగర్వమొప్పంగ బైలేచి సేన
పట్టంబు గట్టించి ప్రభుపండరంగు
బంచిన సామంత పడువలో బోయ
కొట్టముల్ పంద్రెండు గొని వేంగినాంటి
నొల్చి యా త్రిభువనాంకుశబాణ నిల్పి
కట్టెపు దుర్గంబు గడు బయల్సేసి
కందుకూర్బెజవాడ గావించె మెచ్చి

ఈ పద్యంలో పండరంగు విజయాలు వర్ణింపబడినాయి. పండరంగు వేయించిన మరొక శాసనం కందుకూరు శాసనం. క్రీ.శ. 848 నాటిదే అయిన ఆ శాసనంలో సీసపద్యం వుంది. పై తరువోజ దేశ్య పదభరితంకాగా సీసపద్యం సంస్కృత పదభరితంగా నడిచింది.

పండరంగని శాసనాల తర్వాత తెలుగు పద్యం చాళుక్యరాజు భీముడు వేయించిన ధర్మవరశాసనంలో (క్రీ.శ. 897) కన్పిస్తున్నది. దీనిలోని సీస పద్యం ఏ పాదానికా పాదం తెగిపోతు దేశ్య పదభరితంగా వుంది.ఆతర్వాత తెలుగు పద్యం చాళుక్యయుద్ధమల్లుని బెజవాడ శాసనంలో దర్శనమిస్తున్నది. తాతామనవలు ఇద్దరూ యుద్ధముల్లులే. వాళ్ళువేయించిన రెండు శాసనాలు ఒకే శిలపైన వున్నాయి. ఒకటి క్రీ.శ. 885 నాటిది. మరొకటి క్రీ.శ. 930 నాటిది. మొదటి శాసనంలో నాలుగు మధ్యాక్కరలు ఏడు పంక్తుల వచనం తర్వాత శాసనంలో ఒక మధ్యాక్కర వున్నాయి. తెలంగాణాలో దొరికిన

కొరవి శాసనం (క్రీ.శ. 935), విరియాల కామసాని గూడూరు (వరంగల్ జిల్లాలోవి) శాసనం (క్రీ.శ. 1000) చక్కని తెలుగు పద్య గద్య రచనతో కూడివున్నాయి.

కొరవి శాసనాన్ని వేంగీచాళుక్యులకు సామంతులైన ముదిగొండ చాళుక్యరాజు నిరవద్యుడు వేయించాడు. తెలుగు చారిత్రకాంశాల దృష్టితోనే కాక ఆ శాసనం తెలుగు పద్య రచనా దృష్టితోను ముఖ్యమైంది. భాష ప్రసన్నంగా చక్కని కథాకథన శైలిలో వుంది. ద్విరదగతి రగడ ద్విపదలఛాయలతో నడిచింది. సంస్కృతదేశ్యపదాల కూర్పుతో వచనరచన మృదు మధురంగా వుంది. వాక్యాల రచన ఇంపుగా వుంది.

గల కలావత్తణంబు రా
జ్యంబు సేయుచు నిష్ట(ష్ట)వి
షయ కామభోగంబుల
నుభవించుచు సుఖంబు
ణ్డే యొక్క నాణ్డు కొరవి నల్ల
మేటెయ కొడుకు పెద్దన
రావించి నీవునా ప్రాణ స
మానుణ్డవైన చెలివి నీ
చేసిన యుపకారంబు నా
కు బ్రత్యుపకారంబు సేయ
వలయుంగాన నీకేమి వ
లయుం దాని వే
ణ్డికొమ్మన్న.....

కవిని పిలిచి కావ్యరచనను అర్థించే పద్ధతి తర్వాత కాలంలో కావ్యావతారికల్లో వుంది. ఆ పద్ధతిలో చక్కని వచన శైలిలో సంభాషణ ఈ శాసనంలో సాగింది. శాసనం నన్నయ భారతరచనకు వంద సంవత్సరాల ముందుది.

నన్నయ భారతంలోని పద్యగద్య శైలి ఈ శాసనకాలం నాటికి స్థిరపడిందని తెలుస్తున్నది."న్టు"కు బదులుగా "ణ్డు" వాడబడింది. కాని మెఱెయ పదంలో 'ఱ' అక్షరం వాడబడింది. అదే విధంగా రెండవ యుద్ధమల్లుని శాసనం (క్రీ.శ. 935)లో చేఙ్టోల అనే చోట 'ఱ' వాడబడింది. ఆ తర్వాత శాసనాల్లో 'ఱ' కన్పించడం లేదు. నన్నయ భారతం నాటికి 'ఱ' పూర్తిగా ప్రయోగంలో లేకుండా పోయింది.

విరియాలకామసాని గూడూరు శాసనంలో రెండు చంపకమాలలు రెండు ఉత్పలమాలలున్నాయి. శిలాస్తంభం మూడు వేపుల కన్నడ భాషలో వుంది ఒక్కవైపు తెలుగు వృత్త పద్యాలున్నాయి. నన్నయకు పూర్వం వృత్త పద్యాల రచన దీనిలోనే కన్పిస్తున్నది. దేశ్య సంస్కృత పదాల కలయికతో రచన సాగింది. చక్కని ఆలంకారిక శైలి వుంది. "అనుపమ దుర్జయాన్వయ సుధాబ్ధి" "పాండవ మధ్యమ భీముడోయనం" అని రూపకోత్ప్రేక్షాలంకారాలు ప్రయోగింపబడినాయి.

కరీంనగరు జిల్లాలో కుర్క్యాల గ్రామంలో దొరికిన శాసనం జినవల్లభుడు వ్రాసి వేయించిన శాసనం (క్రీ.శ. 945). ఇది తెలుగు సంస్కృత కన్నడ భాషల్లో వుంది. దీనిలో 3 తెలుగు కందపద్యాలున్నాయి. నన్నయకు ఒక శతాబ్దం ముందు వేయబడిన శాసనమిది. కందపద్యాలు దీనిలోనే మొదటిసారిగా కన్పించాయి. పద్యరచన సరళశైలిలో రమ్యంగా వుంది. ఈ శాసనకర్త జినవల్లభుడు కన్నడ సాహిత్యంలో ఆదికవి అయిన పంపని సోదరుడు. పంపకవి వేములవాడ చాళుక్యరాజు రెండవ అరికేసరి (క్రీ.శ. 930-955) ఆస్థానంలో దండనాథుడుగా కవిగా వున్నాడు. పంపకవి తిక్కనవలెనే రాజకీయ తంత్రాన్ని కావ్యరచనను నడిపిన ధీశాలి.

తీరాంధ్రంలో తూర్పుచాళుక్యులు రాయలసీమలో రేనాటి చోళులు,

బాణులు, నొలంబులు, వైదుంబులు పరిపాలిస్తున్న కాలంలో తెలంగాణాలో కరీంనగర్ నిజామాబాదు ప్రాంతాలను మొదట బోధన్ (పోతన) ఆ తర్వాత వేములవాడను రాజధానిగా ఒక చాళుక్యశాఖ పాలించింది. కొరవిసీమ (ఖమ్మం ప్రాంతం) లో ముదిగొండ చాళుక్యులు ముదిగొండ రాజధానిగా పాలించారు. ముదిగొండ చాళుక్యులు తూర్పు చాళుక్య శాఖకు చెందినవాళ్ళు. వాళ్ళకు విధేయులై పాలించారు. వేములవాడ చాళుక్యులు రాష్ట్రకూటులకు విధేయులై పాలించారు. వాళ్ళు జైన శైవమతాల నభిమానించారు. వేములవాడ చాళుక్య మూలపురుషుడు గుజరాతులోని లాట చాళుక్యశాఖకు చెందిన వాడు.వాళ్ళు క్రీ.శ. 750 నుంచి క్రీ.శ. 973 వరకు పాలించారు. తెలంగాణాలో వేములవాడ ముదిగొండ చాళుక్యుల ప్రాభవం నశించిం తర్వాత కాకతీయులు తలెత్తారు.

వేములవాడ చాళుక్యులకాలంలో వేములవాడ జైనమత కేంద్రంగా వుంది. జైనం ఆంధ్రదేశంలో క్రీస్తుపూర్వం నుంచే వుంది. మౌర్య చంద్రగుప్తుని కాలంలో పెద్ద కరవు ఏర్పడగా కొందరు జైనసన్యాసులు వలసవచ్చి కర్ణాటకలోని శ్రవణ బెలగొళలో స్థిరపడ్డారు. వాళ్ళతోపాటు అవసానదశలో జైనమతాన్ని స్వీకరించిన చంద్రగుప్తుడు కూడా వచ్చాడం టారు. ఆ విధంగా క్రీ.పూ. 4వ శ.లోనే జైనం దక్షిణ భారతంలోకి ప్రవేశించింది. తమిళదేశంలోను వ్యాపించింది. అక్కడ ప్రజాసామాన్యం లోను జైనం ప్రవేశించింది. తిర్క్కుక్కురళ్ వ్రాసిన తిరువళ్ళు వరు జైనుడు. ఆంధ్రదేశంలోను క్రీ.పూ. 4వ శ.లోనే కర్ణాటక కళింగదేశాల నుంచి జైనం ప్రవేశించి వ్యాపించింది. అశోకుని పౌత్రుడు సంపుటి ఆంధ్రద్రావిడ దేశాల్లో జైన వ్యాప్తికి కృషి చేసాడంటారు. శాతవాహనుల్లో మొదటి శాతవాహనుడు జైన మతాభిమాని. జైనులకోసం చైత్యాలు నిర్మించాడు. క్రీ.శ. 50 లో సుప్రసిద్ధ జైనాచార్యుడు కొండకుందాచార్యుడు కొనకొండ్ల (అనంతపురం జిల్లాలో) వసతి నిర్మించుకొని అనేక దార్శనికగ్రంథాలను

రచించాడు. జైనమతప్రచారం చేసాడు. తూర్పు చాళుక్య రాజ్యస్థాపకుడు కుబ్జవిష్ణువర్ధనుని భార్య జైనమతాభిమాని. జైనులకు వసతులను నిర్మించింది. తర్వాత కాకతీయుల కళ్యాణిచాళుక్యుల కాలంలో ఆంధ్రదేశంలో జైనం బాగా వ్యాపించింది. పొట్లచెరువు, కొలనుపాక, ఉజ్జి, వర్ధమానపురం, పోతన, వేములవాడ, బెజవాడ మొదలయిన చోట్ల జైనవసతులుండేయి.

పంపకవి వేంగీమండలంలో వేంగిపర్రులో జన్మించాడు. కాబట్టి అతడు తెలుగువాడని చెప్పవచ్చును. పంపకవి వేదాధ్యయనం చేసిన బ్రాహ్మణ వంశంలో పుట్టాడు. పంపకవి తండ్రి భీముడు జైనమతాన్ని స్వీకరించాడు. జైనమతాదరణ కలిగిన వేములవాడకు పంపకవి సకుటుంబంగా వచ్చి రాజ్యాస్థానంలో స్థిరపడివుంటాడు. అతని తమ్ముడు జినవల్లభుడు కూడ ఇప్పటి కరీంనగర్‌జిల్లాలోని గంగాధర కుర్క్యాల గ్రామాల మధ్య త్రిభువన తిలకమనే వసతిని నిర్మించుకొని మత ప్రచారం చేస్తూ నివసించాడు. జినవల్లభుడు జైనులకు జైనమునులకు అన్నదానం చేసేవాడు. కవులను పండితులనాదరించాడు. జైనాలయాలను నిర్మించాడు. మదనవిలాసమనే తోటను వేయించాడు. పంపకవికి కవితా గుణార్ణవుడని బిరుదముంది. జినవల్లభుడు తటాకాన్ని తవ్వించి కవితాగుణార్ణవమని పేరు పెట్టాడు. పంపకవి కన్నడంలో పంపభారతమనే పేరు గల్గిన విక్రమార్జునవిజయం కావ్యాన్ని ఆదిపురాణాన్ని రచించాడు. (క్రీ.శ. 942). "విక్రమార్జున విజయం" కావ్యంలో మహాభారత కథ వుంది. అర్జునున్ని నాయకునిగా చేసి పంపకవి ఏకనాయకాశ్రయంగా భారతకథను కావ్యంగా వ్రాసాడు. కావ్య నాయకుడు అర్జునునికి తన ఆశ్రయదాత రెండవ అరికేసరికి పంపకవి అభేదం చేసి రచించాడు. అది లౌకిక కావ్యం. ఆదిపురాణం ధార్మిక కావ్యం. దానిలో జైనతీర్థంకరుల్లో ఆదిముని అయిన వృషభదేవుని చరిత్ర నిబద్ధంపబడింది. పంపకవికి రెండవ అరిసకేసరి ఈనాటి ప్రసిద్ధ పుణ్యక్షేత్రం ధర్మపురి అగ్రహారాన్ని దానంగా ఇచ్చాడు. ఆంధ్రదేశంలో

కన్నడ సాహిత్యంలో ఆదికవి పంపడు నివసించి సాహిత్య కృషి చేస్తూ కన్నడ కావ్యాలు వ్రాయడం ఒక అపూర్వ విషయం. అదే విధంగా కన్నడ రత్నత్రయంలో వాళ్ళైన పొన్నరన్నలకు ఆంధ్రదేశంతో సంబంధముంది. పొన్నకవి ఆంధ్రదేశంలోని కమ్మనాటిలోని పుంగనూరువాడు. పంపవలెనే పొన్నడు తెలుగువాడేనేమో. ఇద్దరూ జైనులే. క్రీ.శ. 10వ శ.లో ఈ ఇద్దరు కవులు పంపనికి దాదాపు· దాదాపు సమకాలికులే. పొన్న "భువనైక రామాభ్యుదయం" పేరుతో రామాయణాన్ని వ్రాసాడు. కాని అది అలభ్యం. అతని ధార్మిక కావ్యం శాంతి పురాణం. దానిలో 16 వ తీర్థంకరుని చరిత్ర వుంది. రన్న "సాహసభీమ విజయం" లేదా "గదాయుద్ధం" పేరుతో భీముని నాయకునిగా చేసి ఏకనాయకాశ్రయంగా మహాభారత కథను వ్రాసాడు. అది లౌకిక కావ్యం. అతని ధార్మిక కావ్యం రెండవ తీర్థంకరుని చరిత్రతో కూడిన అజితపురాణం. పంపకవివలెనే రన్నకవి తన ఆశ్రయదాత చాళుక్య సత్యాశ్రయునికి భీమునికి అభేదంచేసి రచించాడు. పొన్నకవి కూడా తన ఆశ్రయదాత రాష్ట్రకూట చక్రవర్తి మూడవ కృష్ణునికి రామునికి అభేదం చేసి రచించి వుంటాడు. తెలుగులో నన్నెచోడకవి ఆ సంప్రదాయాన్ని అనుసరించే కావచ్చును తన కృతిభర్త జంగమ మల్లికార్జునునికి కావ్య నాయకుడు శివునికి అభేదం చేసి వర్ణించాడు.

అత్తిమబ్బెయనే ఆమె దానశీలగా ఆ కాలంలో ప్రసిద్ధి చెందింది. "దాన చింతామణి" అని ఆమెకు బిరుదం. జైనమతాభిమాని. ఆమె పొన్నకవి శాంతిపురాణ ప్రతులు వేయి వ్రాయించిందట. ఆమెను రన్నకవి కూడా ఆవేశపూర్వకంగా ప్రశంసించాడు. ఆమె ప్రేరణతోనే రన్నకవి అజితపురాణం వ్రాసాడు. రన్నకవికి "శబ్దానుశాసన ప్రభవ వచోవిభవుడు" అన్న బిరుదం నన్నయకున్న "వాగనుశాసన" బిరుదుదాన్ని పోలివుంది. అదేవిధంగ పొన్నకవికి "ఉభయకవి చక్రవర్తి" అన్న బిరుదముంది. అది తిక్కన "ఉభయ కవిమిత్రుడు" అనే బిరుదాన్ని పోలి వుంది. రన్నకవి గదా

యుద్ధంలో నాటకీయతను చూపాడు. తిక్కన కూడా నాటకీయశిల్పానికి ప్రసిద్ధుడు.

పంపపొన్నల లాగానే మరో కన్నడకవి ఒకటవ నాగవర్మ ఆంధ్రదేశంలో పుట్టాడు. అతడు వేంగిమండలంవాడు. కర్ణాటక కాదంబరి, ఛందోంబుధి గ్రంథాలు వ్రాసాడు. గజాంకుశుడనే మరో కవి (క్రీ.శ. 1000). ఆ కవి కన్నడంలోనే కాక తెలుగులో రచనలు చేసాడని, మడికి సింగన తన సకలనీతి సమ్మతంలో పేర్కొన్న గజాంకుశుడు ఇతడనేనని నిడదవోలు వేంకటరావుగారి అభిప్రాయం. గజాంకుశుడు తెలుగులో "నీతిసారం" వ్రాసాడని అంటారు. అదేవిధంగా "ప్రబంధరత్నావళి" - క్రీ.శ. 1530 నాటిదైన ప్రాచీన కావ్యసంకలన గ్రంథంలో ఉట్టంకించబడిన పద్మకవి - పంపకవి అని, సర్వదేవుడు - పొన్నకవియే అని నిడదవోలువారు దాని రెండవ ముద్రణకు వ్రాసిన పీఠికలో అన్నారు. ప్రబంధరత్నావళిలో పద్మకవి జినేంద్రపురాణం నుంచి ఒక సీసపద్యం మందర పర్వత వర్ణనతో కూడింది ఉదాహరింపబడింది. ఆ వర్ణన రమ్యంగా కావ్యశైలిలో వుంది. పంపకవి తన గురువైన జినేంద్రముని చరిత్రను తెలుగులో వ్రాసాడని పద్మ అన్నది పంపకు రూపాంతరమైన పేరు అని నిడదవోలుగారి అభిప్రాయం. అదే విధంగా సర్వదేవుడన్నది పొన్నకవికి బిరుదనామమని ప్రబంధరత్నావళిలోని సర్వదేవుడు పొన్నకవియే అని నిడదవోలు గారి అభిప్రాయం పంపకవి అంటె పొన్నకవికి అభిమానం. ఆ అభిమానంతోనే అతని కన్నడ ఆది పురాణాన్ని పొన్నకవి ఆంధ్రీకరించాడని అన్నారు. ఆదిపురాణం నుంచి ఒక మత్తేభం ఒక కందం ప్రబంధరత్నావళిలో ఉదాహరింపబడినాయి. కావ్యశైలిలో చంద్రోదయవర్ణన ఈ పద్యాల్లో చేయబడింది.

క్రీ.శ. 850-1000 మధ్యకాలంలో జైనకవులు తెలుగులో కావ్యాలు రచించారని "నన్నయకు పూర్వము తెలుగులో సాహిత్యమున్నదనియు నది

జైన సాహిత్యమనియు మొదటిసారిగా నిరూపించునది ప్రబంధరత్నావళి" అని నిడదవోలు వేంకటరావుగారు దాని పీఠికలో వ్రాసారు.

వేములవాడలో వెలిసిన మరో ప్రసిద్ధకవి భీమన. వేములవాడ భీమకవిగా ప్రసిద్ధి చెందాడు. కవిజనాశ్రయమనే ఛందోగ్రంథాన్ని తెలుగులో రచించాడు. ఇది "భీమన ఛందము" పేరుతో ప్రసిద్ధమైంది. లోకంలో వేములవాడ భీమకవిని గురించి కథలు ప్రచారంలో వుండడమే కాక ప్రాచీనకవిస్తుతిలో కూడా అతని పేరు వుంది. శ్రీనాథుడు "వచియింతు వేములవాడ భీమన భంగినుద్దండ లీల" అన్నాడు. దాన్ని బట్టి భీమన కవిత్వం ఉద్దండరీతిలో వుండేదని తెలుస్తున్నది. శ్రీనాథుడు (క్రీ.శ. 1380-1450) నన్నయ కన్నా ముందుగా భీమనను స్తుతించడం చేత భీమన నన్నయకు పూర్వుడని చెప్పవచ్చును. భీమన శాపానుగ్రహ సమర్థుడైన వశ్యవాక్కు గల కవిగా ప్రచారంలో వున్న కథలు చెప్తున్నాయి. అతని చాటువులుగా ఎన్నో పద్యాలు వ్యాప్తిలో వున్నాయి. అవన్నీ అతనివే అని చెప్పలేము. అతని పేరు మీద రాఘవ పాండవీయం నృసింహపురాణం, హరవిలాసం, సుమతిశతకం శతకంధర రామాయణం మొదలయిన రచన లెన్నో కన్పిస్తున్నాయి. అవన్నీ ఆధారాలు లేంది ఒక్క కవే రచించాడని చెప్పలేము. భీమన కవిజనాశ్రయం రచించాడనడానికి ఆధారాలున్నాయి. వార్తాకవి రాఘవయ్య, అప్పకవి (క్రీ.శ. 1650) భీమనను కవిజనాశ్రయకర్తగా పేర్కొన్నారు. ఆంధ్రకవి రామయ్య "ఛందో నిబంధనా చాతురీ ధౌరేయ వాగ్ధాము వేములవాడ భీము"నని స్తుతించాడు. "వేములవాడం జరించి వేములవాడన్ దా మెరసిన భీముని బలభీము వినుత భీము" అని కొరవిగోపరాజు స్తుతించాడు. ఇంకా మొల్ల పింగళిసూరన చిత్రకవి పెద్దన మొదలయిన ప్రాచీనకవులు భీమనను స్తుతించారు. "లాక్షణికులు కూడా పెక్కురు కవిజనాశ్రయము వేములవాడ భీమకవి రచితమని ఉదాహరించెదరు" - అని ప్రబంధరత్నావళి పీఠికలో వేటూరి ప్రభాకరశాస్త్రిగారన్నారు.

భీమన వేములవాడలో జన్మించాడు. వేములవాడ శాసనాల్లో లేము లవాడ, లేంబులవాడ అని వుంది. "లేములవాడ భీమ భళిరే కవిశేఖర సార్వభౌమ" అని చాటుపద్యం. వేములవాడగా ప్రసిద్ధి చెందిన వేము లవాడను రాజధానిగా చేసుకొని పాలించిన చాళుక్యరాజుల్లో మొదటి బద్దెగుడు (క్రీ.శ. 870-895) ప్రసిద్ధుడైన రాజు. అతడే వేములవాడలో భీమేశ్వరాలాయాన్ని నిర్మించాడు. ఆ తర్వాత రెండవ అరికేసరి (క్రీ.శ. 930-955) వేములవాడలో రాజరాజేశ్వరాలాయాన్ని నిర్మించాడు. అది ఇప్పటికీ ప్రసిద్ధంగా వుంది. బద్దెగునికి "సోలదగండ" అంటె అపజయ మెరుగని వీరుడని బిరుదముంది. కౌరవిశాసనంలో వేంగిచాళుక్య భీముని బంధించినట్లుగా చెప్పబడిందీ బద్దెగుడే. పంపకవి విక్రమార్జునవిజయంలో బద్దెగుడు భీమనృపతి గర్వం దింపిన వాడుగా వర్ణింపబడినాడు. బద్దెగుడు నిర్మించిన భీమేశ్వరాలయం ప్రసిద్ధమైంది. ఇప్పటికీ పూజలందుకుంటున్నది. భీమేశ్వరుని అనుగ్రహం వల్లనే ఒక బ్రాహ్మణ వితంతువుకు భీమన పుట్టాడని ఆ దేవుడతన్ని వశ్యవాక్కుగా దీవించాడని ఐతిహ్యం. వితంతువు కొడుకైన భీమనను బ్రాహ్మణులు బాధించారని అయినా భీమన చలించలేదని కథలు వ్యాప్తిలో వున్నాయి. ఈ భీమన గొప్పకవి అని కూడా కథలున్నాయి. ఆ భీమనే కవిజనాశ్రయుడు, శ్రావకాభరణుడనే బిరుదాలున్న మల్లియరేచనకు అంకితంగా కవిజనాశ్రయాన్ని రచించి వుంటాడు. నన్నయ రాజరాజుకు మహాభారతాన్ని అంకితంగా ఇయ్యలేదు. రాజరాజనరేంద్రుని సంబోధిస్తూ భారతాన్ని రచించాడు. అదే విధంగా భీమన కవిజనాశ్రయుడైన రేచనను సంబోధిస్తూ కవిజనాశ్రయం చెప్పాడు. కాని అంకితంగా ఇయ్యలేదు.

కవిజనాశ్రయంలో ఎన్నోచోట్ల జైనమత ప్రసక్తి వుంది. దాన్ని శైవుడైన భీమన వ్రాసాడనడం అసంగతమని అప్పకవి "వికటకవులు కొన్ని వింతలు కల్పించి కవిజనాశ్రయమున కలిపినారు" అని అన్నాడని అంటారు. భీమన శైవుడైనా జైనాన్ని అభిమానించి వుంటాడు. ఆ కాలంలో ఎందరో వేద

పారంగతులైన పంపకవి వంటివాళ్ళు జైనాన్ని స్వీకరించారు. కాబట్టి జైనమత ప్రాబల్యం గురించి తెలియని కాలంలో అంచనా వేయలేని కాలంలో ఏవేవో ఊహలు మార్పులు చేయడం జరిగింది. దాంతో నిర్ణయించలేని గందరగోళమేర్పడింది. రేచనకు కవిజనాశ్రయుడని బిరుదమున్నట్లు కవిజనాశ్రయం గద్యంలో వుంది. అటువంటప్పుడు రేచన తన పేర తనే గ్రంథం రచించుకున్నాడనడం కంటె అతని ఆశ్రయంలో భీమన రచించాడనడమే సమంజసం. "వేములవాడను వెలిసిన భీమేశ్వరు కరుణగల్గు భీమసుకవినే గోమటి రేచన మీదను నీ మహికవులెన్న ఛందమెలమి రచింతున్" అని కవిజనాశ్రయంలోని పద్యంలో వుంది. కాబట్టి కవిగా లోకంలో గాథలు చెప్పబడే భీమనే కవిజనాశ్రయకర్త అని చెప్పడం సమంజసం. బద్దెగునికి పూర్వమే తెలుగులో పద్యశాసనాలు వున్నాయి. అంటే తెలుగులో పద్యవిద్య స్థిరపడింది. అటువంటప్పుడు భీమన ఛందస్సు లక్షణాలను వివరిస్తూ ఛందోగ్రంథాన్ని వ్రాసాడంటె కాదని నిరాకరించడం నన్నయకు పూర్వం ఛందోగ్రంథం వెలిసిందంటె కాదనడం సమంజసం కాదేమో.

కవిజనాశ్రయాన్ని ప్రచురించిన మానవల్లివారు జయంతి రామయ్య పంతులుగారు భీమన కృతిగానే అంగీకరించారు. రేచనే కవిజనాశ్రయం చెప్పాడనుకుంటే "సుగుణ సుందర తరుణీస్మరనిభుడు, వారస్త్రీ సంసేవ్యా దక్షుడు, సుందరీవశ్యవిద్యామణి" వంటి విశేషణాలను వేసుకోడు. జైనుడైన పంపకవి లాగానె రేచన పరాక్రమ శాలిగా అమిత సాహసుడుగా కన్పిస్తున్నాడు. కొరవి గోపరాజు భీమనను "బలభీము" అని స్తుతించాడు. దాన్ని బట్టి జైనులు శరీరబలం పోషణ విషయంలో శ్రద్ధవహించే వాళ్ళని తెలుస్తున్నది. తర్వాత మధ్వాచార్యులు మధ్వమతంలో శరీర సౌష్ఠవానికి ప్రాధాన్యం ఇచ్చాడు. భీముని అవతారంగా కీర్తింపబడినాడు. అది జైన ప్రభావం వల్ల వచ్చిందే కావచ్చును.

తెలంగాణాలోని వేములవాడ ప్రసిద్ధి తెలియని కాలంలో "వేములవాడ భీమన" ప్రసిద్ధమైన ద్రాక్షారామంతో ముడిపెట్టబడి వుంటాడు. వేములవాడలో కూడా ప్రసిద్ధంగా భీమేశ్వరాలయముందని తెలియని వాళ్ళు వేములవాడభీమన ద్రాక్షారామ భీమేశనందనుడని చెప్పి వుంటారు.

తెలుగుసాహిత్య చరిత్రలో బద్దెన అనే భూపాలుడు నీతిశాస్త్రముక్తావళి, సుమతీశతకం కర్తగా చెప్పబడుతున్నాడు. వేములవాడ చాళుక్యుల్లో ముగ్గురు రాజులు బద్దెగ పేరుతో కన్పిస్తున్నారు. భీమేశ్వరాలయం నిర్మాత మొదటి బద్దెగడు క్రీ.శ. 870-895. రెండవ బద్దెగడు పంపకవి ఆశ్రయదాత రెండవ అరికేసరి కొడుకు. క్రీ.శ. 960-966 మధ్య పాలించాడు. మూడవ బద్దెగడు ఈ వంశంలో చివరిరాజు. రెండవ అరికేసరి కాలంలోనే ఉత్తరభారతం నుంచి సోమదేవసూరి అనే జైనకవి వచ్చి వేములవాడలో ఆశ్రయం పొందాడు. సోమదేవ సూరి సంస్కృతంలో యశస్తిలకచంపు అనే కథాకావ్యాన్ని వ్రాసాడు. దాన్నతడు క్రీ.శ. 959లో రెండవ అరికేసరి పెద్ద కొడుకు వాగరాజు (క్రీ.శ. 955-960) కాలంలో పూర్తిచేసాడు. నీతికావ్యమనే రాజనీతిగ్రంథాన్ని సంస్కృతంలో రచించాడు. సోమదేవ సూరి రెండవ బద్దెగుని కాలంలో కూడా వున్నాడు. అతనికి విద్యాగురువు. బద్దెగుడు సోమదేవసూరికి వేములవాడలో శుభ దామమనే పేరుతో జినాలయాన్ని నిర్మించి ఇచ్చాడు. రెండవ బద్దెగుని కొడుకు మూడవ అరికేసరి కాలంలో కూడా సోమదేవసూరి వున్నాడు. శుభదామజినాలయానికి అతడు క్రీ.శ. 966 లో నైవేద్యార్థం రేపాక గ్రామాన్ని దానంగా ఇచ్చాడు. ఆ విధంగా సోమదేవసూరి మూడు తరాలు జైన గురువుగా వ్యవహరించాడు. సోమదేవ సూరి సంస్కృతంలో రచించిన నీతి కావ్యాన్నే రెండవ బద్దెగుడు నీతిశాస్త్ర ముక్తావళి పేరుతో ఆంధ్రీకరించాడేమో. అతని కాలంలోనే భీమన కవి కూడా వుండివుంటాడు. అందుకే సుమతీశతకం బద్దెగుని రచనగాను భీమన రచనగాను చెప్పబడుతున్నది. ఇద్దరిలో ఎవరో ఒకరు సుమతీ

శతకాన్ని వ్రాసి వుంటారు. జినవల్లభుని కుర్క్యాల శాసనంలో కందపద్యాలు కన్పిస్తున్నాయి. సుమతీశతకం కందాల్లోనే వుండడం గమనించవలసిన విషయం. వేములవాడ చాళుక్యరాజుల్లో చివరి రాజు మూడవ బద్దెగుడు (క్రీ.శ. 1052). అతన్ని కాకతి మొదటి ప్రోలరాజు పారదోలినట్లు కాజిపేట శాసనం వల్ల తెలుస్తున్నది. దాంతో వేములవాడ చాళుక్యవంశం రాజ్యం అంతరించింది. కాబట్టి రాజ్యాస్థిరతతోవున్న మూడవ బద్దెగుని కన్నా రెండవ బద్దెగుడు నీతిశాస్త్రముక్తావళి రచయిత అని చెప్పడం సమంజసంగా వుంటుంది. కన్నడ రత్నత్రయంలో వాళ్ళయిన పొన్న రన్న కవులనాదరించిన మల్లపయ్య కూతురు అత్తిమబ్బె (అత్తిమాంబ) ఆ కాలంలోనే వుంది. భీమనకాశ్రయమిచ్చిన కవిజనాశ్రయ రచనకు ప్రోత్సహించిన మల్లియ రేచన మల్లపయ్య కొడుకు అత్తిమబ్బె సోదరుడై వుంటాడు. వాళ్ళది వైశ్యకులం. వైశ్యులు ఆ కాలంలో జైనమతావలంబులు. వైశ్యులలాగానే యజ్ఞోపవీతాలను ధరించే పంచాణంవాళ్ళు విశ్వకర్ములు కూడా ఆ కాలంలో జైనులే. తర్వాత జైనమతానికి ఆదరణ తగ్గి వీరశైవం విజృంభించిన కాలంలో వాళ్ళంతా శైవులైనారు.

వేములవాడ చాళుక్యులు కన్నడ సంస్కృతభాషల నభిమానించారు. ఒక్క కుర్క్యాల శాసనంలో కన్నడ సంస్కృతాలతోపాటు 3 తెలుగు కందపద్యాలున్నాయి. వేములవాడ చాళుక్యులు రాష్ట్రకూటులతో వియ్యమందుకొని వాళ్ళతో ఘనిష్ఠ సంబంధాలు పెట్టుకున్నారు. అందుకేనేమో వాళ్ళు కన్నడ భాష నెక్కువగా అభిమానించి పంపాదికవుల నాదరించారు. శాసనాలను కన్నడంలోనే ఎక్కువ వేయించారు. కొన్ని మాత్రమే సంస్కృతంలో వున్నాయి. కవులకు పండితులకాశ్రయమిచ్చి పోషించారు. సాహిత్య కృషికి దోహదం చేసారు. జైనశైవ మతాలనవలంబించారు. అనేక జైనాలయాలను శైవాలయాలను నిర్మించి శిల్పకళను పోషించారు. అనేక గ్రామాలను కవిపండితులకు జైనాచార్యులకు దానంగా ఇచ్చారు. గోదావరి, మంజీర

మానేరు, ప్రణీతానదుల పరీవాహక ప్రదేశంలో వున్న వాళ్ళ రాజ్యం సార వంతమైన భూములతో కూడింది. అంతేగాక వాళ్ళు నదులపై ఆనకట్టలు నిర్మించి కాలువలు తవ్వించి నీటిపారుదల వసతులు కల్పించారు. దాంతో పంటలతో దేశం సుభిక్షంగా వుంది. దేశ విదేశీ వాణిజ్యం జరిగేది. ఆనాడు వర్తకసంఘాలుండేయి. వేములవాలోని 'వాడ' పేరును బట్టి అది బెజవాడ లాగానే వర్తక కేంద్రంగా వుండేదని చెప్పవచ్చును. వర్తక సంఘాలను నకరములనే వాళ్ళు. వేములవాడలో నకరేశ్వరాలయముంది. దాన్నిబట్టి వర్తక సంఘం సమృద్ధితో వుందని చెప్పవచ్చును. అందుకే అనేక ఆలయాల నిర్మాణాలతో జైన శైవమతాల వికాసంతో సాహిత్యాభివృద్ధితో వేములవాడ చాళుక్యుల పాలన ఆంధ్రదేశచరిత్రలో విశేషంగా చెప్పుకోదగింది.

దక్షిణదేశంలో బౌద్ధమతం బుద్ధుని కాలంలోనే ప్రవేశించింది. క్రమ క్రమంగా జనసామాన్యంలోకి వ్యాపించింది. కడపమండలంలో దొరికిన అశోకుని 13వ శిలాశాసనాన్ని బట్టి అప్పటికే ఆంధ్రులు బౌద్ధ మతాన్ని అవలంబిస్తున్నారని తెలుస్తున్నది. క్రీ.పూ. 6వ శతాబ్దంలో బుద్ధునికి సమకాలి కుడైన బావరి అనే బౌద్ధాచార్యుడు దక్షిణదేశానికి వచ్చి ఆంధ్రప్రాంతంలోని అశ్మక ములకరాజ్యాల సరిహద్దులో గోదావరి నదీతీరంలో ఆశ్రమాన్ని నిర్మించుకొని విద్యాబోధన చేసాడని సుత్తనిపాతం అనే బౌద్ధగ్రంథాన్ని బట్టి తెలుస్తున్నది. బుద్ధుని ప్రధానశిష్యుల్లో ఒకడైన మహాకాత్యాయనుడు అశ్మకరాజుకు బౌద్ధమత దీక్ష నిచ్చాడు. బౌద్ధజాతక కథలో అశ్మక ములక కళింగరాజ్యాల ప్రసక్తి వుంది - ఆంధ్రాపథం, ఆంధ్రనగరి పేర్కొనబడినాయి. ఆంధ్రనగరి అంటె ధాన్యకటకం అని చారిత్రకుల అభిప్రాయం. ఆ నాటి బౌద్ధమతకేంద్రం, వ్యాపార కేంద్రం అయిన ధాన్యకటకమే ఈనాడు అమరావతిగా పిలువబడుతున్నది.

బావరి, కాత్యాయనులు వింధ్యను దాటి ఆంధ్రప్రాంతాన్ని చేరుకు

న్నారని చారిత్రకులుంటున్నారు. ఉత్తరాపథం నుంచి ఆంధ్రప్రాంతానికి చేరుకోడానికి రెండు మార్గాలుండేయి. ఒకటి ఉజ్జయిని -- వింధ్య పర్వ తాలు మీదుగా, ఇంకోటి -- మగధ నుంచి కళింగం చేరుకొని కృష్ణాముఖ ద్వారానికి చేరుకునేవాళ్ళు. బావరి కాత్యాయనులు ప్రయాణించిన మార్గం లోనే అగస్త్యుడు వింధ్యను దాటి ఆంధ్ర ద్రావిడ ప్రాంతాలకు వచ్చాడు. అతనితోనే హిందూమతం ముఖ్యంగా శైవం దక్షిణ దేశం చేరుకుంది. రామాయణకాలం నాటికే (క్రీ.పూ. 8వ శ.) అగస్త్యుడు దక్షిణదేశంలో ఆశ్ర మాన్ని నిర్మించుకొని నివసిస్తున్నాడు. అగస్త్యుడు దక్షిణభారతానికి వచ్చి ద్రాక్షారామాన్ని చేరుకొని అక్కడ శివారాధన చేస్తూ నిలచిపోయినట్లున్న స్కాందపురాణంలోని వృత్తాంతాన్ని తీసుకొని శ్రీనాథుడు కాశీఖండంలో రచించాడు. అంతేగాని తెలుగు సాహిత్యంతో అగస్త్యునికి ఏమి సంబంధం చెప్పబడలేదు. తమిళంలో మొదటి సంగం కాలంలో అగస్త్యుడు వుండి అగ త్తియం అనే తమిళ వ్యాకరణ గ్రంథాన్ని రచించాడంటారు. మహేశ్వరుడు పాణినికి సంస్కృత వ్యాకరణం ప్రసాదించినట్లుగానే అగస్త్యునికి తమిళ వ్యాకరణం ప్రసాదించాడని ఐతిహ్యం. అగస్త్యునికి తమిళభాషా జనకుడని కీర్తి వుంది. అగస్త్యునివల్లనే తమిళదేశంలో కావేరీనది ప్రవహించిందని ఐతిహ్యం. మొత్తం మీద అగస్త్యుడు తమిళులకు ఆరాధ్యుడైనాడు. అగ త్తియం ఆధారంగానే తర్వాత తొల్కాప్పియం అనే వ్యాకరణం తమిళంలో వ్రాయబడింది. ఇప్పుడు లభ్యమయ్యే తమిళ సాహిత్యంలో తొల్కాప్పియం మొదటి గ్రంథం.

శాతవాహన, ఇక్ష్వాకురాజుల కాలంలో బౌద్ధమతం ఆంధ్రదేశంలో తీరాంధ్రంలో శ్రీకాకుళం నుంచి గుంటూరు వరకు, తెలంగాణాలో విస్త రంగాను వ్యాపించింది. ఈనాటికీ తవ్వకాల్లో బయట పడ్తున్న నిర్మాణాలు శిల్పాలనుబట్టి బౌద్ధమతం చాల విస్తారంగా ఆంధ్రదేశంలో వ్యాపించిందని చెప్పవచ్చును. బౌద్ధం సామాన్య ప్రజల మీద తన ప్రభావాన్ని చూపిందన్న

విషయం కాలగర్భంలో ఇన్నాళ్ళు మరుగున పడిపోయింది. తర్వాత వచ్చిన శైవవైష్ణవ పౌరాణికమతం వెల్లువలో బౌద్ధజైనమతాల ప్రభావాన్ని ఇన్నాళ్ళు ఎవరు అంచనా కట్టలేక పోయారు. ఇప్పుడు తవ్వకాల్లో బయటపడ్తున్న అవశేషాలు బౌద్ధ జైనమతాల వ్యాప్తిని విస్తృతిని తెలియజెప్పుతున్నాయి. శ్రీకాకుళం జిల్లాలోని శాలిహుండం, విశాఖపట్నం జిల్లాలోని రామతీర్థం, శంకరం, బావికొండ, తొట్లకొండ, పశ్చిమగోదావరి జిల్లాలోని గుంటుపల్లి తూర్పుగోదావరి జిల్లాలోని ఆదుర్రు, గుంటూరు జిల్లాలోని అమరావతి, గోలి, మంచికల్లు, రెంటాల, నాగార్జునకొండ, ప్రకాశం జిల్లాలోని చంద్రవరం, కృష్ణాజిల్లాలోని జగ్గయ్యపేట, బట్టిప్రోలు, ఘంటసాల, గుడివాడ, ఖమ్మంజిల్లాలోని నేలకొండపల్లి కరీంనగర్ జిల్లాలోని ధూళికట్ట నల్లగొండ జిల్లాలోని ఫణిగిరి, తిరుమలగిరి, గాజులబండ మెదక్ జిల్లాలోని కొండాపూరు మొదలయిన ఎన్నో చోట్ల బౌద్ధక్షేత్రాలు తవ్వకాల్లో బయటపడ్డాయి. వాటిల్లో అమరావతి, గుంటుపల్లి, నేలకొండపల్లిలోనివి మహాస్తూపాలు .- అంటే - బుద్ధుని అవశేషాల మీద నిర్మింపబడిన పవిత్రమైన స్తూపాలు. ఆకారంలో పెద్దవి కూడా. భవిష్యత్తులో ఇంకా ఎన్ని చోట్ల బౌద్ధావశేషాలు బయటపడ్తాయో చెప్పలేము. అవన్నీ కూడా ప్రాచీనమైన క్షేత్రాలు. క్రీ.పూ. 1,2 శ.ల - క్రీ.శ. 2,3 శ.ల మధ్యకాలం నాటివి. బౌద్ధ క్షేత్రాలుగా వెలసిన అమరావతి (అప్పుడు ధాన్యకటకం) గుంటుపల్లి ఘంటసాల మొదలయినవెన్నో పట్టణాలుగా వ్యాపార కేంద్రాలుగా వుండేయి.

ప్రాచీనకాలంలో బౌద్ధయాత్రికులు ఉత్తర భారతం మధ్యభారతం నుంచి బయలుదేరి వార్ధా ప్రాణహితి గోదావరి నదులను దాటి కరీంనగర్ జిల్లాలోని కోటిలింగాల చేరుకొని అక్కడి నుంచి ఫణిగిరి గాజులబండ తిరుమలగిరి క్షేత్రాల మీదుగా నాగార్జునకొండ అమరావతిని చేరేవాళ్ళని క్రీ.శ. 6వ శ.లో చైనాయాత్రికుడు 'హ్యూయన్ త్సాంగ్' ప్రయాణం చేసిన మార్గం అదేనని తెలుస్తున్నది. ఆ దారి ప్రాచీనకాలం నుంచి వ్యాపార రహదారిగా

కూడా ఉపయోగపడేది. ఈ దారి నుంచే ఉత్తర భారతం నుంచి ఎన్నో జాతులు రాజవంశాలు ఆంధ్రదేశానికి వచ్చి స్థిరపడినాయి.

క్రీ.శ. 11,12 శతాబ్దాల్లో జైనబౌద్ధాలు క్రమంగా ఆంధ్రదేశంలో క్షీణించి వీరశైవం విజృంభణతో పూర్తిగా నశించాయి. జైనమతం కర్ణాటకలో కొంతవరకు ఇప్పటికీ వుంది. కాని బౌద్ధం పూర్తిగా నశించింది. బౌద్ధం ఎక్కువగా తమిళదేశంలో, జైనం ఎక్కువగా కర్ణాటకలో వ్యాపించివుండేయి. తమిళదేశంలో జైనం కూడా కొంత వ్యాప్తిలో వుంది. తిరువళ్ళువరు వంటివాళ్ళు జైనులే. తిరువళ్ళువరు వ్రాసిన తిరుక్కురళ్ అతి ప్రసిద్ధమైన గ్రంథం. అది తమిళుల పంచమవేదంగా పరిగణింపబడుతున్నది. తమిళ పంచ మహాకావ్యాల్లో ఒకటైన జీవకచింతామణి జైన సిద్ధాంతబోధనతో కూడిన కావ్యం. ఇది క్రీ.శ. 5వ శ. నాటిదంటారు. దాన్ని తిరుత్తక్కదేవర్ అనే జైనకవి రచించాడు. తమిళ భాష జైనబౌద్ధుల విశేషకృషి వల్లనే సంస్కృత పదజాలం చేరి సాహిత్య భాషగా రూపొందిందని అంటారు. తమిళ భాషమీద సాహిత్యం మీద సంస్కృతభాషా సాహిత్యాల ప్రభావం తక్కువగా అంచనా వేస్తాము. కాని సంస్కృత పదజాలం చాలా తమిళంలోను వుంది. భేదం ఏమిటంటె సంస్కృత పదాలు తమిళ భాషాధ్వనులకనుగుణంగా మారి ఆ భాషలో చేరిపోయి కొట్టవచ్చినట్లుగా కన్పించడం లేదు. ఉదా.కు కోవలన్ అన్న పేరు "గోపాల" అనే సంస్కృత పేరుకు వికృతి అని ఆలోచించి గమనించేంతవరకు మనం గుర్తించలేము. అట్లా సంస్కృత పదాలెన్నో తమిళభాషలో ఒదిగిపోయి వున్నాయి. అదే తెలుగు కన్నడ మలయాళభాషలో సంస్కృతపదాలు సంస్కృతభాషా ధ్వనులు ఉచ్చారణలతో కన్పిస్తాయి. తమిళంలో మొదటి వ్యాకరణ గ్రంథం "తొల్కాప్పియం" సంస్కృత వ్యాకరణమర్యాద ననుసరించి వ్రాయబ డిందంటారు. వ్యాకరణం అలంకారశాస్త్రలక్షణాల్లో పారిభాషిక పదజాలం తమిళంలో కొంత దేశీయతతో వున్నా ఎక్కువగా చాలా మట్టుకు సంస్కృత

పదజాలం లక్షణాల మర్యాదననుసరించి కుడా వున్నాయి. అదే తెలుగులో చాలా మట్టుకు సంస్కృత పారిభాషికపదాలే తీసుకొనబడినాయి.

తమిళసాహిత్యంలో కావ్యాలు శిలప్పదిగారం మణిమేకలై క్రీ.శ. 2-4 శ.లో వ్రాయబడినాయి ఆ కావ్యాలను ఇలంగో, శాత్తనారు అనే బౌద్ధక వులు రచించారు. ఇతివృత్తం సంస్కృత పురాణాదులనుంచి తీసుకున్నది కాదు. ఇతివృత్తం తమిళదేశానికి సంబంధించింది. అక్కడ జరిగిన సత్య సంఘటనలతో ఆ కావ్యాల ఇతివృత్తం కూర్చబడింది. అట్లా ప్రాచీన కాలం నుంచి తమిళకవులు వస్తు విషయంలో పూర్తిగా దేశీయతను అనుసరించారు. అదే కన్నడ తెలుగు కవులు సంస్కృత సాహిత్యం నుంచి వస్తువును తీసుకొని రచించారు. తెలుగులో ఎక్కువగా క్రీ.శ. 15,16 శ.ల వరకు సంస్కృతానువాదాలే వచ్చాయి. కన్నడం సాహిత్యంలో జైనుల కృషి ఎక్కువగా కన్పిస్తుంది. కన్నడం మొదటి కృతి ఒడ్డారాధన జైనుల రచన. పంపపొన్నరన్న కవులు జైనులు వాళ్ళు జైన పురాణాలను రచించారు. తమిళంలో జైన బౌద్ధకవుల రచనలుండగా కన్నడంలో జైన కవుల రచనలు ఎక్కువగా కన్పిస్తున్నాయి. తమిళదేశంలో క్రీ.శ. 7-10 శ.ల మధ్య కాలంలో భక్తి ఉద్యమాలు లేచాయి. నాయనార్లు ఆళ్వార్లు అనబడే శివభక్తుల విష్ణుభక్తుల రచనలతో జైన బౌద్ధమతాల ప్రభావం పూర్తిగా నశించింది. అదే విధంగా కన్నడ దేశంలో క్రీ.శ 12 వ శ.లో వీరశైవ భక్తి ఉద్యమం లేచింది. వీరశైవకవుల రచనలతో జైనం అణగారి పోయింది. సాహిత్యం తీసుకుంటె తమిళంలో జైనబౌద్ధయుగం తర్వాత శైవ వైష్ణవ భక్తియుగం కన్నడంలో జైనయుగం తర్వాత బసవన యుగం అంటె వీరశైవయుగం వచ్చాయి. బౌద్ధం స్థానాన్ని వైష్ణవం, జైనం స్థానాన్ని శైవం తీసుకున్నాయి. వైష్ణవంలోని విష్ణువు బుద్ధునికి దగ్గరగా వుంటాడు. బుద్ధుని అనేక జన్మల కథలననుసరించి వైష్ణవంలో విష్ణు అవతారకథలు పుట్టాయి. బౌద్ధంలోని బుద్ధుని మీది భక్తి ప్రేమగౌరవాలే విష్ణు, నారాయణ

భక్తిగా ప్రేమగా వైష్ణవంలో ఏర్పడినాయి. జైనంలోని వృషభదేవునికి శివుడు దగ్గరగా కనిపిస్తాడు. జైనంలోని తపస్సు యోగసాధనలు భక్తి పూజలు శైవానికి దగ్గరగా వుంటాయి. అందుకే రాజులు కూడా బౌద్ధాన్నభిమానించే వాళ్ళు వైష్ణవాన్ని, జైనాన్ని అభిమానించేవాళ్ళు శైవాన్ని అంగీకరించే వాళ్ళు.

తమిళంలో కన్నడంలో జైనబౌద్ధకవుల రచనలు ఆ సాహిత్యాలను సుసంపన్నం చేయగా, జైనబౌద్ధకవుల పేరు మీదుగా సాహిత్య యుగా లుండగా తెలుగు సాహిత్యంలో జైనుల బౌద్ధుల రచనలేవీ లభించడం లేదు. జైన బౌద్ధమతాలు విశేషంగా ఆంధ్రదేశంలో వ్యాపించివుండేయి కాబట్టి తమిళకన్నడంలో లాగా తెలుగులోనూ జైనులు బౌద్ధులు రచనలు చేసి వుంటారు. ఆ గ్రంథాలను గురించి కొంతవరకు "ప్రబంధ రత్నావళి" వంటి ప్రాచీన సంకలన గ్రంథాలవల్ల తెలుస్తున్నది. కాని వాళ్ళ గ్రంథాలు ఏ కారణం చేతనో నిశేష ప్రచారం గౌరవం లేకుండా కాలదోషం పట్టి నశించాయి. వీరశైవకవుల రచనలకూ అదే పరిస్థితి ఏర్పడింది. కాని ఆధునికకాలంలో పండిత పరిశోధకుల పరిశ్రమతో అవి ఉద్ధరింపబడి సాహిత్య చరిత్రలో స్థానాన్ని సంపాదించుకున్నాయి. కాని నన్నయకు పూర్వమున్న రచనలు దొరకక వాటి విలువ ఇదమిత్థమని తేల్చడానికి వీల్లేకుండా వుంది. తెలుగు సాహిత్య చరిత్ర నన్నయతోనే ఆరంభమౌతున్నది.

*　　*　　*

# 3. నన్నయ యుగం

తూర్పుచాళుక్యులు త్రిఆంధ్రంలో క్రీ.శ. 624లో రాజ్యస్థాపన చేసిన ప్పటి నుంచి దక్షిణదేశాధిపత్యం కోసం వాళ్ళతో రాష్ట్రకూటులు, పశ్చిమ చాళుకులు పల్లవులు - పల్లవుల వినాశం తర్వాత చోళులు యుద్ధాలు చేస్తూనే వున్నారు. ఈ యుద్ధాల్లో వేములవాడ చాళుక్యులు రాష్ట్రకూటుల పక్షం చేరగా ముదిగొండ చాళుక్యులు తూర్పు చాళుక్యుల పక్షం చేరి పోరాడారు. తూర్పు చాళుక్య రాకుమారులు కూడా రాజ్యాధికారం కోసం పరస్పరం పోట్లాడుకుంటూ పశ్చిమచాళుక్యుల రాష్ట్రకూటుల కళింగుల చివరకు చోళుల సహాయం అర్థిస్తూ వాళ్ళ పంచన చేరుతూ యుద్ధాలు చేసారు. గుణగ విజయాదిత్యుని (క్రీ.శ. 892-921) తర్వాత అతనికి సంతతి లేకపోవడంతో అతని తమ్ముని కొడుకు మొదటి చాళుక్య భీముడు రాజయ్యాడు. కాని అతన్ని రాజుగా ఒప్పుకోని దాయాదులు అతని మీదకు రాష్ట్రకూట ఇమ్మడి కృష్ణరాజు సహాయంతో దండెత్తి రాగా ముదిగొండ చాళుక్యారాజు కుసుమాయుధుని సహాయంతో పోరాడి మొదటి భీముడు విజయాన్ని సాధించాడు. ఆ విషయమే కొరవిశాసనంలో వుంది. చాళుక్య భీముని (క్రీ.శ 892-921) తర్వాత క్రీ.శ. 921-945 మధ్య కాలంలో విజయాదిత్యుడు, మొదటి అమ్మరాజు, రెండవ యుద్ధ మల్లుడు, రెండవ చాళుక్య భీముడు (క్రీ.శ. 934-945) పాలించారు. రెండవ యుద్ధమల్లు నికి రాజమహేంద్ర అని బిరుదముంది. రాజమహేంద్రవర పట్టణాన్ని అతడే

నిర్మించి వేంగి నగరం సురక్షితంకాదని రాజధానిని అక్కడికి మార్చాడని అంటారు.

రెండవ చాళుక్య భీముని తర్వాత అతని రెండవ కొడుకు అమ్మరాజ విజయాదిత్యుడు క్రీ.శ. 945-970 మధ్య పాలించాడు. రాష్ట్రకూట ముమ్మడి కృష్ణుని సహాయంతో అమ్మరాజు సవతి అన్న దానార్ణవుడు క్రీ.శ. 970 లో రాజయ్యాడు. మూడు సంవత్సరాలే పాలించాడు. అమ్మరాజు భార్య తెలుగుచోడరాజు జటాచోడ భీముని చెల్లెలంటారు. దానార్ణవుడు అమ్మరాజును చంపడం సహించక జటాచోడుడు వేంగిపైకి దండెత్తివచ్చి దానార్ణవుని చంపి అతని కొడుకులు శక్తివర్మ విమలాదిత్యులను పారదోలి వేంగిని ఆక్రమించి క్రీ.శ. 972-999 వరకు పాలించాడు.

శక్తివర్మ విమలాదిత్యులు తంజావూరు చోళరాజు ప్రసిద్ధవీరుడైన రాజ రాజచోళుని ఆశ్రయించి 27 సంవత్సరాలు అక్కడే నివసించారు. అంత సుదీర్ఘకాలం తల్లితోపాటు వాళ్ళు తంజావూరు సమీపంలోని తిరువాయూరులో నివసించారని వాళ్ళక్కడ వేయించిన శాసనాలను బట్టి తెలుస్తున్నది. అక్కడ రాజకీయాలకు దూరంగా వుంటూ సోదరులు పెరిగి పెద్దవాళ్ళయివుం టారు. రాజరాజచోళుడు తన దక్షిణ దిగ్విజయయాత్రల్లో మునిగివుండడం వల్లనేమో వేంగిపైకి దండెత్తడం ఆలస్యమైంది. వాళ్ళక్కడే తలదాచుకొని వుండిపోవాల్సి వచ్చింది. విమలాదిత్యుడు రాజరాజు కూతురు కుందవ్వను వివాహమాడాడు. రాజ రాజు సైన్యసహాయంతో శక్తివర్మ జటాచోడుని చంపి వేంగికి రాజై క్రీ.శ. 999-1011 మధ్య పాలించాడు. వేంగి పూర్తిగా చోళుల చెప్పుచేతుల్లోకి వెళ్ళి పోయింది. రాజకీయంగా సాంస్కృతికంగా సాహిత్యంగా చోళుల ప్రభావం వేంగి మీద చాలా పడింది. కళ్యాణి చాళుక్య దండయాత్రలు మాత్రం ఆగిపోలేదు. చోళ సైన్యసహాయంతో శక్తివర్మ వాళ్ళ నరికట్టాడు. శక్తివర్మ తర్వాత విమలాదిత్యుడు (క్రీ.శ.

1011-1018) రాజయ్యాడు. అతని కాలంలోను కళ్యాణి చాళుక్యుల దండ యాత్రలు జరిగాయి. మామ రాజరాజు సైన్యసహాయంతో విమలాదిత్యుడు కళ్యాణి చాళుక్యులను పారదోలాడు. విమలాదిత్యుడు రాజరాజు కూతురునే కాక మేళవ అనే ఆమెను వివాహమాడాడు. మేళవ జటాచోడ భీముని కూతురని అందుకే ఆమె కొడుకు విజయాదిత్యుడు వేంగి సింహాసనమెక్కే హక్కు తనకేవుందని కుందవ్వ కొడుకు రాజరాజనరేంద్రునితో నిరంతరం పోరాటం సాగించాడని చారిత్రకుల అభిప్రాయం.

విమలాదిత్యుని తర్వాత అతని పెద్దకొడుకు చోళరాజకన్య కుందవ్వ కొడుకు రాజరాజనరేంద్రుడు క్రీ.శ. 1019 లో రాజయ్యాడు కాని క్రీ.శ. 1022లో పట్టాభిషేకం చేసుకున్నాడు. రాజరాజ నరేంద్రుడు రాజు కాగానే పశ్చిమచాళుక్యరాజు రెండవ జయసింహుని సహాయంలో రాజరాజు సవతి తమ్ముడు విజయాదిత్యుడు వేంగినాక్రమించుకున్నాడు. రాజరాజు తన మేనమామ రాజేంద్రచోళుని సహాయంతో వేంగిని వశపరచుకొని క్రీ.శ. 1022 లో పట్టాభిషేకం చేసుకున్నాడు. రాజేంద్రచోళుని కూతురు అమ్మంగదేవిని రాజరాజనరేంద్రుడు పెళ్ళిచేసుకున్నాడు. రాజరాజ నరేంద్రుడు దాదాపు 40 సంవత్సరాలు వేంగిని పాలించాడు. ఆ 40 సంవత్సరాలు అస్థిరతతో కూడుకొనే వుంది. ఒకటి రెండుసార్లు సింహాసనభ్రష్టుడైనాడు. మేనమామ రాజేంద్ర చోళుని అండదండలతో తిరిగి సింహాసనస్థుడయ్యాడు. క్రీ.శ. 1031 లో మరోసారి వేంగినాక్రమించుకొని విజయాదిత్యుడు విష్ణువర్ధన బిరుదంతో రాజయ్యాడు. అతడు వీరుడు. పరిపాలనాదక్షుడు. కళ్యాణి చాళుక్యరాజు రెండవ జయసింహుని సహాయంతో అతడు వేంగిని సంపాదించివుంటాడు. తిరిగి చాళుక్య చోళులకు కలిదిండి అనే చోట ఘోరయుద్ధం జరిగింది. చోళసైన్యం చాలా నష్టపోయింది. అయినా విజయం వాళ్ళదే అయింది. క్రీ.శ. 1035 లో రాజరాజు వేంగికి తిరిగి రాజయ్యాడు. క్రీ.శ. 1042 లో రెండవ జయసింహుడు, క్రీ.శ. 1044

లో రాజేంద్ర చోళుడు మరణించారు. కళ్యాణిలో మొదటి సోమేశ్వరుడు రాజయ్యాడు. రాజాధిరాజు చోళచక్రవర్తి అయ్యాడు. తిరిగి వాళ్ళిద్దరి మధ్య యుద్ధాలు చెలరేగాయి. ఆ యుద్ధాల్లో కళ్యాణి చాళుక్యులది పై చేయి అయింది. మొదటి సోమేశ్వరుడు క్రీ.శ. 1047 లో వేంగిని జయించాడు. వేంగీపురవరేశ్వరున్నని చెప్పుకున్నాడు. రాజాధిరాజ చోళుడు వేంగిని తిరిగి జయించాలని ప్రయత్నాలు చేసాడు. క్రీ.శ. 1051లో రాజరాజు నరేంద్రుడు చోళరాజ్యంలో తిరువాయూరులో వున్నట్లు దానశాసనం వల్ల తెలుస్తున్నది. క్రీ.శ. 1051లో రాజాధిరాజు వేంగిని జయించాలని సైన్యంతో వచ్చి దన్నడ (ధాన్యకటకం)లో విడిసాడు. అక్కడే ఆయనకు పరణికావ్యం అంకితంగా ఇయ్యబడింది. పరణి అంటె తమిళంలో 1000 ఏనుగులను యుద్ధంలో చంపినవాడని అర్థం. ఆ వీరుడు రాజాధిరాజుగా పరణి ముక్తక పద్యాల్లో వర్ణింపబడినాడు. క్రీ.శ. 1051 లో జరిగిన చోళచాళుక్య యుద్ధంలో చోళులు వేంగిని జయించలేక పోయారు. తిరిగి క్రీ.శ. 1054లో కొప్పం అనేచోట చాళుక్యులకు చోళులకు పెద్ద యుద్ధం జరిగింది. చోళులు కొలనుపాకను స్వాధీనం చేసుకొని ధ్వంసం చేసారు. అయినా విజయం వాళ్ళను వరించలేదు. చాళుక్యులు కొలనుపాకను తిరిగి జయించారు. కళ్యాణి చాళుక్యులది మళ్ళీ పై చేయి అయింది. చోళ సైన్యం వేంగిని జయించడంలో విఫలమైంది చూసి రాజరాజు మొదటి సోమేశ్వరునితో సంధిచేసుకున్నాడు. చాళుక్యుల అధికారాన్ని రాజరాజు అంగీకరించాడు. ఆ సంధిజరగడంలో సంధివిగ్రహుడు పాత్రుడు అయిన రాజురాజు కులబ్రాహ్మణుడు నన్నయ భట్టు ప్రయత్నం వుండి వుండవచ్చును. సోమేశ్వరుని రాజప్రతినిధిగా వచ్చిన నారాయణ భట్టు నన్నయ సహాధ్యాయుడు ఆ పరిచయంతో ఆ సంధి సఫలమై వుంటుంది. సంధి ఫలించిన సందర్భం గానే రాజరాజు నందంపూడి అగ్రహారాన్ని నారాయణభట్టుకు దానమిచ్చి వుంటాడు. ఆ దానశాసనం సంస్కృతంలో వుంది. దాన్ని నన్నయభట్టు

స్వయంగా రచించాడు. రాజరాజు సమస్త భువనాశ్రయ సత్యాశ్రయకులశేఖర అనే కళ్యాణి చాళుక్యుల బిరుదాలను ధరించాడు. క్రీ.శ. 1062 వరకు అంటె చివరి వరకు రాజరాజు కళ్యాణి చాళుక్యులకు విశ్వసనీయుడుగా వుంటూ ప్రశాంతతో పరిపాలించాడు. మొత్తం దాదాపు 40 సంవత్సరాల పాలనలో అతడు ప్రశాంతంగా వున్నదీ అల్ప కాలంలోనే అప్పుడే అంటె క్రీ.శ. 1056-62 మధ్యకాలంలోనే రాజరాజు ప్రోత్సాహంతో నన్నయ మహాభారత రచన చేసి వుంటాడు. ఆ రచనకు నారాయణ భట్టు సహాయం కూడా చాలా వుందని నన్నయ పీఠికలో వ్రాసిన ఈ కింది పద్యం వల్ల తెలుస్తున్నది.

పాయక పాకశాసనికి భారత ఘోర రణంబునందు నా
రాయణునట్లు వాసిగ ధరామర వంశ విభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయధురంధురుడుం దన కిష్టుడున్ సహా
ధ్యాయుడునైనవాడభిమత స్థితిఁదోడయి నిర్వహింపగాన్ (1-25)

రాజరాజనరేంద్రుని తండ్రి విమలాదిత్యుడు మొదట శైవుడు. వృద్ధాప్యంలో అతడు జైన ధర్మాన్ని స్వీకరించాడు. అతని జైనగురువు దేశిగణాచార్యుడైన త్రికాలయోగి సిద్ధాంతదేవుడు. ఆ యోగి కతడు విశాఖ పట్నం సమీపంలో రామతీర్థంలో రామకొండ అనే గుహాలయాన్ని నిర్మించి ఇచ్చాడు. విమలాదిత్యుడు తన యవ్వనదశలో దాదాపు 27 సంవత్సరాలు చోళరాజరాజు ఆశ్రయంలో వున్నాడు. అతని కూతురును పెళ్ళిచేసుకున్నాడు. అక్కడతనికి శైవమంటె అభిమానమేర్పడి వుంటుంది. కాని విమలాదిత్యుడు వృద్ధాప్యంలో జైనమతాన్ని స్వీకరించడానికి గల కారణం తెలియదు. క్రీ.శ. 11వ శతాబ్దంలో ఆంధ్రదేశంలో జైనం ఇంకా వ్యాప్తిలోవున్నదని మాత్రం దానివల్ల తెలుస్తున్నది. అదే కాలంలో ఆంధ్రదేశంలో కాకతీయులు జైనాన్ని అభిమానించారు. తెలంగాణాలో కొలనుపాక జైన కేంద్రంగా వుండింది. పశ్చిమ చాళుక్యుల రాజకీయ కేంద్రంగావున్న

కొలనుపాకను చోళరాజు ధ్వంసం చేసాడు. క్రీ.శ. 11 వ శతాబ్దంలో బౌద్ధం కూడా కొంతవరకు వ్యాప్తిలో వుంది. వైదిక మతం అంటె వైదిక కర్మకాండలను రాజులు ఆదరించలేదు. దానికి కారణం - వైదిక కర్మకాండలు క్షీణించి పౌరాణికమతం బ్రాహ్మణాభిమానం వ్యాపించింది. అంతకుముందు ప్రజలు జీవనభృతికోసం ఆచరించిన వృత్తులు పనులు వంశాచారంగా ఏర్పడి కులవ్యవస్థ ఏర్పడింది. దాన్ని కాపాడడం రాజుల ధర్మమైంది. అందుకే నన్నయ రాజరాజును "సమస్త వర్ణాశ్రమ ధర్మ రక్షణ మహామహిమన్ మహినొప్పు" అని "మనుమార్గు"డని వర్ణించాడు. వేంగీ చాళుక్యుల్లో చాలామంది శైవులే. బౌద్ధుల పంచారామాలు శైవ క్షేత్రాలుగా మారాయి. శంకరాచార్యుల (క్రీ.శ 8వ శ.) అద్వైతం ఆంధ్రదేశంలో ఇంకా ప్రవేశించలేదు. క్రీ.శ. 9 శతాబ్దం నుంచి ద్రాక్షారామ భీమేశ్వరం కేంద్రంగా శివభక్తి సంప్రదాయం ప్రారంభమై క్రీ.శ. 11 వ శతాబ్దంలో బలపడ్తున్నది. 12వ శతాబ్దంలో వీరమాహేశ్వరంగా - వీరశైవంగా రూపొంది రాజకీయాలను సమాజాన్ని సాహిత్యాన్ని ప్రభావితం చేసింది.

తూర్పు చాళుక్యులు 4,5 శతాబ్దాలు ఆంధ్రదేశాన్ని పాలించినా ప్రసిద్ధమైన రచనలేవి సంస్కృతంలో గాని తెలుగులో గాని రాలేదు. వాళ్ళ పరిపాలన అంతమౌతుండగా రాజరాజనరేంద్రుని ఆస్థానంలోని కవి నన్నయ తెలుగులో ఆదికావ్య రచన చేసాడు. అదే తూర్పు చాళుక్యుల కీర్తిసంభంగా నిలిచింది. కుబ్జవిష్ణువర్ధనుని ఆస్థానంలో ప్రసిద్ధ సంస్కృత కవి భారవి వున్నాడని అంటారు. మూడవ విష్ణువర్ధనుడు కవిపండిత కామధేనువని కవిగాయక కల్పతరువని బిరుదం ధరించాడు. రెండవ విజయాదిత్యుడు కూడా కవిగాయకుల నాదరించాడు. మొదటి చాళుక్య భీముని ఆస్థానంలో శాసనకర్త పండితకవి వామనుడున్నాడు. ప్రసిద్ధ ఆలంకారికుడు రీతి సిద్ధాంతవాది వామనుడు అతడే అని చారిత్రకుల అభిప్రాయం. భీముని ఆస్థానంలో చెల్లవ్వ అనే ప్రసిద్ధగాయని అపర తుంబురు డనిపించుకున్న ఆమె తండ్రి

మల్లప్ప వున్నారు. అమ్మరాజు కూడా కవిపండితులనాదరించాడట. తర్వాత కాకతీయుల విజయనగరరాజుల రెడ్డి వెలమరాజుల కాలంలో సంస్కృతసాహిత్యం కావ్యనాటక వ్యాఖ్యానరచనలతో వికసించినంతగా వేంగిచాళుక్యుల కాలంలో వికసించినట్లు దాఖలాల్లేవు. నన్నెచోడుడు చాళుక్యరాజులు "ఆంధ్ర విషయంబున తెనుగును నిలి" పారని కీర్తించాడు. కాని వాళ్ళు దేశకవితను నిలిపే కృషి ఏం చేసారో ఇప్పుడందకుండా వుంది. రాజరాజ నరేంద్రుని ఆస్థానంలో మాత్రం నన్నయ, గణితశాస్త్రం వ్రాసిన పావులూరి మల్లన వున్నారు. నన్నయ ఆనాడు విద్వజ్జనసభలుండేవని చెప్పాడు. కాని ఆ సభలు ఏం చేసేవో తెలియదు.

రాజరాజనరేంద్రుని తల్లి భార్యలు పుట్టింది చోళవంశంలో. అతడు చాలాకాలం తాతమామల ఇంట్లో నివసించాడు. వాళ్ళ ప్రభావంతోను వంశంలో వున్న శివాభిమానంతోను రాజరాజనరేంద్రుడు శివాభిమాని అయినాడు. బ్రాహ్మణభక్తి కూడా అతనికి చాలా వుంది. చోళుల సాహిత్య ప్రీతి కూడా అతనికి అలవడింది. దాంతో అతడు తన ఆస్థానంలో వున్న నన్నయను మహాభారత రచనకు ప్రేరేపించాడు. తనకీలోకంలో ఐదు ఇష్టమైన పనులున్నాయని చెప్పాడు - బ్రాహ్మణ ప్రీతి, భారత శ్రవణాసక్తి, శివధ్యానపూజామహోత్సవం, సంతత దానశీలత, సాధుసాంగత్యం (1-12). అంతేగాక భారతం తన పూర్వజులైన చంద్రవంశజులైన పాండవోత్తముల చరిత్ర. దాంతో భారత శ్రవణం అతనికి అభీష్టమైంది. భారత శ్రవణాన్ని పుణ్యకార్యంగా భావించి దానియందే చిత్తాన్ని లగ్నం చేసినవాడు రాజరాజు-

అమల సువర్ణ శృంగఖురమైన కపిలంబగు గోశతంబు ను
త్తమ బహువేదవిప్రులకు దానము సేసిన తత్ఫలంబు త
థ్యమ సమకూరు భారతకథాశ్రవణాభిరతిన్ మదీయ చి
త్తము ననిశంబు భారత కథాశ్రవణ ప్రవణంబు కావునన్ (1-15)

రాజరాజు భారతాన్ని ఒక్క భాషలో కాదు అనేక భాషల్లో అనేక ప్రక్రియల్లో చదివాడు విన్నాడు చూచాడు. "బహుభాషల బహువిధముల, బహుజనముల వలన వినుచు భారత బద్ధ, స్పృహులగు వారికెప్పుడు, బహుయాగంబుల ఫలంబు పరమార్థమగున్" - అని విశ్వసించాడు రాజరాజు.

అతనికి చాలా ఇష్టమైంది కాబట్టి భారతాన్ని తెలుగులో రచించమని రాజరాజు నన్నయను కోరాడు. అప్పటికే మహాభారతం తమిళ కన్నడ భాషల్లో రచింపబడింది. భాస భట్టనారాయణాది కవులు సంస్కృతంలో అనేక నాటకాలు వ్రాసారు. ఆ నాటకాల్లో కవులు పాత్రచిత్రణకోసం నాటకకళ రసపోషణల కోసం వ్యాసుని కథలో మార్పులు చేర్పులు చేసారు. రాజరాజు సంస్కృతజ్ఞుడై సంస్కృతభాషలో వున్న మహాభారతాన్ని, నాటకాలను చదివి వుంటాడు. వినివుంటాడు. దర్శించి వుంటాడు. అతడు తమిళదేశంలో చాలాకాలం వున్నాడు. కాబట్టి తమిళం బాగా నేర్చుకొని వుంటాడు. తమిళంలో సంగయుగంలోనే పెరుందేవనార్ భారతాన్ని గేయరూపంలో రచించాడు. క్రీ.శ. 10వ శ.లో పంప, రన్న కవులు కన్నడంలో "విక్రమార్జున విజయం, సాహసభీమవిజయం" పేర్లతో భారతాన్ని ఏకనాయకాశ్రయంగా రచించారు. అయితే వ్యాసుని మహాభారతాన్ని వున్నదున్నట్లుగా అంటె మూలార్థం చెడకుండా తెలుగులో వ్రాయాలని రాజరాజు కోరిక -

"జననుతకృష్ణద్వైపా యన, ముని వృషభాభిహిత మహాభారత బద్ధ నిరూపితార్థమేర్పడ, తెనుగున రచియింపు మధిక ధీయుక్తి మెయిన్" వేదవిహితమైన సత్య ధర్మోపదేశాలు మహాభారతంలో వున్నాయి. ఇంకా సందర్భాన్ని బట్టి దయాదానాది కర్తవ్యబోధనలు వున్నాయి. అందుకే పంచమవేదంగా మహాభారతానికి ప్రసిద్ధి ఏర్పడింది. క్రమంగా దానిలో బ్రాహ్మణభక్తి ప్రబోధం వచ్చి చేరింది. "బ్రాహ్మణ ప్రాధాన్యాన్ని ప్రత్యేకతను

పేర్కొనే సందర్భాలు మూలభారతంలోనే ఎక్కువగా కనపిస్తాయి. కాని నన్నయ భారతంలో బ్రాహ్మణ ప్రసక్తి వచ్చిన ప్రతి సందర్భంలోను మూలం కంటె ఎక్కువగా పెంచి చెప్పిన ఉదాహరణలనేకం వున్నాయి" అంటారు రంగనాథాచార్యులుగారు. 'ధర్మం' అంటె Duty - కర్తవ్యం అన్న విస్తృతార్థం కోల్పోయి ధర్మమంటె వర్ణాశ్రమ ధర్మమన్న సంకుచితార్థం ఏర్పడింది. బౌద్ధ జైనమతంలో శ్రమణులకు శ్రావకులకున్న భక్తి గౌరవాలు పౌరాణికమతంలో బ్రాహ్మణ భక్తిగా సమాజంలో రూపొందింది. అందుకే జయేతిహాసమనబడే "వీరగాధ"లో బ్రాహ్మణ ప్రశంస ప్రసక్తులు కాలక్రమంగా ప్రక్షిప్తాలుగా వచ్చి చేరాయి. బ్రాహ్మణ క్షాత్ర ధర్మాలను ఒకే కుటుంబంలోని వ్యక్తులు తమ తమ ఇష్టాలను బట్టి ఎన్నుకునే సమాజంలో పుట్టింది మహాభారతం. సమాజంలో బ్రాహ్మణులు క్షత్రియులు వేరు వేరు కులాలుగా ఏర్పడిం తర్వాత జయేతిహాసంలో ఎన్నో మార్పులు చేర్పులు జరిగి వుంటాయి.

## నన్నయ

క్రీ.శ. 11 వ శతాబ్దంలో తెలుగులో మహాభారత రచనకు తగిన పరిస్థితులేర్పడినాయి. తెలుగులో కావ్యం వ్రాయదలచుకుంటె సంస్కృతంలో ఆదికావ్యంగా ప్రసిద్ధికెక్కిన రామాయణాన్ని అనువదించవచ్చును. కాని రామాయణంలో సత్యధర్మాల బోధనకన్నా కావ్యకళకు స్థానముంది. మహాభారతంలో ఆద్యంతం సత్యధర్మ బోధన జీవిత సత్యాల చిత్రణ మత సంబంధమైన దార్శనిక సిద్ధాంతాలు అనేక ముఖంగా వున్నాయి. కాబట్టి బౌద్ధజైన ధర్మాల ప్రభావం నశిస్తున్న ఆ కాలంలో మహాభారత రచన అవసరమైంది. దాన్ని గుర్తించిన నన్నయ మహాభారతానువాదానికి పూనుకున్నాడు. రాజరాజు నన్నయను మహాభారతానువాదం చేయుమని

అడిగినప్పుడు నిత్యసత్యవచనుడు వినయసంపన్నుడైన నన్నయ "భారత భారతీ సముద్రము తరియంగ నీదను విధాతృనకైనను నేర బోలునే" అన్నాడు. "నీ యనుమతంబున విద్యజ్జనంబుల యనుగ్రహంబునం జేసినా నేర్చు విధంబున నిక్కావ్యంబు రచియించె" దనన్నాడు. ఆ మాటలు అతని నిగర్వానికి మితభాషితకు తగినట్లుగా వున్నాయి. ఋషికల్పుడైన నన్నయ మహాభారతాంధ్రీకరణకు పూనుకోవడం ఆంధ్రావళి అదృష్టం ! ప్రాచీన భారతదేశంలో సత్యధర్మాలనే గొప్పవిగా భావించారు. మానవుని నిత్య జీవితంలోని ఆర్థిక సమస్యలను వ్యక్తుల మధ్య సంబంధాల్లో వున్న సమస్యలను వాళ్ళు శాశ్వతసమస్యలుగా భావించలేదు. అదీగాక అప్పుడు ఇంత జనాభాలేదు. ప్రకృతి సంపద చాలా వుంది. పళ్ళు ఫలాలకు కందమూలాలకు నీళ్ళకు కొరత లేదు. అవి ఎవరికైనా కావలసినంతగా దొరికేయి. వాటి మీద ఏ ప్రతిబంధకాలు లేవు అప్పుడు ఇంత వస్తుసంపదమీద ఐహికసుఖాల మీద వ్యామోహం లేదు. కాబట్టి కుల సంబంధాల్లో ఆర్థిక సంపాదనలో ఇప్పుడున్న క్లిష్టతలు లేవు. జనాభా తక్కువ కాబట్టి దోపిడీ దౌర్జన్యాలు తక్కువే. అందుకే ప్రాచీన ఋషులు కవులు సాహిత్యంలో సత్య ధర్మాచరణ బోధనలకే ప్రాధాన్య మిచ్చారు. కాని ఆర్థికార్జనకు ఉపాయాలను గాని ఆర్థిక సామాజిక సమస్యలను గురించిగాని చర్చించలేదు. సత్యధర్మాలు వ్యక్తుల శీలాన్ని నిర్మిస్తాయి. దాంతో ఇతర సమస్యలు తీరుతాయని వాళ్ళు విశ్వసించారు. అందుకే వ్యక్తుల చరిత్రలను వ్యక్తిత్వాలను నిర్మించడానికి తోడ్పడే రచనలు చేసారు. ఆత్మోన్నత్యాన్ని పెంచే సాహిత్యాన్ని సృష్టించారు. మహాభారతం ఆ విధంగా సత్యధర్మానుష్ఠానాలను బోధించే ఉత్తమ గ్రంథం. మహాభారతం వైదిక బోధనలను విప్పిచెప్పేది. పంచమవేదం మహాభారతం. కాబట్టి నన్నయ వ్యాస మహాభారతానువాదానికి పూనుకున్నాడు.

మహాభారతం సంస్కృతంలో చదివి తెలుగులో వ్యాఖ్యానం చెప్పడం

దేవాలయాదుల్లో పురాణపఠన రూపంలోను ప్రచారంలో వుండి వుంటుంది. అటువంటప్పుడు మూలమహాభారతాన్ని తెలుగులో వ్రాసి తెలుగు ప్రజలకు అందించాలనే కోరిక నన్నయకు కలిగివుంటుంది. అప్పటికి - క్రీ.శ. 10 వ శ. నాటికీ సంస్కృత సాహిత్య సృష్టిలో ఉత్కృష్టదశ అయిపోయింది. ప్రజాసామాన్యం ప్రాకృతభాషలు మాట్లాడేటప్పుడు సంస్కృతం ఒక ప్రామాణిక భాషగా అందరికీ అర్థమయ్యేది. కాని ప్రాకృత భాషలు కూడా మార్పు చెంది అపభ్రంశభాష లేర్పడి అవి ప్రజలు మాట్లాడుకునే భాషలయ్యాయి. అటువంటి తరుణంలో సంస్కృత భాష ఏ కొద్దిమందికో రచనాభాషగా అనుసంధాన భాషగా మిగిలిపోయింది. అప్పుడు దేశంలో చాల దేశభాషలు రచనాభాషలుగా అభివృద్ధి చెందాయి. ఆ దేశ భాషల్లోనే ప్రజలందరికీ అర్థమయ్యేటట్లుగా రచనలు చేయడం ప్రారంభమైంది. బౌద్ధులు, జైనులు ప్రజల భాషలను ప్రాకృతాలను తీసుకొని రచనలు చేసారు. ఆ తర్వాత బౌద్ధసిద్ధులు ప్రజల భాషలైన అపభ్రంశభాషల్లో పాటలు పదాలు వ్రాసారు. తమిళంలో కూడా సిద్ధుల రచనలున్నాయి. ఆ తర్వాత బౌద్ధజైనులు ప్రజాసామాన్యానికి తమ ధార్మికసిద్ధాంతాలను బోధించడానికి ప్రాంతీయ భాషలనభివృద్ధి పరచి ఆ భాషల్లో రచనలు చేసారు. తమిళ కన్నడంలో అదే జరిగింది. తెలుగులోను జరిగి వుంటుంది. కాని అవి మన వరకు మిగులలేదు. బౌద్ధజైన మతాల ప్రభావాన్ని మనవాళ్ళు అంతగా గుర్తించి నిలపకపోవడానికి ఆంధ్రదేశంలో వైదిక పౌరాణిక మతాలకున్న ప్రాధాన్యమే కారణమని చెప్పకోవాలి. అట్లా నన్నయ మహాభారతమే మనకు నిలిచి మిగిలింది. కన్నడంలో పంపనికి ముందు రచనలున్నా కవులున్నా కన్నడ సాహిత్యంలో పంపకవి ప్రశస్త కవిగా కీర్తిపొందాడు. అతడే ఆదికవిగా చెప్పబడ్తున్నాడు. అదే విధంగా నన్నయకు తెలుగుసాహిత్యంలో ఆదికవి అనే బిరుదం లభించింది.

నన్నయ సత్ప్రితిభాభియోగ్యుడు, కవివరుడు, సద్వినుతావదాత చరి

తుడు, సుజనుడు, నిత్య సత్యవచనుడు, అవిరళ జపహోమతత్పరుడు. నన్నయ నాటికి వైదిక యజ్ఞయాగాది కర్మల ఆచరణ విస్తృతంగా లేదు. అయినా కొందరు ఇంకా వైదిక కర్మలను ఆచరిస్తున్నారని తెలుస్తున్నది. నన్నయ రాజ రాజుకు కులబ్రాహ్మణుడు. అంటె ఇంద్రునికి బృహస్పతి లాగా ధార్మిక లౌకిక రాజకీయ విషయాల్లో తోడ్పడేవాడని అర్థంకావచ్చును. నన్నయ కవిగా కూడా గొప్పవాడని రాజరాజుకు తెలుసు. అందుకే "రసభావ భాసుర నవార్థ వచన రచనా విశారదులైన మహాకవులు" ఎందరో వుండగా మహాభారతాంధ్రీకరణను నన్నయనే చేయమని రాజరాజు అర్థించాడు.

## నన్నయ మహాభారతాంధ్రీకరణం

సంస్కృతంలో వ్యాసుడు రచించిన మహాభారతం పద్దెనిమిది పర్వాలు అనువదించాలనే నన్నయ ప్రణాళికను సిద్ధం చేసుకున్నాడు. అనువాదానికి విషయానుక్రమణికను ఏర్పరచుకొని కావ్యారంభంలో చేర్చాడు. కాని నన్నయ ఆది సభాపర్వాలను అరణ్య పర్వంలో నాల్గవ ఆశ్వాసంలోని శరత్కాల వర్ణనలోని "శారదరాత్రులుజ్జ్వల...." అనే పద్యం వరకు మాత్రమే వ్రాసాడు. నన్నయ మహాభారత రచన పూర్తికాకపోవడానికి రాజరాజు మరణం గాని రాజకీయ సామాజిక పరిస్థితులు అనుకూలంగా లేకపోవడంగాని కారణం కావచ్చును. లేదా నన్నయ మరణం కూడా కారణం కావచ్చును. నన్నయ అనువాదం చేసిన సంస్కృత మహాభారతం 12000 శ్లోకాల్లో వుండగా నన్నయ 4000 పద్యగద్యాల్లో రచించాడు. దాన్ని బట్టి అతని అనువాదం మక్కికి మక్కిగా జరుగలేదనే తెలుస్తున్నది.

సంస్కృత మహాభారతం మొదట జయేతిహాసం పేరుతో 25000 శ్లోకపరిమితంగా వుండి క్రమంగా లక్షకుపైగా శ్లోకాలతో పెరిగి బృహత్

గ్రంథమైంది. అట్లా పెరుగుతున్నప్పుడు కొత్త కథలు చేరడమేకాక ఆయా శ్రోతలడిగిన సందేహాలను తీర్చడం కోసం నీతి ధర్మోపదేశ ఘట్టాలు ఎన్నో చేరాయి. చెప్పిన వృత్తాంతాలు మళ్ళీ మళ్ళీ చెప్పబడినాయి. అటువంటి మహాభారతాన్ని నన్నయ కావ్యరూపంలో అనువాదం చేసాడు. ప్రధాన కథకు భంగం కలిగించే అంశాలను ఘట్టాలను నీరసమైన వర్ణనలను సుదీర్ఘసం భాషణలను నన్నయ పరిహరించాడు. ఔచితీ పూర్వకమైన వృత్తాంతాలను తీసుకున్నాడు. తెలుగు మహాభారతం మూలంకన్నా సంక్షిప్తంగా గందర గోళం లేకుండా ప్రసన్నకథా కథనంతో నడిచి కావ్యంగా రూపొందింది. ఒకొకసారి నన్నయ మూలంలో లేని వర్ణనలను సందర్భోచితం కావ్యరీతికి అవసరమనుకున్న చోట అదనంగా చేర్చాడు కూడా. ఉదాహరణకు పాండురాజు మరణానికి పూర్వం మాద్రితో విహరించిన వసంతోద్యాన వర్ణనలను నన్నయ రెండు లయగ్రాహి పద్యాల్లో మనోహరంగా రచించాడు. కొన్ని చోట్ల నన్నయ మూలంలో అలంకారాలను విడచిపెట్టినా మరికొన్ని చోట్ల మూలంలో లేని అలంకారాన్ని చేర్చాడు. ఉదాహరణకు.

విగతజీవుడై పడియున్న వేదమూర్తి
యతని చేత సంజీవితుడై వెలింగె
దనుజ మంత్రి యుచ్చారణ దక్షుచేత
నభిహితంబగు శబ్దంబునట్ల పోలె [ఆది.ప. 3-127]

సంహితాభ్యాసుడైన నన్నయకు తగినట్లుగానే ఈ ఉపమానమున్నది.

మూలంలో పురాణమార్గంలో నీరసంగా చెప్పిన ఘట్టాలను ఎన్నోచోట్ల నన్నయ కావ్యసౌందర్యంతో రమ్యంగా రచించాడు. నన్నయ రచించిన మహాభారత పర్వాల్లో ఏకలవ్య కథ, కుమారాస్త్ర విద్యాప్రదర్శనం, శిశుపా లవధ శకుంతల కథ, నలదమయంతి కథ మొదలైనయి రసప్లావితంగా ఖండకావ్యాల వలె ఒప్పుతున్నాయి.

మూలంలో సుదీర్ఘంగా వున్న అవాంతర కథలను నన్నయ చాలకుదించి రచించాడు. ఉదాహరణకు వినతకద్రువుల కథలో వున్న సముద్ర మథన వృత్తాంతం 87 శ్లోకాల్లో వున్నదాన్ని నన్నయ 18 పద్యగద్యాల్లో వ్రాసాడు. వినతాకద్రువలు సముద్రతీరంలో విహరించేటప్పుడు సముద్రవర్ణన 16 శ్లోకాల్లో వున్నదాన్ని నన్నయ 1 వచనం 2 పద్యాల్లో వ్రాసి ఔచిత్యాన్ని పోషించాడు. ఇట్లా ఎన్నో వృత్తాంతాలను ఘట్టాలను నన్నయ అనవసరమనిపించిన వాటిని కుదించి, కొన్నిటిని విడిచిపెట్టి వ్రాసాడు.

నన్నయ తన కథాకథన చాతుర్యంతో సంభాషణలతో రసపోషణ చేసాడు. కుమారాస్త్ర విద్యాప్రదర్శన, శిశుపాలవధ ఘట్టాల్లో వీరరౌద్ర రసాలను నలదమయంతి కథలో కరుణరసాన్ని ఇంకా ఆయాచోట్ల శృంగారాది రసాలను పోషించి నన్నయ పాఠకుల హృదయాలను రసప్లావితం అయ్యేటట్లుగా రచించాడు. నన్నయ అనుసరించిన చంపూరచనా మార్గం అనువాద సరణి తర్వాత తిక్కన ఎర్రన కవులకు ఆదర్శమైనాయి.

## నన్నయ కవితా విశేషాలు

నన్నయ తన కవితాగుణాలను కావ్యవతారికలో ఒక పద్యంలో ఇట్లా చెప్పాడు.

సారమతింగవీంద్రులు ప్రసన్న కథాకలితార్థయుక్తిలో
నారసిమేలు నానితరు లక్షరరమ్యత నాదరింపనా
నారుచిరార్థసూక్తినిధి నన్నయ భట్టు తెనుంగునన్ మహా
భారత సంహితారచన బంధురుడయ్యె జగద్ధితంబగన్. (1-26)

నన్నయ తన కవిత్వంలో మూడు గుణాలున్నాయని చెప్పుకున్నాడు. 1. ప్రసన్న కథా కలితార్థయుక్తి 2. అక్షరరమ్యత 3. నానారుచిరార్థ సూక్తినిధిత్వం.

ప్రసన్న కథాకలిత = ప్రసన్నమైన కథతో కూడిన, అర్థయుక్తి = చమత్కార పూర్ణమైన మాటలు - కలిగి వుండటమే - ప్రసన్నకథా కలితార్థయుక్తికి అర్థం. ప్రసన్న అంటే చదువగానే సులభంగా వెంటనే అర్థమయ్యేది అని అర్థం. ప్రసన్న కథాకలితార్థయుక్తులను కావ్యాంతర్గత మైన వాటిని కవీంద్రులు అంటె కవితాకళను తెలిసినవారు - కావ్యకళా మర్మజ్ఞులు గ్రహించ గల్గుతారని నన్నయ భావం. ఇక ఇతరులు - అంటె కావ్యకళామర్మజ్ఞులు కాని వాళ్ళు సామాన్యులు అక్షర రమ్యతను తన కవిత్వంలో విని ఆదరిస్తారని నన్నయ భావం. అక్షరం అంటే పదాలు. రమ్యత - అంటె రామణీయకత. - పదాల కూర్పులోని సౌందర్యాన్ని - మాధుర్యాన్ని సామాన్యులు కూడా విని ఆనందిస్తారు - అని నన్నయ తన కవితావిశేషాన్ని చెప్పుకున్నాడు. మాలాకారుడు పూవులను ఏరి ఏరి మాలను కడ్తాడు. అదేవిధంగా కవి పదాలను కూరుస్తూ కవిత్వం వ్రాస్తాడు. ఈ కూర్పు కవికి నిరంతరాభ్యాసం వల్ల అప్రయత్నంగానే అలవడుతుంది. రమ్యమైన పదాల కూర్పువల్ల కవిత్వంలో మాధుర్యగుణం ప్రవేశిస్తుంది. నన్నయ పదాల కూర్పు, పద్యరచన ఒడిదుడుకులు లేకుండా ప్రసాద మాధుర్య గుణాలతో కూడి వుంటాయి. నన్నయ అక్షర రమ్యతలో పదమాధుర్యమేకాక చక్కని శయ్యా సౌభాగ్యం కూడా వుంది. పదాల అన్యోన్యమైత్రియే శయ్య. వ్యక్తికి నిమ్నోన్నతాలు లేని శయ్య (పడక) ఎట్లా సుఖానందప్రదమో కవిత్వంలో చక్కని పదమైత్రితో కూడిన శయ్యా పాఠకులకు సుఖానందప్రదంగా వుంటుంది. అన్యోన్యమైత్రి కలిగిన పదాలను ప్రయోగించి కవి రచించింతర్వాత వాటిల్లో ఏదైనా ఒక పదాన్ని తీసి మరో పదాన్ని వేస్తే పద్యగతిలో ఒడిదుడుకులు రావచ్చును. అర్థచమ త్కారంలో భేదం రావచ్చును. నన్నయ కవిత్వంలో అక్షర రమ్యతాగుణం వల్ల అతని కవిత్వం వినడానికి చదవడానికి మధురంగా వుండడమే కాక పద్యాలు ధారాళమైన నడకతో నడిచాయి. భావం సూటిగా రోజు

మనం మాట్లాడుకునేటట్లుగా వుండేదాన్ని భామహుడనే ఆలంకారికుడు 'వార్త' అని అన్నాడు. కవిత్వానికి వక్రోక్తి చాల ముఖ్యమంటాడతడు. వక్రోక్తి కోసం కవులు ప్రయత్నం చేయాలంటాడు. ఉదాహరణకు పట్టణంలో మేడలు ఎత్తుగా వున్నాయి - అని కవులందరు సూటిగా ఒక్కలాగా చెప్తే అందులో కొత్తదనమేమీ వుండదు. ఒక్కొక్క కవి ఒక్కొక్కసారి ఒక్కొక్క విధంగా మేడల ఎత్తును గురించి చెప్తాడు. అట్లా చెప్పే కవి మాటల్లోని చమత్కారం, వైచిత్రి, వక్రోక్తి పాఠకులకు ఆహ్లాదాన్ని కలిగిస్తుంది. మేడలు ఆకాశాన్నంటుతున్నాయని, మేరు పర్వతశిఖరం మీది నుంచి నిక్కి దేవతలు పట్టణపు మేడల సౌందర్యాన్ని చూస్తున్నారని - అట్లా ఎన్నో విధాలుగా కవి చమత్కరిస్తాడు. అదే రుచిరార్థసూక్తి.) ఎర్రన "సూక్తి వైచిత్రి" ని శ్రీనాథుడు ప్రశంసించాడు. నన్నయ తాను వక్రోక్తి భరితమైన కవిత్వం చెప్పగల మహాకవినని నానారుచిరార్థసూక్తినిధి అన్న విశేషణంతో చెప్పుకున్నాడు. నానారుచిరార్థ సూక్తులంటే కొందరు అనేక విధాలైన సూక్తి = సుభాషితాలకు నిలయమైన వాడు నన్నయ అని అర్థం చెప్పారు. కాని దానికన్నా నన్నయ వక్రోక్తి భరితమైన కవిత్వం చెప్పగలవాడన్న అర్థమే సమంజసంగా వుంటుంది. అందులో అతని కవిత్వ గౌరవం చెప్పబడింది. మహాకవి అని సూచింపబడింది.

నన్నయ తనకు వాగనుశాసనుడు, విపుల శబ్దశాసనుడు - అన్న బిరుదాలున్నట్లుగా చెప్పుకున్నాడు - నన్నయ "ఆంధ్ర శబ్దచింతామణి" పేరుతో సంస్కృతభాషలో తెలుగుకు వ్యాకరణం వ్రాసి తెలుగుభాషను క్రమబద్ధం చేసాడని అందుకే అతనికా బిరుదం వచ్చిందని అంటారు. కాని ఆంధ్రశబ్ద చింతామణి అర్వాచీన రచన అని తేలింది. అదీగాక అది చెప్పకోదగ్గంత గొప్పగా వున్న వ్యాకరణం కాదు. కన్నడ సాహిత్యంలో రత్నత్రయకవుల్లో ఒకడైన రన్నకు శబ్దానుశాసన ప్రభవవచోభవుడని బిరుదంవుంది. నన్నయ విపుల శబ్దశాసన బిరుదంకూడా అటువంటిదే. అంటె నన్నయ శబ్దం

మీద అధికారం కలిగిన కవి. కవికి భావవ్యక్తీకరణకు భావవైచిత్రి సాధనకు శబ్దజ్ఞానం శబ్దం మీద అధికారం వుండాలి. నన్నయకు అపార శబ్ద జ్ఞానమున్నదని అతడు గొప్పవాక్‌శక్తి గల కవి అని చెప్పుకోవాలి.

నన్నయ గొప్పకవే కాక గొప్ప పండితుడు. వేద శాస్త్రపురాణాలను అభ్యసించాడు. సంహితాభ్యాసుడు, బ్రహ్మాండాది నానాపురాణ విజ్ఞానని రతుడు దానికి తోడు నన్నయ లోకజ్ఞుడు. పరమధర్మ విదుడు అతడు తనను తాను "పాత్రుడు, మత్యమరాధిపాచార్యు"డనని చెప్పుకున్నాడు. బుద్ధిలో బృహస్పతి అంతటి వాడను అని అన్నాడు. దాన్ని బట్టి అతడు రాజనీతి కుశలుడు మంత్రాంగం నేర్చినవాడని చెప్పవచ్చును. పాత్రుడంటె సంధివిగ్రహాది రాజకీయ ఉపాయాలను తెలిసిన వాడు అని అర్థం.

నన్నయ తాను "ఉభయభాషాకావ్య రచనాభిశోభితు"డని చెప్పుకున్నాడు. ఉభయభాషలంటె సంస్కృతం తెలుగు. ఈ రెండు భాషల్లో కవిత్వం చెప్పగలిగినవాడు నన్నయ. రాజరాజనరేంద్రుడు నారాయణ భట్టుకు నందంపూడి ఆగ్రహారాన్ని దానం చేస్తూ శాసనం వేయించాడు. ఆ సంస్కృత శాసనలేఖకుడు నన్నయ. అదిగాక నన్నయ సంస్కృత రచనలేవి మనకు తెలియదు "భాషింతు నన్నయభట్టు మార్గంబున నుభయవాక్ప్రౌఢి నొక్కొక్కమాటు" అని శ్రీనాథుడు నన్నయ ఉభయవాక్ప్రౌఢిని ప్రశం సించాడు. సంస్కృత తెలుగుభాషా పదప్రయోగంలో నన్నయ నిపుణుడని దానివల్ల తెలుస్తున్నది. మహాభారత కావ్యారంభాన్ని నన్నయ "శ్రీవాణీ గిరిజాశ్చిరాయ........" అన్న సంస్కృత శ్లోకంతో చేసాడు. ఆశీస్సు దేవభా షలో వుండాలనుకున్నాడేమో. నన్నయ సంస్కృతపదాలను సమాసాలను ఎక్కువగా వాడాడని కొందరి అభిప్రాయం. కాని నన్నయ దేశ్యపదాలను కూడా ప్రయోగించాడు. అక్కడక్కడ దేశ్యపదభరితమైన చక్కని పద్యాలను వ్రాసాడు.

నన్నయ రచనాశైలి అనువాదపద్ధతి వర్ణనలు ఛందస్సులు తర్వాత కవులకు ఆదర్శమైనాయి. అందుకే నన్నయకు పూర్వం కవులున్నా కవిత్వమున్నా అతడే తెలుగులో ఆదికవిగా కీర్తిని సంపాదించుకున్నాడు. తెలుగు కవిత్వానికి అతడు గురుపీఠం వంటివాడయ్యాడు. మార్కండేయ పురాణ కర్త మారన నన్నయను "ఆంధ్రకవితా గురు"డని స్తుతించాడు. రామరాజ భూషణుడు "మహిమున్ వాగనుశాసనుడు సృజియింప" అని తెలుగు సాహిత్య ప్రపంచానికి నన్నయను సృష్టికర్తగా కీర్తించాడు.

* * *

# 4. నన్నయ తిక్కనల మధ్యయుగం

నన్నయ తిక్కన మధ్యకాలాన్ని తెలుగుసాహిత్యంలో శివకవియుగంగా పేర్కొనడం వుంది. ఈ యుగంలో శైవసాహిత్యం విశేషంగా వచ్చినా యుగకర్తగా పేర్కొనదగిన యుగాన్ని ప్రభావితం చేసిన కవి ఎవరూ లేరు. శైవసాహిత్య సృష్టి జరిగింది. కాబట్టి శివకవియుగమని చెప్పడం వుంది. ఈ యుగప్రతినిధి కవిగా ఒక్కరిని నిర్ణయించడానికి సాధ్యంకాకపోవడం చేత నన్నయతిక్కనల మధ్యయుగం అని పేరు పెట్టడం జరిగింది.

ఈ యుగం రాజరాజనరేంద్రుని మరణం ఆ తర్వాత అతని సవతి తమ్ముడు ఏడవ విజయాదిత్యుడు అత్యల్పకాలపరిపాలన అంతం కావడంతో క్రీ.శ. 1075 తో ఆరంభమై క్రీ.శ. 1200 గణపతిదేవుని పరిపాలనారంభం వరకు సాగుతున్నది. దాదాపు ఈ ఒకటిన్నర శతాబ్దాల కాలంలో ఆంధ్రదేశంలో సుస్థిరమైన పాలనగాని, బలమైన కేంద్రాధికారంగాని లేదు. రాజరాజనరేంద్రుని కొడుకు కులోత్తుంగుడు చోళ వంశనామాన్ని ధరించి చోళ సామ్రాజ్యాన్నేలాడు. అతని కొడుకులను వరుసగా ఒకరి తర్వాత ఒకరిని వేంగిలో రాజప్రతినిధులుగా వుంచాడు. కాని వాళ్ళు సమర్థవంతులై రాజ్యపాలన గాని స్వాతంత్ర్యాన్ని ప్రకటించి రాజ్యనిర్మాణం గాని చేయలేదు. చాళుక్యచోళ పాలనాకాలంలో వెలనాడును పాలించిన రాజులు కొంత ప్రబలురైనారు. వాళ్ళు చోళులు కాకున్నా కులోత్తుంగుని మీది గౌరవంతో

మొదటి గొంకరాజు తన కొడుకుకు కులోత్తుంగరాజేంద్ర చోడుడని పేరు పెట్టాడు. అప్పటి నుంచి ఆ రాజులు వెలనాటి చోడులుగా ప్రసిద్ధి చెందారు. వాళ్ళ రాజధాని చందోలు - చందవోలు. వాళ్ళ శాసనాలు పిఠాపురం, ధాన్యకటకం, చేబ్రోలు, దక్షారామంలో దొరికాయి. వెలనాటి చోళులు ఈ యుగంలో కొంత రాజకీయాధికారబలం కలిగివున్నా వాళ్ళు స్వతంత్రించి బలమైన సామ్రాజ్యానిర్మాణం మాత్రం చేయలేకపోయారు. ఆ కాలంలోనే ఓరుగల్లులో కాకతీయులు అప్పుడప్పుడే బలం పుంజుకొని సామ్రాజ్యనిర్మాణ దశవైపు పయనిస్తున్నారు.

కాకతీయులు తూర్పు చాళుక్యుల కాలంలోనే క్రీ.శ. 950 నాటికే అనుమకొండ ప్రాంతంలో నెలకొన్నారు. ఈ వంశంలో మొదటి ఇద్దరు రాజులు "రాష్ట్రకూట" అని పేరు చివర చేర్చుకోవడం చేత రాష్ట్రకూటులకు సేనానులుగావుండి వాళ్ళ ప్రతినిధులుగా అనుమకొండను పాలించారని తెలుస్తున్నది. తూర్పు చాళుక్యుల దండయాత్రలను అడ్డగించడానికి రాష్ట్రకూటులు ముఖ్యంగా కాకతీయులను అనుమకొండప్రాంతంలో ప్రతిష్ఠించి వుంటారు. ఆ ప్రాంతానికి కుర్రవాడి అని పేరు. తూర్పు చాళుక్యులకు కొరవిసీమలోని ముదిగొండ చాళుక్యులు యుద్ధాల్లో తోడ్పడుతుండే వాళ్ళు. రాష్ట్రకూట రెండవ కృష్ణునికి వేంగి మొదటి చాళుక్యభీమునికి మధ్య యుద్ధాలు జరిగాయి. ముదిగొండ చాళుక్యుల సాయంతో చాళుక్య భీముడు రాష్ట్రకూటుల దండయాత్రను తిప్పికొట్టాడని కొరవిశాసనాన్ని బట్టి తెలుస్తున్నది. ఆ యుద్ధాల్లో కాకర్త్య (కాకతి) గుండయ (క్రీ.శ. 900) దండనాయకుడు రాష్ట్రకూటుల పక్షంలో పోరాడి మరణించాడు. గుండయ పరాక్రమానికి మెచ్చి రెండవ కృష్ణుడు అతని కొడుకు ఎరియ రాష్ట్రకూటుని కుర్రవాడికి అధిపతిని చేసాడు. కొరవి పక్కనే కుర్రవాడి. కుర్రవాడి రాష్ట్రకూటుల సరిహద్దుగా నిలిచింది. ఆ సరిహద్దు రక్షకులు కాకతీయులైనారు. ఎరియ రాజధాని కాకతిపురం. కాకతి దుర్గరూపం.

కాకతి ఆరాధ్య దేవత కాబట్టి వాళ్ళు కాకతీయులైనారు. వాళ్ళు నిర్మించిన నగరం కాకతినగరం అయింది. కాకతి నగరమే ఓరుగల్లుగా ప్రసిద్ధి చెందిందని చారిత్రకుల అభిప్రాయం.

కాకతీయులు మొదట రాష్ట్రకూటుల కింద వుండి వాళ్ళ బిరుదాలను, గరుడలాంఛనాన్ని స్వీకరించారు. తర్వాత కాకతీయులు పశ్చిమ చాళుక్యులకు సామంతులుగా వుండి వాళ్ళ వరాహలాంఛనాన్ని స్వీకరించారు. కాకతీయులు రెండవ బేతరాజు కాలంలో కొరవిమండలం, వేములవాడ ప్రాంతాన్ని జయించి ముదిగొండ చాళుక్యులను వేములవాడ చాళుక్యులను అంతమొందించి రాజ్యవిస్తరణ చేసారు. రెండవ బేతరాజు తండ్రి మొదటి ప్రోలరాజు వేములవాడ చాళుక్యుల కుండే "అరికేసరి" బిరుదాన్ని ధరించడం చేత అతనికాలంలోనే వేములవాడ చాళుక్యులు నిర్జింపబడినారని చెప్పవచ్చును. కాకతీయరాజుల్లో రెండవ ప్రోలరాజు (క్రీ.శ. 1116-1157) చాల విజయాలను సాధించి రాజ్యవిస్తరణ చేసాడు. అతడు కలచురులతో చేరి పశ్చిమచాళుక్యులను ధిక్కరించి స్వతంత్రుడైనాడు. ప్రోలరాజు కొడుకు రుద్రదేవుని (క్రీ.శ. 1158-1195) కాలంలో కలచురి బిజ్జలుడు పశ్చిమచాళుక్యుల రాజ్యాన్ని వశపరచుకొని కళ్యాణంలో రాజ్యం చేసాడు. ఈ బిజ్జలుని ఆస్థానంలోనే బసవేశ్వరుడు బండారిగా మంత్రిగా రాజకీయాధికారం కలిగివుండి వీరశైవమతాన్ని ప్రచారం చేసాడు. రుద్రదేవుని కాలంలోనే వీరశైవం ఆంధ్రదేశంలోకి ప్రవేశించింది. ముఖ్యంగా పశ్చిమాంధ్రంలో విజృంభించింది. కలచురి బిజ్జలుడు సార్వభౌమాధికారంతో కాకతీయులను లొంగదీసుకోవాలని చూసాడు. కాని రుద్రదేవుడు పరాక్రమంతో రాజనీతిజ్ఞతతో శత్రువినాశనం చేసి కాకతీయ రాజ్య విస్తరణ చేసాడు. అతడు ఓరుగల్లును రాజధానిగా చేసుకొని దుర్భేధ్యమైన కోటను నిర్మించాడు. వేయి స్తంబాల గుడిని నిర్మించాడు. దానిలో శివునితోపాటు విష్ణు సూర్యులను ప్రతిష్ఠించాడు. కాకతీయులు మొదట

రాష్ట్రకూటులవలెనే జైనాన్ని అభిమానించారు. ఆ కాలంలో వేములవాడ చాళుక్యుల కాకతీయుల ఆదరణలో జైనమతం ఆంధ్రదేశంలో నెలకొన్నది. కాకతి జైన దేవతే అయివుంటుంది. కాకతీయులు శైవాన్ని అభిమానించగా ఆమె దుర్గరూపంగా మారింది. కాకతీయులు రెండవ ప్రోలరాజు కాలం నుంచి శైవాభిమానాన్ని చూపారు. ప్రోలరాజు ఓరుగల్లు కోటలో స్వయం భూదేవాలయాన్ని నిర్మించాడు. కాకతీయులు మొదట జైనులు కాబట్టి వాళ్ళను శూద్రకుంజులుగా చెప్పడం జరిగిందేమో. చాలా రాజవంశాలను జైనులు కావడంతో చాతుర్వర్ణంలో శూద్రులుగానే పరిగణించారు.

మొదటి రుద్రదేవుని కాలంలో ఆంధ్రదేశంలోకి వీరశైవం ప్రవేశించి రెండవ ప్రతాపరుద్రుని కాలం వరకు వ్యాపించి వున్నది. 12వ శతాబ్దం చివరలో ఆంధ్రదేశంలోకి రామానుజుల వైష్ణవం కూడా ప్రవేశించింది. రుద్రదేవుని మంత్రి గంగాధరుడు వైష్ణవాభిమానంతో వైష్ణవాలయాలను నిర్మించాడు. గోనగన్నారెడ్డి వైష్ణవం స్వీకరించి విట్టల భూపతి అయినాడు కొడుకు గోనబుద్ధారెడ్డిని రంగనాథుని పేర రామాయణ రచనకు ప్రేరేపించాడు. రెండవ ప్రతాపరుద్రునికాలంలో వైష్ణవ ప్రభావంతో భాస్కర రామాయణమనే మరో రామాయణం రచింపబడింది. ఆ కాలంలో జైనం రాజుల ప్రాపును పోగొట్టుకుంటున్నది. బౌద్ధం దాదాపు లేకుండా పోయింది. వీరశైవం బాగా ప్రచారంలోకి వచ్చింది. రుద్రదేవుని కాలంలోనే మల్లికార్జున పండితారాధ్యుడు శైవాన్ని ప్రబోధించాడు.

ఆంధ్రదేశంలో శైవం ప్రాచీనకాలం నుంచి వుంది. శ్రీనాథుని భీమేశ్వరపురాణాన్ని అనుసరించి అగస్త్యుడు వింధ్యను దాటి దక్షిణ దేశానికి వచ్చి దక్షరామాంలో భీమేశ్వరున్ని సేవించాడని వుంది. అంటే అగస్త్యునికి పూర్వమే అక్కడ ఈశ్వరుడు వెలిసాడని అది అతిప్రాచీన క్షేత్రమని తెలుస్తున్నది. శివుని కోపానికి గురయిన వ్యాసుడు కాశిని విడిచిపెట్టి

వచ్చి దక్షారామంలో అగస్త్యుని కలుసుకున్నాడని శ్రీనాథుని భీమ, కాశీ ఖండాల్లో వుంది. శాతవాహనుల్లో శివశ్రీ, స్కందశాతకర్ణి పేర్లను బట్టి ఆ రాజుల్లో కొందరు శైవాన్ని అభిమానించారని తెలుస్తున్నది. తర్వాత కృష్ణానదీ తీరాన్ని పాలించిన శాలంకాయనులు చిత్రరథస్వామి పేరుతో శివున్ని ఆరాధించారు. ఆంధ్రదేశంలో విశాల భూభాగాన్ని దాదాపు రెండు శతాబ్దాల కాలం విష్ణుకుండినులు పాలించారు. వాళ్ళు శ్రీపర్వత స్వామి ఆరాధకులు. శ్రీ పర్వతస్వామి శ్రీశైల మల్లికార్జునుడే అని చారిత్రకుల అభిప్రాయం. శ్రీ శైలానికి పూర్వకాలంలో శ్రీ పర్వతం, శ్రీగిరి అని పేర్లున్నాయి. మొదట అది నాగార్జునాచార్యుల వంటి బౌద్ధులకు నిలయంగా వుండేది. ఆ పర్వతప్రాంతంలో యోగాదిమహిమలతో కూడిన బౌద్ధ సిద్ధసంప్రదాయం పుట్టింది. విష్ణుకుండినుల కాలంలో శ్రీ పర్వతం శైవ క్షేత్రంగా ప్రసిద్ధి చెంది తర్వాత వీరశైవ విజృంభణతో ఆ క్షేత్రం అధిక ప్రాధాన్యాన్ని సంతరించుకుంది. కన్నడ మహారాష్ట్ర తెలుగు ప్రాంతాలకు దగ్గరలో వున్న ఆ శైవ క్షేత్రం దక్షిణ దేశంలో గొప్ప మహిమగల క్షేత్రంగా రూపొందింది.

శ్రీపర్వత ప్రాంతంలో పుట్టిన బౌద్ధసిద్ధ సంప్రదాయం దక్షిణ ఉత్తరభారతమంతటా వ్యాపించింది. బౌద్ధ సిద్ధయోగసంప్రదాయంలో 64 మంది ఆచార్యులున్నారు. వాళ్ళు ప్రజల భాషలయిన ధార్మిక అపభ్రంశభాషల్లో పాటల రూపంగా ఆధ్యాత్మికతత్త్వాన్ని ప్రచారం చేసారు. సిద్ధులు యోగసాధనలతో మంత్రతంత్ర విద్యలను నేర్చి మహిమలను చూపారని అంటారు. క్షుద్రమహిమలతో బౌద్ధ సిద్ధసంప్రదాయం దూషితం అయినప్పుడే దానిలో నుంచి క్రీ.శ. 7,8 శతాబ్దాల్లో శివున్ని ఆరాధ్యదైవంగా చేసుకొని నాథయోగ సంప్రదాయం ఆ శ్రీపర్వత భూమిలోనే పుట్టింది. నాథసంప్రదాయం నేపాల్ అస్సాం మొదలుకొని కన్యాకుమారి వరకు సామాన్య జనుల్లో వ్యాపించింది. ఆ సంప్రదాయంలో నవనాథులనే పేరుతో తొమ్మది

మంది గురువులు ప్రసిద్ధులయ్యారు. నవనాథుల్లో మత్స్యేంద్రనాథుడు మొదట సిద్ధసంప్రదాయానికి చెందినవాడు. అతడే శివుడు పరమదైవంగా నాథసంప్రదాయాన్ని ప్రబోధించాడని అతని శిష్యుడు గోరఖనాథుడు వ్యాపింపజేసాడని అంటారు. మత్స్యేంద్ర గోరఖనాథులకు ఆంధ్రదేశంతో సంబంధమున్నట్లు కథలున్నాయి. నవనాథుల్లో ఒకడైన చౌరంగినాథుడు సారంగధరుడని - అతడు రాజరాజ నరేంద్రుని కొడుకని కథలు వ్యాప్తిలో వున్నాయి. శ్రీనాథుని కాలం వాడైన గౌరన నవనాథుల చరిత్రను ద్విపద కావ్యంగా వ్రాసాడు. అంతకుముందే శ్రీగిరి కవి పద్యకావ్యంగా వ్రాసాడు. దాన్ని బట్టి నాథసంప్రదాయం ఆంధ్రదేశంలో 14వ శతాబ్దం వరకు మిగిలి వుందని చెప్పవచ్చును. నాథసంప్రదాయ ప్రభావం కన్నడ దేశంలో బసవేశ్వరునికి పూర్వం శైవాన్ని అనుసరించిన అల్లమప్రభువు వంటి వాళ్ళమీద వుందని అంటారు. మల్లికార్జున పండితారాధ్యుని గురువు కోటిఫలి ఆరాధ్యుని తండ్రి రేవణ సిద్ధుడని పేర్కొనబడినాడు. అతన్ని మరుళ, ఏకోరాములతో చేర్చి సిద్ధత్రయమని అంటారు. రేవణ శ్రీలంక వరకు ఆకాశగమనం చేసాడని చెప్తారు. అతడు సిద్ధ సంప్రదాయానికి చెందినవాడని క్రీ.శ. 1050-70 వ కాలంవాడని పండితుల అభిప్రాయం. అతడు కొల్లిపాక సోమేశ్వర లింగం నుంచి ఉద్భవించాడని కథలున్నాయి. దాన్ని బట్టి ఆంధ్రదేశంలోనూ సిద్ధయోగ నాథయోగాల సంబంధంతోనే శైవం వ్యాప్తిలోకి వచ్చిందని చెప్పవచ్చును.

తమిళదేశంలో క్రీస్తుశకారంభం నుంచే నాయనార్లు శైవభక్తిని ప్రచారం చేసారు. 63 మంది శివభక్తుల మహిమలు కథలుగా దక్షిణ దేశమంతటా వ్యాపించాయి. నాథ సంప్రదాయం శైవయోగాన్ని ఆధ్యాత్మిక తత్వాన్ని ప్రచారం చేసింది. వీటన్నిటి ప్రేరణతో కన్నడ ఆంధ్రదేశాల్లో శివభక్తి ఉద్యమం ఉద్భవించింది. కన్నడ దేశంలో బసవేశ్వరుడు (క్రీ.శ. 1190 లో నిర్యాణం) వీరశైవాన్ని ప్రచారం చేసాడు. బసవేశ్వరునికి పూర్వమే

బొడర దాసమయ్య, దేవర దాసమయ్య, సకలేశ మాదస, అక్కమహాదేవి, అల్లమ ప్రభు మొదలయిన వాళ్ళు శివభక్తిని శివపారమ్యాన్ని ప్రచారం చేసారు. ఆ బోధనలనే బసవన్న సామాన్య జనుల్లో ప్రచారం చేసాడు. బసవన్న నందీశ్వరుని అవతారంగా భావింపబడినాడు. బసవేశ్వరుని వీరశైవం ఆంధ్రదేశంలోను ప్రవేశించింది. తమిళదేశంలో లేచిన శివ విష్ణుభక్తి ఉద్యమాలు బౌద్ధజైన మతాలను అక్కడ రూపుమాపాయి. కన్నడ దేశంలో వీరశైవం బాగా ప్రచారంలో వున్న జైన ప్రభావాన్ని నాశనం చేసింది. ఇప్పుడు పురాతత్త్వ తవ్వకాలను బట్టి ఆంధ్రదేశంలో క్రీస్తుపూర్వం నుంచి బౌద్ధ జైనాలు మనమిప్పుడు ఊహించరానంతగా బాగా వ్యాపించి ఉన్నతదశలో వున్నాయని ఎన్నో బౌద్ధజైన క్షేత్రాలు స్తూపాలు చైత్యాలు ఆరామాలు జైనవసదులు జినాలయాలుండేవని తెలుస్తున్నది. అటువంటి మతాలను ఆంధ్రదేశంలోను వీరశైవం నామరూపాలు లేకుండా చేసింది. శివుడు తప్ప వేరే దేవుడు లేడనడం ఇతర మతాలంటె అసహనం చూపడం ఆవేశపూరితమైన భక్తి - వీటన్నిటి చేత దానికి వీరశైవమనే పేరు వచ్చింది.

క్రీ.శ. 3,4 శతాబ్దాలనుంచే అంటె .ఇక్ష్వాకుల తర్వాత కాలం నుంచే ఆంధ్రదేశంలో బౌద్ధ జైనాలు రాజుల అభిమానానికి దూరమయ్యాయి. దాంతో ఎన్నో బౌద్ధజైన క్షేత్రాలు శైవ వైష్ణవ క్షేత్రాలుగా మారడం ఆరంభమైంది. తూర్పు చాళుక్యుల కాలంలో ఆరామాల పేరుతో ప్రసిద్ధమైన పంచారామాలు శైవక్షేత్రాలుగా మారి పూజలందుకున్నాయి. చాళుక్య భీముని కాలంలో అది జరిగిందంటారు. చాళుక్య భీముడు (క్రీ.శ. 892-921) తన పేరు మీదుగా భీమవరంలో, దక్షారామంలో భీమేశ్వరాలయాలు కట్టించాడు. అంతేగాక చేబ్రోలు బెజవాడలవంటి వాణిజ్యకేంద్రాలు శైవ క్షేత్రాలుగా అభివృద్ధి చెందాయి. అంతకు పూర్వం చాళుక్య రెండవ విజయాదిత్యుడు (క్రీ.శ. 806-846) యుద్ధాలు చేసి రక్తసిక్తమైన ప్రదేశాల్లో 108 శైవాలయాలు నిర్మించాడు. క్రమంగా దేవాల

యాలు సాంఘిక ఆర్థిక కార్యకలాపాలకు కేంద్రాలయ్యాయి. దేవాలయాలకు రాజులు రాణులు ఉద్యోగులు దానాలు చేసారు. దేవాలయాలు పూజారులు వైదికపండితులు గురువులు సుసంపన్నులై రాజకీయ కార్యకలాపాలను నియంత్రించే వాళ్ళయ్యారు. దేవాలయాల్లో జాతరలు ఊరేగింపులు జరగడం. జాతరల్లో అగ్నిగుండాల మీద నడవడం సిడి ఎక్కడం నాలుక మీద ఒంటిమీద దబ్బణాలతో గుచ్చుకోడం వంటి వ్రతచర్యలు బయలు దేరాయి. ప్రజలనుత్తేజితులను చేసాయి. రాజరాజనరేంద్రుడు శివపూజాతత్పరుడు. అతని తండ్రి విమలాదిత్యుడు పెదతండ్రి శక్తివర్మ చాలాకాలం చోళరాజుల ప్రాపున వున్నారు. చోళ రాజరాజు కూతురును విమలాదిత్యుడు పెండ్లి చేసుకున్నాడు. రాజరాజనరేంద్రుని తల్లేగాక భార్యకూడా చోళరాజకన్యే. చోళచక్రవర్తుల్లో రాజరాజు అతని కొడుకు రాజేంద్రచోళుడు మొదలయిన వాళ్ళు పరమ శివభక్తులు రాజ రాజు బృహదీశ్వరాలయాన్ని నిర్మించాడు. వాళ్ళ శైవాభిమానం బ్రాహ్మణభక్తి రాజరాజనరేంద్రుని మీద చాల ప్రభావాన్ని చూపివుంటుంది.

తూర్పు చాళుక్యులు తీరాంధ్రాన్ని క్రీ.శ. 624-1075 మధ్యకాలంలో పాలించారు. వాళ్ళు దాదాపు నాలుగు ఐదు శతాబ్దాలకాలం ఆంధ్రదేశాన్ని చాలా భాగాన్ని పాలించి సాహిత్య సాంస్కృతిక వికాసానికి తోడ్పడినారు. రాజరాజనరేంద్రుని తర్వాత అతని సవతి తమ్ముడు ఏడవ విజయాదిత్యుడు ఐదు సంవత్సరాలు పాలించి క్రీ.శ. 1075 లో మరణించాడు. దాంతో తూర్పు చాళుక్యుల పాలన అంతమైంది. రాజరాజనరేంద్రుని కొడుకు కులోత్తుంగ రాజేంద్రుడు చోళవంశనామం ధరించి చోళ సింహాసనాన్ని అధిష్ఠించాడు. వేంగి చోళసామ్రాజ్యంలో చేరిపోయింది. అంటె రాజేంద్రుడు తంజావూరు నుంచి వేంగిని రాజప్రతినిధులను నిలిపి పాలించాడు. అందుకే ఆ కాలాన్ని ఆంధ్రదేశ చరిత్రలో చాళుక్యచోళయుగం అంటారు. క్రీ.శ.1076 నుంచి కుల్తోత్తుంగుని నలుగురు కొడుకులు వేంగిని రాజప్రతినిధులుగా

పాలించారు. వీరచోడుని కాలంలో క్రీ.శ. 1088లో తమిళ వైష్ణవబ్రాహ్మణుల అనేక కుటుంబాలు వచ్చి తీరాంధ్రంలో వచ్చి స్థిరపడినారు. దాంతో ఆంధ్రదేశంలో బ్రాహ్మణుల్లో ద్రావిడ శాఖ ఏర్పడింది. కళింగుల పశ్చిమ చాళుక్యుల దండయాత్రలతో వేంగిలో పాలన ప్రశాంతంగా జరుగలేదు. పరాంతకచోళుడు (క్రీ.శ. 1107-1119) వేంగిలో చివరి చోళ రాజప్రతినిధి. వేంగిలో జరిగే నిరంతర యుద్ధాలతో విసిగి రెండవ కులోత్తుంగ చోళచక్రవర్తి వెలనాడులో రెండవ గొంకరాజుకు ఆధిపత్యం కట్టబెట్టాడు. ఆ తర్వాత అతడు ఆంధ్రదేశంలోని రాజకీయాల్లో జోక్యం చేసుకోలేదు. అయినా వెలనాటి చోళులు చోళచక్రవర్తుల మీద విశ్వాసంతోనే పాలించారు గాని స్వతంత్రించి బలమైన రాజ్యాధికారాన్ని సామ్రాజ్య నిర్మాణాన్ని చేయలేక పోయారు.

వెలనాటి చోడులకు అధికారాన్ని ఇయ్యడం ఆంధ్రదేశంలో కొణిదెన చోడులు, నెల్లూరు చోడులు మొదలయిన వాళ్ళు ఇష్టపడక పోవడంతో దేశంలో శాంతిభద్రతలు లేకుండా పోయాయి. పల్నాటి సీమలో క్రీ.శ. 1073 ప్రాంతంలో హైహయులు తలెత్తారు. హైహయులు చేది దేశంనుంచి వచ్చామని సోమవంశ క్షత్రియులమని కార్తవీర్యార్జునుని వంశజులమని చెప్పుకున్నారు. చాళుక్య గుణగవిజయాదిత్యుడు 'డహల' దేశాన్ని జయించినట్లుగా చాళుక్యభీముని ధర్మవరశాసనంలో వుంది. 'డహల' గంగా నర్మదానదుల మధ్యవున్న కలచురి చేదివంశజుల రాజ్యమని చారిత్రకుల అభిప్రాయం. కలచురులు క్రమంగా దక్షిణానికి వచ్చారు. కలచురి బిజ్జలుడు పశ్చిమ చాళుక్య రాజును చంపి రాజ్యాన్ని వశపరచుకున్నాడు. అతని ఆస్థానంలోనే బసవేశ్వరుడున్నాడు. దాన్ని బట్టి నిరంతరంగా అనేక క్షత్రియవంశరాజులు దక్షిణదేశానికి వచ్చి సేనాపతులుగా రాజోద్యోగులుగా వుంటూ రాజ్యాలను సంపాదించారని తెలుస్తున్నది. పల్నాటి హైహయులు ఆ విధంగా ఉత్తరదేశం నుంచి వచ్చినవాళ్ళే. హైహయుల్లో

అనుగురాజు రెండవ గొంకరాజు కూతురు మైలమను వివాహమాడాడు. గొంకరాజు సహాయంతోనే అనుగురాజు పల్నాడులో సుప్రతిష్ఠితుడైనాడు. కాబట్టి మైలమ పేరును చేర్చుకొని అతని కొడుకు మైలమనలగాముడుగా పిలువబడినాడు. పల్నాటి అనుగురాజు రాజధాని గురిజాల. అనుగురాజు తర్వాత నలగాముడు రాజయ్యాడు. వెలనాటి రాజుల ప్రతినిధిగా దొడ్డ నాయుడు గురిజాలలో వున్నాడు. అతని కొడుకు బ్రహ్మనాయుడు. అతడు నలగాముని సవతి తమ్ముడు మలి దేవరాజు పక్షం వహించి రాజ్యాన్ని రెండుగా చీల్చాడు. మలిదేవరాజు బ్రహ్మనాయుని సహాయంతో మాచర్ల రాజధానిగా పాలించాడు. బ్రహ్మనాయుడు వెలనాటి ప్రభువులను గాని గురిజాల ప్రభువునుగాని లెక్కచేయక స్వతంత్రించాడు. వీర వైష్ణవం పేరుతో సామాన్య జనులను రేకెత్తించి తానే ప్రభువుకావాలని చూసాడు అని స్థానిక చరిత్రలో వుందట. అది నాగమ్మ సహించలేదు. ఆమె శివభక్తురాలు. చివరకు గురిజాల మాచర్ల సైన్యాలు కారెంపూడిలో యుద్ధం చేసాయి. దానికే పల్నాటి యుద్ధమని పేరు. ఆ యుద్ధంలో కాకతిరు ద్రుడు, వెలనాటి రాజేంద్రుడు కోట చాగిరాజులు పల్లవులు హోయసలలు నలగాముని పక్షం వహించారు. కలచురి సోమేశ్వరుని కూతురును మలిదేవుడు వివాహమాడాడు. కాబట్టి కల్యాణి కలచురులు మలిదేవుని పక్షం వహించారు. యుద్ధంలో నలగామునికి విజయం లభించింది. కలచు రులు పశ్చిమచాళుక్యుల వలెనే వేంగి చాళుక్య - చోళులను శత్రువులుగా భావించారు. కలచుర కన్యను వివాహమాడిన మలిదేవుడు రాజ్యాధికారం కోసం నలగాముడితో పోరాడి వుంటాడు. రాజకీయ చదరంగంలో పల్నాటి యుద్ధం పెద్దపావుల చేతిలో చిన్నపావులు ఆడేటి ఆట. పల్నాటి యుద్ధం క్రీ.శ. 1176-80 ప్రాంతంలో జరిగిందని. చారిత్రకుల అభిప్రాయం.మొత్తం మీద 12వ శతాబ్దంలో శైవ వైష్ణవాల మధ్య ఏర్పడిన వైషమ్యాన్ని ఆసరగా తీసుకొని రాజకీయాధికారం కోసం జరిగిన పోరాటమిది. పల్నాడులో జరిగిన వృత్తాంతాలను జానపద కవులు గానం చేసారు. శ్రీనాథుడు

కూడా పల్నాటి వీరచరిత్రను ద్విపదలో రచించాడని కొందరి అభిప్రాయం. ఆ తర్వాత క్రీ.శ.1180 లో రెండవ గొంకరాజు కొడుకు రాజేంద్రచోదుని (క్రీ.శ. 1161-81) కాలంలో కలచురులు వెలనాటి మీదికి దండెత్తి ఓడిపోయినారు. రెండవ రాజేంద్రచోడుడు శ్రీశైలం వరకు రాజ్యాన్ని విస్తరింపజేసి చోళసార్వభౌముడు రాజాధిరాజు దుర్బలుడని చూసి అతనికి కప్పం చెల్లించకుండా స్వతంత్రించి పాలించాడు. రాజేంద్రుని తండ్రి రెండవ గొంకరాజు జైనమతాభిమానంతో జినేశ్వరాలయానికి భూమిదానం చేసాడు. రాజేంద్రుని మంత్రి నండూరి కొమ్మన 32 పట్టణాల్లో విష్ణు ప్రతిష్ఠలు చేసాడు. రాజేంద్రుని బావమరది బుదిరాజు బౌద్ధమతాభిమాని. రాజేంద్రుని గురువు బౌద్ధుడు. అతని కాలంలోనే మల్లికార్జునుడున్నాడు.

మల్లికార్జున పండితారాధ్యుడు రాజేంద్రుని సభకు వెళ్ళి బౌద్ధగురువును శాస్త్రవాదంలో ఓడించాడు. బౌద్ధమతాన్ని ఖండించి శైవాన్ని స్థాపించాడు. శివుని కన్నా వేరేదైవమున్నాడన్న వాళ్ళ తలను కాలుతో తంతానన్నాడు. బౌద్ధ గురువు తన అపజయ అవమానాన్ని సహించలేక మల్లికార్జున దీపమాలె కంబాన్ని అందరూ చూస్తుండగా తన శిష్యులతో పగులగొట్టించాడట. దాన్ని సహించలేక పండితుని శిష్యులు రేమయ, దేవయలు చందవోలు దగ్గర సముద్రం మధ్య లంకలో బౌద్ధారామంలో ప్రార్థన చేస్తున్న బౌద్ధ గురువు దేహాన్ని దీపమాలెకంబాన్ని పగులగొట్టినట్లుగా ముక్కలు ముక్కలుగా చేసి చంపారట. మల్లికార్జునుడు తానే హత్యను చేయించినట్లు ఒప్పుకున్నాడు. శిక్షగా రాజు పండితున్ని కళ్ళలో జీడిపాలుపోసి గుడ్డివాన్ని చేసాడు. దాంతో మల్లికార్జునుడు రాజు వ్రణబాధతో చస్తాడని, చందవోలు నాశనమౌతుందని శాపం ఇచ్చాడు. అతడు బసవన్న సందేశాన్ని అందుకొని అతన్ని దర్శించు కోవాలని అమరావతి మీదుగా నల్లగొండ జిల్లాలోని పానగల్లు చేరుకున్నాడు. పానగల్లు రాజు కందుకూరు ఉదయచోడుని కోశాధికారి గోవింద ప్రెగ్గడ, రాజు పెద్దలెంక ధవళేశు నామయ్య పండితుని శిష్యులయ్యారు. వాళ్ళు

రాజు ఆజ్ఞ కన్నా పండితుని ఆజ్ఞను మన్నించసాగారు. దాంతో రాజు కోపించాడు. అప్పుడు అల్లయ్య, మధుపయ్యలనే శివభక్తులను బిజ్జలుడు చంపగా బసవేశ్వరుడు కళ్యాణం నాశనమగుగాక అని శపించాడని మల్లయ బొమ్మయలు బిజ్జలుని చంపారని కాబట్టి భక్తులు సేవకవృత్తితో కొలిస్తేనే సత్పథం చేరుతారని చెప్పి నామయ్య రాజుగారి చేతిలో వున్న కత్తిని తీసుకొని గోపురమెక్కి ఉదయచోడుని వంశమంతరించుగాక అని శాపమిచ్చి తన తలను తెగనరకుకొన్నాడు. పండితుడు కోపోద్రిక్తుడై రాజు సబాంధవంగా నశించుగాక అని శాపమిచ్చాడు. పానుగల్లులో ఉత్పాతాలు పుట్టాయి. పండితుడు శ్రీశైలం చేరుకునే సరికి బసవేశ్వరుడు లింగైక్యం చెందాడని వార్త తెలిసింది. పండితుడు అక్కడే శిష్యులతో ఆగిపోయాడు. అక్కడే అతడు లింగైక్యం చెందాడు. ఈ వృత్తాంతాలను బట్టి శైవభక్తి వీరరూపంగా వ్యాపించిందని శివున్ని శైవాన్ని అంగీకరించని వాళ్ళను వినాశం చేసారని శివున్ని పరమదైవంగా అంగీకరించని వాళ్ళను హత్యలు చెయ్యడానికి వాళ్ళ ఆస్తులను నష్టం చేయడానికి వెనుకాడలేదని తెలుస్తున్నది. బసవేశ్వరుడు కళ్యాణ కటకాన్ని నాశనం చేయించినట్లుగానే పండితుడు చందవోలు పానుగల్లు పురాలను ధ్వంసం చేయించాడని తెలుస్తున్నది. బసవేశ్వరుడు బిజ్జలుని లెక్కచేయక కోశాగారంలోని ధనాన్ని అంతా ఖర్చుపెట్టి కత్తిపట్టి వీరశైవాన్ని ప్రచారం చేసాడని అంటారు. మొత్తం మీద వీరశైవం గొప్ప ఉద్యమంగా లేచి వైదిక బౌద్ధజైనమతాలను దక్షిణదేశం నుంచి తుడిచి పెట్టింది.

తూర్పు చాళుక్య వంశం అంతరించిం తర్వాత కాకతీయ మొదటి రుద్రుడు క్రమంగా ఆంధ్రదేశంలోని చిన్న చిన్న రాజ్యాలను జయించి సామ్రాజ్య నిర్మాణం ప్రారంభించాడు. రుద్రుని తర్వాత అతని తమ్ముని కొడుకు గణపతి దేవుడి కాలంలో వెలనాటి చోడుల రాజ్యం అంతరించింది. రాజకీయాస్థిరత తొలగిపోయి స్థిరమైన పాలన బలమైన కేంద్రాధికారం

ఏర్పడసాగింది. అరాచక పరిస్థితులు మతకల్లోలాలు, మతోన్మాదాలు అంత రించి శాంతిభద్రత లేర్పడసాగాయి. ఆ తరుణంలోనే తిక్కన మహాభారత రచనకు పూనుకున్నాడు.

వీరశైవ భక్తి ఉద్యమంతో శాతవాహనుల కాలం నుంచి విష్ణుకుండినుల వరకు సాగిన వైదిక యజ్ఞయాగాదులు వెనుక పట్టు పట్టాయి. దక్షుని యజ్ఞాన్ని శివుడు ధ్వంసం చేసే కథ అందుకే వీరశైవంలో అతిప్రాధా న్యాన్ని వహించింది. శైవం వేద ప్రామాణికతను పొందింతర్వాత శివుడు యజ్ఞహవిస్సులకు భాగకర్తగా చెప్పబడినాడేమో. శైవం వేదవిదూరమైందని పండితారాధ్య చరిత్రను బట్టి తెలుస్తున్నది. పండితారాధ్యుడు దక్షారామంలో ఒంటినిండా విభూతిని పూసుకొని రుద్రాక్షలు లింగం ధరించి శైవాన్ని ప్రచారం చేస్తుంటే బ్రాహ్మణులు ఈ విధంగా ప్రశ్నించారట -

"పండితయ్యా నీవు పౌరాణికుడవు
సద్విజోత్తముడవు సచ్చరిత్రుడవు
విద్వాంసుడవు వేదవిదుడ వట్లయ్యు
భూతియు రుద్రాక్షలు దాల్పదగునె
నీతియే లింగ సన్నిహితమైన యున్కి......

ఆ కాలంలో శైవానికి చెందిన వివిధ సంప్రదాయాలు వీరశైవోన్ముఖమై దానిలో లీనమైపోయాయి -

ధర్మ శివులును విద్యాధర శివులు
నిర్మల శివులును శైవ ముఖ్యులందరును
బసవయ్య తోయంపు భక్తుల చూచి
వసుధ తారును లింగవంతులమనుచు
తొడగి ప్రసాదంబు కుడుచు చున్నారు......"

అని బసవపురాణంలో సోమనాథుడంటాడు.

బసవన్న ప్రచారం చేసిన శైవంలో వర్ణవిభేదంలేదు. కాని పండితునికి అది రుచించినట్లు లేదు. అందుకే

"జననిపైన ప్రేమజనయిత్రిపై భక్తి
వదల లేని బాల పగిది నేను
భక్తి మీది వలపు బ్రాహ్మంబుతో పొత్తు ,
పాయజాలను నేను బసవలింగ

అని బసరవేశ్వరునికి వార్త పంపాడు. బసవన్న శైవమత సంప్రదాయంలో చాలా విషయాలను పండితుడు గ్రహించినా వర్ణరాహిత్యాన్ని మాత్రం అంగీకరించలేదు. దాంతో ఆంధ్రదేశంలోని బ్రాహ్మణుల్లో ఆరాధ్యశాఖ ఒకటి బయలు దేరింది. పండితారాధ్యునికి పూర్వం 9,10 శతాబ్దాల్లో శ్రీపతి పండితుడు శివలెంక మంచనలు మహిమలు చూపి శివభక్తిని ప్రబోధించారు. సోమనాథుని బసవపురాణ రచనతో వీరశైవమనే పేరు బాగా ప్రచారంలోకి వచ్చింది. ఆంధ్రదేశంలో వీరశైవం అగ్రనిమ్న వర్ణాల్లో వ్యాపించినా వర్ణభేదాన్ని మాత్రం కన్నడదేశంలో లాగా వ్యతిరేకించలేదు.

చాళుక్యులు ప్రజల భాషను దేశభాషను అభిమానించారని అంటారు. నన్నెచోడుడు "దేశ కవిత" బుట్టించి తెనుగును నిలిపి రంధ్ర విషయంబున జన చాళుక్యరాజు మొదలుగ పలువుర్" అని అన్నాడు. తెలుగులో మొదటి పద్యశాసనం గుణగ విజయాదిత్యుని సేనాని పండరంగు వేయించాడు. చాళుక్యుల్లో దాదాపు చివరివాడైన రాజరాజనరేంద్రుడు నన్నయను మహాభారత రచనకు ప్రోత్సహించాడు. అంతేగాని వాళ్ళు తెలుగుసాహిత్యాన్ని పోషించినట్లు కన్పించదు తూర్పు చాళుక్యులకు సమకాలికులైన వేములవాడ చాళక్యుల ఆస్థానంలో ఆదరణ పొందిన దండనాథుడు కవి అయిన పంపడు 10వ శతాబ్దంలోనే కన్నడంలో రచనలు చేసి ఆదికవి అయినాడు. తెలుగులో 9వ శతాబ్దంలో పద్యరచన దర్శనమిచ్చినా 11వ

శతాబ్దంలో గాని కావ్యరచన జరుగలేదు. కుబ్జవిష్ణువర్ధనుని ఆస్థానంలో కిరాతార్జునీయం వ్రాసిన సంస్కృతకవి భారవి వున్నాడంటారు. మొత్తం మీద రాజరాజనరేంద్రుడు తప్ప మిగతా చాళుక్యరాజులు వాళ్ళు ఏలిన 4,5వ శతాబ్దాలకాలంలో సాహిత్య వికాసానికి అంతగా దోహదం చేసినట్లు కన్పించదు.

తూర్పు చాళుక్యుల తర్వాత నన్నయ తిక్కనల మధ్యకాలంలో శైవ సాహిత్యం తప్ప వేరే సాహిత్యమేది విశేషంగా చెప్పకోదగింది రాలేదు. అథర్వణుడు విరాట పర్వమాదిగా భారతానువాదాన్ని కొనసాగించాడని దొరికిన కొన్ని పద్యాలను బట్టి తెలుస్తున్నది. భారతాన్ని అతడెంత వరకు వ్రాసాడన్నది చెప్పలేము. అతని రచన జైనమతానుకూలంగా సాగడం చేత ప్రచారాన్నందుకోలేదని పండితుల ఊహ. తిక్కన భారత రచనను చేపట్టేంత వరకు నన్నయ భారతాన్ని ఈ యుగంలో ఎవరూ కొనసాగించలేదు. దానికి శైవమతప్రాబల్యమే కారణమని చెప్పాలి. వెలనాటి రాజుల కాలంలో మంచన కేయూరబాహుచరిత్ర విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణి రచనలు చేయబడినా అవి తిక్కన తర్వాత వచ్చిన రచనలు కాబట్టి అవి తిక్కనయుగంలోనే చేరుతాయి.

శివకవులు వస్తువు ఛందస్సుల విషయంలో దేశీయతనభిమానించారు. సంస్కృత పురాణాల్లో వున్న శివభక్తుల కథలను కాక దక్షిణ దేశంలో అగ్రనిమ్నకులాల్లో వెలసిన శివభక్తుల కథలను తీసుకొని రచనలు చేసారు. పాల్కురికి సోమన బసవ పురాణం, పండితారాధ్య చరిత్రల్లో బసవేశ్వరుని పండితుని జీవితచరిత్రలను రచించాడు. కన్నడంలో సోమనాథుని జీవిత చరిత్ర కావ్యంగా యక్షగానంగాను అవతరించింది. ఈ యుగం చివర వైష్ణవం ప్రభావంతో రంగనాథ, భాస్కర రామాయణాలు వ్రాయబడినాయి. పాల్కురికి సోమన వేదశాస్త్ర పాండిత్య వైభవంతో వీరశైవం

వేదప్రామాణికతను సంతరించుకొని క్రమంగా శైవాగమాల రచనలతో తన ప్రచండ వీర రూపాన్ని వదిలి భక్తిమతంగా అర్చనలు పూజల ప్రాధాన్యంతో అవతరించింది.

ఆంధ్రదేశంలో శ్రీపతి పండితుడు (క్రీ.శ. 19వ) శివలెంక మంచన (క్రీ.శ. 11వ శకం) మల్లికార్జున పండితారాధ్యుడు (క్రీ.శ. 12వ శ.) వంటి పండితత్రయమేకాక సూరసానమ్మ, బెలిదేవ వేమనా రాధ్యుడు, వెల్లగుండ మహాదేవయ్య వంటి పరమశివభక్తులు ఆంధ్రదేశంలో వున్నట్లు పండితా రాధ్య చరిత్రవల్ల తెలుస్తున్నది. వాళ్ళు శివభక్తిని ప్రబోధించారు. వైదిక కర్మకాండలను సమర్థించలేదు. బౌద్ధ జైనాలను ఎదిరించి శివపారమ్యాన్ని చాటారు.

## శ్రీమతి పండితుడు

శ్రీపతి పండితుడు శివలెంక మంచన మల్లికార్జున పండిరాధ్యులకు పండిత్రయమని పేరు. శ్రీపతి పండితుడు బ్రహ్మసూత్రాలకు శైవపరంగా భాష్యాన్ని సంస్కృతంలో రచించాడు. దానికి శ్రీకర భాష్యమని పేరు. దానికి శివభక్తదీపిక అని కూడా పేరు. అది అలభ్యం. బెజవాడ ఇంద్ర కీలాద్రిపైన వైదిక బ్రాహ్మణులకు పవిత్రమైన అగ్నిహోత్రాన్ని ఉత్తరీయం కొంగులో మూటగట్టి అతడు శివపారమ్యాన్ని చాటాడట. పాల్కురికి సోమన అతన్ని తన అనుభవసారంలో కవిగా ప్రశంసించాడు. అతడు క్రీ.శ 9వ శతాబ్దంవాడని విమర్శకుల అభిప్రాయం.

## శివలెంక మంచన

మంచన కాశిలో మూడు పూటలా తన వ్రేళ్ళను శివుని కర్పించి తిరిగి పొందేవాడని గొప్ప భక్తుడని బసవపురాణంలో సోమనాథుడు ప్రశంసిం చాడు. మంచన శ్రుతిస్మృతి పురాణశాస్త్రాదుల్లో పండితుడు. శాస్త్రవాదంలో

పండితుల నోడించి శివమాహాత్మ్యాన్ని చాటి వాళ్ళందరి ముందు విష్ణువు చేత శివునికి మొక్కించాడట. కన్నడ సాహిత్యంలోను అతని ప్రశంస వుంది. అతడు రచించిన రచనలేవి దొరుకలేదు.

## మల్లికార్జున పండితారాధ్యుడు

మల్లికార్జునునికి పూర్వమే ఆంధ్రదేశంలో వేమనారాధ్యుడు, కోటిఫల ఆరాధ్యుడు వంటి శైవాచార్యులు గురువులున్నారు. వీరమాహేశ్వరాన్ని, బసవన్న వీరశైవం బోధనలతో చేర్చి పండితుడు శైవాన్ని ప్రబోధించాడు.

మల్లికార్జునుడు కోటిఫలి ఆరాధ్యుల (క్రీ.శ. 1080-1150) దగ్గర శివదీక్షను పొందాడు. పండితునిది దక్షారామం. దక్షారామం సమీపంలోనే కోటిఫలి వుంది. కోటిఫల ఆరాధ్యుడు రేవణారాధ్యుని కొడుకు. రేవణ చాళుక్య కన్య సోమలాదేవిని వివాహమాడాట. వాళ్ళ సంతానమే కోటిఫలి. రేవణ శిష్యుడు కాశీనాథుడు రాజరాజనరేంద్రుని గురువు అని పులివర్ర కైఫీయతులో వున్నదట. పండితారాధ్యుని తండ్రి భీమన. అతడు కుంతల బనవాసి నుంచి వచ్చిన 'వానస' వంశబ్రాహ్మణుడు. బనవాసి అన్న పేరే తెలుగులో వానసగా మారిందంటారు. నన్నయకు భారత రచనలో తోడ్పడిన నారాయణభట్టు వానస వంశంవాడే. వేంగిమండలం నుంచి పోయి వేములవాడ చాళుక్యుల ప్రాపున వున్న కన్నడ ఆదికవి పంపడు బనవాసివాడే. శ్రీపతి పండితుడు కూడా వానస వంశీయుడే అని అతడు వానస అనంతవాల దండనాయకుని ప్రాపున వున్నాడని విమర్శకుల అభిప్రాయం. మొత్తం మీద వేదపండితులైన 'వానస' వంశబ్రాహ్మణులు వేంగీమండలంలో స్థిరపడినారని తెలుస్తున్నది. వానస భీమన దక్షారామం భీమేశ్వరాలయంలో పూజారి. అతడు సంతానం లేక శ్రీశైల మల్లికార్జునున్ని

దర్శించి ఆరాధించగా మల్లికార్జునుడు పుట్టాడు. పండితునికి పుట్టుకతోనే కన్నడబాష వచ్చును. అతడు కన్నడంలో వ్రాసిన "సహస్రగణనామ" గ్రంథాన్ని పాల్కురికి సోమన విస్తరించాడు. అది కన్నడ దేశంలో బాగా ప్రచారంలో వుంది. మల్లికార్జున పండితుడు ఆరాధ్యుడుగా ప్రసిద్ధి చెందాడు. గొప్ప శివభక్తుడు ఎన్నో మహిమలను చూపాడని కథలున్నాయి. కన్నడ దేశంలో బసవన్నకున్న స్థానం తెలుగుదేశంలో పండితునికి వుంది. కాబట్టి సోమన బసవన్న చరిత్రను బసవ పురాణంగా, పండితుని చరిత్రను పండితారాధ్య చరిత్రగా ద్విపదకావ్యాలుగా రచించాడు. సోమన పండితున్ని ప్రతినిత్యం స్మరిస్తానని తన అనుభవసారంలో చెప్పాడు. అతని మీది భక్తి చేతనే అతని చరిత్రను కావ్యంగా వ్రాసి వుంటాడు. పండితుడు బసవన్నకు సమకాలికుడు. పోరండ్ల సూరసానమ్మ, బెల్దేవి వేమనారాధ్యుడు దక్షారామంలో పండితుని దగ్గరకు వచ్చి పండితుని శివభక్తికి జంగమారాధనకు సంతుష్టులై బసవేశ్వర సదృశ మూర్తిగా భావించి బసవన్నను గురించి అతనికి చెప్పారట. (బెల్దేవి వేమనారాధ్యుని సునుమని శిష్యుడు పాల్కురికి సోమన). అప్పుడు బసవన్నను దర్శించాలని పండితునికి కోరిక గలిగి ప్రయాణమయ్యాడు. దారి మధ్యలోనే బసవన్న నిర్యాణవార్త తెలిసింది. పండితుడు శిష్య బృందంతో శ్రీశైలం వెళ్ళాడు. వృద్ధాప్యంతో కొండ ఎక్కలేక తన శిష్యుని చేత కొండనెక్కించి మొక్కు చెల్లించుకొని అక్కడే మరణించాడు.

మల్లికార్జునుడు శిష్య బృందంతో సంచారం చేస్తు శివభక్తిని ప్రచారం చేసాడు. వెలనాటి రాజేంద్ర చోడుని (క్రీ.శ 1163-1180) ఆస్థానంలో వున్న బౌద్ధ గురువును ఓడించి శైవమత ప్రాశస్త్యాన్ని స్థాపించాడు. పండితుడు శివాంశ సంభూతుడుగా చెప్పబడినాడు. మల్లికార్జునుడు సంస్కృతాంధ్ర కర్ణాట భాషల్లో పండితుడు. సంస్కృతంలో రుద్ర మహిమ, అమరేశ్వరాష్టకం, లింగోద్భవ గద్యం, పంచగద్యాలను రచించాడు. కన్నడంలో

సహస్రగణనామ, బసవగీతం, ప్రభులింగ స్తోత్రాలను వ్రాసాడు. అతని తెలుగు రచనల్లో ఒక్క శివతత్త్వసారం దొరుకుతున్నది.

పండితారాధ్యున్ని పాల్కురికి సోమన శివకవి, కవిమల్లుడని కీర్తించాడు. పండితుని శివతత్త్వసారంలో 489 కంద పద్యాలున్నాయి. దానిలో శివభక్తుల మహిమలు శివుని లీలలు శైవమత సిద్ధాంతాలను వర్ణించాడు. అతడు చెప్పిన శైవమత సిద్ధాంతాలు వీరశైవమత సిద్ధాంతాలను పోలి వున్నాయి. దాన్ని బట్టి ఆంధ్రదేశంలో పుట్టిన శైవం వీరశైవంతో పండితుని కాలంలోనే ఐక్యమైందని చెప్పవచ్చును. వీరశైవులు జాతిభేదాన్ని పాటించలేదు. శివభక్తులకు ఎక్కువ గౌరవాన్ని ఇచ్చారు. పండితుడు అన్ని విషయాల్లో వీరశైవాన్ని అంగీకరించినా "భక్తి మీద వలపు బ్రాహ్మ్యంబుతో పొత్తు పాయలేను నేను బసవలింగ" అన్నాడు. అందుకే ఆంధ్రదేశంలో వీరశైవం బ్రాహ్మణుల్లో ఆరాధ్య శైవం పేరుతో వ్యాప్తి చెందింది.

పండితుని శివతత్త్వసారం శతకమని పాల్కురికి సోమన చెప్పాడు. తెలుగు సాహిత్యంలో ఇది మొదటి శతకమని అంటారు. కాని శతకానికి కావలసిన లక్షణాలన్నీ ఇందులో లేవని కొందరి అభిప్రాయం ఇందులో నూటికి మించి - దాదాపు 500 వరకు పద్యాలున్నాయి. కాని అన్నీ కందపద్యాలే అంటె శతకంలో ఒకే ఛందస్సు వుండాలనే లక్షణం పాటించబడింది. 489 పద్యాల్లో 191 పద్యాలకే మకుటం వుంది. ఆ మకుటం కూడా ఒక్కటి కాక హరా, శివా, అజా, మహేశా అని 28 రకాల శివసంబోధనతో కూడిన మకుటాలున్నాయి. ఈ రచనలో వస్తువు కూడా ఒక్కటిగాలేదు. శివభక్తుల మహిమలు, శివలీలలు శైవదీక్షా విధానాలు మొదలయినయి వున్నాయి. ఈ కారణాలచేత ఇది శతకం కాదని కొందరంటున్నారు. అన్ని శతకాల్లో సంఖ్యానియమం లేకపోవడం చేత

శతకంగా అంగీకరించవచ్చునని కొందరి అభిప్రాయం. శివతత్త్వసారంలో కవిత్వం పాలు కన్నా శైవ సంప్రదాయాన్ని గురించి చెప్పడమే ఎక్కువగా వుంది. శివదీక్ష పొందిన వాళ్ళు పాటించవలసిన ఆచారవ్యవహారాలు చెప్పబడినాయి. అద్వైతుల మాయావాదం ఖండింప బడింది. దీనిని శైవస్మృతి గ్రంథం అని అనడానికి తగివుంది. ఆరాధ్యులకు శివతత్త్వసారం ఒక ప్రామాణిక గ్రంథం. శివతత్త్వసారంలో ఇప్పుడు ప్రచారంలో లేని పదాలు కొన్ని అర్థం కాకుండా వున్నాయి.

## నన్నెచోడకవి

నన్నెచోడుని కుమారసంభవం కావ్యం నుంచి పద్యాల సంకలన గ్రంథాల్లో పద్యాలు కన్పిస్తున్నా క్రీ.శ. 1910 వరకు ఈ కావ్యం వెలుగులోకి రాలేదు. మానవల్లి రామకృష్ణకవి 1910లో కుమారసంభవంలోని 7 ఆశ్వాసాలను మొదటి భాగంగాను 1911లో మిగతా 5 ఆశ్వాసాలను రెండోభాగంగాను ప్రచురించాడు. ప్రచురిస్తూ కవిగారు నన్నెచోడుడు నన్నయకు పూర్వం క్రీ.శ. 940 వాడని ప్రకటించారు. దాంతో సాహిత్యలోకంలో సంచనలం చెలరేగింది. పండిత విమర్శకుల్లో నన్నెచోడుని కాలం గురించి తర్జన భర్జనలు జరిగాయి. కొందరు నన్నోచోడుడు నన్నయకు పూర్వుడని కొందరు సమకాలికుడని మరికొందరు నన్నయ తిక్కనల నడుమవాడని వాదించారు. చివరకు క్రీ.శ. 1250 నాటి పెద చెరుకూరు శాసనంలో కన్పించే నన్నెచోడుని వంశక్రమం ఆధారంగా నన్నెచోడుడు క్రీ.శ. 1120 ప్రాంతం వాడని జయంతి రామయ్య పంతులుగారు, వేటూరి ప్రభాకరశాస్త్రిగారు నిర్ణయించారు. ఆ కాలనిర్ణయమే ఎక్కువ మందికి అంగీకారయోగ్యంగా వుంది.

నన్నెచోడుడు కందుకూరి చోడవంశానికి చెందిన రాజు. పాకనాడును పశ్చిమ చాళుక్యులకు సామంతులుగా ఈ చోడ వంశీయులు పాలించారు. ఈ కవి తండ్రి చోడబల్లి. తల్లి శ్రీసతి హైహయవంశజ. తనకు టెంకణాదిత్యుడని బిరుదమున్నట్లు కవి చెప్పుకున్నాడు. నన్నెచోడుడు కుమారసంభవ కావ్యాన్ని తన గురువు జంగమ మల్లికార్జునునికి అంకితంగా ఇచ్చాడు. శివునికి జంగమ మల్లికార్జునునికి అభేదం చెప్తూ కావ్యంలో కవి విశేషణాలు వేసాడు. కృతినాయకునికి కృతి భర్తకభేదం చెప్పడం కన్నడ కావ్యాల్లో వుంది. జంగమ మల్లికార్జునుడు కాలాముఖశైవానికి చెందినవాడని కాబట్టి నన్నెచోడుడు వీరశైవుడుకాదని పండితుల అభిప్రాయం. కాని నన్నెచోడుడు శివుడు పరమదైవమని విశ్వసించాడు. శైవులు దక్షాధ్వరధ్వంస వృత్తాంతాన్ని చాల అభిమానంగా చెప్పుకుంటారు. శివుని పారమ్యాన్ని చెప్పే దక్షాధ్వర వృత్తాంతాన్ని కవి అన్యదేవతా హేళనతో వ్రాసాడు. దక్షుడు చేసిన శివప్రస్తుతిని నన్నెచోడుడు 3 లయ గ్రాహి 2 లయహారి వృత్తాల్లో భక్త్యావేశ పూరితంగా రచించాడు.

నన్నెచోడుని కుమారసంభవం కావ్యం పేరు వినగానే కాళిదాసు కుమార సంభవం గుర్తుకు వస్తుంది. కాళిదాసు కథా సంవిధానాన్నే నన్నెచోడుడు చాలా మట్టుకు తీసుకున్నా కాళిదాసు కావ్యంలో లేని కథలనెన్నో నన్నెచోడుడు తన కావ్యంలో చేర్చాడు. నన్నెచోడుని కావ్యకథకు మూలం బ్రహ్మాండ పురాణ కథ అని కొందరు అభిప్రాయపడినారు. కావ్యప్రారంభంలో సతీదేవిని శివుడు వివాహమాడడం గజరూపధారులై క్రీడించగా వారికి గజాననుడు జన్మించడం దక్షాధ్వరధ్వంసం మొదలైన ఘట్టాలను నన్నెచోడుడు పురాణాల నుంచి లోకంలో వ్యాప్తిలో వున్న కథల నుంచి తీసుకొని రమ్యంగా రచించాడు. ఇవి కాళిదాసు కుమార సంభవంలో లేవు. మూడో ఆశ్వాసం నుంచి నన్నెచోడుడు కాళిదాసు కుమార సంభవం కథాక్రమాన్ని అనుసరించినా శివుని తపోభంగం చేయడానికి వెళ్ళే

మన్మథున్ని రతిదేవి శివుని మహిమను చెప్పి వారించడం మన్మథుడు శివుని మూడోకన్ను మంటల్లో బూడిదైనపుడు రతీదేవి విలాపం మొదలైన ఘట్టాలను నన్నెచోడుడు స్వతంత్రంగా కల్పన చేసాడు. కాళిదాసు భావాలను అక్కడక్కడ నన్నెచోడుడు తీసుకొని అనువదించినా అతని కావ్యం స్వతంత్ర కల్పనలతో కూడిన కావ్యమనే చెప్పాలి.

నన్నెచోడుని కుమారసంభవం వర్ణనలు వక్రోక్తులు ఆలంకారిక శైలితో కూడి వుండి తెలుగులో మొట్టమొదటి ప్రబంధమనడానికి తగివున్నది. క్రీ.శ. 16 వ శ.లోని ప్రబంధాల్లో వలె కావ్యేతివృత్తం కూడా స్వతంత్రంగా వున్నది. నన్నెచోడుని శైలి రమ్యంగా ప్రౌఢంగా వుంది. క్రీ.శ 12 వ శ. ఆరంభంలో తెలుగులో కుమారసంభవం వంటి ఉత్తమ ప్రబంధలక్షణాలు కలిగిన రచన జరిగినా ఆధునిక కాలం వరకు దానికి తగిన గుర్తింపు రాలేదు. నన్నెచోడుడు శైవుడు కావడమే దానికి కారణం కావచ్చును.

కన్నడంలో క్రీ.శ. 9,10 శ.ల్లోనే విక్రమార్జున విజయం గదాయుద్ధం వంటి ఉత్తమ కవిత్వంగల కావ్యాలు రచింపబడనాయి. ఆ కావ్యాలను ఆదర్శంగా తీసుకునే నన్నెచోడుడు తెలుగులో శివపారమ్యాన్ని చెప్పే కథతో ఈ కావ్యాన్ని రచించి వుంటాడు. ఇటువంటి కావ్యరచనా పద్ధతి తెలుగులో ఆగిపోయి తిరిగి రాయలకాలంలో ప్రబంధరచనగా పుంజుకొన్నది.

## కుమారసంభవంలో ప్రబంధలక్షణాలు

కుమారసంభవం ఇతివృత్తం పురాణాలనుంచి లోకకథలనుంచి కాళిదాసు కుమార సంభవం నుంచి తీసుకోబడినా స్వతంత్రంగా నడిచింది. కథ ఏకనాయకాశ్రయంగా కుమార సంభవం తారకాసురవధ ఫలోమ్ముఖంగా నడిచింది. ప్రబంధోచితమైన అష్టాదశవర్ణనలు సందర్భానుకూలంగా వున్నాయి. వర్ణనలు

చక్కని భావ ప్రకటనలతో రమ్యంగా వున్నాయి. "విస్తరించెద ప్రబంధము సద్రసంబంధురంబుగాన్" (1-48) అని అన్నాడు కవి. శైలి గంభీరంగా ఉక్తివైచిత్రులతో రసవంతంగా వుంది. నన్నెచోడుడు వస్తు కవితకు భారవిని ప్రస్తుతించి తనది వస్తుకవిత అని "జంగమ మల్లయ వరము నందు గనిన వస్తు కవిత" అని చెప్పుకున్నాడు. కన్నడ సాహిత్యంలో వస్తు విస్తరరచన, వస్తువిద్య, వస్తుకవి, వస్తుకృతి అనే పద ప్రయోగాలున్నాయి. వస్తుకవిత అంటె ఆలంకారిక శైలితో వర్ణనలతో స్వతంత్రమైన కథాసంవిధానంతో కూడిన కవిత్వమని పండితుల అభిప్రాయం. కాళిదాసు మహాకావ్యాల్లో కన్నా భారవికిరాతార్జునీయం వస్త్వైక్యం సందర్భోచిత విస్తృత వర్ణనలు భావాలంకార వైచిత్రులు అంగి అంగరసాల సమావేశంతో కూడి సంపూర్ణ మహాకావ్య లక్షణాలతో వుంది. నన్నెచోడుడు తనది అటువంటి కావ్యమని అదే వస్తుకవిత అని విశేషంగా భారవిని ప్రస్తుతించివుంటాడు. "వస్తు కావ్యాబ్జరవి" అని వాల్మీకిని నన్నెచోడుడు ప్రస్తుతించాడు. మహాకావ్య ప్రక్రియకు ఆదికవి వాల్మీకియే కాబట్టి నన్నెచోడకవి అతన్ని ప్రస్తుతించి వుంటాడు. "వస్త్వైక్యమున కొంత లోపమున్నా కుమారసంభవమే యథార్థముగా మన ప్రథమ ప్రబంధ"మని పింగళి లక్ష్మీకాంతంగారి అభిప్రాయం.

నన్నెచోడుడు తనది జాను తెనుగు అని చెప్పుకున్నాడు "సరళముగాగ భావములు జాను తెనుంగున నింపుపెంపుతో బిరిగొన వర్ణనల్" సరళమైన భావాలను వర్ణనలను జానుతెనుగులో వ్రాస్తానన్నాడు అతడు జాను తెనుగు అంటె జనులవాడకలోవున్న తెలుగని అంటె దేశీయమైన పద సంపదతో కూడిన తెలుగు అని పండితులు అర్థం చెప్పారు. పాల్కురికి సోమన వృషాధిప శతకంలో జానుతెనుగుకు ఉదాహరణగా రచించిన పద్యాన్ని బట్టి ఈ అర్థం సరియైందని తెలుస్తున్నది. కన్నడంలో జాణ్ణుడి - అని దేశీయతనభిమానించిన రచన అని అర్థం చెప్పబడుతున్నది. జాణ్ణుడియే తెలుగులో జానుతెనుగు అయిందేమో. నన్నెచోడుడు వాడిన తెనుగు

పదాలు కొన్ని ఇప్పుడు మనకర్థం కావు. అవి ఆనాడు లోక వ్యవహారంలో వున్న పదాలు కావచ్చును. ఆ పదాలకు ఆధునిక నిఘంటుకారులు అర్థాలనియ్యలేదు. దాంతో నన్నెచోడుని కవిత్వం కొన్ని చోట్ల అర్థంకాకుండా వుంది. నన్నెచోడుడు కావ్యానతారికలో కవిత్వమంటె ఎంట్లా వుండాలో చెప్పాడు. కుకవినంద సుకవిప్రశంస పూర్వకవి ప్రస్తుతి షష్ట్యాంతాలను రచించాడు. ఈ అంశాలను తర్వాత తిక్కనాది కవులు అనుసరించి తమ కావ్యాతారికలో రచించారు.

## పాల్కురికి సోమనాథుడు

పాల్కురికి సోమన శివకవుల్లో ప్రసిద్ధమైనవాడు. ఆంధ్రదేశంలోనే కాక అతనికి కన్నడ దేశంలోను పేరున్నది. ఈ కవి ఓరుగల్లు సమీపంలో ఈనాటి జనగామ ప్రాంతంలోని పాలకుర్కి గ్రామవాసి. సోమన తెలుగులో బసవపురాణం, పండితారాధ్య చరిత్ర అనే ద్విపకావ్యాలను అనుభవసారం, బసవోదాహరణం, చెన్నమల్లు సీసాలు, పంచప్రకార గద్య, అక్షరాంక గద్య, అష్టోత్తర నామ గద్య, శరణుబసవ గద్య, బసవరగడ, బసవాద్య రగడ, గంగోత్పత్తి రగడ, బసవోదాహరణం, అక్షరాంక పద్యాలు, అష్టకం, సోమ నాథస్తవం అనే లఘుకృతులను వృషాధిపశతకం, బసవలింగ శతకం (దీనికి చతుర్వేద సారమని పేరు. 357 సీసపద్యాలున్నాయి) అనే శతక కావ్యాలను వ్రాసాడు. సంస్కృతంలో సోమనాథ భాష్యం, రుద్రభాష్యం, త్రివిధ లింగాష్టకం వ్రాసాడు. సోమనాథ భాష్యం 25 ప్రకరణాల గ్రంథం దీనిలో శ్రుతి స్మృతి ప్రమాణాలలో శివపారమ్యాన్ని సోమన నిరూపించాడు. రుద్రభాష్యం యజుర్వేదంలోని రుద్రాధ్యాయానికి భాష్యం. ఇది అలభ్యం కన్నడ భాషలో సోమన వ్రాసిన సద్గురు రగడ, చెన్న బసవరగడ, అక్షరాంక పద్యాలు, శరణుబసవరగడ, బసవలింగనామావళి, శీల సంపాదనం, శివగణ సహస్రమాల అనే లఘు కృతులు లభిస్తున్నాయి. రగడ, గద్య ప్రక్రియల్లో

కన్నడ కవులు ముఖ్యంగా శివకవులు లఘుకృతులను చాల రచించారు. ప్రసిద్ధ కన్నడ శివకవి హరిహరుడు వందలకొద్ది రగడలు వ్రాయడం చేత అతనికి "రగళెయ కవి" (రగడకవి) అని పేరు వచ్చింది. కన్నడ కవులభిమానించిన రగడలో సోమన తెలుగు కన్నడ కృతులను వ్రాసాడు.

పాల్కురికి సోమన లఘుకృతుల కన్నా ద్విపదకావ్యాలు శతకాలు తెలుగులో అతనికి పేరు తెచ్చాయి. వీరశైవమతాచార్యుడు బసవన చరిత్రను సోమన "బసవ పురాణం" గా వ్రాసాడు. జైనులు తీర్థంకరుల చరిత్రలను వ్రాసి వాటిని "పురాణం" అని అన్నారు. హిందువులకు అష్టాదశపురాణాలున్నాయి. జైనులకు చతుర్వింశతి పురాణాలున్నాయి. కన్నడ భాషలో పంపకవి ఆదిపురాణం పొన్నకవి శాంతి పురాణం రన్నకవి అజిత పురాణం రచించారు. ఆ సంప్రదాయాన్ననుసరించి సోమన బసవన చరిత్రను "బసవపురాణం" అని పేరు పెట్టి బసవన్నను ఒక పురాణపురుషునిగా నిలబెట్టాడు. బసవపురాణ వస్తువును కథాకోవిదులైన వృద్ధులనుంచి, బసవన స్వయంగా కన్నడంలో రచించిన వచనాల నుంచి తీసుకున్నట్లుగా సోమన చెప్పాడు. ఆ కావ్యంలో బసవనచరిత్రలో పాటు తమిళ కన్నడ ఆంధ్ర మహారాష్ట్ర ప్రాంతాలకు చెందిన 75 మంది శివభక్తుల కథలను వర్ణించాడు. ఆ కావ్యంలో 6288 ద్విపదాలున్నాయి. బసవపురాణం క్రీ.శ. 1369లో కన్నడంలోకి అనువదింపబడింది. తర్వాత 50 సంవత్సరాలకు శంకరారాధ్యుడు సంస్కృతంలోకి అనువదించాడు. శంకరారాధ్యుడు తనను తాను ప్రమథకవి అని చెప్పుకున్నాడు. ప్రమథకవి అంటె శివకవి అని విమర్శకుల అభిప్రాయం. శంకరారాధ్యుడు పెద్దకోమటి వేమారెడ్డి నైషధకృతిభర్త సింగనకు గురువు అని నిడదవోలు శివసుందరేశ్వరరావు గారి అభిప్రాయం. సంస్కృత బసవపురాణానికి గురుపాదుడు కన్నడటీకను క్రీ.శ. 1529 లో వ్రాసాడు.

సోమన పండితారాధ్యచరిత్రలో మల్లికార్జున పండితారాధ్యుని చరిత్రను కూర్చాడు. దీనిలోను అక్కడక్కడ శివభక్తుల చరిత్రలు వర్ణింపబడినాయి. సోమన పండితారాధ్య చరిత్రను తర్వాత శ్రీనాథుడు చంపువుగా రచించాడు. కాని అది దొరకలేదు. సోమన పండితారాధ్య చరిత్రలోని పర్వత ప్రకరణాన్ని తీసుకొని నాగులూరి శేషారాధ్యుడు పర్వత పురాణంగా వ్రాసాడు. గురురాజకవి పండితారాధ్యచరిత్రకావ్యాన్ని సంస్కృతీకరించాడు.

సోమన బసవపురాణం పండితారాధ్య చరిత్రల్లోని ఇతివృత్తం దేశీయమైంది. కన్నడ ఆంధ్రప్రాంతాల్లో పుట్టిన వ్యక్తుల, శివభక్తుల కథలను వాటిల్లో చెప్పాడు. ఛందస్సు కూడా ద్విపద - దేశీయమైంది. సోమన ఇతర లఘురచనల్లోని ఇత్తివృత్తాలు కూడా దేశీయమైనయి. అతని భావానుభూతులు భక్త్యనుభూతులు ఆవేశభరితమైనయి. సోమన పరమ వీరశైవాచార సంపన్నుడు "భవిజన సమాదరణ సంభాషణాది సంవర్గదూర గుడ"నని బసవపురాణంలో చెప్పుకున్నాడు.

భవి హస్తగత ఫలపత్త్రి శాకాది
భవి గృహక్షేత్రాది పథ వర్జితుండ
భవిజన దర్శన స్పర్శనాలాప
వివిధ దానాదాన విషయ దూరగుడ

నని సోమన పండితారాధ్యచరిత్రలో చెప్పుకున్నాడు. శైవులు కాని వారు "భవులు, భవిజను"లని శైవేతర కవులు "భవికవు"లని వీరశైవులు పిలిచారు. పరమతసహనం లేకపోవడం వల్లనోయేమో భవికవులు శివకవులను

సోమన రచనల్లో భక్త్యావేశం శివపక్షపాతంతో కూడిన మతోద్రేకం కన్పిస్తున్నది. ఆ కవి తన రచనల్లో శ్రుతిస్మృతి. పురాణాల్లోని ప్రమాణాలతో

శివపారమ్యాన్ని చెప్పాడు. శివభక్తుల కథలను చెప్పడం పరమతఖండనం చేసి శైవమత ఉత్కృష్టతను ప్రతిపాదించడం చేసాడు. సోమన సంస్కృతాంధ్ర కన్నడ మరాఠీ మొదలయిన అనేక భాషల్లో పాండిత్యం కలవాడు. "ఉరుతర గద్యపద్యోక్తులకంటె సరసమై పరిగిన జాను తెనుంగు, చర్చింపగా సర్వసామాన్యమగుట కూర్చెద ద్విపదల కోర్కి దైవార" అని ప్రజాసామాన్య భాష జానుతెనుగులో వ్రాస్తానని అన్నా పాండిత్య ప్రౌఢి భక్త్యావేశాలతో ఆ మాటను నిలబెట్టుకోలేక పోయాడు. కవితావేశంతో సంస్కృత భూయిష్టంగా రచించాడు. సోమన ద్విపదలను పాఠకులకు విసుగు కలిగించకుండా ఉరకలవేసే శైలిలో రమ్యంగా రచించాడు. సందర్భోచితమైన వర్ణనలతో సోమన కవిత్వం సరసంగా సాగింది. సంగయ్య, బెజ్జమహాదేవి, గొడగూచి, కన్నప్ప, మాదిరాజయ్య, మడివాలు మాచయ్య మొదలయిన భక్తుల కథలను సోమన రసవంతంగా వ్రాసాడు. ఈ కథల్లో మూఢవాత్సల్యాది భక్తివిశేషాలను కవి చక్కగా ప్రస్తుతీకరించాడు.

సోమన వృషాధిపశతకం సమస్త శతకలక్షణాలు గల మొదటి శతకం. వృషాధిపా మకుటంతో 108 పద్యాలున్నాయి. సోమన భక్త్యావేశంతో జలపాతంలాగా ఉరకలు వేసే శైలిలో ఈ పద్యాలను వ్రాసాడు. సోమన ద్విపదలనెంత సమర్థవంతంగా వ్రాయగలడో వృత్తాలనంతే సమర్థవంతంగా వ్రాయగలడని ఈ కావ్యం వల్ల తెలుస్తున్నది. ఈ శతకం ఒక్క వృత్తంలో కాక చంపక ఉత్పలమాలలు రెండు వృత్తాల్లో నడిచింది. సోమన శబ్దాలంకారాలను చక్కగా ప్రయోగించి ఈ పద్యాలను వ్రాసాడు.

సోమనాథుని అనుభవసారం విశిష్టమైన లఘుకావ్యం. దీనిలో 243 పద్యాలున్నాయి. దీనిలో గురుభక్తి మహిమ, భక్తి స్వరూపం, భక్తుని లక్షణాలు, శివపూజా పద్ధతి, ఇష్టలింగార్చనావిధి, జంగమ సేవ మొదలయిన వీరశైవధర్మాలు వివరింపబడినాయి. ఇది పండితారాధ్యుని శివతత్త్వసారాన్ని

అనుసరిస్తున్నది. పండితారాధ్యుడంటే సోమనకు చాలా భక్తి "శివుని మహిమ దెల్పినట్టి మల్లికార్జున పండితయ్యగారి తలతు ననుదినంబు" అంటాడు. ఈ కావ్యంలో సోమన కందం తరువోజ క్రౌంచపదం మాలిని వనమ యూరి వంటి ఛందస్సులను వాడాడు. చతుర్విధ కందమన్న పేరుతో సోమన చిత్రకవిత్వాన్ని రుచి చూపించాడు.

సోమన కన్నడ భాషలో వ్రాసిన "దశవిధ పాదోదక వివర, బసవరగళె, సద్గురు రగళె, అక్షరమాలకాగద్య నమస్కారగద్య, అష్టోత్తర శతనామగద్య, పంచ ప్రకారగద్య, మంగళాష్టక మొదలయిన రచనలు కన్నడదేశంలో బాగా ప్రచారంలో వున్నాయి. "సోమనాథ భాష్యం" సోమన సంస్కృత రచన. ఇది శైవ విజ్ఞానసర్వస్వం. దీనికి మనోహరీయమనే తెలుగు వ్యాఖ్యానం అసంపూర్ణంగా వుండి దొరుకుతున్నది. కన్నడటీక కూడా వుంది. సోమన బసవపురాణం 14వ శ.లో భీమకవి చేత కన్నడంలో అనువదింపబడింది. పండితారాధ్య చరిత్ర కూడా కన్నడంలోకి అనువదింపబడింది. సోమన తన రగడాది రచనా సరణితో బసవపురాణాది అనువాద కావ్యాలతో కన్నడ కవులను కూడా ప్రభావితం చేసాడు అంటారు.

పాల్కురికి సోమన కాలాన్ని గురించి అభిప్రాయభేదాలున్నాయి. కొందరు విమర్శకులు సోమన నన్నయ తిక్కనల నడిమికాలం వాడని బహుశా మొదట ప్రతాపరుద్రుని (క్రీ.శ. 1158-1195) కాలంవాడని అంటారు. సోమన ప్రచారం చేసిన శివపారమ్యం వల్లనే శైవులకు వైష్ణవులకు మధ్య అసహనం ఏర్పడి మతకల్లోలాలు కొట్లాటలు బయలుదేరాయని ఆ పరిస్థితులను అణచి శాంతిని నెలకొల్పడానికి తిక్కన హరిహరాద్వైతాన్ని బోధించాడని వాళ్ళంటారు. మరో విమర్శకులు సోమన తిక్కన తరువాతవాడని రెండో ప్రతాపరుద్రుని (క్రీ.శ. 1289-1323) కాలం వాడని అంటారు. మొదటివాదాన్ని అంగీకరించినట్లయితే సోమన

దాదాపు బసవనకు సమకాలికుడవుతాడు. బసవనకే కాక పండితారాధ్యునికి కూడా [illegible]న సమకాలికుడవుతాడు. అట్లా సమకాలికుల చరిత్రలను కావ్యాలుగా వ్రాసాడనే దాని కంటె సోమన తర్వాత కాలంలో వుండి వాళ్ళ చరిత్రలను వ్రాసాడనడం సహజంగా సమంజసంగా వుంటుంది. అంటే మతసామరస్యాన్ని బోధిస్తూ హరిహరాద్వైతాన్ని చెప్పిన తిక్కన తర్వాత కూడా వీరశైవం ఆంధ్రదేశంలో ప్రబలివుందని తెలుస్తున్నది. పాల్కురికి సోమన సోమనాథబాష్యం రుద్రభాష్యం వ్రాసి వీరశైవాన్ని, వీర మాహేశ్వరాన్ని వైదికబద్ధం చేసింతర్వాత ఎర్రన శ్రీనాథ పోతనల కాలంలో వీరశైవం కేవలం శైవంగా శివభక్తితత్పరమైన పూజార్చన రూపంగా మారి పౌరాణిక బ్రాహ్మణమతంలో విలీనమైంది. ఆ కాలంలోనే ఆంధ్రదేశంలో వీరశైవం దాదాపుగా అంతరించిపోయిందని చెప్పాలి.

తిక్కన హరిహరాద్వైతాన్ని బోధిస్తే తిక్కన తర్వాత సోమన వీరశైవాన్ని వేద ప్రామాణికం చేసి నిలబెట్టాడు. జైనమతాన్ని పారదోలేందుకు బయలుదేరిన వీరశైవంలో జైనసిద్ధాంతాల ప్రభావం కన్పిస్తున్నది. జైనులు తీర్థంకరులను పూజిస్తే వీరశైవులు శివున్ని శివభక్తులను పూజించారు. జైనులలాగానే వీరశైవులు వర్ణబేధాన్ని నిరసించారు. వైదిక కర్మకాండలను పాటించలేదు. యజ్ఞోపవీతాది ధారణలను వ్యతిరేకించి లింగధారణ చేసారు. వేదశాస్త్రాలకన్న శివుని కథలను లీలలను శివభక్తుల మహిమలను అభిమానించారు. వీరశైవులు కాయకష్టానికి ప్రాధాన్యమిచ్చారు. కాయకష్టాన్ని భగవత్స్వరూపంగా తలిచారు. స్త్రీలకు పురుషులతో అన్ని విషయాల్లో సమానతను ఇచ్చారు. స్త్రీ శివభక్తురాలయితే భర్త శివవిద్వేషి అయినప్పుడు భార్య భర్తను వదిలివేయవచ్చునన్నారు. స్త్రీ వేదాంతాది చర్చల్లో పాల్గొనే హక్కును ఇచ్చారు. అట్లా వీరశైవం వైదిక మూఢాచారాలకు వ్యతిరేకంగా లేచిన తిరుగుబాటు ఉద్యమంగా బయలుదేరి జైన బౌద్ధవైదిక మతాలను ఎదిరించి పారదోలే ప్రయత్నం చేసింది. అటువంటప్పుడు సోమనాథుడు

వీరశైవానికి వైదిక ప్రామాణ్యాన్ని కల్పించి అది అవైదిక నాస్తికమతం కాకుండా రక్షించాడు. అందుకే వీరశైవమతంలో అతనికి గొప్ప స్థానం ఏర్పడింది. కన్నడ వీరశైవ కవులతన్ని భృంగి అవతారంగా పురాణ పురుషునిగా కీర్తించారు. అతని చరిత్రను కన్నడభాషలో "పాల్కురికి సోమేశ్వర చరిత్ర" పేరుతో తోంటదార్య కవి కావ్యంగాను మల్లికార్జున కవి యక్షగానంగాను వ్రాసారు.

కన్నడ సాహిత్య చరిత్రకారులు కన్నడ వీరశైవకవి రాఘవాంకుడు సోమన - ఇద్దరూ రెండవ ప్రతాపరుద్రుని కాలంలో ఓరుగల్లులో వున్నారని మహమ్మదీయుల దండయాత్రల సమయంలో రెండవ ప్రతాపరుద్రుడు బందీ అయినప్పుడు ఆ అరాచక పరిస్థితుల్లో ఓరుగల్లును విడిచిపెట్టి కన్నడ దేశానికి పారిపోయారని సోమన అక్కడే కల్యా అనే చోట లింగైక్యం చెందాడని వ్రాస్తున్నారు. దాని ప్రకారం సోమన తిక్కన తర్వాత వున్నాడని తెలుస్తున్నది. అప్పటికి వీరశైవంలో వీరావేశం తగ్గింది. అప్పుడే సోమన వీరశైవాన్ని వైదికబద్ధం శాస్త్రబద్ధం చేసాడు. వీరశైవం జైనం లాగానే నాస్తికమతం వైదికవిదూరమైన .మతం కాకుండా సోమన కాపాడాడు. కవిగానే కాక సోమనకు ఆ కారణంచేత కూడా కన్నడదేశంలో కీర్తి గౌరవాలు లభించాయి.

## యథావాక్కుల అన్నమయ్య

ఈ కవి సర్వేశ్వర శతకం వ్రాసాడు. దీనిలో 142 మత్తేభశార్దూల వృత్తాలున్నాయి. సర్వేశ్వర మకుటం వుంది. శివభక్తి ప్రభావం భక్తుల మహిమలు వర్ణింపబడినాయి. శైలి ధారాళంగా వుంది.

## చక్రపాణి రంగన

రంగన రంగనాథరామాయణ కర్తగా భావింపబడినాడు. కాని పరిశోధన లతో ఈ రంగన వేరే అని తేలింది. ఈ కవి మొదట వైష్ణవుడుగా వుండి పాల్కురికి సోమనాథునితో శాస్త్రవాదంలో ఓడిపోయి శైవదీక్ష పొందాడని ఐతిహ్యం. నయనరగడ, నమశ్శివాయ రగడ మొదలయిన ముక్తకాలను రచించాడు. శరభలీల మొదలయిన కావ్యాలను రంగన రచించాడు. కాని అవేవి ఇప్పుడు లభించడం లేదు. వైష్ణవుడుగా వున్నప్పుడు శ్రీశైల మార్గంలో పోతూ మల్లికార్జునుని సందర్శించక పోవడంతో గుడ్డివాడయ్యాడని తర్వాత సోమనాథుని దయవల్ల కనుచూపు పొంది నయనరగడ రచించాడట. ఈ రగడలో ప్రతిపాదం చివర "కంటి" అనే పదం వుంది.

## శివకవుల కవితావైశిష్ట్యం - దేశికవితోద్యమం

శివకవులు శివుడే పరమదైవమని విశ్వసించారు. శివభక్తిని శివభక్తుల మహిమలను శైవసిద్ధాంతాలను శైవాచారాలను వర్ణిస్తూ ఈ కవులు రచనలు చేసారు. శివకవులు రాజులనాశ్రయించలేదు. రాజుల ఆదరణ పోషణలు లేకుండా వాళ్ళు విశృంఖలులై రచనలు చేసారు. ప్రజల భాషలోనే ప్రజలకోసమే శైవధర్మ ప్రచారం కోసమే వాళ్ళు సాహిత్యాన్ని సృష్టించారు. అందుకే వాళ్ళ కవిత్వంతో ఆవేశం అనుభూతుల వ్యక్తీకరణ కన్పిస్తాయి. రాజుల అంకుశం లేకుండానే స్వంతంత్రంగా వాళ్ళు సాహిత్యోద్యమాన్ని నడిపారు. పరమత అసహనం వాళ్ళను వీరావేశితులను చేసింది. తిరుగుబాటు వీరావేశం కేవలం మతవిషయంలోనే కాక వాళ్ళు సాహిత్యంలోను చూపి దేశకవితోద్యమాన్ని నడిపారు. "మార్గ"ను వస్తు విషయంలోగాని ప్రక్రియవిషయంలోగాని స్వీకరించలేదు. అందుకే నన్నయ భారతం, నన్నయ కవితామార్గం ఈ యుగంలో అనుయాయులు లేక

కొనసాగలేదు.

శివకవులు కవిత్వంలో విశిష్టప్రయోగాలు చేసారు. వాటిని గురించి గాని ఆ కవులను గురించి గాని తర్వాత కవులు ప్రశంసించలేదు. ప్రస్తావించలేదు. అందుకే ఆధునిక యుగంలో పరిశోధనల వల్లనే వాళ్ళను గురించి సాహితీలోకానికి తెలిసింది. శివకవుల ప్రభావం ముద్ర మాత్రం తర్వాత కవుల మీద చాల పడింది. దాని అంచనా అంతా ఆధునిక కాలంలోనే జరిగింది. శివకవుల దేశీయాభిమానంతో కూడిన సాహిత్యోద్యమం విలువకట్టడం జరిగింది.

తెలుగులో దేశి, మార్గ భేదాలని రెండు వున్నాయి. మార్గ అనేది సంస్కృత సంప్రదాయాన్ని లక్షణాలను అనుసరించింది. కవిత్వంలో సంస్కృత సాహిత్యంలోని వస్తువు భాష ఛందస్సు భావప్రకటనలు లాక్షణిక లక్షణాలను అనుసరించేది మార్గ కవిత్వమనబడుతుంది. దీనికి భిన్నంగా దేశీయమైన వస్తువు ఛందస్సు నుడికారాలను అనుసరించేది దేశికవిత్వం. కవిత్వంలో జాతి జీవనాడి ప్రతిస్పందిస్తుంది. తెలుగులో నన్నయకు పూర్వం దేశి కవిత్వముంది. పాల్కురికి సోమనాథుడు తన పండితారాధ్య చరిత్రలో పండితుని శిష్యులు తుమ్మెద పదాలు, నివాళి పదాలు, వాలేశుపదాలు, గొబ్బిపదాలు, వెన్నెల పదాలు, సంజవర్ణన మణిగణ వర్ణన పదాలు పాడుతూ వెలనాటి చోడుని సభకు పోయినట్లుగా వర్ణించాడు. ఇంకా సోమన దేశినాటక ప్రదర్శనలను ఆనందగీతాలు శంకరగీతాలను గురించి చెప్పాడు. నన్నెచోడకవి కూడా ఊయల పాటలు గౌడు గీతాలను రాగయుక్త గేయాలను అభినయంతో కూడిన "అలతు"లను పేర్కొన్నాడు. దీన్ని బట్టి నన్నయకు పూర్వమే తెలుగులో పదాలు పాటలు గేయాల రూపంలో దేశికవిత్వం వుందని అది తెలుగువారి హృదయజనితమైన నిసర్గమైన మౌలికమైన భావాలతో నిత్యజీవితంలోని సంఘటనల చేత స్పందితులై వ్రాసిందని చెప్పవచ్చును. సంస్కృత మార్గాన్ననుసరించిన

మార్గ పద్ధతిని శివకవులు నిరసించారు. నన్నెచోడుడు "మార్గ కు మార్గము" అని మార్గ కవితా మార్గాన్ని నిరసించాడు. మార్గను నిరసించి శివకవులు దేశీయతనభిమానించి ఆమోదించారు. వారి దేశీయతను వస్తువు ఛందస్సు భాష విషయంలో ప్రధానంగా చూడవచ్చును.

1) **వస్తువు** – సంస్కృత పురాణేతిహాసాలను అనువాదం చేయడం వాటి నుంచి కథావస్తువులను తీసుకోడం శివకవులు ఇష్టపడలేదు. ఎక్కడో ఎప్పుడో జరిగిన సంస్కృత కావ్యాలను తెలుగులో వ్రాయడాన్ని వాళ్ళు గర్హించారు. అందుకే వాళ్ళు ప్రాంతీయమైన తమ దేశంలో పుట్టి పెరిగిన మహాపురుషుల మత ప్రవక్తల చరిత్రలను తీసుకొని కావ్యాలు వ్రాసారు. సోమనాథుని బసవపురాణం పండితారాధ్య చరిత్రలు ఇటువంటివే. ఇంకా ఆకావ్యాల్లో వర్ణించిన బెజ్జమహాదేవి గొడగూచి కుమ్మర గుండయ్య కక్కయ్య మడివాలు మాచయ్య కన్నప్ప సంగయ్య దుగ్గవ్వ వంటి భక్తుల కథలు కూడా ప్రాంతీయమైనయి. బసవన్న పండితారాధ్యుని వంటి మహాపురుషులు ఆంధ్రకర్నాటక ప్రాంతాల వాళ్ళు. కవికి కొంచెం ముందు కాలంలోని వాళ్ళు ఎప్పుడో ఎక్కడో జరిగిన భాగవతాది పురాణాల్లోని కథలవంటివి కావు ఇవి. నన్నెచోడుని వంటి కవులు పురాణ ప్రసిద్ధమైన కథను తీసుకున్నా దేశీయమైన ప్రజల నోళ్ళల్లో పుట్టిపెరిగిన కథలను వృత్తాంతాలను చేర్చారు. ఉదా.కు శివుని తపోభంగం చేయడానికి వెళ్ళే మన్మథున్ని రతి శివుని మహిమను చెప్పి నివారించడం, సతీదేవి శివుడు గజరూపంలో క్రీడించగా గజాననుడు పుట్టాడనడం దక్షాధ్వరధ్వంస వృత్తాంతం దక్షిణ భారతంలో వ్యాప్తిలో వున్నాయి. నన్నెచోడుడు కుమారసంభవ కావ్యాన్ని సంస్కృతానువాదంగా కాక స్వతంత్రంగా వర్ణనలతో ఆలంకారిక శైలితో సన్నివేశ కల్పనలతో రచించాడు.

శివకవుల దేశీయత చేత ప్రభావితుడై గోనబుద్ధ భూపతి రంగనాథ

రామాయణంలో దేశంలో వ్యాప్తిలో వున్న కథలను అవాల్మీకాలైనవెన్నో చేర్చి రచించి దేశీయతాముద్ర వేసాడు.

ఛందస్సు - నన్నయకు పూర్వం తెలుగులో తరువోజ, మధ్యాక్కర, సీసం, ఆటవెలది, తేటగీతి, కందం, రగడ మొదలయిన దేశి ఛందస్సులు వ్యాప్తిలో వున్నట్లు శాసనాల వల్ల తెలుస్తున్నది. నన్నయ భారతంలో దేశి మార్గ ఛందస్సులను వాడాడు. చంపూ పద్ధతిలో వ్రాసాడు. శివకవులు చంపూ పద్ధతిని ఆదరించలేదు. దేశి ఛందస్సులనభిమానించారు. పండితారాధ్యుడు కందంలోనే శివతత్త్వసారాన్ని రచించాడు. గద్య, రగడ వంటి దేశి ఛందస్సులను తీసుకొని లఘురచనలు చేసారు. గద్య ఒక విధమైన రగడ భేదమే. సోమన ద్విపద మహాకావ్య రచనకు తగిందని నిరూపించాడు. ద్విపదకు తెలుగులో కావ్యగౌరవాన్నిచ్చి ద్విపదకు ప్రాచుర్యాన్ని కలిగించినవాడు సోమనాథుడు "తిన్నని సూక్తుల ద్విపద రచింతు" "కూర్చెద ద్విపదులు కోర్కి దైవార" అని సోమన ప్రతిజ్ఞ చేసి ద్విపదను వాడాడు. ద్విపదకు పండిత పామర ఆదరణను సోమన కలుగజేసాడు.

శివకవుల చంపూ నిరాదరణను చూసే కావచ్చు తిక్కన తన ఉత్తరరామాయణాన్ని నిర్వచనంగా వ్రాసాడు. మహాభారతంలో కందపద్యాలను ఎక్కువగా అర్థగౌరవ శిల్పంతో ప్రయోగించి సొగసుతనాన్ని చూపాడు. రంగనాథ రామాయణ కర్త శివకవుల దేశికవితా ఉద్యమం చేత ప్రభావితుడయ్యే కావచ్చును ద్విపదలో వ్రాసాడు. ద్విపద గేయరూపంగా పాడుకోడానికి వీలుగా వుంటుంది. కాబట్టే రంగనాథ రామాయణం పాటల రూపంలో పామరజనుల్లో కూడా వ్యాపించి ఆదరణను సంపాదించుకుంది. తర్వాత గౌరనాది కవులు ద్విపదలో హరిశ్చంద్రోపాఖ్యానం వంటి కావ్యాలను రచించారు.

సోమన "చెన్న మల్లుసీసం"ను సీసపద్యం దేశిఛందస్సులో వ్రాసాడు. సోమన సీసపద్యాలు ఏ పాదానికా పాదం తెగిపోతూ నడిచినాయి. సోమన సీసరచన ప్రేరణతోనే కావచ్చును తర్వాత ఆంధ్రనాయక శతకం నరసింహశతకం వంటివి సీసపద్యాల్లో కూర్చబడినాయి. శ్రీనాథ పోతనలు అందమైన సీసపద్యాలను రచించారు. సోమన అనుభవసారంలో కందంలో చిత్రకవిత్వాన్ని రచించాడు. ఆ విధంగా శివకవులు కందం ద్విపద రగడ సీసం మొదలయిన దేశిఛందస్సులకు ప్రాచుర్యాన్ని కలిగించారు.

భాష – శివకవులు దేశీయమైన ఇతి వృత్తం, ఛందస్సులనే కాక భాష విషయంలోను దేశీయతను అభిమానించారు. జన సామాన్యానికి అర్థమయ్యే భాషను కవులు ప్రయోగించాలని వాళ్ళ ఆశయం. సామాన్యులకు అర్థంకాని జటిల సంస్కృత పదజాలాన్ని వాడుకూడదు అని వాళ్ళ అభిమతం బసవపురాణంలో సోమన ---

"ఉరుతర గద్య పద్యోక్తుల కంటె సరసమై పరగిన జానుతెనుంగు"
చర్చింపగా సర్వసామాన్యమగుట కూర్చెద ద్విపదలు కోర్కిదైవార"

అని అన్నాడు. సంస్కృత భూయిష్ఠరచన సర్వసామాన్యంకాదు. "జాను తెనుగు" విశేషంగా ప్రసన్నమైందని సోమన పండితారాధ్య చరిత్రలో అంటాడు – "ఆరూఢ గద్య పద్యాది ప్రబంధ పూరిత సంస్కృత భూయిష్ఠరచన మానుగా సర్వసామాన్యంబుకాదు జాను తెనుగు విశేషము ప్రసన్నతకు"

నన్నెచోడుడు కూడా 'జాను తెనుగు'లో వ్రాస్తానని చెప్పకున్నాడు. "సరళముగాగ భావములు జానుతెనుంగున నింపుతో పిరిగొన వర్ణనల్" అన్నాడు.

శివకవులు చెప్పిన "జాను తెనుగు" పదాన్ని గురించి పండితుల్లో

తర్జన భర్జనలు జరిగినాయి. జానుతెనుగు అంటే "అచ్చతెనుగు" అని కొందరన్నారు. కాని నన్నెచోడ సోమనాథులు చెప్పిందాన్ని బట్టి జానుతెనుగు అంటె సంస్కృత భూయిష్ఠంకాని సరళమైన సుంభంగా తొందరగా అర్థమయ్యే భాష అని తెలుస్తున్నది. అప్పుడు జానుతెనుగు అంటె జనుల భాష - జనులు వాడుకునే భాష అని అర్థం. కన్నడంలో "జాణ్ణుడి" అనే మాట కన్పిస్తున్నది. ఆ జాణ్ణుడియే తెలుగులో "జాను తెనుగు" అని అయివుంటుంది. శివకవులు జనుల వాడకలో వున్న భాషను వాడారు కాబట్టి ఎన్నో వ్యాకరణ విరుద్ధమైన పదాలు సమాసాలు వాళ్ళ కావ్యాల్లో కన్పిస్తున్నాయి. వాళ్ళు వాడిన ఆనాటి వాడుకపదాలు కొన్ని ఇప్పుడు అర్థం తెలియకుండా కూడా వున్నాయి.

శివకవుల జానుతెనుగు భాషా ఉద్యమ ప్రభావం తిక్కన మీద చాలా కన్పిస్తున్నది. తిక్కన సమాసభూయిష్టంకాని దేశిపద బాహుళ్యంతో కూడిన భాషను ప్రయోగించాడు. దేశిపదాలు తెనుగు నుడికారం తిక్కన ప్రయోగించినంతగా తెలుగులో మరేకవి ప్రయోగించలేదు. అందుకే తిక్కన అచ్చమైన తెలుగుకవి అని అనిపించుకున్నాడు. నన్నెచోడుడు సోమనాథుడు జానుతెనుగులోనే వ్రాస్తామని అన్నా వాళ్ళు తమ భక్త్యావేశంతో కవితావేగంతో సంస్కృత భూయిష్ఠ రచననే చేసారు. శివకవుల దేశిభాషాభిమానం తిక్కనలో ఫలరూపం ధరించింది. తిక్కన శివకవుల ప్రభావంతో దేశీయమైన తెలుగుభాషను వాడడమే కాక పాత్రచిత్రణలో సంభాషణా శైలిలో ఆచారాల చిత్రణలో దేశీయతను ప్రవేశపెట్టి భారతాన్ని తెలుగువాళ్ళ జాతీయగ్రంథంగా చేయగలిగాడు. శివకవులను తర్వాత కవులు ప్రాచీన కవిస్తుతిలో చేర్చి గౌరవాదరంతో స్మరించకున్నా శివకవుల దేశికవితా ఉద్యమ ప్రభావం తెలుగు సాహిత్యంలో కొత్త మలుపులను తెచ్చిందనడంలో సందేహం లేదు.

క్రీ.శ. 13వ శతాబ్దంలో తిక్కన నిర్వచనోత్తర రామాయణం మహాభారత రచనల కన్నా పూర్వమే తెలుగులో రెండు రామాయణ కావ్యాలు వ్రాయబడినాయి. ఒకటి - రంగనాథ రామాయణం రెండు - భాస్కర రామాయణం

## రంగనాథ రామాయణం

ఆంధ్రకన్నడ దేశాల్లో వీరశైవం వీరావేశంతో విజృంభిస్తున్న తరుణంలో తమిళదేశంలో రామానుజాచార్యులు (క్రీ.శ. 1017-1137) వైష్ణవమతాన్ని ప్రబోధిస్తున్నాడు. ఆ వైష్ణవ భక్తిమతం కూడా వైదిక కర్మలకు ప్రాధాన్యమియ్యక విష్ణుభక్తిని ప్రచారం చేసింది. వైష్ణవులకు శ్రీరంగంలోని రంగనాథుడు ప్రధానదైవం. రంగనాథ రామాయణకర్త గోన బుద్ధారెడ్డి. అప్పుడే ఆంధ్రదేశంలో ప్రవేశిస్తున్న వైష్ణవాన్ని అభిమానించి రామాయణ రచనకు పూనుకొని వుంటాడు. అందుకే తన రామాయణానికి రంగనాథుని పేరు మీద రంగనాథరామాయణమని పేరు పెట్టి వుంటాడు.

రంగనాథ రామాయణ కావ్యకర్త గోనబుద్ధారెడ్డి కాకతీయ గణపతి చక్రవర్తికి సమకాలికుడు. రాయచూరు మండలాన్ని పాలించిన సామంత రాజు. గోనబుద్ధ భూపతి తండ్రి గోనగన్నారెడ్డి. అతనికి విట్టల భూపతి అని కూడా పేరున్నది. దాన్ని బట్టి బుద్ధభూపతి తండ్రికాలం నుంచే వైష్ణవాన్ని అభిమానించారని చెప్పవచ్చును. గోన బుద్ధభూపతి కాలం క్రీ.శ. 13వ శ. పూర్వార్థమని రంగనాథరామాయణ రచనా కాలం క్రీ.శ.1240 ప్రాంతమని విమర్శకుల అభిప్రాయం.

"రమణమై తెనుగున రామాయణంబు
క్రమమొప్ప చెప్పెడి ఘనకావ్య శక్తి
గల కవులెవ్వారు గల రుర్వినను చు"

విట్టల భూపతి నిండుకొలువులో అడుగుగా గోన బుద్ధరాజు రామాయణ రచనకు పూనుకొని వ్రాసాడు. శివకవుల దేశీఛందస్సు మీది అభిమానంచేత ప్రేరేపితుడై బుద్ధ భూపతి ద్విపదలో రామాయణాన్ని రచించాడు. వాల్మీకి రామాయణాన్ని కవి అనుసరించినా దేశంలో వ్యాప్తిలో వున్న వృత్తాంతాలను కవి దీనిలో చేర్చాడు. అహల్యావృత్తాంతంలో ఇంద్రుడు కోడియై కూసినాడనడం, అహల్యరాయిగా మారిందనడం, రాముడు బాల్యంలో మందర కాలువిరిచినాడనడం, జంబుమాలి, కాలనేమి వృత్తాంతాలు సులోచన కథ, లక్ష్మణుడు పర్ణశాలచుట్టు రేఖను గీయడం మొదలయిన అవాల్మీకాంశాలను కవి తీసుకున్నాడు. ఆ విధంగా బుద్ధ భూపతి వస్తు విషయంలో దేశీయతను పాటించాడు. కవి శైలి సమాసరహితంగా సరళ సులభంగా వుంది. గేయ రూపంగా పాడుకోడానికి లనువుగా వుండడం చేత రంగనాథ రామాయణం ద్విపదలు పామరజనుల్లో వ్యాప్తిలో వుండేయి. తోలు బొమ్మలాటలో ఈ ద్విపదలను పాడే వాళ్ళు కూడా. భాష విషయంలోను బుద్ధ భూపతి జానుతెనుగును ప్రయోగించి దేశీయతనభిమానించాడు. బుద్ధ భూపతి సందర్భానుకూలంగా వర్ణనలను చేర్చాడు. పాత్రచిత్రణ సంభాషణలు సహజంగా వున్నాయి. అక్కడక్కడ అలంకారాలు శైలిని రమ్యంచేసాయి. కథను కవి సుబోధకంగా చెప్పాడు.

బుద్ధభూపతి పూర్వరామాయణాన్ని వ్రాయగా అతని కొడుకులు కాచవిభుడు, విట్టలనాథుడు ఉత్తరరామాయణాన్ని వ్రాసి రంగనాథ రామాయణాన్ని పూర్తి చేసారు. బుద్ధ భూపతి పూర్వరామాయణాన్ని తండ్రి పేర వ్రాయగా ఈ కవులు ఉత్తర రామాయణాన్ని బుద్ధ భూపతికి అంకితమిచ్చారు. వాళ్ళ శైలి బుద్ధభూపతి శైలి అంత రమణీయంగా లేకున్నా ప్రశస్తంగా వుంది.

తెలుగులో రంగనాథ రామాయణం మొట్ట మొదటి రామాయణం.

దాని తర్వాత భాస్కరుడు, ఎర్రన, సత్యనారన కవులు, ఆధునిక కాలంలో విశ్వనాథ ప్రసిద్ధంగా రామాయణాలను వ్రాసారు. తిక్కన కంకంటి పాపరాజులు ఉత్తర రామాయణాలను వ్రాసారు. వాటిల్లో ఎర్రన, సత్యనారన రామాయణాలు దొరకడం లేదు. భాస్కరుని రామాయణం చంపూపద్ధతిలో వుండి వాల్మీకి రామాయణాన్ని చాలా మట్టుకు అనుసరిస్తు సాహిత్యప్రియులను అలరిస్తున్నది. రంగనాథ రామాయణం పండిత పామరులను సమానంగా అలరిస్తున్న అద్వితీయకావ్యం.

## భాస్కర రామాయణం

భాస్కర రామాయణం ఒక్క కవి చేత మీదుగా వ్రాసింది కాదు. దాన్ని మొత్తం నలుగురు కవులు వ్రాసారు. వాళ్ళల్లో ప్రధానమైన కవి హుళక్కి భాస్కరుడు. అందుకే ఈ రామాయణానికి భాస్కరరామాయణమనే పేరు వచ్చింది. చంపూ పద్ధతిలో వ్రాసిన రామాయణాల్లో ఇది మొదటిది. దీంత ర్వాత వ్రాయబడిన ప్రాచీన రామాయణాలేవి నిలువక నశించిపోయినాయి. దాన్ని బట్టి ఈ రామాయణం విశేషాదరణ పొందిందని చెప్పవచ్చును.

భాస్కరకవి రామాయణాన్ని తొందరగా ముగించాలనో లేక తన శిష్యు లను ప్రోత్సహించాలనో ఇతర కవులను కూడా చేర్చుకున్నాడు. భాస్కరుని (కొడుకు మల్లికార్జున భట్టు బాలకాండం, భాస్కరుని శిష్యుడు రుద్రదే వుడు అయోధ్యాకాండం, స్వయంగా భాస్కరుడు అరణ్యకాండం ఒకేసారి తీసుకొని రచించారు.) సమర్థుడైన మల్లికార్జున భట్టు బాలకాండాన్ని తొందరగా ముగించి నాల్గవ ఐదవ కాండాలు కిష్కింధ సుందరకాండాలను రచించాడు. భాస్కరుడు యుద్ధకాండాన్ని తీసుకొని రచిస్తుండగా అతని (మిత్రుడు అయ్యలార్యుడు అతని అనుమతితో యుద్ధకాండం ఉత్తరభాగాన్ని)

రచించాడు. ఆ విధంగా ఆ రామాయణకావ్యాన్ని నల్గురు కవులు రచించారు.

ఈ రామాయణకర్త భాస్కరుడు తిక్కన తాత భాస్కరుడు ఒక్కరే అని కొందరు తలంచారు. కాని ఈ భాస్కరుని హుళక్కి భాస్కరుడని పూర్వకవులు ప్రస్తుతించారు. భాస్కర రామాయణం సాహిణిమారనకు అంకితమయ్యబడింది. ఆ మారన రెండవ ప్రతాపరుద్రుని అశ్వసేనాధ్యక్షుడు కాబట్టి భాస్కరుని కాలం క్రీ.శ 13 వ. శ. చివర క్రీ.శ. 14వ శ. ఆరంభమని చెప్పవచ్చును.

రామాయణ కావ్యకవుల్లో భాస్కరుడు ప్రధానమైనవాడైనా ఎక్కువ భాగాన్ని వ్రాసింది మల్లికార్జున భట్టు. మల్లికార్జునుని కవిత్వం సంస్కృత పదభూయిష్ఠంగా రసవంతంగా వుంది. అతడు బాలకాండాన్ని ప్రబంధమార్గంలో అయోధ్యానగర వర్ణనతో ఆరంభించాడు. అతని వర్ణనలు నాతిదీర్ఘంగా రమ్యంగా వున్నాయి. మల్లికార్జునుడు మిగిలిన కవులకన్నా శబ్దాలంకారాలను ఎక్కువగా వాడాడు. రుద్రదేవుని కవిత్వం సులభశైలిలో వుంది. అతని అనువాదం సంగ్రహంగా నడిచింది. కథను చెప్పడమే ప్రధానంగా వుంది. వర్ణనలధికంగా లేవు. అయ్యలార్యుని కవిత్వం భాస్కరుని కవిత్వాన్ని అనుకరిస్తున్నది. భాస్కరుని కవిత్వం రమణీయంగా వుంది. మొత్తం మీద భాస్కరరామాయణంలో రచన ధారాళమైన పద్యాలతో ప్రసన్నంగా రసవంతంగా రమణీయంగా నడిచింది.

భాస్కరరామాయణంలో కవులు వాల్మీకిననుసరిస్తు అనువదించినా రంగనాథరామాయణంలో వలెనే అవాల్మీకాంశాలను చేర్చారు. ఉదాహరణకు ఇంద్రుడు కోడియై కూయడం, అహల్య రాయిగా శపించబడడం, జంబుమాలి, కాలనేమి వృత్తాంతాలు, రావణుని నాభిలోవున్న అమృతక

లశ రహస్యాన్ని విభీషణుడు రామునికి చెప్పడం వంటివి వున్నాయి. అక్కడక్కడ రంగనాథ రామాయణంలోని భావాలు పదాలు పదబంధాలు భాస్కరరామాయణంలో కన్పిస్తున్నాయి.

* *

# 5. తిక్కన యుగం

తిక్కన నెల్లూరు చోడరాజు మనుమసిద్ధి ఆస్థానంలో మంత్రిగా వున్నాడు. వెలనాటి రాజులకు ప్రత్యర్థులుగా నెల్లూరు తెలుగు చోడులు నెల్లూరు మొదలుకొని కంచి వరకు పాలించారు. వాళ్ళు కరికాలచోడుని సంతతిమని చెప్పుకున్నారు. తెలుగు చోడుల విజృంభణకు పూర్వమే పాకనాడులో నన్నెచోడ మహాకవి వంశంవాళ్ళు పాలించి వుంటారు. ఆ కవి తన తండ్రి చోడబల్లి పాకనాడిరువది యొక్క వేయిటి కధీశుడని చెప్పుకున్నాడు. నెల్లూరు చోడవంశ మూలపురుషుడు బిజ్జన పశ్చిమచాళుక్య చక్రవర్తి మొదటి సోమేశ్వరుని (క్రీ.శ. 1042-1068) సామంతుడుగా పాలన సాగించాడు. పశ్చిమ చాళుక్యులు చోళులతో చేసే యుద్ధాల్లో పాల్గొన్నాడు. అతని శక్తిసామర్థ్యాలను గుర్తించి ఆరవ విక్రమాదిత్యుడు (క్రీ.శ. 1076-1126) అతన్ని పాకనాటికి పాలకుడుగా నియమించాడు. అప్పటి నుంచి వాళ్ళ రాజధాని నెల్లూరు, ఉపరాజధాని కంచి అయింది. వెలనాటి చోడులు నెల్లూరు చోడుల ప్రాబల్యాన్ని సహించలేదు. వెలనాటి మొదటి రాజేంద్రుడు క్రీ.శ.1132 ప్రాంతంలో నెల్లూరు పైకి దండెత్తి సిద్ధిబేతని ఓడించాడు. అప్పటి నుంచి వెలనాటి రెండవ రాజేంద్రచోళుని మరణం వరకు నెల్లూరు చోడులు తలెత్త లేకపోయారు. ఆ సమయంలో పశ్చిమ చాళుక్యులు బలహీనులు కావడంతో నెల్లూరు చోడులు కూడా ఏమి చేయలేక పోయారు. పశ్చిమ చాళుక్య రాజును చంపి కలచురి బిజ్జలుడు

(క్రీ.శ. 1156) రాజైనాడు. పశ్చిమ చాళుక్యుల రాజనీతిననుసరించి అతడు వేంగి చాళుక్యచోళులను వెలనాటి చోళులను శత్రువులుగా చూసాడు. దాంతో కలచురులు నెల్లూరు చోడులతో మైత్రి చేసారు. వెలనాటిపై దండెత్తి ఆ రాజ్యాన్ని (క్రీ.శ 1180)లో అంతమొందించారు. దాంతో నెల్లూరు చోడులు ప్రబలమైనారు. క్రీ.శ. 1187 నల్లసిద్ధి నెల్లూరును పాలించాడు. నల్లసిద్ధికి మొదటి మనుమసిద్ధి అని పేరు. అతని కాలంలో తంజావూరు చోళచక్రవర్తి మూడవ కులోత్తుంగుడు కంచిని స్వాధీనం చేసుకొని కప్పం వసూలు చేసాడు. నల్లసిద్ధి క్రీ.శ. 1205లో మరణించాడు. అతని తమ్ముడు తమ్ముసిద్ధి రాజయ్యాడు. అతడు చోళచక్రవర్తుల్లో మూడవ కులోత్తుంగుని పక్షం వహించాడు. వెలనాటి పృథ్వీశ్వరుడు రెండవ రాజాధిరాజు పక్షం వహించి నెల్లూరు మీదికి దండెత్తాడు. యుద్ధంలో నల్లసిద్ధి కొడుకు చోడతిక్కన పృథ్వీశ్వరున్ని వధించాడు. దీన్నే తిక్కన నిర్వచనోత్తర రామాయణం పీఠికలో "శైశవ లీలనాడె పటుశౌర్య దురుంధరుడైన చోడ పృథ్వీశనరేంద్రు మస్తకము వేడ్తెర కందుక కేళి సల్పడే" అని వర్ణించాడు. ఆ యుద్ధంలో కాకతీయ గణపతి దేవుడు నెల్లూరు చోడుల పక్షంలో పోరాడాడు. చోడ తిక్కనతో పాటు గణపతిదేవుడు "పృథ్వీశ్వర శిరః కందుక క్రీడా వినోదు"డని కీర్తింపబడినాడు. పృథీశ్వరుని మరణంతో వెలనాటి రాజ్యం క్షీణించింది. క్రీ.శ. 1212 లో అంతరించింది.

చోడతిక్కన నల్లసిద్ధి కొడుకు. నెల్లూరు చోడ రాజుల్లో ప్రసిద్ధుడు క్రీ.శ. 1223-48 మధ్య పాలించాడు.అతని రాజ్యం కావేరి వరకు విస్తరించిందట. అతని కాలంలో తెలుగు చోడులు దక్షిణదేశ రాజకీయాల్లో కీలకపాత్ర వహించారు. తంజావూరులో చాళుక్యచోళ వంశం పతనావస్థకు చేరుకుంది. పాండ్యులు హోయసలులు ప్రబలులైనారు. తంజావూరులో చాళుక్యచోళ చక్రవర్తి మూడవ రాజేంద్రుడు తన వంశ ప్రతిష్ఠను పునరుద్ధరింప దలచాడు కాని విజయం సాధించలేక పోయాడు. అతడే ఆ వంశంలో చివరి రాజు.

హోయసలులు పాండ్యులతో చేరి అతని మీదికి దండెత్తారు. చోడతిక్కన మూడవ రాజేంద్రుని పక్షం వహించి యుద్ధం చేసి "చోళస్థాపనాచార్య" అని బిరుదం ధరించాడు. చోడ తిక్కన సాహిత్యాభిమాని. అభినవభోజ, కవిసార్వభౌమ బిరుదాలను ధరించాడు. అతని ఆస్థానంలోనే తిక్కన మహాకవి కుటుంబం ఆదరణ పొందింది. తిక్కన తాత భాస్కరుడు, తండ్రి కొమ్మన, పెదతండ్రి సిద్ధన మంత్రి దండనాయక నగర పాలకులుగా వున్నారు. సిద్ధన వీరుడు. "స్థాపిత సూర్యవంశ వసుధాపతి" అనే బిరుదం వుంది. చోడులు సూర్యవంశజులమని చెప్పుకున్నారు.

చోడతిక్కన తర్వాత అతని కొడుకు రెండవ మనుమసిద్ధి రాజయ్యాడు. క్రీ.శ. 1248-63 మధ్య పాలించాడు. కాని మనుమసిద్ధికి దాయాదుల బెడద అధికమైంది. విజయగండ గోపాలుడనే దాయాది హోయసల సోమేశ్వరుని చాళుక్యచోళ మూడవ రాజేంద్రుని సహాయం సంపాదించుకొని మనుమసిద్ధిని ఎదిరించాడు. తిక్కన బయ్యనలనే దాయాదులు మనుమసిద్ధి పైకి యుద్ధానికి వచ్చారు. వాళ్ళు మనుమసిద్ధిని పారదోలి నెల్లూరు సింహాసనాన్ని ఆక్రమించారు. ఆ సమయంలోనే నిస్సహాయుడైన పదవీభ్రష్టుడైన మనుమసిద్ధి పక్షం వహించి తిక్కన కాకతి గణపతిదేవుని సహాయం అర్థించాడు. అప్పటికే కాకతి గణపతి దేవుడు వెలనాడు కమ్మనాడులను స్వాధీనం చేసుకొని ఆంధ్రదేశం చాలా భాగానికి అధిపతి అయ్యాడు. తిక్కన గణపతి దగ్గరకు రాయబారిగా పోయి అతని సహాయమర్థించి తెచ్చి మనుమసిద్ధిని తిరిగి నెల్లూరులో ప్రతిష్ఠించాడని ఐతిహ్యం. సిద్ధేశ్వరచరిత్రలో ఈ వృత్తాంతం విశదంగా వర్ణింపబడింది. మొత్తం మీద క్రీ.శ. 1254 ప్రాంతంలో గణపతిదేవుడు దక్షిణదేశ దిగ్విజయయాత్ర చేసి వెలనాటి మూడవకులోత్తుంగుని చాళుక్యచోళ మూడవ రాజేంద్రుని హోయసల సోమేశ్వరుని విజయగండ గోపాలుని సైన్య కూటమిని ఎదిరించి ఓడించి తన అధికారాన్ని స్థాపించాడు. దాంతో కాకతీయులు ఆంధ్ర

చక్రవర్తులయ్యారు. శాతవాహనుల తర్వాత ఆంధ్రదేశాన్ని జాతిని ఏకచ్ఛత్రం కిందకు తెచ్చిన ఘనత వాళ్ళకు దక్కింది. వాళ్ళ కాలంలోనే ఆంధ్ర త్రిలింగ పదాలు సమానార్థకాలైనాయి. దేశపరంగా జాతి పరంగా రెండు పదాలు వాడబడినాయి. కాకతీయులు ఆంధ్రదేశాధీశ్వరులని బిరుదం ధరించారు. అటువంటి బిరుదాన్ని వాళ్ళే మొదటిసారి ధరించారు. వాళ్ళ రాజధాని ఓరుగల్లు ఆంధ్రనగరి అయింది. దాదాపు రెండు శతాబ్దాల కాలం వున్న అశాంతి యుద్ధభయం రాజకీయాస్థిరతలు పోయి శాంతి నెలకొన్నది. బలమైన కేంద్రాధికారం ఏర్పడింది. ఆ తరుణంలోనే తిక్కన మహాభారత రచన చేసి నన్నయ భారత రచనను పూర్తి చేసివుంటాడు.

మనుమసిద్ధి తన తండ్రికాలంనాటి స్వాతంత్ర్యాన్ని కోల్పోయి కాకతీయులకు సామంతుడై పాలించాడు. కొద్ది కాలానికే అద్దంకినేలే యాదవరాజు సారంగ దేవుడు మనుమసిద్ధిపైకి దండెత్తి వచ్చాడు. మనుమసిద్ధి అతన్ని ఓడించాడని తిక్కన నిర్వచనోత్తర రామాయణంలో వుంది. బహుశా అది గణపతి దేవుని సహాయానికి పూర్వమే జరిగి వుంటుంది. క్రీ.శ. 1260లో కనిగిరి సీమలోని కాటమరాజుకు మనుమసిద్ధికి పుల్లరిని గురించి తగాదా ఏర్పడి యుద్ధం జరిగింది. ఇదే కాటమరాజు కథగా ప్రచారంలో వుంది. ఈ యుద్ధంలోనే తిక్కన పెదతండ్రి సిద్ధన కొడుకు ఖడ్గ తిక్కన మరణించాడు. క్రీ.శ 1263లో జటావర్మ సుందరపాండ్యుడు నెల్లూరు మీదికి దండెత్తి వచ్చాడు. కాకతీయులు హోయసలులు మనుమసిద్ధికి సహాయం చేసారు. కాని లాభం లేక పోయింది. జటావర్మ నెల్లూరునాక్రమించాడు. మనుమసిద్ధి మరణించాడు. మనుమసిద్ధి తర్వాత కాకతీయులకు పాండ్యులకు పోరాటాలు జరిగాయి. మనుమసిద్ధి తర్వాత రెండవ తిక్కన, మనుమగండగోపాలుడు పరిపాలించారు. రుద్రమదేవి కాలంలో (క్రీ.శ. 1292) కాకతీయుల నెదిరించి మనుమగండగోపాలుడు చనిపోయాడు. మళ్ళీ కాకతి రెండవ ప్రతాపరుద్రుని కాలంలో మనుమగండగోపాలుని కొడుకు

రాజగండగోపాలుడు తలెత్తాడు. ప్రతాపరుద్రుడు అతన్ని ఓడించాడు (క్రీ.శ. 1297). నెల్లూరు రాజ్యం గణపతి కాలంలోనే కాకతీయ సామ్రాజ్యంలో చేరినా ప్రతాపరుద్రుని కాలంలో పూర్తిగా సత్తాను కోల్పోయిందని చెప్పాలి.

నెల్లూరు చోడులు పాకనాడును ఒక శతాబ్దకాలం పాలించి దక్షిణ దేశ రాజకీయాల్లో క్రియాశీలమైన పాత్రను ధరించారు. పశ్చిమ చాళుక్యులకు కలచురులకు చాళుక్యచోళులకు చివరకు కాకతీయులకు సామంతులుగా వుండి అనేక యుద్ధాల్లో పరాక్రమాన్ని చూపి రాజ్యాధికారాన్ని నిర్వహించారు. తిక్కన సోమయాజి మనుమసిద్ధి ఆస్థానంలో వున్నా అతని కుటుంబం అతని తాత భాస్కరుని కాలం నుంచే నల్లసిద్ధి ఆస్థానంలో చేరారని చెప్పవచ్చును. భాస్కరుడు తన పెద్దకొడుకుకు సిద్ధన అని రాజుపేరు పెట్టడమే దీన్ని చెప్తున్నది. నెల్లూరు చోడ వంశానికి తిక్కన కుటుంబానికి ఘనిష్ఠ సంబంధమేర్పడింది. రాజుల పేర్లను తిక్కన వంశీయులు పెట్టుకోవడం వాళ్ళ రాజభక్తిని అభిమానాన్ని చాటుతున్నది. తిక్కన పేరు కూడా మనుమసిద్ధి తండ్రి చోడతిక్కన పేరు మీదుగానే పెట్టబడింది. తిక్కన మనుమసిద్ధిని మామా అని పిలవడం ఆ రెండు కుటుంబాల మధ్య గల అన్యోన్యతను చాటుతున్నది. అందుకే తిక్కన మనుమసిద్ధిని పునః ప్రతిష్ఠించడానికి ఓరుగల్లుకుపోయి గణపతి సహాయాన్ని అర్థించి తెచ్చి తన రాజకీయ చాతుర్యాన్ని ప్రదర్శించాడు.

కాకతిగణపతి దేవుడు (క్రీ.శ. 1199-1262) మహావీరుడు. రాజనీతిజ్ఞుడు. విజేత. అతడు దిగ్విజయ యాత్రలు చేసి కాకతి రాజ్యాన్ని విస్తరించాడు. అప్పటికే ఉత్తరభారతం తురుష్కుల అధీనమైంది. వాళ్ళ దండయాత్రలను అరికట్టడానికి దక్షిణ దేశంలో బలమైన రాజ్యం స్థిరమైన పాలన దృఢమైన కేంద్రాధికారం అవసరమైంది. గణపతిదేవుడు వాటిని ఏర్పరచడంలో సమర్థుడైనాడు. గణపతిదేవుని తర్వాత అతనికి కొడుకుల్లేక

పోవడంతో కూతురు రుద్రమ చక్రవర్తిని అయి తండ్రి సామ్రాజ్యాన్ని సురక్షితంచేసి పరిపాలించింది. రుద్రమకు పుత్రసంతానం లేక పోవడంతో కూతురు కొడుకు ప్రతాపరుద్రుని దత్తత తీసుకుంది. రుద్రమ తర్వాత అతడే రెండవ ప్రతాపరుద్రుడుగా చక్రవర్తి అయినాడు. రెండవ ప్రతా పరుద్రుడు వీరుడు. రాజనీతిజ్ఞుడు. సాహిత్యాభిమాని. స్వయంగా కవి. అతని కాలంలోనే తురుష్కులు ఢిల్లీసుల్తానులు ఐదుసార్లు దండయాత్రలు నడిపారు. నాలుగు సార్లు ప్రతాపరుద్రుడు తురుష్కులను ఎదిరించి పారదోలాడు. ఒక్కొక్క దండయాత్ర రోజుల తరబడి నెలల తరబడి జరగడంతో అతని అర్థబలం సైన్యబలం క్షీణించింది. చివరకు ఐదోసారి గియాసుద్దీన్ తుగ్లక్ కొడుకు జునాఖాన్ (ఇతడే మహమ్మద్ బిన్ తుగ్లక్ పేరుతో రాజైనాడు) నడిపిన దండయాత్రలో ప్రతాపరుద్రుని నీరసించిన సైన్యం విజయాన్ని సాధించలేక పోయింది. దక్షిణదేశ రాజుల్లో గాని ప్రతాపరుద్రుని సైన్యంలోని నాయకుల్లోగాని ఐకమత్యం లేకుండా పోయింది. ప్రతాపరుద్రుని సేనాని బొబ్బారెడ్డి చేసిన ద్రోహంతో ఆంధ్రుల సైన్యం పరాజయం పొందింది. ప్రతాపరుద్రుడు తురుష్కుల బందీ అయినాడు. బందీగా ఢిల్లీకి తీసుకొని పోతుండగా మార్గమధ్యంలో ప్రతాపరుద్రుడు నర్మదా నదిలోకి దూకి మరణించాడంటారు. కాకతీయుల పతనంతో ఆంధ్రదేశం తురుష్కుల వశమైంది.

కాకతీయుల కాలంలో తెలుగుభాషను మాట్లాడే వాళ్ళంతా ఒక పాల నలోకి వచ్చారు. ఆంధ్రజాతి, ఆంధ్రభాష అనే చైతన్యం కలిగింది. తిక్కన "ఆంధ్రావలి మోదముంబొరయునట్లుగ" మహాభారతాన్ని రచిస్తానన్నప్పుడు "ఆంధ్రావలి" అని ఆంధ్రులనందర్నీ చేర్చాడు. చిన్న చిన్న రాజ్యాలు రాజకీయ అస్థిరత తొలగిపోయి సమైక్యత స్థిరత్వం ఏర్పడింది. ఒక స్త్రీ సామ్రాజ్య భారాన్ని వహించిన గౌరవం ఈ కాలంలోనే ఆంధ్రులకు కలిగింది. రాజుల సేనానుల మాండలికులచేత అనేక తటాకాలు నిర్మింపబడి వేలకొద్ది ఎకరాల

భూములు సాగులోకి వచ్చాయి. కొత్త వలస గ్రామాలు ఏర్పడినాయి. ఆ నాటి తటాకాలు కాలువలు ఇప్పటికి వ్యవసాయానికి పనికివస్తున్నాయంటె కాకతీయుల నిర్మాణకౌశలం ప్రణాళికా నైపుణ్యం తెలుస్తున్నాయి. అనేక పరిశ్రమలు అభివృద్ధి చెంది దేశవిదేశ వాణిజ్యం ముమ్మరంగా సాగింది. మార్కోపోలో వంటి విదేశీయాత్రికులు కాకతీయులకాలం నాటి ప్రజల సిరిసంపదలను వర్ణించారు. కాకతీయులు బలమైన దుర్గాలను కోటలను నిర్మించారు. బలమైన సైన్యాన్ని పోషించారు. దాంతో దేశం దండయాత్రల భయంలేక సుభిక్షంగా వుంది. కాకతీయులు ఎన్నో దేవాలయాలను నిర్మించారు. అవి ఎక్కువగా శివవిష్ణు సూర్యులు వెలసిన త్రికూటాలయాలు కావడం విశేషం. కాకతీయులు మొదట జైనాన్ని అభిమానించి తర్వాత శివాభిమానులయ్యారు. ప్రసిద్ధ శైవాచార్యుడు విశ్వేశ్వర శివదేవుడు గణపతికి రుద్రాంబకు దీక్షాగురువు. అతడు విదిత శైవాగమ విద్వద్గరిష్ఠుడు. రెండవ శివుడు. గురువేకాక గణపతి దేవుని మంత్రి. అతని ప్రోత్సాహంతో విద్యాలయాలతో కూడిన గోళకీమఠాలు ఆంధ్రదేశమంతటా వెలిసాయి. మొదటి రుద్రుని కాలంలో విజృంభించిన వీరశైవం గణపతిదేవుని నాటికి ఇంకా వీరరూపంతో సామాన్యజనుల్లో వ్యాప్తిలో వుంది. కాని క్రమ క్రమంగా దాని వీరరూపం హింసాచర్యలు తగ్గుముఖం పట్టాయి. శైవాలయాల నిర్మాణంతో శివపూజలు అర్చనలు సాగాయి. సిద్ధేశ్వర చరిత్రలో గణపతి దేవుడు అనుమకొండలో జైనులను హింసించాడని విశ్వేశ్వర శివదేవుడు జైన గ్రామాలను నాశనం చేసాడని చెప్పబడింది. అది కొంత అత్యుక్తి కావచ్చును. మొత్తం మీద పండితారాధ్యుని కాలంలోనే (12వ శ.) బౌద్ధజైనాలు అంతరించాయి. మిగతా ఏమైనా మిగిలివుంటె ఈ యుగంలో రాజాదరణ ప్రజాదరణ లేక అంతరించి వుంటాయి. జైనమతానికి నిలయమైన కొల్లిపాకలో ఇప్పటికి జైనాలయం క్షీణదశలో మిగిలి వుంది. కొల్లిపాక మొదట జైనమత కేంద్రంగా వుండి తర్వాత శైవమతానికి కేంద్రంగా ఏర్పడింది. పాడుపడిన శైవాలయాలెన్నో ఇప్పటికీ కన్పిస్తాయి. కాకతీయుల

కాలంలో వైదికమతం పూర్తిగా లేకుండా పోయింది. తమిళదేశంలో రామానుజులు బోధించిన వైష్ణవం ఆంధ్రదేశంలోకి ప్రవేశించింది. కొందరు మాండలికులు వైష్ణవాన్ని అభిమానించారు. కాని కాకతీయ రాజులు శైవాన్ని చివరి వరకు అభిమానించి ఆచరించారు. తంజావూరు చోళ సామ్రాజ్యంలో రామానుజాచార్యులకు అతని మత ప్రచారానికి ఆ రాజుల అనుజ్ఞా ఆదరణ దొరకకపోవడంతో ఆయన కర్ణాటకలోని హోయసలులను ఆశ్రయించాడు. హోయసలరాజులు వైష్ణవాన్ని స్వీకరించారు. పాండ్యుల హోయసలుల చేతుల్లో చోళసామ్రాజ్య వినాశనానికి వైష్ణవం కూడా ఒక కారణమై వుంటుంది. తిక్కన సోమయాజి మొదట శివాభిమానిగా కన్పిస్తాడు కాని తర్వాత భారత రచననాటికి అతడు శైవవైష్ణవాలకు అభేదం చెప్పి అద్వైత బోధనతో ధార్మిక సమైక్యతను సాధించేందుకు కృషి చేసాడు. తిక్కన వంటి ఎందరో వ్యక్తులు ఆచార్యుల మూలంగా ఆంధ్రదేశంలో వీరశైవ వైష్ణవుల విజృంభణలు మతకల్లోలాలు అరాచకీయ పరిస్థితులు చల్లారి వుంటాయి. రెండవ ప్రతాపరుద్రుని కాలంలో వున్న పాల్కురికి సోమన వీరశైవాభిమానంతో రచనలు చేసిన వీరశైవానికి వేదప్రామాణికతను కల్పించిన పండితకవి. కాకతీయుల కాలంలో ఆంధ్రదేశంలో ప్రవేశించిన వీరశైవం వర్ణవ్యవస్థను నిర్మూలించలేక పోయింది. కన్నడ దేశంలో జైనమత ప్రభావంతో వర్ణవిభేదాన్ని వీరశైవం ఖండించి ప్రచారం చేసినా అక్కడ కూడా అది వర్ణభేదాన్ని నశింపజేయలేక పోయింది. వీరశైవులు ఒక వర్ణంగా ఒక భిన్న మత సాంప్రదాయంగా ఏర్పడినారు. కాకతీయుల కాలంలో సమాజంలో ఇంకా వర్ణవ్యవస్థ స్థిరపడి కొత్త కొత్త వర్ణాలు ఏర్పడినాయి. వీరశైవం ప్రభావంతో మొల్ల వంటి నిమ్నకులాలకు చెందిన కవులు విద్యావంతులై కవిత్వం వ్రాసారు.

కాకతీయులు ఆంధ్రాధీశులయి ఆంధ్రజాతి అనే జాతీయభావాన్ని కలిగివున్నా తెలుగును రాజభాషగా ఆదరించలేదు. కాకతీయుల రాజభాష

సంస్కృతం. వాళ్ళ శాసనాలు చాలభాగం సంస్కృతంలోనే వున్నాయి. వాళ్ళ సామంతులు కూడా శాసనాలను సంస్కృతంలోనే వేయించారు. అభినవ మయూరసూరి ఈశ్వరభట్టు కవిచక్రవర్తి వంటి కవిత్వంలో నేర్పుగల కవులు ఆ సంస్కృత శాసనాలను వ్రాసారు. అగస్త్యుడు శాకల్యమల్లుభట్టు, గంగాధర, నరసింహకవి, విశ్వనాథ వంటి సంస్కృత కవులు అనేక ప్రసిద్ధ సంస్కృత కావ్య నాటకాలు వ్రాసారు. విద్యానాథుడు ప్రతాపరుద్రయశో భూషణమనే అలంకార శాస్త్రగ్రంథాన్ని వ్రాసాడు. గండయభట్టు శ్రీహర్షుని ఖండన ఖండఖాద్యమనే వేదాంత గ్రంథానికి వ్యాఖ్యానం వ్రాసాడు. మల్లి నాథ సూరి అతని కొడుకు సంస్కృత మహాకావ్యాదులకు వ్యాఖ్యానాలు వ్రాసారు. మల్లినాథుడని జైనతీర్థంకరులలో ఒకరి పేరు. కాబట్టి మల్లినా థుడు జైనుడనే వాదముంది. ఒకవేళ తర్వాత అతడు హిందూమతాన్ని అనుసరించాడేమో. అతని కొడుకు పేరు కుమారస్వామి సోమపీథి. మల్లినాథుడు రాచకొండ రాజ్యంలో వున్నాడని అంటారు. అతని వ్యాఖ్యా నాలు ప్రపంచ ప్రసిద్ధమైనయి. కాకతి మొదటి రుద్రుడు సంస్కృతంలో 'నీతి సార' మనే రాజనీతి గ్రంథాన్ని రచించాడు. రెండవ ప్రతాపరుద్రుడు యయాతి చరిత్ర వంటి సంస్కృత నాటకాలు రచించాడు. జాయప సేనాని "నృత్త రత్నావళి" అనే నాట్యశాస్త్రాన్ని రచించాడు. గణిత జ్యోతిషాదిశాస్త్ర గ్రంథాలు ఈ కాలంలో సంస్కృతంలో వచ్చాయి. కాకతీయుల నాటికి ఉత్తర భారతంలో సంస్కృతం, సంస్కృతరచనలు వెనుక తట్టు పట్టాయి. దానికి తురుష్కుల ఆక్రమణలు, అప్రభ్రంశ దేశభాషల్లో రచనలు రావడం కారణాలు కావచ్చును. ఉత్తర భారతంలో సంస్కృతం మీద ఆదరణ పోయి రచనలు ఆగిపోయిన తరుణంలో దక్షిణదేశంలో కాకతీయులు, ఆ తర్వాత విజయనగరం రెడ్డి వెలమ నాయకాది రాజులు సంస్కృతాన్ని అభిమానించి స్వయంగా సంస్కృతంలో రచనలు చేసారు. సంస్కృత కవిపండితుల నాదరించారు. కావ్యనాటకాలకు వేదశాస్త్రాలకు వాఖ్యానాలు రచింపబడడం ఆ యుగంలో గొప్ప విశేషం. కాకతీయుల కాలంలో కన్నడ -

తెలుగు కవిత్వంలో ఇతివృత్తంలో ఛందస్సులో దేశీయతనభిమానించారు. "జానుతెనుగు" పేరుతో దేశి పదజాలంతో కూడిన తెలుగు భాషను అభిమానించారు. అదే తిక్కన చేత "జాత్యముగామి నొప్పయిన సంస్కృత మెయ్యెడ జొన్ప" నని చెప్పించింది. శివకవుల భాషోద్యమంచేత దేశితనంతో కూడిన సంస్కృత మిశ్రితమైన తెలుగుభాషాశైలి రూపొందింది. అంటె అదంతా పాలకులు అంటె రాజుల ప్రమేయం లేకుండా సాహిత్య లోకంలోనే ఈ విప్లవం ప్రవేశించిందని చెప్పాలి. కాకతీయుల ఆదరణలో ఆస్థానంలో కాక తెలుగు కవిత్వం నెల్లూరు చోడరాజుల దగ్గర ఆదరణ పొందింది. అంటె శాసనభాషగా రేనాటి చోడులు తెలుగుభాషను గ్రహించారు. అక్కడే మనకు మొట్టమొదట తెలుగుభాష దర్శనమిస్తున్నది తర్వాత తంజావూరు చోళుల ప్రభావంతోనేమో రాజరాజనరేంద్రుడు నన్నయను తెలుగులో మహాభారత రచనను ప్రోత్సహించాడు. నెల్లూరు చోళుల ఆస్థానంలో వున్న తిక్కన నన్నయభారత రచనను కొనసాగించాడు, ఆ విధంగా చూస్తే చోళులు దేశభాషలను విశేషంగా అభిమానించినట్లు కన్పిస్తున్నది. తిక్కన ఆదరణలో భవ్యభారతి అని అతని చేత బిరుదంపొందిన బయ్యన, మారన కేతనలు రచనలు చేసారు. తిక్కన పెదతండ్రి భాస్కరునికేతన కాదంబరిని తెలుగులోకి అనువదించాడు. వెలనాటి చోళుల మంత్రి ఆదరణలో మంచన కేయూరబాహుచరిత్ర వంటి రచనలు వచ్చాయి. తిక్కన యుగంలో గాని తిక్కనకు పూర్వం శివకవి యుగంలో చాళుక్యులుగాని కాకతీయులుగాని తెలుగు కవిపండితులనాదరించినట్లు కన్పించదు. శివకవులు రాజాదరణ లేకుండానే రచనలు చేసారు. గోనబుద్ధారెడ్డి స్వయంగా సామంతుడు. భాస్కరకవికి కూడా రామాయణ రచనకు కాకతిరాజులు ఆదరణ వున్నట్లు లేదు. భాస్కర రామాయణం వ్రాసిన నలుగురు కవుల్లో ఒకడైన కుమార రుద్రదేవుడు రెండవ ప్రతాపరుద్రుడని అంటారు. కాని అది సర్వజనాంగీకారమైన వాదం కాదు. భాస్కరుడు రెండవ ప్రతాపరుద్రుని కాలం

వాడంటారు. కాని అతనికి రాజాదరణ వున్నట్లుగాని ఆ రాజు ఆదరణలో రామాయణం వ్రాసినట్లుగాని కన్పించడంలేదు. భాస్కరుడు సాహిణి మారన అనే అశ్వసైన్యాధ్యక్షుని ఆశ్రయంలో రచించాడు. తిక్కన కాలంలో తెలుగు సాహిత్యం సామంతరాజుల ఆదరణలోనే వికసించింది.

## తిక్కన

తిక్కన నెల్లూరును పాలించిన తెలుగు చోడరాజు మనుమసిద్ధి ఆస్థానంలో మంత్రి దండనాథుడు. తిక్కన వంశపారంపర్యంగా వస్తున్న కవిత్వ పాండిత్యాలు మంత్రాంగాలకు నిలయమైనాడు. తిక్కన తన తాత "గుంటూరు విభుడు, మంత్రి భాస్కరుడు, సార కవితాభిరాము"ని తలచుకొనైనా తన కావ్యాన్ని లోకం ఆదరిస్తుందని నిర్వచనోత్తర రామాయణంలో చెప్పుకున్నాడు. తిక్కన పెద తండ్రి అయిన భాస్కరుని కేతన సంస్కృతంలో బాణుడు వ్రాసిన కాదంబరి గద్యకావ్యాన్ని తెలుగులో చంపూమార్గంలో అనువదించాడు. గొప్ప వీరుడైన ఖడ్గతిక్కన తిక్కన పెదతండ్రి సిద్ధన కొడుకు. తిక్కన తండ్రి కొమ్మన దండనాథుడు సాంగవేదవేది. ఆ విధంగా తిక్కన వంశం కవిత్వ పాండిత్య శౌర్యాలకు ఆలవాలమైంది.

తిక్కన తనను గురించి ఎక్కువగా చెప్పకోకపోయినా అతడు అంకితంగా పొందిన మూలఘటిక కేతన దశకుమారచరిత్రను బట్టి అతని వ్యక్తిత్వాన్ని గురించి చాలా విషయాలు తెలుస్తున్నాయి. తిక్కన గొప్ప పండితుడు నన్నయ వలెనే అతడు వేదాది సమస్త విద్యాభ్యాసి. నానావేదాంగ తత్త్వజ్ఞుడు. సకలాగమతత్త్వార్థ విచారోదారుడు. అనూన తపస్స్వాధ్యాయాది సుకృత పరిపాలకుడు. కేతన తిక్కనను సోమయాజిగా పేర్కొనకున్నా అతడనేక యాగాలు చేసినట్లుగా చెప్పాడు -

సతతాధ్వరక్రియా కర్మఠపాణి పద్మడు, మఖ సంతోషిత మరుత్సమాజుడు. యాజకమండలోత్తముడు. తిక్కన రాజకీయ చతురుడు కూడా. నీతి చాణుక్యుడు. సామాద్యుపాయవిదుడు. నీతి నిపుణ మతిజిత పురుహూతామాత్యుడు. నన్నయేమో మత్యమరాయోధిపాచార్యుడనని చెప్పుకున్నాడు. తిక్కన అరిసచివ మహోపాయాపహరుడు దుర్గమశాత్రవపార్శ్వభేది. తిక్కన గొప్పకవి మయూరసన్నిభకవి. మహాకవి. అతడు బాణోచ్ఛిష్టం జగత్త్రియమన్న మాటలకు తగిన వాడట. తిక్కన స్వయంగా కవేకాక మంత్రిగా రాజకీయాధికారంలో వుండి ఎందరో కవులనాదరించాడు. కవి పోషకుడయ్యాడు. అందుకే కేతన అతన్ని - పోషిత సత్కవీంద్రుడని కవీంద్రలోకాధారుడని కవిజన రాజకీరసహకారమని కవి సరోజమార్తాండుడని ప్రస్తుతించాడు. కేతన లాగానే తిక్కన నభిమానించిన కవులు కావ్యాలనంకితంగా ఇచ్చిన కవులు మారన వంటి కవిశిష్యులు ఎందరో వుండివుంటారు. తిక్కన ఆశ్రిత జనపోషకుడు. బంధుజనపోషకుడు. తోషిత బంధువర్గుడు. తేజోవంతుడు. సుందరుడు. సలిలనిధి గంభీరుడు. వినయనిధి. ఉదారుడు - అని ఎన్నో తిక్కన గుణగణాలను కేతన వర్ణించాడు.

తిక్కన స్వయంగా కవి పండితుడు కవిజన పోషకుడే కాక రాజకీయాధికార ప్రాభవం కలవాడు. ఆశ్రితకవిబంధుజన పోషకుడైన తిక్కన ఒక సంస్థ వంటివాడని చెప్పవచ్చును. ఆశ్రయాన్ని అర్థించి వచ్చిన, కవితా ప్రశంసలనందుకోదలచి వచ్చిన, పాండిత్య ప్రదర్శనలు చేసి సన్మానాలందుకోదలచిన కవిపండితులతో రాజకీయావసరాలతో వచ్చే పోయే వారి జనంతో బంధుజనులతో తిక్కన గృహం ఒక చిన్న రాజదర్బారులాగా వుండేది కావచ్చును. కేతన వంటి కవులు అతనికి కావ్యాలనంకితంగా ఇచ్చారు. మారన వంటి శిష్యులు అతని వరప్రసాదంచేత కవిత్వం చెప్పగలిగారు. బయ్యన కవిత్వం చెప్పి తిక్కనను మెప్పించి "భవ్యభారతి"అనే బిరుదాన్ని పొందాడు. అందుకే కేతన తిక్కనను "సుకవీంద్రబృంద రక్షకుడెవ్వడనిన

వీడను నాలుకకు తోడవైనవాడు....... దశదిశా విశ్రాంత యశుడు...... సకల విద్యాకళాచణుడు..... మనుమసిద్ధి మహేశసమస్త రాజ్యభాగ్యధౌరేయుడు..." అని పొగిడాడు.

మనుమసిద్ధి తన దాయాదుల చేతిలో రాజ్యాన్ని కోల్పోయినప్పుడు తిక్కన ఓరుగల్లుకు పోయి గణపతిదేవ చక్రవర్తిని మెప్పించి సైన్యసహాయం తెచ్చి మనుమసిద్ధిని తిరిగి సింహాసనస్థునిగా చేసాడు. ఆ తర్వాతనే తిక్కన రాజకీయ జంజాటాన్నంతా వదలుకొని సోమయాగం చేసి సోమయాజియై మహాభారత రచనకు పూనుకొనివుంటాడు. తిక్కన గణపతి చక్రవర్తికి మహాభారతాన్ని చదివి వినిపించాడని దానికి చక్రవర్తి సంతోషించి ఏం కావాలో కోరుకొమ్మన్నాడని అప్పుడు తిక్కన మనుమసిద్ధి రాజ్యలాభాన్ని అర్థించాడని కాసె సర్వప్ప వ్రాసిన సిద్ధేశ్వరచరిత్రలో వున్నది. అయితే గణపతి చక్రవర్తికి తిక్కన వినిపించింది అతడు అనువాదం చేస్తున్న మహాభారతమని కొందరి అభిప్రాయం. తిక్కన అప్పటికి మహాభారతానువాదాన్ని ఆరంభించి వుండడని సంస్కృతమహాభారతాన్ని వినిపించాడని కొందరి అభిప్రాయము. అనువాదానికి పూర్వం తిక్కన వ్యాస భారతాన్ని ఎన్నోసార్లు చదివి అధ్యయనం చేసి వుంటాడు. దాన్నే వ్యాఖ్యానపూర్వకంగా గణపతి చక్రవర్తికి వినిపించి వుంటాడని ఆధునిక విమర్శకుల అభిప్రాయం.

తిక్కన మొదటి రచన నిర్వచనోత్తర రామాయణం. మనుమసిద్ధి తనను మామా అని పిలుస్తాడు. కాబట్టి ఆ పిలుపు సార్థకమయ్యేటట్లుగా తిక్కన తన కావ్య కన్యకను అతనికంకితంగా ఇచ్చాడు. నిర్వచనోత్తర రామాయణం నిర్వచనంగా అంటె వచన భాగం లేకుండా కేవలం పద్యమయంగా వ్రాయబడింది. తిక్కనకు పూర్వం అతని తాత భాస్కరుడు పూర్వరామాయణం వ్రాసాడని అందుకే తిక్కన ఉత్తరరామాయణ రచన చేసాడని అంటారు. కాని అది నిరాధారం."ఎత్తరినైనను ధీరోదాత్త నృపోత్తముడు రామధరణీపతి

సద్వృత్తము సంభావ్యమగుట నుత్తర రామాయణోక్తియుక్తుడనైతిన్" అని తిక్కన తన రచనకు కారణాన్ని చెప్పుకున్నాడు. తిక్కన నాటికి రంగనాథ భాస్కర రామాయణాలున్నాయి. రాముని ప్రభుధర్మాన్ని ఉదాత్తంగా చిత్రించే ఉత్తరరామాయణ కథ తిక్కనను ఆకర్షించి వుంటుంది. అందుకే ఆ కావ్యరచనకు పూనుకొని వుంటాడు.

తిక్కన వాల్మీకి ఉత్తరరామాయణాన్ని వున్నదున్నట్లుగా అనువాదం చేయలేదు. దాన్ని స్వతంత్రానువాదంగానే చేసాడు. వర్ణనల్లో పాత్రచిత్రణలో తిక్కన ఆంధ్రతాముద్రను వేసాడు. స్వతంత్రించి సీత పాత్రను తీర్చిదిద్దాడు. వాల్మీకి రాముని దృష్టితో ఉత్తరరామాయణాన్ని వ్రాయగా తిక్కన సీత దృష్టితో వ్రాసాడు. దాన్ని సీతచరితగా చేసాడు. కావ్యాన్ని పురవర్ణనతో ఆరంభించి కావ్యత్వాన్ని ఇచ్చాడు. తిక్కన "సంస్కృతశబ్దము తెలుగుబడి విశేషణంబు"గా బుధజనులు మెచ్చేటట్లుగా ఈ కావ్యాన్ని రచించాడు. మహాభారతంనాటికి తిక్కన తెలుగుబడి విశేషణం ఇంకా పూర్తిగా తేటపడింది. నిర్వచనోత్తర రామాయణ పీఠికలో తిక్కన తనను గురించి "అమలోదత్త మనీష నేనుభయ కావ్యప్రౌఢి పాటించు శిల్పమునం బారగుండం గళావిదుడ"నని గర్వంగా చెప్పుకున్నాడు. కవిత్వమంటె ఎట్లా వుండాలో గర్వోక్తులతో చెప్పాడు. కుకవులను నిరసించాడు. తిక్కనలోని ఈ ఔద్ధత్యం మహాభారతరచనా కాలం నాటికి లేదు. మహాభారత రచనాకాలంలో అతడు కవిత్వాన్ని "ఆరాధనా విశేషంగా" భావించాడు. "నా నేర్చిన భంగి చెప్పి వరణీయుడనయ్యెద భక్త కోటికిన్" అని వినయంగా చెప్పుకున్నాడు. "కావున భారతామృతము కర్ణపుటంబుల నారగ్రోలి యాంధ్రావలి మోదముంబొరయునట్లుగ" వ్రాస్తానన్నాడు. నన్నయ రెండున్నర పర్వాల వరకే రచించి విడిచిపెట్టిన మహాభరతానువాదాన్ని దాదాపు రెండువందల సంవత్సరాలైనా ఎవరు చేపట్టలేదు. తిక్కన ఆంధ్రావలికి సంతోషమయ్యేటట్లుగా మహాభారతానువాదానికి పూనుకున్నాడు.

నన్నయ పద్దెనిమిది పర్వాలను వ్రాయాలనే సంకల్పంతోనే మహాభారతానువాదాన్ని ఆరంభించాడు. కాని ఏ కారణంచేతనో పూర్తి చేయలేకపోయాడు."బుధ సంతోషంబు నిండారగ"మిగిలిన 15 పర్వాలను తిక్కన కవిత్వదీక్షావిధితో పండితులే కాదు సమస్త ఆంధ్రప్రజలు సంతోషించేటట్లుగా వ్రాస్తానన్నాడు. తిక్కనకు నన్నయ అంటే అపార గౌరవం. "మహితాత్ముడు నన్నయభట్టు దక్షత" తో మహాభారతం మూడు పర్వాలను వ్రాసాడంటాడు. తిక్కన తాను మహాభారతానువాదానికి మొదటి నుంచి పూనుకోక నన్నయ రచననే కొనసాగించాడు.15 పర్వాలు వ్రాసిన అతనికి 3 పర్వాలు వ్రాయడం కష్టం కాదు. కాని నన్నయ ఏ ఉద్దేశంతో మహాభారతానువాదానికి పూనుకున్నాడో తిక్కన ఉద్దేశం కూడా అదే. కాబట్టి నన్నయ కావ్యమార్గాన్ని నిలిచి పోకుండా ముందుకు సాగించాడు. దానివల్ల నన్నయ కీర్తి అజరామరమైంది. అతని కవితోద్దేశం ఫలించింది.

నన్నయకాలంలో జైన బౌద్ధమతాల విజృంభణతో వైదికమతానికి ఆదరణ తగ్గింది. ఆ వైదికమతోద్ధరణ బ్రాహ్మణానురక్తిని కలిగించే దృష్టితో నన్నయ భారత రచనకు పూనుకున్నాడు. తిక్కన కాలంలో శైవం వీరశైవం రూపం ధరించి విజృంభించింది. వైదిక కర్మకాండను వర్ణాశ్రమ ధర్మాన్ని నిరసించింది. ఇంకోవైపు వైష్ణవం వ్యాపిస్తున్నది. పల్నాడులో వైష్ణవం వీర వైష్ణవరూపం ధరించింది. ఈ పరిస్థితులను గమనించిన తిక్కన శివకేశవ భేదం లేని హరిహరద్వైతాన్ని ప్రబోధించాడు. హరిహరునికే తన మహాభారతాన్ని అంకితంగా ఇచ్చాడు. ఆ విధంగా తిక్కన హరిహరనాథరూపంలో మత సామరస్యాన్ని బోధించి శాంతిదూత ప్రవక్త అయినాడు. గుజరాతు దేశంలో హేమచంద్రాచార్యుడు క్రీ.శ 1088-1192 కవి పండితుడు. అన్హిలవాడ రాజధానిగా సోలంకి రాజులు జయసింహ కుమారపాలుర ఆస్థానంలో మంత్రిగా వున్నాడు. అనేక కావ్యరచనలు చేసాడు. కవి పోషకుడు. శిష్యపరంపర కలవాడు. అతడు స్వయంగా జైనుడై వుండి గుజరాతులో జైన

హిందూ మతసామరస్యాన్ని సాధించాడు. హేమచంద్రుని వంటి ప్రజ్ఞాశాలి తిక్కన. ఆంధ్రదేశంలో అతడు శైవవైష్ణవ సామరస్యాన్ని సాధించి జ్ఞానాద్వైతాన్ని బోధించాడు. నన్నయ వైదిక ధర్మోద్ధరణ కోసం బ్రాహ్మణానురక్తి పెంపు కోసం మహాభారతాంధ్రీకరణకు పూనుకున్నాడు. కాని తిక్కన మహాభారతం "సమస్త దురితాపహంబును నభిమత శుభావహంబు" అని వేదాల్లో అఖిలస్మృతుల్లో బహుపురాణాల్లో చెప్పే ధర్మార్థకామ మోక్షస్థితిని బోధించేది కాబట్టి "అమ్మహా కావ్యంబు నర్థంబు సంగతంబు చేసెద" నని "బుధసంతోషంబు నిండారగ" రచించెదనని చెప్పాడు. తిక్కన నాటికి బ్రాహ్మణానురక్తిని బోధించే అవసరం లేకపోయింది. అప్పుడు "ధర్మాద్వైత స్థితి"ప్రధానమైంది.

తిక్కనకు ఒక రాత్రి స్వప్నంలో హరిహరనాథ దేవుడు కన్పించి మహాభారతాన్ని రచించి తనకంకితమియ్యమని అర్థించాడు. ఆ దేవుని అభ్యర్థన వల్ల తన జన్మ సార్థకమైందని తిక్కన తలంచి మహాభారత రచనకు పూనుకున్నాడు. అతడు వర్ణించిన హరిహరమూర్తి భౌతికంగా శివకేశవుల కలయిక అయినా అతడు నిజంగా ఆరాధించింది ఉపనిషత్ప్రతిపాదిత మైన నిర్గుణ పరబ్రహ్మమే.

తిక్కన నిర్వచనోత్తర రామాయణాన్ని నిర్వచనంగా పద్యకావ్యంగా వ్రాసాడు. మహాభారతాన్ని నన్నయ చంపూమార్గం లోనే "మహాకవిత్వదీక్షావిధి నొంది పద్యముల గద్యములన్ రచియించెదం కృతుల్" అన్నాడు. భాషవిషయంలో తిక్కన శివకవుల దేశిఉద్యమం చేత ప్రభావితుడై దేశిపద భరితంగా తెలుగు నుడికారంతో వ్రాసాడు. తిక్కన గణపతిదేవ చక్రవర్తి క్రీ.శ (1199-1261) నర్థించి తెచ్చిన సైన్యసహాయంతో క్రీ.శ 1261కి పూర్వమే మనుమసిద్ధిని రాజుగా పునఃప్రతిష్ఠితునిగా చేసాడు. క్రీ.శ 1290 లో మనుమసిద్ధి దుర్బుద్ధితో రుద్రమదేవి మీద తిరుగుబాటు చేయగా

రుద్రమదేవి అతన్ని యుద్ధంలో చంపి అతని కొడుకు నల్లసిద్ధిని సామంత రాజుగా కుర్చోబెట్టింది. అయితే తిక్కన అంతవరకు జీవించి వుండలేదని అతని కాలం క్రీ.శ 1205-1288 అని పండితుల అభిప్రాయం. మనమసిద్ధిని పునః ప్రతిష్ఠితుని చేసి తిక్కన రాజకీయాల నుంచి విరమించుకొని ప్రశాంత జీవితాన్ని గడుపుతూ సోమయాజియై మహాభారత రచనకు పూనుకొని వుంటాడు.

## ఆంధ్రావలి మోదముంబొరయునట్లుగ

"కావున భారతామృతము కర్ణపుటముల నారఁగ్రోలి యాంధ్రావలి మోదముం బొరయునట్లుగా సాత్యవతేయ సంస్మృతిలి, శ్రీవిభవాస్పదం బయిన చిత్తముతోడ మహాకవిత్వ దీక్షావిధి"తో రచిస్తానని తిక్కన ప్రతిజ్ఞ చేసాడు. ఆంధ్రులు సంతోషించేటట్లుగా వ్రాస్తానన్నాడు. అంటె నన్నయ భారతరచన అర్థాంతరంగా ఆగిపోవడం శతాబ్దం రెండు శతాబ్దాలైనా దాన్ని చేపట్టేవాడు లేకపోవడం ఆంధ్రులకు సంతాపాన్ని కలిగించి వుంటుంది. అథర్వణుడు భారతరచనను విరాట పర్వమాదిగా చేపట్టాడు కాని అది వైదిక బద్ధంగా కాక జైనమతానుసారంగా నడిచిందట. అది ఆంధ్రులకు ఆనం దాన్ని కలుగజేయలేదు. తిక్కన యజ్ఞవిధితో పవిత్రుడై నన్నయ మార్గంలోనే భారత రచన చేస్తున్నాడని మూల రూపం-పంచమ వేదరూపం చెడకుండా రచిస్తున్నాడని తెలిసినప్పుడు ఆంధ్రులు ఆనందానికి అవధుల్లేకుండా పోయాయి. చాలామంది అతన్ని అభినందించి వుంటారు. అందుకే తిక్కన ప్రత్యేకంగా ఆంధ్రావలి ఆనందం పొందేవిధంగా వాళ్ళకు ఆనందకారకంగా రచిస్తానని మహాకవిత్వదీక్షతో - విఘ్నాలు లేకుండా సాంతంగా రచిస్తానని "జనాభ్యర్చితమైన" భారతాన్ని "నా నేర్చిన భంగి జెప్పి వరణీయుడ నయ్యెద భక్తకోటికిన్" అన్నాడు. ఆ భక్తకోటియే ఆంధ్రావలి ! అదే విధంగా

సంస్కృత సాహిత్యంలోను బాణుని మరణంతో కాదంబరికావ్యం అసం పూర్ణంగా మిగిలి పోగా పండితులు బాణతనయున్ని దాన్ని పూర్తిచేయమని అర్థించారట. వాళ్ళ సంతోషం కోసం బాణతనయుడు కాదంబరిని పూరించాడు. అదే విధంగా తిక్కన ఆంధ్రుల అసంతృప్తిని పోగొట్టేందుకు నన్నయ మార్గాన్నే అనుసరిస్తూ మహాభారత రచనకు పూనుకున్నాడు.

## తిక్కన కవిత్వం

తిక్కన మహాభారతరచనోద్దేశం ధర్మప్రబోధమే అయినా అతడు గొప్ప కవి కాబట్టి అతని మహాభారతం గొప్ప కావ్యంగా వెలిసింది.తిక్కనకు కవిబ్రహ్మ ఉభయకవిమిత్రుడని బిరుదాలున్నాయి. బ్రహ్మ ఈ సృష్టిని సృష్టించినట్లుగా తిక్కన కవితాసృష్టిని చేసి తన నైపుణ్యాన్ని చూపాడు. కవిబ్రహ్మ బిరుదం సార్థకమైంది. "కవిత చెప్పి యుభయ కవిమిత్రు మెప్పింప నరిది బ్రహ్మకైన " అని "తెనుగున సంస్కృతమున చతురుండై" తిక్కన ఉభయకవి మిత్రనామము ధరించాడని కేతన అన్నాడు. ఉభయ అంటె సంస్కృత తెలుగు కవులకు-ఇద్దరికీ మిత్రుడని అర్థం. కన్నడ శివకవుల్లో రాఘవాంకునికి (క్రీ.శ 1250 - 300) "ఉభయకవి కమలరవి" అనే బిరుదముంది. తిక్కన బిరుదు కూడా అటువంటిదే.

తిక్కన "నానారసాభ్యుదయోల్లాసి"గా విరాటోద్యోగ పర్వాలు మొద లుకొని 15 పర్వాలు రచించాడు. శాంత శృంగార కరుణ వీర రౌద్ర అద్భుత బీభత్సాది రసాలను తిక్కన సందర్భానుకూలంగా వర్ణించాడు. తిక్కన అచ్చమైన తెలుగుకవి. తెలుగువారి జాతీయ కవి అని చాలామంది పండితుల అభిప్రాయం. అతడు ప్రయోగించిన భాషాపదాలు వాక్య నిర్మాణాలు నుడికారాలు పలుకుబడులు అతన్ని అచ్చమైన తెలుగు కవిగా

నిలబెడ్తున్నాయి. అంతేగాక తిక్కన దేశీయమైన ఆచార వ్యవహారాలను వర్ణించాడు. పాత్రలన్నీ తెలుగు వారిలాగానే కనిపిస్తాయి. ఉదాహరణకు మూలాతిరిక్తంగా తిక్కన ఉత్తరాభిమన్యుల వివాహాన్ని తెలుగు వారి ఆచారాలు సంప్రదాయాలు ప్రతిబింబించేటట్లుగా వ్రాసాడు. ఉత్తరుడు తను పాండవులకు మేనల్లుడనని గర్వంగా చెప్పుకోవడం మూలంలో లేదు. మేన సంబంధాలంటే అభిమానమున్న తిక్కన తెలుగు హృదయకల్పనే అది. శివకవుల దేశికవితోద్యమం తిక్కన భాషలో పాత్రల చిత్రణలో ఆచారవ్యవహారాల వర్ణనలో ప్రభావం చూపిందని చెప్పాలి. తిక్కన రచన అలతి అలతి పదాలతో తెలుగునుడికారంతో సమాసరహితంగా రసవంతంగా నడిచింది. "జాత్యము గామి నొప్పయిన సంస్కృతమెయ్యెడ జొన్ప" నని తిక్కన నిర్వచనోత్తర రామాయణంలోనే చాటాడు. దాన్ని మహాభారతంలో ఎక్కువగా పాటించాడు. తిక్కన మహాభారతానువాదం నన్నయ మార్గంలోనే అనవసరమనుకొన్న వృత్తాంతాలను అనౌచిత్యాలను పరిహరిస్తూ ఔచిత్యాన్ని పోషిస్తూ కావ్యమార్గంలో నడిచింది.

తిక్కన కవిత్వంలో చెప్పుకోదగిన గుణాలు-సజీవపాత్ర చిత్రణ, నాటకీయత, రసాభ్యుచితబంధం, అర్థగాంభీర్యం, రాజనీతిజ్ఞతలు.

మహాభారతంలో విభిన్న మనస్తత్వాలుగల పాత్రలున్నాయి. అవి రామాయణంలో లాగా ఆదర్శ పాత్రలు కావు. లోకంలో కన్పించే వ్యక్తులకు ప్రతినిధులు. మానవ సహజమైన బలహీనతలు సుగుణాలు ఆ పాత్రల్లో కన్పిస్తాయి. ఆ పాత్రలను తిక్కన తన వర్ణనలతో సజీవం చేసాడు. పాత్రల ప్రతి కదలికను అంతరంగంలోని ఆలోచనలను తిక్కన సూక్ష్మంగా వర్ణించాడు. పాత్రల సంభాషణలను నిత్యజీవితానికి దగ్గరగా వుండేటట్లు వ్రాసాడు. దాంతో ప్రతి పాత్ర ఒక్కొక్క వ్యక్తిత్వంతో మన కనులముందు నిలుస్తుంది. ప్రతిపాత్ర నైజాన్ని తిక్కన తన జీవితానుభవంతో చక్కగా

వర్ణించాడు. మూలమహాభారతంలో లేని పాత్రచిత్రణ కవిబ్రహ్మ తిక్కన చేతిలో సజీవంగా జరిగింది.

తిక్కన నాటక శిల్పం అద్వితీయ మైంది. కథను ఘట్టాలుగా సన్నివేశాలుగా విభజించుకొని పాత్రల సంభాషణల ద్వారా కథను నడిపించడంతో నాటకీయత సాధింపబడుతుంది. నాటక శిల్పంలో సజీవ పాత్రచిత్రణ సంభాషణలు చాలా అవసరం. ప్రతిపాత్రను పాఠకుల మనోనేత్రాలకు గోచరించేటట్లుగా తిక్కన వర్ణించాడు. దాంతో రంగస్థలం మీద నటుల అభినయాన్ని ప్రత్యక్షంగా చూచిన విధంగా పాఠకులు తిక్కన కావ్యపఠనంద్వారా మనః ఫలకంమీద చూడగల్గుతున్నారు. పాత్రల సంభాషణలతో తిక్కన కథను నాటకంలో లాగా నడిపాడు. పాత్రల కదలికల చేష్టల వర్ణనల వల్ల పాత్రల సంభాషణల వల్ల పాఠకునికి నాటక దర్శనానందం కలుగుతున్నది. దాని వల్ల రసావిష్కారం సులభంగా జరుగుతున్నది. అదే నాటక శిల్పంలోని రహస్యం.

తిక్కన మితభాషిగా కన్పిస్తాడు. తక్కువ మాటల్లో ఎక్కువ అర్థాన్ని ఇమిడిస్తాడు. ప్రతిపద్యంలో తిక్కన చెప్పిన అర్థాలను ఆలోచించి తెలుసుకొని ఆనందించి ముందుకు వెళ్ళవలసి వుంటుంది. తక్కువ మాటల్లో ఎక్కువ అర్థాన్ని చెప్పడమే అర్థగాంభీర్యగుణం. సంస్కృతంలో భారవిమహాకవి అర్థగంభీరతకు ప్రసిద్ధమైనవాడు. ఆ విధంగానే తెలుగులో తిక్కన అర్థగంభీరతకు ప్రసిద్ధమైన వాడు. వీరరసాభిమాని. యుద్ధవర్ణనా ప్రీతి కలవాడు. తిక్కన కూడా భారవి లాగానే బ్రాహ్మక్షాత్ర తేజస్సులు కలవాడు. తిక్కన రచించిన మహాభారతం 15 పర్వాల్లో ఎక్కువభాగం యుద్ధవర్ణనలున్నాయి. వాటిని అతడు విసుగు పుట్టించకుండా వర్ణించాడు. తిక్కన రచనలో యుద్ధ వర్ణనలేకాక ధర్మవేదాంత వైరాగ్యాది విషయాలు కూడా వున్నాయి. దాన్నంతా అతడు సరళమైన తేట తెలుగులో వ్రాసాడు. తెలుగు భాషకు

ఇన్ని విషయాల భావవ్యక్తీకరణ జేసే సామర్ధ్యం వుందని నిరూపించిన మహాకవి తిక్కన. "మడుగు చీరయందు మసిదాకినట్లు,పాలలో పడిన బల్లి విధంబున, నిప్పులు వేడిమి సెడినయట్లు, చిచ్చొడిం గట్టినయట్లు, కంటికి రెప్పయుబోలె, నూతి కప్ప విధమున, అందని మ్రాకుల పండ్లు కోయదలచుట, పాము బొదివి పడదిగిచిన చీమలమిగ యట్లు" మొదలయిన జాతీయాలు పదబంధాలు తిక్కన అర్ధగాంభీర్యతకు తోడ్పడినాయి. తిక్కన దేశీభాష సొగసుతనాన్ని పోషించాయి. తిక్కన తన సరళమైన భావాలతో ధ్వని స్ఫోరకతతో పాత్రల చిత్రణతో సంభాషణాశైలితో వివిధరసాలను చక్కగా స్ఫురింపజేసాడు. అంటె విభావానుభావాదుల వర్ణనలతో తిక్కన రసస్ఫోరకతను సాధించిన మహాకవి.

తిక్కన మంత్రి కాబట్టి స్వయంగా రాజనీతిజ్ఞానం కలవాడు. తెలుగుసాహిత్యంలో రాజనీతితో ప్రత్యక్షపరిచయం గల కవులు ఇద్దరు. ఒకరు-తిక్కన, మరొకరు శ్రీకృష్ణదేవరాయలు. భారతంలో సంజయ శ్రీకృష్ణరాయబార ఘట్టాలను తిక్కన మూలంలో కన్నా చక్కగా రచించాడు. తిక్కన స్వయంగా రాయబారం నడిపినవాడు. కాబట్టి ఆ రచనానైపుణ్యం అతనికి సాధ్యమైంది. సంజయ రాయబారఘట్టంలో ధర్మరాజు ధృతరాష్ట్రుల వ్యక్తిత్వాలు స్పష్టంగా చిత్రింపబడినాయి. ధర్మరాజు ఒక రాజనీతిజ్ఞుడైన వ్యక్తిగా అక్కడ దర్శన మిస్తాడు. అదే విధంగా శ్రీకృష్ణుని సంధి ప్రయత్నాలను భేదోపాయలను తిక్కన బాగా వర్ణించాడు. ఆ సందర్భాల్లో తిక్కన రచన వక్రోక్తులతో ధ్వని స్ఫోరకంగా చక్కని తెలుగునుడికారంతో అనితరసాధ్యంగా సాగించాడు.

భారత రచనలో వ్యాసునిది ఇతిహాసదృష్టి పురాణదృష్టి కాగా తిక్కనది కావ్యకళాదృష్టి. భారతం కావ్యకళ దెబ్బతింటున్నదనే కావచ్చును తిక్కన భగవద్గీతను అనువదించకుండా వదిలేసాడు. కాని శాంతి అనుశాసనిక పర్వాల్లో ఆధ్యాత్మిక విషయాలను తిక్కన చాల సులభమైన శైలిలో రచిం

చాడు. యుద్ధానంతరం ధర్మరాజు చిత్తం అశాంతిని పొందడం ఆముష్మిక విషయాసక్తం కావడం మొదలయిన ఘట్టాలను తిక్కన గొప్పగా వ్రాసాడు. మహాభారత రచనా సమయంలో తిక్కన మనస్సూ ధర్మరాజు మనస్సులాగా ఐహిక విషయవాంఛలకు దూరమై ఆముష్మిక వ్యగ్రమై వుంది కావచ్చును. అందుకే తిక్కన ధర్మరాజు మనస్సును సహజంగా వర్ణించగలిగాడు.

తిక్కన విజయసేనం అనే కథాకావ్యాన్ని వ్రాసాడంటారు. అది అలభ్యం కాని ఆకావ్యంలోని 15 పద్యాలు సంకలన గ్రంథాల్లో ఉదాహరించబడి దొరికాయి. ఒకవేళ అది తిక్కన మొదటి రచనేమో. అదేగాక తిక్కన కవిసార్వభౌమ ఛందస్సు కృష్ణశతకం వ్రాసాడని అంటారు. కృష్ణశతకం అలభ్యం. కవిసార్వభౌమఛందస్సు 36 పంక్తుల రచన. అది తిక్కన రచనగా లేదు.

## కేతన

కేతన తిక్కన సమకాలికుడు. అభిమాని. అతడు వేంగిదేశంలోని వెంటిరాల గ్రామనివాసి. అతడు నెల్లూరు చేరుకొని తిక్కననాశ్రయించాడు. దండి సంస్కృతంలో వ్రాసిన దశకుమారచరిత్ర గద్యకావ్యాన్ని చంపూ పద్ధతిలో అనువదించాడు. దాన్ని తిక్కనకు అంకితమిచ్చాడు. కవి మరోకవికి అంకితంగా ఇయ్యడం అపూర్వ విషయం.

దశకుమారచరిత్ర కథాకావ్యం. తెలుగులో లభించిన కథాకావ్యాల్లో మొదటిది. తిక్కన విజయసేనం, భాస్కరుని కేతన కాదంబరి కథాకావ్యాలు దొరక లేదు. దశకుమార చరిత్రలో పది మంది కుమారుల సాహసప్రేమ కథలున్నాయి. కవి సందర్భానుకూలంగా ఆంధ్రుల ఆచారాలను వర్ణించాడు. దశకుమారచరిత్రలో శైలి దీర్ఘ సమాసాలు లేక సరళసులభంగా వుంది.

కేతన దశకుమార చరిత్రనే కాక ఆంధ్రభాషాభూషణం, విజ్ఞానేశ్వరీయా లను వ్రాసాడు. ఆంధ్రభాషాభూషణం తెలుగులో తెలుగుభాషకు వ్రాసిన మొదటి వ్యాకరణగ్రంథం. దీనిననుసరించి చిన్నయసూరి బాలవ్యాకరణంలో కొన్ని. సూత్రాలను రచించాడు. కన్నడంలో క్రీ.శ. 1042లో నాగవర్మ "కర్నాట భాషా భూషణం" పేరుతో కన్నడ వ్యాకరణాన్ని వ్రాసాడు. అదే పేరుతో కేతన తన గ్రంథాన్ని "ఆంధ్రభాషా భూషణం" అని అన్నాడు. నాగవర్మ కూడా వేంగినాడు వాడే.

విజ్ఞానేశ్వరీయం ధర్మశాస్త్ర గ్రంథం. యజ్ఞవల్క్యస్మృతికి విజ్ఞానేశ్వరుడు "మితాక్షరి" పేరుతో వ్యాఖ్యను వ్రాసాడు. ఆ వ్యాఖ్య సుప్రసిద్ధమై వార సత్వం, స్త్రీధనం మొదలయిన విషయాల్లో ఈనాటికి బెంగాల్ మొదలయిన ప్రాంతాల్లో వాడుకలో వుంది. ఆంధ్రదేశంలోను అవే న్యాయ నియమాలు అనుసరింపబడటం చేత కేతన దాన్ని అనువదించి వుంటాడు. దీనిలో 433 పద్యాలున్నాయి. కేతన వ్రాసిన మూడు రచనలు ఆయా ప్రక్రియల్లో మొదటి రచనలు.

## మారన

మారన తిక్కన శిష్యుడు. ఈ కవి అనువదించిన మార్కండేయ పురాణం తెలుగులో మొదటి పురాణం. తాను తిక్కన సోమయాజి అనుగ్రహం వల్లనే కవిత్వం చెప్పగలిగానని మారన అశ్వాసాంత గద్యంలో చెప్పుకున్నాడు. ఈ కృతిని మారన కాకతీయ చక్రవర్తి రెండవ ప్రతాపరుద్రుని (క్రీ.శ. 1295-1323) సేనాపతి నాగయగన్ననికి అంకితంగా ఇచ్చాడు. ఈ గన్నయ రాయచూరు శాసనంలో చెప్పబడిన గోన గన్నారెడ్డియే అని పండితుల అభిప్రాయం. తిక్కన ఓరుగల్లు పోయినప్పుడు మారన అతని శిష్యునిగా చేరివుంటాడు.

మార్కండేయ పురాణంలో మారనశైలి సుకుమారంగా రమ్యంగా వుంది. ఈ పురాణంలోని కథలను తీసుకొని తర్వాత కవులు స్వతంత్రకావ్యాలు వ్రాసారు. హరిశ్చంద్ర కథ, వరూధినీ ప్రవరుల కథ, మదాలసకువలయాశ్వుల కథలు కావ్యంగా వెలిసాయి. పెద్దనవంటి కవి మనుచరిత్రలో మారన భావాలను, పద్యాలను అనుకరించాడు. ఈ పురాణంలో ఇంకా బహుళాశ్వ చరిత్ర, రుచి ప్రజాపతి, మానినీరాజవర్ధనుల కథలు మరుత్తు వృత్తాంతాలు రమ్యమైనయి వున్నాయి. మహిషాసుమర్ధనను మారన ఆవేశంతో వ్రాసాడు.

## మంచన

సంస్కృతంలో రాజశేఖరుడు (క్రీ.శ 880-920) వ్రాసిన విద్ధసాల భంజిక అనే నాటకం కథ ఆధారంగా తీసుకొని ఇంకా కొన్ని కథలను సందర్భానుసారంగా చేర్చి మంచన "కేయూరబాహు చరిత్ర" అనే కథాకావ్యాన్ని వ్రాసాడు. మంచన చేర్చిన కథలు పంచతంత్రంలోని నీతి కథలు. మొత్తం 22 కథలను కవి చెప్పాడు. ప్రధాన కథతో ఈ కథలకు సంబంధంలేకున్నా కవి సందర్భోచితమనిపించేటట్లుగా సరళ శైలిలో సరసంగా వ్రాసాడు. సంస్కృత నాటకాన్ని తెలుగులో కావ్యంగా మలచడంలో ఇది మొదటి ప్రయత్నం. మంచన పద్యాలు ధారాళంగా నడిచాయి. కథాకథనం బాగా వుంది. ప్రధానకథ శృంగార రసభరితంగా వుంది. కవి సరళమైన శైలిలో వ్రాసాడు.

మంచన తన కేయూరబాహు చరిత్రను వెలనాటిని పాలించిన పృథ్వీశ్వరుని (క్రీ.శ. 1206) మంత్రి నందూరి కేతనకు మనుమడైన గుండనకు అంకితమిచ్చాడు. అప్పుడు మంచనకాలం క్రీ.శ. 1250 ప్రాంతమని చెప్పవచ్చును.

# 6. ఎఱ్ఱన యుగం

రాజమహేంద్రవరం పెద్దమసీదులో క్రీ.శ 1324 నాటి గియాసుద్దీన్ శాసనం వుంది. ఆ ప్రాంతంలో అతని నాణాలు కూడా దొరికాయి. దాన్ని బట్టి ఓరుగల్లు కాకతి ప్రతాపరుద్రుని మరణంతో కాకతి సామ్రాజ్యం అంతరించిందని ఆంధ్రదేశాన్ని తురుష్కులు ఆక్రమించారని తెలుస్తున్నది. తురుష్కుల పాలనలో దేవాలయాలు ధ్వంసం చేయబడినాయని ప్రజలకు పన్నుల భారమధిక మైందని పండితుల అగ్రహారాలకు నష్టం ఏర్పడిందని ప్రోలయనాయకుని శాసనంవల్ల తెలుస్తున్నది. గియాసుద్దీన్ స్వయంగా మతసహనం కలవాడనే సమకాలికులు చెప్పారు. కాని విజేతలైన వాళ్ళు విజితులను నష్టపరచడమనేది వుంటుంది. మొత్తం మీద గియాసుద్దీన్ రాజనీతిని మతసహనాన్ని సహించక ఉలేమాలు అంటె తురుష్కమతాచార్యులు ఎదురు తిరిగారు. దాంతో అతనికి విరుద్ధంగా దేశవ్యాప్తంగా తిరుగుబాట్లుజరిగాయి. ఆ కల్లోల పరిస్థితిని ఆసరాగా తీసుకొని ఆంధ్రదేశంలో దక్షణ తెలంగాణాలో రేచెర్ల సింగమనాయకుడు, ఉత్తర తెలంగాణా ఉత్తర తీరాంధ్రంలో ముసునూరి ప్రోలయనాయకుడు, దక్షిణ తీరాంధ్రంలో ప్రోలయ వేమారెడ్డి స్వతంత్రించి రాజ్యాలు స్థాపించారు. క్రీ.శ 1325 నాటి మల్లవరం శాసనంలో ప్రోలయ వేమారెడ్డి "మ్లేచ్ఛాబ్ధి కుంభోద్భవ" బిరుదాన్ని ధరించిందాన్ని బట్టి తురుష్కుల పాలన ఒకటి రెండు సంవత్సరాల కన్నా సాగలేదని అదనుచూసుకొని ముగ్గురు నాయకులు విజృంభించి

ఆంధ్రదేశాన్ని పరపాలననుంచి రక్షించి ధర్మరక్షణ చేసారని చెప్పవచ్చును. క్రీ.శ 1328 లో మహమ్మదు బిన్ తుగ్లక్ ఆనెగొంది రాజధానిగా గల కంపిలి రాజ్యాన్ని జయించి రాజప్రతినిధిని ఏర్పాటు చేసాడు. కాని ప్రజలతని మీద తిరుగుబాటు చేయగా ఢిల్లీ సుల్తాన్ స్థానికులైన హరిహర బుక్కరాయలను రాజుగా మంత్రిగా నియమించాడు. హరిహరబుక్కరాయలు మొదట కాకతి ప్రతాపరుద్రుని కొలువులో వుండి ఆ రాజ్య విధ్వంసంతో కంపిలికి వెళ్ళారు. కంపిలిని జయించి సుల్తాన్ వాళ్ళను బందీగా తీసుకపోయాడని స్థానిక ప్రజల తిరుగుబాటుతో వాళ్ళను ముస్లింలుగా మార్చి రాజప్రతినిధులుగా పంపాడని అంటారు. ముస్లింలైన వాళ్ళను విద్యారణ్యుడు హిందూవులుగా మార్చి విద్యానగరం నిర్మాణం చేసి వాళ్ళను స్వతంత్ర రాజ్యస్థాపనకు ప్రోత్సహించాడని స్థానిక చరిత్రలు చెప్తున్నాయి. విద్యానగరమే తర్వాత విజయనగరమైంది. క్రీ.శ. 1335 లో హరిహరుడు ఆనెగొందిలో రాజయినాడు. ఆ తర్వాత హరిహరబుక్కరాయ సోదరులు క్రమంగా విజయాలు సాధించి క్రీ.శ. 1343లో రాజధానిని నిసర్గదుర్గమైన విజయనగరానికి మార్చుకొని స్వతంత్రించి విజయనగర రాజ్యస్థాపన చేసారు.

హరిహరబుక్కరాయల తండ్రి పేరు సంగముడు. అందుకే ఆ రాజవంశానికి సంగమవంశమని పేరు. వాళ్ళు దాదాపు 150 సంవత్సరాలు 15 మంది రాజులు ఆంధ్ర కర్ణాటక తమిళ ప్రాంతాలతో కూడిన విజయనగర రాజ్యాన్ని పాలించాడు. మొదట హరిహరుడు (1336-1365) తర్వాత బుక్కరాయలు (1357-1377) పాలించారు. రెండవ హరిహరుని (1377-1404) తర్వాత కుటుంబ కలహాలు ఏర్పడనాయి. రెండవ దేవరాయలు 1426-1446 మధ్యకాలంలో పాలించాడు. సంగమ వంశంలో ప్రసిద్ధుడు. అతనికే ప్రౌఢ దేవరాయలని పేరు. శైవాభిమాని అయినా మతసహనాన్ని చూపాడు. అతని ఆస్థానంలో సంస్కృత కన్నడ తమిళ తెలుగు కవులు ఆదరింపబడినారు. స్వయంగా పండితుడైన దేవరాయలు

పండిత గోష్ఠుల్లో పాల్గొనేవాడు. అతని కాలంలోనే అబ్దుర్రజాక్ నికోలోవంటి విదేశీయాత్రికులు విజయనగరాన్ని దర్శించి దాని వైభవాన్ని వర్ణించారు. రెండవ దేవరాయల తర్వాత రాజులైన వాళ్ళు అసమర్థులు కావడంతో బహమనీ, కళింగరాజులు విజృంభించారు. ఈ అల్లకల్లోల పరిస్థితులను చూసి సామంతుడైన సాళువ నరసింహరాయలు తుళువనరసరాయల సహాయంతో విజయనగరాన్ని క్రీ.శ. 1485 ప్రాంతంలో వశపరచుకొన్నాడు. అతడు దాదాపు 20 సంవత్సరాలు పాలించాడు. వీరుడు. అనేక విజయాలు సాధించాడు. బహమనీ కళింగరాజులను పారదోలాడు. విజయనగరాన్ని బలపరిచాడు. కవులను పండితులనాదరించాడు. నరసింహుడు కొడుకులు ఇద్దరిని తుళవ నరసనాయకుని చేతిలో పెట్టి మరణించాడు. వాళ్ళలో ఒకడు అకాలమృత్యువు పాలయ్యాడు. మరొకన్ని బందీగా చేసి తుళువ నరసరాజు విజయనగరానికి దాదాపు క్రీ.శ. 1505లో రాజైనాడు. దాంతో తుళవ వంశ పాలన ప్రారంభమైంది.

హరిహర బుక్కరాయల వలెనే రేచెర్ల సింగమనాయకుడు, ముసునూరి ప్రోలయ నాయకుడు, ప్రోలయ వేమారెడ్డి కాకతి ప్రతాపరుద్రుని కొలువులో సేనానులుగా సామంతులుగా వున్నవారే. కాకతి సామ్రాజ్య వినాశంతో ఏర్పడిన రాజకీయాస్థిరతను వాళ్ళు తొలగించి స్వతంత్రమైన రాజ్యాలను స్థాపించారు. కాకతీయసామ్రాజ్య శిథిలాల నుంచి నాలుగు రాజ్యాలేర్పడినాయి. వాళ్ళు పరస్పరం యుద్ధాలు చేసినా దేశం అన్యాక్రాంతం కాకుండా ధర్మవినాశం జరుగకుండా విజాతీయ సంస్కృతి ప్రవేశించకుండా దాదాపు రెండు శతాబ్దాల కాలం పాలించారు. ఉత్తర భారతం తురుష్కుల ఆక్రమణలో మునిగి వున్న కాలంలో తురుష్కుల దండయాత్రల నరికట్టి ఆ నాయకులు జాతి దేశం పరాక్రాంతం కాకుండా పరిరక్షించారు.

ముసునూరి ప్రోలయ రేకపల్లి రాజధానిగా పాలించాడు. అతని తిరుగుబాటులో అతని పినతండ్రి కొడుకు కాపయనాయకుడు, ప్రోలయ వేమారెడ్డి సహకరించారు. ప్రోలయ నష్టమైన అగ్రహారాలను నిలిపి హిందూ ధర్మాన్ని పునరుద్ధరించాడు. ప్రోలయ తర్వాత కాపయరాజైనాడు. వాళ్ళకు రేచర్ల రాజులకు నిరంతరం యుద్ధాలు జరిగాయి. రేచర్ల సింగమనాయని కొడుకు అనపోతానాయనితో జరిగిన యుద్ధంలో క్రీ.శ. 1366లో కాపయనాయకుడు ఓడిపోయి మరణించాడు. దాంతో ముసునూరి వంశమంతరించింది. క్రీ.శ. 1347 లో హసన్‌గంగూ గుల్బర్గా రాజధానిగా బహీమనీ రాజ్యాన్ని స్థాపించాడు. హసన్ గంగూకు కాపయనాయకుడు రాజ్యస్థాపనలో సైన్యసహాయం చేసాడని ఫెరిస్తా అనే చరిత్రకారుడు వ్రాసాడు. తర్వాత దక్షిణదేశ రాజకీయాల్లో బహమనీ రాజ్యం చాల కీలకమైన పాత్ర వహించింది. బహమనీ రాజులతో యుద్ధాల్లో కాపయ అధికారబలం కదిలింది. తను సహాయంచేసి నిలిపిన బహమనీ రాజ్యం తననే కబళిస్తుందని ఆయన గ్రహించలేక పోయాడు. దూరదృష్టిలేని స్వార్థపు రాజకీయాలతోనే దేశం పరాక్రాంతమౌతుంది. తీరాంధ్రంలో కాపయ అధికారం నశించింది. ఓరుగల్లు భువనగిరి దుర్గాలు రేచెర్ల వెలమరాజుల వశమైనాయి.

రేచర్ల సింగమనాయని తర్వాత అనపోతానాయుడు రాచకొండను దుర్భేధ్యమైన కోటగా నిర్మించుకొని రాజధానిని ఆమనగల్లు నుంచి అక్కడికి మార్చాడు. అతని రాజ్యం శ్రీశైలం నుంచి మధ్య తెలంగాణా వరకు విస్తరించింది. తన రాజ్యాన్ని రెండుగా విభజించి దేవరకొండలో తన తమ్ముని మాదానాయున్ని నియమించాడు. అట్లా రెండు వెలమ రాజ్యాలేర్పడినాయి. వెలమలకు పద్మనాయకులని పేరు. విష్ణుపాదాలనుంచి పుట్టినందున వాళ్ళకా పేరు వచ్చిందంటారు. వెలమల్లో 17 గోత్రాల వాళ్ళున్నారు. వాళ్ళలో రేచెర్ల గోత్రం ఒకటి. పల్నాటి వీరచరిత్రలో బ్రహ్మానాయుడు రేచెర్ల గోత్రం వాడు. కాకతీయుల కాలంలో పద్మనాయకులు

సేనానులుగా ప్రాబల్యం కలిగివున్నారు. వెలుగోటి వారి వంశావళిలో భేతాళనాయకుడు వెలమల మూలపురుషుడుగా చెప్పబడినాడు. చెవిరెడ్డి కాకతీయులకు సామంతుడుగా పిల్లలమర్రిని పాలించాడు. పిల్లల మర్రి వెలమలు రెడ్డి పదాన్ని ధరించారు. భేతాళనాయకుడే బ్రహ్మనాయుడని కొందరంటారు. బ్రహ్మనాయుడు చాతుర్వర్ణ స్త్రీలను వివాహమాడాడు. వాళ్ళ సంతతి వాళ్ళే వెలమలైనారని ఒక వాదం. బ్రహ్మనాయుడు వీర వైష్ణవుడు. వెలమలు కూడా వైష్ణవాన్ని అభిమానించారు. దక్షిణదేశం నుంచి వలసవచ్చిన 'వెల్లాల' కులం వాళ్ళే ఆంధ్రదేశంలో రాజకీయోద్యోగులు, సామంతులు, పాలకులై వెలమలుగా ప్రసిద్ధి చెందారని మరోవాదం. మొత్తం మీద రెడ్లతో పాటు వెలమలు కాకతీయులను సేవించి తర్వాత స్వతంత్ర రాజ్యాన్ని స్థాపించి ధార్మికంగా సాంస్కృతికంగా తమ ప్రభావాన్ని చూపారు. సాహిత్యాభిమానంతో స్వయంగా పండితులై కవులై పండితులను కవులను ఆదరించారు.

రాచకొండ దేవరకొండ రేచెర్లరాజులు బహమనీలతో సఖ్యం చేసి ముసునూరి వంశాన్ని అంతమొందించారు. రేచర్ల వంశంలో అనపోతని కొడుకు రెండవ సింగమనాయుడు ప్రసిద్ధుడు. (1383-99) పండితుడు. కవి. వీరుడు. బహమనీల అండదండలతో కళ్యాణ దుర్గాన్ని జయించి విజయస్తంభం నాటినట్లుగా విశ్వేశ్వరుని సంస్కృత అలంకారశాస్త్రగ్రంథం చమత్కారచంద్రికను బట్టి తెలుస్తున్నది. విజయనగరం, కొండవీటి రాజులతో అతనికి పోరాటాలు జరిగాయి. రెండవ సింగమ తర్వాత అతని కొడుకు రెండవ అనపోతానాయుడు రాజైనాడు. అనేక యుద్ధాలు చేసి విజయాలు సాధించిన వీరుడని వెలునోటివారి వంశావళి వల్ల తెలుస్తున్నది. రెడ్డివెలమ రాజులకు జరిగిన యుద్ధాల్లో పానగల్లు దుర్గం కీలక పాత్ర ధరించింది. పానగల్లులో జరిగిన ఘోరయుద్ధంలో దేవరకొండ రాజు పినవేదగరి పెదకోమటి వేముని తమ్ముడు మాచారెడ్డిని చంపాడు.

దానికి ప్రతీకారంగా పెదకోమటి వేముడు దేవరకొండను ముట్టడించి పినవేదగిరిని చంపాడు. రెండవ అనపోతన పినవేదగిరి సోదరుడు లింగ మనీడుతో కలిసి కొండవీటిమీదికి దండెత్తి పోయి పెదకోమటివేముని చంపి అతని శిరస్సును తమ్మపడిగలో సమర్పించాడట. దాంతో కొండవీటి రాజ్యం అంతరించింది.రెండవ అనపోతని తర్వాత అతని తమ్ముడు మాదానాయుడు (క్రీ.శ 1421-30)పాలించాడు. అతడు పండితుడు. వైష్ణవమతాభిమాని.రామానుజాచార్యుల కొడుకు వేంకటాచార్యుని శిష్యుడు. అతని తర్వాత రెండవ అనపోతన కొడుకు వేంకటాచార్యుని శిష్యుడు. మూడవ సింగమనాయుడు రాజైనాడు. అతనికి సర్వజ్ఞ బిరుదముంది. అతడు వీరుడు. అయినా బహమనీలు దాడులు చేసి దేవరకొండ తప్ప మిగతా తెలంగాణాన్నంతా జయించారు. సర్వజ్ఞ సింగనకు నిలువనీడ లేక పోయింది. క్రీ.శ. 1453 నాటిది అతని చివరి శాసనం గుంటూరు జిల్లా బెల్లంకొండలో దొరికింది. కళింగలో గంగవంశరాజు కపలేశ్వరుని సహాయంలో సర్వజ్ఞ సింగమ తమ్ముడు క్రీ.శ. 1464 లో రాజయినాడు. కాని కపిలేశ్వరుని మరణంతో తిరిగి తెలంగాణా బహమనీల వశమైంది. దాంతో రేచర్ల వెలమరాజుల చరిత్ర సమాప్తమైంది. క్రీ.శ. 1475లో బహమనీసుల్తాన్ రెండవ మహమ్మదుషా తెలంగాణాకు ప్రతినిధిగా కుతుబ్ ఉల్ముల్క్‌ను పంపాడు. అతని బిరుదనామం పేరుతో కుతుబ్‌షాహి వంశనామమేర్పడింది. క్రీ.శ. 1518లో అతడు స్వతంత్రించి ఆంధ్రదేశంలో ఉత్తరభాగంలో గొలకొండ రాజ్యాన్ని స్థాపించాడు. అప్పటి నుంచి తెలంగాణా క్రీ.శ. 1948 వరకు ముస్లింల పాలన కింద వుండిపోయింది. పారశీ ఉర్దూ భాషాసంస్కృతుల చేత ప్రభావితమైంది.

రెడ్డిరాజులు మొదట అద్దంకి ఆ తర్వాత కొండవీడు రాజధానిగా సింహాచలం నెల్లూరు మధ్యవున్న తీరాంధ్రాన్ని ఒక శతాబ్దానికి పైగా పాలించారు. క్రీ.శ. 6 వ శతాబ్దం నుంచే ఆంధ్రదేశంలో కాపుల పేర్ల

చివర రట్టకుడి, రట్టగుడి అనే పదం చేర్చబడి కన్పిస్తున్నది. రట్టకుడి పదమే రట్టోడి, రట్టడి, రడ్డిగా మార్పు చెంది రెడ్డిగా స్థిరపడిందంటారు. క్రీ.శ. 16 వ శతాబ్దంలో కూడా రట్టడి, రడ్డి, అనే పదాలే కన్పిస్తున్నాయి. రడ్డి ——> రెడ్డిగా ఆధునిక కాలంలోనే మారింది. రట్టకుడి పదం "రాష్ట్రకూట" అనేది పదం నుంచి వచ్చిందని "రాష్ట్ర కూట" ఉద్యోగం పేరని కొందరి అభిప్రాయం. రాష్ట్రకూట పదం కన్నా రట్టకుడి పదం ప్రాచీనమైందని "రట్టకుడి" కి సంస్కృతీకరణమే రాష్ట్రకూట పదమని కొందరు భావిస్తున్నారు. అశోకుని శాసనంలో 'రథిక' ఒక దాక్షిణాత్యజాతిగా పేర్కొనబడింది. అశోకుని శాసనాల్లో రాష్ట్రిక, రాట్రక, రిష్టిక, రెట్ట రూపాలున్నాయి. శాతవాహన శాసనాల్లో మహారథులున్నారు. ఖారవేలుని హాథీగుంఫ శాసనంలో రథికుల ప్రస్తావన వుంది. అనేక జాతుల సమ్మేళనంతో ఆంధ్రులేర్పడినారు. అనేక జాతుల్లో రట్టజాతి ఒకటని 'రట్ట' పదం నుంచే రడ్డి - రెడ్డి వచ్చిందని చెప్పాలి. వాళ్ళు ముఖ్యంగా వ్యవసాయం వృత్తిగా కలవాళ్ళు అవసరమైనప్పుడు శస్త్రాలను ధరించి యుద్ధాలు చేసేవాళ్ళు. క్రీ.శ. 7వ శతాబ్దం నుంచి వాళ్ళు మళ్ళీ తలెత్తి రాజకీయోద్యోగులుగా సేనానులుగా వున్నారు. కాకతీయ సామ్రాజ్య పతనానంతరం స్వతంత్ర రాజ్యాన్ని ఏర్పరిచారు.

రెడ్డి రాజులవంశానికి కోమటి ప్రోలయరెడ్డి మూలపురుషుడు. ప్రోలయ కొడుకు ప్రోలయ వేమారెడ్డి రెడ్డిరాజ్యాన్ని స్థాపించాడు. ఎర్రన తన హరివంశంలో "శ్రీ పార్వతీశ భక్తి వ్యాపిత గుణ ఘూడెరాయ గురుకృపా స్థాపిత సామ్రాజ్య సముద్దీపిత వేమక్షితీంద్ర" అని అన్నాడు. విజయనగరంలో హరిహర బుక్కరాయలకు క్రియాశక్తి గురువుకాగా వేమారెడ్డికి ఘూడెరాయుడు గురువని తెలుస్తున్నది. ఇద్దరూ శైవులే. కాకతీయులకు సామంతుడుగా వున్న వేమారెడ్డి వాళ్ళు అంతరించింతర్వాత స్వతంత్రించి రాజ్యవిస్తరణ చేసాడు. మ్లేచ్ఛాబ్ధి కుంభోద్భవుడైన వేమారెడ్డి క్రీ. శ.

1324-25 లో అద్దంకి రాజధానిగా స్వతంత్ర రాజ్యం ఏర్పరుచుకున్నాడని మల్లవరం శాసనం ప్రకారం తెలుస్తున్నది. అతడు క్రీ.శ. 1353 వరకు పాలించాడు. విజయనగర రాజుల అధీనంలో వున్న పాకనాడును జయించి కొండవీడు కందుకూరు కొండపల్లి దుర్గాలను నిర్మించి బలమైన సైన్యాలను నిల్పాడు. ప్రోలయకు రాజ్యవిజయాల్లో రక్షణలో అతని సోదరులు అండగా నిల్చారు. అతడు అన్న మాచారెడ్డిని చందోలు దుర్గానికి, తమ్ముడు మల్లా రెడ్డిని కందుకూరుకు అధిపతులుగా నియమించాడు. మల్లారెడ్డి వీరుడు. సర్వసైన్యాధ్యక్ష పదవినదిష్ఠించాడు. సాహిత్యాభిమాని. ఎర్రన మొదట మల్లారెడ్డికే పరిచయమయ్యాడు. అతడే ఎర్రనను వేమారెడ్డి దగ్గరకు చేర్చి ఆస్థానకవిగా చేసాడు. వేమారెడ్డితోనే ఆంధ్రదేశంలో ధర్మస్థాపన అనేది ఆరంభమైంది. తురుష్కుల దండయాత్రల్లో నష్టమైన అగ్రహారాలను అతడు పునరుద్ధరించాడు. అనేక గ్రామభూదానాలు చేసి "నిస్సీమ భూదాన పరశురామ" అని బిరుదాన్ని ధరించాడు. అనేక దానాలు వ్రతాలు చేసి శ్రీశైల క్షేత్రంలో పాతాళగంగకు సోపానాలు నిర్మించిన శైవాభిమాని. ఆహోబల క్షేత్రంలోను సోపానాలు నిర్మించి తన మతసహనాన్ని చాటుకున్నాడు.

వేమారెడ్డి తాతపేరు కోమటి అని వుంది. ఆ తర్వాత ఆ వంశంలో కోమటి నామధేయులున్నారు. కోమటి అనే పేరును బట్టి వేముడనే కోమటిని హత్యచేసి అతని దగ్గరున్న పరుసవేదిని సంపాదించి ధనికులయ్యారని స్థానిక చరిత్రల్లోకి ఎక్కింది. కాని కోమటి అన్నది "గోమతేశ్వర" రూపాంతరమైన పేరు. ఆ వంశజులు మొదట కాకతీయులవలె జైనాన్ని అభిమానించి తర్వాత శైవాభిమానులై వుంటారు. అప్పుడు "భీమేశ్వర"నామ రూపాంతరమైన 'వేమ' పేరును ధరించారు. రాచకొండ రాజులు వైష్ణవాభిమానులు కాగా రెడ్డి రాజులు శైవాభిమానులయ్యారు. బ్రాహ్మణ భక్తితో "అనవరత పురోహితకృత.సోమపాన" "ధర్మప్రతిష్ఠాగురు"లని కీర్తిం

పబడినారు. అటువంటి ధర్మస్థాపకులైన రాజుల అండదండలో వుండి ఎర్రన అరణ్యపర్వశేషం, హరివంశం రచించి నన్నయ ఆరంభించిన మహాభారత రచనాక్రతువును సుసంపన్నం చేసాడు. తిక్కన తర్వాత దాదాపు ఒక శతాబ్దకాలానికి నన్నయ భారత రచనను కొనసాగించే శాంతి భద్రతలు ధార్మికవాతావరణం ఏర్పడినాయి. ఆ వాతావరణంలో ఎర్రన మహాభారత రచనను పూర్తిచేసి కవిత్రయంలో స్థానం సంపాదించుకున్నాడు. ఎర్రన రామాయణాన్ని రచించాడు. అహోబలక్షేత్రమాహాత్మ్యాన్ని కీర్తిస్తూ నరసింహపురాణాన్ని రచించాడు. ఆ కాలం నుంచే అహోబలక్షేత్రం ఒక వైష్ణవ క్షేత్రంగా అభివృద్ధి చెందింది. అహోబలమఠం వెలిసింది. అక్కడి ఆచార్యులు ఆంధ్రదేశంలో వైష్ణవాన్ని వ్యాపింపజేసారు. అది బలమైన వైష్ణవ కేంద్రంగా మారింది. తర్వాత సింగన అనంతామాత్యుని వంటి కవులు తమ కావ్యాలను అహోబల నరసింహస్వామి కంకితమిచ్చారు. రాజమహేంద్రవరంలో చాళుక్య రాజు రాజరాజనరేంద్రుని ప్రోత్సాహంతో ఆరంభమైన ఆంధ్రమహాభారత రచన నెల్లురూలో తిక్కన, అద్దంకిలో ఎర్రనలతో దాదాపు 300 సంవత్సరాలకు పరిసమాప్తమైంది. మహాభారతాన్ని ఖిలపర్వమైన హరివంశంతో పరిసమాప్తి చేయడానికి అద్దంకిలో ప్రయత్నాలు జరుగుతున్న కాలంలోనే విజయనగరరాజుల ఆస్థానంలో నాచన సోమన "తిక్కన సోమయాజి ప్రణీతంబైన శ్రీ మహాభారత కథానంతరంబున.........ప్రణీతంబైన యుత్తర హరివంశ"ము అని ఆశ్వాసాంత గద్యంలో చేర్చి చెప్పిందాన్ని బట్టి మహాభారత పరిసమాప్తికి పూనుకున్నాడని తెలుస్తున్నది. ఈ విధంగా ప్రభువుల ధార్మికాభిమానం దేశ శాంతిభద్రతలతో ముడివడి తెలుగు సాహిత్యం వికసించింది. మొదటిసారిగా ఈ యుగంలోనే రాజులు చక్రవర్తులు ఆస్థానంలో తెలుగు కవుల నాదరించి రచనలకు ప్రోత్సహాన్నిచ్చారు. తెలుగుకు సంస్కృతంతో సమానంగా గౌరవం లభించింది.

ప్రోలయ వేమారెడ్డి తర్వాత రెడ్డిరాజ్యాన్ని అతని తమ్ముడు అనపోతారెడ్డి (క్రీ.శ. 1353-64) కొడుకు అనవేమారెడ్డి (క్రీ.శ 1364-86) పాలించారు. అనపోతారెడ్డి రాజధానిని అద్దంకి నుంచి కొండవీటికి మార్చాడు. అతని కాలంలో మోటుపల్లి నుంచి ఎగుమతి దిగుమతి వ్యాపారానికి ప్రోత్సాహమియ్యబడింది. అనవేమారెడ్డి వీరుడు. వేంగిని జయించాడు. ప్రోలయ వేమన వలెనే వాళ్ళిద్దరు వైదిక ధర్మాభిమానులు. శివభక్తి తత్పరులు. దానవ్రతాలు నిర్వహించారు. అనవేమన తర్వాత అతని కొడుకు కుమారగిరి క్రీ.శ. 1386-1402 మధ్య పాలించాడు. అతని కాలంలో మాచారెడ్డి పౌత్రుడు పెద్ద కోమటి వేమారెడ్డి రాజ్యాక్రమణ చేయడానికి ప్రయత్నించాడు. ఆ తరుణంలో కుమారగిరికి అతని బావ మరిది వీరుడైన కాటయవేముడు శ్రీకృష్ణుడు ధర్మరాజునాదుకున్నట్లు ఆదుకున్నాడు. పెదకోమటి, విజనయగర రాజుల దండయాత్రలతో దేశంలో అశాంతి ఏర్పడింది. కళింగ యుద్ధంలో కుమారగిరికి అల్లాడరెడ్డి అతని కొడుకులు వేమ వీరభద్ర దొడ్డా రెడ్లు చాల పరాక్రమం చూపి తోడ్పడినారు. కుమారగిరి కొడుకు అనపోతారెడ్డి మరణంతో అతడు విశాదగ్రస్తుడైనాడు. రాజ్య రక్షణార్థమై కుమారగిరి రాజమహేంద్రవర రాజ్యానికి కాటయవేముని అధిపతిగా చేసాడు. కుమారగిరి మరణం తర్వాత కాటయవేముని రాజ్యం అతని కూతురు అనితల్లికి సంక్రమించింది. ఆమె భర్త అల్లాడరెడ్డి కొడుకు వీరభద్రారెడ్డి రాజమహేంద్రవరానికి రాజైనాడు. అతనికి సహాయుడుగా వుండి అతని అన్న వేమారెడ్డి పరిపాలించాడు. కొండవీటి రాజ్యానికి పెదకోమటివేమారెడ్డి రాజయి క్రీ.శ 1402-20 మధ్య పాలించాడు. విజయనగర బహమనీ రాజమహేంద్రవరం నుంచి జరిగే దండయాత్రలతో పెదకోమటి పాలన అశాంతిగానే సాగింది. రాచకొండ సర్వజ్ఞ సింగభూపాలునితోజరిగిన యుద్ధంలో (క్రీ.శ 1420) పెదకోమటి వేమారెడ్డి మరణించాడు.అతని తర్వాత అతని కొడుకు రాచవేమన క్రీ.శ 1420-24 మధ్య పాలించాడు. అంతటితో కొండవీటి రాజ్యమస్తమించింది.

ఆ తర్వాత రాజమహేంద్రవరంలో వేమారెడ్డి వీరభద్రారెడ్డిల పాలన కొంత కాలం సాగింది. క్రీ.శ 1446లో విజయనగర కళింగుల దండ యాత్రలతో రెడ్డి రాజ్యం అతరించింది. ప్రోలయ వేమారెడ్డి సోదరుడు మల్లారెడ్డి వంశజులు కందుకూరు రాజధానిగా క్రీ.శ 1324 నుంచి ఒక శతాబ్ద కాలం పాలించారు. మల్లారెడ్డి పౌత్రుడు శ్రీగిరి సమర్ధవంతుడైన రాజు సంగీత సాహిత్యవిశారదుడు. కళాపోషకుడు. చివరకు విజయనగర రాజుల దాడులను వాళ్ళు కూడా తట్టుకోలేక పోయారు.

ఈ యుగంలో రాచకొండ కొండవీటి విజయనగరరాజులు హిందూ ధర్మాబిమానంతో మతసహనంతో ధర్మరక్షణ దృష్టితో పాలించారు. తురుష్కుల దండ యాత్రలతో క్షతి పొందిన హిందూధర్మం ఉద్ధరణ ఈ కాలంలో జరిగింది. నాలుగు వేదాలకు సాయణాచార్యులు భాష్యం రచించాడు. బుక్కరాయల మంత్రి మాధవాచార్యుల తమ్ముడు సాయణుడు. విద్యారణ్యులు మాధవాచార్యులు ఒక్కరే అని ఒక వాదం. కర్మ మీమాంసా మార్గాన్ని ప్రబోధిస్తు సాయణుడు వేదభాష్యాలు రచించాడు. అంతేగాక అతడు "యజ్ఞ తంత్ర సుదానిధి, జైమినీయ న్యాయమాలావిస్తరమనే గ్రంథాలు రచించాడు. యజ్ఞ ప్రాధాన్యాన్ని బోధించే మీమాంసామార్గంలో సాయణుడు వేదాలకు భాష్యం వ్రాసినా ఆ కాలంలో శంకరాచార్యుల అద్వైతం ఉత్తరమీమాంసామార్గమే వ్యాప్తిలోకి వచ్చి బ్రాహ్మణుల్లో స్మార్త శాఖ ఒకటి ఏర్పడింది. సాయణుని వేదభాష్యాలతో హిందువులకు మతం మీద విశ్వాసం ఏర్పడి ముస్లింలను నెదుర్కొనే ఆత్మశక్తిని ప్రసాదించిందని చెప్పవచ్చును. ఉత్తర భారతంలో ఆ కాలంలో కృష్ణరామభక్తి ఉద్యమాలు వ్యాపించి హిందూధర్మోద్ధరణను చేసాయి. దక్షిణ దేశంలో అంతకుముందున్న మతకలహాలు మతహింసలు సమసిపోయి కొంత మతసహనం ఏర్పడింది. అందుకే శంభుదాసు అని పేరు ధరించి శివాభిమాని అయిన ఎర్రన ప్రహ్లాద చరిత్రను వైష్ణవభక్తిని చాటే కావ్యం రచించాడు.

రాచకొండ కొండవీటి విజయనగర రాజులు పరస్పరం కలహించు కుంటు బహమనీ కళింగుల దండయాత్రలను ఎదుర్కొంటు యుద్ధాలతో రాజకీయాలతో తీరుబడి లేకున్నా సాహిత్యాన్ని కళలను అభిమానించారు. అగ్రహారాది దానాలతో బ్రాహ్మణులను ఆదరించారు. ఆ రాజులు తెలుగును అభిమానించినా వాళ్ళు చాలా శాసనాలు సంస్కృతంలో కూడా వేయించారు.సంస్కృత సాహిత్యాన్ని అభిమానించారు. స్వయంగా కవి పండితులై సంస్కృత రచనలే చేసారు. అంటే తెలుగు భాషాసాహిత్యాలు రాజ గౌరవాన్ని పొందినా ఇంకా సంస్కృతం మీద అభిమానం చావలేదని తెలుస్తున్నది. ఉత్తర భారతంలో భక్తి ఉద్యమాలతో ప్రజల వాడుక భాషలు సాహిత్యభాషలుగా స్వీకరింపబడినాయి. సంస్కృతానికి అభిమానం లేకుండా పోయింది. ఆ తరుణంలో క్రీ.శ 14 వ శతాబ్దంలో సంస్కృతం దక్షిణ దేశంలో విశేషాదరణ పొందింది. కాకతీయుల కాలంలో లాగానే ఈ కాలంలో సంస్కృత కావ్యనాటకాదులు, భాష్యాలు, వ్యాఖ్యానాలు, అంకారశాస్త్రాలు సంగీతాది శాస్త్రాలు చాలా వ్రాయబడినాయి. ప్రోలయ వేమారెడ్డి ఆస్థానంలో మహాదేవుడనే సంస్కృత పండతుడు విద్యాధికారిగా వున్నాడు. అనపోతారెడ్డి అనవేమారెడ్డి కాలంలో బాలసరస్వతి త్రిలోచనా చార్యులనే సంస్కృత పండితులున్నారు. కుమారగిరి సంస్కృతంలో వసంత రాజీయమనే నాట్యశాస్త్రాన్ని వ్రాసాడు. కాటయ వేమారెడ్డి కాళిదాసు నాటకత్రయానికి కుమారగిరి రాజీయమనే పేరుతో వ్యాఖ్యానం వ్రాసాడు. అవి ముద్రితమై ఇప్పుడు లభిస్తున్నాయి. పెదకోమటి వేమారెడ్డి సంస్కృతంలో సంగీత చింతామణి సాహిత్య చింతామణి వ్రాసాడు. సప్తశతిసారటీక, అమరుక కావ్యానికి వ్యాఖ్యానం రచించాడు. అతని ఆస్థానంలో వామన భట్టబాణుడనే ప్రసిద్ధ కవి సంస్కృతంలో ఉషాపరిణయం పార్వతీపరిణయం నాటకాలు నలాభ్యుదయం హంస సందేశం వేమభూపాలచరిత్రాది కావ్యాలు వ్రాసాడు. కందుకూరు రాజు శివలింగారెడ్డి గిరీశ

శృతి సూక్తమాలకు వ్యాఖ్యానం వ్రాసాడు. రాచకొండ రాజుల్లో అనపోతానా యుడు సంస్కృతంలో "మదన విలాసభాణం" వ్రాసాడు. ప్రసిద్ధ సంస్కృత నాగనాథుడితని ఆస్థానంలో వున్నాడు. రెండవ సింగభూపాలుడు "రసార్ణ వసుధాకరం" అనే లక్షణ గ్రంథాన్ని "రత్నపాంచాలిక" అనే నాటకాన్ని రచించాడు. అతని ఆస్థానంలో విశ్వేశ్వరుడనే ప్రసిద్ధ ఆలంకారికుడున్నాడు. అప్పయార్యుడు అమరకోశానికి వ్యాఖ్య వ్రాసాడు. సింగభుపాలుని కొడుకు మాదానీడు రామాయణానికి "రాఘవీయు" మనే వ్యాఖ్యానం వ్రాసాడు. సంస్కృతమే రాజుల చేత అభిమానింపబడినా ఈ కాలంలో తెలుగుభాష శైలి ఒక స్థిరరూపాన్ని ధరించాయి. ఈ యుగంలో రామాయణ మహాభార తాల రచనలు సుసంపన్నమయ్యాయి. పురాణాల కథాకథనశైలి స్థానంలో వక్రోక్తితో కూడిన శైలి తెలుగులో రూపొందింది. ప్రబంధ పరమేశ్వరుడైన ఎఱ్ఱన, నవీన గుణసనాథుడైన సోమన ఈ యుగంలో ప్రముఖమైన కవులుగా వెలసి సాహిత్యసృష్టి చేసారు. ఎఱ్ఱన నరసింహపురాణంలో సోమన ఉత్తర హరివంశంలో భావవక్రోక్తులతో కూడిన శైలిలో రీతి సౌందర్యం ప్రకటమైంది. సోమనలో కథాకథనం కన్నా రీతిపాధాన్యం బాగా కన్పించింది. అంతేగాక ఆద్యంతం ఒకే వస్తుసూత్రంలో బంధింపబడిన ప్రబంధ కావ్యాలను ఎఱ్ఱన సోమనలు రచించి తెలుగులో కావ్య ప్రక్రియకు నాందిని పలికారు.

తిక్కన తర్వాత వంద సంవత్సరాల కాలంలో చెప్పుకోదగ్గ కావ్యాలు రాలే దంటె విజాతీయుల దాడులు ఆక్రమణలు, ఆంధ్ర నాయకులు స్వాతంత్ర్య పోరాటాల్లో మునిగి వుండటమే కారణమని చెప్పాలి. ఆంధ్రనాయకులు రాజ్యస్థాపనలు చేసి స్థిరపడి ప్రశాంతకాలం నెలకొన్న తర్వాత ఇటు రెడ్డి రాజుల ఆస్థానంలో అటు విజయనగర ఆస్థానంలోనూ మహాభారతాంధ్రీక రణ పూర్తిచేసే ప్రయత్నాలు జరిగాయి. తెలుగు సాహిత్యం మూడు పూలు ఆరుకాయలుగా కొత్త ప్రక్రియలతో ముందుకు సాగింది.

# ఎఱ్రన

ఎఱ్రన (క్రీ.శ 1280-1364) గుడ్లూరు నివాసి. శివభక్తుడు కావటంచేత శంభుదాసు శివదాసు అనే బిరుదాలను ధరించాడు. ప్రోలయ వేమారెడ్డి (క్రీ.శ 1325-1353) తమ్ముడు మల్లారెడ్డి ఎఱ్రనను తన అన్నగారికి పరిచయం చేసాడు. ఎఱ్రన మొదట రామాయణాన్ని వ్రాసి ప్రోలయ వేమారెడ్డికి అంకితంగా ఇచ్చాడు. కృతిభర్త కోరికననుసరించి ఎఱ్రన ఆ తర్వాత హరివంశాన్ని వ్రాసాడు. ఎఱ్రన వంశీయుడైన చదలవాడ మల్లన తన విప్రనారాయణ చరిత్రలో ఎఱ్రనను "వల్మీకభవు వచోవైఖరి రామాయణంబు నాంధ్రప్రబంధంబు చేసె" అన్నదాన్నిబట్టి ఎఱ్రన వాల్మీకి రామాయణాన్ని అనువాదం చేసినట్లు తెలుస్తున్నది. కాని అది ఇప్పుడు అలభ్యం.

ఎఱ్రన హరివంశాన్ని అనువాదం చేస్తూ మూలంలోని ప్రద్యుమ్నోపాఖ్యానాన్ని హంసడిభకోపాఖ్యానాన్ని అనువదించలేదు. ఎఱ్రన అనుసరించిన సంస్కృత హరివంశంలో ఆ కథలున్నవో లేవో చెప్పలేము. ఎఱ్రన హరివంశంలో "నన్నయభట్ట తిక్కన కవినాథులు చూపిన త్రోవ పావనం బెన్న" అని ప్రస్తుతించాడు. నన్నయ తిక్కనల మహాభారతాంధ్రీకరణం పూర్తికావాలంటే హరివంశం కూడా అనువదింపబడాలి. మహాభారతానికి హరివంశం ఖిలపర్వం లేదా అనుబంధపర్వం అని అంటారు. మహాభారతంలో నాయకుడైన శ్రీకృష్ణుని పూర్వచరిత్ర దానిలో లేదు. కృష్ణుడు మహాభారతం కథ మధ్యలో ప్రవేశిస్తాడు. ఆ లోటును తీర్చడానికి వ్యాసుడు హరివంశాన్ని వ్రాసాడని అంటారు. అట్లా హరివంశపురాణం అనువదింపబడ్డేనే మహాభారతాంధ్రీకరణం పూర్తి అవుతుందన్న ఉద్దేశంతో ప్రోలయ వేమారెడ్డి ప్రేరణతో ఎఱ్రన హరివంశాన్ని రచించి వుంటాడు. ఎఱ్రన హరివంశం అనువాదమైనా ఎన్నో స్వతంత్రవర్ణనలతో సాగింది. శ్రీకృష్ణుని బాల్యక్రీడలు,

గోపకులు వ్రేపల్లెను విడిచిపెట్టి బృందావనానికి పోయే ఘట్టం మొ.వాటిని ఎర్రన సహజమధురంగా ఆంధ్రుల జానపదజీవితం ప్రతిబింబించేటట్లుగా వ్రాసాడు. ఎర్రన శ్రీకృష్ణబాల్యక్రీడాది వర్ణనలను తర్వాత పోతన అనుకరించాడు.

ఎర్రన హరివంశం తర్వాత అరణ్యపర్వశేషాన్ని రచించాడు. నన్నయ అరణ్యపర్వం నాల్గవ ఆశ్వాసంలోని "శారదరాత్రులుజ్జ్వల" అనే 142 వ పద్యం వరకు వ్రాయగా ఎర్రన "స్ఫురదరుణాంశు" అనే పద్యం నుంచి ఆరంభించి అరణ్యపర్వాన్ని పూరించాడు. కొన్ని తాళపత్రప్రతుల్లో అరణ్యపర్వం నాల్గవ ఆశ్వాసం 142 పద్యం తర్వాత "ఇక్కడి నుంచి ఎర్రాప్రెగడ కవిత్వము" అని వుంది. కొన్ని ప్రతుల్లో లేదు. తిక్కన విరాటపర్వం నుంచి అనువాదం చేస్తూ "మూడుకృతు లాంధ్రకవిత్వవిశారదుండు విద్యాదయితుండొనర్చె మహితాత్ముడు నన్నయభట్టు దక్షతన్" అని అన్నాడు. అంటె నన్నయ మూడు పర్వాలను పూర్తిగా వ్రాసాడని తిక్కన మాటలను బట్టి తెలుస్తున్నది. కాబట్టి నన్నయ మూడుపర్వాలు పూర్తిగా వ్రాసాడని తిక్కన నాటికి అవి వున్నాయి కాని తర్వాత శిథిలమైన కొన్ని భాగాలను మాత్రమే ఎర్రన పూరించాడని కొందరు విమర్శకులు భావిస్తున్నారు. తిక్కన కాలం వరకున్న మూడు పర్వాలు తరువాతనే అన్ని ప్రతుల్లో సమానంగా శిథిలం కావడం అందులో అరణ్యభాగంలోనే కావడం అసహజంగా వుంటుంది. కాబట్టి నన్నయ రెండున్నర పర్వాలు వ్రాయగా మిగతాభాగాన్ని ఎర్రన పూరించాడనడమే సహజంగా వుంటుంది. అట్లా అయితే తిక్కన దాన్ని ఎందుకు పూరించలేదని అనుమానం వస్తుంది. ఒక పర్వం మధ్యలో ఆరంభించడం అశుభం అనుకునో లేదా తన మహాభారతాన్ని భగవంతునికి అంకితంగా ఇస్తున్నాడు కాబట్టి మధ్యలో ఆగినచోటునుంచి ఆరంభించడం ఇష్టం లేకనో నిండుగా నాల్గవ పర్వం నుంచి తిక్కన వ్రాసివుంటాడు. ఇక నన్నయ మూడు పర్వాలను వ్రాసాడని తిక్కన చెప్పాడుగదా అంటె - అక్షరాలా మూడే అని మనం తీసుకోకూడదు.

అరణ్య పర్వశేషాన్ని అనువదిస్తూ ఎఱ్ఱన ఆ పర్వంలో తన పేరు చెప్పకోలేదు. నన్నయ పేరు మీదనే రచించాడు. కాని ఎఱ్ఱన అరణ్యపర్వశేషాన్ని వ్రాసాడని లోకంలో వ్యాప్తిలో వుంది. కేవలం ఖిలపర్వం హరివంశం వ్రాయడం వల్లనే కాక అరణ్యపర్వశేషాన్ని వ్రాయడం వల్లనే ఎఱ్ఱనకు కవిత్రయంలో స్థానం లభించివుంటుంది. ఒకవేళ హరివంశం రచించడం వల్ల ఆ స్థానం లభించిందంటె "తిక్కన సోమయాజి ప్రణీతంబైన మహాభారత కథానంతరంబున......నాచన సోమనాథ ప్రణీతంబైన యుత్తర హరివంశం....." అని చెప్పకున్న నాచన సోమనకు కవిత్రయంలో స్థానం లభించాలి కాని లభించలేదు. ఎఱ్ఱన వ్రాసిన భాగాలు నన్నయ వ్రాసిన భాగాలకన్నా కవిత్వంలో భిన్నంగా వున్నాయి. నన్నయ భారతంలోని మధ్యాక్కరల్లో ఐదవ గణాద్యక్షరానికి యతివేసాడు. ఎఱ్ఱన నాల్గవ గణాద్యక్షరంతో యతి వేసాడు. నన్నయ తర్వాత కవులు ఆ విధంగానే వేసారు. ఎఱ్ఱన అనువదించిన ఉపాఖ్యానాలు నన్నయ లాగా కుదించి కాక విస్తరించి వున్నాయి. నన్నయది కథనాత్మక శైలి కాగా ఎఱ్ఱనది వర్ణనాత్మక శైలి. ఎఱ్ఱన నన్నయ పేరుతోనే రచన సాగించినా అతని రచనాసరణి అతన్ని పట్టి ఇస్తున్నాయి. లోకంలో ప్రచారంలో వున్న ఎఱ్ఱన కర్తృత్వం దాంతో బలపడ్తున్నది. అంతేగాక జక్కన తన విక్రమార్క చరిత్రలో ఎఱ్ఱనను "ప్రబంధ పరమేశ్వరుడై విరచించె శబ్దవైచిత్రి అరణ్యపర్వమున శేషము....." అని అన్నాడు. చదలవాడ మల్లన "ప్రతిభతో నారణ్యపర్వశేషము జెప్పె కవులకు చెవుల పండువులుగాగ....." అని అన్నాడు. అంతేగాక ఎఱ్ఱన తన చివరి రచన నృసింహపురాణం పీఠికలో "ప్రబంధ పరమేశుడనంగ నరణ్యపర్వశేషోన్నయ మంధ్రభాష సుజనోత్సవ మొప్పగ నిర్వహించితా, నన్నయభట్ట తిక్కన కవినాథుల కెక్కిన భక్తి పెంపునన్" అని తన తాత గారు చెప్పినట్లుగా చెప్పకున్నాడు. వీటన్నిటిచేత ఎఱ్ఱన అరణ్యపర్వశేషాన్ని రచించాడని నిశ్చయంగా తెలుస్తున్నది.

ఎఱ్ఱన అరణ్యపర్వశేషాన్ని అనువదిస్తూ నన్నయ శైలిని అనుకరించాడు. చివరకు నన్నయ లాగానే రాజరాజనరేంద్రుని సంబోధిస్తూ వ్రాసాడు. నన్నయ మధ్యాక్కరలను ఎక్కువగా వాడాడు. తర్వాత కవులు వాడలేదు. అయినా ఎఱ్ఱన నన్నయ లాగానే వ్రాయాలని మధ్యాక్కరలను కూడా ప్రయోగించాడు. ఎఱ్ఱన అరణ్యపర్వ శేషాన్ని నన్నయ కవిత్వంలాగా ఆరంభించి క్రమంగా తిక్కన ననుకరిస్తు పూరించాడు. మహాభారతాన్ని ఏకబిగిని చదివేవారికి అది అతుకులబొంతగా కాక ఏకకవికృతంగా గోచరిస్తుంది. అందుకే రాధామాధవకవి ఇట్లన్నాడు. "భారత కావ్యహారమొక భాగము నన్నయభట్టొనర్చె ము,క్తా రమణీయ వాక్యముల తిక్కన భాగము సోమయాజి సాం, పారనొనర్చె, రెంటి కలయన్ శివదాసుడు మధ్యనాయక శ్రీ రచియించె శారద ధరింపగ కవిత్రయకీర్తిమించగన్".

ఎఱ్ఱన నృసింహపురాణానికి. "లక్ష్మీనరసింహావతారము" అని పేరు పెట్టాడు. కాని నృసింహపురాణమనే పేరే వాడుకలో వుంది. ఆంధ్ర దేశంలో అహోబలక్షేత్రంలో లక్ష్మీనరసింహుడు వెలిసాడు. ఎఱ్ఱన కావ్యం చివర ఆ క్షేత్ర మాహాత్మ్యాన్ని కొంత చెప్పాడు. బ్రహ్మాండ పురాణంలోని నరసింహావతారకథననుసరించి ఎఱ్ఱన ఈ కావ్యేతివృత్తాన్ని కూర్చాడు. ఎఱ్ఱన స్వప్నంలో కన్పించిన తన తాతగారి కోరిక ననుసరించి అహోబల నరసింహస్వామికి అంకితమిచ్చాడు. ఎఱ్ఱన సహజంగా నిగర్వి. మృదుస్వభావుడు. నృసింహపురాణ రచనాకాలం నాటికతడు ఇంకా వినయసంపన్నుడయ్యాడు. దైవాంకితంగా వ్రాసిన ఎఱ్ఱన నృసింహపురాణం అతడు వార్ధక్యంలో రచించిన చివరి రచన అని చెప్పవచ్చును.

నృసింహపురాణ రచనాకాలంనాటికి ఎఱ్ఱనకు ప్రబంధ పరమేశ్వరుడనే బిరుదముంది. ఆ కావ్యపీఠికలో అతని తాత అతన్ని "...ప్రబంధ రచనా ప్రావీణ్యం నీకు సహజపరిణత సిద్ధంబై వెలసినయది...."అని అంటాడు. శబ్దవై

చిత్రితో అరణ్యపర్వశేషాన్ని వ్రాయడం వల్ల ఎర్రనకు ప్రబంధపరమేశ్వరుడనే బిరుదం వచ్చిందని కొందరి అభిప్రాయం. నన్నయ తిక్కనల కవిత్వానికి ఎర్రన సేతువుగా నిలిచాడు. ఆ ఇద్దరి కవిత్వాలను కలిపి బంధించాడు. కాబట్టి ఎర్రనకు ప్రబంధపరమేశ్వరుడనే బిరుదం వచ్చిందని కొందరి అభిప్రాయం. అతని రామాయణంలో కావ్యశైలి ఎట్లా వుందో చెప్పలేము. కాని నృసింహపురాణంలో ఎర్రన చక్కని కావ్యశైలిని ప్రయోగించాడు. పురాణంలోని ఒక్క ప్రహ్లాదకథను తీసుకొని కావ్యం మొదటి నుంచి చివరికి వరకు ఆ కథనే నడుపుతూ వస్త్వైక్యతను సాధించాడు. కావ్యానికి పురాణమని పేరున్నా అది పురాణం కాదు. తర్వాత శ్రీనాథ పినవీరన పెద్దనాది కవుల కావ్య ప్రబంధాల్లో వలెనే ఒక్క కథను తీసుకొని విస్తరింపజేసి రచించాడు. సందర్భానుకూలంగా. వర్ణనలను చేర్చాడు. రసపోషణ ప్రస్ఫుటంగా వుంది. కవిత్వం ప్రౌఢంగా అలంకార శోభతో కూడి వుంది. ప్రబంధపరమేశ్వరుని సూక్తి వైచిత్రిని శ్రీనాథుడు ప్రశంసించాడు. సూక్తి అంటె చమత్కారయుక్తమైన రమణీయమైన కవితాఉక్తి అని అర్థం. సూక్తినే భామహుడనే ఆలంకారికుడు వక్రోక్తి అన్నాడు. రసానుకూలమైన పదప్రయోగం రమణీయమైన పదాలకూర్పు అర్థవైచిత్రి అన్నీ సూక్తిలోని భాగాలే. అటువంటి సూక్తి వైచిత్రికి ఎర్రన ప్రసిద్ధుడైనాడు. ఎర్రనలోని వస్తువు రచనాశైలికి సంబంధించిన నూతనాంశాలే శ్రీనాథయుగంలో కావ్యరీతి వికాసానికి దోహదం చేసాయి.

## నాచన సోమన

ఎర్రనకు సమకాలికుడు సోమన.ఎర్రన వలెనే సోమన హరివంశాన్ని అనువదించాడు. ఎర్రన కావ్యానికి హరివంశం అని పేరుండగా సోమన కావ్యానికి ఉత్తరహరివంశం అని పేరు. ఎర్రన పూర్వ ఉత్తర భాగాలతో

హరివంశాన్ని వ్రాయగా సోమన కేవలం ఉత్తర హరివంశాన్ని అనువాదం చేసాడు. కాని కొందరు విమర్శకులు నాచన సోమన మొత్తం హరివంశం వ్రాసాడని కాని ఇప్పుడు కేవలం ఉత్తర హరివంశం దొరుకుతున్నదని అభిప్రాయపడ్తున్నారు. ఉత్తర హరివంశంలో పీఠిక లేదంటె అది పూర్వ హరివంశంతోపాటు నశించిందని అంటున్నారు. కాని కొందరు విమర్శకులు సోమన ఉత్తర హరివంశాన్నే వ్రాసాడంటున్నారు. తిక్కన భారతానికి పూరకంగా సోమన వ్రాసాడు. కాబట్టి పీఠిక వ్రాయలేదని ఒకవేళ సోమన రెండు భాగాలు వ్రాసి వుంటే పూర్వభాగం ఉత్తరభాగాలని అనేవాడుకాని ఉత్తరహరివంశం అని కాదని అంటున్నారు. సోమన ఉద్దేశం పూర్తిగా హరివంశం వ్రాయడం కాక కొన్ని రససమంచిత కథలను తీసుకొని వ్రాయ డమే అని వారి అభిప్రాయం. ఉత్తర భాగంలోని హంసడిభకోపాఖ్యానం, నరకాసురవధ, బాణాసుర కథలను తీసుకొని సోమన ఉత్తర హరివంశాన్ని రచించాడు.

ఎర్రన రెడ్డిరాజుల ఆస్థానంలో వుండగా సోమన విజయనగరరాజు బుక్కదేవరాయల (క్రీ.శ. 1356-1377) ఆస్థానంలో వున్నాడు. ఆ రాజు అతనికి పెంచుకులదిన్నె అనే అగ్రహారాన్ని దానంచేస్తూ వేసిన శాసనం ఒకటి దొరికింది. ఆ శాసనకాలం క్రీ.శ. 1344 అని - దాన్ని బట్టి సోమన క్రీ.శ. 1340 ప్రాంతంలో హరివంశం వ్రాసాడని అప్పుడు సోమన ఉత్తర హరివంశం ఎర్రన హరివంశం కన్నా పదేండ్లు తర్వాత వ్రాయబడిందని పండితుల అభిప్రాయం. కాని ఎర్రన హరివంశాన్ని గురించి సోమనకు తెలుసోలేదో చెప్పలేము.

"తిక్కన సోమయాజి ప్రణీతంబైన శ్రీ మహాభారత కథానంతరం బున.........నాచన సోమనాథ ప్రణీతంబైన యుత్తర హరివంశం......" అని సోమన అశ్వాసాంతగద్యలో చెప్పకోడం చేత మహాభారతాంధ్రీకరణాన్ని

ఖిలపర్వమైన హరివంశ రచనతో పూర్తి చేయాలన్న ఉద్దేశం ఎర్రనకున్నట్లే సోమనకున్నదని తెలుస్తున్నది. అసలు సోమన తన కావ్యానికి అవతారిక వ్రాయక పోవడం "ఉత్తర" అని పేరు పెట్టడం ఆ ఉద్దేశంతోనే కావచ్చును. "ఉత్తర" - అంటె తర్వాత భాగమైన హరివంశం - అని అతని ఉద్దేశం కావచ్చును. రామాయణానికి ఉత్తర రామాయణం లాగా. తిక్కన లాగానే సోమన తన కావ్యాన్ని హరిహరనాథ దేవునికి అంకితంగా ఇచ్చాడు.

నాచన సోమన తనకు "సకల భాషాభూషణ, సాహిత్య రసపోషణ, సంవిధాన చక్రవర్తి, నవీన గుణసనాథ" అని విశేషణాలు వేసుకున్నాడు. సోమన సంస్కృత హరివంశం నుంచి కొన్ని రసానుకూలమైన కథలను తీసుకొని అనువదించాడు. అందుకే అతనికి సాహిత్య రసపోషణ విశేషణం సరిపోయింది. కథా సంవిధానాలను చక్కగా కూర్చాడు కాబట్టి సంవిధాన చక్రవర్తి అయినాడు. కథాకథనం పాత్రచిత్రణ పాత్రోచిత సంభాషణలు అలంకారాల శోభ ఇవి సోమనలోని నవీనగుణాలని సాహిత్య విమర్శకుల అభిప్రాయం. నాచన సోమన తిక్కనతో సాటిరాగల కవి అని కొందరు విమర్శకుల అభిప్రాయం. తిక్కన పాత్ర చిత్రణ సంభాషణాశైలి సోమనలో కొంతవరకు కన్పించినా సోమన తిక్కనంత ప్రతిభాశాలి కవి అని చెప్పడం సాహసమే అవుతుంది. సోమన దేశిపదాలను సామెతలను చాలా ప్రయోగించాడు. సోమన వాడినన్ని సామెతలను తెలుగులో మరేకవి వాడలేదు. సోమన ప్రయోగించిన అప్రసిద్ధ సంస్కృతపదాలు తెలుగు మాండలికపదాలు కొన్ని అర్థంకాక అతని కవిత్వాన్ని జటిలం చేస్తున్నాయి. సోమన ప్రయోగించిన ఉపమా అర్థాంతరన్యాసాలంకారాలు బాగున్నాయి. మొత్తం మీద సోమన శైలి ప్రౌఢంగా వుంది. ఉక్తి వైచిత్రులతో రసవంతంగా సాగింది. తర్వాత శ్రీనాథ యుగంలోని ప్రబంధయుగంలోని కవులకు అతని ప్రౌఢశైలి కథాకథన వైఖరి ఆదర్శంగా నిలిచాయి.

# విన్నకోట పెద్దన

ఈ కవి క్రీ.శ. 14వ శతాబ్దం ప్రారంభంలో వున్నాడు. కావ్యాలంకార చూడామణి అనే అలంకార శాస్త్రగ్రంథాన్ని వ్రాసాడు. అది చాల చిన్న గ్రంథం. కాని తెలుగులో మొదటి అలంకార శాస్త్రగ్రంథం. సంస్కృత ఆలంకారికులు అలంకార రసాదులను గురించి చెప్పిన వాటినే అతడు దీనిలో సంగ్రహంగా చెప్పాడు. స్వతంత్ర ఆలోచనలేమి లేవు. దీనిలో అలంకారశాస్త్ర సంబంధి విషయాలేకాక వ్యాకరణాంశాలు కూడా వున్నాయి. దీనిలో కవి ఉదాహరణ పద్యాలను కృతిభర్త విశ్వేశ్వరున్ని వర్ణిస్తూ చెప్తూ స్వతంత్రంగా వ్రాసాడు. అల్లాడ రెడ్డికి పూర్వం చాళుక్య విశ్వేశ్వరుడు పంచధారలను పాలించాడు. రాజమహేంద్రవరంలోని అల్లాడరెడ్డి కొడుకు దొడ్డారెడ్డికి ఈ కవి శివలీలావిలాసం రచించి అంకితంగా ఇచ్చాడు.

*　　*　　*

# 7. శ్రీనాథ యుగం

పెదకోమటి వేమారెడ్డి క్రీ.శ. 1402-1420 మధ్య కొండవీడును పాలించాడు. అతడు ప్రోలయ వేమారెడ్డి అన్న మాచారెడ్డి మనవడు. అన వేముని తర్వాత కుమారగిరి రాజయినప్పుడు పెదకోమటి వేమారెడ్డి అతన్ని ఎదిరించాడు. వాళ్ళిద్దరి మధ్య జరిగిన ఒడంబడిక ప్రకారం కుమారగిరి తర్వాతనే అతడు కొండవీడుకు క్రీ.శ. 1402లో రాజై క్రీ.శ. 1420 వరకు పాలించాడు. అతడు ధాన్యకటకంలో పాలన సాగిస్తున్న కాలంలోనే శ్రీనాథుడు అతన్ని ఆశ్రయించాడు. పెదకోమటి వేమారెడ్డి పరాక్రమశాలి. పండితుడు. కవి. సాహిత్యాభిమాని. కొండవీటి రెడ్డిరాజుల వైభవం అతని కాలంలో ఒక వెలుగు వెలుగు తీతనితోనే అంతరించింది. కొండపల్లి, తీరాంధ్రభూములను జయించి పెదకోమటి రాజ్యంలో శాంతి భద్రతలు ఏర్పరిచాడు. రాజమహేంద్రవరాన్ని జయించి కొండవీడును దాంతో ఏకం చేయాలని పెదకోమటి కాటయ వేమునితో యుద్ధాలు చేసాడు. కాటయ వేమన మరణించినా రాజమండ్రి అతనికి వశం కాలేదు. మంత్రి మామిడి సింగన రాజనీతితో పెదకోమటి బహమనీలతో మైత్రి చేసి వాళ్ళ సాయంతో రాజమండ్రిని ముట్టడించాడు. అయినా అల్లాడ రెడ్డి పరాక్రమంతో తరిమి వేసాడు. రాచకొండ రాజులు విజయనగరరాజులతో మైత్రి చేసి కొండ వీడును ముట్టడించారు. పెదకోమటి తమ్ముడు మాచారెడ్డిని రాచకొండ వాళ్ళతో కలిసి దండెత్తిన దేవరకొండ రాజు వేదగిరి చంపాడు. దానికి

ప్రతిక్రియగా పెదకోమటి దేవరకొండపైకి పోయి వేదగిరిని చంపాడు. దాంతో వేదగిరి తమ్ముడు లింగమనీడు యుద్ధంలో పెదకోమటిని ఓడించి అతని సింహలాంఛనాన్ని వంశపారంపర్యంగా వచ్చిన నంది కంటపోతరాజు అనే కత్తిని హరించాడు. ఆ సమయంలోనే శ్రీనాథుడు రాచకొండరాజు సర్వజ్ఞసింగని దర్శించి రాయబారం నడిపి తన పాండిత్యంతో అతన్ని మెప్పించి పెదకోమటి సింహలాఛంనాన్ని కత్తిని తెచ్చాడని కథ వుంది. తిక్కన తర్వాత శ్రీనాథునికి కవిత్వపాండిత్యంతో రాజకీయ రాయబారాలను నడిపి. రాజులను రాజగౌరవాన్ని పునః ప్రతిష్ఠించిన గౌరవం దక్కింది. అంతటితో కొండవీటి రాచకొండ రాజులకు యుద్ధాలు ఆగలేదు. క్రీ.శ. 1420లో వెలమలతోటి యుద్ధాల్లోనే పెదకోమటి వేమారెడ్డి మరణించాడు. అతనితో రెడ్డిరాజుల వైభవం నశించింది.

ఈ తరుణంలో రాజమహేంద్రవరంలో కాటయవేముని అల్లుడు అనితల్లి భర్త అల్లాడిరెడ్డి కొడుకు వీరభద్రారెడ్డి రాజైనాడు. అతని అన్న వేమారెడ్డి పరిపాలనా బాధ్యత వహించాడు. క్రీ.శ. 1423-48 మధ్య వీరభద్రారెడ్డి పాలనలో రెడ్డిరాజ్యం తిరిగి వైభవాన్ని పొందింది. గజపతులు విజయనగర రాచకొండ రాజులు రాజమహేంద్రం మీద దండయాత్రలు సాగించారు. రాచకొండ పక్షం వహించిన దేవరకొండ లింగమనీడు వేమారెడ్డిని వీరభద్రా రెడ్డిని ఓడించి రాజమహేంద్రవరాన్ని క్రీ.శ. 1448లో ఆక్రమించుకున్నాడు. గజపతి సోమేశ్వరుడు వాళ్ళకు సహాయంగా నిలిచాడు.

ఈ కాలంలో కాపయనాయకుడు వెలమలు ఆంధ్రదేశాధీశ్వర, ఆంధ్ర సురత్రాణ బిరుదాలు ధరించ్చారు. పెద కోమటిని శ్రీనాథుడు "ఆంధ్ర క్ష్మామండలాఖండలు"డని వర్ణించాడు. ఎవరికి వాళ్ళే చక్రవర్తులు కావాలనే ప్రయత్నంలో విజయనగరం రాచకొండ కొండవీడు రాజులకు పరస్పరం యుద్ధాలు జరిగాయి. దేవరకొండ రాజులు రాచకొండ పక్షం వహించారు.

బహామనీలు గజపతులు అవకాశాన్ని బట్టి కూటమిలో చేరి పోయి యుద్ధాలు చేసారు. పరస్పర యుద్ధాలతోనే కాపయ రాజ్యం నశించి గోలకొండ రాజ్యమేర్పడింది. క్రమంగా రాచకొండ కొండవీడు రాజమహేంద్రవరం రాజ్యాలు నశించాయి. చివరకు కళింగంలో గజపతులు విజయనగరంలో తుళవ వంశీయులు బలవంతులై సామ్రాజ్యాలను నిర్మించారు.

రాజ్యాలు రాజులు పరస్పరం యుద్ధకలహాలతో వున్నా మొత్తం మీద దేశం సుభిక్షంగా వుంది. కొండవీడు రాచకొండ రాజులు తటాకాలు కాలువలు తవ్వించి వ్యవసాయానికి ప్రోత్సాహం కలిగించారు. పరిశ్రమలు అభివృద్ధి చెందాయి. మోటుపల్లి మొదలయిన రేవుల నుంచి దేశవిదేశ వ్యాపారాలు సాగాయి. రెడ్డి రాజుల కాలంలో అవచి దేవయ అతని కొడుకు అవచి తిప్పయలనే వణిజులు సింహళాది ద్వీపాంతరాలతో వర్తకం చేసారు. కంచి నుంచి నెల్లూరు - ఓరుగల్లు మీదుగా అయోధ్య వరకు రాచమార్గముండింది. ఈ మార్గం ద్వారా వ్యాపారం జరిగేది. ఇటువంటి వ్యాపార మార్గాలే జాతి సంస్కృతి సాహిత్యాల ఆదాన ప్రదానానికి క్షేత్ర స్థాపనలకు దేవాలయాల నిర్మాణాలకు దోహదం చేసాయి. ఈ యుగంలో రాజులు కవి పండితులైన బ్రాహ్మణులకు విరివిగా అగ్రహారాలు భూములు దానం చేసి ధర్మరక్షణ చేసారు. సాహిత్యాన్ని వికసింపజేసారు. ఈ యుగంలో రాజులు "దేవబ్రాహ్మణ" భక్తి తత్పరులైనారు. రెడ్డి రాజులు దాతృత్వంతో బ్రాహ్మణులు సుసంపన్నులైనారని శ్రీనాథుని వర్ణనలను బట్టి తెలుస్తున్నది "ధరియింప నేర్చిరి దర్భవెట్టెడు వేళ్ళ లీల మాణిక్యాంగుళీక ముల....... ధామముల వెండియు పైడియు దడబడగ, బ్రాహ్మణోత్తముల గ్రహారముల యందు, వేమ భూపాలుడను జన్మ వీరభద్రు, ధాత్రియేలింప గౌతమీ తటమునందు" విబూది చర్మం ధరించే శివుడు ఈ కాలంలో "ఒకవేళ ధరియించు యవనాశ్వుడిచ్చిన కట్టాణీ ముత్యాల కంఠమాల మాంధాతృడిచ్చిన మాణిక్య ఖచిత కేయూరంబు ధరియించు నొక్కవేళ"

కాల ధర్మాన్ననుసరించి భోగి అయినాడు.

ప్రోలయ నాయకుడు వైదిక ధర్మాన్ని పునరుద్ధరించాడని, ప్రోలయ వేమారెడ్డి వైదిక ధర్మాభిమాని అని చెప్పబడుతున్నా ఈ కాలం నాటికి వైదిక కర్మకాండలు నశించాయి. అక్కడ వైదిక పదం హిందూ ధర్మమనే అర్థంలోనే వాడబడింది కావచ్చును. "హిందూ" శబ్దం ధర్మసంబంధంగా 16 వ శతాబ్దంలో ముస్లింలతో వాడుక లోకి వచ్చింది. బౌద్ధజైన మతాలు వీరశైవ వైష్ణవం సిద్ధనాథ సంప్రదాయాల ప్రభావంతో వైదిక కర్మలు ఆంధ్రదేశంలో చాళుక్యులకాలం నాటికి కాకతీయులనాటికి అంతరించాయి. నన్నయను ఆదరించిన రాజరాజనరేంద్రుడు, తిక్కన ఆశ్రయించిన మనుమసిద్ధి శివాభిమానులేగాని శాతవాహన విష్ణుకుండినుల వలె యజ్ఞయాగాది కర్మలనాచరించినవాళ్ళు కాదు. చాళుక్యులు చోళులు చంద్రసూర్యవంశజులమని చెప్పుకున్నా వైదిక క్రతువుల మీద వాళ్ళు అభిమానం చూపలేదంటె ఆ క్రతువులు అంతరించి బ్రాహ్మణ భక్తితో కూడిన పౌరాణిక మతాలు వ్యాపించాయని చెప్పాలి. నన్నయ తాను "అవిరళ జపహోమ తత్పరుడు" నని చెప్పుకున్నా సోమయజ్ఞం చేసి సోమయాజియైన తిక్కన "సతతాధ్వర క్రియా కర్మఠ పాణిపద్మ్మ"డని యాజకమండలోత్తము"డని "మఖ సంతోషిత మరుత్సమాజు"డని కేతన చేత కీర్తింపబడినా ప్రోలయ వేమారెడ్డి "అనవరత పురోహిత కృత సోమపాన" అని వర్ణింపబడినా వైదిక క్రతువులు ఏ కొద్దిగానో కుటుంబాలకు పరిమితమై నిలచిపోయాయి గాని రాజుల ఆదరణతో విస్తారంగా వ్యాపించిలేవని చెప్పాలి. ఈ కాలం నాటికి నాథసంప్రదాయం, వీరశైవం విజృంభణలు తగ్గాయి. కాని యోగమార్గంగా, శైవభక్తి మార్గంగా అవి నిలిచాయి. రామానుజుల వైష్ణవం ప్రవేశించి రాచకొండ వెలమరాజుల ఆదరణను పొందింది. ఇంకోవైపు రామభక్తి సంప్రదాయం ప్రవేశించింది. పోతన మొల్ల వంటి శైవులు వీరశైవాభిమానులు రాముని భక్తులుగా మారారు. శ్రీనాథుడు నైషధంలో నలుని "వీరమాహేశ్వర పారగునకు"

అని మూలంలో లేని విధంగా వర్ణించాడు. దాన్ని బట్టి శివాభిమానం కలిగిన వాళ్ళున్నారని తెలుస్తున్నది. శ్రీనాథుడు ఈశ్వరార్చన కళాశీలుడు భీమేశ్వరపురాణాన్ని అంకితంగా తీసుకున్న బెండపూడి అన్నమంత్రి "ఆగమోపనిషన్మనోహరుని హరుని నర్చనము సేయు సంధ్యాత్రయములందు....." అని శ్రీనాథుడు చెప్పాడు. అతని కృతులను అంకితంగా తీసుకున్న వాళ్ళు శివాభిమానులు అతని కావ్యాలన్నీ శివభక్తిసంబంధమైనయి. హరవిలాసంలో పార్వతి అర్జునుడు ఇద్దరు పాశుపత దివ్యదీక్షను పొందినట్లుగా చెప్పాడు. అతడు చిన్న వయస్సులోనే పాల్కురికి సోమన పండితారాధ్యచరిత్రను చంపువుగా వ్రాయడం హరవిలాసంలో వీరశైవానికి సంబంధించిన సిరియాళుని కథను వ్రాయడం అతడు వీరమాహేశ్వరుడని చాటుతున్నాయి. పోతన కూడా మొదట వీరభద్రవిజయం వ్రాసి తన వీరశైవ సంబంధాన్ని చాటాడు. మొల్ల తన తండ్రి జంగమార్చన పరుడని చెప్పుకుంది. అయితే వీరశైవం వాసనలున్నా ఈ యుగంలో అది శివభక్తిగా రూపొందింది. పౌరాణిక హిందూమతంలో భాగంగా మారింది.

ఈ యుగంలో రాజకీయాల అవసరం కోసం పండితులు అరబీ పారసీ తురుష్కాది భాషలను నేర్చారు. రాజమహేంద్రవరంలో వేమారెడ్డికి వీరభద్రారెడ్డికి మంత్రి అన్నయ "పారసిభాష వ్రాసినం గన్నుల పండులై యమరు గాకిత మందలి వర్ణపద్ధతుల్" అని శ్రీనాథుడు వర్ణించాడు. అన్నయ అరబీ తురుష్క శక బర్బరాది భాషలను నేర్చినవాడట. తిక్కన కాలంలోనే ఉద్దూమువి తరాజు వంటి పదాలు తెలుగులో చేరాయి. ఇక శ్రీనాథుని కాలంలో "సురతాణ, వజీరు, సామాన్లు, కుళ్ళాయి, ఖరచు"ల వంటి ఎన్నో అన్యదేశ్యాలు తెలుగులో చేరాయి. రాజాస్థానాల్లో పొడుగాటి కోటులాంటి అంగీని ధరించడం ఆచారమైంది. పండితులైనా ఆ కోటు ధరించవలసిందే. కాగితం అప్పుడప్పుడే ప్రవేశించింది.

ఈ యుగంలో రెడ్డి రాజులు వెలమరాజులు విజయనగర రాజులు కాకతీయుల వలెనే సంస్కృతాభిమానాన్ని మానలేదు. పెదకోమటి వేమారెడ్డి సర్వజ్ఞ సింగభూపాలుడు స్వయంగా సంస్కృత రచనలు చేసారు. సంస్కృతకవులను పోషించారు. విజనయగర రాజుల దగ్గర వంశపారం పర్యంగా గౌడడిండిమ కవులు ఆదరింపబడినారు. విజయనగర రాజుల కాలంలోనే వేదాంతదేశికులు అనేక వైష్ణవ కృతులను సంస్కృతంలో రచించాడు. బుక్కరాయల కోడలు గంగాదేవి సంస్కృతంలో మధురావిజయమనే కావ్యంగా ఆమె భర్త కంపన మధురావిజయాన్ని వర్ణిస్తూ వ్రాసింది. అయితే కాకతీయుల ఆస్థానంలో రాజుల ఆదరణలో తెలుగు సాహిత్యం లేదు. కాని ఈ కాలంలో రాజులు తెలుగు కవుల నాదరించి సత్కరించారు. ప్రోలయ వేమారెడ్డి ఆస్థానంలో సంస్కృత పండితుడు మహాదేవుడు విద్యాధికారిగా వుండగా పెదకోమటి వేమారెడ్డి ఆస్థానంలో తెలుగు కవి శ్రీనాథుడు విద్యాధికారిగా వున్నాడు. శ్రీనాథుడు విజయనగర రాజు రెండవ ప్రౌఢదేవరాయల ఆస్థానానికి పోయి గౌడడిండిమభట్టును శాస్త్రవాదంలో ఓడించి అతని దగ్గర వంశపారంపర్యంగా వస్తున్న డిండిమను పగులగొట్టించాడు. దేవరాయలతనికి ముత్యాలశాలలో కనకాభిషేకం చేసి గౌరవించాడు. తెలుగంటె చెవినపెట్టని సంస్కృత గర్వం ఈ కాలంలో వెనుకపట్టు పట్టింది. నైషధానువాదంతో తెలుగు భావవ్యక్తీకరణ సామర్థ్యం బయటపడింది. స్వతంత్ర మహాకావ్య రచనకు ఇది దారులు ఏర్పరచింది. తెలుగులో సంస్కృతం తెలుగు పదాల సమ్మిళితమైన చక్కని శైలి వ్యాప్తిలోకి వచ్చింది. శ్రీనాథుని కావ్యాల్లో చక్కని గంభీరమైన ప్రౌఢమైన పదప్రయోగంతో కూడిన సమాసభూయిష్ఠమైన శైలితో సీసం మొదలయిన పద్యాలు నడకను సంపాదించుకున్నాయి. పోతనలో లలితమధురమైన శైలి వికసించింది. ఈ కాలంలో కవులు కేవలం సంస్కృతానువాద కావ్యాలు వ్రాయక ఎక్కువ స్వాతంత్ర్యాన్ని చూపి తమ సామర్థ్యాన్ని ప్రకటించారు.

చక్కని భావవైచిత్రులు వక్రోక్తులు కవిత్వంలో ప్రవేశించాయి. దీన్నే "హరచూడా హరిణాంక వక్రత" అన్నాడు శ్రీనాథుడు. రీతి ప్రాధాన్యాన్ని కవులు గుర్తించారు. కావ్యంలో ఆద్యంతం అంగిరస పోషణ వుండాలని శృంగార నైషధానువాదంతో శృంగారశాకుంతల రచనతో కవులు గుర్తించారు. అప్పుడప్పుడే అలంకారాల వైచిత్రి వర్ణనల చమత్కారం తెలుగు కావ్యాల్లో ప్రవేశించసాగింది. అంటె అవి ఇంతకు ముందు అసలే లేవని కాదు. వాటిని కావ్య రీతిలో కవితాసౌందర్యం కోసం సాధించడం కవులు మొదలు పెట్టారు. అందుకే కొందరు సాహిత్య చరిత్రకారులీ యుగాన్ని కావ్యయుగం అన్నారు. ఈ యుగం కావ్యోన్ముఖమై 16వ శతాబ్దంలో స్వతంత్ర తెలుగు మహాకావ్యాల అవతరణకు రంగాన్ని సిద్ధం చేసింది. తెలుగు భాషకు కవిత్వానికి ఒక స్థానాన్ని ఒక గౌరవాన్ని కలిగించింది ఈ యుగమే. విజాతీ యతను ఎదుర్కోడానికి రాజులు జాతీయత మీద చూపిన అభిమానమే దానికి కారణం కావచ్చును.

## శ్రీనాథుడు

శ్రీనాథుడు రాజసం గల కవి. అతని శైలి రాజసంతో ఔద్ధత్యంతో నడిచింది. శ్రీనాథుడు చిన్నారిపొన్నారి చిరుతకూకటి నాటి నుంచే కావ్య రచన చేయడం ఆరంభించిన ప్రతిభాశాలి. అతని తాత కమలనాభామాత్యుడు కావ్యకళాలాభుడు. సరససాహిత్య సామ్రాజ్య చక్రవర్తి. పద్మ పురాణ సంగ్రహ కర్త. కవితా విద్యాధరుడు. కాల్పట్టణాధీశ్వరుడు. వినమత్ కాకతి సార్వభౌముడు. శ్రీనాథునిది కవి పండితవంశం. అతడు బ్రాహ్మీదత్త వరప్రసాదుడు. బ్రహ్మాండాది మహాపురాణశీలుడు. శ్రుతి పురాణ కావ్య వ్యాకరణ దర్శనాలను సాంతంగా చదివిన వాడు. సంస్కృత ప్రాకృత శౌరసేన్యాది భాషలను నేర్చినవాడు. కవిసార్వ భౌమ బిరుదాంకితుడు. శివభక్తి

తత్పరుడు. ఈశ్వరార్చన కళాశీలుడు.

శ్రీనాథుని రచనలు అనేకం - శ్రీనాథుడు చిన్నారి పొన్నారి చిరుత కూకటి నాడు మరుత్తరాట్చరిత్రను వ్రాసాడు. దాన్ని మామిడి సింగన అన్న మామిడి వేమనకు అంకితం ఇచ్చాడు. మార్కండేయ పురాణంలోని మరుత్తరాజు కథ ఇది. ఇది స్వతంత్ర కావ్యం కాని ఇప్పుడిది అలభ్యం.

ప్రాకృతంలో హాలుడు కూర్చిన గాథాసప్తశతిని శ్రీనాథుడు శాలివాహన సప్తశతి పేరుతో అనువదించాడు. నూనూగు మీసాల నూత్న యౌవనంలో కవి దీన్ని అనువదించాడు. గాథాసప్తశతిలో 700 గాథలున్నాయి. శ్రీనాథుడు వాటన్నిటిని అనువాదం చేయకుండ వచ్చును. కొండవీటి రాజు పెదకోమటి వేమారెడ్డి (క్రీ.శ. 1402-1420) "సప్తశతీ సారటీక" పేరుతో గాథాసప్తశతిలోని 100 గాథలకు సంస్కృతటీక వ్రాసాడు. అది ఇప్పుడు ముద్రింపబడి లభిస్తున్నది. ఒకవేళ శ్రీనాథుడు పెదకోమటి వేమారెడ్డి ఆస్థానంలో చేరిన కొత్తలో రాజుగారి ప్రీతికోసం ఆ 100 గాథలను తెనిగించి వుండవచ్చును. ఇప్పుడిది దొరకడం లేదు. దీనిలోని రెండు పద్యాలు ప్రబంధమణి భూషణంలో కన్పిస్తున్నాయి. వాటిని బట్టి శ్రీనాథుని శైలి అనువాదం సరళంగా మధురంగా సాగిందని చెప్పవచ్చును.

పాల్కురికి సోమన ద్విపదాల్లో వ్రాసిన పండితారాధ్య చరిత్రను శ్రీనాథుడు చంపూశైలిలో వ్రాసాడు. దాన్ని కవి శృంగారనైషధ కృతిభర్త మామిడి సింగన అన్న మామిడి ప్రెగ్గడయ్యకు అంకితమిచ్చాడు. దాని ప్రసక్తి శృంగారనైషధంలో వుంది కాని అది అలభ్యం. పండితారాధ్యచరిత్ర రచనను బట్టి శ్రీనాథుడు శైవమతాభిమానం కలవాడని తెలుస్తున్నది.

"నిండు జవ్వనంబున గాఢ పాకంబైన హర్ష నైషధకావ్యమాంధ్రభాష"లో

శ్రీనాథుడు శృంగార నైషధంగా వ్రాసాడు. దాన్నతడు పెదకోమటి వేమారెడ్డి ఆస్థానంలో వున్నప్పుడు వ్రాసి అతని మంత్రి మామిడి సింగనకు అంకితంగా ఇచ్చాడు. మామిడి వారి కుటుంబంతో శ్రీనాథునికి ఘనిష్ఠ సంబంధమున్నట్లు కన్పిస్తున్నది. ముగ్గురు సోదరులకు ఒక్కొక్క కావ్యాన్ని శ్రీనాథుడంకితంగా ఇచ్చాడు. ఆ అంకితాల తర్వాతనే శ్రీనాథునికి పెదకోమటి వేమారెడ్డి ఆస్థానంలో ప్రవేశం లభించింది కావచ్చును. పెదకోమటివేమారెడ్డి కొండవీటి సింహాసనాన్ని చేజిక్కించుకోక ముందు సామంత రాజుగా చిన్న మండలాన్ని పాలించాడు. క్రీ.శ. 1402లో అతడు కొండవీటికి రాజయ్యాడు. అప్పుడే శ్రీనాథునికి ఆ రాజు ఆస్థానంలో ఆశ్రయం లభించిందేమో. అంతకుముందు శ్రీనాథుడు చిన్న వయస్సులో కుమారగిరిరెడ్డి ఆస్థానంలో చేరాడని అంటారు. అప్పుడే అతనికి అవచి దేవయ తిప్పయసెట్టితో పరిచయమేర్పడింది కూడా కావచ్చును. మొత్తం మీద శ్రీనాథుడు పెదకోమటి వేమారెడ్డి ఆస్థానంలో విద్యాధికారి పదవి నదిష్ఠించి గౌరవ సత్కారాలను పొందాడు. వేమారెడ్డి స్వయంగా సంగీత సాహిత్య చక్రవర్తి. అంటె సంగీత సాహిత్యాల్లో ప్రవీణుడు. సంస్కృతంలో పండితుడు కవి. కవి పోషకుడు. అతని ఆస్థానంలో వామనభట్టబాణుడు వంటి ప్రసిద్ధ సంస్కృతకవులున్నారు. వాళ్ళంతా వుండగా తెలుగు కవి యౌవనంలో వున్న శ్రీనాథునికి విద్యాధికారి పదవి లభించడం గొప్ప విషయమే. విద్యాధికారి అంటే రాజుగారికి గ్రంథపఠనం చేసి వినిపించడం, ఆస్థానానికి వచ్చిన కవి పండితులను పరీక్షించడం, రాజుగారు వేయించే శాసనాలను వ్రాయడం మొదలయిన విద్యాసంబంధమైన పనులను చూసుకునే అధికారి. శ్రీనాథుడు పెదకోమటి వేమారెడ్డి ఆస్థానంలో వున్నా ఆ రాజుకు కవి ఏ కావ్యాన్ని అంకితంగా ఇయ్యలేదు. దాన్ని బట్టి శృంగారనైషధ రచన తర్వాతనే శ్రీనాథుడు పెదకోమటి ఆస్థానంలో చేరాడని చెప్పవచ్చును.

శ్రీనాథుడు క్రీ.శ. 1385లో పుట్టాడని శృంగార నైషధాన్ని దాదాపు 25-30 సంవత్సరాల వయస్సులో వ్రాసాడని అంటారు. అంటె క్రీ.శ. 1410-15 ప్రాంతంలో శ్రీనాథుడు పెదకోమటి ఆస్థానంలో చేరి వుంటాడు. ఆ తర్వాత కావ్యం వ్రాసి రాజుగారికి అంకితమిచ్చే అవకాశం అతనికి దొరికి వుండదు. సంస్కృతంలో శ్రీహర్షకవి (క్రీ.శ. 12వ శ. ఉత్తరార్థం) వ్రాసిన "నైషధీయ చరితం" మహాకావ్యాన్ని శ్రీనాథుడు శృంగార నైషధం పేరుతో తెనిగించాడు. సంస్కృత నైషధానికి "నైషధం విద్వదౌషధమ్" అని పేరు. పాండిత్య గర్వంతో వున్నవారిని నైషధశ్లోకార్థాన్ని అడిగితే చెప్పలేరని దాంతో వాళ్ళ పాండిత్యగర్వం అనే రోగం హరింప బడుతుందని దానికర్థం. శ్లేషాది అలంకారాలతో శాస్త్రపాండిత్యంతో కూడిన భావాలతో నైషధరచన కఠినంగా వుంటుంది. వ్యాఖ్యానాధారం లేకుండా పండితులకైనా నైషధార్థాన్ని చెప్పడం కష్టసాధ్యం. అటువంటి కావ్యాన్ని శ్రీనాథుడు యౌవనారంభంలోనే ఆంధ్రీకరించి తన కవిత్వ పాండిత్యశక్తులను ప్రకటించుకున్నాడు.

నైషధమహాకావ్యాన్ని శ్రీనాథుడు మూలాన్ని దగ్గరగా అనుసరిస్తూ అనువదించాడు. ఔచిత్యాన్ని పాటిస్తూ శబ్దాన్ని అనుసరిస్తూ అభిప్రాయాన్ని గుర్తిస్తూ రసాన్ని పోషిస్తూ అలంకారాన్ని భూషిస్తూ నైషధాన్ని అమవదించాడు. శ్రీనాథుని కావ్యం అనువాద కావ్యంలాగా నీరసంగా నడువలేదు. అక్కడక్కడ శ్రీనాథుడు మూలంలోని పదాలను సమాసాలను వున్నదున్నట్లుగా తీసుకొని ప్రయోగించాడు. అందుకే శ్రీనాథుని అనువాదం "డుమువులు" తగిలించినట్లుగా వుందన్న విమర్శలకు గురైంది. అయినా శ్రీనాథుని నైషధానువాదం తెలుగు సాహిత్యంలో పెద్దమలుపు వంటిదని చెప్పాలి. అంతవరకు తెలుగు కవులు మహాభారతరామాయణ పురాణాల కథాకావ్యాల అనువాదాలే చేసారు. కాని సంస్కృతంలో వున్న మహాకావ్యాల జోలికి పోలేదు. సంస్కృత మహాకావ్యాల్లో చివరిది ప్రౌఢతమమైన నైషధాన్ని శ్రీనాథుడనువదించి తెలుగుభాషకు మహాకావ్య

రచనా సామర్థ్యమున్నదని, భావ వైచిత్రికి వివిధాలంకారాల వక్రోక్తులకు ఆ భాష ఎదిగిందని చూపించాడు. శ్రీనాథుడు నైషధానువాదంతో తెలుగులో కావ్యమార్గానికి ఒరవడి పెట్టాడు. అంతవరకు శృంగారం ప్రధాన రసంగాగల కావ్యాలు తెలుగులో లేవు. శృంగార రసప్రధానమైందని చెప్పడానికే శ్రీనాథుడు తన నైషధానికి శృంగార నైషధమని పేరు పెట్టాడు. దీన్ననుసరించి పిల్లలమర్రి పినవీరన శాకుంతల కావ్యానికి శృంగారశాకుంతలమనే పేరు లోకంలో ఏర్పడింది. ఆ రెండు కావ్యాలు తర్వాత 16వ శ.లో తెలుగులో స్వతంత్రకావ్యాలు - ప్రబంధాలనే పేరుతో ఆవిర్భవించడానికి దోహదం చేసాయి.

శ్రీనాథుడు హరవిలాసం రచించి అవచి తిప్పయశెట్టికి అంకితమిచ్చాడు. ఆ కావ్యం శృంగారనైషధానికి భీమేశ్వరపురాణానికి మధ్య జరిగిన రచన. క్రీ.శ. 1420 తర్వాత కొండవీటి సామ్రాజ్య అస్తమయం తర్వాత శ్రీనాథుడు కాంచీనగరానికి పోయి అక్కడ తన బాల్య స్నేహితున్ని దర్శించి అతనికంకితంగా ఆ కావ్యాన్ని వ్రాసి వుంటాడు. హరవిలాసంలో శ్రీనాథుడు "ఆంధ్రభాషా నైషదాబ్జభవుని" అని తనను గురించి చెప్పుకోవడం వల్ల ఆ కావ్యం నైషధానంతర రచన అని నిశ్చయంగా చెప్పవచ్చును. రెడ్డిరాజుల కాలంలో అవచి తిప్పయ అతని తండ్రి అవచి దేవయులు ద్వీపాంతరాలకు సముద్రవర్తకాలను నడిపిన వణిజులు. శివభక్తులు. సిరియాలుని వంశజులమని చెప్పుకున్నారు. అందుకేనేమో శ్రీనాథుడు హరవిలాసంలో మొదట సిరియాలుని కథనే తీసుకున్నాడు. ఆ తర్వాత గౌరీకళ్యాణం, శివుని దారుకావన విహారం, సముద్రమథన వృత్తాంతం, శివుడు హాలాహలాన్ని తాగడం, కిరాతార్జునీయ కథలను రచించాడు.

హరవిలాసంలోని సిరియాలుని కథకు పాల్కురికి సోమన బసవపురాణంలోని కథ మూలం కావచ్చును. లేదా లోకంలో వ్యాప్తిలోవున్న

కథ కావచ్చును. శ్రీనాథుడు ఈ కథను స్వతంత్రంగా వ్రాసాడు. గౌరీ కళ్యాణ వృత్తాంతాన్ని కూడ శ్రీనాథుడు స్వతంత్రంగా వ్రాస్తూ కొంత కాళిదాసు కుమార సంభవంలోని భాగాలను శ్లోకాలను అనువదించాడు. శివుని దారుకారనవిహారానికి మూలం సంస్కృతంలో ఉత్ప్రేక్షావల్లభుడు వ్రాసిన భిక్షాటనకావ్యం అని పండితుల అభిప్రాయం. శివుడు పరమ పతివ్రతలైన మునిపత్నులతో రమించడం శ్రీకృష్ణుడు గోపికలతో రమించే ఘట్టంలాగా ఆధ్యాత్మికార్థంలో కూడింది. ఆ ఘట్టంలో శ్రీనాథుడు లౌకిక శృంగారాన్ని వర్ణించినా అది భాగవతంలోని శృంగారంలాగా దివ్యమైందని అంటారు. సముద్రాన్ని మథించడం శివుడు జగత్కళ్యాణం కోసం హాలాహలాన్ని మింగే వృత్తాంతం సంగ్రహంగా 64 పద్య గద్యాల్లో చెప్పబడింది. సముద్రమథన వృత్తాంతాన్ని శ్రీనాథుడు భీమేశ్వర పురాణంలోను వ్రాసాడు. ఈ రెండు కథలను కొంచెం భేదంతో శ్రీనాథుడు వర్ణించాడు. చివరిది కిరాతార్జునీయ కథ. భారవి కిరాతార్జునీయ కావ్యాన్ని అక్కడక్కడ అనుసరిస్తూ అనువదిస్తూ శ్రీనాథుడు స్వతంత్ర రచనలాగా వ్రాసాడు. ఈ విధంగా శ్రీనాథుడు ఆయాకవుల శ్లోకాలను సందర్భానుకూలంగా అనువదిస్తూ హరవిలాసాన్ని స్వతంత్ర కావ్యంలాగానే వ్రాసాడు. మొత్తం మీద సంస్కృత సాహిత్యంలోని పంచమహాకావ్యాల్లో నైషధం కుమార సంభవం కిరాతార్జునీయం మూడింటిని తెలుగులోకి తెచ్చిన వాడయ్యాడు శ్రీనాథుడు. హరవిలాసంలో ప్రతి కథను శ్రీనాథుడు శివభక్తి తత్పరతతో వ్రాసాడు. కథా కథనం వర్ణనలు స్వతంత్ర మార్గంలో మనోహరంగా నడిచాయి. శ్రీనాథుని మిగతా కావ్యాల్లోని శైలీగాంభీర్యం ఇందులో లోపించినట్లు కన్పిస్తుంది.

శ్రీనాథుడు కొండవీటి సామ్రాజ్య అస్తమయం తర్వాత దేశసంచారం చేస్తూ కాంచీనగరం చేరి అక్కడి నుంచి విజయనగరం చేరుకొని ప్రౌఢ దేవరాయల ఆస్థానంలో గౌడ డిండిమ భట్టును శాస్త్రవాదంలో ఓడించి

డిండిమభట్టుకు వంశపారంపర్యంగా వచ్చిన పాండిత్య గరిమకు చిహ్నమైన కంచుఢక్కను పగులగొట్టించాడు. ప్రౌఢరాయల చేత కవిసార్వభౌమ బిరుదాన్ని పొందాడు. ముత్యాలశాలలో కనకాభిషేకం చేయించుకున్నాడు. ఒక తెలుగుకవి ప్రసిద్ధ సంస్కృతకవి పండిత వంశజుడైన డిండిమ భట్టును శాస్త్ర వాదంలో ఓడించడం తెలుగు భాషా సాహిత్యాలకు గర్వ కారణంగా చెప్పుకోవాలి. ఆ తర్వాత శ్రీనాథుడు రాచకొండ పద్మనాయకరాజు సర్వజ్ఞ సింగభూపాలుని ఆస్థానానికి పోయి ఆ రాజును తన కవిత్వంతో మెప్పించి గౌరవ సత్కారాలందుకున్నాడు. ఆ దేశ పర్యటన సందర్భంలోనే శ్రీనాథుడు తెలుగు రాయుడు, పంటమైలారవిభుడు, వినుకొండ వల్లభరాయుడు మొదలయిన రాజులను సామంతులను సందర్శించి వాళ్ళచేత గౌరవ సన్మానాలు అందుకున్నాడు. ఆ తర్వాత శ్రీనాథుడు రాజమహేంద్రవరం చేరుకొని అక్కడ రెడ్డిరాజు వీరభద్రారెడ్డికి మంత్రి బెండపూడి అన్నయకు భీమేశ్వర పురాణాన్ని అంకితంగా ఇచ్చాడు.

భీమేశ్వర పురాణం అచ్చమైన దేశీయతాముద్రగల కావ్యం. దానిలో శ్రీనాథుడు ద్రాక్షారామ భీమేశ్వరంలో వెలసిన భీమేశుని మహిమను వర్ణించాడు. వస్తుదృష్టితో ఇది దేశి కావ్యం. కావ్యంలో ఎక్కువభాగం ద్రాక్షారామం తత్ప్రాంతప్రదేశాల వర్ణన వుంది. కొబ్బరితోటలను పంట పొలాలను నదులను కొండలను గుడులను ప్రకృతి రామణీయకతను శ్రీనాథుడు తన్మయుడై వర్ణించాడు. అచ్చంగా ఆంధ్రదేశాన్ని వర్ణించే ఈ కావ్యంలో శ్రీనాథుని జాతీయాభిమానం బాగా ప్రకటమైంది. భీమేశ్వర పురాణానికి మూలం స్కాంద పురాణాంతర్గతమైన గోదావరి మండలమని శ్రీనాథుడే చెప్పుకున్నాడు. కాని శ్రీనాథుని భీమేశ్వర పురాణాన్ని సంస్కృతీకరించి స్కాందపురాణంలో చేర్చారని కొందరు విమర్శకుల అభిప్రాయం. ఒకవేళ అనువాదమైనా అనువాదంగా కాక ఈ కావ్యం స్వతంత్రరచన వలెనే వుంది. ఈ కావ్యం క్షేత్రమాహాత్మ్యం అయినా కావ్యశైలిలో రచింపబడి సాహిత్య

గౌరవాన్ని అందుకున్నది. తర్వాత ఈ మార్గంలోనే ప్రబంధయుగంలో ధూర్జటి తెనాలిరామకృష్ణకవులు క్షేత్రమాహాత్మ్యాలను రచించారు.

శ్రీనాథుడు "ప్రాయమెంతయు మిగుల శైవాల కుండ" రచించిన ప్రౌఢకావ్యం కాశీఖండం. దాన్ని ఆ కవి రాజమహేంద్రవరం రెడ్డిరాజు వీరభద్రారెడ్డికి అంకితంగా ఇచ్చాడు. శ్రీనాథుడు మొదట భీమేశ్వర పురాణాన్ని బెండపూడి అన్నయకు అంకితంగా ఇచ్చి ఆ మంత్రి సహాయంతో రాజమహేంద్రవర రాజుల ప్రాపును సంపాదించి కాశీఖండాన్ని రాజుకు అంకితంగా ఇచ్చి వుంటాడు. భీమేశ్వరపురాణం పీఠికలోనే శ్రీనాథుడు వీరభద్రారెడ్డిని అతని అన్న వేమారెడ్డిని వాళ్ళ వంశాన్ని విశేషంగా వర్ణించాడు. స్కాంద పురాణంలోని కాశీఖండం భాగాన్ని తీసుకొని శ్రీనాథుడు కాశీఖండ కావ్యంగా రచించాడు. ఇది యథాతథానువాదం కాదు. ఎంతో స్వతంత్రించి వ్రాసాడు. సందర్భాను కూలంగా మయూరాది సంస్కృత కవుల శ్లోకాలను అనువదించి చేర్చాడు. కాశీ ఖండంలో అగస్త్యుడు కాశిని విడిచిపెట్టడం, వింధ్యపర్వత విజృంభణం, దాని గర్వభంగం, వ్యాసుడు కాశిని వదిలిపెట్టే వృత్తాంతం, గుణనిధి కథ మొదలయిన వాటిని శ్రీనాథుడు చక్కని ప్రౌఢమైన కావ్యశైలిలో వ్రాసాడు. అగస్త్యవ్యాసుల కాశీవియోగ బాధను శ్రీనాథుడు పాఠకుల హృదయాలు సంచలించేటట్లుగా రచించాడు. సంస్కృతంలో "కాశీ ఖండం అయః పిండం" అని లోకోక్తి వుంది. అంటె కాశీఖండం ఉక్కుముద్దవలె పగల గొట్టడానికి వీల్లేని ప్రౌఢార్థాలతో వుందని దాని అర్థం. ఆ లోకోక్తి సంస్కృత కాశీఖండం వల్ల కాక తెలుగు కాశీఖండం వల్లనే ఏర్పడిందని పండితులంటారు.

కాశీఖండం భీమఖండం వలెనే పురాణాంతర్గతమైన క్షేత్రమాహాత్మ్యాన్ని చెప్పే రచన అయినా శ్రీనాథుడు రసవంతమైన ప్రౌఢశైలిలో రచించి కావ్య గౌరవాన్ని ఇచ్చాడు. వర్ణనలు పాత్రచిత్రణలు సంభాషణలను కవి రమ్యంగా

వ్రాసాడు. వక్రోక్తి భరితమైన శబ్దార్థాలు దీనిలో వున్నాయి. సందర్భానుకూలంగా శ్రీనాథుడు శైవమతతత్త్వాలను సాముద్రిక పాతంజలయోగ శాస్త్ర మంత్రశాస్త్రాదుల పాండిత్యాన్ని ప్రదర్శించాడు. అగస్త్యవ్యాసుల మనఃస్థితిని వర్ణించేటప్పుడు శ్రీనాథుడు లోకజ్ఞతను ప్రదర్శించాడు. పాత్రల చిత్రణలో అతడు తన సూక్ష్మపరిశీలనాశక్తిని చాటుకున్నాడు. దానిలోని గుణనిధి కథ ఒక ఉత్తమమైన ఖండకావ్యంలా వుంది. గుణనిధి కథననుసరించే తెనాలి రామకృష్ణుడు పాండురంగమాహాత్మ్యంలో నిగమశర్మకథను తీర్చిదిద్దాడు. శ్రీనాథుడు పరిపక్వావస్థలో కాశీఖండాన్ని రచించాడు. కాబట్టి ఆ కావ్యం మిగతా కావ్యాలకన్నా ప్రౌఢంగా వుంది.

శివరాత్రిమాహాత్మ్యం కావ్యాన్ని శ్రీనాథుడు కాశీఖండం తర్వాత రచించాడని పండితుల అభిప్రాయం. క్రీ.శ. 1443 లో రాజమహేంద్రవరంలో రెడ్డిరాజ్యం కళింగరాజు కపిలేశ్వరుని చేత ఆక్రమింపబడింది. దాంతో రెడ్డి రాజుల కీర్తి అస్తమించింది. ఆ సమయంలో శ్రీనాథుడు తనకాశ్రయమిచ్చే తెలుగు రాజులు లేక శ్రీశైలానికి వెళ్ళివుంటాడు. అక్కడ శాంతి భిక్షావృత్తి మఠాధిపతి ముమ్మడి శాంతయ్యకు అంకితంగా శివరాత్రీమాహాత్మ్యాన్ని శ్రీనాథుడు వ్రాసాడు. ఈ కావ్యం అక్కడక్కడ పేలవంగా వుండడం చేత శ్రీనాథుని రచన కాదని భావించారు. కాని శైలి పద్యాల నడక శ్రీనాథుని రచన అనే చెప్తున్నాయి. స్కాంధ పురాణంలోని ఈశానసంహితలో 336 శ్లోకాల్లో మూడు అధ్యాయాలుగా వున్న కథను తీసుకొని శ్రీనాథుడు ఐదు అశ్వాసాలుగా శివరాత్రి మాహాత్మ్యం వ్రాసాడు. ఇది అనువాదమైనా స్వతంత్ర కావ్యంగానే భాసిస్తున్నది. సందర్భానుకూలంగా కవి బాణాది కవుల కావ్యభాగాలను అనువదించి కూర్చాడు. ఈ కావ్యంలో సుకుమారుడనే బ్రాహ్మణ యువకుడు తలిదండ్రులకు లేకలేక కల్గిన సంతానం. అతడు కాముకుడై చెడిపోవడం చివరకు శివరాత్రి నాడు శివుని దర్శనం వల్ల కైలాసం చేరుకున్న కథ వుంది. ఇది కాశీఖండంలోని గుణనిధికథను

పోలివుంది. సుకుమారుడు గుణనిధి కన్నా నికృష్టుడు. సుకుమారుడు కన్నకూతురును కాంక్షించిన పరమ భ్రష్టుడుగా చెప్పబడినాడు. అటువంటి వాడు చివరకు కేవలం శివరాత్రినాడు శివదర్శనం వల్ల శివలోకాన్ని చేరు కున్నాడని చెప్పబడింది. భక్తి మహిమను చాటడం కోసమే ఈ విధంగా చిత్రింపబడింది.

శ్రీనాథుడు పై కావ్యాలేకాక ధనంజయవిజయం వ్రాసాడని దాన్ని దంతులూరి గన్నభూపాలుని అంకితమిచ్చాడని దంతులూరి బాపిరాజు వ్రాసిన మూర్తిత్రయోపాఖ్యానం వల్ల తెలుస్తున్నది. గన్నభూపాలుడు పెద కోమటి వేమారెడ్డికి పిల్లనిచ్చిన మామ. ధాన్యవాటి పురాధిపతి. కావ్యం పేరును బట్టి అర్జునుడు శివున్ని మెప్పించి పాశుపతాస్త్రం పొందే కథ దానిలో వున్నట్లు చెప్పవచ్చును. దీని రచనాకాలం క్రీ.శ. 1420 ప్రాంతమని విమర్శకుల అభిప్రాయం. శ్రీనాథుడు నందనందన చరిత్రను వ్రాసాడని దాన్ని వైష్ణవుడైన పంటమైలారు రెడ్డికి అంకితమిచ్చాడని కొందరంటున్నారు. అదే విధంగా శ్రీనాథుడు వల్లభాభ్యుదయం వ్రాసి తెలుగు రాయల కంకితమిచ్చాడని దీని రచనా కాలం క్రీ.శ. 1428 అని విమర్శకులంటున్నారు.

వినుకొండ వల్లభరాయల కృతంగా లభిస్తున్న క్రీడాభిరామం కావ్యాన్ని శ్రీనాథుడు వ్రాసాడని లోకంలో వ్యాప్తిలో వుంది. శ్రీనాథుడు దేశసంచారం చేస్తున్నప్పుడు వినుకొండ వల్లభరాయులను సందర్శించి ఆ కావ్యరచనలో అతనికి తోడ్పడినాడని కొందరు విమర్శకుల అభిప్రాయం. అదే విధంగా శ్రీనాథుడు పల్నాటివీరచరిత్ర ద్విపద కావ్యాన్ని వ్రాసాడని లోకంలో ప్రచారంలో వుంది. పల్నాటివీర చరిత్రను కాటమరాజు కథను రెండింటిని శ్రీనాథుడు మార్గకవిత్వంలో వ్రాయగా జానపదకవులు వాటిని ద్విపదలోకి మార్చి వ్రాసారని విడదవోలు వెంకటరావుగారి అభిప్రాయం.

చిలుకూరి పాపయ్యశాస్త్రి, చాగంటి శేషయ్యగారలు పల్నాటివీర చరిత్ర శ్రీనాథుని రచన కాదనగా వేటూరి ప్రభాకరశాస్త్రి, పింగళి, బండారు తమ్మయ్య, అక్కిరాజు ఉమాకాంతం, శ్రీరామమూర్తిగారలు పల్నాటివీర చరిత్ర శ్రీనాథుని రచన అని అంగీకరించారు. ఒకవేళ శ్రీనాథుడు వ్రాస్తే పల్నాడులో తన చరమజీవితాన్ని గడిపిన కాలంలో క్రీ.శ. 1450 ప్రాంతంలో వ్రాసాడని చెప్పాలి.

ఆంధ్రదేశాన్ని కళింగరాజు ఆక్రమించి తర్వాత శ్రీనాథుడు తననాదరించే రాజులు లేక పల్నాడు వెళ్ళాడని అక్కడ కొంత భూమిని కౌలుకు తీసుకొని పంటపండక కౌలు చెల్లించ లేక రాజదండన శిక్షలను అనుభవించాడని దారిద్ర్యంతో చివరకు "దివిజ కవివరుని గుండెలు దిగ్గురనగ అరుగుచున్నాడు శ్రీనాథుడమరపురికి" అని పద్యం చెప్తూ చనిపోయాడని ఐతిహ్యం. ఆ చాటు పద్యంలో ఐతిహ్యంలో ఎంత సత్యమున్నదో చెప్పలేము. కాని పల్నాడును వర్ణిస్తూ పల్నాడులో తాను పడిన కష్టాలను వర్ణిస్తూ శ్రీనాథుడు చెప్పాడనే చాటు పద్యాలు దొరుకుతున్నాయి.

క్రీ.శ. 14వ శతాబ్దంలో ఆంధ్రదేశాన్నేలిన రాజులందర్ని శ్రీనాథుడు సందర్శించి వాళ్ళ చేత గౌరవ సత్కారాలందుకున్నాడు. ఒక విధంగా క్రీ.శ. 14వ శతాబ్దంలో శ్రీనాథుని చరిత్ర ఆంధ్రదేశ చరిత్రగా ఆంధ్రదేశ చరిత్ర శ్రీనాథుని చరిత్రగా కన్పిస్తున్నది. తెలుగు సాహిత్యంలో శ్రీనాథుని లాగా అనేక కావ్యాలను వ్రాసిన మరోకవి లేదు.

## పోతన

శ్రీనాథయుగంలో జీవించిన మరో మహాకవి పోతన. భక్తకవిగా పేరు పొందాడు. పోతన పేరు చెప్పగానే భాగవతం గుర్తుకు వస్తుంది. అతని

కాలం క్రీ.శ. 1420-1480 ప్రాంతం.

భాగవతం వ్రాయకముందు పోతన రాచకొండనేలిన పద్మనాయకరాజు సర్వజ్ఞ సింగభూపాలుని ఆస్థానంలో వున్నాడని అంటారు. అక్కడున్నప్పుడే ఆ కవి భోగినీదండకం వ్రాసాడు. భోగిన అనే వేశ్య గోపాలదేవోత్సవంలో సింగభూపాలుని చూచి ప్రేమించి విరహతప్తురాలై చివరకు తెగించి వచ్చి ఆ రాజు కాళ్ళమీద పడ్తుంది. రాజు ఆమెను మన్నించి ప్రియురాలిగా గ్రహించి ఏనుగు మీద ఎక్కించుకొని ఊరేగిస్తూ తీసుకపోతాడు. ఈ ఇతివృత్తాన్ని వర్ణిస్తూ పోతన ఈ లఘుకావ్యాన్ని వ్రాసాడు. వేశ్యను గురించి చెప్పే ఈ కృతి పరమభక్తుడైన పోతన వ్రాసి వుండడని కొందరు విమర్శకులు తలంచారు. కాని దీనిలోని శైలి పోతన భాగవత శైలిని పోలి వుంది. పోతన రామభక్తుడు కాక పూర్వం రాజాశ్రయంలో దీన్ని వ్రాసి వుంటాడు. ఎందరో భక్త కవులు మొదట భోగులుగా వుండి విరాగులుగా మారి రాజులను వాళ్ళిచ్చే ధనకనకవస్తు వాహనాదులను నిరసించారు. పోతన కూడా మొదట రాజాశ్రయంలో వుండి భోగినీదండకాన్ని రాజుగారి ప్రీతికోసం వ్రాసి వుంటాడు. రామభక్తుడై భక్తి మతాన్ని ఆశ్రయించాక భాగవతాన్ని వ్రాసి వుంటాడు. సింగభూపాలుడు భాగవతాన్ని తనకంకితమయ్యమని అర్థించాడని పోతన నిరాకరించి రామాంకితం చేసాడని ఐతిహ్యాం.

పోతనకు పూర్వం నన్నయ శ్రీనాథులు మొదలైన కవులు తమ కావ్యాల్లో భగవంతుని స్తుతితో దండకాలను వ్రాసారు. దండకాలను స్వతంత్రకృతిగా వ్రాసిన వాటిల్లో పోతన భోగినీదండకం మొదటిది. సోమనాది శివకవులు శివస్తుతితో కూడిన గద్యాలు రగడలు అనే లఘుకృతులు వ్రాసారు. పోతన నరస్తుతితో కూడిన దండకాన్ని వ్రాసాడు. నరస్తుతి చేసిన పోతన తర్వాత "మనుజేశ్వరాధముల" సేవించనని విముఖతను చూపాడు. పోతన తర్వాత విజయరాఘవుడు రాజగోపాల దండకం గణపవరపు వేంకటకవి విద్యావతీ

దండకం మొదలయినయి రచింపబడినయి. ఇవి దైవశృంగారపరమైనయి కాగా పోతన దండకం లౌకిక శృంగారం వర్ణించేది.

సంస్కృతంలో వున్న భాగవతాన్ని పోతన ఆంధ్రీకరించాడు. దాన్ని ఆంధ్రీకరిస్తూ----

ఒనరన్ నన్నయ తిక్కనాది కవులీ యుర్విం బురాణావళుల్
తెనుగుం జేయుచు మత్పురాకృత శుభాధిక్యంబు దానెట్టిదో
తెనుగుంజేయరు మును భాగవతమున్ దీనిం దెనింగించి నా
జననంబున్ సఫలంబు జేసెద పునర్జన్మంబు లేకుండగన్

అని పోతన అంటాడు.

క్రీ.శ.12 వ శతాబ్దంలో తమిళదేశంలో రామానుజాచార్యులు విష్ణునారాయణభక్తితో కూడిన వైష్ణవమతాన్ని శాస్త్రబద్ధం చేసి వ్యాపింపజేసాడు. రామానుజుల ప్రశిష్యుల్లో రామానందుడు దక్షిణదేశం నుంచి ఉత్తర భారతానికి పోయి అక్కడ రామభక్తిని ప్రచారం చేసాడు. తులసీదాసు కబీరు మొదలయిన భక్త కవులు ఆ రామభక్తి సంప్రదాయాన్ననుసరించిన వాళ్ళే రామానందుడు దక్షిణదేశం నుంచి ఉత్తర భారతానికి పోతూ తోవలో వున్న ఆంధ్రదేశంలో రామభక్తిని ప్రచారం చేసివుంటాడు. అట్లా ఆంధ్రదేశంలో రామభక్తి సంప్రదాయం ప్రవేశించిన తరుణంలో అంతకుముందు శైవులైనవాళ్ళెందరో రామభక్తులైనారు. పోతన మొల్ల వంటి కవులిటువంటి వాళ్ళే. మొల్ల రామభక్తితో రామాయణం వ్రాయగా పోతన వైష్ణవులకు పవిత్ర గ్రంథమైన భాగవాతాన్ని ఆంధ్రీకరించాడు. ఆంధ్రదేశంలో తిక్కన కాలం నాటికి వైదికకర్మల ప్రాధాన్యం నశించి శివ విష్ణుభక్తితో కూడిన అర్చనాదులతో వ్రతవిధులతో కూడిన పౌరాణిక మతం క్రమంగా వ్యాపించసాగింది. శ్రీనాథుడు శివభక్తుడు కాగా పోతన విష్ణుభక్తుడైనాడు.

శ్రీనాథుడు రాజుల ఆస్థానాలను సందర్శించి రాజులకు మంత్రులకు కావ్యాలనంకితంగా ఇచ్చి గౌరవ సన్మానాలనందుకోగా పోతన మొదట రాజస్థానంలో వున్నా తర్వాత రాజాశ్రయాన్ని నిరసించి తన భాగవతాన్ని రామునికంకితంగా ఇచ్చాడు "మన్నామాంకితంబుగా శ్రీ మహాభాగవతంబు తెనుగు సేయుము. నీకు భవబంధంబులు తెగు" నని రామచంద్రుడే ప్రత్యక్షమై ఆదేశించినట్లుగా పోతన చెప్పుకున్నాడు. శ్రీనాథ పోతనల భక్తిమార్గంలో జీవితవిధానంలో వున్న వైరుధ్యాన్ని పురస్కరించుకొనో లేదా శ్రీనాథునికి నిజంగానే దగ్గుపల్లి దుగ్గనతో పాటు పోతన పేరున్న బావ మరిది వుండటం వల్ల నామసామ్యం చేతనోయేమో శ్రీనాథ పోతనలు బావామరదులని చెప్పి కొన్ని కథలు లోకంలో ప్రచారంలో వున్నాయి. శ్రీనాథుడు దక్షణ తీరాంధ్రంలో పుట్టి పెరిగినవాడు. పోతన తెలంగాణాలో ఓరుగల్లునివాసి. ఆ కాలంలో అంతంతదూరం సంబంధాలు చేసుకోవడం అసంభవంగా కన్పిస్తుంది.

పోతన "శ్రీమన్నారాయణ కథా ప్రపంచ విరచనాకుతూహలుండై" ఒక పౌర్ణమి రోజు చంద్రగ్రహణం రోజున గంగకు స్నానానికి పోయాడు. అక్కడ మహేశ్వర ధ్యానంతో అతడు అర్థనిమీలితనేత్రుడై వుండగా శ్రీరాముడు ఎదురుగా ప్రత్యక్షమై కన్పించి భాగవతాన్ని వ్రాయమని ఆదేశించాడు. ఆ తర్వాత కొన్ని రోజులకు పోతన ఏకశిలానగరం వచ్చి అక్కడి గురువృద్ధబుధ బంధుజనానుజ్ఞాతుడై భాగవతాన్ని తెలుగులో రచించడానికి పూనుకున్నాడు. పోతన ఏకశిలానగరం అంటే ఓరుగల్లు (ఈనాటి వరంగల్లు) నగరంలో వుండి భాగవతాన్ని రచించినట్లు తెలుస్తున్నది. అంతేగాక అతని గురు బంధుజనాదులు కూడా అక్కడే వుండేవారని దాన్ని బట్టి తెలుస్తున్నది. పోతన వరంగల్లు ప్రాంతంలో జనగామ సమీపంలో వున్న బమ్మెరవాసి అయినా ఓరుగల్లులోని వాసమేర్పరచుకొన్నట్లుగా భాగవతం పీఠికను బట్టి తెలుస్తున్నది. ఒక చంద్రగ్రహణం రోజు గంగకు స్నానానికి వెళ్ళాడు. ఆ గంగ

దక్షిణగంగ అని పిలువబడే గోదావరి నది. తెలంగాణాలో గోదావరిని ప్రజలు గంగ అని పిలవడం వుంది. వేములవాడ దగ్గరలో వున్న ధర్మపురి గోదావరి నదీతీరంలో వుంది. నరసింహ స్వామి అక్కడ వెలిసాడు. ప్రసిద్ధ వైష్ణవ క్షేత్రం. వేద పండితులకు నిలయమైన ధర్మపురి అప్పుడే వైష్ణవ క్షేత్రంగా అభివృద్ధి చెందుతుందేమో. ఒక వేళ పోతన ధర్మపురిలోని గోదావరిలోనే స్నానమాడాడేమో. ధర్మపురి వరంగల్లుకు దూరమేమికాదు. మొత్తం మీద పోతన గోదావరి నదీతీరంలో వున్న ఏదో ఒక పుణ్యక్షేత్రానికి పోయి తిరిగి ఓరుగల్లుకు వచ్చి శ్రీరాముని ఆదేశానుసారంగా గురుబుధ బంధుజనాదుల అనుజ్ఞతో భాగవతాన్ని వ్రాయడానికి పూనుకున్నాడని భాగవతం పీఠికను బట్టి తెలుస్తున్నది.

తెలుగులో భాగవతం రచించిన కవిగా పోతనకు పేరున్నా భాగవతాన్నంతా అతడొక్కడే తెనిగించ లేదు. భాగవతంలోని 12 స్కంధాల్లో 5,6,11,12 తప్ప మిగిలిన 8 స్కంధాలను పోతన రచించాడు. భాగవతంలో దశమస్కంధంలో శ్రీకృష్ణుని చరిత్ర అంతా వర్ణింపబడింది. ఇది దీర్ఘమైన స్కంధం. దశమస్కంధాన్ని పోతన తన మధుర కవితావైభవాన్ని భక్తితత్పరతను ప్రకటిస్తూ రచించాడు. 5వ స్కంధాన్ని గంగన, 6వ స్కంధాన్ని ఏర్చూరి సింగన 11,12 స్కంధాలను వెలిగందలనారయ అనువదించారు. పోతన భాగవతంలో ఈ 4 స్కంధాలు శిథిలంకాగా ఈ ముగ్గురు కవులు రచించారని కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణ సారసంగ్రహంలో అన్నాడు. కాని దానిలో చారిత్రక సత్యంలేదని ఆధునిక విమర్శకులు తలస్తున్నారు. పోతన తన శిష్యులకు ప్రోత్సాహం ఇయ్యడానికే వాళ్ళచేత ఆ భాగాలను రచింపజేసాడని అంటున్నారు.

భాగవతం భక్తిమార్గాన్ని ప్రబోధించే పురాణం. సంసార దుఃఖాలను తొలగించి భక్తి పునర్జన్మ లేకుండా చేసి మోక్షాన్ని ప్రసాదిస్తుందని భాగవతం

చెప్తున్నది. శ్రీకృష్ణభక్తిమహిమను వర్ణించే భాగవతం కాక దేవీభక్తిని వర్ణించే దేవీభాగవతం అష్టాదశపురాణాల్లో చేరిన ప్రాచీన పురాణం అని కొందరు విమర్శకుల అభిప్రాయం. చారిత్రక దృష్టితో పరిశీలించే విమర్శకులు భాగవతం దాదాపు క్రీ.శ. 10వ శతాబ్దంలో రచింపబడి వ్యాసవిరచితంగా ప్రచారం చేయుబడిందని అంటున్నారు. వైష్ణవమత ప్రచార వ్యాప్తులతో భాగవతానికి చాల ప్రసిద్ధి లభించింది. నవరసాల్లో మొదట భక్తిరసం చేరలేదు. తర్వాత రూపగోస్వామి (క్రీ.శ. 1490-1563) భక్తికి రసస్థానాన్నిచ్చి నిలబెట్టాడు. అతనికన్నా ముందు బోపదేవ హేమాద్రులు తమ భాగవతముక్తాఫలంలో భక్తిరసాన్ని పేర్కొని వున్నారు. దాన్ని బట్టి వైష్ణవభక్తి కృష్ణభక్తి భాగవత పురాణం - వాటి వ్యాప్తి తర్వాతనే భక్తికి రసస్థానం లభించింది. భాగవతంలో భక్తి రసస్ఫూర్తిని కలిగించే అనేక కథలున్నాయి. భాగవతంలో భాగవతమత ప్రాశస్త్యం దశవిధభక్తి మార్గాలు వివరింపబడినాయి - "తను హృద్భాషల సఖ్యమున్ శ్రవణమున్ దాసత్వమున్ వందనార్చనముల్ సేవయు నాత్మలో నెరుకయున్ సంకీర్తనల్ చింతనం, బను నీతొమ్మిది మార్గములు". భక్తిని అర్జున ప్రహ్లాద భీష్మాదుల వృత్తాంతాలతో పోతన వివరించాడు. భక్తులకు భగవంతుడు ఎంత సులభుడో భాగవత కథల్లో చెప్పబడింది. భక్తి ప్రపత్తి మార్గంలో భగవన్నామ స్మరణతో ప్రహ్లాదుని వంటి భక్తులు కష్టాలను అవలీలగా ఎదుర్కొని దుష్టశిక్షణకు కారకులుకావడం అంబరీషుని వంటి భక్తుల వ్రతానుష్ఠానాలు భాగవతంలో వర్ణింపబడినాయి. భీష్మనారదుల జ్ఞానభక్తి, రంతిదేవుని త్యాగభక్తి, దేవకీ యశోదల వాత్సల్యభక్తి, హనుమంతాదుల దాస్య భక్తి, ఉద్ధవార్జునాదుల సఖ్యభక్తి, గోపికల మధుర భక్తి, మొదలయిన భక్తి మార్గాలు సంస్కృత భాగవతంలో పురాణ శైలిలో చెప్పబడినాయి. పోతన సుమధురశైలిలో లలితమైన పదాలకూర్పుతో శబ్దాలంకారాల రచనతో

తెలుగు భాగవతానికి కావ్యగౌరవం తెచ్చాడు. సన్నివేశ వర్ణనలలో పాత్రల రూపకల్పనలోను పోతన ప్రావీణ్యం చూపాడు. పోతన స్వయంగా భక్తుడు. భక్త్యావేశంతో అతడు ప్రతి ఘట్టాన్ని భక్తి రసస్ఫోరకంగా వ్రాసాడు. పోతన భక్తిరసాన్నేకాక శృంగార వీరరసాలను చక్కగా పోషించాడు. సత్యభామ యుద్ధ వర్ణనలో ఆమె శృంగారవీర రూపాన్ని రమ్యంగా వర్ణించాడు. కృష్ణుడు రుక్మితో చేసిన యుద్ధాన్ని పోతన సహజంగా కన్నులకు కట్టేటట్లుగా వర్ణించాడు. పోతన యుద్ధ వర్ణనల్లోని వాస్తవికతవైపు విమర్శకుల దృష్టి ఎక్కువగా ప్రసరించలేదు. యుద్ధ వర్ణనలను సహజంగా చేసిన కవులు తిక్కన తర్వాత పోతన - ఆ తర్వాత పెద్దన. కావ్యశైలి వల్లనే మూల భాగవతానికి లేని సాహిత్యగౌరవం పోతన భాగవతానికి కలిగింది.

పోతన అనుసరించిన అనువాద మార్గం కవిత్రయం వారిదే. కొన్నిచోట్ల కథానువాదంగా కొన్నిచోట్ల శ్లోకభావానువాదంగా కొన్నిచోట్ల అమూలక కల్పనలను కూర్చడంగా భాగవతానువాద పద్ధతి నడిచింది. మూల భాగవతంలో లేని రూపకల్పనలు వర్ణనలు శబ్దాలంకారాల రామణీయకతలు పోతన భాగవతంలో కన్పిస్తాయి. పోతన కవితాప్రతిభకు అవి నిదర్శనాలు. పోతన కవిత్వం సుకుమారంగా నడిచింది. లలిత మధురమైంది. పోతన సహజ పాండిత్యం కలవాడు.అంటె పుట్టుకతోనే కవితా పాండిత్యాలు కలవాడని అర్థం. అంటె సహజ ప్రతిభగల కవి అని చెప్పాలి. పోతన మహాభక్తుడు. భక్త్యావేశంతో అతడు ఎన్నోచోట్ల ఘట్టాలను పెంచి వ్రాసాడు. పోతన లలిత మధురమైన పదాలను కూర్చడమేకాక వృత్త్యనుప్రాస యమకాలంకారాలను ప్రయోగించి అర్థధ్వనులను రసస్ఫోరకతలను సాధించాడు. రుక్మిణీ కళ్యాణం, నరకాసుర వధ, వామనావతారం, గజేంద్రమోక్షం, ప్రహ్లాదుని కథలు ఎన్నో రసవంతమైనయి పోతన భాగవతంలో వున్నాయి. పోతన పద్యాలు

ధారాళంగా నడుస్తాయి. ప్రసన్న భావాలతో కూడి చదువగానే అర్థమౌతాయి. కఠినమైన పదాలు సమాసాలు లేవు. పరుషాక్షర ప్రయోగాలు లేవు. కవిత్వం ఎక్కడా కుంటుపడకుండా నడిచింది.

పోతన మధుర ప్రసన్నమైన రచన పండితపామరులను సమానంగా అలరింపజేస్తున్నది. పోతన భాగవతంలోని ఒక్క పద్యమైనారాని ఆంధ్రుడుండడంటె అతిశయోక్తి కాదు. పోతన అనగానే మనకు భక్తిరసం జ్ఞాపకానికి వస్తుంది. కాని పోతన భక్తితో సమానంగా శృంగార వీర రసాలను పోషించాడు. అతడు వర్ణించిన శృంగార స్త్రీమూర్తులు శృంగారభావాలు కోమలంగా మృదుమదురంగా అందంగా వున్నాయి. భక్తి శృంగారాలు విరుద్ధ రసాలు. కాని పోతన భక్తి శృంగారాలను సమానంగా నడిపి తన ప్రతిభను చూపాడు. ఉదాహరణకు - మొసలి గజేంద్రుని కాలు పట్టుకొని లాగుతుంటె బాధతో దిక్కుతోచక తనను రక్షించమని విష్ణువుతో మొరపెట్టుకుంటాడు. ఆ మొర విన్న విష్ణువు వెంటనే వున్నపళంగా బయలు దేరి రావడాన్ని పోతన ఇట్లా వర్ణించాడు.

సిరికిం జెప్పడు శంఖచక్రయుగముం జేదోయి సంధింప డే
పరివారంబును జీర డభ్రగపతిం బన్నింపడా కర్ణికాం
తర ధమ్మిల్లము చక్కనొత్తడు వివాదప్రోత్థిత శ్రీకుచో
పరి చేలాంచలమైన వీడడు గజ ప్రాణావనోత్సాహియై.

విష్ణువు ప్రణయకలహంలో లక్ష్మీదేవి చీరకొంగుపట్టి లాగుతున్నవాడు అట్లాగే చేతిలో చీర కొంగుతో పాటు లక్ష్మీదేవితో గజేంద్రుని రక్షించడానికి హుటాహుటిని వచ్చేసాడని పోతన వర్ణన. ఈ ప్రణయకలహం చీరకొంగు లాగడం ఆకొంగుతో లక్ష్మీదేవి రావడం వర్ణన మూలంలో లేదు. భక్తిరసం మధ్య ఈ శృంగారభావం పోతన స్వంత కల్పనే. అదేవిధంగా యుద్ధరంగంలో వీరరసావేశంతో కూడిన సత్యభామను వర్ణించేటప్పుడు వీరంతోపాటు

శృంగారాన్ని కూడ పోతన కలబోసి వర్ణించాడు. అది మూలంలో లేదు. ఆ పద్యంలోని శబ్దాలంకార సౌందర్యం కూడా పోతనదే.

పరుజూచున్ వరుజూచు నొంపనలరిపంన్ రోషరాగోదయా
విరత భ్రూకుటి మందహాసములతో వీరంబు శృంగారమున్
బరగం గన్నుల గెంపుసొంపుఁ బరగం జండాస్త్ర సందోహమున్
సరసాలోక సమూహమున్ నెరపుచుం జంద్రాస్య హేలాగతిన్.

పోతన కవితా మాధుర్యం రసవంతమైన భావాలు ఆబాలగోపాలాన్ని ఆనందింప జేస్తాయి. తెలుగు సాహిత్యంలో పోతన కవిత్వం విలక్షణమైంది. పోతన ప్రయోగించిన శబ్దాలంకార వైచిత్రిని అంతకుముందు తెలుగు కవులెవరూ చూప లేదు.

వెడవెడ నడకలు నడచుచు
నెడనెడ నడుగిడగ నడరి యిల దిగబడగా
బుడిబుడి నొడువులు నొడువుచు
జిడిముడి తడబడగ వడుగు సేరెన్ రాజున్

ఈ పద్యంలో "డ" కారావృత్తి పొట్టివాడైన బుడతడు వామనుని నడకలను స్ఫురింప జేస్తున్నది. ఇటువంటి వృత్త్యనుప్రాసాలంకారం పోతన కవిత్వంలో అడుగడుగునా కన్పిస్తుంది.

కమనీయ శుభ గాత్రు కంజాత దళనేత్రు
వసుధాకళత్రు పావనచరిత్రు...

అంత్యానుప్రాసతో పై పద్యం ప్రసన్నమధురంగా వుంది. పోతన కవిత్వంలో అనుప్రాసాది శబ్దాలంకారాలు అప్రయత్నంగా దొర్లినట్లు వుంటాయి. అవి కవిత్వంలో మాధుర్యాన్ని సాధించి భక్తిరస పోషణను చేసాయి. పోతన కవిత్వంలో అనుప్రాస భేదాలే కాక యమకం ముక్తపదగ్రస్తం వంటి శబ్దాలంకారాలు కూడా అప్రయత్నంగానే దొర్లినట్లుగా కన్పిస్తాయి.

లేమా దనుజుల గెలువగ
లేమా నీవేల కడగి లేచితి విటురా
లేమాను మానవే నా
లే మా విల్లంది కొనుము లీలం గేలన్.

పై పద్యంలో యమకాలంకార సౌందర్యం భావ వైచిత్రితో పోటీ పడుతున్నది.

కొందరకు తెనుగు గుణమగు
కొందరకును సంస్కృతంబు గుణమగు రెండుం
కొందరకు గుణములగు నే
నందర మెప్పింతు కృతుల నయ్యై యెడలన్.

అని పోతన ఆత్మవిశ్వాసంతో తన కవిత్వంలో తెనుగు సంస్కృత భాషల ప్రయోగం సమానంగా వుంటుందని ప్రకటించాడు. అదే విధంగా పోతన కవిత్వం ఒకచోట దేశి పదాల సొంపుతో మరోచోట సంస్కృత భూయిష్టంగాను నడిచింది. చాలా చోట్ల అతడు తిలతండుల న్యాయంగా తెలుగు సంస్కృత పదాలను కలెబోసి రచన సాగించాడు. పోతన ఈ భాషా ప్రయోగంతో తర్వాత కవులకు తెలుగా, సంస్కృతము, అన్న సమస్య రాలేదు. తెలుగు సంస్కృత పదాలను పడుగు పేకల వలె కలెబోసే తర్వాత కవులు భాషాశైలిని నడిపించారు.

పోతన భాగవతంలో దక్షాధ్వరధ్వంసఘట్టంలో శివనింద చేసిన పాప పరిహారం కోసం వీరభద్రవిజయం అనే కావ్యాన్ని వ్రాసాడని అంటారు. తన గురువు ఇవటూరి సోమశేఖరుని ప్రోత్సాహంతో పోతన ఆ కావ్యాన్ని వ్రాసాడు. దానిలో రచన పరిపక్వంగా లేదు. ఒకవేళ గురువుగారి ఆదేశంతో పోతన చిన్ననాడే ఆ కావ్యాన్ని వ్రాసాడేమో. రచన పరిపక్వంగా లేకపోయినా భాగవతపద్యాల పోలికలు వీరభద్రవిజయం పద్యాల్లో వున్నవని

అది పోతన రచనే అని మల్లంపల్లి సోమశేఖరశర్మ గారి అభిప్రాయం. భాగవతంలోని కవితాలక్షణాలు ఆ కావ్యంలో అసలే లేవని అది పోతన రచన కాదని పింగళి లక్ష్మీకాంతం గారి అభిప్రాయం. పోతన కొడుకు ప్రౌఢకవి బిరుదం గల మల్లన తన రుక్మాంగదచరిత్రలో గాని పోతన మునిమనుమలు కేసనమల్లనలు తమ దాక్షాయణీపరిణయంలో గాని పోతన వీరభద్ర విజయం గురించి చెప్పలేదు. పోతన సహజ పండితుడనని భాగవతంలో చెప్పుకున్నాడు. గురువు ఇవటూరి సోమనారాధ్యుదున్నట్లుగా పోతన చెప్పుకోలేదు. పోతన భాగవతంలో శ్రీరామప్రసాదలబ్ధ కవితావిలాసుడనని చెప్పుకున్నాడు. వీరభద్ర విజయంలో వీరభద్ర ప్రసాదం వల్ల కవిత్వం చెప్పనేర్చినానని చెప్పుకున్నాడు. భాగవతంలోని పోతన వంశవర్ణన వీరభద్ర విజయంలోని వంశ వర్ణనతో కలవడం లేదు. ఆ కారణాలన్నిటి చేత వీరభద్రవిజయం పోతన కృతి కాదని ఎవరో వ్రాసి అతని పేరు పెట్టారని కొందరు పండితులభిప్రాయపడినారు. ఒకవేళ వీరభద్రవిజయం కర్త పోతన – భాగవత కర్త పోతనకు సవతి తమ్ముడో లేదా అతని వంశంలోనివాడో అయివుంటాడని మరికొందరు పండితులు అభిప్రాయపడినారు. పోతన మొదట వీరశైవుడని, అతడు వీరశైవుడుగా వున్నప్పుడు వీరభద్రవిజయం వ్రాసాడని అప్పుడతని గురువు ఇవటూరి సోమనారాధ్యుడని ఆ గురువు ప్రేరణతో ఆ కృతిని వ్రాసాడని చాలామంది అభిప్రాయం. ఆ కావ్యరచన నాటికి పోతన కవిత్వం శైలి గట్టిపడలేదని అందుకే దానిలో అతని కవిత్వం అపరిపక్వంగా వుందని అంటారు. పోతన మునిమనుమలైన కేసనమల్లనలు ఇవ్వటూరి పర్వతాలును తమ గురువుగా పేర్కొన్నారు. ఆ పర్వతాలు పూర్వజుడే పోతన గురువు సోమనారాధ్యుడు కావచ్చును. పోతన వీరశైవుడుగా వున్నప్పుడు అతడు గురువు. అప్పుడు పోతన వీరభద్రుని కృపచేత కవిత్వం చెప్పాడు. కాని రామభక్తుడైంతర్వాత శ్రీరాముని కృపతో కవిత్వం చెప్పాడు. దీనిలో అసహజమేమి లేదు. పోతన మొదట వీరశైవుడని

అతని కొడుకు మునిమనుమలు వ్రాసిన కావ్యాలనుబట్టి తెలుస్తున్నది. పోతన తర్వాత అతని కుటుంబీకులు వీరశైవులు గానే వున్నారు. పోతన మాత్రమే రామభక్తుడై విష్ణుభక్తితత్త్వాన్ని బోధించే భాగవతాన్ని వ్రాసాడని చెప్పవచ్చును. ఈ ఆధారాలను బట్టి వీరభద్రవిజయం పోతన చిన్ననాటి రచన అని తెలుస్తున్నది. భాగవతంలో శివనిందాపాపపరిహారం కోసం రచించాడనడం అది భాగవతం తర్వాత రచన అని అనడం తర్వాత పుట్టిన ఐతిహ్యం.

## మొల్ల

పోతన లాగానే మొల్ల వీరశైవురాలైవుండి రామభక్తిని అనుష్ఠించింది. కాకతీయ సామ్రాజ్యపతనానంతరం ఓరుగల్లులో వెలిసిన కవులు పోతన మొల్లలు. ఏకామ్రనాథుని ప్రతాపచరిత్ర (క్రీ.శ 1550)ను బట్టి మొల్ల రెండవ ప్రతాపరుద్రుని ఆస్థానంలో కవయిత్రి అని తాను వ్రాసిన రామాయణాన్ని ఆ రాజుకు అంకితమియ్యాలని అనుకున్నదని తెలుస్తున్నది. రెండో ప్రతాపరుద్రుడు ఢిల్లీ సుల్తాను చేతిలో ఓడిపోయి మరణించడంతో ఆమెకది సాధ్యం కాలేదేమో చెప్పలేము. కాని మొత్తం మీద వీరశైవ ప్రభావం నశించి రామభక్తి సంప్రదాయం ఆంధ్ర దేశంలో ప్రవేశించిన తరుణంనాటిది మొల్ల. రామానుజుని ప్రశిష్యుల్లో ఒకడైన రామానందుడు రామభక్తి సంప్రదాయాన్ని బోధించాడు. రామానందుడు ఉత్తరభారతానికి పోతూ మార్గమధ్యంలో రామభక్తి సంప్రదాయాన్ని ప్రచారం చేస్తూ పోయి వుంటాడు. అట్లా రామభక్తి ఆంధ్రదేశంలో ప్రవేశించి వ్యాపించింది. ఆ కాలంలోనే పోతన మొదట వీరశైవుడుగా వుండి రామభక్తుడైనాడు. మొల్ల తన తండ్రి "గురులింగజంగ మార్చన పరుడు" అని "శివభక్తి రతుడు" అని చెప్పిందాన్నిబట్టి ఆమె వీరశైవకుటుంబంలో పుట్టిందని తెలుస్తున్నది. పోతనలాగానే మొల్ల వీరశైవాన్ని విడిచిపెట్టి రామభక్తురాలై రామాయణ

కావ్యాన్ని వ్రాసింది. వీరశైవకుటుంబంలో పుట్టింది కాబట్టి కుమ్మరి కులంలో పుట్టిన మొల్లకు విద్యాబుద్ధులు అలవడినాయి. వీరశైవంలో స్త్రీజ్ఞాన సముపార్జనకు అడ్డంకులు లేవు. తిక్కన తర్వాత దాదాపు పోతన కాలంలో - క్రీ.శ 1350 - 1400 ప్రాంతంలో మొల్లజీవించి వుంటుంది. కొందరు పండితులు తెలుగు సాహిత్యంలో మొల్లనే ప్రథమ కవయిత్రిగా అంగీకరించారు.

పోతన - "పలికెడిది భాగవతమట, పలికించెడివాడు రామభద్రుడట, యిక నే పలికిన భవహర" మగునని చెప్పుకున్నట్లుగానే మొల్ల కూడా - "చెప్పుమని రామచంద్రుడు సెప్పించిన పలుకుమీద చెప్పెద నే నెల్లప్పుడు నిహపరసాధన మిప్పుణ్యచరిత్ర తప్పులెంచకుడు కవుల్" అని చెప్పుకున్నది. పోతన తన కృతిని నరాంకితం చేయక రాజులను నిరసించనట్లుగానే మొల్ల కూడా నిరసించి ఇట్లా అన్నది - "రామనరపాలకుని స్తుతిసేయు జిహ్వారున్ విల్లర రాజలోకమును జేకొని మెచ్చగ నిచ్చంబుట్టునే...." ఇద్దరిదీ ఒక్కలాంటి రామభక్తి మార్గమే.

మొల్ల కన్న ముందు తెలుగులో రామాయణాలను వ్రాసిన కవులున్నారు. కాని వాళ్ళెవ్వరు భక్తులుగా ప్రసిద్ధికెక్కలేదు. మొల్ల భక్తి పరాయణతతో రాముని కథను గానం చేసింది. ఒక వారాంగన తన పెంపుడు చిలుకను శ్రీరాముని పేరుతో పిలిచి మోక్షం పొందింది. ఇక రాముని చరిత్రనే వ్రాస్తే తనకు మోక్షసిద్ధి కలుగుతుందన్న ఆశతో భక్తురాలు మొల్ల రామాయణాన్ని వ్రాసింది. మొల్లలో పోతనంత భక్త్యావేశం పరుగులు తియ్యడం లేదు. ఆమె కవిత్వం సరళగంభీరంగా వుంది. విజ్ఞానులను అజ్ఞానులను రాముడు కృపతో చూడడానికి భక్తియే కాని చదువు కారణం కాదని మొల్ల విశ్వాసం. "ఛందో విలక్షణములు కావ్యసంపద ప్రక్రియలు నిఘంటువుల క్రమా" లేవి తను చదువుకోలేదని

గోపవరం (ఆమె స్వగ్రామం కావచ్చును) లోని శ్రీకంఠ మల్లేశుని వరంచేత కవిత్వం చెప్పగలిగానని మొల్ల అంటుంది. దాన్ని బట్టి మొల్ల పెద్దగా చదవుకోలేదని భక్తిచేత ప్రేరేపితురాలై రామాయణాన్ని తన సహజ కవితా ప్రతిభతో వ్రాసిందనవచ్చును.

మొల్ల రామాయణ కావ్యం పరిమాణంలో చిన్నది. కేవలం కథను మాత్రమే "కట్టె కొట్టె తెచ్చె" అన్నట్లుగా సంగ్రహంగా చెప్పింది. ఆమె కావ్యం కథాకథనంలోగాని భావకల్పనలోగాని విశేషంగా లేదు. లఘురూపంలో వున్న ఆ రామాయణం బాగా ప్రచారంలో వుండి వుంటుంది. అందుకే కాలపుతాకిడిలకు ఈనాటికి నిలిచి వుంది.

మొల్ల రామాయణం అయోధ్యపురవర్ణనతో ఆరంభమైంది. ప్రబంధ వర్ణనలున్నాయి. దాంచేత మొల్ల ప్రబంధయుగానికి అంటే క్రీ.శ. 16వ శ.కి చెందిందని అన్నారు. కాని తిక్కన ఎర్రనలు కూడా పురవర్ణనలతో కావ్యారంభం చేసారు. ప్రబంధోచిత వర్ణనలు చేసారు. దాన్ని బట్టి మొల్ల రెండవ ప్రతాపరుద్రుని కాలం నాటిదని చెప్పడానికి ఏమి ఆటంకముండకూడదు. రాజులకు ప్రియురాళ్ళుగా వుండి కొందరు స్త్రీలు కావ్యాలు వ్రాసారు. కాని సామాన్య స్త్రీ అయిన మొల్ల ఏ రాజాశ్రయం లేకుండా తన కవిత్వాన్ని స్వచ్ఛందమార్గంలో నడిపి కీర్తిని సంపాదించుకుంది.

మొల్ల కవిత్వం సరళ సులభం. భావాలు సూటిగా వుంటాయి. అక్కడక్కడ చక్కని భావ సంపదగల పద్యాలను మొల్ల చెప్పింది. ఉదా. గుహుడు రాముని పాదధూళి సోకి తన నావ ఏమౌతుందో అని రాముని పాదాలను కడిగి నావనెక్కనిస్తాడు. గుహుని భయాన్ని మూఢభక్తిని కవయిత్రి రమణీయంగా చెప్పింది.

సుడిగొని రామపాదములు సోకిన ధూళి వహించి రాయియే

ర్పడనొక కాంతయయ్యెనట పన్నగ నీతని పాదరేణు ని
య్యెడ వడినోడ సోకనిది యేమగునోయని సంశయాత్ముడై
కడిగె గుహుడు రామపదకంజయుగంబు భయము పెంపునన్.

మొల్ల చంపూ మార్గంలో తన రామాయణాన్ని వ్రాసింది. ఆమె వర్ణనలు సహజ సుందరంగా వున్నాయి. ఎక్కడ ఆమె కవితలో అతిశయోక్తి అన్నది లేదు. స్త్రీ సహజమైన మృదుమధుర వాక్కు ఆమెది.

## పిల్లలమర్రి పినవీరన

పిల్లలమర్రి పినవీరన (క్రీ.శ.1480 ప్రాంతం) శ్రీనాథునికి సమకాలికుడు. వయస్సులో అతని కన్నా చిన్నవాడు. శ్రీనాథుడు "బ్రాహ్మీదత్త వర ప్రసాదు"డనని చెప్పుకోగా పినవీరన "వాణి నారాణి" అని చెప్పుకున్నాడు. పినవీరన శృంగారశాకుంతలం జైమినిభారతం కావ్యాలను వ్రాసాడు. అవేగాక అవతారదర్పణం, నారదీయం, మాఘమాహాత్మ్యం, మానసోల్లాసం అనే కృతులను రచించానని శృంగార శాకుంతలంలో పినవీరన చెప్పుకున్నాడు. కాని అవి దొరుకలేదు.

శృంగార శాకుంతలానికి శకుంతలా పరిణయమని కవి పెట్టిన పేరు. శృంగార నైషధంవలె శృంగార రసప్రధానమైందని కావచ్చును లోకంలో దానికి శృంగార శాకుంతలమని ప్రసిద్ధంగా పేరు వచ్చింది. అది నాలుగు ఆశ్వాసాల కావ్యం. పినవీరన మహాభారతంలోని శకుంతల కథను ప్రధానంగా తీసుకొని దానికి కాళిదాసు అభిజ్ఞాన శాకుంతల నాటకక్రమాన్ని కొంత చేర్చి ఆ కావ్యాన్ని రచించాడు. ఋషుల ప్రార్థనననుసరించి వేటకు వచ్చిన దుష్యంతుడు కణ్వాశ్రమానికి రావడం, శకుంతల తన సఖులు అనసూయాప్రియంవదలతో కూడి వృక్షజలసేచనం చేస్తుండగా దుష్యంతుడు

చెట్టుచాటున వుండి వాళ్ళ మాటలు వినడం, అంగుళీయక వృత్తాంతం - వీటిని పినవీరన కాళిదాసు నాటకం నుంచి తీసుకున్నాడు. నాటకాన్ని అనుసరించి విదూషక పాత్రను ప్రవేశపెట్టాడు. పుత్రవతి అయిన శకుంతల దుష్యంతుని సభకు రావడం ఆకాశవాణి కథనం మొదలైన తర్వాత కథ మహాభారత కథననుసరించి వుంది.

పిన వీరన శృంగార శాకుంతలంలో సందర్భానుకూలంగా పుర మృగయా స్త్రీ సౌందర్యకథనాది ప్రబంధ వర్ణనలను సరసంగా చేసాడు. వేటను విశదంగా వర్ణించిన మొదటి కవి పినవీరన. పినవీరనను అనుసరించి నందిమల్లయ ఘంటసింగయ, పెద్దన కవులు వేటను విశదంగా వర్ణించారు. ఇటువంటి సహజమైన వేట వర్ణనలు సంస్కృతకావ్యాల్లో లేవు. పిన వీరన రసభావాలను సన్నివేశాలను సంభాషణలను తర్వాత పెద్దనాది కవులు అనుసరించారంటె పినవీరన కవితావైభవ మెటువంటిదో తెలుస్తున్నది.

పినవీరన చివరి రచన జైమిని భారతం. సంస్కృతంలో వ్యాసభారతాన్ని నలుగురు శిష్యులు ప్రచారం చేసారు. వాటిల్లో వ్యాసభారతమే ఎక్కువ ప్రచలితంగా వుండి మహాభారతం పేరుతో ప్రసిద్ధికెక్కింది. జైమిని ప్రచారం చేసిన మహాభారతంలో ఒక్క అశ్వమేధపర్వమే దొరుకుతున్నది. దాన్నే పినవీరన తెలుగులోకి అనువదించాడు. అది 8 ఆశ్వాసాల కావ్యం. ధర్మరాజు అశ్వమేధయాగం చేయడం భీమార్జునులు అశ్వమేధాన్ని రక్షిస్తూ దిగ్విజయయాత్ర చేయడం మొదలైన కథా ఘట్టాలు దానిలో వున్నాయి. దానిలో శ్రీకృష్ణుని మహిమ గొప్పగా చెప్పబడింది. ధర్మరాజాదులందరు కృష్ణభక్తులుగా కన్పిస్తారు. ప్రధాన కథతోపాటు దీనిలో కుశలవోపాఖ్యానం, చంద్రహాసకథ, ప్రమీలార్జునీయం, బభ్రువాహన వృత్తాంతం, ఉద్దాలకుని చరిత్ర మొదలైన రమ్యమైన ఘట్టాలున్నాయి. జైమిని భారతంలో పినవీరన శైలి ప్రౌఢంగా వుంది. అది శృంగార శాకుంతలమంత కీర్తిని సంపాదించిన

కావ్యం కాదు. పినవీరన జైమిని భారతాన్ని విజయనగరరాజు సాళువ నరసింహరాయలు (క్రీ.శ. 1485-93) కు అంకితంగా ఇచ్చాడు. పిన వీరన అన్న పెద వీరన సాళువ నరసింహరాయల దగ్గర ఉద్యోగి.

పినవీరన తర్వాత క్రీ.శ. 1550 ప్రాంతం వాడైన లక్ష్మీశుడనే కన్నడకవి జైమినిభారతాన్ని షట్పదిలో వ్రాసాడు. లక్ష్మీశుడు పినవీరన భారతాన్ని చూసే వుంటాడని పండితుల అభిప్రాయం. కాని లక్ష్మీశుని కావ్యం కావ్యశైలిలో వీరరసప్రధానంగా నడిచి అధిక ప్రచారాన్నందుకున్నది. పినవీరన పురాణ శైలి అతని కావ్యానికి ఎక్కువ గౌరవం తేలేకపోయింది. పినవీరన తెలంగాణాలోని నల్లగొండ జిల్లాలో ప్రసిద్ధమైన పిల్లలమర్రి నివాసి. విజయనగరానికి పోయి అక్కడ రాజాదరణను సంపాదించి వుంటాడు.

## తాళ్ళపాక అన్నమాచార్యుడు

అన్నమయ క్రీ.శ. 1424-1503 ప్రాంతం వాడు. వేంకటేశ్వరుని భక్తుడు. తిరుపతి కొండ మీదనే నివాసాన్నేర్పరుచుకొని ఆ భక్తుడు భక్తి భావ భరితమైన పదాలను శతకాలను రచించాడు. తెలుగులో మొట్టమొదటి పదకర్త అన్నమయ. యోగ వైరాగ్య శృంగార భావాలతో నిండిన 32 వేల పదాలను అతడు రచించాడు. ఇప్పుడు 2 వేలకు పైగా మాత్రమే దొరుకుతున్నాయి. అతనికి "పద కవితాపితామహ" "సంకీర్తనాచార్య" అనే బిరుదాలున్నాయి. పదాలకు కీర్తనలు, సంకీర్తనలని పేరు. అన్నమయ సంస్కృతంలో పద లక్షణగ్రంథాన్ని వ్రాసి సంస్కృతంలో పదాలను కూడా వ్రాసాడు. కాని ఆ లక్షణ గ్రంథం దొరకడం లేదు. పదాలకు లక్షణాన్ని కల్పించింది అన్నమయే అని అతని తర్వాతనే కన్నడంలో పురందరదాసు పదాలు వ్రాసాడని పండితుల అభిప్రాయం.

అన్నమయ వేంకటాచల మాహాత్మ్యం, వేంకటేశ్వర శతకాలు వ్రాసాడు. వాల్మీకి రామాయణాన్ని సంకీర్తనలుగా వ్రాసాడని చిన్నన్న తన అన్న మాచార్య చరిత్రలో చెప్పాడు. కాని అవి దొరక లేదు. అన్నమయ 12 శతకాలను వ్రాసాడని చెప్పుకున్నాడు. ఇప్పుడు ఒక్క శతకమే దొరుకున్నది.

అన్నమయ పదాలు వ్యావహారిక పదజాలంతో పండితపామరులకు ఆహ్లాదకరంగా వున్నాయి. తెలుగు నుడికారం స్వచ్ఛమైన భావసంపద అతని పదాల్లో కన్పిస్తాయి. పామరుల పాటల్లోంచి అన్నమయ పదలక్ష ణాలను ఏర్పరచుకొని వ్రాసాడని పండితుల అభిప్రాయం. అన్నమయ భక్తి శృంగారభావాలు మధురమైనయి. అతని పదాలు పాడుకోడానికే కాక నృత్యాభినయనానికి తగినట్లుగా వున్నాయి. పామరుల పలుకుబడిని ఉపయోగించి అన్నమయ గంభీరమైన వేదాంత విషయాలను చెప్పాడు. అన్నమయ గొప్ప సంగీతజ్ఞుడు. వేదాంత కవి, భక్తుడు.

అన్నమయ సాళువ నరసింహరాయల సమకాలికుడు. ఆ రాజు తన మీద పదరచన చేయమని అడుగగా అన్నమయ నిరాకరించి కారాగారం పాలయ్యాడని చివరకు నరసింహరాయలు తన తప్పు తెలుసుకొని అతన్ని విడచి పెట్టాడని అంటారు.

తాళ్ళపాక వంశంలో తర్వాత చాలా మంది భక్తకవులు పదకర్తలు కావ్యకర్తలు జన్మించారు. అన్నమాచార్యుల మొదటి భార్య తిమ్మక్క భక్తురాలు కవయిత్రి. అతని రెండోభార్య కొడుకు పెదతిరుమలాచార్యుడు శతకాలను ద్విపద కావ్యాలను పదాలను అనేకం రచించాడు. తనవి తన తండ్రి పదాలను అతడు రాగిరేకుల మీద చెక్కించాడు. పెద తిరుమలాచార్యుని పెద్ద కొడుకు చిన తిరుమలయ్య అష్టభాషా కవిచక్రవర్తి. అనేక పదాలను వ్రాసాడు. చిన తిరువెంగళ నాథుడు (చిన్నన్న) పెద

తిరుమలయ్య నాలుగో కొడుకు. కావ్యాలన్నీ ద్విపదలో వ్రాసి ద్విపదకవిగా ప్రసిద్ధికెక్కాడు. చిన తిరుమలయ్య కొడుకు తిరువెంగళప్ప అమరుకశతకాన్ని తెనిగించాడు.

## తిమ్మక్క

అన్నమాచార్యుల మొదటి భార్య. ఈమెకు తిరుమలాంబ తిమ్మాంబ అని కూడా పేర్లు. ఈమె సుభద్రాపరిణయమన్న ద్విపదకావ్యాన్ని వ్రాసింది. ఇది మంజరీ ద్విపదలో వుంది. మంజరీ ద్విపద స్త్రీబాలపామరాదులు కంఠపాఠంగా నేర్చుకోడానికి వీలైందని వేటూరి ప్రభాకర శాస్త్రిగారు ఈ కావ్య పీఠికలో వ్రాసారు. తిమ్మక్క వ్రాసిన ఈ ద్విపదకావ్యం చాలా చిన్నది. పెండ్లిపాట రూపంలో వుంది. రూపం చెడిన కావ్యప్రతి ఒకటి కాళహస్తి రాజాగారి తాళపత్ర గ్రంథ సంచయంలో వుంటే ప్రభాకరశాస్త్రిగారు దాన్ని తీసుకొని ప్రచురించి వెలుగులోకి తెచ్చారు. పెండ్లిపాట రూపంలో ఇది మౌఖిక ప్రచారంలో వుండి వుండవచ్చును.

తిమ్మక్క గురువుల దగ్గర విద్యనభ్యసించలేదు. భర్త అన్నమాచార్యుల భక్తి కవిత్వాలు ఆమెకు అబ్బివుంటాయి. అందుకే సుభద్రాకళ్యాణ వృత్తాంతాన్ని గానం చేసింది. ఇంట్లో వాతావరణాన్ని బట్టి ఆమెకు సంగీతం కూడా అలవడి వుంటుంది. తిమ్మక్క కవిత్వం స్త్రీ సహజమైన మార్దవంతో సరళ సులభంగా వుంది. భావాలు సూటిగా గృహవాతావరణ చిత్రణతో సాగాయి. కవిత్వం విశేషమైన భావాలంకార చమత్కారాలు లేకుండా సహజంగా గేయరూపంలో నడిచింది. ఈ గేయం జానపదుల పాటలాగా సాగింది. తిమ్మక్క వేంకటేశ్వరుని భక్తురాలే కాని కృష్ణుడంటె అభిమానం. అందుకే కృష్ణపాత్ర ప్రాధాన్యమున్న సుభద్రాకళ్యాణాన్ని తీసుకొని పాటగా రచించింది.

# నందిమల్లయ ఘంటసింగయలు

మనకు తెలిసినంతవరకు వీళ్ళిద్దరు తెలుగులో మొదటి జంటకవులు. జంటగా కవిత్వం చెప్పడం అష్టావధాన శతావధాన ప్రక్రియలు తెలుగు సాహిత్యాన్నికి పరిమితమైనయి. ఈ జంటకవుల కృతులు - ప్రబోధ చంద్రోదయం. వరాహ పురాణం. భాగవత షష్ఠ స్కంధం (ఇది దొరకలేదు)

సంస్కృతంలో కృష్ణమిశ్రుడు (క్రీ.శ. 1098) వ్రాసిన ప్రబోధ చంద్రోదయ నాటకాన్ని ఈ కవులు కావ్యంగా గద్యపద్యాల్లో రచించారు. ఈ నాటకాన్ని కావ్యంగా వ్రాసే ప్రయత్నం మంచన కేయూర బాహుచరిత్ర పినవీరన శాకుంతలంలో ఇదివరకే జరిగింది. ఈ నాటకం వేదాంత విషయాలతో వుంది. పాత్రలు కూడా - మనస్సు, మాయ, ప్రవృత్తి, నివృత్తి, మోహకామలోభ వివేకం మొదలయినయి. మనస్సు జ్ఞానోపదేశంతో వివేకాన్ని పొందే ఇతివృత్తం ఇందులో వుంది. ప్రతీక పాత్రలతో కథ చెప్పబడింది. ఇటువంటి ప్రతీకపాత్రలు గల నాటకాన్ని బౌద్ధకవి అశ్వఘోషుడు సంస్కృతంలో వ్రాసాడు. సందర్భానుకూలంగా ప్రబంధ వర్ణనలను చేర్చి స్వతంత్ర పద్ధతిలో కవులు ఈ నాటకాన్ని అనువదించారు. ఇది శాంత రసప్రధానమైన కావ్యం. దీన్ని కవులు దగ్గుపల్లి దుగ్గయ నాచికేతోపాఖ్యానాన్ని అంకితంగా తీసుకున్న చందులూరి గంగయామాత్యునికి అంకితంగా ఇచ్చారు. గంగయామాత్యుడు వేదాంత విషయాలంటె అభిరుచి కలవాడేమో.

సంస్కృత వరాహపురాణాన్ని అనువదించి. ఈ కవులు తుళువ నరసనాయకునికి (క్రీ.శ. 1493-1505 ఇతడు శ్రీకృష్ణదేవరాయల తండ్రి) అంకితంగా ఇచ్చారు. మూలంలోని కొన్ని భాగాలనే తీసుకొని వీళ్ళు స్వతంత్రానువాదం చేసారు. రసవంతమైన కథలను ఎన్నుకోలేదు.

హాని తీసుకున్న వృత్తాంతాలను ప్రబంధ వర్ణనలతో పెంచి వ్రాసారు. ఈ రచనలో దుర్జయోపాఖ్యానం గౌతమ్యుపాఖ్యానం, ధర్మవ్యాధోపాఖ్యానం చెప్పుకోదగినయి. మిగతా భాగమంతా ధానధర్మాలు వ్రతానుష్ఠానాల వర్ణనలతో నిండి వుంది. దుర్జయుడు వేటకు పోయిన సందర్భంలో ఈ కవులు చేసిన వేట వర్ణన చెప్పుకోదగింది.

## గౌరన

ఈ కవి క్రీ.శ. 1380-1450 ప్రాంతంవాడు. నవనాథ చరిత్ర హరిశ్చంద్రోపాఖ్యానం ఇతని కృతులు. రెండు ద్విపద రచనలే. సంస్కృతంలో లక్షణ దీపిక అనే చంద్రోగ్రంథాన్ని ఈ కవి వ్రాసాడు. గౌరన భక్తుడు. తాను శ్రీశైల భ్రమరాంబ అనుగ్రహం వల్ల కవిత్వం చెప్పానన్నాడు. తన కావ్యాలను శ్రీశైల మల్లికార్జునునికి అంకితమిచ్చాడు.

నవనాథుల చరిత్రను ఇంతకు పూర్వమే శ్రీగిరికవి చంపువులో వ్రాసాడు. దాన్ని అనుసరిస్తూ గౌరన ద్విపదలో వ్రాసాడు. శ్రీగిరికవి కృతి ఇప్పుడు దొరకడం లేదు. నాథసంప్రదాయమన్నది శ్రీపర్వత ప్రాంతంలో అంటె ఈనాటి నాగార్జునకొండ శ్రీశైలం కొండ ప్రాంతంలో పుట్టి పెరిగింది. ఈ సంప్రదాయం బౌద్ధ సిద్ధ సంప్రదాయం నుంచి పుట్టింది. దీన్ని మత్స్యేంద్రనాథుడు ప్రవర్తింపజేసాడంటారు. అతని శిష్యుడు గోరఖ (గోరక్ష) నాథుడు ఈ సంప్రదాయాన్ని వ్యాపింపజేసాడు. నాథ సంప్రదాయం క్రీ.శ. 8-14 శతాబ్దాల్లో కన్యాకుమారి నుంచి నేపాల్ వరకు సింధు నుంచి అస్సాం వరకు భారతదేశమంతటా సామాన్య జనుల్లో వ్యాపించింది. ఈ సంప్రదాయంలో 9 మంది గురువులు నవనాథులన్న పేరుతో ప్రసిద్ధులు. ఆ నవనాథుల చరిత్రలే గౌరన కావ్యంలో కూర్చబడినాయి. నాథ సంప్రదాయంలో యోగానికి, యోగీశ్వరుడైన శివునికి ప్రాధాన్యముంది.

మూఢవిశ్వాసాలను విగ్రహ పూజలను వీళ్ళు నిరసించి యోగతత్త్వాన్ని బోధించారు. నవనాథ చరిత్రను గౌరన కథాకథనకౌశలంతో వ్రాసాడు.

హరిశ్చంద్రోపాఖ్యానంలో హరిశ్చంద్రుని కథ వుంది. మార్కండేయ స్కాంద పురాణాల్లో వున్న హరిశ్చంద్రుని కథను గౌరన స్వంత కల్పనలను చేర్చి వ్రాసాడు. మంగళసూత్రాన్ని చూసి చంద్రమతి తన భార్య అని హరిశ్చంద్రుడు గుర్తించడం, చంద్రమతికి శిశుహత్యానింద రావడం, రాజదండన, హరిశ్చంద్రుడు ఆజ్ఞానిర్వహణ చేయడం మొదలయిన వృత్తాంతాలు గౌరన చేసిన కల్పనలు. కన్నడంలో ప్రసిద్ధ కవి రాఘవాంకుడు (క్రీ.శ. 1250-1300) "హరిశ్చంద్రకావ్యం" వ్రాసాడు. ఆ రచన ఉత్తమంగా సాగి రాఘవాంకకవికి కన్నడ కవి శ్రేష్ఠుల్లో స్థానం దొరికింది. రాఘవాంకుని వలెనే హరిశ్చంద్రుడు శివభక్తుడు. నాటకీయశైలిలో సరళ సుందర శైలిలో రాఘవాంకుని కావ్యం సాగిందట. ఆ కవి తన కావ్యంలో నక్షత్రపాత్రను ప్రవేశపెట్టాడు. గౌరన కూడా నక్షత్రకపాత్రను ప్రవేశపెట్టాడు. వాళ్ళిద్దరి నక్షత్రకపాత్రకు మూలం సంస్కృతంలో క్షేమేశ్వరుడు (క్రీ.శ. 900) వ్రాసిన చండకౌశిక నాటకంలో వుంది. హరిశ్చంద్రుని కథను తీసుకొని కవి ఈ నాటకాన్ని వ్రాసాడు. రాఘవాంకుడు షట్పదిలో వ్రాస్తే గౌరన ద్విపదలో వ్రాసాడు. గౌరన శైలి ధారాళంగా నడిచింది. సరళ సుందరంగా వుంది. సహజ పాత్రచిత్రణలున్నాయి. ప్రతిపాత్రను కవి కనులకు కట్టేటట్లుగా వర్ణించాడు. గౌరనకు సరససాహిత్యలక్షణ విచక్షణుడని బిరుదముంది. గౌరన ద్విపదలను పాఠకులకు విసుగుపుట్టించకుండా వైవిధ్యంతో నడిపాడు.

గౌరన లక్షణదీపిక ప్రామాణిక ఛందశ్శాస్త్ర గ్రంథం. 50 ప్రామాణిక గ్రంథాలను సంప్రదించి ఈ గ్రంథం వ్రాసాడట.

# మడికి సింగన

సింగన క్రీ.శ.1420 ప్రాంతంవాడు. తెలుగులో మొదటి పద్య సంకలన గ్రంథాన్ని కూర్చాడు. సకల నీతి సమ్మతమని దాని పేరు. కామందకం, పంచతంత్రం, నీతిసారం, ముద్రామాత్యం, నీతితారావళి, బద్దెన నీతి, భారతం మొదలయిన గ్రంథాల నుంచి రాజనీతి సంబంధమైన పద్యాలను ఏరుకొని వాటిల్లో శాస్త్రసంబంధమైన పద్యాలను చేర్చి కవి దీన్ని కూర్చాడు. దీన్ని కేశవేశ్వరుని కంకితమిచ్చాడు, పద్మపురాణోత్తర ఖండం, భాగవత దశమస్కంధం, వాసిష్ఠ రామాయణం ఇతని ఇతర రచనలు. పద్మపురాణోత్తర ఖండం 11 ఆశ్వాసాల గ్రంథం.

సింగన భాగవత దశమస్కంధం పోతన భాగవతానికి పూర్వరచన. ఇది ద్విపదలో సరసంగా సలలితంగా నడిచింది. శ్రీకృష్ణచరిత్ర ఈ స్కంధంలో నిబద్ధింపబడింది. భాగవతంలో ఈ దశమస్కంధం మణిపూస వంటిది. సింగన వాసిష్ఠ రామాయణంలో 5 ఆశ్వాసాలున్నాయి. దీన్ని కవి అహోబల నరసింహస్వామికి అంకితమిచ్చాడు. సంస్కృత జ్ఞానవాసిష్ఠానికి ఇది సంగ్రహానువాదం. సింగన తిక్కన సోమయాజి కొడుకు కొమ్మన కూతురు కట్టాంబిక కొడుకు. సింగన తండ్రి అయ్యలామాత్యుడు రాజ మహేంద్రవరాన్ని పాలించిన తొయ్యేటి అనపోతానాయని మంత్రి. రాజు మరణానంతరం క్రీ.శ. 1353 లో సింగన తండ్రి సబ్బినాటి రాజధాని రామగిరి (కరీంనగర్)కి పోయారు. సింగన తన పద్మపురాణం దశమ స్కందాలను రామగిరికి రాజు ముప్పిడి నాయకుని మంత్రి వెలిగందల కందయామాత్యుని కంకితమిచ్చాడు. మొత్తం మీద సింగన ప్రతిభగల కవి.

## దగ్గుపల్లి దుగ్గయ

దుగ్గన (క్రీ.శ. 1465) శ్రీనాథకవికి కూరిమి మరదినని చెప్పుకున్నాడు. దుగ్గనకు పోతన పేరుగల అన్నకూడా వున్నాడు. శ్రీనాథ మహాకవీంద్రుని ప్రసాదం వల్లనే తనకు కవితా విశేషమబ్బిందని అతడు చెప్పుకున్నాడు. కాంచీమాహాత్మ్యం నాచికేతోపాఖ్యానం అతని కృతులు. మొదటి కృతి దొరకడం లేదు. దుగ్గన నాచికేతోపాఖ్యానంలో ఉపనిషత్ ప్రసిద్ధమైన నచికేతుని వృత్తాంతముంది. ఉద్దాలకుడు తన కొడుకు నచికేతున్ని అతడు వేసే ప్రశ్నలకు విసిగి యమలోకం పొమ్మని శపిస్తాడు. నచికేతుడు అక్కడ యమునితో మాట్లాడి ఆత్మ జ్ఞానాన్ని పొందుతాడు. వేదాంత విషయాలతో కూడిన ఈ గ్రంథాన్ని దుగ్గన ప్రసన్నశైలిలో వ్రాసాడు. దుగ్గనే కాక తెలుగులో చందలూరి చిక్కయ్యకూడా ఒక నాచికేతోపాఖ్యానం వ్రాసాడని వేటూరి ప్రభాకర శాస్త్రిగారు ప్రబంధ రత్నావళి పీఠికలో తెలిపారు. ఆ కవి ఏ కాలం వాడో తెలియదు.

## శ్రీనాథయుగంలో కావ్యరీతులు

శ్రీనాథ యుగాన్ని కావ్యయుగం అని అంటారు. ప్రక్రియను బట్టి సాహిత్య చరిత్రలో యుగ విభజన చేసేటప్పుడు శ్రీనాథునికి ముందున్న కాలాన్ని పురాణ యుగమని లేదా అనువాద యుగమని అంటారు. శ్రీనాథుని కాలాన్ని కావ్య యుగం అని అంటారు. శ్రీనాథునికి పూర్వం మహాభారత రామాయణేతిహాసాలు పురాణాలే ఎక్కువగా అనువదింపబడినాయి. శివకవి యుగాన్ని దేశకవితా యుగం అనవచ్చును ఈ కాలంలో కవులు దేశిని అభిమానించారు. వస్తువులో ఛందస్సులో దేశిని పాటించారు. వర్ణనల్లో అలంకారాల్లో భావాల్లో స్వతంత్రను చూపారు. సంస్కృతపురాణ కావ్యానువాదాలను ఈ కాలంలోని

శివకవులు చేయలేదు. ఈ కాలంలోనే నన్నెచోడుని కుమారసంభవం సంపూర్ణ కావ్యకళతో కూడిన కావ్యం వ్రాయబడింది. దీనిలోని వస్తువు పురాణ సంబంధమైందే అయినా కవి స్వతంత్ర కల్పనలతో కూడిన సన్నివేశాలను కూర్చాడు. స్వతంత్రమైన వర్ణనలు శైలి దీనిలో వున్నాయి. ఆద్యంతం వస్తువులో ఐక్యత వుంది. అంటె కవి వస్త్వైక్యతను పాటించాడు. అయితే ఈ కావ్యం ఏ కారణంచేతనో తర్వాత కవులకు ఒరవడిగా నిలువలేదు. అందుకే తెలుగు సాహిత్యంలో సంపూర్ణ స్వతంత్ర కావ్యాలయిన ప్రబంధాలు పుట్టడానికి మరో నాలుగు శతాబ్దాల కాలం పట్టింది.

శ్రీనాథునికి పూర్వం నన్నయ తిక్కన ఎర్రన కవులు మహాభారతాన్ని హరివంశపురాణంతో సహా అనువదించారు. నాచన సోమన కూడా హరి వంశాన్ని అనువదించాడు. ఇక రామాయణాలు అనేకం వ్రాయబడినాయి. రంగనాథ రామాయణం, భాస్కర రామాయణం, తిక్కన నిర్వచనోత్తర రామాయణం, ఎర్రన రామాయణం, కొరవి సత్యనారన రామాయణం, మొల్ల రామాయణం - ఇట్లా ఎన్నో రామాయణకావ్యాలు వ్రాయబడినాయి. అవన్నీ వాల్మీకి రామాయణాన్ని అనువదిస్తూ అనుసరిస్తూ వ్రాయబడి నాయి. మారన, పశుపతి నాగనాథకవి మార్కండేయ విష్ణు పురాణాలను అనువదించారు. విష్ణుపురాణాన్ని నాగనాథుడేకాక వెన్నెలకంటి సూరన, కలిదిండి భావ నారాయణలు అనువదించారు. 15వ శతాబ్దారంభంలో శ్రీనాథుడు నిశ్శంక కొమ్మన కొలని గణపతిదేవుడు వంటివాళ్ళు శివ సంబంధమైన రచనలు చేసినా శతాబ్దాంతం చివర వైష్ణవం వ్యాపిస్తున్నదని ఈ రచనలను బట్టి తెలుస్తున్నది.

ఇంకా ఈ కాలంలో అశ్వ గణిత రాజనీతి శాస్త్రసంబంధమైన రచనలు వచ్చాయి. కాదంబరి విజయసేనము, దశకుమారచరిత్ర, విక్రమ సేనము వంటి కథాకావ్యాలు రచింపబడినాయి. ఈ యుగంలోని కవులందరి

దృష్టి ముఖ్యంగా మహాభారత రామాయణాలు పురాణాల మీదనే వున్నట్లు కన్పిస్తున్నది. నన్నయ (క్రీ.శ 1050) మొదలుకొని నాచన సోమన (క్రీ.శ 1380)వరకు అంటె దాదాపు 300-350 సంవత్సరాల సాహిత్యకాలం తెలుగులో మహాభారత రామాయణాల అనువాదాలే ప్రధాన కేంద్రంగా నడిచింది. అందుకే ఈ సాహిత్యయుగాన్ని పురాణేతిహాసయుగం లేదా అనువాదయుగం అని ప్రక్రియపరంగా అనడం సమంజసంగా వుంది.

శ్రీనాథుని యుగం కూడ కావ్యపురాణ కథాకావ్యాల రచనలతో ద్విపద పద రచనలతో అనేక ప్రక్రియోన్ముఖంగా నడిచింది. శ్రీనాథుడు నైషధం హరవిలాసం కావ్యాలను పినవీరన శృంగారశాకుంతల కావ్యాన్ని గౌరన హరిశ్చంద్రోపాఖ్యానం ద్విపద కావ్యాన్ని రచించారు. పోతన భాగవతపురాణం నందిమల్లయ్య ఘంట సింగయకవుల వరాహపురాణం మడికి సింగన పద్మపురాణోత్తర ఖండం వంటి పురాణాలు ఈ యుగంలో వ్రాయబడినాయి. జక్కన అనంతామాత్య కొరవి గోపరాజు మొ.న కవులు కథాకావ్యాలను రచించారు. అన్నమయ్య భక్తిభరితమైన పదాలనురచించాడు. శ్రీనాథుడు పండితారాధ్యచరిత్ర గౌరన నవనాథచరిత్ర వంటి దేశి ఇతివృత్తం గల రచనలు వచ్చాయి. దుగ్గన నాచికేతోపాఖ్యాం మడికి సింగన వాసిష్ఠరామాయణం నంది మల్లయ ఘంటసింగయ ప్రబోధ చంద్రోదయం వంటి వేదాంతగ్రంథాలు రచింపబడినాయి. ఈ విధంగా శ్రీనాథయుగం వివిధ ప్రక్రియల వైవిధ్యంతో సాగింది. అయినా శైలి దృష్టితో రీతిసౌందర్యం దృష్టితో పరిశీలిస్తే శ్రీనాథుని కాలంలో తెలుగులో కావ్యశైలి వికసించింది.

కవిత్రయ కవులు మహాభారతాన్ని అనువదిస్తూ మూలాన్ని ఉన్నదున్నట్లుగా అనువదించ లేదు. పునరుక్తులను అనౌచిత్యాలను పరిహరిస్తూ మూలంలో లేని అలంకారాలను వర్ణనలను చేరుస్తూ కథాకథనానికి అడ్డుగా

వున్న సుదీర్ఘమైన వర్ణనలను విడిచిపెడ్తూ తెలుగు మహాభారతానికి సంక్షిప్తతను చేకూర్చి కావ్యమార్గంలో అనువదించారు. అయితే కన్నడంలో వున్న విక్రమార్జునవిజయం గదాయుద్ధం కావ్యాల వలె మహాభారతకథను కవిత్రయ కవులు ఏకనాయకాశ్రితమైన కావ్యమార్గంలో అనువదించలేదు. "కృష్ణద్వైపాయనముని వృషభాభిహిత మహాభారతబద్ధ నిరూపితార్థమే ర్పడ"గానే రచించినా మూలంలో వున్న మహాభారతం విశాల స్వరూపం పురాణరూపం తెలుగులో లేకపోవడంచేత తెలుగు మహాభారతానికి కావ్యత్వ సిద్ధి కలిగింది.ఎర్రన నరసింహ పురాణం పేరుకు పురాణమైనా వస్త్వైక్యత కలిగివుంది. బ్రహ్మాండపురాణంలోని ప్రహ్లాదుని కథను తీసుకొని ఎర్రన పెంచి కావ్యంగా వ్రాసాడు. నాచన సోమన కూడా హరివంశంలోని కొన్ని కథలను కావ్యశైలిలో అనువదించాడు. అదే అతని నవీన గుణసనాథత్వం కావచ్చును. ఈ మార్గంలోనే పురాణ భాగాలను తీసుకొని కావ్యరూపంగా శ్రీనాథుడు భీమ కాశీఖండాలను హరవిలాసాన్ని రచించాడు.నన్నయ తిక్కన ఎర్రన గోనబుద్ధారెడ్డి నన్నెచోడ భాస్కర మారనాది కవుల పద్యాల్లో స్వతంత్రభావాలంకార చమత్కారాలు శైలీ రామణీయకత పాత్రచిత్రణా నైపుణ్యం సంభాషణా శైలి మొదలయిన కావ్యరీతులున్నాయి.ఈ లక్షణాలే శ్రీనాథయుగం కవుల్లో ఇంకా వికసించి 16వ శతాబ్దంలోని ప్రబంధాలనబడే తెలుగు స్వతంత్ర మహాకావ్యరచనలకు దారి నేర్పరిచాయి.

శ్రీనాథయుగంలో శ్రీనాథుడు భీమేశ్వరపురాణం కాశీఖండం వంటి రచనలు పేరుకు పురాణభాగాల అనువాదాలయినా స్వతంత్రమైన ప్రౌఢశైలి లోవ్రాయబడి కావ్యాలుగా ఒప్పుతున్నాయి. నందిమల్లయ ఘంటసింగయలు వరహాపురాణం పురాణమైనా దీనిలోని వేట వర్ణన తర్వాత కవులకు ఆదర్శమైంది. శ్రీనాథుడు భీమ కాశీఖండాల్లో హరవిలాసంలో పురాణాల నుంచి కొంత భాగాన్ని తీసుకొని స్వతంత్రమైన వర్ణనలతో సన్నివేశ కల్పనలతో పాత్రచిత్రణ సంభాషణలతో పెంచి వ్రాసాడు. లాక్షణికులు కావ్యాలకు

చెప్పిన ప్రసిద్ధేతివృత్తం అన్న లక్షణం ఇదే. పినవీరన మహాభారతంలోని శకుంతలోపాఖ్యానాన్ని తీసుకొని దానికి కాళిదాసు శాకుంతలంలోని సన్నివేశాలను చేర్చి స్వకల్పనలతో వర్ణనలతో స్వతంత్ర కావ్యంగా రచించాడు. తిక్కన కాలంలోనే మంచన సంస్కృత నాటకం కథను తీసుకొని కేయూరబాహుచరిత్ర కావ్యాన్ని రచించాడు. దానిలో శృంగారం అంగిరసంగా సాగింది. శ్రీనాథయుగంలో నంది మల్లయ ఘంట సింగయలు ప్రబోధచంద్రోదయం అనే సంస్కృత నాటకాన్ని కావ్యంగా వ్రాసారు. పినవీరన కాళిదాసు శాకుంతలనాటక క్రమాన్ని తన శృంగార శాకుంతలంలో అనుసరించాడు. దాంతో తెలుగు కావ్యేతివృత్తంలోని సన్నివేశ కల్పనలు నాటకాల్లోని అంకాలల్లో లాగా జరగడం అనే లక్షణం ప్రవేశించింది. తర్వాత 16వ శ.లో ప్రబంధకవుల మనుచరిత్ర పారిజాతాపహరణం వసుచరిత్ర వంటి ప్రబంధాల్లో నాటకశిల్పంగా తెలుగు ప్రబంధాల ప్రత్యేక లక్షణంగా రూపొందింది.

శ్రీనాథయుగంలో జక్కనాది కవులు రచించిన అనేక కథాకావ్యాలను వర్ణనలు సంభాషణలు అలంకారాలున్న శైలిలో కేవలం కథలను చెప్పడంగా కాక కావ్యాలుగా రూపొందించారు. పోతన భాగవతం పురాణమైనా మూలానికి లేని కావ్యగౌరవం దీనికుంది. పోతన రచనా శైలి మధురంగా లలితంగా రమ్యంగా సాగింది. కథాకథనం రసవంతంగా వుంది. పోతన స్వంతంత్రమైన శబ్దాలంకారాలు తెలుగు కావ్యశైలి వికాసంలో ఒక మైలురాయి వంటివి. పోతన శృంగార భక్తి రసాల పోషణ భావవైచిత్రులు శబ్దార్థాలంకారాల సౌందర్యం తెలుగు కావ్యశైలికి మెరుగులు దిద్దాయి. ఇక తెలుగు కావ్యశైలికి అక్షరాభ్యాసం చేసింది శ్రీనాథుని నైషధకావ్యం. సంస్కృతంలో శ్రీహర్షుని నైషధం మహాకావ్య ప్రక్రియలో చరమ సీమను చేరుకున్న ప్రౌఢరచన. వ్యాఖ్యానం లేకుండా దాన్ని అర్థం చేసుకోలేము. అటువంటి అతి ప్రౌఢమైన శ్లేషాదుల చేత క్లిష్టమైన కావ్యాన్ని శ్రీనాథుడు

తెలుగులోకి అనువదించి తెలుగు కావ్యశైలికి ప్రౌఢమైన నడకలు నేర్పాడు. శ్రీనాథ పోతనల సీస వృత్తపద్యాల నడకలు తెలుగు కావ్యరీతులకు వన్నె పెట్టాయి.

ఈ యుగంలో శ్రీనాథాది కవులు తీసుకున్న ఇతివృత్తాలు పూర్వకవుల ఇతివృత్తం వలె పూర్తిగా ఆద్యంతం మూలానుసారమైనయి కావు. శ్రీనాథాది కవులు పురాణాల నుంచి తీసుకున్న ఇతివృత్తాన్ని స్వతంత్రమైన సన్నివేశకల్పనలతో వర్ణనాదులతో విస్తరించి వ్రాసారు. కథా కావ్యాలను కూడా ఈ పద్ధతిలోనే రచించారు. ఇతివృత్త సంబంధంగా ఇది పూర్తిగా కావ్యరీతులకు సంబంధించిన ప్రధాన గుణం. ఇక ఈ యుగంలో రెండో కావ్యరీతి- శైలి. స్వతంత్రమైన భావాలతో అలంకారాలతో వర్ణనలతో సన్నివేశకల్పనలతో సంభాషణలతో కవులు కావ్యాలను భూషించారు. మూడో కావ్యగుణం-రసపోషణ. శృంగారనైషధం శృంగారశాకుంతలం వంటి కావ్యాలు ఆద్యంతంగా అంగిరసపోషణతో అంగరసాల యోజనతో రచింపబడినాయి. పోతన తన రచన భాగవతం పురాణమైనా రసస్ఫోరకతతో రచించాడు. నాలుగవ కావ్యగుణం-శ్రీనాథ పోతనాది కవులు కేవలం కథాకథనం భక్తిధర్మాది విషయప్రధానాలుగా కాక ఉక్తివైచిత్రి భావసౌందర్యం అలంకారశోభ వక్రోక్తి రసావిష్కారంమీద తమ దృష్టిని కేంద్రీకరించారు. ఐదవ కావ్యగుణం-శ్రీనాథాది కవులు 'రచనల్లో జాతీయతాముద్రను చూపడం స్వతంత్రత మౌలికతలతో ఈ యుగంలోని కావ్యాలుండడం - ఈ కావ్యగుణాలన్నీ తర్వాత ప్రబంధ యుగంలో ప్రబంధ ప్రక్రియావిర్భావానికి సంపూర్ణంగా తోడ్పడినాయి.

## జక్కన

"జక్కన నీదు కవిత్వము చక్కన" ప్రశంస నందుకున్న కవి జక్కన (క్రీ.శ 1380-1440) శ్రీనాథునికి సమకాలికుడు. విక్రమార్క చరిత్ర అతని కావ్యం. ఈ కథాకావ్యాన్ని సిద్ధనమంత్రి కంకిత మిచ్చాడు. సిద్ధన ప్రౌఢ

దేవరాయల సామంతుడైన నెల్లూరు మండలంలోని ఉదయగిరి పాలకుని దగ్గర ఉద్యోగి. ప్రౌఢదేవరాయలే శ్రీనాథునికి కనకాభిషేకం చేసాడు. జక్కన విక్రమార్కచరిత్రలో విక్రమార్కుని జననం సాహసకార్యాలను చెప్పే కథలున్నాయి. సంస్కృతంలో విక్రమార్కునికి సంబంధించిన కథలు బేతాళ పంచవింశతి సింహాసనద్వాత్రింశిక కథాగ్రంథాల్లోవున్నాయి. లోకంలోను ప్రచారంలో వున్నాయి. ఆ కథల నుంచే జక్కన కథల నెన్ను కొని స్వతంత్ర పద్ధతిలో వ్రాసాడు. అంతేగాని జక్కన కావ్యానికి మూలమని చెప్పదగిన కావ్యమేదీ సంస్కృతంలో లేదు. జక్కన కథలను "ప్రబంధశయ్యగా తెలుగున" చెప్పదలిచాడు. అతనికి కథాకథన చాతుర్యముంది. ప్రతి కథను చక్కగా చెప్పాడు. జక్కన ప్రబంధ మార్గంలో కావ్యారంభాన్ని మధురానగర పురవర్ణనతో చేసి సందర్భానుకూలంగా ఇతర ప్రబంధ వర్ణనలను చేసాడు. వీరాద్భుతరసాలను జక్కన పోషించాడు. జక్కన వర్ణనలు భావ వైచిత్రులు పద్యశిల్పం తర్వాత పెద్దనాది ప్రబంధకవులకు ఆదర్శమైనాయి. అంటె జక్కన కవిత్వంగొప్పతనం తెలుస్తున్నది. జక్కన సందర్భానుకూలంగా సంస్కృతాంధ్రలోకోక్తులను వాడాడు.

## అనంతామాత్యుడు

అనంతామాత్యుడు ఈ యుగంలో కథాకావ్యం వ్రాసిన మరోకవి. భోజరాజీయం అతని కృతి. అదేగాక ఆ కవి ఛందోదర్పణం అనే ఛందో గ్రంథాన్ని రసాభరణమనే అలంకారశాస్త్ర గ్రంథాన్ని వ్రాసాడు. రసాభరణాన్ని ఈ కవి క్రీ. శ. 1434లో ముగించినట్లుగా చెప్పుకున్నదాన్ని బట్టి అతడు శ్రీనాథుని సమకాలికుడని తెలుస్తున్నది.

అనంతునిది పండిత కవి వంశం. అతని తాత బయ్యన తిక్కనచేత "భవ్య భారతి" అన్న బిరుదాన్ని పొందాడు. ఈ కవి తన భోజరాజీయాన్ని

అహోబలనరసింహుని కంకితమిచ్చాడు. ఇది ఏడు ఆశ్వాసాల కథాకావ్యం. ధారానగర రాజు భోజునికి సర్వటి అన్న సిద్ధుడు చెప్పిన అన్నదానమహిమ, స్త్రీ పాతివ్రత్యమహిమ, సత్యం త్యాగం అహింసల మహిమలను గురించి చెప్పే 17 కథలు ఈ కావ్యంలో వున్నాయి. ఇవన్నీ అనంతుడు స్వయంగా కల్పించిన కథలని పండితుల అభిప్రాయం. కాని వీటికి మూలకథలు ఎక్కడో సంస్కృతంలో వుండే వుంటాయి. దీనిలో గోవ్యాఘ్రసంవాదకథ ప్రసిద్ధమైంది.

అనంతుని కవిత్వం సరళ సులభమైంది. లోక పరిశీలనాశక్తితో కూడిన కవి. స్వభావోక్తులతో అతని కవిత్వం సహజంగా వుంది. అనంతుడు మానవ స్వభావాన్నే కాక పిల్లి ఎలుక ఆవు వంటి జంతువుల స్వభావాలను సహజంగా రమణీయంగా చిత్రించాడు. అనంతుడు ఎక్కువ వర్ణనలు చేయలేదు. కథ చెప్పడమే ప్రధానంగా వ్రాసాడు. అచ్చమైన కథాగ్రంథ ఫక్కీలో వుంది. తెలుగు సామెతలను జాతీయాలను కవి ప్రయోగించాడు. అనంతునిది మధురశైలి.

అనంతుని ఛందోదర్పణం 4 అశ్వాసాల గ్రంథం. దీనిలో అతడు కావ్యలక్షణాలను గురులఘు నిర్ణయాన్ని గణాల నిరూపణను ప్రాసయతి రూపాలను వివిధ ఛందస్సులను దశవిధ దోషాలను మొదలైన వాటిని వివరించాడు. రసాభరణంలో 4 ఆశ్వాసాలున్నాయి. దీనికి రసార్ణవం అని కూడా పేరు. దీనిలో అతడు సోదాహరణంగా రసవివరణను చేసాడు.

## కొరవి గోపరాజు

శ్రీనాథునికాలంవాడు. అతని ఇద్దరు పెద తండ్రులు రాచకొండరాజు రేచెర్ల సింగమనాయకుని మంత్రులు. ఈ యుగంలో మరో కథాకావ్యకవి.

సింహాసన ద్వాత్రింశిక అతని కృతి పేరు. దీన్ని కవి హరిహరనథుని కంకితమిచ్చాడు. దీనిలో 12 ఆశ్వాసాలున్నాయి. భోజరాజు విక్రమాదిత్యుని సింహాసనాన్ని అధిరోహించడానికి వచ్చినప్పుడు దాని మీది 32 బొమ్మలు చెప్పిన కథలు దీనిలో వున్నాయి. ఒక్కొక్క రోజు ఒక్కొక్క బొమ్మ కథ చెప్పి అతన్ని సింహాసన మెక్కనియ్యకుండా ఆపుతాయి. విక్రమాదిత్యుని సాహసౌదార్యాలకు సంబంధించిన కథను చెప్పి అట్లాంటి గుణాలుంటేనే సింహాసనాన్ని ఎక్కడానికి తగిన వాడవని బొమ్మలంటాయి. ముహూర్తం దాటిపోవడంతో ఆ రోజు భోజరాజు తిరిగి పోయి మరుసటి రోజు వస్తాడు. ఇట్లా 32 రోజులు జరుగుతుంది.

గోపరాజు తన కావ్యం సంస్కృతానువాదమని స్వయంగా చెప్పుకున్నాడు. సంస్కృతంలో వివిధ ప్రాంతాల్లో వివిధ సింహాసన ద్వాతింశిక (ద్వాత్రింశిక = 32) కథల ప్రతులున్నాయి. గోపరాజు వాటిల్లో దేనినను సరించాడో చెప్పడం కష్టం. గోపన శైలి ధారాళంగా సాగింది. అతనికి కథాకథన నైపుణ్యముంది. కథలను సరళంగా మధురంగా చెప్పాడు. కాని వర్ణనలతో అలంకారశైలితో జటిలం చేయలేదు. గోపరాజు కావ్యంలో సమకాలిక సాంఘిక విషయాలెన్నో ప్రతిబింబించాయి. వివిధ దేవతల పూజావిధానాలు, శకునాలు, స్వప్న ఫలాలు, చోర శిక్షలు, జూదం, చద రంగాలు, జ్యోతిషం, గ్రహశాంతులు, ఇంద్రజాలం, పురుడుపోయు పద్ధతి, సురతంత్రం, సాముల రకాలు, చేపల్లోని రకాలు పాముల్లో భేదాలు, పక్షివేట విధానం, పట్టుబట్టల్లో రకాలు మొదలయిన ఎన్నో విషయాలను గురించి గోపన చెప్పాడు. అతని కావ్యం ఒక విజ్ఞానకోశంగా వుంది. గోపరాజుకు వివిధ విషయాలతో వున్న పరిచయానికి ఆశ్చర్యం కలుగుతుంది.

# కూచిరాజు ఎర్రన

ఎర్రన క్రీ.శ. 1450-1500 ప్రాంతం వాడు. కొక్కోకమనే కామశాస్త్రాన్నేకాక సకలనీతికథావిధానమనే కథా కావ్యాన్ని వ్రాసాడు. దీన్ని అతడు తిరుపతి వేంకటేశ్వరుని కంకితమిచ్చాడు. దీనిలో 5 అశ్వాసాలున్నాయి. దాదాపుగా 150 కథలున్నాయి. విక్రమార్క చరిత్ర భేతాళపచవింశతి కేయూర బాహుచరిత్ర దశకుమార చరిత్ర పంచతంత్రం కథాసరిత్సాగరం నుంచి అనేక కథలను తీసుకొని ఎర్రన సంగ్రహంగా చెప్తూ ఈ కథలను కూర్చాడు. ఈ కవి సకలపురాణసారం కూడా వ్రాసాడట కాని అది అలభ్యం.

# వెన్నెలకంటి అన్నయ

అన్నయ కాలనిర్ణయంలో అభిప్రాయ భేదాలున్నాయి. అతడు 12వ శతాబ్దం వాడని 13వ శతాబ్దం వాడని అంటున్నారు. కథాకావ్యాల రచన జోరుగా సాగిన 15వ శతాబ్దం ఉత్తరార్థంలోనే ఈ కవి వుండివుంటారు. ఇతరు రచించిన షోడశకుమార చరిత్ర కథాకావ్యం పూర్తిగా దొరకలేదు. 8 ఆశ్వాసాల కావ్యంలో అవతారిక 3,4 ఆశ్వాసాల్లోని కొన్ని భాగాలు నశించాయి. ఈ కవి ఈ కథాకావ్యాన్ని తన తండ్రి కంకితంగా ఇచ్చాడు.

షోడశకుమార చరిత్రలో. కమలాకురుడనే రాజకుమారుడు 8 మంది మంత్రికుమారులు 4 గురు దండనాయక కుమారులు 3 గురు పురోహిత కుమారులు - మొత్తం 16 మంది కుమారులు విడిపోయి తిరిగి కలుసుకొని తమ తమ అనుభవాలను చెప్పుకుంటారు. ఇది దశకుమార చరిత్ర పద్ధతిలో వ్రాయబడింది. భేతాళపంచవింశతి దశకుమారచరిత్ర కేయూర బాహుచరిత్రల కథల ఆధారంగా అన్నయకవి ఈ కథలను కూర్చాడు. ఈ కవి శైలి సరళసులభంగా ధారాళంగా వుంది.

ఈ కవే కాక షోడశకుమార చరిత్రను ఆమందూరి నరసింహభట్టు అనే కవి కూడా వ్రాసినట్లుగా ప్రబంధరత్నావళి పీఠికలో ప్రభాకర శాస్త్రిగారు తెల్పారు. కాని అది అలభ్యం.

## పంచ తంత్రకవులు

దొరికిన తెలుగు పంచతంత్రకావ్యాల్లో దూబగుంట నారాయణకవిదే మొదటిది. ఈ కవి కాలం క్రీ.శ. 1470 ప్రాంతం. సంస్కృతంలోని పంచతంత్ర కథలను తెనిగించాడు. ఇతని కన్నా ముందు తెలుగులో ఒక పంచతంత్రం వున్నట్లు మడికి సింగన సకలనీతిసమ్మతం వల్ల తెలుస్తున్నది. కాని అది దొరక లేదు. నారాయణకవి తన పంచతంత్ర కథాకావ్యాన్ని ఉదయగిరి పాలకుడు బసవరాజు కంకితమిచ్చాడు. పంచతంత్రంలో ఐదు భాగాలున్నాయి - మిత్ర భేదం, మిత్ర లాభం, సంధి విగ్రహం, లబ్ధనాశం, అవిమృశ్యకారితం. నారాయణకవి ఈ కథలను సరళమైన ధారాళమైన శైలిలో రచించాడు.

నారాయణ కవికి కొంచెం తర్వాత కాలం వాడు బైచరాజు వేంకటనాథుడు. క్రీ.శ. 16వ శతాబ్దంవాడు. ఈ కవి పంచతంత్రాన్ని అనువదించి హరిహరనాథునికి అంకితంగా ఇచ్చాడు. నారాయణకవి శైలి సరళంగా వుంది. వేంకటనాథుని శైలి ప్రౌఢంగా వుంది. ఈ కవి కథలను సవిస్తరంగా చెప్పాడు. కృష్ణదేవరాయల కాలంవాడే మరోకవి భానయ పంచతంత్రాన్ని వ్రాసాడు. ఈ విధంగా క్రీ.శ. 14వ శతాబ్దం నుంచి క్రీ.శ. 16వ శతాబ్దారంభం వరకు వ్రాయబడిన పై కథా కావ్యాలే కాక క్రీ.శ. 16,17 వ శతాబ్దాల్లో అంటె ప్రబంధాలు ప్రముఖంగా వచ్చిన కాలంలో కొన్ని మంచి కథాకావ్యాలు వ్రాయబడినాయి. ఆ కథా కావ్యాలను గురించి సమగ్రంగా ఇక్కడే తెలుసుకోవడం సమంజసం.

# పుత్తేటి రామభద్రకవి

రామభద్రకవి శ్రీ కృష్ణదేవరాయుల (క్రీ.శ. 1509-1530) ఆస్థానకవి ఈ కవి "సకల కథాసారసంగ్రహం" అనే కథాకావ్యాన్ని వ్రాసాడు. పెద్దన మనుచరిత్ర కన్నా పూర్వమే ఈ కావ్యం శ్రీ కృష్ణదేవరాయుల కంకితమయ్యె బడిందని పండితుల అభిప్రాయం. ఇది అముద్రితం. సకలకథాసారసంగ్రహం ఒకే ఒక ప్రతి మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారాంలో వుందట. ప్రబంధమణిభూషణంలోని పద్యాలను బట్టి ఈ కవి కవిత్వం ప్రసన్నంగా వుందని చెప్పవచ్చు. పెద్దన మనుచరిత్రలో ప్రవరుని వర్ణిస్తూ చెప్పిన

"వదన ప్రభూత లావణ్యాంబు సంభూత
కమలంబులన వీని కన్నులమరు........"
అన్న పద్యం సకలకథాసార సంగ్రహంలోని రామభద్ర కవి
వదన సౌందర్య విస్ఫారాంబు సంభూత
కంజంబులగు వాని కన్నుదోయి........"

అన్న పద్యాన్ని అనుకరించి వ్రాసిందని నిడదవోలు వేంకటరావుగారు ప్రబంధమణి భూషణం రెండో ముద్రణ పీఠికలో తెల్పార

# పాలవేకరి కదిరీపతి

కదిరీపతి క్రీ.శ. 1660 ప్రాంతంవాడు. అయినా తెలుగు సాహిత్యంలో కథాకావ్యాల వికాసం గురించి చర్చించబోతున్నాం. కాబట్టి కథా కావ్య రచయితల్లో ప్రసిద్ధుడైన కవి కాబట్టి కదిరీపతిని గురించి ఇక్కడనే వ్రాయడం జరిగింది. కడప మండలంలోని కదిరి గ్రామవాసి. ఈ కవి మైసూరు ప్రాంతంలో ఉద్యోగం చేసాడు. ఈ కవి శుకసప్తతిని శ్రీరామాంకితంగా

వ్రాసాడు. ప్రభావతి అనే సుందరికి ఆమె పెంపుడు చిలుక డెబ్బదిరాత్రులు వరుసగా చెప్పిన డెబ్బై కథలు దీనిలో వున్నాయి. ఈ కథలన్నీ శృంగార భరితమైనయి. ఎక్కువగా జారస్త్రీలను గురించి వాళ్ళ చాతుర్యం గురించి చెప్పినయి. ఈ కథలు జారత్వాన్ని నిరసించి నీతిని బోధించేయి. సందర్భానుకూలంగా కదిరీపతి సమకాలిక జీవితాన్ని చిత్రించాడు. తెలుగువారి సాంఘిక జీవితాన్ని తెలుసుకోడానికి శుకసప్తతి నిరుపమాన గ్రంథమని సురవరం ప్రతాపరెడ్డిగారు తమ ఆంధ్రుల సాంఘిక చరిత్రలో అన్నారు.

శుక సప్తతి సంస్కృతంలో వుంది. ఇది క్రీ.శ. 10వ శ.కి పూర్వరచన. సంస్కృతంలో శుకసప్తతి అనేక ప్రతులు దొరికాయి. అవన్నీ వేరే వేరే కథలతో వున్నాయి. ఈ కథలు అనేక భారతీయ భాషల్లోకి పర్షియన్ మంగోలియన్ మొదలయిన భాషల్లోకి అనువదింపబడి ప్రచారంలో వున్నాయి. ఉర్దూ నుంచి ఈ కథలు తెలుగులోకి క్రీ.శ. 19వ శ.లో గద్యంలో “తూతేనామా” “కీర బహత్తరి” పేర్లతో అనువదింపబడినాయి. కదిరీపతి ఏ సంస్కృతప్రతిని అనుసరించాడో చెప్పలేము. కదిరీపతి కథలు సరళంగా ఉత్కంఠను చక్కగా పోషిస్తూ పద్యగద్యాల్లో నడిచాయి.

ప్రభావతి భర్త సముద్ర వ్యాపారి. అతడు దేశాంతరం పోయినప్పుడు ఆ దేశం రాజు ప్రభావతిని కోరి రాయబారం పంపుతాడు. ప్రభావతి రాజు కోరికను అంగీకరించి అలంకరించుకోగా ఆమె పెంపుడు చిలుక ఒక కథ చెప్పి ఆ కథలోని స్త్రీవలె నువ్వు పరపురుషగమనాన్ని ఉపాయంతో కప్పిపుచ్చుకోగల్గుతావా - అని ప్రశ్నిస్తుంది. ప్రభావతి దానికి సమాధానం చెప్పలేక ఊరుకుంటుంది. ఇంతలో తెల్లవారుతుంది. అట్లా 70 రోజులు చిలుక 70 కథలు చెప్పి యజమానురాలి శీలాన్ని కాపాడుతుంది. కథను “క్లైమాక్సు” వరకు తీసుకొనిపోయి ఇప్పుడు ఆ స్త్రీ జారత్వం బయట

పద్తుంది - అని అనుకుంటున్నప్పుడు చిలుక కథనాపి ప్రభావతిని ప్రశ్న అడుగుతుంది. ప్రభావతి సమాధానం చెప్పలేక పోగా అప్పుడు చిలుక చిక్కు ప్రశ్నకు సమాధానం చెప్తుంది. బేతాళపంచవింశతి, సింహాసనద్వాత్రింశికాది కథల్లో కథనం ఇదే పద్ధతిలో కుతూహల పూర్వకంగా వుంటుంది. అద్భుత సన్నివేశాలతో కూడిన ఈ కథలను కదిరీపతి సమర్థవంతంగా రచించాడు. స్త్రీల దూర్తత వాక్చాతుర్యం చాకచక్యాలను కవి చక్కగా చిత్రించాడు.

కదిరీపతి శుకసప్తతి కథల ననుసరించి అయ్యలరాజు నారాయణామాత్యుడు హంసవింశతిని రచించాడు. ఈ కవి కూడా తన అపారవిషయ విజ్ఞానాన్ని పాండిత్యాన్ని ఈ కావ్యంలో ప్రకటించాడు.

కవి భల్లటుడు (క్రీ.శ. 1150 ప్రాంతం) బేతాళపంచవింశతి కథాకావ్యాన్ని తెలుగులో వ్రాసినట్లుగా నిడదవోలు వేంకటరావుగారు ప్రబంధ మణి భూషణంలో తెల్పారు. కాని అది దొరకలేదు. అదే విధంగా పోతరాజు కూడా భేతాళ పంచవింశతి వ్రాసాడు అని ప్రబంధ రత్నావళి పీఠికలో వేటూరి ప్రభాకర శాస్త్రిగారు పేర్కొన్నారు. అది కూడా దొరకడం లేదు. ఈ విధంగా ఎన్నో తెలుగు కథాకావ్యాలు కాలగర్భంలో కలిసిపోయి వుంటాయి. తెలుగులో కథాకావ్యాలు కవిపాఠకుల ఆదరణను పొందాయని వాటి సంఖ్యను బట్టి తెలుస్తున్నది. ముద్రణ యంత్రాలు వచ్చిం తర్వాత క్రీ.శ. 19వ శతాబ్దంలో తెలుగులో అనేక కథాగ్రంథాలు వచనంలో వ్రాయబడి ప్రచారంలోకి వచ్చాయి. విక్రమార్క కథలు (1819) పంచతంత్ర కథలు (1834) తోతి నామా కథలు (1842) దిలారామకథలు (1843) కాంభోజరాజు కథలు (1849) లాలాచార్యుల కథలు (1855) ఇట్లా ఎన్నో వచన కథాకావ్యాలు ముద్రింపబడినాయి.

# తెలుగు సాహిత్యంలో కథా కావ్యాల వికాసం

సంస్కృతంలో కథాకావ్యాలు గద్యప్రక్రియలో వుండగా తెలుగులో కథాకావ్యాలన్నీ చంపూమార్గంలో వ్రాయబడినాయి. తిక్కన యుగం నుంచి కథా కావ్యాల రచన ఆరంభమై శ్రీనాథయుగంలో అనేక సంఖ్యలో కథాకావ్యాలు వ్రాయబడినాయి. ప్రబంధ ప్రక్రియ ముమ్మరంగా సాగిన రాయలయుగంలోనూ కథా కావ్యాలు వ్రాయబడినాయి. దక్షిణాంధ్రంలో వికసించిన తెలుగు సాహిత్యయుగం వచన వాఙ్మయచరిత్రలో స్వర్ణ యుగమనిపించుకున్నా వచనంలో క్షేత్ర వ్రతమాహాత్మ్యాలు రామాయణ మహాభారతాలే వ్రాయబడినాయి. కాని కథాకావ్యాలు చంపువులోనే వ్రాయబడినాయి.

సంస్కృత సాహిత్యంలో కథా కావ్యాలు రెండు విధాలుగా వున్నాయి --- ఒకటి --- కేవలం కథల కోసమే చదువబడే కథాకావ్యాలు. ఇటు వంటి కథాకావ్యాల రచన తెలుగుసాహిత్యంలో క్రీ.శ. 1150 ప్రాంతం వాడైన కవిభల్లటుని బేతాళపంచవింశతితో ఆరంభమైంది. పోతరాజు కూడా ఒక భేతాళ పంచవింశతి వ్రాసాడు. ఆ తర్వాత చిమ్మపూడి అమరేశ్వరుడు (క్రీ.శ. 1350) విక్రమసేనం పేరుతో విక్రమాదిత్యుని కథలు వ్రాసాడు. జక్కన విక్రమార్కచరిత్ర గోపరాజు సింహాసనద్వాత్రింశికలు కూడా విక్రమా దిత్యునికి సంబంధించిన కథలే. విక్రమాదిత్యుడు క్రీ.పూ. 58 ప్రాంతంలో ఉజ్జయిని రాజధానిగా మాళవదేశాన్ని పాలించాడు. ఇంతవరకు అతన్ని గురించి చారిత్రాకాధారాలేవి దొరకకున్నా అతన్ని గురించి ఎన్నో కథలు గాథలు ప్రచారంలో వున్నాయి. ఆంధ్రదేశంలోనూ అతనికి సంబంధించిన కథలు అభిమానంతో చదువబడేయి అని పై కథాకావ్యాల సంఖ్యను బట్టి తెలుస్తున్నది. శ్రీనాథయుగంలో అనంతామాత్యుడు భోజరాజీయం పేరుతో అన్నదాన మహిమాదులను తెలిపే 17 కథలను కూర్చాడు. శ్రీ కృష్ణదేవరా యల కంకితంగా పుత్తేటి రామభద్రుడు సకలకథానిధానంలో వివిధ కథలను కూర్చాడు. దూబగుంట నారాయణాది కవులు పంచతంత్రాన్ని

తెనిగించారు. కదరీపతి శుకసప్తతి నారాయణామాత్యుని హంసవింశతి కూడా కథలకోసం చదివే కావ్యాలే. విక్రమార్కుని కథలు వీరసాహస చర్యలతో కూడినాయి. పాఠకులకు లోకజ్ఞతను బోధించి ఉల్లాసం కలిగించి. అద్భుత వీరరసానందంలో ముంచెత్తుతాయి. పంచతంత్రం భోజరాజీయం వంటి కథలు పాఠకులకు నీతి ధర్మం రాజనీతి లోకజ్ఞానం బోధిస్తాయి. బేతాళ పంచవింశతి వంటి కథలు ఆశ్చర్యాద్భుతానందంలో ముంచెత్తి పాఠకుల నలరిస్తాయి. మెదడుకు మేత పెడ్తాయి. బేతాళ పంచవింశతి శుకసప్తతి వంటి కథలు పాఠకుల ఉత్కంఠను లేవనెత్తి కొసమెరుపుతో సంతోషపెడ్తాయి. ఈ కథలన్నీ సరళమైన భాషలో కథనచమత్కారంతో కూడినయి. కథలో కథను చేర్చి కథనాన్ని సాగించడం ఈ కథల్లో ప్రత్యేకత. తర్వాత కాలంలో "కథ" ప్రక్రియకు చెందిన కావ్యాల ఇతివృత్తంలోను కథలో కథను చేర్చి కథనం సాగించడమనే లక్షణం కన్పిస్తున్నది. ఈ కథలకు భారతదేశం పుట్టినిల్లు అని పాశ్చాత్య విమర్శకులు తలంచారు. ఈ కథలు వర్తకులచేత ప్రయాణికులచేత ధార్మిక వ్యక్తులచేత ఖండఖండాంతరాలు వ్యాపించాయి. కేవలం కథలకోసమే చదివే కథాకావ్యాల రచన తెలుగులో క్రీ.శ. 1150 లో కవిభల్లటుని కాలం నుంచే ఆరంభమైంది. సంస్కృతంలో ఈ కథా కావ్యాలు సరళమైన సుబోధకమైన శైలిలో సామాన్య పాఠకులకు పఠనయోగ్యంగా వున్నాయి. సంస్కృతంలో ఇవి కేవలం గద్యంలో వ్రాయబడినాయి. తెలుగు కవులు ఈ కథలను పద్యగద్యాలతో కూడిన చంపువుల్లో వ్రాసారు. అక్కడక్కడ వర్ణనలను కూడా చేర్చారు. భాష భావాలు కొంతవరకు సరళంగా వున్నాయి. శుకసప్తతి హంసవింశతి వంటి కావ్యాలు కేవలం కథ చెప్పడమే ప్రధానంగా నడిచాయి. అయినా వీటిల్లోను కవులు తమ పాండిత్య ప్రదర్శనకు పూనుకున్నారు. జక్కన విక్రమార్కచరిత్ర కొంత కావ్యశైలిలో భావాలంకారాలతో ఛందోవైచిత్రితో నడిచించింది. జక్కన భావాలు పద్యాలు తర్వాత పెద్దనాది ప్రబంధకవుల

కాదర్శమైనాయి. ప్రపంచ భాషలన్నిటిలో సరళంగా వ్రాయబడిన పంచ తంత్ర కథలను బైచరాజు వేంకటనాథుడు ప్రౌఢశైలిలో వ్రాసాడు. సరళ సుబోధకంగా వుండవలసిన కథా గ్రంథాలు తెలుగులో పద్యగద్యమయమైన కవితారామణీయకత గల కావ్యాలుగా అవతరించాయి.

రెండో విధం కథా కావ్యాలు ----- ఇవి కథ, ఆఖ్యాయిక భేదాంతో వున్నాయి. కథ కల్పితేతివృత్తం మీద ఆధారపడింది కాగా ఆఖ్యాయిక సత్యేతివృత్తం మీద ఆధారపడింది. హర్షచరిత్ర వంటి కావ్యాలు సంస్కృత సాహిత్యంలో ఆఖ్యాయిక ప్రక్రియకు చెందినయి. తెలుగు సాహిత్యంలో ఆఖ్యాయిక ప్రక్రియ లేదు. ఆధునిక కాలంలో 20వ శతాబ్దంలో వ్రాయబడిన చారిత్రక నవలలను జీవితచరిత్ర ఆత్మకథలను ఆఖ్యానాలు అనడానికి ప్రయత్నించారు కాని ఆ పేరు వాటికి నిలువలేదు.

సంస్కృత సాహిత్యంలో కథ ప్రక్రియ క్రీ.పూ. 150 కి పూర్వం నుంచే వున్నట్లు తెలుస్తున్నది. పతంజలి (క్రీ.పూ. 150) తన మహాభాష్యంలో వాసవదత్త సుమనోత్తర బైమిరథి అనే కథ కావ్యాలను పేర్కొన్నాడు. ఇప్పుడు లభ్యమయ్యే కథ కావ్యాల్లో సుబంధు (క్రీ.శ 5 వ శ.) వ్రాసిన వాసవదత్త మొదటిది ఆ తర్వాత బాణుని కాదంబరి దండి దశకుమార చరిత్ర, ధనపాలుని తిలకమంజరి మొదలయిన కథా కావ్యాలు ప్రసిద్ధమైనయి. ఇవన్నీ కల్పితమైన ఇతివృత్తంతో కూడి సందర్భానుకూలంగా సుదీర్ఘమైన కావ్యవర్ణనలతో అలంకార శైలిలో వ్రాయబడినాయి. దీర్ఘ సమాసాలను దీర్ఘవాక్యాలను క్లిష్టమైన అలంకారాలను ప్రయోగించి కవులు "కథ" కావ్యాలను రచించారు. సుబంధు బాణాది కవులు శ్లేషాలంకారాన్ని చాలా ప్రయోగించి తమ పాండిత్య ప్రతిభను చూపారు. ఈ కావ్యాల్లోని శైలి పద్యకావ్యాల్లోని శైలి కన్నా ప్రౌఢంగా క్లిష్టంగా వుంది. అందుకే లాక్షణికులు "గద్యం కవీనాం నికషోపలం" అన్నారు. ఈ కావ్యాలు

ప్రేమ సాహసవృత్తాంతాలతో కూడి పాశ్చాత్య సాహిత్యంలోని "రొమాన్సు" రచనలను పోలి వున్నాయి.

తెలుగు కవులు సంస్కృత "కథ" కావ్యాలను అనువదించడం తిక్కన కాలం నుంచే సాగింది. తిక్కన పెద తండ్రి భాస్కరుని కేతన కాదంబరిని మూలఘటిక కేతన దశకుమారచరిత్రను అనువదించారు. ఆ కవులు వీటిని మూలానుసారంగా గద్యంలో కాక చంపువులో వ్రాసారు. మూలంలోని రచనా ప్రౌఢి శ్లేషాద్యలంకారాల క్లిష్టతలు ఈ తెలుగు అనువాదాల్లో లేవు. ఇవి సరళమైన పద్య గద్యాల్లో నాతిదీర్ఘమైన వర్ణనంతో కొద్దిపాటి అలంకారికశైలిలో వున్నాయి. మూలంలోని కొన్ని వర్ణనలను కవులు అనువదించారు. కాని మూలంలో లాగా సుదీర్ఘంగా క్లిష్టంగా ఈ వర్ణనల్లేవు. తిక్కన వ్రాసిన "విజయసేనం" పేరును బట్టి "కథ" ప్రక్రియకు చెందిన కావ్యమని తెలుస్తున్నది. పూర్తి కావ్యం దొరకలేదు. లభ్యమైన పద్యాలు ప్రౌఢంగా వున్నాయి. సంస్కృతంలో రాజశేఖరుడు వ్రాసిన విద్ధసాల భంజిక నాటక కథను ప్రధాన ఇతివృత్తంగా తీసుకొని శృంగారరసాన్ని పోషిస్తూ నడుమ నడుమ చిన్న చిన్న ఇతర కథలను చేర్చి కేయూరబాహుచరిత్ర కావ్యాన్ని మంచన రచించాడు. ఇది "కథ" కావ్యంగా రూపొందింది. ఒక విధంగా ఇది తెలుగులో స్వతంత్ర "కథ" కావ్యమని చెప్పకోవచ్చును. తర్వాత క్రీ.శ. 1500 ప్రాంతంలో ఉదయుని కథను తీసుకొని నారనసూరన "ఉదయనోదయ" కావ్యాన్ని వ్రాసాడు. దీనిలోని ఇతివృత్తం కథాసరిత్సాగరం రెండో లంబకంలోది. అంటే బృహత్కథ ప్రసిద్ధమైన ఇతివృత్తాన్ని తీసుకొని కవి ఉదయనోదయకావ్యాన్ని రచించాడు. బృహత్కథ (క్రీ.శ. మొదటి శతాబ్దం నాటిది) అతి ప్రాచీనకాలంలోనే "పెరియకథై" పేరుతో తమిళభాషలోకి అనువదింపబడింది. బృహత్కథలోని ప్రధాన కథల్లో ఉదయనమహారాజు కథ వుంది. అటువంటి కథను తీసుకొని నారన సూరన కావ్యంగా వ్రాయడం సంతోషమే కాని ఇది ముద్రితం కాకపోవడం తెలుగువారి దురదృష్టం. ఇది

చక్కని వర్ణనలతో రసపోషణతో ప్రేమ సాహస వృత్తాంతాలతో సాగిందని పండితులు చెప్తున్నారు. ఇది కూడా తెలుగులో "కథ" ప్రక్రియకు చెందిన స్వతంత్ర కావ్యమని చెప్పాలి. ఆ తర్వాత పింగళి సూరన (క్రీ.శ. 1660) కల్పితేతివృత్తంగల కళాపూర్ణోదయ కావ్యాన్ని వ్రాసాడు. దీనిలోని కథ అద్భుత సన్నివేశాలతో ప్రేమ సాహసాదులతో సాగింది. కాదంబరి కథలో వున్న కథాకథన చమత్కారం వుంది. కాదంబరి కథలో వున్న ప్రతీకాత్మతను కూడా కవి దీనిలో సాధించాడు. కళాపూర్ణోదయాన్ని ప్రబంధ ప్రక్రియకు చెందిన కావ్యంగా కాక "కథ" ప్రక్రియకు చెందిన కావ్యంగా చెప్పుకోవాలి. సంస్కృతంలో "కథ" ప్రక్రియ గద్యంలో వ్రాయబడింది. కాని "కథ" తెలుగులో మొదటి నుంచీ చంపువులో వ్రాయబడింది. కాబట్టి కళాపూర్ణోదయం గద్యంలో కాక చంపువులో వున్నా తెలుగు సాహిత్య మర్యాదననుసరించి చంపువులో వున్న "కథ" కావ్యంగా దీన్ని అంగీకరించాలి. అదేవిధంగా మాదయగారి మల్లన వ్రాసిన "రాజశేఖర చరిత్ర" కూడా కల్పితేతివృత్తం కలది. దీనిలో ప్రేమ సాహసకార్యాలతో కూడిన ఇతివృత్తం అలంకార శైలిలో వ్రాయబడింది. ఇది సుబంధు వాసవదత్త కథ కావ్యంలోని ఇతివృత్తాన్ని పోలిన ఇతివృత్తం కలది. ఇది కూడా కళాపూర్ణోదయం వలెనే స్వతంత్రమైన "కథ" ప్రక్రియకు చెందిన కావ్యం. ప్రేమ సాహసాద్భుత వృత్తాంతాలు గల కల్పితేతివృత్తంగల "కథ" కావ్యాలు తర్వాత కాలంలో తెలుగులో రాలేదు. నాయకరాజుల కాలంలో వచన రచన వికసించినా ఆ కాలంలో వచనంలో "కథ" కావ్యాలేవి రాలేదు.

* * *

# 8. శ్రీకృష్ణదేవరాయలయుగం

సాళువ నరసింహ రాయలు క్రీ.శ 1485-91 మధ్యకాలంలో విజయ నగరాన్ని పాలించాడు. అతడు గజపతుల, బహమనీల చోళపాండ్య చేర రాజులతో యుద్ధాలలోనే మునిగి పోయాడు. క్రీ.శ 1489-90 ప్రాంతంలో బీజాపూర్, అహ్మాద్‌నగరం,బీదర్‌లో ముస్లిం రాజ్యాలేర్పడినాయి. గోలకొం డలో కులీకుతుబ్ ఉల్‌ముల్క్ బలవంతుడైనాడు. సాళువ నరసింహుడు చిన్న వయస్సులో వున్న ఇద్దరు కొడుకులను ప్రధాని, సేనాని అయిన తుళువ నరస రాజుకు అప్పగించి మరణించాడు.తుళవ నరసరాజు రాజుకొడుకుల్లో పెద్దవాడైన తమ్మరాజును రాజుగా చేసి తానే పరిపాలించాడు. తమ్మరాజు మరణంతో రెండవ కొడుకు ఇమ్మడి నరసింహరాయలు రాజైనాడు. తుళువ నరసరాజు అతన్ని యుద్ధంలో బందీచేసి తానే రాజైనాడు. క్రీ.శ 1503లో అతడు మరణించాడు. అతనికి ముగ్గురు భార్యలు తిప్పాంబకు వీరన రసింహుడు, నాగాంబికకు శ్రీకృష్ణదేవరాయలు, ఓబాంబికకు రంగరాజు, అచ్యుతదేవరాయలు కొడుకులు. నరసరాయల తర్వాత వీరనరసింహుడు రాజయ్యాడు. అతని కాలంలోనే బహమనీ రాజును ఓడించి తరిమేసి ఆరవీటి రామరాజు అతని కొడుకు తిమ్మరాజు కందనవోలు ఆదోని ప్రాంతాలకు రాజులయ్యారు. వీరనరసింహుని తర్వాత అతని సవతి తమ్ముడు శ్రీకృష్ణదేవరాయలు రాజు కావడానికి తిమ్మరుసు మంత్రి సహాయం చాలా వుంది అని న్యూనిజ్ వంటి విదేశి యాత్రికుల వ్రాతలవల్ల తెలుస్తున్నది. శ్రీకృష్ణదేవరాయలు క్రీ.శ 1509-29 మధ్య విజయనగరాన్ని పాలించాడు. అతవి రాజ్యకాలం 20 సంవత్సరాలే అయినా అతని పాలన

దక్షిణ భారతదేశ చరిత్రలో స్వర్ణయుగాన్ని సృష్టించింది. అల్లకల్లోలంగా వున్న విజయనగర రాజ్యాన్ని రాయలు తన యుద్ధవిజయాలతో చక్కపరి చాడు. సామ్రాజ్య విస్తరణ చేసాడు. బహమనీలను క్రీ.శ 1510లో గెల్చి వాళ్ళ గర్వమణిచాడు. క్రీ.శ 1513-1519 మధ్య కళింగ దండయాత్రలు సాగించి విజయం సాధించాడు. పొట్నూరు దగ్గర తన విజయ స్తంభాన్ని నాటాడు. కళింగ దండయాత్రల్లో మునిగివున్నపుడే రాయలు తెలుగులో ఆముక్తమాల్యద కావ్యాన్ని రచించాడు.

సాళువ తిమ్మరుసుమంత్రి సహాయంతో కృష్ణదేవరాయలు (క్రీ.శ. 1509-1529) బలమైన రాజ్యవ్యవస్థను నిర్మించుకొని పరిపాలించాడు. రాయలు పరిపాలించింది ఇరవై సంవత్సరాలే అయినా ఆ కొద్ది కాలం లోనే అతడు అనేక విజయాలను సాధించి సామ్రాజ్యాన్ని నిర్మించాడు. సాహిత్య పోషకుడు కళాపోషకుడుగా అజరామరమైన కీర్తి సంపాదిం చాడు. అదంతా అతని ప్రతిభకు నిదర్శనం. దక్షిణాపథంలోనే కాదు భారత దేశంలోనే అగ్రగణ్యులైన చక్రవర్తుల్లో ఒకడుగా గణింపదగినవాడు శ్రీ కృష్ణదేవరాయలు. వీరుడు. రాజనీతిజ్ఞుడు. పాలనాదక్షుడు.కవి పండితుడు. కవిపండితపోషకుడు, సాహిత్య సమరాంగణ సార్వభౌముడుగా అపరభోజు డుగా కీర్తింపబడినాడు. కృష్ణదేవరాయలది తుళువ వంశం. తుళువ వంశజులు చంద్రవంశ క్షత్రియులమని శాసనాల్లో చెప్పుకున్నారు. కర్ణాటకలోని తుళు లేదా తుళువ ప్రాంతం జన్మస్థలం కావడం చేత ఆ వంశానికి తుళువ అనే పేరు వచ్చిందని చారిత్రకుల అభిప్రాయం. జన్మస్థలమేదైనా నరసరాయుల కాలం నుంచి వాళ్ళు తెలుగునభిమానించారు. శ్రీ కృష్ణదేవరాయల ఆస్థానంలో తెలుగు కవులేకాక సంస్కృత తమిళ కర్ణాట భాషా కవులు కూడా ఆదరణ పొందారు. శ్రీ కృష్ణదేవరాయలంటె తెలుగు ప్రజలకెంత అభిమానమో కన్నడ ప్రజలకంతే అభిమానముంది. కన్నడ సాహిత్యానికి అపూర్వమైన పోషణ ఆశ్రయం కృష్ణదేవరాయల ఆస్థానంలో దొరికిందని కన్నడ సాహిత్య చరిత్రలో చెప్తారు. ఈ కాలంలోనే హళ కన్నడం పోయి హొస (కొత్త) కన్నడం వికసించింది. శైవ ప్రభావం అంతరించి వైష్ణవ ప్రభావం ప్రవేశించింది. 16వ శతాబ్దారంభం నుంచి కన్నడ సాహిత్యంలో

దాస సాహిత్యం పేరుతో వైష్ణవభక్తి గీతాలు చాలా వ్రాయబడినాయి. శ్రీపాదరాజు దాససాహిత్యానికి ఆద్యుడంటారు. కృష్ణదేవరాయల కాలం లోనే పురందరదాసు కనకదాసులు భక్తి నీతి ధర్మబోధకమైన కీర్తనలు వ్రాసి దాససాహిత్యాన్ని ఉత్కృష్టతకు చేర్చారు. వాళ్ళ గురువు వ్యాస రాయలు సాళువ నరసింహునికి. గురువు కూడా 90 సంవత్సరాలు జీవించి కృష్ణ, శ్రీ కృష్ణ, సిరికృష్ణ అనే అంకితనామాలతో వందలకొద్ది కీర్తనలు వ్రాసాడు. అతని పేర దాసపంథతోపాటు వ్యాసపంథ కూడా వ్యాప్తిలోకి వచ్చింది. సాళువ నరసింహరాయల కాలం నుంచే విజయనగర రాజ్యంలో వైష్ణవానికి అభిమానం పెరిగినట్లు కన్పిస్తున్నది. వేంకటేశ్వర క్షేత్రం కూడా వైష్ణవ క్షేత్రంగా అభివృద్ధి చెందసాగింది. ఆంధ్రదేశంలో వైష్ణవానికి పీఠంగా అహోబల క్షేత్రం ప్రసిద్ధమైంది. శైవాలయంగా వున్న సింహాచలం వైష్ణవాలయంగా మారింది. సాళువ నరసింహరాయల కాలం వాడైన అన్నమాచార్యులు వైదికాన్ని విడిచిపెట్టి వైష్ణవుడై తిరుపతి చేరుకొని తెలుగులో భక్తిపదాలు వందల సంఖ్యలో వ్రాసాడు. తెలుగులో దాస సంప్ర దాయం పేరుతో భక్తికీర్తన రచన జరుగకున్నా అన్నమాచార్యుల దగ్గర నుంచి తెలుగులో భక్తిపదాల రచన ప్రారంభమైంది. పెద తిరుమలయ్య, చిన్న తిరుమలయ్య రామదాసు త్యాగయ్య క్షేత్రయ్య పెద్దదాసు వంటి భక్త కవులు పదరచనలు చేసారు. శ్రీకృష్ణదేవరాయల ఆస్థానంలో తిమ్మణ్ణ అని ప్రసిద్ధ కన్నడ కవి వుండి కుమార వ్యాసుడు (క్రీ.శ. 1400-30) పది పర్వాలు వ్రాసి విడిచిన భారత కావ్యాన్ని పూరించాడు. కుమార వ్యాసుడు తన భారతానికి "కర్ణాట భారత కథామంజరి" అని పేరు పెట్టగా తిమ్మణ్ణ "కృష్ణరాయభారత కథామంజరి" అని కృష్ణరాయల పేరు చేర్చాడు. శ్రీకృష్ణదేవరాయలు స్వయంగా సంస్కృతాన్ని అభిమానించి కావ్యనాటకాలు రచించాడు. కాకతీయ రెడ్డి వెలమ రాజుల సంగమ రాజుల కాలంలో ప్రసిద్ధులైన సంస్కృత కవులు ఆలంకారికులు వ్యాఖ్యాతలున్నారు. విజయ నగర రాజులు సంస్కృతంలోనూ శాసనాలు వేయించారు. లొల్ల లక్ష్మీధరుడు "లక్ష్మీధర"మనే అలంకార శాస్త్రగ్రంథాన్ని వ్రాసాడు. దాన్ని బట్టి ఉత్తర భారతంలో ఆదరణ కోల్పోయి నామమాత్రంగా నిలిచిన సంస్కృత సాహిత్యం దక్షిణ దేశంలో 16వ శతాబ్దం నాటికి ఇంకా ఆదరణ

కోల్పోలేదని తెలుస్తున్నది. కృష్ణదేవరాయల యుగంలో మహామంత్రి తిమ్మ రుసు అగస్త్యుని బాలభారతానికి మనోరమ వ్యాఖ్యానాన్ని వ్రాసాడు. అతని మేనళ్ళుల్లు సంస్కృత ప్రబోధ చంద్రోదయానికి వ్యాఖ్యానం వ్రాసారు. అచ్యుతదేవరాయల భార్య తిరుమలాంబ వరదాంబికా పరిణయం వ్రాసింది. ప్రౌఢదేవరాయల కాలంనుంచి ఆస్థానకవులుగా ఉన్న డిండిమకవి వంశంలో అరుణగిరి నాథుడు అచ్యుతదేవరాలయ కాలంలో వుండి అచ్యుతాభ్యుదయ మనే కావ్యాన్ని సంస్కృతంలో వ్రాసాడు. స్వయంగా శ్రీకృష్ణదేవరాయలు సంస్కృతాన్ని అభిమానించి కావ్య నాటకాలు వ్రాసాడు. కళింగ దండ యాత్రల కాలంలో రాయలు శ్రీకాకుళంలో విడిది చేసాడు. అప్పుడు అక్కడి క్షేత్రదైవం ఆంధ్రవిష్ణువు అతనికి కలలో కన్పించి "దేశభాషలందు తెలుగు లెస్స" కాబట్టి తెలుగులో కావ్యం వ్రాయమన్నాడు. ఆంధ్రవిష్ణువు ఆదేశంతో కృష్ణదేవరాయలు తెలుగులో మహాకావ్య రచన చేసాడు. అతని ఆస్థానంలో తెలుగు కవులెందరో ఆదరింపబడినారు. పెద్దన్న తిమ్మన వంటి కవులు అతనికి అతిసన్నిహితులుగా అంతరంగ మిత్రులుగా వున్నట్లు తెలుస్తున్నది. తెలుగు సాహిత్య చరిత్రలో కృష్ణదేవరాయల కాలం స్వర్ణయుగమైంది.

రాయల యుగంలో తెలుగులో స్వతంత్ర మహాకావ్య రచనలు జరిగాయి. వాటికే "ప్రబంధా"లనే ప్రత్యేకమైన పేరు ఏర్పడింది. తెలుగు ప్రబంధాలు భావ ప్రటనలో అలంకార వైచిత్రిలో రసపోషణలో సంస్కృత సాహిత్య ప్రభావం ఛాయలు లేకుండా స్వతంత్ర మార్గంలో రచింపబడినాయి. శ్రీనాథుని యుగం వరకు తెలుగు సాహిత్యంలో అనువాదయుగంగానే సాగింది. శ్రీనాథుని కాలంలో శ్రీనాథుడు పినవీరన వంటి కవులు స్వతంత్రత చూపిన వాళ్ళు సంస్కృతానువాదానికి ఛాయానువాదానికి దూరం కాలేదు. రాయల కాలంలోనే మనుచరిత్రాది రచనలు స్వతంత్రంగా వ్రాయబడినాయి. 11వ శతాబ్దంలో పుట్టిన తెలుగు కావ్యం 16వ శతాబ్దంలో గాని యుక్తవయస్కురాలు కాలేదు. రామరాజ భూషణుని "వసుచరిత్ర" సంస్కృతంలోకి అనువదింపబడిందంటె తెలుగులో కావ్యసంప్రదాయం ఎంత స్వతంత్రస్థితికి ఎదిగిందో చెప్పవచ్చును.

13,14 శతాబ్దాల్లో మధ్వాచార్యులు (క్రీ.శ. 1193-1275) బోధించిన

విష్ణు కృష్ణభక్తితో కూడిన ద్వైతం మాధ్వమతం బాగా వ్యాపించింది. కాని విజయనగర రాజులు సంగమ వంశీయులు శైవాన్ని అభిమానించారు, సాళువ నరసింహరాయలు వైష్ణవాన్ని స్వీకరించాడు, శ్రీకృష్ణదేవరాయలు రామానుజుల శ్రీ వైష్ణవాన్ని అభిమానించాడు. అతడు రచించిన ఆము క్తమాల్యదలో పెరియాళ్వారు, గోదాదేవి ఇద్దరు ఆళ్వారుల చరిత్ర వుంది. అంతేగాక రామానుజులకు పూర్వం వైష్ణవాన్ని ప్రబోధించిన యమునా చార్యాదుల కథలు దీనిలో వున్నాయి. శ్రీకృష్ణదేవరాయలు పరమ వైష్ణవుడు. అతన్ని ఆశ్రయించిన తెలుగు కవులందరూ వైష్ణవాన్ని స్వీకరించి అభిమానించారు. పెద్దన మొదట వైదిక బ్రాహ్మణుడు. శఠకోపయతి గురుత్వంలో వైష్ణవం స్వీకరించి కృష్ణదేవరాయల మిత్రుడు హితుడు అయినాడు. తిమ్మన వైష్ణవాన్ని అభిమానించాడు. ఇక శైవుడుగా వున్న రామలింగడు వైష్ణవాన్ని స్వీకరించి రామకృష్ణుడయ్యాడు. పాండురంగ విట్టల భక్తిని ప్రబోధించే కావ్యం వ్రాసాడు. రాయల కాలంలో విట్టల భక్తి సంప్రదాయం ఒకటి ప్రబలంగా బయలుదేరింది. ధూర్జటి శైవుడని అనుకుంటున్నాం. కాని ఆకాలంలో విష్ణువు కాక శివుదు ఆరాధ్య దైవంగా విశిష్టాద్వైత సంప్రదాయం ఒకటి బయలుదేరింది. ధూర్జటి అట్లా శైవవిశిష్టాద్వైతానికి చెందినవాడై కృష్ణదేవరాయల ఆదరణ పొందాడు. శైవ విశిష్టాద్వైతానికి కాళహస్తి కేంద్రంగా వుంది. ఈ కవులందరు వైష్ణవ భక్తిని విశిష్టాద్వైత సంప్రదాయాన్ని ప్రబోధిస్తూ కావ్యాలు రచించారు. వైష్ణవ ప్రబోధకాలు కాబట్టే ఆ కావ్యాలకు ప్రబంధాలనే పేరు తర్వాత కాలంలో స్థిరపడి వుంటుంది. తమిళంలో వైష్ణవ గీత సంకలనాలను ప్రబంధాల నడం వుంది. శ్రీకృష్ణదేవరాయల కాలంలోని వైష్ణవభక్తి పెనుగొండనేలిన ఆరవీటి రాజులకు తంజావూరు నేలిన నాయకరాజులకు సంక్రమించింది. వైష్ణవం వీరవైష్ణవంగా మారింది. ఈ యుగంలో వైదిక క్రతువులు నామరూపాలు లేకుండా పోయాయి. భక్తి ప్రధానమైన పూజలతో కూడిన వైష్ణవ శైవభక్తి బాగా ప్రచారంలోకి వచ్చాయి. వీరశైవంలో లాగానే వైష్ణవం లోను రామానుజ మధ్వ ఆచార్యులు తమ సంప్రదాయాలను వైదికబద్ధం చేసి ప్రబోధించారు. ఈ యుగంలో అనేక వైష్ణవాలయాల నిర్మాణాలు జరిగాయి. బ్రాహ్మణులు పూజారులుగా, మఠాధిపతులుగా, గురువులుగా,

భూస్వాములుగా, ధనవంతులయ్యారు. మనుచరిత్రలోని ప్రవరుని వర్ణన దాన్ని ప్రతిబింబిస్తున్నది. అయినా భక్తిమతంలో వర్ణభేదం పాటింపబడలేదు కాబట్టి తర్వాత బ్రిటిషు కాలంలో వర్ణవ్యవస్థ స్థిరపడి వికృత రూపం ధరించినంతగా ధరించి లేదని చెప్పాలి. ఆనాడు జనాభా ఈనాడున్నంత లేదు. కాబట్టి ప్రకృతి వనరులను పల్లెల్లో అరణ్యాల్లో వుండే ప్రజలు స్వేచ్ఛగా అనుభవించేవాళ్ళు. విజయనగరం వ్యాపారంతో పాడిపంటలతో సమృద్ధంగా వుందని విదేశీయాత్రికుల రచనల వల్ల తెలుస్తున్నది. ఆనాటి శాంతి సౌభాగ్యాలు భోగభాగ్యాలు ఆనాటి కావ్యాల్లో బాగా ప్రతిఫలించింది. మనుచరిత్ర వసుచరిత్ర వంటి ప్రబంధాల్లోని వివాహవైభవం వరుడు తరలి వచ్చే ఆడంబరం వర్ణనలు చదివితే అన్నపానాదుల్లో జీవన సరణిలో అభిరుచులు భోగలాలసతలు శృంగార ప్రియత్వం ఆ కాలంలో ముస్లింల ప్రభావంతో ****************** ఇనుమడించాయని చెప్పవచ్చును. కళాప్రేమతో అభినయాది కళలను నేర్చిన వేశ్యల నభిమానించడమే కాక భార్యలుగా కూడా చెప్పుకోడం ఈ కాలంలో ఆరంభమై తర్వాత 17,18 శతాబ్దాల్లో నాయక రాజుల కాలంలో అధికమైంది.

శ్రీకృష్ణదేవరాయల మరణం (క్రీ.శ 1529) తర్వాత విజయ నగరసింహాసనం కోసం అంతఃకలహాలు ఏర్పడినాయి. రాయలకున్న ఒక్క కొడుకు మరణించాడు. రాయలు అంతవరకు పెనుగొండలో బందీగా వుంచిన సవతి తమ్ముని వారసుడుగా ప్రకటించాడు. అది అతని అల్లుడు అళియరామరాజుకు నచ్చలేదు. ఎదురు తిరిగాడు. అయినా అతని ప్రయత్నం సాగలేదు. అచ్యుతదేవరాయలు రాజైనాడు. అతడు కొన్ని విజయాలు సాధించి సమర్థవంతంగానే రాజ్యం చేసాడు. రామ రాయలు తన తమ్ముల సహాయంతో తురుష్కులను చేర్చుకొని సైన్యం సిద్ధం చేసాడు. క్రీ.శ 1536 లో రామరాయలు అచ్యుతదేవరాయలను బంధించి తాను రాజు కావాలని చూసాడు కాని ఫలించలేదు. క్రీ.శ 1542లో అచ్యుతదేవరాయలు మరణించాడు. సేనాని సలకం పెదతిరు, మల రాజు అచ్యుతుని కొడుకు వెంకటపతిరాయలను రాజును చేసి తాను సంరక్షకుడుగా నిలిచాడు. రామరాయలు గుత్తి దుర్గంలో అచ్యుతుని

అన్న రంగరాయని కొడుకు సదాశివరాయలను రాజుగా ప్రకటించి తాను సంరక్షకుడయ్యాడు. మొత్తం మీద సలకం తిరుమల, రామరాయల మధ్య సంవత్సరం కాలం అంతర్యుద్ధాలు జరిగాయి. ఆ పరిస్థితులను అవకాశంగా తీసుకొని బీజాపూరు రాజు విజయనగరం మీదికి దండెత్తాడు. సలకం తిరుమలుడు తానే పట్టాభిషేకం చేసుకొని రాజయ్యాడు. రామరాయలు తిరుమలుని వధించి కొన్నాళ్లు సదాశివరాయల పేర తానే అధికారం చలాయించాడు (క్రీ.శ 1543-65). రామరాయలు తురుష్కరాజులతో స్నేహం చేసి విజయనగరాన్ని బలపరిచాడు. కృష్ణదేవరాయలు తనకు అశ్వాలను తెచ్చిపెట్టే పోర్చుగీసులకు గోవాలో స్థావరాన్ని ఏర్పాటు చేసుకోవడానికి అనుమతి ఇచ్చాడు. పోర్చుగీసులు బలవంతులు కావడం చూసి రామరాయలు వాళ్ళ మీదికి దండెత్తిపోయి కప్పం వసూలు చేసాడు. బహమనీ బీజాపూరు, గోలకొండ రాజుల అంతర్ వ్యవహారాల్లో జోక్యం కలిగించు కున్నాడు. గోల్కొండ ఇబ్రాహిం కుతుబ్ షాకు ఆశ్రయమిచ్చాడు. కొన్నాళ్ళతడు విజయనగరంలోనే వున్నాడు. అయితే రామరాయలు తమను ఒక్కొకసారి ఒక్కొకరిని సమర్థిస్తూ ద్వంద్వ నీతిని ప్రయోగించాడు - అతడు తమను మోసగించి బలవంతుడవుతున్నాడని గ్రహించిన పంచపాదుషాలనబడే తురుష్కరాజులు ఏకమై రామరాయల మీదికి దండెత్తారు. క్రీ.శ 1564లో రాక్షసితంగడి (తల్లికోట) అనేచోట ఘోరయుద్ధం జరిగింది. యుద్ధంలో రామరాయలు మరణించాడు. విజయనగర వైభవం నేలమట్టమైంది.కాకతీయుల తర్వాత నిరంతరం సాగే ముస్లింల దాడులను తట్టుకుంటూ విజయనగరం బలమైన కేంద్రాధికారంగా వుండింది. దాన్ని నిర్మూలించాలనే సుల్తానుల ప్రయత్నం రామరాయల ద్వంద్వ నీతి వల్ల ఫలించింది. క్రీ.శ 1570లో రామరాయల తమ్ముడు అప్పటికే అతివృద్ధుడు. పెనుగొండలో పట్టాభిషేకం చేసుకొని ఒక సంవత్సరం పాలించాడు. జీర్ణకర్ణాట వైభవాన్ని సముద్ధరించడానికి ప్రయత్నించారు. కాని సాధ్యం కాలేదు. తిరుమల తర్వాత ఆరవీటి వంశజులు అంతఃకలహాలతో క్రీ.శ 1652 వరకు పాలించారు. బీజాపూరు గోల్కొండ సుల్తానుల దండయాత్రల ఫలితంగా విజయనగర రాజ్యం వాళ్ళకు వశమైంది. ఆరవీటి వంశంలో చివరిరాజు మూడవ శ్రీరంగరాయలు మైసూరులో శరణు పొందాడు.

కాకతీయ వంశ వినాశం తర్వాత ముసునూరి, రెడ్డి, వెలమనాయకుల స్వాతంత్ర్యోద్యమం ఫలితంగా ఆంధ్రదేశం తురుష్కుల ఆక్రమణ నుంచి రక్షించబడింది. కాని గుల్బర్గాలో బహామనీరాజ్యం క్రీ.శ. 1347 ఏర్పడింది. తెలంగాణా తీరాంధ్రాలను జయించి వాళ్ళు అక్కడ కుతుబ్ ఉల్‌ముల్క్‌ను ప్రతినిధిగా నియమించారు. క్రీ.శ 1500 ప్రాంతంలో బహమనీ రాజ్యం విచ్ఛిన్నమై అయిదు స్వతంత్ర ముస్లిం రాజ్యాలేర్పడినాయి. అందులో ఒకటి ఆంధ్ర ప్రాంతాలతో కూడిన గోల్కొండ. గోల్కొండలో కుతుబ్‌ఉల్‌ముల్క్ స్వతంత్రించి కుతుబ్‌షాహి వంశపాలనను ఏర్పరిచాడు. సుల్తాన్ కులీ తర్వాత జంషీద్ (క్రీ.శ 1543-50) ఇబ్రాహీం (క్రీ.శ 1550-80) పాలించారు. జంషీద్ తర్వాత అంతఃకలహాలు ఏర్పడగా అళియరామరాయలు ఇబ్రాహింకులీకుతుబ్‌షా పక్షం వహించి సుల్తాన్‌ను చేసాడు. అతని కాలం నుంచే కుతుబ్‌షాహీలు మతసహనంతో పాలించారు. హిందువులను పీడించ లేదు. హిందూ దేవాలయాలకు బ్రాహ్మణులకు అగ్రహారాలిచ్చారు. హిందువులకు ఉన్నతోద్యోగాలిచ్చారు. వాళ్ళు పర్షియా నుంచి వచ్చిన వాళ్ళు కాబట్టి పారశీకాన్ని రాజభాషగా వాడారు. వాళ్ళకాలంలోనే పరిపాలనారంగంలో జనుల వాడుకభాష తెలుగులో అనేక అన్యదేశ్యాలు వచ్చి చేరాయి. బహమనీరాజుల కాలంలో తెలంగాణం వరకు సీమితమైన ముస్లిం జనాభా ఆంధ్రదేశమంతటా విస్తరించారు. గోల్కొండ రాజులు పారశీ ఉర్దూ కవులను ఆదరించారు. సుల్తాన్‌కులీ స్వయంగా ఎన్నోవందల గజళ్ళు రచించాడు. పారశీ ఉర్దూ తెలుగు పదాల సమ్మిశ్రితంగా అతడు ముస్లిం హిందూ పండుగలను వర్ణించాడు. ఇబ్రాహింకు విజయనగరంలో వున్నప్పుడు ఆంధ్రభాషాభిమానం ఏర్పడి వుంటుంది. తెలుగు కవులను ఆదరించాడు. అతని కాలంలో గోల్కొండ పటిష్ఠమై సంస్కృతికాలవాలమై విలసిల్లింది. కుతుబ్‌షాహీల పాలనలోనే తెలుగు మరాఠి భాషల ప్రభావంతో "దక్కనీ"పేరుతో ఉర్దూలో ఒక "బోలీ" ఏర్పడింది. ఇబ్రాహిం కొలువులో మరింగంటి వంశానికి చెందిన వైష్ణవకవులున్నారు. ఇబ్రాహింను "ఇభరాముడని "కవులు వర్ణించారు. అతన్ని గురించి చెప్పిన చాటుపద్యాలు చాల వున్నాయి.

ఇబ్రాహిం కాలంలోనే రాక్షసి తంగడి యుద్ధంలో విజయనగర సామ్రాజ్యం అంతమైంది. అతని తర్వాత మహమ్మద్ కులీకుతుబ్‌షా (క్రీ.శ 1580-1612) అబ్దుల్లా కుతుబ్‌షా (క్రీ.శ 1612-1658) అబుల్ హసన్ (1658-1687) పాలించారు. ఢిల్లీ సుల్తానులు దండయాత్రలతో గోల్కొండ బలహీనమైంది. ఔరంగజేబు స్వయంగా క్రీ.శ 1687లో గోల్కొండ దుర్గాన్ని ముట్టడించి ఎనిమిది నెలలు యుద్ధం సాగించాడు. చివరకు అబ్దుల్లా పాణి అనే సేనాని ద్రోహం వల్ల మొగల్ సైన్యాలు గోల్గొండను వశం చేసుకున్నాయి. అబుల్ హసన్ బందీ అయినాడు. అతన్ని సకుటుంబంగా గ్వాలియర్‌లో బందీని చేసారు. ఔరంగజేబు గోల్కొండ దుర్గంలోని అపార ధనాన్ని వజ్రవైడూర్యాలను దోచుకున్నాడు. గోల్కొండ మొగల్ సామ్రాజ్యంలో అంతర్భాగమైంది.

కుతుబ్‌షాహీల కాలంలో హిందూముస్లిం సంస్కృతుల మేళనం జరిగి నిర్మాణకళ అభివృద్ధి చెందింది. మహమ్మదు కులీ కాలంలోనే హైద్రాబాదు నిర్మాణం జరిగి రాజధాని గోల్కొండ నుంచి హైద్రాబాదుకు మారింది. చార్‌మినార్, జూమామసీదు వంటి నిర్మాణాలు జరిగాయి. కుతుబ్‌షాహీల సమాధులు చక్కని నిర్మాణ కళతో కూడినయి. అబుల్ హసన్ - తానీషాగా ప్రసిద్ధి చెందాడు. అతని దగ్గర అక్కన్న మాదన్నలనే హిందూ మంత్రులున్నారు. వాళ్ళ మంత్రాంగం సహాయంతోనే తానీషా పాలన సాగించాడు. అతని కాలంలోనే శివాజీ దండెత్తివచ్చి బళ్ళారి వెల్లూరు జింజి ప్రాంతాలను వశపరచుకున్నాడు. అబుల్ హసన్ విద్యావంతుడైనా పరిపాలనా దక్షుడు కాకపోవడం అతని రాజ్యక్షీణతకు కారణమైందని చారిత్రకుల అభిప్రాయం. కుతుబ్ షాహీల తర్వాత తెలంగాణా రాయలసీమ ఉత్తరతీరాంధ్ర భూములను ఆసఫ్‌జాహీలు పాలించారు. వాళ్ళు మొదట మొగల్‌లకు ప్రతినిధులుగా వుండి క్రమంగా వాళ్ళ అంతఃకలహాలను బలహీనతను చూసి స్వతంత్రించారు. ఫ్రెంచి, డచ్, ఇంగ్లీషు వాళ్ళను చేరదీస్తూ చివరకు ఇంగ్లీషు పాలనకు బద్ధులై నిజాం అనే పేరుతో పాలించారు. 20వ శతాబ్దారంభంలో గ్రంథాలయోద్యమం తెలంగాణాలో ప్రారంభమై క్రమంగా అది సాంస్కృతిక రాజకీయ పోరాటంగా మారి

తెలంగాణా చివరకు 1948 సెప్టెంబరు 18 వ తేదీన తెలంగాణా విముక్తిని సంపాదించి భారత రిపబ్లిక్‌లో చేరింది. తెలంగాణా విమోచన పోరాటాన్ని కాంగ్రెసువాళ్ళు, ఆర్య సమాజం వాళ్ళు నిజాంకు వ్యతిరేకంగా సాగించారు. అయితే కమ్యూనిస్టులు జరిపిన తెలంగాణా విమోచన పోరాటం రైతాంగ పోరాటమై తెలంగాణా విమోచనానికే కాక భూస్వామ్య వ్యవస్థను ఎదిరించి ఆ వ్యవస్థ నిర్మూలనానికి కృషి చేసింది. ఆ తెలంగాణా పోరాటం చాలా మంది కవులకు రచయితలకు ప్రేరణనిచ్చింది. మౌలికమైన రచనలు రావడానికి ఆవేశాన్నిచ్చింది. 1956 నవంబరు 1 వ తేదీన మూడు కోట్ల ఆంధ్రులు తెలంగాణా రాయలసీమ తీరాంధ్రంలోని వాళ్ళంతా ఒక్కటై ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడింది. ఆంధ్రులంతా ఏకం కావాలన్న ఆకాంక్ష ఆనాటితో తీరింది.

కవి పండితుడు, కవి పండితపోషకుడు సాహిత్య సమరాంగణ చక్రవర్తి అయిన శ్రీకృష్ణదేవరాయల (క్రీ.శ 1509-1529) పేరుతో - ప్రబంధప్రక్రియ ఉదయించి వికసించిన ఈ తెలుగు సాహిత్య యుగాన్ని రాయలయుగం అని అనడం సమంజసం. ప్రబంధయుగంలో రచింపబడిన మొదటి రెండు ప్రబంధాలు మనుచరిత్ర పారిజాతాపహరణం రాయలకే అంకితంగా ఇయ్యబడినాయి. శ్రీకృష్ణదేవరాయలు స్వయంగా ఆముక్తమాల్యద అనే ప్రౌఢప్రబంధాన్ని రచించాడు. తమిళంలో వైష్ణవ భక్తిగీతాలను ప్రబంధ మనడం వుంది. సంస్కృతంలో ప్రబంధ పదం "కావ్యం" "గ్రంథం" అనే జాతివాచకార్థంలో వుంది. మొదట్లో ప్రబంధయుగంలో వ్రాయబడిన ప్రబంధాలు చాలా మట్టుకు విశిష్టాద్వైతాన్ని విష్ణు-కృష్ణభక్తిని ప్రబోధించేయి. రాయలు పరమ వైష్ణవుడు. కాబట్టి ఈ యుగంలో వెలసిన స్వతంత్రమైన తెలుగు కావ్యాలకు ప్రబంధమనే పేరు స్థిరపడిపుంటుంది.

## ప్రబంధ వికాసం

తెలుగు సాహిత్యంలో 16 వ శతాబ్దంలో స్వతంత్ర కావ్యాలైన ప్రబంధ ప్రక్రియ ఆవిర్భావం హఠాత్తుగా ఏమీ జరుగలేదు. నన్నయ నన్నె

చోదుల నాటి నుంచే తెలుగు సాహిత్యం కావ్యప్రక్రియోన్ముఖమై వికాసం చెందుతూనే వుంది. ప్రబంధ పదాన్ని తీసుకుంటె ఆ శబ్దాన్ని మొట్ట మొదట ప్రయోగించిన వాడు నన్నె చోదుడు (క్రీ.శ 1120). ఆ పదాన్ని అతడు కావ్య సామాన్యార్థంలోనే ప్రయోగించాడు. ప్రకృష్టమైన బంధం కలది-ప్రబంధం-అని ప్రబంధ పదానికి అర్థం. పూర్వం తాటాకుల మీద వ్రాసి వాటిని ఒక్కచోట కుచ్చి కట్టగా పుస్తకంగా బంధించేవారు. అట్లా కట్టినప్పుడు దారంతో గట్టిగా బిగించి కట్టవలసి వుంటుంది. లేకపోతే తాటాకులు ఊసిపోయి పుస్తకం శిథిల మయ్యే అవకాశముంది. అందుకే ప్రకృష్టమైన బంధం కలది ప్రబంధం అన్న పదం పుస్తకం-కావ్యం అనే సామాన్యార్థంలో మొదట తెలుగులో వాడ బడింది. తిక్కన మహాభారత పర్వాలను ప్రబంధ మండలి అని పిలిచాడు. ఎర్రనకు ప్రబంధ పరమేశ్వ రుడన్న బిరుదముంది. అతడు అరణ్యపర్వశేషాన్ని వ్రాసి నన్నయ తిక్కనల మహాభారతాలనే వారధులను బంధించిన వాడు కాబట్టి ఆ బిరుదమూ తనికి సార్థకమైందంటారు. శ్రీనాథుడు కూడా కావ్యసామాన్యార్థంలోనే ప్రబంధపదాన్ని వాడాడు. చివరకు ప్రబంధ కవులు కూడా తమ కావ్యాలకు ప్రబంధాలని ప్రత్యేకమైన పేరు పెట్టుకున్నట్లు కన్పించదు. 16 వ శతాబ్దంలో వ్రాయబడిన విశిష్ట లక్షణాలు కలిగిన కావ్యాలను ప్రబంధాలని పిలవడం తర్వాత కాలంలోనే వ్యాప్తిలోకి వచ్చింది.

ప్రబంధ ప్రక్రియకు బీజాలు నన్నయ వర్ణనల్లో తిక్కన నాటకీయ శైలిలో రసపోషణలో ఎర్రన సూక్తి వైచిత్రితో కూడిన కావ్యశయ్యలో నాచన సోమన నవీన గుణసనాథత్వంలో కన్పించి అంకురించాయి. శ్రీనాథుడు పినవీరనల కావ్యశైలిలో ప్రబంధాంకురాలు మొక్కలై ఎదిగాయి. 16వ శతాబ్దంలో వృక్షాలుగా పెరిగాయి. కేవలం పురాణేతిహాసాల అనువాదంతో ప్రారంభమై తెలుగు సాహిత్యం స్వతంత్రాస్వతంత్ర మార్గంలో కావ్యరూపాన్ని ధరించి ప్రబంధయుగంలో అనువాదాలు కాని పూర్తిగా స్వతంత్రమైన కావ్యాల రూపంగా అవతరించాయి. ప్రబంధాలు సంస్కృతానువాదాలు కావు. పురాణాదుల్లో వున్న చిన్న ఇతివృత్తాన్ని తీసుకొని కవులు రసానుగుణంగా విస్తరింపజేసి కావ్యాలుగా రచించారు. సన్నివేశ కల్పనలు సంభాషణలు

ప్రాత్రపోషణలు వర్ణనలు కవి ప్రతిభాజనితమైనయి. అట్లా స్వతంత్రమైనయి, మౌలికమైనయి అయినా తెలుగు ప్రబంధాలు సంస్కృతంలో మహాకావ్యానికి లాక్షణికులు ఏ లక్షణాలనయితే చెప్పారో ఆ లక్షణాలతోనే కన్పిస్తున్నాయి. క్రీ.శ. 1120 ప్రాంతంలో నన్నెచోడుని కుమార సంభవంతోనే తెలుగులో అంకురించిన మహాకావ్య ప్రక్రియ ఏ కారణాలచేతనో మరుగుపడిపోయి 16వ శతాబ్దంలో ప్రబంధంగా అవతరించింది. కుమార సంభవం శైవావేశంతో వ్రాయబడడంచేతనో యేమో ఆ కావ్యం ఆధునిక కాలం వరకు మరుగున పడిపోయింది. తర్వాత కవులకు అది ఆదర్శంగా నిలిచి కావ్యప్రక్రియ తెలుగులో వికసించడానికి దోహదం చేయలేక పోయింది. కన్నడ జైన కవుల కావ్య సంప్రదాయాన్ని అనుసరించడం కూడా దానికి కారణం కావచ్చును. ప్రబంధ ప్రక్రియ క్రమ పరిణామవికాసాల ఫలస్వరూపంగా 16వ శతాబ్దంలో రాయలకాలంలో పుట్టింది.

## లక్షణాలు

తెలుగు ప్రబంధ లక్షణాలు చాలా మట్టుకు సంస్కృత మహాకావ్యాల లక్షణాలను పోలి వున్నా కొన్ని ప్రత్యేక లక్షణాలు వాటిల్లో కన్పిస్తున్నాయి. సంస్కృత మహాకావ్యాలు సర్గలుగా విభజింపబడి ఒక్కొక్క సర్గ ఒక్కొక్క ఛందస్సులో వ్రాయ బడినాయి. అవి అచ్చంగా పద్యాల్లోనే వ్రాయబడినాయి. తెలుగు ప్రబంధాలు పద్యగద్యాల్లో - చంపువులో వ్రాయ బడినాయి. అవి ఆశ్వాసాలుగా విభజించబడి ఛందోవైవిధ్యంతో వున్నాయి. సంస్కృత మహాకావ్యాల్లో ముఖ్యంగా వీరశృంగారాలు ప్రధాన రసాలుగా పోషించబడగా తెలుగు ప్రబంధాల్లో భక్తి శాంత శృంగార రసాలు ప్రధాన రసాలుగా వున్నాయి. ఆకారంలో రెండింటికి భేదాలు కన్పిస్తున్నా అంతరంగ తత్త్వంలో కొన్ని సామ్యాలున్నాయి.

1. వస్తువు : మహాకావ్యాల్లో ఇతి వృత్తం - అంటె వస్తువు. ప్రఖ్యాతం, కల్పితం అని రెండు విధాలుగా వుంటుందని లాక్షిణికులు చెప్పారు. దీన్నే రుద్రటుడు అనుత్పాద్యం ఉత్పాద్యం అని అన్నాడు.

ధనంజయుడు నాటకాల్లో వస్తువు గురించి చెప్తూ ప్రఖ్యాతం, ఉత్పాద్యం, మిశ్రమం అని మూడు విధాలుగా పేర్కొన్నాడు. తెలుగులో పినవీరన రామరాజభూషణాది కవులు ప్రఖ్యాతం, కల్పితం, మిశ్రమం అని మూడు విధాలైన ఇతి వృత్తాలను గురించి ప్రసంగించారు. రామరాజ భూషణుడు "కేవల కల్పనా కథలు కృత్రిమ రత్నము లాద్య సత్కథల్ హావిరిపుట్టు రత్నముల్" అని విమర్శించి "అవారిత సత్కవి కల్పనా విభూషావహ పూర్వవృత్తములు సానలదీరిన జాతి రత్నముల్" అని ప్రశంసించి "కావున నిట్టి మిశ్రకథగా" కృతి రచిస్తానని చెప్పాడు.

"ఆద్యసత్కథల్" ప్రఖ్యాతేతివృత్తం - అంటె పురాణేతిహాసాల నుంచి కథను వున్నదున్నట్లుగా తీసుకొని వ్రాయడం. పెద్దన మార్కండేయ పురాణం నుంచి తీసుకున్న కథను ఎక్కువ మార్పులు లేకుండా రచించాడు. కాబట్టి మనుచరిత్రలోని వస్తువు ఇటువంటి ప్రఖ్యాతేతి వృత్తమని అన్నారు. కల్పిత మంటె పూర్తిగా కవి కల్పితమైన ఇతివృత్తం. మాదయగారి మల్లన రాజశేఖర చరిత్ర, పింగళి సూరన కళాపూర్ణోదయం వంటి కల్పితేతి వృత్తంగలవి అన్నారు. ఇక మూడోది మిశ్రమం అంటె పురాణేతిహాసాల్లోని చిన్న కథను తీసుకొని కవి స్వల్పకలతో విస్తరింపజేసి వ్రాయడం. రామరా జభూషణుడు తన వసుచరిత్ర ఇటువంటి మిశ్రమేతివృత్తం గల కావ్యమని అదే ఉత్తమమైందని ప్రశంసించుకున్నాడు.

సంస్కృత మహాకావ్యాల్లో ప్రఖ్యాతం కల్పితం లేదా అనుత్పాద్యం, ఉత్పాద్యం అని రెండు విధాలుగానే వస్తువు చెప్పబడింది. ప్రఖ్యాతం లేదా అనుత్పాద్య ఇతివృత్తానికి ఉదాహరణగా కిరాతార్జునీయాది కావ్యాలు చెప్పబడినాయి. భారవి మహాభారతం నుంచి కథావస్తువును తీసుకొని స్వతంత్రమైన సన్నివేశ కల్పనలతో సంభాషణలు పాత్రచిత్రణలతో వర్ణనలతో మహాకావ్యంగా వ్రాసాడు. ప్రఖ్యాతమైన ఇతి వృత్తంలో ఔచిత్యం కోసం రస నిర్వహణ కోసం కవి స్వంత కల్పనలు చేర్చవచ్చునని ఆనందవర్ధనుడంటాడు. అదే విధంగా భారవి మాఘ శ్రీహర్షాది కవులు పురాణేతిహాసాల నుంచి చిన్న కథను తీసుకొని అంగాంగిరసపోషణతో పెంచి కిరాతార్జునీయం శిశుపాలవధ నైషధం వంటి మహా కావ్యాలు వ్రాసారు. తెలుగులోను

పెద్దన తిమ్మన రామరాజభూషణ కవులు పురాణేతిహాసాల నుంచి చిన్న కథను తీసుకొని పెంచి ప్రబంధాలుగా వ్రాసారు. ఈ కవులు కూడా ఔచిత్యం కోసం రసపోషణ కోసం కథలో కల్పనలను చేర్చి రచించారు. సన్నివేశాలు సంభాషణలు పాత్రపోషణలు వారి స్వంతమే. కాబట్టి పెద్దనాది కవుల ప్రబంధ వస్తువు ప్రఖ్యాతం - అనుత్పాద్యమనే చెప్పుకోవాలి. పెద్దన మార్కండేయ పురాణం నుంచి తీసుకున్న కథ రామరాజభూషణుడు మహాభారతం నుంచి తీసుకున్న కథ కన్నా పెద్దది. కాని ఇద్దరూ సమానంగా సన్నివేశ సంభాషణ పాత్రచిత్రణాదులను స్వంతంగా కల్పించే రచించారు. కాబట్టి ప్రబంధాల్లో వస్తువు సంస్కృత మహాకావ్యాల్లో వలె ప్రఖ్యాత మైందనే చెప్పుకోవాలి. ఇక రామరాజభూషణుడు "కేవలం కల్పనాకథలు" గురించి చెప్పాడు. కల్పనా కథలు - కల్పితం లేదా ఉత్పాద్య వస్తువుకు సంస్కృత లాక్షణికులు బాణుని కాదంబరి ధనపాలుని తిలకమంజరి వంటి "కథ" కావ్యాలను ఉదాహరణలుగా ఇచ్చారు. తెలుగులో కల్పిత కథలు కృత్రిమ రత్నాలవంటివని రామరాజ భూషణుడు పింగళి సూరన కళాపూర్ణోదయాన్ని విమర్శించాడని అంటారు. ప్రబంధయుగంలో కల్పితేతి వృత్తంగల కావ్యాలవే. కాని సంస్కృత లాక్షణికులు చెప్పినట్లుగా కల్పితేతి వృత్తం "కథ" కావ్యాల్లోనే వుంటుంది. "కథ" కావ్యాల్లో సంస్కృతంలోలాగా గద్యంలో కాక చంపువులోనే రచింపబడినాయి. కాబట్టి రాజశేఖర చరిత్ర, కళాపూర్ణోదయాలు కల్పితేవృత్తంగల "కథ" కావ్యాలే అని చెప్పుకోవాలి. అప్పుడు రామరాజభూషణాది కవులు నాటకాలకుచెప్పిన మూడు విధాలైన ఇతి వృత్తాలను పేర్కొన్నా పరిశీలనవల్ల తెలుగు ప్రబంధాల్లో సంస్కృత మహాకావ్యాల్లోవలెనే ప్రఖ్యాతం - అనుత్పాద్యం అన్న ఇతివృత్తమే వున్నదని చెప్పవచ్చును. తెలుగులో మిశ్రమం అన్న వస్తువిభాజన ఆనందవర్ధనాదులు రస నిర్వహణ కోసం విధించిన కల్పనలు చేరిన ప్రఖ్యాతేతివృత్తమేగాని వేరేకాదు.

మహాకావ్యం ఇతివృత్త నిర్వహణలో నాటకంలోవలెనే పంచసంధులను పాటించాలని లాక్షణికులు - "సుసంధిభిః, పంచభిస్సందిర్యుక్త" మని చెప్పారు. నాటకంలో పంచసంధులు నాయకుని కార్యారంభంతో ఆరం

భమై ఫలాగమంతో ముగుస్తాయి. నాయకుడేదో అభ్యుదయాన్ని ఆశించి కార్యారంభానికి పూనుకుంటాడు. కార్యసాధనకు యత్నం చేస్తాడు. ఈ ఆరంభయత్నాలు రెండూ ముఖప్రతిముఖ సంధుల్లో నిర్వహింపబడ్డాయి. గర్భసంధిలో ఫలప్రాప్తి అనిశ్చితంగా వుండి ఘర్షణ జరుగుతుంది. అవమర్శసంధిలో ఫలప్రాప్తి జరిగే సూచన కన్పిస్తుంది. నిర్వహణసంధిలో ఫలప్రాప్తి కలుగుతుంది. నాయకుని చరిత్రను అనవసరమైన వృత్తాంతాలతో పురాణ ఫక్కీలో కాకుండా కథను ఒక్క సూత్రంలో బంధించి నడపడానికి ఈ నాటక పంచసంధులు మహాకావ్యానిక్కూడా విధించబడినాయి. సంస్కృత కుమార సంభవం, కిరాతార్జునీయం, శిశుపాలవధ, నైషదం వంటి మహాకావ్యాల్లో పాటింపబడినట్లు చూడవచ్చును. తెలుగులో వసుచరిత్ర ప్రబంధంలో కవి ఈ సంధులను పాటించి కథను ఏక సూత్రంలో బిగించి వస్త్వైక్యతను సాధించాడు. మనుచరిత్రలోను వివిధ వృత్తాంతాలు స్వారోచిషమను సంభవమనే కార్యప్రాప్త్యున్ముఖంగా నడిచాయి. ఆ విధంగా మను చరిత్రలోను కవి వస్త్వైక్యాన్ని సాధించాడు. ఇక కాళహస్తి మాహాత్మ్యం పాండురంగ మాహాత్మ్యం వంటి ప్రబంధాల్లో పంచసంధులు పాటించబడలేదు. కాని వాటిల్లో దేవుని మహిమలను చెప్పే సమానలక్షణం అనే కథా సూత్రంతో బంధింపబడి వస్త్వైకం సాధించబడింది. అదే విధంగా శ్రీనాథుని హరవిలాసంలో లాగానే చేమకూర వేంకటకవి విజయవిలాసంలో అర్జునుని (విజయుని) విలాసాన్ని చెప్పే కథలన్నీ కూర్చబడి వస్త్వైక్యం సాధించబడింది. ఈ విధంగా వస్తువు పురాణాల్లోలాగా అనవసరమైన వృత్తాంతాలతో కాక అవసరమైన ఔచితీవంతమైన వృత్తాంతాలతో కవులు ప్రబంధాల్లో వస్తువును ఏక సూత్రంలో బిగించి వస్త్వైక్యాన్ని సాధించారు.

2. వర్ణనలు - (సంస్కృత లాక్షణికులు మహాకావ్యాల్లో 18 రకాల వర్ణనలుండాలని చెప్పారు.) దండి కావ్యోచిత వర్ణనలను గురించి ఇట్లా చెప్పాడు-----

నగరార్ణవ శైలర్తు చంద్రార్కోదయ వర్ణనైః

ఉద్యాన సలిల క్రీడా మధుపాన రతోత్సవైః

విప్రలంభైః వివాహైశ్చ కుమారోదయ వర్ణనైః

మంత్రదూత ప్రయాణాజి నాయకాభ్యుదయైరపి

ఈ వర్ణనలను వాటి విస్తరంగా సందర్భోచితంగా చేయాలని లాక్షణికుల అభిప్రాయం. ఈ 18 వర్ణనలకు అప్పకవి మరో నాలుగు వర్ణనలు - కన్యాంగ సౌందర్యకథనం, దౌహృదం, వనవిహారం, మున్యాశ్రమ వర్ణనలు - చేర్చి 22 వర్ణనలు తెలుగు ప్రబంధాల్లో వుండాలని చెప్పాడు. విశ్వనాథుడు మహాకావ్య వర్ణనల్లో వేటను కూడా చేర్చాడు. పెద్దనాది కవులు వేట వర్ణనను సహజంగా వీరరసస్ఫోరకంగా రచించారు. ప్రబంధ కవులు తమ ప్రబంధాల్లో సందర్భానుకూలంగా పై కావ్యవర్ణనలను చేసారు. ఆ కవులు వర్ణనలకు అవకాశం కలిగేటట్లుగా కథలో మార్పులను చేర్పులను కూడా చేసారు. నన్నయాది కవులు వర్ణనలకు ఎక్కువ ప్రాధాన్యమియ్యక అవసర మైన చోటనే వర్ణనలు చేసారు. కాని ప్రబంధ కవులు వర్ణనలను తప్పనిసరిగా దీర్ఘంగా సుదీర్ఘంగా రచించారు. ప్రబంధ కవుల వర్ణనల్లో అలంకారాలు భావ వైచిత్రులు ఉక్తిచమత్కారాలు చాలా చోటు చేసుకున్నాయి. ఇవన్నీ కూడా ప్రబంధ కవుల స్వంతమే కాని నన్నయ శ్రీనాథాది కవుల్లో వలె సంస్కృత కవుల అనుకరణలు కావు.

3. శైలి - అలంకారాలు : ప్రబంధకవులు తమ కృతులను కథను చెప్పడమే ప్రధానంగా పురాణ పద్ధతిలో కాక వక్రోక్తులతో చెప్పారు. శైలీ రామణీయకత వారి ప్రత్యేకత. వక్రోక్తిభరితమైన ఉక్తిచమత్కారాలతో కూడిన భావాలను కూర్చారు. అలంకార సౌందర్యాన్ని ప్రకటించారు. సాధా రణంగా వాచ్యోక్తులతో మాట్లాడే తెలుగు సరస్వతి శ్రీనాథుని నైషధకాలం నాటికి ప్రౌఢోక్తులను నేర్చుకొని ప్రబంధకాలం నాటికి వక్రోక్తిభరితంగా మాట్లాడ్డం నేర్చుకుంది.

నన్నయాది కవులు ఉపమ ఉత్ప్రేక్షరూపకాది అలంకారాలనే ఎక్కువగా వాడారు. పోతన ఒక్కడే శబ్దాలంకారాలను ప్రయోగించాడు. కాని ప్రబంధ కవులు అలంకారాలను ఎక్కువగా వాడారు. శబ్దార్థాలంకారాలను

రెండింటిని ఉక్తి వైచిత్రి సాధనకు ప్రయోగించారు. క్లిష్టమైన అలంకారాలను అనుప్రాణితాలంకారాలను వాడారు. శ్లేషను ప్రయోగించి రెండు అర్థాల చమత్కారాన్ని అలంకార వస్తుధ్వనులను సాధించారు. చేమకూరకవి వంటి వాళ్ళు ప్రతిపద్య చమత్కారాల సాధనతో శ్లేషయమకాది అలంకారాలను ప్రయోగించి రచించారు. వక్రోక్తి అర్థచమత్కారం ప్రబంధకవుల శైలిలోని ప్రత్యేకత.

పెద్దన ఉపమ ఉత్ప్రేక్షరూపకాలతో పాటు స్వభావోక్తి అతిశయోక్తులను ఎక్కువగా వాడాడు. స్వభావోక్తి అతిశయోక్తి - రెండూ విరుద్ధాలంకారా లుగా కనిపిస్తాయి. కాని పెద్దన ఈ రెండు అలంకారాలను సమానంగా ప్రయోగించి చక్కని వర్ణనలను చేసాడు. రామారాజ భూషణునిలో ప్రబంధ శైలి ఉన్నత శిఖరాలనందుకున్నది. ప్రతి పద్యంలో అతడు రెండు మూడు అంకారాలను కూర్చాడు. ఒక్క అలంకారప్రయోగంతో అతనికి తృప్తి లేదు. శ్లేషతో క్లిష్టమైన అర్థాలను సాధించాడు. శ్లేషానుప్రాణిత ఉత్ప్రేక్షరూపకాలను ప్రయోగించి అలంకార వస్తుధ్వనులను సాధించిన మహాకవి. చేమకూర వేంకటకవి కూడా శ్లేషయమకాలను ప్రయోగించి అర్థచమత్కృతులను సాధించాడు.

ప్రబంధకవుల శైలి (రీతి) ప్రాచీనకవుల శైలి కన్నా ప్రౌఢమై రమణీ యమైంది. తిక్కన నాటక శిల్పం శ్రీనాథుని పద ప్రయోగనైపుణి పోతన శబ్దార్థాలంకార రామణీయకతలు ప్రబంధకవుల్లో వికసించాయి. తెనాలి రామకృష్ణుని పదగుంఫనంతో కూడిన శైలి, ధూర్జటి పదమాధుర్యం, పెద్దన శిరీషకుసుమ పేశలమైన వాక్కులు, రామరాజ భూషణుని గంభీర ప్రౌఢశైలి, పింగళి సూరన సహజ చిత్రణలతో కూడి సహజశైలి, చేమకూర కవి చమత్కృతులతో కూడిన శైలి ప్రబంధకవుల స్వంతం. నన్నయ తిక్కనాదుల్లో సరళమైన శైలి ఎర్రన సోమనల కావ్యాల్లో సూక్తి వైచిత్రిని సంతరించుకొని శ్రీనాథాది కవుల్లో "హరచూడా హరిణాంకవక్రత"ను సంపాదించుకొని ప్రబంధకవుల్లో తెలుగు కావ్యశైలి వికసించింది. ప్రబంధ కవుల్లో తెలుగు కావ్యశైలి ప్రౌఢవక్రోక్తి భరితమైంది. ప్రబంధకవుల కాలం తెలుగు సాహిత్యంలో "రీతి" ప్రధానకాలం అని చెప్పవచ్చును.

4. రసపోషణ : రాయలయుగానికి పూర్వం కావ్యాల్లో సందర్భానుకూలంగా ఆయా రసాలను స్ఫురింపజేసారేగాని కావ్యం ఆసాంతంగా ఒక్క రసాన్ని విభావానుభావాదులతో పోషించడం జరుగలేదు. కాని ప్రబంధాల్లో ఒక్క రసాన్ని ప్రధానరసంగా అంటె అంగిరసంగా మిగిలిన రసాలు అంగ రసాలుగా పోషింపబడినాయి. సంస్కృత లాక్షణికులు వీరశృంగారరసాల్లో ఒక రసాన్ని అంగిరసంగా మహాకావ్యంలో పోషించాలని చెప్పారు. సాహిత్య దర్పణకారుడు విశ్వనాథుడు "శృంగార వీర శాంతా నామేకోంగిరస ఇష్యతే" అని శృంగార వీరాలతోపాటు శాంతరసాన్ని కూడా అంగిరసంగా అంగీకరించాడు. తెలుగు ప్రబంధాల్లో భక్తి శాంత శృంగారరసాలు ప్రధాన రసాలుగా పోషింపబడినాయి. ఆముక్తమాల్యద కాళహస్తిమాహాత్మ్యం పాండురంగ మాహాత్మ్యంలో భక్తిరసం, మనుచరిత్రలో శాంతరసం, వసుచరిత్ర ప్రభావతీ ప్రద్యుమ్నం విజయవిలాసంలో శృంగారరసం అంగిరసాలుగా వున్నాయి. వీరరసం కేవలం అంగరసంగానే పోషింపబడింది. సంస్కృత మహాకావ్యాల్లో భక్తిరసం కనిపించడం లేదు.

మను చరిత్ర వసుచరిత్రాది ప్రబంధాల్లో విభావానుభావాలచేత పరిపుష్టమైన రసపోషణ కోసం కవులు కథావస్తువును మలిచారు. పాత్రలను తదనుగుణంగా పోషించారు. వసుచరిత్రలో కవి శృంగారరసపోషణ కోసం మూలంలో చాలా చిన్నదైన కథను పెంచి సన్నివేశకల్పనలను సంభాషణల రచనను పాత్రలచిత్రణను చేసాడు.

ప్రఖ్యాతేతివృత్తం తీసుకున్నప్పుడు మూలకథలో అనౌచిత్యం వుంటే తొలగించి రసోచితంగా మార్చవచ్చునని ఆనందవర్ధనుడంటాడు - "ఇతివృత్త వశాయాతం త్యక్త్వానుగుణాం స్థితిం ఉత్ప్రేక్ష్యాప్యంతరాభీష్ట రసోచిత కథోన్నయః"

వసుచరిత్రాది ప్రబంధకారులు దీన్ని అక్షరాలా అనుసరించి నూతన కల్పనలు చేసారు.

ప్రబంధాల్లో అంగిరసాలుగా శృంగార శాంత భక్తిరసాలున్నా సందర్భాను

కూలంగా ప్రబంధ కవులు వీర హాస్య కరుణాద్భుత రౌద్రబీభత్స వాత్సల్యాది రసాలను పోషించారు. రసానుకూలమైన రీతిని (శైలిని) ప్రయోగించారు.

5. పాత్ర చిత్రణ : రాయల యుగానికి పూర్వం కవులు ఒక్క తిక్కన తప్ప - కవులెవరూ పాత్రచిత్రణాశిల్పానికి ప్రాధాన్యాన్ని ఇయ్యలేదు. ప్రాచీన లాక్షణికులు పాత్ర చిత్రణను గురించి నాయికా నాయక భేదాలు తప్ప విశేషంగా ఏమి చెప్పలేదు. అయినా మహాభారత రామాయణాల్లో సజీవ పాత్రచిత్రణ జరిగింది. తెలుగులో సజీవ పాత్రచిత్రణ చేసి ప్రతిపాత్ర ప్రత్యేక వ్యక్తిత్వంతో పాఠకుల కనుల ముందు నిలిచేటట్లుగా శిల్పాన్ని పాటించిన వాడు తిక్కన. నన్నయ ప్రసన్న కథనానికి అక్షర రమ్యతకు ప్రాధాన్యాన్నిచ్చినట్లుగా పాత్రచిత్రణా శిల్పానికియ్యలేదు. మళ్ళీ పోతనలో కొంతవరకు పాత్రలచిత్రణ జరిగింది. శ్రీనాథాది కవులక్కడక్కడ పాత్రల స్వరూపాన్ని చేష్టలను వర్ణించినా అతని కావ్యాల్లో చెప్పుకోదగిన సజీవ పాత్రచిత్రణ జరుగలేదు. తిక్కన తర్వాత తెలుగులో సజీవ పాత్రచిత్రణ చేసిన వాళ్ళు ప్రబంధకవులు. పెద్దన మనుచరిత్రలోని ప్రవరవరూథిని స్వరోచిమనోరమ పాత్రలు పారిజాతాపహరణంలోని సత్యభామ శ్రీ కృష్ణ పాత్రలు ప్రభావతీ ప్రద్యుమ్నంలోని ప్రభావతి ప్రద్యుమ్నులు చిలుక పాత్రలు వసుచరిత్రలోని గిరిక శుక్తిమతి వసురాజు పాత్రలు విజయవిలాసంలో అర్జునుడు ఉలూచి సుభద్ర పాత్రలు ఒక్కొక్క వ్యక్తిత్వంతో పాఠకుల కనుల ముందు నిలుస్తాయి. సంస్కృత మహాకావ్యాల్లో శైలి రసపోషణల కిచ్చినంత ప్రాధాన్యాన్ని పాత్ర చిత్రణా శిల్పానికియ్యలేదని చెప్పవచ్చును. కాని ప్రబంధ కవులు పాత్రల రూపవర్ణన చేష్టలవర్ణనలతో సంభాషణల వైవిధ్యంతో సహజవర్ణనలతో సజీవ పాత్రచిత్రణలు చేసారు.

6. నాటక శిల్పం : తెలుగు సాహిత్యంలో నాటకాల రచన ఆధునిక కాలంలో ఆరంభమైంది. సంస్కృత నాటకాలను కూడా ప్రాచీన కవులు కావ్యాలుగా అనువదించారు. ఈ కోవలో రాజశేఖరుని విద్ధసాలభంజిక నాటకాన్ని మంచన కేయూరబాహుచరిత్రగా కాళిదాసు అభిజ్ఞాన శాకుంతలనాటకాన్ని కొంతవరకు అనుసరిస్తూ పినవీరన శృంగార శాకుంతలంగా కృష్ణమిశ్రుని ప్రబోధచంద్రోదాయ నాటకాన్ని నందిమల్లయ

ఘంట సింగయులు ప్రబోధ చంద్రోదయంగా కావ్యాలుగా రచించారు. ఆ నాటకాల చేత ఆకర్షింపబడి తెలుగులో నాటకాలు లేకపోవడం చేత తెలుగు కవులు వాటిని కావ్యాలుగా అనువదించి వుంటారు. నాటకాలను కావ్యాలుగా వ్రాయడంతో తెలుగు కావ్యాల్లో ఇతివృత్తాన్ని సన్నివేశాలుగా విభజించేటప్పుడు అంకవిభజన పద్ధతిలో సన్నివేశాలను విభజించడం, నాటకాల్లో మాత్రమే కన్పించే విదూషక పాత్రలను ప్రవేశ పెట్టడం వంటివి జరిగాయి. మంచన పినవీరనలు తమ కావ్యాల్లో విదూషక పాత్రను ప్రవేశపెట్టారు. ప్రబంధకవుల్లో రామరాజభూషణుడు వసుచరిత్రలో విదూషక పాత్రను ప్రవేశ పెట్టాడు. నాటకంలోని అంకాల్లోలాగా ప్రబంధాల్లో ఒక్కొక్క ఆశ్వాసంలో సన్నివేశ కల్పనలు చేయడం ఆ సన్నివేశాల్లో పాత్రల ప్రవేశనిర్గమనాదులను చెప్పడం సంభాషణలతోనే ఆ సన్నివేశాలను నడపడం జరిగింది. మనుచరిత్ర వసుచరిత్ర పారిజాతాపహరణం ప్రభావతీ ప్రద్యుమ్నం వంటి అనేక ప్రబంధాల్లో ఈ నాటక ధర్మాలను చూడవచ్చును. వసుచరిత్రలో కవి సన్నివేశాల కల్పనలో కాళిదాసు శాకుంతలం హర్షదేవుని నాగానందం వంటి నాటక అంకాల్లోని సన్నివేశాలను అనుకరించాడు. ఈ విధంగా ప్రబంధకవులు సన్నివేశ కల్పనలో విదూషక పాత్ర ప్రయోగంలో నాటకధర్మాలను ప్రదర్శించారు.

ప్రబంధాల్లో కేవలం నాటకధర్మాలేకాక నాటకశిల్పం కూడా కన్పిస్తున్నది. నాటకశిల్పంలో - సజీవమైన శక్తివంతమైన పాత్రచిత్రణ, సంభాషణలు ప్రధానాంశాలు. ప్రబంధ కవులు సజీవపాత్రచిత్రణలు చేసారు. పాత్రల స్వరూపాలను చేష్టలను నాటకరంగస్థలం మీద నటులు అభినయించి చూపుతున్నట్లుగా పాఠకుల కనులకు కట్టేటట్లుగా వర్ణించారు. కథను కవి స్వయంగా వర్ణించి చెప్పకుండా నాటకంలోలాగా పాత్రల సంభాషణల మూలంగా నడపడం నాటకీయత నాటకశిల్పంలో ప్రధానాంగం. ఆయా పాత్రలకు తగినట్లుగా పాత్రల మనః ప్రవృత్తులు ప్రకటమయ్యేటట్లుగా సంభాషణలను, మాట్లాడే తీరులను ప్రబంధకవులు రచించారు. ప్రబంధాల్లో ఈ నాటకశిల్పం బాగా కన్పిస్తున్నది. మనుచరిత్ర వసుచరిత్ర పారిజాతాపహరణం మొదలయిన అనేక ప్రబంధాల్లో ఈ నాటకశిల్పాన్ని

చూడవచ్చును.

## శ్రీకృష్ణదేవరాయలు

శ్రీకృష్ణదేవరాయలు (క్రీ.శ. 1509-1529) కవిపండితుడై కవి పండిత పోషకుడై అపరభోజుడని పేరు సంపాదించుకున్నాడు. అతడు పాలించిన కొద్ది కాలంలోనే అనేక విజయాలను సాధించి సామ్రాజ్య నిర్మాణం చేసాడు. కవియై అనేక సంస్కృతాంధ్ర కృతులను రచించాడు. అనేక కవి పండితుల నాదరించి కావ్యాలనంకితంగా తీసుకొని అజరామరమైన కీర్తిని పొందాడు. అతడు కేవలం తెలుగు కవులనేకాక సంస్కృత కన్నడ తమిళ కవులను పోషించాడు. వాళ్ళ కవిత్వాలను నిరంతరం విని సంతోషించిన రసికుడు. రాయలు సంస్కృతంలో అనేక కావ్యనాటకాలు వ్రాసాడు. తెలుగులో ఆముక్తమాల్యద అనే అపూర్వమైన ప్రబంధాన్ని రచించాడు.

రాయలు కళింగదేశం మీదికి దండెత్తి పోతూ మార్గమధ్యంలో విజయ వాడలో విడిది చేసాడు. శ్రీకాకుళాంధ్ర విష్ణువును దర్శించాడు. ఆరాత్రి అతనికి కలలో ఆ దేవుడు కన్పించి - నీవు సంస్కృతంలో మదాలస చరిత్ర, సత్యవధూ ప్రీణనం, సకలకథాసార సంగ్రహం, జ్ఞానచింతామణి, రసమంజరి మొదలయిన కావ్యనాటకాలు వ్రాసావు. ఇప్పుడు తెలుగులో నాకు ప్రియమయ్యేటట్లుగా కావ్యనిర్మాణం చేయమని కోరాడు -

తెలుగదేల యన్న దేశంబు తెలుగేను
తెలుగు వల్లభుండ తెలుగొకండ
యెల్ల నృపులు గొలువ నెరుగవే బాసాడి
దేశ భాషలందు తెలుగు లెస్స.

అట్లా ఆంధ్రవిష్ణువు ప్రోత్సాహంతో రాయలు ఆముక్తమాల్యద ప్రబంధాన్ని రచించాడు. దీనికి విష్ణుచిత్తీయం అనే పేరు కూడా వుంది. ఈ కృతిని రాయలు ఆంధ్రవిష్ణువు ఆదేశంతో వ్రాసి తన ఇష్టదైవం వేంకటేశ్వరునికి అంకితమిచ్చాడు. "అంకితం నీ ఇష్టదైవానికే ఇచ్చుకో. అతడూ నేనూ వేరు కాదు" అని ఆంధ్ర విష్ణువే అతన్ని ఆదేశించాడు. చాలాకాలం

వరకు ఆముక్తమాల్యదను శ్రీకృష్ణదేవరాయలు కాక పెద్దనో మరో కవో వ్రాసాడన్న అభిప్రాయం లోకంలో వ్యాపించివుండింది. దానికి కారణాలు- ఒకటి-శ్రీకృష్ణదేవరాయలు రాజు. యుద్ధాలలో రాజ్యపాలనలో వ్యగ్రుడై వుంటాడు. రెండోది-రాయలు మాతృభాష తెలుగు కాదు. తుళు భాష అంటారు. తెలుగు రానివాడు తెలుగులో కావ్యం వ్రాయడం సాధ్యంకాదని విమర్శకుల అభిప్రాయం. అంతేగాక లోకంలో ఆముక్తమాల్యదను పెద్దన వ్రాసి రాయలపేరు మీద పెట్టాడన్న చాటుపద్యం- "కృష్ణ రాయల పేరు ఇడి నీవు రచియించితివి తొల్లి విష్ణుచిత్తీయమనగ అల్లసాని పెద్దనార్య విశేష వివేకధుర్యా !"- అని వ్యాప్తిలో వుంది. అంతేగాక ఆముక్తమాల్యద పీఠికలో రాయల వంశవర్ణన పెద్దన మనుచరిత్ర పీఠికలోని పద్యాలే వున్నాయి. వీట న్నిటి చేత రాయలు ఆముక్తమాల్యద వ్రాయలేదని చాలామంది పండితులు తలంచారు. కాని ఆముక్తమాల్యదలోని శైలి పూర్తిగా పెద్దన శైలికన్నా భిన్నమైంది. స్వతంత్రమైంది. ప్రత్యేకమైంది. రాయలు తన వంశాన్ని తాను వర్ణించుకోడం ఇష్టం లేక పెద్దన మనుచరిత్ర పీఠికలోని పద్యాలనే తీసుకొని వుంటాడని విమర్శకుల అభిప్రాయం. కాబట్టి ఆముక్తమాల్యద రాయల కృతమే అని ఆధునికకాలంలో నిర్వివాదంగా నిర్ణయింపబడింది.

ఆముక్తమాల్యద శబ్దానికి అర్థం - ఆ + ముక్త + మాల్య+ద అంటె తాను ధరించి విడిచిన మాలలను (భగవంతునికి) ఇచ్చినది - అని అర్థం. అట్లా ఇచ్చిన భక్తురాలు గోదాదేవి. ఆముక్త మాల్యద - అన్నపదం "చూడికొడుత్తాళ్"అనే తమిళపదానికి సంస్కృతానువాదం. ఆమెకే తమిళంలో ఆండాళు అని కూడా పేరు. గోదాదేవి పన్నిద్దరు ఆళ్వారులు = విష్ణుభక్తుల్లో ఒకతి. ఈ కావ్యంలో గోదాదేవి వృత్తాంతంతో పాటు ఆమె పెంపుడు తండ్రి విష్ణుచిత్తుడు ( పెరియాళ్వారు)అనే మరో ఆళ్వారు-విష్ణుభక్తుని కథ వుంది. ఇవేగాక విష్ణుపారమ్యాన్ని వైష్ణవతత్వాన్ని బోధించే ఖాండిక్య కేశధ్వజుల, యామునాచార్య, మాలదాసరి కథలు దీనిలో వున్నాయి. ఈ కావ్యంలో వస్త్వైక్యం లేదని అంటారు. కాని - గోదాదేవి రంగనాథుని వివాహమాడే కథ దీనిలో ప్రధాన కథ. దానికి ఉపకథలుగా భక్తుల కథలున్నాయి. అందరూ రంగనాథుని భక్తులే. ఈ

ప్రబంధం వైష్ణవభక్తి ప్రబోధకమైంది. తమిళంలో విష్ణుభక్తుల రచనలను "ప్రబంధము"లంటారు. విష్ణుకథలను చెప్పే ఆముక్తమాల్యదకు ప్రబంధమనే పేరు ఆ విధంగా ఏర్పడి క్రమంగా స్థిరపడి ఈ కాలంలోని మిగతా కావ్యాలకు ప్రక్రియాపరమైన పేరుగా స్థిరపడి వుంటుంది. ఈ యుగంలోని ప్రబంధాల్లో ఎక్కువగా వైష్ణవభక్తి విశిష్టాద్వైతం బోధించేయి కావడం గమనార్హం. రాయలు వివిధ వైష్ణవ గ్రంథాలనుంచి కథలను తీసుకొని వర్ణనలతో పెంచి ప్రబంధంగా రచించాడు. సందర్భం దొరికితే చాలు రాయలు సుదీర్ఘవర్ణనల్లోకి దిగుతాడు. ఆముక్తమాల్యదలోని ఋతువర్ణనలు, ప్రకృతి వర్ణనలు పురవర్ణనలు ఉద్యానవన వర్ణనలు అపూర్వమైనయి. తెలుగు కావ్యాల్లో మరెక్కడా ఇంత మనోహరమైన వర్ణనల్లేవు. గ్రీష్మవర్షాది ఋతువులను కవి దీర్ఘంగా రమ్యంగా సహజంగా వర్ణించాడు. ఇంకా ప్రబంధోచిత స్త్రీవర్ణన విరహం వివాహాది వర్ణన లెన్నో మనోజ్ఞంగా చేసాడు. రాయలు సూక్ష్మపరిశీలనా శక్తి కలవాడు. రవి గాంచనిలో కవి గాంచునని లోకోక్తి. రాయలు ఒక చక్రవర్తియై నిత్యం రాజకీయాల్లో యుద్ధాల్లో మునిగి పోయివుండి కూడా సామాన్యజనుల జీవిత విధానాలను ప్రకృతిలోని వింతలను సూక్ష్మంగా వర్ణించాడు. ఒక్కొక్క పద్యంలో అతడు వర్ణించిన దృశ్యాలను ఒక్కొక్క చిత్రపటంగా చిత్రించ వచ్చును. పశుపక్షులను కూడా చాల సూక్ష్మ పరిశీలనతో రమ్యంగా సహజంగా రాయలు చిత్రించాడు. "తలఁబక్షచ్ఛట గ్రుచ్చి బాతువులు కేదారంపుఁ గుల్యాంతర స్థలి నిద్రింపగఁ జూచి యారెకులుషస్స్నాత ప్రయాత ద్విజా, వలి పిండీకృత శాటికల్పె తదావాసంబు జేర్ప రేవుల డిగ్గన్వెసబారు వానిఁ గని నవ్వన్మాలి గోప్యోఘముల్" అంటాడు రాయలు. పొలాల నీళ్ళల్లో ముడుచుకొని కూర్చున్న బాతులు తెల్లగా ఉతికి పిండి పెట్టిన వస్త్రాల్లాగా ఉన్నవన్న ఉత్ప్రేక్ష రాయల పరిశీలనా శక్తి నుంచి పుట్టిన మౌలికమైన రమ్యమైన భావమే. అదేవిధంగా రాయలు సామాన్యుల నిత్య జీవితాన్ని వాళ్ళ ఆహారాన్ని సహజంగా వర్ణించాడు.

రాయల శైలి నారికేళ పాకంలో వుందంటారు. సంస్కృతపదాలను ఎక్కువగా వాడాడు. అతని భావప్రకటనలు క్లిష్టంగా సాగాయి. కాని

ఒకసారి భావసాక్షాత్కారం చేసుకుంటె ఆహ్లాదం కలుగుతుంది. రాయల భావాలను సాక్షాత్కారం చేసుకోవాలంటె పాఠకునికి పదజ్ఞానం వుండాలి. పదజ్ఞానంతోపాటు ఊహాశక్తి వుండాలి. నారికేళాన్ని ఎత్తైన చెట్టునుంచి దింపి పీచుతీసి గట్టి పెంకును పగులగొడ్తే చల్లని తియ్యని రసం తియ్యని కొబ్బరి దొరుకుతుంది. రాయల కవిత్వం అటువంటిదే. రాయల కవిత్వం అక్కడక్కడ అతిప్రసన్నంగా నడిచిన సందర్భాలు కూడా వున్నాయి. ఒక్కొక్క పద్యాన్ని రాయలు అతిప్రయత్నంతో నగిషీలు చెక్కి రచించాడు. అతనిది అనితరలభ్యమైన అసాధారణశైలి.

రాయలు పరమవైష్ణవుడు. వైష్ణవగాథలను తెలిసినవాడు. అందుకే ఆ కథలను చక్కగా ఎన్నుకొని ఈ కావ్యం వ్రాసాడు. యామునాచార్యుల వృత్తాంతంలో రాయలు తన రాజనీతి వైశాద్యాన్ని చాటాడు. స్వయంగా పరిపాలనానుభవంతో రాజనీతిని వ్రాసిన మరో కవి తిక్కన. రాయలు చక్రవర్తి అయితే. తిక్కన ఒక రాజు దగ్గర మంత్రిగా వున్నాడు.

## పెద్దన

పెద్దన రాయలకు కృతినంకితంగా ఇచ్చినకవి. రాయల ఆస్థానంలో పెద్దన (క్రీ.శ 1470-1540) పెద్దగానే చూడబడినాడు. రాయలకు హితుడు సన్నిహితుడుగా వుండేవాడు. రాయలు "హితుడవు" అని పెద్దనను గురించి స్వయంగా చెప్పాడు. "ఎదురైనచో తన మదకరీంద్రము డిగ్గి, కేలూత యొసగి యెక్కించుకొనియె." అని రాయల మరణానంతరం పెద్దన జీవించివుండి చాటువులో చెప్పాడు. వీర నరసింహుడు మరణిస్తూ మంత్రి తిమ్మరుసును బాలుడైన తన కొడుకును రాజు వేయమని కృష్ణదేవరాయల కనుగుడ్లు తీయింపమని ఆదేశించాడు. తిమ్మరుసు శ్రీకృష్ణదేవరాయులను దాచిపెట్టి మేక కనుగుడ్లను రాజుకు చూపించాడు. రాజు మరణం తర్వాత రాయలను తిమ్మరుసు రాజును చేసాడని న్యూనిజ్ వ్రాతలవల్ల తెలుస్తుందని చారిత్రకులంటున్నారు. రాయలు అజ్ఞాతంలో వున్నప్పుడే పెద్దన అతనికి పరిచయమై వుంటాడు. అతని పరిచయంతోనే పెద్దన సాముగరిడీలు యుద్ధతంత్రం వేటలంటె అభిమానం అభిరుచి ప్రవేశాలను

సంపాదించి వుంటాడు. అందుకే వాళ్ళిద్దరి మధ్య సన్నిహితత్వం,గాఢస్నేహం ఏర్పడివుంటుంది. రాయలు పెద్దనను "ఆంధ్రకవితా పితామహ అల్లసాని పెద్దనార్య" అని నోరారా పిలిచేవాడట.

పెద్దన ఆంధ్రకవితా పితామహుడు. అంటె ప్రబంధ ప్రక్రియకు పితామహుడు - అంటె బ్రహ్మ అని అర్థం చెప్పుకోవాలి. పెద్దన మనుచరిత్ర ప్రబంధం అతి ప్రసిద్ధమైంది. మనుచరిత్ర కన్నా ముందు పెద్దన హరికథాసారాన్ని వ్రాసి తన గురువు శఠకోపయతికి అంకితమిచ్చాడు. ఈకృతి అలభ్యం. పెద్దన నందవరీకబ్రాహ్మణుడు. నందవరీకులు చౌడీశ్వరి భక్తులు. శ్రీకృష్ణదేవరాయల ప్రభావంతోనోయేమో పెద్దన వైష్ణవాన్ని స్వీకరించాడు. అతని వైష్ణవగురువు శఠకోపయతి కావచ్చును.

పెద్దన మను చరిత్రకు అతడు పెట్టిన పేరు స్వారోచిష మనుసంభవం. కాని ఎందుకో మనుచరిత్ర అన్న పేరే వ్యాప్తిలో వుంది. మార్కండేయ పురాణంలోని స్వారోచిషమను సంభవ వృత్తాంతాన్ని తీసుకొని కావ్య వర్ణనలతో సంభాషణలు పాత్రచిత్రణాశిల్పంతో పెంచి పెద్దన ప్రబంధంగా రచించాడు.

పెద్దన మనుచరిత్ర ప్రవరుని వృత్తాంతంతో ఆరంభమౌతుంది. క్రమంగా ప్రవరవరూథినుల, స్వరోచి మనోరమల వృత్తాంతాలున్నాయి. స్వరోచికి స్వారోచిషుడు పుట్టి తపస్సు చేయడంతో ప్రబంధం ముగుస్తుంది. మనుచరిత్రలో వేరు వేరు కథలున్నాయేగాని వస్త్వైక్యం లేదని కొందరు విమర్శకులు తలంచారు. కాని ఘనుచరిత్రలో ఇతివృత్తం మొదటనుంచి స్వారోచిష మనుసంభవం అనే ఫలాగమం వైపు కథను కవి నడిపించి వస్త్వైక్యతను సాధించాడు. మనుచరిత్రలో మొదటి రెండు ఆశ్వాసాల్లో ప్రవరుని శీల వర్ణన సిద్ధుని రాక ప్రవరుడు సిద్ధుడిచ్చిన లేపసహాయంతో హిమాలయాలకు వెళ్ళడం హిమాలయాల వర్ణన వరూథిని వర్ణన ప్రవరవరూథినుల సమాగమం-మొదలయిన ఘట్టాలను అతిమనోహరంగా రసవత్తరంగా పెద్దన వర్ణించాడు. ఆ తర్వాత స్వరోచి వేటను వివాహాదులను సహజంగా రమ్యంగా వర్ణించాడు. ప్రవర సిద్ధుల, ప్రవర వరూథినుల సంవాద ఘట్టాలను పెద్దన

చక్కగా ప్రస్తుతీకరించాడు. ప్రవరవరూథినుల సంవాదఘట్టంలో కవి శృంగార శాంతరసాల ఘర్షణను శాంతానికి విజయాన్ని చిత్రించాడు. ఆ తర్వాత ప్రబంధంలో శృంగారవీరరసాలు కరుణ బీభత్సాదులు కొంత వరకు ప్రాధాన్యాన్ని వహించాయి. వరూథిని గంధర్వుని వల్ల గర్భం ధరించినా ప్రవరుని వల్లనే గర్భమైందనుకొని ఆమె అతన్నే స్మరిస్తుంది. దాంతో ప్రవరుని శాంత తేజస్సులు స్వరోచిలో స్వరోచి నుంచి స్వారోచిషునిలో ప్రవేశించాయి. చివరకు స్వారోచిషుని తపస్సుతో శాంతరసస్ఫూర్తితో పెద్దన ప్రబంధాన్ని ముగించాడు. స్వరోచి వేట రాక్షసునితో యుద్ధం ఘట్టంలో వీరరస స్ఫూర్తి వుంది. వేట యుద్ధాలను పెద్దన అపూర్వంగా అనితరసాధ్యంగా సహజంగా వర్ణించాడు. ఆ రెండు ఘట్టాలు అతని స్వానుభవాలను ప్రతిబింబింప జేస్తున్నాయి. పెద్దనకు సాముగరిడీల్లోను ఆయుర్వేదంలోను ప్రవేశముంది. సంగీత అశ్వశాస్త్రాలతో అతనికి పరిచయముంది. పెద్దన సూర్యోదయ సూర్యాస్తమయ చంద్రోదయాది వర్ణనలను మౌలికమైన చమత్కారంతో కూడిన అలంకారయుక్తమైన భావాలతో రచించాడు. పెద్దన పాత్ర చిత్రణలో సంభాషణల రచనలోను ప్రవీణుడు. ప్రతిపాత్రను సజీవంగా చిత్రించాడు. సంభాషణలను అతిసహజంగా పాత్రోచిత వాగ్వైచిత్రితో వ్రాసాడు. పెద్దన శైలీభావాలు అతి ప్రసన్నంగా వైదర్భరీతిలో నడిచాయి. పెద్దన కవిత్వం శిరీషకుసుమపేశలమని రాయలే స్వయంగా పొగిడాడు. పెద్దన కవిత్వం అనుప్రాసాద్యలంకారాలతో మధురంగా లలితంగా సాగింది. ఉపమ ఉత్ప్రేక్షరూపకాలను ఎక్కువగా వాడాడు. శ్లేష అతనికిష్టమైన అలంకారం కాదు. స్వభావోక్తి అంటె అతనికభిమానం.

పెద్దన శృంగార కరుణరసఘట్టాల్లో అతిసుకుమార శైలిని వేట యుద్ధ వర్ణనల్లో పరుషాక్షర భరితమైన శైలిని వాడి రసస్ఫూర్తిని కలిగించాడు. పెద్దన "అల్లిక జిగిబిగి" అని ప్రసిద్ధి. పెద్దన కవిత్వంలో మృదుపదాలు, కాంతి, పదవినియమాన్ని సహించని గుణాలున్నాయని అర్థం. పెద్దన కవిత్వానికి మెచ్చి రాయలు స్వయంగా గండపెండేరం తొడగి గౌరవించాడట. పెద్దన కథాకథనం పాత్రల చిత్రణలు సంభాషణలు వర్ణనలు తర్వాత కవులకాదర్శమైనాయి.

# ముక్కు తిమ్మన

నంది తిమ్మనకే ముక్కుతిమ్మన అని పేరు. శ్రీకృష్ణదేవరాయల ఆస్థానంలో తిమ్మన్న అని ప్రసిద్ధ కన్నడకవి వున్నాడు. అతడు కన్నడంలో కుమారవ్యాసుని భారతాన్ని పూరించి ప్రసిద్ధుడైనాడు. కుమార వ్యాసుడు తన భారతానికి "కర్ణాట భారత కథామంజరి" అని పేరు పెట్టగా తిమ్మన్న కృష్ణదేవరాయల పేరు మీద తన భారతభాగానికి "కృష్ణరాయభారత కథా మంజరి" అని పేరు పెట్టాడు. అతనికి "కవికుల సార్వభౌమ" అనే బిరుదముందట. కన్నడ కవి తిమ్మన్నను తెలుగుకవి తిమ్మన్నను వేరు చేయడానికి తెలుగు తిమ్మన్నకు ముక్కుతిమ్మన అనే పేరు ఏర్పడింది. అతనికి ముక్కు పెద్దగా వుండడం చేత ఆ పేరు ఏర్పడిందంటారు. మరో ఐతిహ్యం ప్రకారం అతడు ముక్కు మీద "నానాసూన వితాన వాసనల....." అనే అందమైన పద్యాన్ని చెప్పాడని అందుకే ఆ పేరు ఏర్పడిందని అంటారు. ఆ పద్యాన్ని రామరాజభూషణుడు తన వసుచరిత్రలో చేర్చు కున్నాడని అంటారు. తిమ్మన నందిమల్లయ ఘంటసింగయ జంటకవుల్లో ఘంట సింగయకు మేనల్లుడు.

తిమ్మన పారిజాతాపహరణమనే ప్రబంధాన్ని వ్రాసి శ్రీకృష్ణదేవరాయల కంకితంగా ఇచ్చాడు. ఆ రాజు కంకితంగా ఇయ్యబడిన కావ్యాల్లో ఇది మూడోది. తిమ్మన కన్నా పూర్వం పెద్దన అంతకన్నా పూర్వం పుత్తేటి రామభద్రకవి రాయలకు కావ్యాలనంకితంగా ఇచ్చారు. మనుచరిత్రలో లాగా రాయలు కర్పూరతాంబూలాదులనిచ్చి కృతిని రచించి అంకితంగా ఇయ్యమని అడగకపోవడం ఈ కావ్యంలో వింతగా కన్పిస్తున్నది. సామాన్యంగా కావ్యపీఠికల్లో కృతి భర్త అర్థించడం వుంటుంది. ఏదో సందర్భంలో రాయలు రాణి తిరుమల దేవి మీద అలిగాడని ఈ కావ్యాన్ని వినిపించి ఆ అలుకను పోగొట్టి ఇద్దరిని కలిపాడని ఐతిహ్యం. ఇది ఎంతవరకు నిజమో చెప్పలేము. కాని తిమ్మన కృష్ణునికి కృష్ణదేవరాయలకు సత్యభామకు తిరుమలదేవికి సామ్యాన్ని కల్పిస్తూ చిత్రించాడని సహృదయుల అభిప్రాయం. మూలంలో ఎక్కడా సత్యభామ శ్రీకృష్ణుని తలను కాలితో తొలగతోసినట్లుగా లేదు. ఆ

కల్పనను కవి రాయల అలుకను పోగొట్టడానికే చేసాడని అంటారు. తిమ్మన తిరుమలదేవి అరణపుకవి అంటారు. మొత్తం మీద అంతఃపురాల్లోని సవతుల అసూయను కవి బాగా తెలిసినవాడు. అందుకే కవి తన కావ్యంలో దాన్ని సహజంగా చిత్రించాడు.

పారిజాతాపహరణం పీఠికలో వ్రాయబడిన రాయల విజయపరంపరల వర్ణనలను పరిశీలిస్తే మనుచరిత్ర కన్నా పూర్వమే దీని రచన జరిగిందని తెలుస్తున్నది. కాని రెండు ప్రబంధాలు కళింగ విజయానంతరమే రాయల కంకితంగా ఇంచుమించు ఏకకాలంలో ఇయ్యబడి వుంటాయి. కళింగ విజయం క్రీ.శ. 1518లో జరిగింది. దీన్ని బట్టి క్రీ.శ. 1518 కి పూర్వమే మనుచరిత్ర పారిజాతాహరణాల రచన జరిగిందని కొంచెం తర్వాత ఆముక్తమాల్యద రచింపబడిందని చెప్పవచ్చును.

సంస్కృతంలో పారిజాతాపహరణ వృత్తాంతం హరివంశంలో వుంది. ఆ కథ అనేక కావ్యాలుగా కూడా రచింపబడింది. తిమ్మన కథలో కొద్ది మార్పులను చేసి ప్రబంధ వర్ణనలను చేర్చి తెలుగులో రచించాడు. తిమ్మన చక్కని నాటక శిల్పంతో రచించాడు. పాత్రోచితమైన సంభాషణలను కవి రచించాడు. సత్యభామ, కృష్ణుడు నారదుడు పాత్రలను సహజంగా చిత్రించాడు. "ముక్కు తిమ్మనార్యు ముద్దు పలుకు" అని లోకంలో ప్రసిద్ధి, నిజంగానే తిమ్మన శైలి ముద్దలొలికే శైలి. లలిత మధురంగా ప్రసన్నంగా వుంటుంది. శృంగార భావాలను మృదుమధురంగా చెప్పడంలో కవి ప్రవీణుడు ప్రకృతి వర్ణనలను రమ్యంగా చేసాడు. ప్రతి సన్నివేశాన్ని కవి నాటకంలోని దృశ్యంలాగా కనులకు కట్టేటట్లుగా వర్ణించాడు. కృష్ణునికి ఇంద్రునితో జరిగిన యుద్ధవర్ణనలో కవి వీరరసాన్ని పోషించాడు. తిమ్మన వాణీ విలాసమనే కావ్యాన్ని రచించాడని తెలుస్తున్నది. కాని అది అలభ్యం.

## ధూర్జటి

ధూర్జటి శివభక్తుడు. పరమవైష్ణవుడైన శ్రీకృష్ణ దేవరాయల ఆస్థానంలో శైవకవి వుండడం రాయల మత సహనానికి తార్కాణమని అంటారు.

కాని ధూర్జటి శివున్ని ఆరాధించినా అతని సిద్ధాంతాలు విశిష్టాద్వైతానికి చెందినయి. ఆ కాలంలో విష్ణువుని ఆరాధ్యదేవతగానే కాక శివున్ని ఆరాధ్య దేవతగా చేసుకొని విశిష్టాద్వైతం ప్రబలింది. అదే ధూర్జటి కావ్యాల్లో చిత్రింపబడిన భక్తితత్త్వం.

ధూర్జటి తన కృతుల్లో దేనిని రాయలకంకితంగా ఇయ్యలేదు.కాని ధూర్జటి రాయల ఆస్థానంలో వున్నాడని అతని కొడుకు లింగరాజకవి వ్రాసిన పెదకాళహస్తి మాహాత్మ్యం, మనుమడు కుమారధూర్జటి వ్రాసిన కృష్ణరాయ విజయాన్ని బట్టి తెలుస్తున్నది. రాయలు ధూర్జటి కవిత్వాన్ని-"స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటి పల్కులకేల కల్గెనీ యతులిత మాధురీమహిమ" అని ప్రశంసించాడట. ధూర్జటి కాళహస్తిమాహాత్మ్యం అనే ప్రబంధాన్ని కాళహస్తీశ్వర శతకాన్ని వ్రాసాడు.ధూర్జటి తన ప్రబంధాన్ని కాళహస్తీశ్వరునికి అంకితంగా ఇచ్చాడు. కాళహస్తీశ్వరుడైన శివుని మాహాత్మ్యాలు చెప్పే కథలు దీనిలో వున్నాయి. స్కాందపురాణం నుంచి కవి ఇతివృత్తాన్ని తీసుకొని వర్ణనలతో పెంచి వ్రాసాడు. కాళహస్తికి దక్షిణ కైలాసమని పేరు. సాలెపురుగు, పాము, ఏనుగు-మూడు శివభక్తిచేత తరించిన కథ, తిన్నని కథ, నత్కీరుని కథ దీనిలో వున్నాయి. జంతుకీటకాల భక్తిని ఒక ఆటవికుడైన తిన్నని మూఢభక్తిని నత్కీరుని గర్వభంగాన్ని శివభక్తిని ధూర్జటి రమ్యంగా రచించాడు. అతని శైలి ప్రౌఢరమ్యమైంది. పద్యాలు ధారాళంగా నడిచాయి. భక్తిని అంగిరసంగాను శృంగారవీరశాంత రసాదులను అంగరసాలుగాను పోషించాడు. తిన్నని కథలో శబరుల జీవితాన్ని, మధురలో ఏర్పడిన దుర్భిక్షాన్ని కవి సహజంగావర్ణించాడు. తిన్నడు నత్కీర పాత్రలను ధూర్జటి సహజంగా చిత్రించాడు. ఈ కావ్యంలో కాళహస్తీశ్వరుని మాహాత్మ్యం అనే వస్త్వైక్యత పాటించబడింది.

ధూర్జటి మొదట వేశ్యాలోలుడని తర్వాత శివభక్తుడైనాడని అంటారు. ధూర్జటి తిక్కన లాగానే కవిత్వాన్ని ఒక దివ్యకళగా ఈశ్వరారాధనకు వినియోగింపదగిందిగా భావించాడు. అతడు రాజాశ్రయంలో వుండి కూడా తన కావ్యాన్ని ఈశ్వరునికే అంకితమిచ్చిన భక్తుడు. ధూర్జటి వ్యక్తిత్వం భక్తి

కాళహస్తీశ్వరశతకంలో బాగా ప్రతిబింబించింది. దీని రచనా కాలంనాటికి ధూర్జటి విరాగిగా కన్పిస్తాడు. ఆత్మాశ్రయ కవిత్వానికి ధూర్జటి శతకం మంచి ఉదాహరణ. భావావేగంతో కవి దీన్ని రచించాడు.

## పింగళి సూరన

పింగళి సూరన శ్రీకృష్ణదేవరాయ ఆస్థానంలోని అష్టదిగ్గజకవుల్లో ఒక డని అంటారు. కాని అతని కావ్యాన్ని అంకితంగా పొందిన నంద్యాల కృష్ణరాజు శ్రీకృష్ణదేవరాయల తర్వాత కాలంలో క్రీ.శ 1560 ప్రాంతంలో వున్నాడు. పింగళి సూరన కాలంకూడా అదే. రాయల కాలంలో ఆకవి యవ్వనారంభదశలో వుండివుంటాడు.

పింగళి సూరన ప్రతిభాశాలియైన కవి అని విమర్శకుల అభిప్రాయం. సూరన మొదటి రచన గరుడపురాణం. కాని అది దొరకలేదు. సూరన రెండో రచన రాఘవపాండవీయం అది ద్వ్యర్థి కావ్యం. దానిలో రాముని కథ పాండవుల కథ అంటె రామాయణమహాభారత కథలు రెండూ శ్లేషసహాయంతో జోడింపబడినాయి. ఇటువంటి ద్వ్యర్థి కావ్యాల రచన సంస్కృతంలో క్రీ.శ 10వ శతాబ్దంనుంచి ఆరంభమైంది. తెలుగులో భీమన ఒక రాఘవపాండవీయమనే ద్వ్యర్థికావ్యాన్ని వ్రాసాడని పెద్దలంటారు. కాని దాన్నెవరూ చూడలేదని, తన కావ్యమే తెలుగులో మొదటి ద్వ్యర్థి కావ్యమని పింగళిసూరన ఆకావ్య పీఠికలో చెప్పాడు. ఆ కావ్యాన్ని కవి ఆకువీటి పెదవెంకటాద్రి ప్రేరణతో వ్రాసి పంపవిరూపాక్షునికి అంకితమిచ్చాడు. సందర్భానుకూలంగా కథాకథనంలో సూరన వర్ణనలను కూడా చేర్చాడు. శ్లేషలో సభంగ అభంగ-రెండు రకాల శ్లేషను వాడాడు.

సూరన మూడో రచన-కళాపూర్ణోదయం. ఇది కల్పిత కథతో కూడిన కావ్యం. 8 ఆశ్వాసాలున్నాయి. పింగళి సూరన "సకల లక్షణ లక్షితంబైన మహాప్రబంధంబు కీర్తి కారణ " మని దీన్ని ప్రబంధంగానే పేర్కొన్నాడు. కాని దీనిలో కథ కల్పితం కాబట్టి దీన్ని "కథ" ప్రక్రియకు చెందిన చంపూకావ్య

మనడమే సమంజసం. తన కావ్యం అపూర్వ కథాసంవిధాన వైచిత్రితో శృంగారరసంతో కూడిందని సూరన చెప్పుకున్నాడు. కళాపూర్ణోదయంలో కవి అద్భుతమైన కథాకల్పనాశక్తిని కథానిర్మాణకౌశలాన్ని ప్రదర్శించాడు. కథను ఆరంభం నుంచి కాక మధ్యలో ఆరంభించి వెనుకకు పోయి "ఫ్లాష్‌బ్యాక్" లో లాగా కథను నడిపాడు. ఈనాటి నవల ప్రక్రియలో ఇట్లాంటి కథాకథన పద్ధతి కన్పిస్తుంది. సంస్కృత కాదంబర్యాది"కథ"కావ్యాల్లోను ఇటువంటి కథన చాతుర్యం వుంది. కళాపూర్ణోదయంలోని కలభాషిణి వృత్తాంతం రంభా నలకూబరుల కథ సుగాత్రీశాలీనుల కథలు రమణీయంగా వున్నాయి. సూరన సజీవ పాత్రచిత్రణను చేసాడు. సంభాషణా శైలి సహజంగా వుంది. సందర్భోచితంగా వర్ణనలున్నాయి. ఆధునిక కాలంలో కట్టమంచి రామలింగారెడ్డి వంటి సహృదయుల మెప్పును పొందిన అపూర్వ కావ్యమిది.

సూరన చివరి రచన ప్రభావతీప్రద్యుమ్నం. ఇది 5 ఆశ్వాసాల మను చరిత్రాదుల కోవకు చెందిన ప్రబంధం. దీన్ని కవి తన తండ్రికి అంకితంగా ఇచ్చాడు. హరివంశంలోని ప్రభావతీప్రద్యుమ్నకథను తీసుకొని సూరన వర్ణనలతో పాత్రచిత్రణలతో సంభాషణలతో భూషించి రచించాడు. హరివంశంలోని ఉషాఅనిరుద్ధుల కథను తీసుకొని సూరన ఈ కథను వ్రాసాడని కొందరి అభిప్రాయం. రెండు కథల్లో పోలికలుండడమే దానికి కారణం.రెండు కథలు హరివంశంలో వున్నాయి. ఎర్రన హరివంశాన్ని అనువదిస్తూ రెండు కథలు ఒక లాగా వుండడం వల్లనేమో ఉషా అనిరుద్ధుల కథమాత్రమే అనువదించాడు. నాచన సోమన కూడా కొన్ని కథలనే తీసుకొని అనువదిస్తూ ఉషా అనిరుద్ధుల కథనే అనువదించాడు. సంస్కృతంలో కేరళరాజకవి రవివర్మ (క్రీ.శ 12వ శ.) "ప్రద్యుమ్నాభ్యుదయ" మనే నాటకాన్ని వ్రాసాడు.హరివంశంలో లేని చిత్రపట వృత్తాంతాన్ని సూరన ఆ నాటకంనుంచి తీసుకున్నాడని పింగళి లక్ష్మీకాంతం గారన్నారు.

సూరన మూలకథలో కొన్ని మార్పులు చేసి ప్రభావతీప్రద్యుమ్నకావ్యాన్ని వ్రాసాడు. ప్రద్యుమ్నుడు శ్రీకృష్ణుని కొడుకు. అనిరుద్ధుని తండ్రి. ప్రభా

వతి వజ్రనాభుడనే రాక్షసరాజు కూతురు. ప్రద్యుమ్నుడామెను ప్రేమించి పెండ్లాడే కథ దీనిలో వుంది. వాళ్ళిద్దరి నడుమ రాయబారం నడిపింది ఆడ హంస శుచిముఖి. సూరన అపూర్వ ప్రతిభతో శుచిముఖి పాత్రను చిత్రించాడు. మూలకథలో శుచిముఖికి ప్రత్యేకత లేదు. కాని సూరన శుచిముఖి కేవలం రాయబారం నడపిన పక్షికాదు. కార్యాన్ని సాధించిన మంత్రి. లోకజ్ఞత రాజనీతిజ్ఞత వాక్ప్రౌఢిమ కలది. అది బుద్ధికుశలతతో మానవులను దేవతలను మించింది. శుచిముఖి బ్రహ్మరథ వాహనుడైన సారంధరుని కూతురు. దాన్ని భారతీదేవి పెంచి పెద్ద చేసింది. దాని కవిత్వానికి మెచ్చి ఆమె "ఉపమాతిశయోక్తి కామధేనువు" అనే బిరుదాన్నిచ్చి కాలికి అందెను తొడిగింది. శుచిముఖి తన ప్రతిభతో వజ్రనాభుని చంపించి ప్రభావతీ ప్రద్యుమ్నుల వివాహం చేసింది. నైషధం లోని హంసకన్నా శుచిముఖి గొప్ప చాతుర్యం కలది.

సూరన ప్రభావతీప్రద్యుమ్నంలో కళాపూర్ణోదయంలోను చక్కని నాటక శిల్పాన్ని చూపాడు. సన్నివేశకల్పనలు, సంభాషణలు, సజీవపాత్రచిత్రణలు నాటకశిల్పాన్ని చక్కగా పోషించాయి. ప్రభావతీప్రద్యుమ్నంలో నాటకప్రద ర్శన ప్రసక్తి కూడా వుంది. ప్రద్యుమ్నుడు సూత్రధారియై "గంగావతరణ" నాటకాన్ని పదర్శిస్తాడు.ఆ సందర్భంలో సూరన తన సంగీత శాస్త్ర పాండి త్యాన్ని ప్రదర్శించాడు. ప్రద్యుమ్నుడు వాహ్యాళికి పోయినప్పుడు అతడు అశ్వాన్ని నడపడాన్ని వర్ణిస్తూ సూరన తన అశ్వశాస్త్ర పరిచయాన్ని చూపించాడు. సూరన శైలి లలిత మధురంగా వర్ణనలతో అలంకారరచనలో రమ్యంగా వుంది. శృంగారరస పోషణను సూరన చక్కగా చేసాడు.

## తెనాలి రామకృష్ణుడు

తెనాలి రామకృష్ణుడు (క్రీ.శ 1485-1575) శ్రీకృష్ణదేవరాయల ఆస్థా నంలో వుండేవాడని హాస్యకథల్లోని తెనాలి రామలింగడు ఇతడే అని కొందరి అభిప్రాయం. ఈ కవి మొదట రామలింగడని, శైవుడని తర్వాత అతడు వైష్ణవాన్ని స్వీకరించి రామకృష్ణుడు అయ్యాడని అంటారు. శైవుడుగా

వున్నప్పుడు ఆ కవి ఉద్భటారాధ్యచరిత్ర వ్రాసాడని వేటూరి ప్రభాకర శాస్త్రి గారి అభిప్రాయం. తెనాలి రామకృష్ణుడు వ్రాసిన ప్రసిద్ధప్రబంధం పాండురంగమాహాత్మ్యం. అతని మరో రచన ఘటికాచలమాహాత్మ్యం.ఈ కవి శివున్ని ద్వేషించేంత వైష్ణవుడేం గాదు. పాండురంగ మాహాత్మ్యంలో శివుడే ఆ కథలను చెప్పినట్లుగా కవి కూర్చాడు. శివస్తుతిని కూడా చేసాడు. కాబట్టి రామలింగ రామకృష్ణకవులు ఒక్కరే అనే వాదంలో సత్యముండ వచ్చును. పింగళి సూరన వలెనే రామకృష్ణుడు యవ్వనారంభదశలో రాయల ఆస్థానంలో వుండ వచ్చును. రామకృష్ణకవి పాండురంగ మాహాత్మ్యాన్ని విరూరి వేదాద్రికి అంకితంగా ఇచ్చాడు. కృతి భర్త కవిని "శారద నీ రూపము" అని "మహిన్ మహేంద్ర కవితావిద్యాబలప్రౌఢి నీ కెదురేరి-" అని ప్రశంసించాడు. ఈ కవికి "కుమారభారతి" అనే బిరుదముంది. రామలింగకవి కృతమని చెప్పబడే ఉద్భటారాధ్యచరిత్ర 3 ఆశ్వాసాల కావ్యం. పాల్కురికి సోమన బసవపురాణంలో 7వ ఆశ్వాసంలో వున్న ఉద్భటుని కథను తీసుకొని కవి పెంచి ఈ కావ్యాన్ని వ్రాసాడు. దీన్ని శివభక్తుడైన ఊరదేచమంత్రికి అంకితంగా ఇచ్చాడు. రామలింగకవి కందర్ప కేతువిలాసం అనే కృతి వ్రాసాడని పద్యసంకలన గ్రంథాల్లో పద్యాలుదాహరింపబడినాయి. కాని అది దొరక లేదు.

రామకృష్ణుని పాండురంగమాహాత్మ్యంలో పాండురంగ క్షేత్రమాహాత్మ్యాన్ని చెప్పే కథలున్నాయి. ఇది 5 ఆశ్వాసాల ప్రబంధం. కవి స్కాందపురాణం వుంచి కథలను తీసుకొని పెంచాడు. దీనిలో పుండరీకుని కథ, నిగమశర్మోపాఖ్యానం, శ్రీకృష్ణావతార చరిత్ర, శ్రీరాధాచరిత్ర, సుశీల కథ, కాకి హంస పాము చిలుక తేనెటీగలు మోక్షం పొందిన కథ, సుశర్మోపాఖ్యానం, ధర్మరాజు తమ్ములతో పాండురంగ క్షేత్రాన్ని దర్శించిన వృత్తాంతం వున్నాయి.ఈ కథలన్నిటిని కవి ప్రౌఢశైలిలో చెప్పాడు. వీటిల్లో నిగమశర్మ, సుశీల కథలు సహజ వర్ణనలతో రక్తి కట్టే విధంగా వున్నాయి. పాత్రల చిత్రణ సహజంగా వుంది. ఇది భక్తిరసభరితమైన ప్రబంధం.

రామకృష్ణుని పదగుంఫనం ప్రసిద్ధమైంది. శ్రీనాథుని వలెనే ఈ కవి

పదాడంబరాన్ని ప్రదర్శించాడు. సంస్కృత తెలుగుపదాలను రమ్యంగా కూర్చడమే పదగుంఫనం. అక్కడక్కడ రామకృష్ణకవి కవిత్వం జటిలంగా వున్నా మొత్తం మీద అతని కవిత్వం గంభీరంగా మధురంగావుంది. అతని పద్యాలు ధారాళంగా వున్నాయి. నిగమశర్మోపాఖ్యానం శ్రీనాథుని కాశీఖండంలోని గుణనిధి కథను పోలివుంది. రామకృష్ణకవి సందర్భానుకూలంగా సమకాలిక సాంఘికజీవితాన్ని ప్రతిబింబింప జేసాడు. మౌలికమైన భావాలు అలంకారాలు అతని కవిత్వంలో వున్నాయి.

రామకృష్ణుని ఘటికాచలమాహాత్మ్యం 3 ఆశ్వాసాల కావ్యం. దీని అవతారికను పూర్తిగా వ్రాయకముందే రామకృష్ణకవి మరణించగా అతని మనుమడు దాన్ని పూర్తిచేసి ఖండోజి అనే మహారాష్ట్ర రాజుకు అంకితమిచ్చాడు. దీనిలో రామకృష్ణకవి రచన ప్రౌఢంగా లేదు. రామకృష్ణకవి హరివిలాసం రచించాడని తెలుస్తున్నది. కాని అది అలభ్యం. ఇంకా అతడు లింగపురాణం, ఆదిపురాణం, ఒక శతకాన్ని వ్రాసాడని లోకంలో వ్యాప్తిలో వుంది. కాని అవేవి దొరక లేదు.

## రామరాజభూషణుడు

రామరాజభూషణుని అసలు పేరు బట్టుమూర్తి. ఈకవి శ్రీకృష్ణదేవరాయల అల్లుడు అళియరామరాయల (క్రీ.శ 1542- 1564) మేనల్లుడైన ఓబయ నరసరాజు (క్రీ.శ 1557 ప్రాంతం) ఆదరణలో వుండి కావ్యాలంకార సంగ్రహం వ్రాసి అతని కంకితంగా ఇచ్చాడు. ఇది అలంకారశాస్త్ర గ్రంథం. దీనికి నరసరాజీయమనే పేరుంది. నరసరాజు తొరగంటి దుర్గపాలకుడు.

మూర్తికవి సంస్కృతంలోని విద్యానాథుని ప్రతాపరుద్రీయాన్ని అనుసరిస్తూ నరసరాజీయాన్ని రచించాడు. విద్యానాథుడు లక్ష్యశ్లోకాలను రెండోప్రతాపరుద్రుని వర్ణిస్తూ చెప్పగా మూర్తి కవి నరసరాజును వర్ణిస్తూ విద్యానాథుని భావసంపదనే తీసుకొని రచించాడు. తెలుగులో వ్రాయబడిన అలంకార శాస్త్రగ్రంథాల్లో ఇది ఉత్తమమైందని చెప్పవచ్చును. కాని దీనిలో మౌలికమైన

అభిప్రాయాలుగాని స్వతంత్రమైన సిద్ధాంతాలు గాని లేవు. ఆధునిక కాలంలో దీనికి సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి గారు చక్కని వ్యాఖ్యానం వ్రాసారు. ఆ వ్యాఖ్యానం చాలా విషయాలను వివరంగా చెప్తూ వున్నది. నరసభూపాలీయంలో మూర్తి కవి తన చిత్రకవితాచాతుర్యాన్ని గురించి చాటి చెప్పకున్నాడు. శతలేఖినీపద్యసంధాన ధౌరౌయుడనని, ఘటికాశత గ్రంథ కరణధుర్యుడనని ఆశుప్రబంధాన్ని చెప్పగల వాడనని చెప్పకున్నాడు.

ఓబయ నరసరాజే ఈ కవిని అళియరామరాయలకు పరిచయం చేసి వుంటాడు.అళియ రామరాజు చేత భూషింపబడి- సత్కరింపబడి ఈకవి రామరాజభూషణుడన్న బిరుదనామంతో ప్రసిద్ధి కెక్కాడు. అసలు పేరు మరుగున పడి పోయింది. ఈ కవి రామరాజుకు ఏ కృతిని అంకితంగా ఇచ్చినట్లు తెలియడం లేదు. అతన్ని గురించి బిరుదుపద్యాలను ప్రశస్తులను తప్పక చెప్పివుంటాడు. అని మనవరకు రాలేదు.

రామరాజభూషణుడు వసుచరిత్ర అనే ప్రౌఢ ప్రబంధాన్ని వ్రాసాడు. దాన్నతడు రామరాజుకే అంకితమియ్యాలను కున్నాడేమో. కాని ఇంతలో క్రీ.శ 1564 లో తళ్ళికోట యుద్ధంలో రామరాజు మరణించాడు. విజయనగర స్రామాజ్య వైభవం నశించింది. రామరాయలతమ్ముడు.తిరుమల రాయలు పెనుగొండ రాజధానిగా క్రీ.శ 1570లో పట్టాభిషేకం చేసుకొన్నాడు. జీర్ణ కర్ణాట సామ్రాజ్యాన్ని ఉద్ధరించ తలచాడు. కాని అతడు ఒక్క సంవత్సరం మాత్రమే రాజ్యం చేసాడు. ఆ కాలంలోనే రామరాజ భూషణుడు వసుచరిత్రను తిరుమలరాయలకు అంకితంగా ఇచ్చాడు.

తిరుమలుని తర్వాత అతని కొడుకు శ్రీరంగదేవరాయలు(క్రీ.శ 1572-1585) పాలించాడు. ఆ తర్వాత ఆరవీటి వంశం క్రీ.శ 1680 వరకు పెనుకొండ ప్రాంతాన్ని పాలించినా అది అంతఃకలహాలతో నిండి నిస్తేజమైంది. తిరుమలదేవరాయల మరణంతో దక్షిణ దేశంలో సామంతులైన తంజావూరు మధుర నాయక రాజులు స్వతంత్రులైనారు. రాజ్యాధికారంతో పాటు తెలుగు సాహిత్యపోషణ కవి పండితాదరణ దక్షిణ దేశాలకు తర

లిపోయింది.క్రీ.శ 1600తర్వాత ఆంధ్రదేశంలో కవిపండితులనాదరించేవారే లేకుండా పోయారు. అందుకే ఆంధ్రదేశంలో ఆ కాలంలో చెప్పుకోదగ్గ కావ్యాలు వ్రాయబడ లేదు. క్రీ.శ 17,18 శతాబ్దాల్లో కూచిమంచి తిమ్మకవి, ఏనుగు లక్ష్మణకవి, కంకంటి పాప రాజు వంటి ప్రతిభగల కవులు కొంద రున్నారు. తిమ్మకవి రసికజనమనోభిరామం వంటి ప్రబంధాలు మను, వసు చరిత్రలకు ప్రతికలుగానే వ్రాయబడినాయి.వాటిల్లో ఏమీ మౌలికత లేదు. ఇక ఆంధ్రదేశంలో వెలువడిన రచనల్లో రామరాజభూషణుని వసుచరిత్రే చివరి ప్రౌఢప్రబంధం. తెలుగు సాహిత్యంలో ఆధునిక యుగావతరణ వరకు వసుచరిత్ర రచన తర్వాత నిస్తబ్దత వ్యాపించిందనే చెప్పాలి.

రామరాజ భూషణుడు వసుచరిత్ర కథను మహాభారతం నుంచి తీసు కున్నాడు. భారతంలో ప్రసిద్ధం కాని ఉపరిచర వసువు వృత్తాంతాన్ని కవి తీసుకొని తన ప్రతిభతో పెంచి 'ఆశ్వాసాల కావ్యంగా వ్రాసాడు. నన్నయ భారతంలో వసురాజు కథ 12 పద్యగద్యాల్లో మాత్రమే వుంది. దాన్ని రామ రాజభూషణుడు 800 పద్య గద్యాలుగా విస్తరింప జేసాడు. దీనిలో ప్రధాన వస్తువు గిరికావసురాజుల ప్రేమ, వివాహం. గిరికా జన్మవృత్తాంతం ఈ ప్రబంధంలో ఒక అపూర్వఘట్టం. గిరిక తలిదండ్రులు శుక్తిమతీకోలాహలురు. శుక్తిమతి నది. కోలాహలుడు పర్వతం. కోలాహలుడు మొదటి చూపులోనే శుక్తిమతిని కాంక్షించాడు. బలాత్కారం చేసాడు. ఆ ఘట్టంలో కవి శబ్దశక్తి మూలక ధ్వనితో శుక్తిమతి కోలాహలురను నదీపర్వతాలుగానే కాక స్త్రీ పురుషులన్న భావనను కలిగించి పాఠకుల నలరించాడు. కోలాహలుడు శుక్తిమతీ నదిని అడ్డగించగా ఆ నది మొరపెట్టుకుంటుంది. ఆ మొర విని ఆ దేశాన్నేలే వసురాజు వచ్చి కాలిగోటితో పర్వతాన్ని ఎగమీటి శుక్తిమతిని రక్షిస్తాడు. శుక్తిమతి గర్భం ధరించి, గిరికను వసుపదుడనే కొడుకును కంటుంది. గిరిక వసురాజును ప్రేమిస్తుంది. వారికి ఎడబాటు కలుగుతుంది. ఆ సమయంలో మంజువాణి దౌత్యం నడుపుతుంది. తర్వాత గిరికావసురా జుల వివాహంతో కావ్యం ముగుస్తుంది. వసురాజు వర్ణనలో గిరికవర్ణనలో కవి శ్లేషమూలకధ్వని చేత వసురాజును ఇంద్రునిగాను సూర్యునిగాను గిరికను

ఒక సెలయేరుగాను భాసింపజేసాడు. గిరికాజన్మ వృత్తాంతం వసురాజు పరాక్రమవృత్తాంతంగా ఔచితీమంతంగా వుంది. వసురాజు పరాక్రమానికి మెచ్చి ఇంద్రుడు రథాన్నిస్తాడు. ఆ రథవర్ణనను కవిశ్లేషలో వర్ణించాడు. అసలు శ్లేషాలంకారం శ్లేషమూలక ధ్వనులు లేని వర్ణనలు వసుచరిత్రలో లేనే లేవు. ప్రతిపద్యంలో కవి రెండుమూడు అలంకారాలను ప్రయోగిస్తూ రచించాడు. యమక ముక్తపదగ్రస్త అనుప్రాసాది శబ్దాలంకారాలను కూడా కవి చాలా చోట్ల ప్రయోగించాడు. రామరాజభూషణుని కవిత్వం అర్థం కావాలంటె పాఠకునికి శబ్ద పరిజ్ఞానం కావాలి. అప్పు డతనికి కవిత్వం సులభంగా అర్థమై ఆనందాన్నిస్తుంది. వసుచరిత్ర కథాసంవిధాన నిర్మాణంలో కాళిదాసు శాకుంతలం, హర్షుని నాగానందం, శ్రీహర్షుని నైషధం నాటకకావ్యాల ప్రభావం కన్పిస్తున్నది. తెలుగులో మనుచరిత్రతో ఆరంభమైన ప్రబంధప్రక్రియ వసుచరిత్రలో పరాకాష్ఠ నందుకుంది. రామరాజు భూషణుడు పెద్దన శిష్యుడని ఐతిహ్యం. వసుచరిత్రకారుడు చాలాచోట్ల మనుచరిత్ర సన్నివేశాలను సంభాషణలను వర్ణనాక్రమాలను అనుసరించాడు. సంస్కృతంలో మాఘుడు భారవిని మించాలనే కవితాస్పర్థను పూని కిరాతార్జునీయాన్ని అనుకరిస్తు శిశుపాలవధను రచించాడు. రామరాజభూషణుడు కూడా అటువంటి కవితా స్పర్థతోనే మనుచరిత్రననుకరిస్తూ వసుచరిత్రను రచించాడు. వసుచరిత్రతో సరితూగగల ప్రౌఢ ప్రబంధం లేదని చెప్పవచ్చును. సంస్కృతంలో విద్వదౌషధం అనే నైషధంతో సాటి రాగల కావ్యం వసుచరిత్ర.

వసుచరిత్రలో ఇతివృత్తం ఆద్యంతం విభావానుభావాల వర్ణనలతో శృంగారరసస్ఫోరకంగా వుంది. వస్త్వైక్యతతో చక్కని కల్పనలు, సన్నివేశాలు, పాత్ర చిత్రణ, సంభాషణలు, ప్రౌఢమైన వర్ణనలతో వసుచరిత్ర సంపూర్ణ ప్రబంధ లక్షణాలు కలిగివుంది. రామరాజభూషణునికి "సాహిత్యరస పోషణ" అనే బిరుదముంది. రసహీనమైన చిన్నకథను తీసుకొని ఒక రసవంతమైన ప్రబంధాన్ని వ్రాయడంలో కవి నేర్పు చూపి సాహిత్య రసపోషణ బిరుదాన్ని సార్థకం చేసాడు. రామరాజభూషణుడు గొప్ప కవేకాక గొప్ప పండితుడు. అలంకార, సంగీత, రత్న, యోగశాస్త్రాదుల్లో తనకున్న పాండిత్య పరిచ

యాన్ని వర్ణనల్లో ప్రదర్శించాడు. నైషధంలో శ్రీహర్షుడు తన పాండిత్య జ్ఞానంతో అర్థ గ్రంథులను ప్రయోగించినట్లుగానే రామరాజభూషణుడు తన శాస్త్రపాండిత్యంతో అర్థగ్రంథులను ప్రయోగించాడు.

రామరాజభూషణుడు తన వసుచరిత్ర ప్రబంధాన్ని ఒక నాటకంగా దిద్దాడు. శాకుంతలం నాగానందం నాటకాల్లోని సన్నివేశాలననుకరించి సన్నివేశాలను అల్లడం, మంజువాణి దౌత్యాన్ని కవి వర్ణించక పాత్రచేత చెప్పించడం వల్ల వసుచరిత్రలో నాటక లక్షణాలు బాగా కన్పిస్తున్నాయి. సంభాషణలను కవి నాటకంలో లాగా రచించాడు. అందుకేనేమో వసు చరిత్ర ప్రబంధాన్ని పేరుసూరి సంస్కృతంలోకి "వసు మంగళ నాటకం" పేరుతో నాటకంగా అనువదించాడు. ఈ ప్రబంధాన్ని కాళహస్తి కవి (క్రీ.శ. 1554-1626) ఆరు ఆశ్వాసాల మహాకావ్యంగా సంస్కృతం లోకి అనువదించాడు. ప్రాచీన కాలంలోనే ఈ ప్రబంధం సంస్కృతంలోకి అనువదింపబడిన గౌరవాన్నందుకున్నది.

వసుచరిత్ర సమస్త ప్రబంధలక్షణ లక్షితమై వుంది. దీనిలో కథ పురాణ ప్రసిద్ధమైంది. కవి తీసుకున్న కథ చాల చిన్నది. కవి దాన్ని చాల పెంచాడు. అందుకే తన కావ్యేతివృత్తం మిశ్రమమని రామరాజభూషణుడు చెప్పుకున్నాడు. శృంగార రసాన్ని ప్రధానంగాను కరుణాద్భుత వీరరసాదులను అంగరసాలుగాను కవి పోషించాడు. శృంగార రసస్ఫూర్తికోసం కవి చక్కగా పాత్ర చిత్రణలను సన్నివేశ కల్పనలను చేసాడు. సందర్భానుకూలంగా పుర సూర్యోదయ సూర్యాస్తమయ చంద్రోదయ జలక్రీడలు విరహం వివాహాది ప్రబంధ వర్ణనలను కవి చేసాడు. వసుచరిత్రలో ఆశ్వాసాల విభజన నాటకాల్లోని అంకవిభజనలాగా వుంది. సన్నివేశాలు సంభాషణలు పాత్ర చిత్రణలు నాటకశిల్పాన్ని పోషిస్తున్నాయి.విభావానుభావ వర్ణనలతో కూడిన రసపోషణ వుంది.

రామరాజ భూషణుని చివరి రచన హరిశ్చంద్రనలోపాఖ్యానం. ఇది ద్వ్యర్థికావ్యం. ఈ కవి మొదట హనుమద్భక్తుడు. తర్వాత రామభక్తుడుగా

మారి ఈ కావ్యాన్ని శ్రీరాముని కంకితంగా ఇచ్చాడు. పింగళి సూరన రాఘవ పాండవీయం తర్వాత ఇది తెలుగులో రెండో ద్వ్యర్థి కావ్యం. కవి హరిశ్చంద్రనలుల కథలను జోడించాడు. అభంగ సభంగ శ్లేషలను వాడాడు. రామాయణభారత కథల్లో కొన్ని సమానఘట్టాలున్నాయి. కాబట్టి ఆ కథలను జోడించడం కష్టం కాదు. కాని హరిశ్చంద్రనలుల కథల్లో సమానఘట్టాలేవి లేవు. అందుచేత ఆ కథలను జోడించి వ్రాయడం క్లిష్టమైన పని. అయినా రామరాజభూషణుడు ఆ కథలను చక్కగా జోడించి కథను రమ్యంగా నడిపాడు. సందర్భానుకూలంగా కవి వర్ణ నలను చేసాడు. పింగళి సూరన కథ చెప్పడానికే ప్రాధాన్యాన్నిచ్చాడు. కాని రామరాజభూషణుడు కథాకథనంలో వర్ణనలు సంభాషణలు చేర్చి రచించాడు. ద్వ్యర్థికావ్యం వ్రాయాలంటె కవికి శ్లేషమీద పూర్తి అధికార ముండాలి. శ్లేషను కూర్చడంలో రామరాజభూషణుడు ప్రవీణుడు. అందుకే హరిశ్చంద్రనలోపాఖ్యానం ఉత్తమంగా వుంది.

సంస్కృత సాహిత్యంలో ద్వ్యర్థికావ్యాలు క్రీ.శ. 10వ శతాబ్దం నుంచి వ్రాయబడుతూ వున్నాయి. సంస్కృతంలో ద్వ్యర్థియేకాక త్ర్యర్థి కావ్యాలు కూడ వ్రాయబడినాయి. అంతేగాక శ్లేషతో ఐదు అర్థాలు నూరు అర్థాలు సాధించిన కావ్యాలు కూడా వున్నాయి. ఇంకా అనులోమ విలోమకావ్యాలు అంటె శ్లోకాలను పై నుంచి చదివితే ఒక కథార్థం కింది నుంచి పైకి చదివితే మరో కథార్థం వచ్చే కావ్యాలను కూడా సంస్కృత కవులు వ్రాసారు. తెలుగులో ఇటువంటి కావ్యాలన్నీ రాకున్నా ద్వ్యర్థికావ్యాలు రామరాజభూషణుని తర్వాత కూడా వ్రాయబడినాయి. ఉదా.కు కృష్ణాధ్వరి నైషధపారిజాతీయం, పిండిప్రోలు లక్ష్మణకవి లంకావిజయం, పోడూరి పెదరామామాత్యుని శివరామాభ్యుదయం, మంత్రిప్రెగడ సూర్యప్రకాశం కృష్ణార్జునచరిత్ర, వేంకటాచార్యుల అచలాత్మజాపరిణయం మొదలుయిన ద్వ్యర్థికావ్యాలు చాలానే వ్రాయబడినాయి ద్వ్యర్థిత్ర్యర్థికావ్యాలు వీరేశలింగం కాలం వరకూ వ్రాయబడినాయి. ఇవన్నీ ఇంకా పరిశోధకుల పరిశీలనలోకి రాలేదు.

రాయలయుగంలో ప్రబంధాలను వ్రాసిన కవులు ఇంకా వున్నారు. అయ్యలరాజు రామభద్రుడు రామాభ్యుదయాన్ని వ్రాసి గొబ్బూరి నరస రాజుకంకితంగా ఇచ్చాడు. ఇది రామాయణకావ్యం. సకలకథాసారసంగ్రహాన్ని వ్రాసింది ఈ కవే అని కొందరు తలంచారు. కాని ఆ కథా కావ్యాన్ని పుత్తేటి రామభద్రుడు వ్రాసాడని నిడదవోలు వేంకటరావుగారు ప్రబంధ మణిభూషణం పీఠికలో తెల్పారు. ఇది దొరుకుతున్నా ముద్రింపబడ లేదు. ఇది శ్రీకృష్ణదేవరాయల కంకితమియ్యబడింది. మాదయగారి మల్లన రాజశేఖర చరిత్ర కళాపూర్ణోదయం వలెనే "కథ" కావ్యం. ఎల్లనార్యకవికి రాధామాధవకవి అని పేరు. ఆ కవి రాధామాధవం అనే కావ్యాన్ని తారక బ్రహ్మరాజీయం, విష్ణుమాయానాటకం అనే మూడు కృతులు రచించాడు. రాధామాధవ కావ్యాన్ని శ్రీకృష్ణదేవరాయలు మెచ్చుకొని రాధామాధవకవి అని బిరుదాన్నిచ్చాడని కవి చెప్పుకున్నాడు. ఈ కావ్యాన్ని కవి మదనగోపాల దేవునికి అంకితంగా ఇచ్చాడు. ఈ యుగంలో మరో ప్రసిద్ధ కవి సంకుసాల నరసింహకవి. కవి కర్ణరసాయనమే ప్రబంధాన్ని వ్రాసి శ్రీరంగేశ్వరునికి అంకితంగా ఇచ్చాడు. ఈ కవి శ్రీకృష్ణదేవరాయలను దర్శించి తన కావ్యాన్ని వినిపించి మెప్పును పొందాలనుకున్నాడు కాని పెద్దనాది కవులు ఈర్ష్యచేత రాజదర్శనం కానియ్యలేదని చివరకు విసిగి విరాగియై కవి తన కావ్యాన్ని భగవంతునికి అర్పించి దారిద్ర్యంతో మరణించాడని ఐతిహ్యం. కవి కర్ణ రసాయనం ప్రౌఢకావ్యం. కవి దీనిలో మాంధాతచరిత్రను రచించాడు. ఈ కవి వైష్ణవుడు. రాగి విరాగి, విరాగి రాగి అయ్యేటట్లుగా కవి ఈ కావ్యాన్ని రచించినట్లుగా చెప్పుకున్నాడు. రాయల యుగంలో మరోకవి - కందుకూరి రుద్రకవి. కృష్ణదేవరాయల ఆస్థానంలోని అష్టదిగ్గజకవుల్లో ఒకడని ప్రసిద్ధి. ఈ కవి సుగ్రీవవిజయం అనే యక్షగాన కావ్యాన్ని వ్రాసాడు. ఇదే తెలుగులో మొదటి యక్షగానమని ప్రతీతి. రుద్రకవి మరో కావ్యం నిరంకుశోపాఖ్యానం. ఇది చిన్న కావ్యం. దీనిలో నిరంకుశుమని కథ వుంది. గుణనిధి, నిగమశర్మకు సోదరుని వంటివాడు నిరంకుశుడు.

రాయల యుగంలో యక్షగానం, పురాణం, కథాకావ్యాల వంటి ఎన్నో

ప్రక్రియలు వెలిసినా ఈ యుగంలో ప్రముఖంగా వ్రాయబడినయి ప్రబంధాలు. రాయలకు సమకాలికులైన కవులు కొద్దిగా తర్వాత వున్న కవులు ప్రబంధాలను రచించి తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నం చేసారు. శ్రీకృష్ణదేవరాయల భువనవిజయం అనే సభలో అష్టదిగ్గజాల పేరుతో ఎనిమిది మంది కవులు ఎనిమిది దిక్కుల సింహాసనాలనలంకరించి వుండే వారని ఆంధ్రదేశంలో వ్యాప్తిలో వుంది. వారు పెద్దన, తిమ్మన, ధూర్జటి, అయ్యలరాజు రామభద్రుడు, మాదయగారి మల్లన, తెనాలి రామకృష్ణుడు, పింగళి సూరన, రామరాజ భూషణులని అంటారు. భువన విజయం అనే సభాభవనాన్ని పెద్దన పేర్కొన్నాడు కాని అష్టదిగ్గజాల గురించి ఆయనగాని మరెవ్వరూ గాని వ్రాయలేదు. కాబట్టి రాయల ఆస్థానంలో అష్టదిగ్గ జాలనబడేవారున్నారనడానికి ఆధారాలు లేవని కొందరంటారు. ఒకవేళ వున్నా అందరూ తెలుగు కవులే అనడానికి వీల్లేదంటారు. కృష్ణదేవరాయల సామ్రాజ్యంలో తెలుగుకన్నడ తమిళ ప్రాంతాలున్నాయి. అతని ఆస్థానంలో ప్రసిద్ధమైన సంస్కృత తెలుగు కన్నడ తమిళ కవులున్నారు. కాబట్టి అష్టదిగ్గజాల్లో ఆ కవులందరికీ స్థానముండి వుంటుంది అంటారు. విక్ర మాదిత్యుని ఆస్థానంలో నవరత్నాలున్నట్లుగా కృష్ణదేవరాయల ఆస్థానంలో అష్టదిగ్గజాలున్నారనడం సత్యమే కావచ్చును.

విజయనగర రాజ్యకాలంలో గోలకొండసుల్తానులు మహమ్మదీయులైనా వాళ్ళ మాతృభాష తెలుగు కాకపోయినా ఆ సుల్తానులు కొందరు తెలు గునభిమానించారు. రాజోద్యోగులు కూడా తెలుగునభిమానించి కవులను ఆదరించారు. గోలకొండ రాజ్యంలో కొన్ని రమ్యమైన తెలుగు ప్రబంధాలు రచింపబడినాయి.

## అద్దంకి గంగాధరుడు

ఈ కవి తపతీ సంవరణోపాఖ్యానమనే ప్రబంధాన్ని వ్రాసి గోలకొండ సుల్తాను ఇబ్రాహీం కుతుబ్షాకు (క్రీ.శ 1550-1580) అంకితమిచ్చాడు. ఇబ్రాహీం కుతుబ్షాను తెలుగు కవులు మల్కిభరాముడని కీర్తించారు.

గంగాధరుని ప్రబంధానికి పూర్వం ఈ రాజు పెక్కు కృతులను అంకితంగా పొందినట్లు పీఠికను బట్టి తెలుస్తున్నది.

మహాభారతం ఆదిపర్వంలోని తపతి సంవరణుల కథను తీసుకొని 5 ఆశ్వాసాల ప్రబంధంగా గంగాధర కవి వ్రాసాడు. కవి కల్పనలు వర్ణనలు చక్కగా వున్నాయి. శైలి ధారాళంగా వుంది. శబ్దాలంకారాలు రమ్యంగా వున్నాయి. నన్నయ తెలుగు భారతంలో తపతిసంవరణుల కథను 23 పద్యగద్యాల్లో చెప్పాడు. అంత చిన్న కథను తీసుకొని గంగాధరకవి పెంచి శృంగార ప్రధానమైన ప్రబంధంగా రచించాడు. గంగాధర కవి చాలా విషయాల్లో రామరాజభూషణుని వసుచరిత్రను అనుకరించాడు. తపతీసంవరణుల మధ్య రాయబారాన్ని ఒక చిలుక నడపుతుంది. ఈ ఘట్టాన్ని గంగాధరకవి రమ్యంగా చిత్రించాడు.

## పొన్నగంటి తెలగన

ఈ కవి యయాతి చరిత్రను రచించి అమీనుఖాను అనే ఇబ్రాహీం కుతుబ్షా సామంతరాజుకు అంకితంగా ఇచ్చాడు. అమీనుఖాను మెదక్ జిల్లా లోని పొట్లచెర్ల (నేటి పటన్‌చెర్వు) పాలకుడు. యయాతి చరిత్ర అచ్చతెనుగు కావ్యం. ఇదే తెలుగులో మొదటి అచ్చతెనుగు కావ్యం. సంస్కృతభాషాపదా లను వాడకుండా దేశి తద్భవ పదాలను మాత్రమే వాడి కవి ఈ కావ్యాన్ని రచించాడు. కొన్ని సంస్కృత పదాలను కవే స్వయంగా అనువదించి దేశి పదాలను తయారు చేసుకున్నాడు కూడా. ఉదా.పంచవదనుడు = అరపది మోముల వేల్పు. హిరణ్యగర్భుడు=కడుపు బంగారు బొక్కసము చేసిన మేటి. వాల్మీకి = కనువినుకలి తావుచూలి. బ్రహ్మ = నీటి పుట్టుగు పట్టి, పక్కడాల్ వేలుపు పొక్కిలి పసిబిడ్డ. హిమవంతుడు = మరుమేపుకందొక మామగారు.

దేశిపదాలను ప్రయోగించి తిక్కనాదులు తమ కావ్యాల్లో పద్యాలు వ్రాసారు. నన్నయ శ్రీనాథపోతనాది కవులు కూడా అక్కడక్కడ

దేశిపదాలను బహుళంగా ప్రయోగించి పద్యాలు చెప్పారు. అట్లా అచ్చతెనుగు పద్యమొక్కటైనా కావ్యంలో వుంటె చదివి మెచ్చుకుంటారు. ఇక కావ్యమంతా అచ్చ తెలునుగులో వుంటె ఆశ్చర్యంతో ఇంకా మెచ్చు కుంటారని తెలగన తన కావ్యపీఠికలో అన్నాడు. దాన్నిబట్టి అచ్చతెనుగు అంటే సంస్కృత పదాలు లేని కావ్యం వ్రాయాలన్న దీక్షతోనే తెలగన ఈ కావ్యం వ్రాసాడు. తర్వాత కవులు కొందరు కూచిమంచి తిమ్మకవి (క్రీ.శ 1750) నీలాసుందరి పరిణయం, అచ్చతెనుగు రామాయణం, ములుగు పాపయారాధ్యుడు శుద్ధాంధ్ర భారత సంగ్రహం శుద్ధాంధ్ర రామాయణ సంగ్రహం రచించారు. అచ్చతెనుగు కావ్యరచన తెలుగులో ఒక ప్రక్రియగా జరిగింది. అచ్చతెనుగు పదాల నిఘంటువులు కూడా కూర్చబడినాయి అంటే ఈ ప్రక్రియ గంభీర రూపంగానే బయలు దేరి వ్యాప్తినందుకున్నదని చెప్పాలి. అచ్చతెమగునే శుద్ధాంధ్రమని అన్నారు. అచ్చతెనుగులో కావ్యం వ్రాయడం శివకవుల దేశికవితోద్యమంలోని జానుతెనుగు ప్రయోగ ఫలితమే కావచ్చును. తెలగన అచ్చతెనుగు ప్రబంధాన్ని వ్రాసి ఒక మహమ్మదీయునికి అంకితమియ్యడం ఒక ప్రత్యేకత. కవి దీనిలో ప్రబంధ లక్షణాలను పాటించాడు. వివిధ ప్రకృతి వర్ణనలను చేసాడు. వేటను విశదంగా వర్ణించాడు. భారతంలోని యయాతి కథ ప్రబంధకథకు మూలం. తెలగన కొన్ని మార్పులతో ఈ కథను పెంచి ప్రబంధంగా తీర్చిదిద్దాడు.

అచ్చ తెనుగు కావ్యాల్లో దీర్ఘసమాసాలు గాని పరుషాక్షరాలు గాని లేక పోవడంతో శైలి మృదుమధురంగా వుంటుంది. కాని రానురాను కవులు సంస్కృత పదాలను తెనిగిస్తూ కృతిమ పదజాలాన్ని సృష్టించి భాషను కృత్రిమం చేసారు. అచ్చ తెలుగుతో వర్ణనలకు భావాలకు సరిపోయేంత పదజాలం లేక పోవడంతో కవిత్వం ధారాళంగా రమ్యంగా సాగలేదు. కవికి ఎంతసేపు దృష్టి భాష మీద వుండడంతో కథాకథనం, వర్ణనలు భావచమత్కారం లేకుండా సాగాయి.

## సారంగు తమ్మయ్య

తమ్మయ్య వైజయంతీ విలాసమనే శృంగార ప్రబంధాన్ని వ్రాసాడు. దీనికి విప్రనారాయణ చరిత్ర అనికూడా పేరు. ఇది 4 ఆశ్వాసాల ప్రబంధం. ఈ కవి గోలగొండ సుల్తాను మహమ్మదు కుతుబ్షా (క్రీ.శ 1581-1611) కాలంలో గోలకొండ కరణంగా పనిచేసాడు. ఈ కవి తన కావ్యాన్ని తన ఇష్టదైవం శ్రీరాముని కంకితంగా ఇయ్యడం విశేషం. తమ్మయ సంస్కృతంలో వున్న దివ్యసూరి చరితముననుసరించి విప్రనారాయణుని కథను వ్రాసాడు. ఇతని కవిత్వం సరసంగా వుంది. అక్కడక్కడ ఔచిత్యాన్ని మించిన శృంగారవర్ణనలున్నాయి. పాత్రచిత్రణలను కవి సహజంగా చేసాడు.

## చరిగొండ ధర్మన

ధర్మన క్రీ.శ 1504 ప్రాంతంలో ఓరుగల్లును పాలించిన చిత్తాపుఖాను కాలంవాడు. ఈ కవి చిత్రభారతం వ్రాసి చిత్తాపుఖాను మంత్రి ఎన్మలపల్లి పెద్దామాత్యునికి అంకితమిచ్చాడు. కవి చిత్రభారత కథను బ్రహ్మాండపురాణం నుంచి తీసుకున్నాడు. పేరుకు తగినట్లుగానే ఈ కథ చిత్రంగా వున్నది. శ్రీకృష్ణునికి అర్జునునికి మధ్య చతుర్ధనరాజు వల్ల యుద్ధం సంభవిస్తుంది. కృష్ణార్జునుల యుద్ధాన్ని కవి మహాభారత యుద్ధరీతిలో వర్ణించాడు. ఈ యుద్ధం కూడా 18 రోజులు జరిగిందట. ధర్మన కవిత్వం వీరరసస్ఫోరకంగా వుంది. చిత్రకవిత్వంలో తనకున్న ప్రవేశాన్ని చూపించాడు.

## మల్లారెడ్డి

ఈ కవి మెదకు దుర్గానికి సమీపంలోని ఓక్కన వోలును రాజధానిగా గోలకొండ సుల్తానుల కింద సామంతుడుగా పాలించిన రాజవంశంలోని వాడు. ఈకవి ఇబ్రాహీం కుతుబ్షా కాలంవాడని చాటు పద్యాల వల్ల తెలుస్తున్నది. మల్లారెడ్డి షట్చక్రవర్తి చరిత్ర, శివధర్మోత్తర కృతులను

వ్రాసాడు. శివధర్మోత్తర కావ్యేతివృత్తాన్ని స్కాందపురాణం నుంచి కవి తీసుకున్నాడు. దీనిలో కవి శైలి సరళంగా వుంది. కాని షట్చక్రవర్తి చరిత్రలో కవి రామరాజభూషణుని వసుచరిత్ర శైలిని అనుసరించాడు. ఆర్గురుచక్రవర్తుల కథలను శృంగారరస ప్రధానంగా ప్రబంధ వర్ణనలను చేర్చి చక్కని కల్పనలతో రచించాడు. రామరాజభూషణుని వలెనే శ్లేష శబ్దాలంకార వైచిత్రిని కవి ప్రదర్శించాడు. ఈ కవి మరో రచన పద్మ పురాణం. దీనిలో కవి రామాయణ కథను చక్కని శైలిలో రచించాడు.

## సురభి మాధవరాయలు

ఈ కవి జటప్రోలు పాలకుడు. క్రీ.శ 1650 ప్రాంతంవాడు. జటప్రోలు జీర్ణకర్ణాటరాజ్యంలో ఒక సంస్థానం. మాధవరాయలు రచన చంద్రికాపరి ణయం ప్రబంధం. దీనిలో చంద్రిక సుచంద్రుల ప్రేమ వివాహ కథ వుంది. కథ కల్పితం. కథ వసుచరిత్ర కథను పోలి వుంది. వర్ణనల్లోను వసుచరిత్ర కథను పోలివుంది. వసుచరిత్రలోవలెనే మాధవరాయలు శ్లేష చమత్కారాన్ని ప్రదర్శించాడు. ఇది ప్రబంధయుగానంతరం వచ్చిన అనేక పిల్ల వసుచరిత్రలకు నాంది పలికింది.

## రామదాసు

రామదాసు అసలు పేరు కంచెర్ల గోపన్న. క్రీ.శ. 1620-80 మధ్య కాలంలో వున్నాడు. అక్కన మాదన్నలు అతని మేనమామలు. గోల్కొండ ప్రభువు అబుల్ హసన్ (క్రీ.శ. 1658-87) దగ్గర మంత్రులుగా వున్నారు. వాళ్ళ ప్రభావంతోనే గోపన్న భద్రాచలం తాసిల్దారుగా నియమింపబడి వుంటాడు. అతడు చిన్న నాటి నుంచి రామభక్తికలవాడు. రఘునాథ భట్టాచార్యుల గురుత్వంలో అతని రామభక్తి ఇనుమడించి రామదాసుగా ప్రసిద్ధిచెందాడు. భక్తి భగవత్ కైంకర్యం అతిథిపూజలతో అతని ఆస్తి కరిగిపోయింది. అది పోగా సర్కారు ఖజానా డబ్బును కూడా ఖర్చు చేసాడు. ప్రభువు దానికి కోపించి అతన్ని బందిఖానాలో వేసాడు. రామలక్ష్మణులు

స్వయంగా వచ్చి సుల్తానుకు డబ్బు చెల్లించి రామదాసును విడిపించారని ప్రభువు అతని భక్తి మహిమను తెలుసుకొని అతన్ని బాధించినందుకు పశ్చాత్తాపపడినాడని ఐతిహ్యం. రామదాసు కీర్తి దక్షిణాన త్యాగయ్య వరకు వ్యాపించింది. త్యాగయ్య రామదాసును ఎన్నోసార్లు స్మరించాడు. రామదాసు భక్తిపారవశ్యంతో ఎన్నో కీర్తనలను వ్రాసాడు. "దాశరథీ కరుణా పయోనిధి" మకుటంతో దాశరథి శతకాన్ని వ్రాశాడు. ప్రతిపూట రామకోటి వ్రాసి భద్రాచల రామునికి అర్పించేవాడట. రామదాసు బందీఖానాలో 12 ఏండ్లు వున్నాడు. అప్పుడు రామున్ని భక్తితో తనను రక్షించమని మొరపెట్టుకున్నాడు. ఒకొకసారి రాముని మీద అలుగుతూ కోపగిస్తూ అనునయిస్తూ చెప్పిన కీర్తనలు నిసర్గభావాలతో కూడి వున్నాయి. భాష సరళంగా భావాలు నిరాడంబరంగా వుండి శ్రోతలను ఆకట్టుకుంటాయి.

రామదాసు తెలుగునే కాక ఆనాడు రాజభాషలయిన ఉర్దూ పారశీకభాషలను నేర్చాడు. అతడు పండితుడైనా అతని కీర్తనలు సరళమైన నిత్యవ్యవహారానికి దగ్గరైన తెలుగులో వున్నాయి. రామదాసు మొత్తం ఎన్ని కీర్తనలు వ్రాసాడో చెప్పలేము కాని నూరో నూటయాభైయ్యో వుంటాయని పండితుల అభిప్రాయం. అతడు వ్రాసిన కీర్తనలు తక్కువే అయినా సరళ భక్తిభావాలతో కూడి తెలుగునుడికారంతో వుండి అలరిస్తున్నాయి. దాశరథి శతకం కూడా సరళమైన భాష·భావాలతో వుంది. అతని ఆర్తి శరణాగతి దాస్యభక్తి ఇందులో కనిపిస్తాయి. భావతీవ్రత అతని కీర్తనల్లో బాగా చోటు చేసుకుంది.

గొల్కొండను ఔరంగజేబు ఆక్రమించుకొని బందీలను విడచి పెట్టాడని అందులో రామదాసు కూడా వున్నాడని చారిత్రకుల అభిప్రాయం.



# 9. రఘునాథనాయక యుగం

తమిళ కర్ణాట ప్రాంతాల్లో తెలుగు రాజుల ఏలుబడిలో 17,18 శతాబ్దాల్లో తెలుగు సాహిత్యం అనేక నూతన ప్రక్రియలతో వికసించింది. అందుకే దీన్ని దక్షిణాంధ్రయుగం అని అనడం వుంది. కవుల పేరు మీద యుగ విభజన చేసినప్పుడు దీన్ని రఘునాథనాయక యుగమని అనాలి. రఘునాథ నాయకుడు క్రీ.శ. 1614 - 33 మధ్య తంజావూరును పాలించాడు. శ్రీ కృష్ణదేవరాయల వలెనే అతడు వీరుడు. సాహసి. విజేత. కవి. పండితుడు. కవి పండిత పోషకుడు. రాయలవలెనే అపరభోజుడుగా ప్రసిద్ధి చెందాడు. అతని వలెనే సాహితీ సమరాంగణ సార్వభౌముడనదగినవాడు. స్వయంగా అనేక కావ్య యక్షగానాదులను వ్రాసాడు. అతని కాలంలో ప్రబంధ, ద్విపద కావ్యాలు, యక్షగానాలు, పద రచనలు అభ్యుదయ కావ్యాలు, చిత్ర కవిత్వం, ద్వ్యర్థికావ్యాల వంటి అనేక ప్రక్రియలు పుట్టి గుబాళించాయి. పద రచన యక్షగానాది వంటి ప్రక్రియలు ఈ యుగంలో బాగా వికసించాయి. రఘునాథుడు సంగీతంలోను పండితుడు. ఆ యుగంలో వికసించిన సాహిత్య ప్రక్రియలన్నిటికి . మూలస్థానమైనవాడు. కాబట్టి ఈ యుగాన్ని అతని పేర పిలవడం ఎంతో సమంజసం. ఈ యుగం క్రీ.శ. 1600 నుంచి క్రీ.శ. 1855 వరకు విస్తరించింది. తంజావూరులో శహజీ ' చివరి రాజు క్రీ.శ. 1855 వరకు పాలించాడు.

శ్రీ కృష్ణదేవరాయల కాలంలోనే దక్షిణంలో వున్న చోళ మధుర పుదుక్కోట ప్రాంతాలు జయింపబడి విజయనగర రాజ్యంలో చేరాయి. విశాల విజయనగర సామ్రాజ్యంలోని సుదూర దక్షిణ దేశాలను ఏలడానికి నమ్మకమైన నాయకులు నియమింపబడినారు. అచ్యుత దేవరాయల

కాలంలో అతని భార్య వరదాంబిక చెల్లెలు భర్త అయిన చెవ్వప్పనాయకుడు తంజావూరులో ప్రతినిధిగా నియమింపబడినాడు. చెవ్వప్ప వంశజులు వంశపారంపర్యంగా విజయనగర రాజుల దగ్గర సైన్యాధికారులుగా వుండి బలపరాక్రమాలు చూపారు. వాళ్ళు తాము చంద్రవంశజులమని చెప్పుకున్నారు. చెవ్వప్ప తంజావూరును క్రీ.శ. 1535-61 మధ్య పాలించాడు. అతనికి గోవింద దీక్షితులు మంత్రిగావున్నాడు. చెవ్వప్ప తర్వాత అతని కొడుకు అచ్యుత నాయకుడు క్రీ.శ. 1561-1614 వరకు పాలించాడు. అతని కాలంలోనే పోర్చుగీసులు ప్రజల చేత రాజుమీదికి తిరుగుబాటు చేయించారు. యువరాజైన రఘునాథుడు తిరుగుబాటు నణచివేసి పోర్చుగీసులను నాగపట్టణానికి తరిమి వేసాడు. పోర్చుగీసులు చోళగుడనే బందిపోటును ప్రేరేపించారు. వాని సహాయంతో పోర్చుగీసులు సింహళంలోని జాఫ్నాను వశపరచుకున్నారు. జాఫ్నారాజు రఘునాథుని శరణు కోరాడు. ఇంకొక వైపు జగ్గరాజును శిక్షించి రామదేవరాయలను విజయనగర చక్రవర్తిగా చేయవలసివుంది. ఈ పరిస్థితుల్లోనే అచ్యుతనాయకుడు వృద్ధుడైవుండి కొడుకు రఘునాథ నాయకునికి పట్టాభిషేకం చేసాడు. క్రీ.శ. 1614 లో రఘునాథ నాయకు పట్టాభిషిక్తుడై క్రీ.శ. 1633 వరకు పాలించాడు. శ్రీ కృష్ణదేవరాయల అపరావతారంగా ప్రస్తుతింపబడినాడు. దేవికోటపై దండెత్తి చోళగుని బంధించి యావజ్జీవ బందీగా చేసాడు. పదవల వంతెనతో రఘునాథుడు జాఫ్నా చేరుకోగా అది చూసి పోర్చుగీసులు అతన్ని ఎదిరించలేక పారిపోయారు. జాఫ్నారాజు పునఃప్రతిష్ఠితుడైనాడు. జాఫ్నా ప్రాంతానికి ఆనాడు నేపాళమని పేరు. కవులు రఘునాథ భూపాలుని నేపాళ విజయాన్ని శ్రీరాముని లంకావిజయంతో సమానంగా వర్ణించాడు. ఆ తర్వాత రఘునాథుడు యాచమనాయకునితో చేరి జగ్గరాజును చంపి రామదేవరాయలను పట్టాభిషిక్తుని చేసాడు. జగ్గరాజుకు సహాయంగా వచ్చిన పోర్చుగీసులు జింజి మధుర నాయకులు పారిపోయారు. రఘునాథుని పక్షంలో డచ్చివారు వుండి పోరాడారు. ఈ విజయాలతో రఘునాథుని పరాక్రమం లోకవిదితమైంది.

రఘునాథుని ఆస్థానంలో సంస్కృత భాష బాగా ఆదరణ పొందింది.

అతని మంత్రి గోవింద దీక్షితుడు సంగీతసుధ వ్రాసాడు. రాజ చూడామణి దీక్షితుడు రుక్మిణీకళ్యాణ చంపువు భోజుని రామాయణాన్ని పూరిస్తూ యుద్ధ కాండాన్ని రచించాడు. గోవింద దీక్షితుని కొడుకు యజ్ఞ నారాయణుడు. అతనికి రఘునాథ నాయకుడు గురువట. ఆ కవి రఘునాథుని చరిత్రను సంస్కృతంలో రఘునాథాభ్యుదయమనే కావ్యంగా వ్రాసాడు. రఘునాథ విలాసమనే నాటకాన్ని వ్రాసాడు. అలంకార రత్నాకరంలో రఘునాథుని వర్ణిస్తూ లక్షశ్లోకాలతో అలంకారశాస్త్రగ్రంథాన్ని వ్రాసాడు. రాజచూడామణి రఘునాథ భూపవిజయ కావ్యం వ్రాసాడు. రఘునాథుని ఆస్థానంలో రామభద్రాంబ మధురవాణి అనే సంస్కృత కవయిత్రులు న్నారు. వాళ్ళు అతని ప్రియురాళ్ళుగా చెప్పబడినారు. ఈ విధంగా రఘునాథుడు సంస్కృతాభిమానాన్ని విడిచిపెట్టకుండానే. తెలుగు రచనను ప్రోత్సహించాడు.

రఘునాథనాయకుని కాలంలోనే తంజావూరు స్వతంత్ర రాజ్యమైంది. రఘునాథుని తర్వాత అతని కొడుకు విజయ రాఘవనాయకుడు రాజయ్యాడు. అతడు తండ్రివలెనే సాహిత్యాభిమాని. సంగీతాభిమాని. నాట్యప్రియుడు. నాయక రాజులు మొదటి నుంచి వైష్ణవాన్ని అభిమానించారు. కాని విజయరాఘవునిలో వైష్ణవం ముదిరిపోయింది. పూజల్లో దైవదర్శనాల్లో మునిగిపోయి విజయరాఘవుడు రాజకార్యాల మీద అశ్రద్ధ చూపాడు. వీరవైష్ణవుడై ఇతర మతాల వాళ్ళను పీడించాడు. సైన్యం విషయంలో శ్రద్ధచూపలేదు. యుద్ధంలో చనిపోయిన వీరుల మీద మంత్రజలాలు చల్లితే పునర్జీవిస్తారని విశ్వసించిన మతమౌఢ్యంతోనే అతని రాజ్యం క్షీణించింది. మధుర చొక్కనాథుడు తన మీద తిరుగుబాటు చేసిన లింగనీడుకు ఆశ్రయమిచ్చాడనే కోపంతో తంజావూరు మీదికి దండెత్తివచ్చి విజయరాఘవుని అతని కొడుకు మన్నారుదాసును చంపాడు. తంజావూరులో తన సవతి తమ్ముడు అళగిరిని పాలకుడుగా నియమించాడు. అప్పుడు విజయరాఘవుని కాలంలో రాజోద్యోగి అయిన రాయసం వెంకన్న బీజాపూరు సేనాని ఏకోజి సహాయంతో మన్నారుదాసు కొడుకు చెంగమలదాసును రాజును చేసాడు. చెంగమలదాను దుష్టుడైన వెంకన్నను తొలగించాడు. దాంతో వెంకన్న చెంగ

మలదాసును తొలగించి ఏకోజీని రాజును చేసాడు. ఏకోజీ శివాజి సవతి తమ్ముడు. అప్పటి నుంచి తంజావూరులో మహారాష్ట్రుల పాలన మొదలైంది. చెంగమలదాసు కొంత కాలం మధురలో శరణార్థిగా వున్నాడు. తర్వాత అతని వంశజులు సింహళానికి వలసపోయారని చారిత్రకులంటున్నారు.

తంజావూరు రాజ్యం నాయకరాజుల పాలనలో చోళరాజుల కాలంనాటి వైభవంతో సుఖశాంతులతో వర్థిల్లింది. ప్రజలు తమిళులు పాలకులు తెలుగువారయినా ప్రజల్లో ఏమి అసంతృప్తి ఏర్పడ లేదు. రఘునాథనాయకుడు డచ్చి వాళ్ళ చేత శిక్షణనిప్పించి బలమైన ఆశ్వికదళాన్ని తయారు చేసాడు. తన సైన్యబలంతో సింహళంలోని జాఫ్నా వరకు రాజ్యాన్ని విస్తరింపజేసాడు.

రఘునాథుని ఆస్థానంలో రామభద్రాంబ మధురవాణి అనే కవయిత్రులున్నారు. వాళ్ళు తెలుగులో సంస్కృతంలో కృతుల రచించడం విశేషం. రామభద్రాంబ రఘునాథాభ్యుదయం రచించింది. దానిలో రఘునాథుని చరిత్ర వుంది. మధురవాణి రఘునాధుడు వ్రాసిన తెలుగు రామాయణాన్ని సంస్కృతీకరించింది. రఘునాథుని రామాయణం పూర్తిగా దొరకలేదు. మధురవాణి రామాయణం పూర్తిగా దొరకలేదు. తంజావూరు రాజుల కాలంలో స్త్రీలు కవిత్వం చెప్పి రాజదర్బారుల నలంకరించి సన్మానాలందుకోవడం విశేషమని చెప్పాలి. కృష్ణాజీ, రంగాజీ అని వాళ్ళ పేర్ల చివర 'జీ' వుండడాన్ని బట్టి వాళ్ళు మహారాష్ట్ర దేశం నుంచి వచ్చిన నాట్య సంగీతాది కళలు కవిత్వం నేర్చిన గణికలని చెప్పాలి. పూర్వకాలంలో రాజాశ్రయాలను వెతుక్కుంటూ గణికల కుటుంబాలు దేశసంచారం చేసేవాళ్ళు. ఎక్కడ ఆదరణ లభిస్తే అక్కడ వుండి పోయే వాళ్ళు. కళాప్రియులైన తంజావూరు నాయకరాజులు రఘునాథ విజయరాఘవులు విశేషంగా స్త్రీలను ఆదరించి సత్కరించారు. రంగాజీ విజయరాఘవుని భార్యనని కూడా చెప్పుకుంది.

రఘునాథనాయకునికి సంగీతంలోను ప్రవేశముంది. అతడు వీణావాదన నిపుణుడట. అతని కాలంలోనే వీణ అచలమైన మెట్లతో కూడి రూపమేర్పరుచుకుందని అంటారు. సాహిత్య సంగీత నాట్య ప్రియుడైన రఘునాథుని కాలంలోనే ఆ మూడు కళల సమాహార రూపమైన యక్షగాన

ప్రక్రియ వికసించి అభివృద్ధి చెందింది. శ్రీకృష్ణదేవరాయల కాలంలో ఆరంభమైన ప్రబంధ ప్రక్రియ రఘునాథుని ఆస్థానంలో చేమకూర వేంకట కవి విజయవిలాసంతో ఒక వెలుగు వెలిగింది. తంజావూరు రాజుల ఆదరణలో చిత్రకవిత్వం బంధకవిత్వం ఆదరింపబడినాయి. రఘునాథుని ఆస్థానంలో వున్న కృష్ణాధ్వరి నైషధ పారిజాతీయమనే ద్వ్యర్థి కావ్యాన్ని వ్రాసాడు. రఘునాథునితో తండ్రి జీవితచరిత్రను అభ్యుదయ కావ్యంగా వ్రాయడం ఆరంభమై మన్నారుదాసు వరకు కొనసాగింది. ఈ కాలంలో ద్విపద కావ్యాలు, పద రచనలు కూడా బాగా సాగాయి. తండ్రి వలెనే విజయరాఘవుడు పండితుడు కవి. తండ్రి జీవితచరిత్రను రఘునాథా భ్యుదయం కావ్యంగా రచించాడు. అతడు అనేక కావ్యాలు యక్షగానాలు వ్రాసాడు. అతని కొడుకు మన్నారు దేవుడు తండ్రి జీవిత చరిత్రను విజయ రాఘవాభ్యుదయ కావ్యంగా రచించాడు. హేమాబ్జనాయికా స్వయంవరమనే యక్షగానాన్ని కూడా వ్రాసాడు.విజయ రాఘవుని కులగురువు శ్రీనివాస తాతాచార్యులు. అతడు విజయరాఘవునికి అత్యంత సన్నిహితుడుగా వుండేవాట. కుటుంబవిషయాల్లోను, శ్రద్ధ చూపేవాడట. విజయరాఘవుడు వైష్ణవుడు. మన్నారుదేవుని భక్తుడు. తంజావూరు సమీపంలోనే స్వామిమలైలో కృష్ణుడు మన్నారు దేవుడుగా వెలిసాడు. విజయరాఘవునికి మన్నారు దేవుడని కూడా పేరు. అతడు రంగాజమ్మ చేత కృష్ణుని అవతారంగా కీర్తింపబడినాడు. ఆ కాలంలో భారత దేశమంతటా రాజులు విలాసప్రియులై భోగాల్లో తేలుతూ సంగీత నాట్య సాహిత్యాభిమానంతో వైష్ణవం మీద అభిమానంతో తాము స్వయంగా, పదాభినయాలు చేస్తూ స్త్రీలచేత పరివేష్టింపబడి వాళ్ళు గోపికలు తాము కృష్ణుని అపరావతారంగా కీర్తింపబ డుతూ నీరసులు నిర్వీర్యులై రాజ్యాలు చేసారు. మనకు ఉత్తరభారతంలో మహారాష్ట్రలో అంతటా అటువంటి రాజులు చరిత్రలో దర్శనమిస్తారు. వాళ్ళ నిర్వీర్యం చేతనే దేశం అన్యాక్రాంతమైంది. వస్తున్న మార్పులను వాళ్ళు ఎదుర్కోలేక తట్టుకోలేక ఆ విధంగా అయ్యారేమోననిపిస్తుంది. అటువంటి నిర్వీర్యులైన రాజులనే పోర్చుగీసులు, డచ్‌లు, ఇంగ్లీషువాళ్ళు తమ గుప్పెట్లో పెట్టుకొని మొదట రాజకీయాలు నడిపి తర్వాత రాజ్యాల నాక్రమించుకున్నారు.

ఏకోజీ (క్రీ.శ 1674) తర్వాత మహారాష్ట్రరాజులు తంజావూరును క్రీ.శ 1855 వరకు రెండు శతాబ్దాల కాలం పాలించారు. వాళ్ళు మహారాష్ట్రులు. పాలించేది తమిళ దేశం. అయినా ఆ రాజులు తెలుగునభిమానించి తెలుగులో స్వయంగా రచనలు చేసారు. తెలుగు కవులను పండితులను ఆదరించారు. యక్షగానాలకు వాళ్ళ కాలం స్వర్ణయుగమని చెప్పాలి. శహజీ (క్రీ.శ 1684-1712) కాలంలో తెలుగుతో పాటు సంస్కృత సాహిత్యం కూడా వికసించింది.సంస్కృతంలో నిఘంటువులు, వేదాంత గ్రంథాలు యక్షగాననాటకాలు రచింపబడినాయి.శహాజీ ఆస్థానకవి రామభద్రదీక్షితుడు పతంజలి చరిత్రను కావ్యంగా రచించాడు. రెండవ శరభోజి. (క్రీ.శ 1800-1832) సంస్కృతంలో కుమారసంభవ వంపువును వ్రాసాడు. శహాజీ కృష్ణదేవరాయలు రఘునాథరాయల వలె అపరభోజుడుగా కీర్తింపబడినాడు. అతడు అనేక యక్షగానాలేకాక భక్తివైరాగ్య పదాలు రచించాడు. రాధికాసాంత్వనం వ్రాసిన ముద్దుపళని మహారాష్ట్ర రాజుల ఆదరణలోనే వున్నది. మహారాష్ట్ర రాజుల్లో చివరిరాజు శివాజీ క్రీ.శ 1833-55 మధ్య పాలించాడు. అతనికి సంతానం లేకపోవడంతో అతని రాజ్యం ఇంగ్లీషు వాళ్ళ వశమైంది. దాంతో తంజావూరు చోళరాజ్యచరిత్ర ముగిసింది.

క్రీ.శ 1310 లో ఢిల్లీ సుల్తాను అల్లాఉద్దీను సేనాని మాలక్ కాఫర్ దక్షిణాపథానికి దండెత్తివచ్చి పాండ్య దేశమైన మధురను జయించాడు. క్రీ.శ 1370 ప్రాంతంలో బుక్కరాయల కొడుకు వీరకంపన మధురను జయించి విజయనగరసామ్రాజ్యంలో చేర్చాడు. అయినా పాండ్యరాజుల సంతతి వాళ్ళే మధురలో, చోళరాజుల సంతతివాళ్ళు తంజవూరు రాజప్రతినిధులుగా నియమింపబడినారు. కంపన మధురావిజయవీరగాధనే అతని భార్య గంగాదేవి సంస్కృతంలో "మధురావిజయం" కావ్యంగా రచించి అతని కీర్తిని అజరామరం చేసింది. శ్రీకృష్ణదేవరాయల కాలంలో మధురను చంద్రశేఖర పాండ్యుడు పాలిస్తున్నాడు. తంజావూరును పాలించే వీరశేఖరచోళుడు మధురనాక్రమించుకోగా చంద్రశేఖరుడు కృష్ణదేవరాయల శరణువేడాడు. రాయలు కాశ్యపగోత్రజుడైన సేనాని వీరుని నాగమనాయకుని మధుర మీదికి పంపాడు. నాగమ మధురను జయించి తానే పాలించసాగాడు.

అప్పుడు రాయలు పంపగా నాగమ కొడుకు విశ్వనాథనాయకుడు పోయి మధురను ఆక్రమించుకున్నాడు. క్రీ.శ 1529 లో విశ్వనాథ నాయకుడు మధురకు రాజప్రతినిధి అయ్యాడు. మధురను అతడు పునరుద్ధరించి మీనాక్షి దేవాలయాన్ని బాగుచేయించాడు. విశ్వనాథనాయకుడు మధురతో పాటు తంజావూరుకు రాజప్రతినిధిగా నియమింపబడినాడు. కాని అచ్యుత దేవరాయల కాలంలో తంజావూరుకు చెవ్వప్ప రాజప్రతినిధిగా నియమింపబడినాడు. విశ్వనాథనాయకుడు (క్రీ.శ 1529-64) లో మధుర రాజ్యాన్ని 72 "పాళె" ములుగా విభజించి తెలుగు కన్నడ తమిళులను పాలకులుగా- "పాళెగాళ్ళ" గా నియమించాడు. ఈ పాళెగాళ్ళు తర్వాత కొందరు బలవంతులై స్వాతంత్ర్యం ప్రకటించారు. విశ్వనాథుని తర్వాత అతని కొడుకు మొదటి కృష్ణప్పనాయకుడు (క్రీ.శ 1564-72) రాజయ్యాడు. అతని తర్వాత అతని కొడుకు రెండవ కృష్ణప్పనాయకుడు (క్రీ.శ 1595-1601) తర్వాత అతని కొడుకు ముద్దుకృష్ణప్పనాయకుడు (క్రీ.శ 1601-09) పాలించారు. కృష్ణప్ప మతసహనాన్ని ఆసరాగా తీసుకొని పోర్చుగీసులు క్రైస్తవమతప్రచారాన్ని ప్రజల మతం మార్పిడిని చేసారు. అగ్రవర్ణాలవాళ్ళు గూడా క్రైస్తవమతాన్ని స్వీకరించారు. రాబర్ట్-డి-నోబిల్ అనే ఫాదరి క్రీ.శ 1606లో మధురకు వచ్చాడు. అతడు బ్రాహ్మణుల ఆచారవ్యవహారాలను అనుసరిస్తూ తెలుగు సంస్కృతం తమిళం నేర్చుకొని మతప్రచారం చేసాడు. ముద్దుకృష్ణప్ప కాలంలోనే రామేశ్వరం ప్రాంతాన్ని పాలించే మరవజాతివాళ్ళు సేతుపతులనే పేరుతో బలవంతులవుతున్నారు. ఈ పరిస్థితుల నేపథ్యాన్ని తీసుకునే విశ్వనాథ ఏకవీర నవలను వ్రాసాడు. ముద్దుకృష్ణప్ప కొడుకు మొదటి ముద్దు వీరప్పనాయకుడు క్రీ.శ 1609-23లో పాలించాడు. అప్పటికే రాక్షసతంగడి యుద్ధంతో విజయనగర వైభవం నశించింది. అళియ రామరాయల తమ్ముడు తిరుమల రాయలు పెనుగొండలో రాజయ్యాడు. అతని తర్వాత అతని కొడుకు శ్రీరంగ రాయులు రాజయ్యాడు. కాని వాళ్ళు విజయనగర పూర్వ వైభవాన్ని ఉద్ధరించలేక పోయారు. ఆ అదను చూసుకొని మధుర పూర్తిగా స్వతంత్ర రాజ్యంగా ఏర్పడింది. ముద్దువీరప్ప తర్వాత అతని తమ్ముడు తిరుమలనాయకుడు రాజయ్యాడు. అతడు వీరుడు దక్షతగల పరిపాలకుడు. దానశీలుడు. సంస్కృతాంధ్ర భాషాపోషకుడు.

నృత్యసంగీతాది కళలను శిల్పులను పోషించాడు. తిరుమల నాయకుని ఆస్థానంలో ప్రసిద్ధ కవి పండితుడు అప్పయ్య దీక్షితుని సోదరుని పౌత్రుడు నీలకంఠ దీక్షితులు ఆస్థానకవిగా వున్నాడు. ఆ కవి నీలకంఠవిజయమనే చంపువును వ్రాసాడు. శివలీలార్ణవం, గంగావతరణం అనే కావ్యాలు రచించాడు. నీలకంఠుని సహపాఠి వేంకటాధ్వరి వరదాభ్యుదయం శ్రీనివాస చంపువులను సంస్కృతంలో వ్రాసాడు. భోజుని అసంపూర్ణ రామాయణాన్ని పూరించాడు. 16వ శతాబ్దంలో ప్రసిద్ధుడైన అప్పయదీక్షితుడు బహుముఖ ప్రజ్ఞాశాలి. కవి. దార్శనికుడు. ఆలంకారికుడు. వైయాకరణుడు. అతడు వెల్లూరు రాజు చినబొమ్మనాయకుని (క్రీ.శ 1549-78) పెనుగొండలో వేంకటరాయల (క్రీ.శ 1586-1613) ఆస్థానాల్లో వున్నాడు. అనేక కృతులు రచించాడు. చిత్రకావ్యవివేచన చేస్తూ చిత్రమీమాంస, కువలయానందం వ్రాసాడు. అలంకారాల వివేచనలో చివరి గ్రంథం కువలయానందం. వేంక టరాయల ఆస్థానంలోనే చిదంబరకవి రాఘవ యాదవపాండవీయమనే త్ర్యర్థికావ్యాన్ని వ్రాసాడు. అప్పయ్య దీక్షితుడు అలంకారవాది. అర్థవైచిత్రిని చిత్రకవిత్వాన్ని సమర్థించిన ఆలంకారికుడు. అందుకే ఈ యుగంలో దక్షిణదే శంలో సంస్కృతమే కాక తెలుగులోను అనేకార్థకావ్యాలు, చిత్రకవిత్వాలు, అలంకార చమత్కృతులతో కూడిన కావ్యాలు చాల వ్రాయబడినాయి. రసధ్వనులకు రోజులు చెల్లిపోయాయి. కవిత్వం క్షీణదశను చేరుకోవడానికి ఇదో కారణమని చెప్పాలి. వీరేశలింగం నాటికి ఇటువంటి రసహీన మైన అచ్చతెలుగు కావ్యాలు నిరోష్ఠ్యాది చిత్రకవిత్వంతో కూడిన కావ్యాలు వ్రాయడం ప్రచారంలో వుంది. భట్టోజి దీక్షతుడనే పండితుడు కాశి నుంచి దక్షిణానికి వచ్చి అప్పయ్యదీక్షతుని శిష్యుడై వ్యాకరణం అభ్యసించి తన మొదటి గురువు శేషకృష్ణుని విమర్శించాడు. భట్టోజి పాణిని వ్యాకరణ సూత్రాలను సరళీకరిస్తూ సిద్ధాంతకౌముది అనే వ్యాకరణాన్ని వ్రాసాడు. అది ఉత్తమమైన వ్యాకరణగ్రంథంగా ప్రశంసలనందుకుంది. పాణిని అష్టా ధ్యాయికి భట్టోజి వ్యాఖ్యానం కూడా వ్రాసాడు. భట్టోజి సిద్ధాంత కౌముదిని 'ఇంకా సరళీకరిస్తూ వరదరాజు లఘు సిద్ధాంతకౌముదిని వ్రాసాడు. అతడు భట్టోజి శిష్యుడు. భట్టోజి మనుమడు హరి దీక్షితుడు. అతని శిష్యుడు నాగే శభట్టు సిద్ధాంతకౌముదికి లఘుశబ్దేందుశేఖరం అనే వ్యాఖ్యానం వ్రాసాడు.

ఈ విధంగా దక్షిణదేశంలో సంస్కృతసాహిత్యం వ్యాకరణ అలంకారశాస్త్ర రచనలతో వికసించింది. సంస్కృతంతో పాటు తెలుగు గౌరవాదరాలను పొందుతూనే వుంది. క్షేత్రయ్య తిరుమలనాయకుని సందర్శించి అతని మీద రెండువేల పదాలను రచించాడు. సత్యభామా సాంత్వనం వ్రాసిన లింగనమఖి కామేశ్వరకవి అతని ఆస్థానంలోనే వున్నాడు. అతని కాలం లోనే "సుందరమహల్" అనే రాజప్రాసాదం నిర్మింపబడింది. మీనాక్షి దేవాలయంలోని శిల్పనిర్మాణంతో కూడిన మంటపం అతని కాలంలోనే నిర్మింపబడింది. తిరుమల నాయకుని కాలంలో నిర్మింపబడిన అనేక సుందర భవనాలు ఇప్పటికీ నిలిచి వుండి ప్రభుత్వకార్యాలయాలుగా మారాయి. కాని తిరుమలుని ఉదార హృదయం మత సహనం ఆధారం చేసుకొని క్రైస్తవం నిరాఘాటంగా ప్రచారం సాగించింది. చివరకు ఒక గుడిలో పూజ చేస్తున్న తిరుమలుని కుట్రపన్ని హత్య చేసారని అంటారు. అతని తర్వాత అతని కొడుకు ముద్దువీరప్పనాయకుడు రాజై నాలుగు నెలలు పాలించాడు. బీజాపూరు సుల్తాను మధుర మీదికి దండెత్తాడు. మార్గమధ్యంలో సుల్తాను సైన్యం తంజావూరును కొల్లగొట్టాయి. ఆ రోజుల్లోనే తంజావూరులో పెద్ద క్షామం ఏర్పడింది. బీజాపూరు సైన్యం అపారనష్టంతో వెనుదిరిగింది. ముద్దు వీరప్ప తర్వాత అతని కొడుకు చొక్కనాథుడు రాజయ్యాడు. క్రీ.శ 1659-82 మధ్య పాలించాడు. అతని కాలంలో దళవాయి లింగమనాయడు జింజీ పాలకుల సహాయంతో మధురను వశపరచుకోవాలని చూసాడు. కాని ఆ ప్రయత్నం ఫలించక తంజావూరులో తలదాచుకున్నాడు. చొక్కనాథుడు తంజావూరుపై దండెత్తి విజయరాఘవనాయకుని ఎదిరించాడు. అప్పుడు తంజావూరులో క్షామమేర్పడగా అన్నార్తులైన ప్రజలను డచ్చివారు తీసుకెళ్ళి బానిసలుగా అమ్మారట. చొక్కనాథుడు క్షామ పరిస్థితిలో తంజావూరు ప్రజలను ఆదరించిన సహృదయుడు. దక్షిణదేశంలో తెలుగు నాయకుల పాలనకింద వున్న తంజావూరు మధుర రాజులు ఎప్పుడూ సఖ్యంగా లేక పరస్పరం కలహించుకుంటూ వచ్చారు.చొక్కనాథుడు రెండు రాజ్యాల మధ్య సఖ్యం ఏర్పరచాలని విజయరాఘవుని కూతురును వివాహమా డదలిచాడు. కాని విజయరాఘవుడు అంగీకరించలేదు. దానికి కారణం మధుర రాజులు ఆభిజాత్యం కలవారు కాదని తంజావూరు నాయకులు

భావించేవాళ్ళు. చెవ్వప్ప నాయకుడు విజయనగర చక్రవర్తి అచ్యుత దేవరాయలకు తోడల్లుడు. మధుర నాయక రాజుల్లో మొదటివాడైన విశ్వ నాథనాయకుడు శ్రీకృష్ణదేవరాయల దగ్గర అడపం-అంటె తాంబూల కరండవాహకుడు. దాని చేతనే తంజావూరు రాజులు మధుర రాజులను చిన్న చూపు చూసారు. దానికితోడు రఘునాథరాయలు మధుర రాజు మొదటి ముద్దువీరప్ప కూతురు కళావతిని పెళ్ళి చేసుకున్నాడు. ఆమె బాగానే వుంది. సవతి కొడుకైన విజయరాఘవుని ఆమె దేవకీదేవి కృష్ణుని పెంచినట్లుగా పెంచిందని కవులు వర్ణించారు. కాని రఘునాథరాయల కూతురును తిరుమలనాయకుడు పెళ్ళాడాడు. ఆమెను అతడు హత్య చేసాడని దాంతోనే తంజావూరు మధురల మధ్య వైరం ప్రబలిందని అంటారు. చొక్కనాథుడు తంజావూరును జయించి తన తమ్ముడు ముద్దళగిరిని ప్రతి నిధిగా నియమించాడు. తర్వాత అది మహారాష్ట్రుల వశమైంది. చొక్కనాథుని కాలంలోనే యుద్ధాలధికమై ప్రజలకు పన్నులభారమధికమైంది. ప్రాంతీయ పాలకులు బలవంతులు కావడంతో మధుర పతనోన్ముఖమైంది. అతని కాలంలోను క్రైస్తవమతప్రచారం బాగా సాగింది. చొక్కనాథుని కొడుకు మూడవ ముద్దు వీరప్ప నాయకుడు క్రీ.శ 1682-89 మధ్య పాలించాడు. అతడు మశూచికంతో అకాలమరణం చెందినప్పుడు అతని భార్య ముద్దమ్మ గర్భవతి. ఆ నాటి ఆచారాన్ననుసరించి ఆమె భర్తతో సహగమనం చేయడా నికి పూనుకోగా ముద్దు వీరప్ప తల్లి మంగమ్మ ఆమెను వారించింది. తర్వాత పుట్టిన బాలునికి మూడవ నెలలో పట్టాభిషేకం చేసి సంరక్షకురాలుగా మంగమ్మ మధురను క్రీ.శ 1689-1706 మధ్య పాలించింది. ఈ కాలంలోనే విజయనగరంలో చిక్కదేవరాయలు తంజావూరులో శహాజీ మొగల్ రాజు ఔరంగజేబు చేతిలో ఓడిపోయి సామంతులయ్యారు. క్రీ.శ 1697లో మంగమ్మ మొగల్ సేనాపతిని జుల్ ఫిర్ఖాను ఘనంగా సత్కరించింది. కాని సమయం చూసుకొని ఆమె స్వతంత్రించింది. మంగమ్మ రాజనీతిజ్ఞురాలు. ఆమె సమయస్ఫూర్తి వల్లనే మధురరాజ్యం పతనం కాకుండా నిలిచింది. మతసహనంతో హిందూ ముస్లిం క్రైస్తవ దేవాలయాలకు దానాలు చేసింది. ఆమె కట్టించిన సత్రాలు ఇప్పటికి నిలిచివున్నాయి. శిల్పులను నటులను ఆమె ఆదరించింది. కవులనాదరించక పోవడం చేతనోయేమో వికటకవి

గోపాలరాయడనే కవి (క్రీ.శ 1650-1700) మధుర మంగాపుంశ్చలీ లీలావిలాసము అనే రచనలో మంగమ్మ అసభ్య శీలాన్ని వర్ణించాడు. ఆ రచన ఆ కాలంలో ఎక్కడో మరుగున వుండి వుంటుంది. లేకపోతె ఒక కవి కసితో అట్లా వ్రాస్తే రాణి రాజనీతిజ్ఞురాలైన ఆమె ఊరుకునేది కాదు. మంగమ్మ ప్రతిభను చూసి ఎవరో కవిని ఆ రచనకు పురుకొల్పివుంటారు. మంగమ్మ తర్వాత ఆమె మనుమడు విజయరంగ చొక్కనాథ నాయకుడు (క్రీ.శ 1706-1732) రాజయ్యాడు. అతడు మహాదైవభక్తి కలవాడు విజయ రాఘవుని వలెనె అతడు దైవధ్యానం, తీర్థ యాత్రల్లో మునిగి వుండి రాజకీయాలను ఉపేక్షించాడు. రాజోద్యోగులు ఆశతో ప్రజల మీద పన్నులు విధించారు. 1710-20 ప్రాంతంలో పెద్ద క్షామం కూడా ఏర్పడింది. రెండు సంవత్సరాల కొకసారి చొక్కనాథుడు సపరివారంగా శ్రీరంగం, తిరునల్వేలి, శ్రీవైకుంఠాది క్షేత్రాలను దర్శించేవాడు. అతి దైవభక్తి అసమర్థత మంత్రుల దుష్పరిపాలనతో మధుర రాజ్యం పతనోన్ముఖమైంది. అతడు క్రీ.శ 1732 లో మరణించాడు. ఆ తర్వాత అతని భార్య మీనాక్షి మధుర పాలకురాలయింది. ఆమె సచ్ఛీలగా పేరు పొందింది. తన సోదరుడు వేంకట పెరుమాళ్ళ సహాయంతో రాజ్యం చేసింది. సంతానం లేక బంధువైన తిరుమలనాయకుని కొడుకు విజయకుమారుని దత్తత తీసుకుంది. తిరుమల నాయకుడు తానే రాజ్యాధికారం వశం చేసుకోవాలని కుట్రలు పన్నాడు. ఆ ఉద్దేశంతో అతడు అర్కాటు నవాబులను కూడా ఆశ్రయించాడు. అర్కాటు నవాబుల కుతంత్రాలతో మీనాక్షి వజ్రాన్ని మింగి ఆత్మహత్య చేసుకుంది. అట్లా మధుర అర్కాటు నవాబుల వశమైంది. మధుర నాయకరాజుల వంశజులు ఇప్పటికీ మధుర చుట్టు పక్కల గ్రామాల్లో నివసిస్తున్నారంటారు.

తంజావూరు మధుర నాయకరాజుల కాలంలో క్షామాలతో పన్నుల భారాలతో ప్రజలు పీడింపబడినారు. రాజులు రాజోద్యోగులు సత్రాలు నిర్మించి అన్నదానాలు చేసారు. అతివర్షాలు లేదా వర్షాలు లేక పోవడం వంటి ప్రకృతి వైపరీత్యాలను ఎదుర్కోలేక ప్రజలు బాధపడ్డారు. దానికితోడు పోర్చుగీసు డచ్చివాళ్ళ రాజకీయాలు వాళ్ళను బలహీనం చేసాయి. ఎప్పుడు

యుద్ధాలతో శాంతి భద్రతలు లేకుండా పోయాయి. రాజులు దానధర్మాలతో మతసహనంతో పాలించారు. అది అలుసుగా తీసుకొని వైష్ణవ ఫాదిరీలు మతప్రచారం మత మార్పిడులు చేసారు. రాజులేమో వీర వైష్ణవంతో భక్తిలో పడిపోయి రాజకార్యాలను సైన్యవ్యవస్థను చూసుకోలేదు. దాంతో రాజ్యాలు బలహీనమై శత్రువులకధీనమయ్యాయి.

తంజావూరు మధుర ఇంకా జింజి (చెంజి) పుదుక్కోట మైసూరు రాజ్యాలను తెలుగు రాజులు పాలించారు. వాళ్ళందరూ కూడా రాజకీయాది పరిస్థితులెట్లా వున్నా తెలుగుభాషాభిమానంతో తెలుగు సాహిత్యాన్ని పోషించారు. ఎంతోమంది తెలుగు కవులు పండితులు సంగీతజ్ఞులు శిల్పులు నటులు ఆంధ్రదేశాన్నుంచి దక్షిణ దేశానికి వలస వెళ్ళారు. రాజాశ్రయాలను పొందారు. ఆ సమయంలో ఆంధ్రదేశంలో సాహిత్యపోషణ శూన్యమనే చెప్పాలి. ఎవరో కొందరు కవులు సంస్థానాధీశ్వరుల ఆశ్రయంలో చేరి కొన్ని కావ్యాలు వ్రాసారు. కాని అవి పిల్లమను, వసు చరిత్రలు శతకాలే గాని చెప్పుకోదగిన సాహిత్యం కాదు.

తంజావూరులో నాయక, మహారాష్ట్రుల పాలనలో ఎన్నడూ లేనంతగా తెలుగు వివిధ ప్రక్రియలతో వికసించింది. తెలుగులో మౌలికమైన చివరి ప్రబంధం విజయవిలాసం. రఘునాథనాయకుని ఆస్థానకవి చేమకూర వేంకటకవి వ్రాసాడు. ద్విపద కావ్యాలు, పదరచనలు యక్షగానాల వంటి ప్రక్రియలు తంజావూరులో బాగా వికసించగా మధుర రాజులు వచన కావ్య రచనను చాల ప్రోత్సహించారు. విశ్వనాథనాయకుని స్థానాపతి వ్రాసిన లేఖ రాయవాచకం పేరుతో వచన సాహిత్యంలో చోటు చేసుకొని తెలుగు వచన రచనకు శ్రీకారం చుట్టింది. అది ఆనాటి వ్యావహారిక భాషలో సరళ సుందరంగా వుంది. తిరుమలనాయకుడు, ముద్దళగిరి విజయరంగ చొక్కనాథులు సాహిత్యాభిమానులై కవుల నాదరించారు. సంస్కృతాంధ్రాల్లో ప్రవీణుడైన లింగమఖి కామేశ్వరకవి ముద్దళగిరి ఆస్థానంలో వున్నాడు. క్షేత్రయ్య ముద్దళగిరిని సందర్శించాడు. విజయరాఘవుని వలెనే ముద్దళగిరి తాను శ్రీకృష్ణుని అవతారంగా భావించి కాముకుడై వుండేవాడట. కలియుగ గోపాలుడుగా ప్రసిద్ధి చెందాడు. ఆనాటి రాజుల ధనవంతుల శృంగార

జీవితాలకు ప్రతిబింబాలుగానే ఆ కాలంలో శుకసప్తతి, తారా శశాంకం, సత్యభామాసాంత్వనం, రాధికాసాంత్వనం, అహల్యా చరిత్ర వంటి కావ్యాలు వ్రాయబడినాయి. పురుషులేకాక ముద్దుపళని వంటి కవయిత్రులు కూడ వచ్చి శృంగారాన్ని వర్ణించారు. ఆ శృంగారయుగంలో అవి తప్పుగా భావింపబడలేదేమో. తర్వాత కాలంలో ఆ సాహిత్యమంతా తెలుగు సాహిత్య క్షీణదశను ప్రతిబింబిస్తున్నాయని విమర్శకులు భావించారు. విజయరంగ చొక్కనాథుని ఆస్థానంలోనే వచన గ్రంథాలు వ్రాసిన సముఖం వేంకట కృష్ణప్ప నాయకుడున్నాడు. ఆయన జైమిని భారతం, సారంగధర చరిత్ర వచనకావ్యాలను అహల్యాసంక్రందనం రాధికాసాంత్వనం శృంగార ప్రబంధాలను వ్రాసాడు. చెంజిలో కువలయాశ్వచరిత్ర ప్రౌఢప్రబంధాన్ని వ్రాసిన నవరము చిననారాయణకవి వరదేంద్రుని (క్రీ.శ 1645-49) ఆస్థానంలో వున్నాడు. చెంజిలో ప్రసిద్ధ సంస్కృత కవి రత్నఖేట శ్రీనివాస దీక్షితులు (క్రీ.శ 1550) సూరప్పనాయకుని ఆస్థానంలో వున్నాడు. చెంజి సేనాపతి తుపాకుల కృష్ణప్ప (క్రీ.శ 1637-49) మీద క్షేత్రయ్య పదాలు రచించాడు. కృష్ణప్ప కొడుకే తుపాకుల అనంత భూపాలుడు. మధురరాజుల దళవాయి. ఆయన కళువె వీరరాజుకు వచన భారత రచనలో తోడ్పడినాడు. ఆయన స్వయంగా విష్ణుపురాణం భగవద్గీత , రామాయణ సుందరకాండం, భారతానుశాసనిక పర్వం వచనంలో వ్రాసాడు. గణపవరపు వేంకటకవి, రేవూరి అనంతయజ్వ మొదలయిన కవులు చెంజి రాజుల ఆదరణను పొందారు. మైసూరును పాలించిన రాజులు కూడా తెలుగు సాహిత్యాన్ని అభిమానించారు. వాళ్ళ రాజ్యంలో కోలారు ప్రాంతానికి సామంతుడైన పాలవేకరి కదిరీపతి (క్రీ.శ 1660) శుకసప్తతి కావ్యాన్ని వ్రాసాడు. మైసూరులో చిక్కదేవరాయల (క్రీ.శ 1673-1704) ఆస్థానంలో తిరుమలాచార్యుడనే కవి చిక్కదేవరాయ విజయం పేరుతో కావ్యం శతకం యక్ష గానం రచించాడు. చిక్కదేవ రాయల కొడుకు కంఠీరవ నరసరాజు రాజయ్యాడు. అతడు మూగవాడు. అయినా చేతి సంజ్ఞలతోనే దక్షతతో రాజ్యం చేసాడు. అతడు తెలుగు కన్నడ తమిళ ప్రాకృతభాషల్లో ఒకొక్క కొరవంజలను తెలుగులో ఏడు యక్షగానాలను రచించాడు. అతని ఆస్థానంలో మల్లిక, మందారిక,మంజుభాషిణి, మధురవాహిని అనే నాట్యగత్తెలుండేవారట. కళువెవీరరాజు

కొడుకు కళువెనంజరాజు మైసూరు రాజుల దగ్గర దండనాథుడుగా వుండి కన్నడంలో వచనభారతాన్ని రచించాడు. తెలుగులో హాలాస్యమాహాత్మ్యం మొదలయిన వచన రచనలు చేసాడు. ఆలూరు నరసింహశాస్త్రి సంస్కృతంలో నంజరాజయశోభూషణమనే అలంకార శాస్త్ర గ్రంథాన్ని రచించాడు. దక్షిణంలో పుదుక్కోటను పాలించిన తెలుగు నాయకరాజులు తెలుగు సాహిత్యాభిమానంతో తెలుగు కవిపండితులను పోషించారు. రాజులు స్వయంగా రచనలు చేసారు. పుదుక్కోట రాజులకు "తొండమాన్" అని బిరుదం. రఘునాథుడు (క్రీ.శ 1682-1730) గురించి చాల చాటువులు కన్పిస్తున్నాయి. రాయ రఘునాథుడు (క్రీ.శ 1769-89) పార్వతీపరిణయం ప్రబంధం వ్రాసిన కవి. సంస్కృతంలోను పండితుడు. నుదురు పాటి వెంకన్న అనే ప్రసిద్ధ కవికి ఈ రాజు సతీర్థుడు. వెంకన్న రఘునాదీయమనే అలంకార శాస్త్రగ్రంథాన్ని అనేక కావ్యశాస్త్రాదులను రచించాడు. రాయరఘునాథుని తర్వాత రాజులు కూడ తెలుగుసాహిత్యాన్ని అభిమానించారు. మల్లయుద్ధశాస్త్రం, ఖడ్గలక్షణ శిరోమణి వంటి శాస్త్ర గ్రంథాలు ఈ రాజుల ఆస్థానంలో వ్రాయబడినాయి.పుదుచ్చేరిలో ఫ్రెంచి ప్రభుత్వోద్యోగిగా వున్న ఆనందరంగపిళ్ళై (క్రీ.శ 1746) తమిళుడైనా కస్తూరి రంగకవిని ఆదరించి ఆనంద రాగరాట్ఛందము రచనకు ప్రేరణనిచ్చాడు. "కస్తూరి రంగరంగా కావేటి రంగరంగా" అనే మకుటంగల పదాలను రంగకవి చాల వ్రాసాడు. ఆ పదాలు బాగా ప్రచారంలోకి వచ్చాయి.ఆనందరంగ పిళ్ళై చరిత్రను శ్రీనివాసకవి ఆనందరంగచంపువుగా వ్రాసాడు. అతడు బాణుని గద్యాన్ని అనుకరించాడు. దాన్ని బట్టి దక్షిణ భారతంలో ఒక వైపు తెలుగు ఆదరింపబడ్తున్నా సంస్కృతాభిమానం మాత్రం తరగలేదు. మౌలికమైన అలంకారవ్యాకరణ శాస్త్రాదులు కావ్యనాటకాలు వ్యాఖ్యానాలు రచింపబడ్తూనే వున్నాయి. వీరేశలింగం యుగంలోను కవులు సంస్కృత వాసనలను విడువలేదు. ఆనాటి కవులు సంస్కృతాంధ్రాలను నేర్చి సంస్కృత కావ్య నాటకాలను చాలా సంఖ్యలో అనువదించారు. కాల్పనిక యుగం నుంచే సంస్కృతం మీద మోజు తగ్గి ఇంగ్లీషు మీదికి పాకింది. రానురాను తెలుగు కవులకు సంస్కృతం తెలుసుకోవలసిన అవసరం లేదనే వాళ్ళు సంస్కృత పదాలను వాడకూడదనే వాళ్లు కూడా వున్నారు.జనుల వ్యవహార

తెలుగుకు దగ్గరగా వుండాలని వాళ్ళ ఉద్దేశం.

దక్షిణాంధ్రంలో 17 వ శతాబ్దంలో ఇంచుమించుగా రఘునాథనాయకుని కాలంలో కొన్ని చెప్పుకోదగిన తెలుగు కావ్యాలు వ్రాయబడినాయి. దామెర్ల వేంగళనాయకుడు (క్రీ.శ 1620) రామభద్రుని ప్రేరణతో బహుళాశ్వ చరిత్ర ప్రబంధాన్ని రచించాడు. దామెర్ల వంశంవాళ్ళు కాళహస్తిని పాలించారు. దామెర్లవారి ఆదరణ లో కాకమాని మూర్తికవి రాజవాహన విజయం, పాంచాలీ పరిణయం అనే ప్రబంధాలను వ్రాసాడు.సవరము చిన నారాయణకవి (క్రీ.శ 1600-50) కువలయాశ్వచరిత్ర ప్రబంధం వ్రాసాడు. కథావైచిత్రిలో పింగళి సూరన కళాపూర్ణోదయాన్ని పోలి వుంది. తిమ్మయ, బాలసరస్వతి, ఆతుకూరి సోమన అనే ముగ్గురు కవులు (క్రీ.శ 1550-1650) ద్విపదలో మహాభారతాన్ని వ్రాసి మరొక కవిత్రయంగా పేరు పొందారు. వాళ్ళది నెల్లూరు మండలం. కట్టా వరదరాజు (క్రీ.శ 1630) కడప మండలంవాడు. భాగవత చరిత్ర, శ్రీరంగమాహాత్మ్యం,రామాయణాలు రచించాడు.అతని రామాయణం వాల్మీకి ననుసరించి వున్నా కవి వైష్ణవుడు కాబట్టి వైష్ణవ ప్రబోధకంగా వుంది. దక్షిణాంధ్రంలో చిన్న చిన్న సంస్థానాలైన తిరుచునాపల్లి, తురయ్యూరు, చెయ్యూరు మొదలైన చోట్ల కూడా తెలుగు కావ్య రచనలు జరిగాయి.

దక్షిణాంధ్రంలో తమిళ కర్ణాటదేశాల్లో తెలుగు రాజులు పాలిస్తూ తెలుగు సాహిత్యం మీద అభిమానంతో తెలుగు కవుల నాదరిస్తున్న కాలంలో 17,18 శతాబ్దాల్లో 19వ శతాబ్దం ఉత్తరార్ధంలో ఆంధ్ర దేశంలోని సంస్థానాధీశ్వరులు తెలుగు కవుల నాదరించారు. కేంద్రాధికారం గల బ్రిటిషువాళ్ళు తురుష్కులు ఇంగ్లీషు పారశీ భాషలను రాజభాషలుగా చేసి పాలించారు. తెలుగునాదరించే వాళ్ళు లేక పోయారు. ఈ యుగాన్నే తెలుగు సాహిత్య చరిత్రలో క్షీణయుగ మంటున్నారు. రాజకీయమైన దోపిడి పరపాలన సాగుతున్న కాలం. క్షామాలు కోరలు చూపిన యుగం సంస్థాధీశ్వరులు జమిందార్లు కేంద్రాధికారానికి ప్రతినిధులుగా మాత్రమే వుండి వాళ్ళ చేతుల్లో కీలు బొమ్మలుగా వున్నారు. ఎంత అయితె అంత ప్రజలనుంచి పన్నుల రూపంగా

వసూళ్ళు చేసి కేంద్రాధికారానికిచ్చేది ఇచ్చి తమ వంతు మిగిలించుకోవాలని చూసిన కాలం. పాలకులకు ప్రజాక్షేమం పట్టలేదు. అందుకే నిరాశాపూరిత వాతావరణంలో సాహిత్యం నూతనోత్తేజంతో వికసించలేకపోయింది. రాజకీయంగా సామాజికంగా నిరాశాపూరిత వాతావరణం వ్యాపించింది. అప్పుడు కొందరు తిట్టుకవిత్వాలు అధిక్షేప శతకాలు వ్రాసారు. కేంద్రపాలకులకు సాహిత్యంమీద ముఖ్యంగా తెలుగు సాహిత్యం మీద ఆసక్తి లేదు. కాబట్టి సంస్థానాధీశ్వరులే తమ ఆర్థిక పరిస్థితులకు తగినంతగా ఏదోకొంత కవ్వం నాదరించారు. పిఠాపురం,పెద్దాపురం, విజయనగరం, బొబ్బిలి, వెంకటగిరి, శ్రీకాళహస్తి, నూజివీడు, అమరావతి, నరసరావు పేట, వల్లపల్లి, గద్వాల, వనపర్తి,ఆత్మకూరు, కొల్లాపురం,దోమకొండ సంస్థానాధీస్వరులు తెలుగు కవి పండితులను ఆదరించారు. రచనలను ప్రోత్సహించారు. ఈ సంస్థానాల్లో ఏనుగు లక్ష్మణకవి, కూచిమంచి తిమ్మకవి కూచిమంచి జగ్గకవి పుష్పగిరి తిమ్మన, కంకంటి పాపరాజు, కనుపర్తి అబ్బయామాత్యుడు,పిండి ప్రోలు లక్ష్మణకవి, అడిదం సూరకవి, గోపీనాథ వేంకటకవి, కుమార ధూర్జటి, దిట్టకవి నారాయణకవి (బొబ్బిలి యుద్ధాన్ని వర్ణిస్తూ రంగరాయచరిత్రను వ్రాసాడు) కాసుల పురుషోత్తమ కవి, కాణాదం పెద్దన సోమయాజి, ఎలకూచి బాలసరస్వతి మొదలయిన కవులున్నారు. క్రీ.శ 1858 లో భారతదేశంలో తూర్పు ఇండియా కంపెనీ పాలన పోయి విక్టోరియారాణి పాలన ఏర్పడింది. రాజారామ మోహనరాయల వంటి దూరదర్శనాశక్తి గల సంస్కర్తల చేత ధార్మిక సామాజిక సంస్కరణోద్యమాలు లేచాయి.దాంతో భారతదేశమంతటా పునరుజ్జీవనోద్యమం ప్రవేశించింది. ఆంధ్రదేశంలో వీరేశలింగం పంతులు వంటి వాళ్ళు సంస్కరణోద్యమాలను నడిపారు. సాహిత్యంలో మార్పుకు కొత్తదనానికి కృషిచేసారు. చెప్పిందే చెప్పే అనాటి కవుల ప్రాచీన ధోరణులను నిరసించి కొత్తదనం తేవాలని ప్రయత్నించారు. అప్పుడు కవులు అంతవరకు జరుగని సంస్కృత నాటకాలను కావ్యాలను ఇంగ్లీషునాటకాలను అనువదించారు. కావ్యప్రబంధాలను కాక ఖండకావ్యరచనలను చేసారు. అయితే ఆకవులకు చాలామందికి ఈ సంస్థానాలే ఆదరణను కల్పించాయి.పిఠాపురం రాజా సూర్యారావు ఇచ్చిన

ధనంతోనే సూర్యరాయాంధ్ర నిఘంటువు అచ్చయింది. మండపాక పార్వతీశ్వర బొబ్బిలివారి ఆదరణ పొందాడు. ఇక విజయనగర సంస్థానాధిపతుల తెలుగు సాహిత్యపోషణ విశేషమైంది.ఆనంద గజపతి చేత ఆదరింపబడినవాళ్ళలో బహుజనపల్లి సీతారామాచార్యులు (ప్రౌఢవ్యాకరణ కర్త) గురజాడ శ్రీరామమూర్తి (కవిజీవితములు) గురజాడ (కన్యాశుల్కం) తచ్చూరి సింగరాచార్యులు (గాయక పారిజాతం) వంటివాళ్ళున్నారు. ఆచార్య మామిడిపూడి వెంకట రంగయ్య, ఆకుండి వెంకట శాస్త్రి, ఆదిభట్ల నారాయణదాసు, భోగరాజు నారాయణ మూర్తి, బులుసువేంకట రమణయ్య మొ.న పండితులు విజయనగర సంస్థానాధీశ్వరుల ఆశ్రయంలో వర్ధిల్లారు. మునగాల ఆస్థానంలో కొమర్రాజు వేంకట లక్ష్మణరావు (క్రీ.శ 1877-1923) ఆంతరంగిక కార్యదర్శిగా పనిచేసిన పరిశోధకుడు. పండితుడు. మునగాల రాజానాయని వెంకటరంగారావు ప్రోత్సాహంతో శ్రీకృష్ణదేవరాయాంధ్రనిలయం అనే గ్రంథాలయం ఆరంభింపబడి తెలంగాణాలో గ్రంథాలయోద్యమానికి తద్వారా తెలంగాణా ఆంధ్రోద్యమానికి పునాది వేసింది. లక్కవరం రాజా మంత్రి ప్రెగడ భుజంగరావు (క్రీ.శ 1872-1948) స్వతంత్ర నాటకాలు వ్రాసాడు. చెంచయ్య సహాయంతో "History of Telugu literature" వ్రాసిప్రకటించాడు. ఆకొండి వ్యాసమూర్తి శాస్త్రి వీరి ఆదరణలో వున్నాడు. పోలవరం జమిందారు కొచ్చర్ల కోట రామచంద్ర వెంకట కృష్ణారావు పోషణలోనే తిరుపతి వేంకట కవులుండి బుద్ధచరిత్రను వ్రాసి అతని కంకితమిచ్చారు. సంగమ వలస సంస్థానాధిపతి నిశ్శంకభూపాలుడు సంస్కృతాంధ్రపండితుడు. పరవస్తురంగాచార్యులు అతని జీవిత చరిత్రను "నిశ్శంకచరిత్ర" పేరుతో పద్య కావ్యంగా వ్రాసాడు. ధర్మవరం కృష్ణమాచార్యులు ఆంధ్రనాటకపితామహ బిరుదాంకితుడు గద్వాలలో ఆస్థాన సంగీతవిద్వాంసుడుగా గౌరవం పొందాడు. వనపర్తిలో మానవల్లి రామకృష్ణకవి గ్రంథ ప్రచురణ కార్యనిర్వాహకుడుగా పదియేండ్లు పని చేసాడు. దోమకొండ పాలకుడు రాజాసోమేశ్వరరావు సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రి కావ్యాలంకారసంగ్రహం ను ప్రచురించాడు. ఆచంట వేంకట సాంఖ్యాయన శర్మ, శ్రీపాద కృష్ణ మూర్తి, మతుకుపల్లి

నరసింహశాస్త్రి, ఆదిభట్ల నారాయణదాసు వంటి పండితులెందరో బ్రిటిషు పాలనలో సంస్థానాధీశ్వరుల ఆదరణలో కృతులు రచించి వారిచ్చిన ద్రవ్యసహాయంతో ప్రచురించారు. వీరేశలింగం యుగం తెలుగు సాహిత్య చరిత్రలో బ్రిటిషు పాలనాయుగం అని సంస్థానాధీశ్వరుల యుగం అని అనవచ్చును. క్రీ.శ 1857లో కళాశాలలు, విశ్వ విద్యాలయాల స్థాపనతో భారతీయుల ఇంగ్లీషు విద్యనభ్యసించి ఉపాధ్యాయులుగా న్యాయవాదులుగా ఉద్యోగాలు చేసి సంపాదన పరులైనారు. కీ.శ 1920లో గాంధీజీ ప్రవేశంతో స్వాతంత్ర్యోద్యమం వ్యాపించింది. దాంతో చదువుకున్న యువకుల్లో ఆత్మ గౌరవం, స్వాతంత్ర్యేచ్ఛలు ప్రబలి ఒకరి సంతోషం కోసం గాని మరొకరి ధనాన్ని పోషణను అపేక్షించిగాని రచనలు చేయడం మానేసారు. తమకు ఆవేశరూపంలో వచ్చిందాన్నే కవిత్వంగా చెప్పారుకాని రాజులు మహారాజులు కోరిన రచనలు చేయడంగాని వారికి అంకితంగా ఇయ్యడంగాని మానే సారు.కవులు స్వాతంత్ర్యప్రియులైనారు. వాళ్ళ మీద ఏ అంకుశం పని చేయలేదు.

## రఘునాథనాయకుడు

రఘునాథనాయకుడు క్రీ.శ 1614-1633 నడుమ తంజావూరును పాలించాడు. అతడు యుద్ధతంత్ర నిపుణుడు. పరిపాలనాదక్షుడు. కవి పండితుడు. సంగీతజ్ఞుడు. కవిపండితుల నాదరించాడు. శ్రీకృష్ణదేవరాయల వలెనే అభినవభోజుడని ప్రశంసింపబడినాడు. రాయలవలెనే సాహితీ సమరాంగణ సార్వభౌముడు. ఆ రాజకవి సంస్కృతాంధ్రంలో కవిత్వం చెప్పగలవాడు. ఆ నాయకరాజు రచనలు -వాల్మీకి చరిత్ర, శృంగారసావిత్రి ప్రబంధాలు. నలచరిత్ర ద్విపదకావ్యం. అతడు వ్రాసిన రామాయణంలో కొంతభాగమే దొరికింది. ఆ కవి ఆశువుగా పారిజాతాపహరణకృతిని చెప్పి తండ్రి చేత కనకాభిషేకగౌరవాన్ని పొందాడు. తనతండ్రి అచ్యుతనాయకుని చరిత్రను అచ్యుతాభ్యుదయం కావ్యంగా వ్రాసాడు. అతని ఆస్థానంలో రామభద్రాంబ మధురవాణి వంటి కవయిత్రులు కృష్ణాధ్వరి చౌడప్ప చేమ కూర వేంకటకవి వంటి కవులున్నారు.

# చేమకూర వేంకటకవి

రఘునాథరాయల ఆదరణను పొందిన కవి. విజయవిలాసమనే ప్రబంధాన్ని వ్రాసి ఆ కవి ఆ రాజుకే అంకితమిచ్చాడు. వేంకటకవి మొదటి కృతి సారంగధర చరిత్ర. దీని అవతారిక ఆశ్వాసాంతపద్యాలు దొరకలేదు. కాబట్టి కవి దీన్ని ఎవరికి అంకితంగా ఇచ్చాడో తెలియదు. సారంగధర చరిత్ర చంపువులో వ్రాయబడింది. ఈకావ్యం ఎక్కువ కీర్తిని కవికి గడించిపెట్టలేదు.అందుకే కవి విజయవిలాసంలో "ఏ గతి రచియించిరేని సమకాలమువారలు మెచ్చరు గదా" అని వాపోయాడు. సారంగధరుడు రాజరాజనరేంద్రుని కుమారుడని ప్రచారంలో వుంది. కాని అది చారిత్రకసత్యం కాదు. సారంగధర చిత్రాంగి కథ మాళవదేశంలో జరిగిందని వేంకటకవి వ్రాసాడు. సారంగధరుడు నాథసంప్రదాయంలో నవనాథుల్లో ఒకడుగా ప్రసిద్ధి చెందాడు. గౌరన తన నవనాథచరిత్ర ద్విపదకావ్యంలో సారంగధరుని కథను చెప్పాడు. వేంకటకవి దాన్ననుసరిస్తు ప్రబంధోచితవర్ణనలతో పెంచి ఈ కావ్యాన్ని రచించాడు.

వేంకటకవి విజయవిలాసం రమ్యమైన ప్రబంధం. దీనిలో 3 ఆశ్వాసాలున్నాయి. 3 ఆశ్వాసాల్లో క్రమంగా నాయకుడైన అర్జునుడు ఉలూచి చిత్రాంగద సుభద్రలను వివాహమాడే కథలున్నాయి. కవి మహాభారతం నుంచి ఈ కథలను తీసుకొని వర్ణనలతో సంభాషణలతో పాత్ర చిత్రణాశిల్పంతో పెంచి ఈ ప్రబంధాన్ని రచించాడు. తెలుగు ప్రబంధాల వరుసలో మౌలికమైనది సుందరమైనది ఇదే చివరి ప్రబంధం.

వేంకటకవి శ్లేష యమకం అనుప్రాసలను ప్రయోగించడంలో నిపుణుడు. "ప్రతి పద్యము నందు చమత్కృతి కలుగంజెప్ప నేర్తువు" అని కృతిపతి రఘునాథనాయకుడు ఈ కవిని ప్రశంసించాడు. నిజంగానే వేంకట కవి ప్రతిపద్యంలో శ్లేషచమత్కారాన్నో అలంకార చమత్కారాన్నో సామెతలను నుడికారాలను ప్రయోగించి చమత్కారాన్నో సాధించాడు. వేంకటకవి శ్లేష యమకాలను వాడినా అవి సులభగ్రాహ్యంగా వుండి కవిత్వాన్ని సరళ

సుబోధకం చేసాయి. అభంగ సభంగ శ్లేషలను వేంకటకవి వాడి తన శ్లేషప్రయోగచాతుర్యాన్ని చూపాడు. ఉలూపి సుభద్ర అర్జునుల పాత్రలను కవి సజీవంగా చిత్రీకరించాడు. వేంకటకవి శైలి స్వతంత్రమైనది. ఇతడెవరినీ అనుకరించలేదు. చేమకూరకవి కవిత్వం భావాలు ఉదాత్తంగా చమత్కారపూర్ణంగా వున్నాయి.

## విజయ రాఘవ నాయకుడు

ఇతడు రఘునాథనాయకుని కొడుకు. అతని తర్వాత తంజావూరు నేలిన రాజు. తెలుగులో ఇతడు 50 కృతులను రచించానని ప్రహ్లాదచరిత్ర పీఠికలో చెప్పుకున్నాడు. సంగీత సాహిత్యప్రియుడు. ఇతని కాలంలో తెలుగులో యక్షగాన ప్రక్రియ శిఖరాగ్రాన్ని చేరుకుంది. ఆరాజకవి స్వయంగా 20 వరకు యక్షగానాలను వ్రాసాడు. కాని ఆరు మాత్రమే దొరికాయి. యక్షగానాల్లో సంస్కృతనాటక పద్ధతులను ఆ కవి ప్రవేశపెట్టాడు. ఇతనికి ద్విపద అన్న కూడా అభిమానమే. ఆ కవి పాదుకాసహస్రము, మోహినీవిలాసము, మంజరీ ద్విపద, రఘునాథనాయకాభ్యుదయమనే నాలుగు ద్విపద కావ్యాలు వ్రాసాడు. వాటిల్లో చివరి రచన దొరుకుతున్నది. విజయ రాఘవుడు గోపికాభ్రమర గీతాలను, రగడ, దండకాలను కూడా రచించాడు.

విజయ రాఘవుని ఆస్థానంలో అనేక కవయిత్రులు కవులు పండితులున్నారు. వాళ్ళల్లో రంగాజమ్మ అతనికి ప్రియురాలు భార్యయైన కవయిత్రి. ప్రతిభ గలది.

## రంగాజమ్మ

రంగాజమ్మకు రంగాజీ అని పేరు. రంగాజి+అమ్మ = రంగాజమ్మ అయింది. విజయరాఘవనాయకుని (క్రీ.శ 1633-1674) భార్యనని చెప్పుకున్నది. ఈమె రాజమన్నారుదాసవిలాస ప్రబంధాన్ని రామాయణభారత భాగవత సంగ్రహాలను పద్య రూపంగాను, మన్నారు దాసవిలాస నాటకమనే యక్షగానాన్ని ఉషాపరిణయమనే ప్రబంధాన్ని వ్రాసింది. ఇంకా ఈమె

మధురమైన పదాలను కూడా వ్రాసిందట. ఇప్పుడు మన్నారుదాసనాటకం, ప్రబంధం, ఉషాపరిణయ ప్రబంధం మాత్రమే దొరుకుతున్నాయి.

మన్నారుదాసవిలాసప్రబంధంలో విజయరాఘవ నాయకుడు కాంతిమతిని పెండ్లాడే వృత్తాంతం వుంది. ఆ రాజుకు మన్నారుదాసు అనే బిరుదముంది. ఆ కావ్యాన్ని రంగాజమ్మ విజయరాఘవుని ఇష్టదైవం రాజగోపాలునికంకితమిచ్చింది. కవయిత్రి దీనిలో శ్లేష ఉత్ప్రేక్ష అతిశయోక్త్యాది అలంకారాలను ప్రయోగించింది. వర్ణనలు రమ్యంగా వున్నాయి. ఇది 5 ఆశ్వాసాల ప్రబంధం.

ఉషాపరిణయం 5 ఆశ్వాసాల ప్రబంధం. విజయ రాఘవుడు హరివంశంలోని ఉషాపరిణయాన్ని కావ్యంగా వ్రాయమని రంగాజమ్మను కోరాడు. దాన్ని వ్రాసి ఆమె ఆ రాజుకే అంకితంగా ఇచ్చింది. దీనిలో ఆమె కవిత్వం ప్రౌఢంగా వుంది. తంజావూరు నాయకరాజుల కాలంనాటి ఆచార వ్యవహారాలు దీనిలో ప్రతిబింబించాయి.

మన్నారు దాసవిలాసమనే యక్షగానంలో విజయ రాఘవుడు కాంతిమతిని వివాహమాడే వృత్తాంతమే వుంది. దీన్ని కూడా కవయిత్రి రాజగోపాలునికి అంకితంగా ఇచ్చింది. ఇది ఆమె చివరి రచన. రాజ గోపాల స్వామి రథోత్సవానికి వచ్చిన కాంతిమతి విజయరాఘవున్ని చూసి ప్రేమించి విరహతప్తురాలవుతుంది. కాంతిమతి చెలికత్తె రాజు దగ్గరికి రాయబారిగా పోయి కార్యాన్ని చక్కబెడుతుంది. ఇంతలో సాక్షాత్తు రాజగోపాలస్వామి భార్య చెంగమలదేవి ఎరుకసానిగా వచ్చి ఎరుక చెప్తుంది. చివరకు రాజగురువైన తాతాచార్యుల ప్రయత్నంతో విజయరాఘవుడు కాంతిమతిని వివాహమాడుతాడు. యక్షగానాల్లో కన్పించే హాస్యంతో కూడిన పాత్రోచితమైన సంభాషణలున్నాయి. రంగాజమ్మ కవితాశైలి సంస్కృత సమాసాలు లేక సరళశైలిలో వుంది. చక్కని తెలుగు పలుకుబడులను కవయిత్రి ప్రయోగించింది. రంగాజమ్మ తనకృతుల్లో శ్రీనివాసాచార్యులను గురించి చెప్పడంచేత కుమారతాతాచార్యులతర్వాత శ్రీనివాసాచార్యులు కులగురువైన తర్వాత ఆమె ఈ కృతులను రచించిందని క్రీ.శ 1645-55ప్రాంతమని

చెప్పవచ్చును.

## క్షేత్రయ్య

క్షేత్రయ్య (క్రీ.శ 1600-1680) కృష్ణా జిల్లాలో మొవ్వ గ్రామనివాసి. దానికి దగ్గర లోనే కూచిపూడి గ్రామం వుంది. క్షేత్రయ్య మొవ్వలో వెలసిన గోపాలస్వామి భక్తుడు. మొదట అతని పేరు వరదయ్య.తర్వాత క్షేత్రయ్యగా మారింది. అతన్ని గౌరవంగా క్షేతజ్ఞులు అని కూడా పిలుస్తారు. క్షేత్రయ్యది మధురభక్తి. అతని పదాలు శృంగార భరితమైనయి.

క్షేత్రయ్య చాలామంది రాజులను దర్శించి ఆదరింపబడినాడు. మధుర రాజు తిరుమలనాయకుడాతన్ని సత్కరించాడు. రఘునాథనాయకుని కూడా అతడు దర్శించినట్లు ఆంధ్రకౌముదినిబట్టి తెలుస్తున్నది. విజయరాఘవుని ఆస్థానంలో క్షేత్రయ్య చాలా కాలముండి పదాలను రచించాడు. గోలకొండ సుల్తాను అబుల్ హసన్ కుతుబ్షాను దర్శించి క్షత్రయ్య 40 రోజుల్లో 1500 పదాలు రచించి సుల్తాను చేత సన్మానింపబడినాడు. రామదాసు త్యాగయ్యలు క్షేత్రయ్యకు ఇంచు మించుగా సమకాలికులే. క్షేత్రయ్య మొత్తం 4500 పదాలు రచించినట్లు తెలుస్తున్నది. ఇప్పుడు 400 పదాల వరకు దొరుకుతున్నాయి. వీటిల్లో క్షేత్రయ్య నాయికా నాయకుల శృంగారావస్థలను అలంకార శాస్త్ర సమ్మతంగా మధురంగా రమణీయంగా వర్ణించాడు. అతని కవిత్వం లలిత మధురపదజాలంతో కూడివుంటుంది. అతడు కూచిపూడి దగ్గరివాడు కాబట్టి అతనికి అభినయంతో కూడా పరిచయం వుండివుంటుంది. అందుకే అతని పదాలు సంగీత సాహిత్యాలతో కూడి చక్కని అభినయానికి అనువుగా వున్నాయి. అతని పదాలు జయదేవుని అష్టపదులను పోలి భక్తి శృంగారమయంగా మధురంగా వున్నాయి. విరహ శృంగారం, నాయిక విరహం కోపం వేదన వర్ణనలతో కూడిన క్షేత్రయ్య పదాలను జావళీలంటారు. ఈజావళీల మీద ఆనాడు ఉర్దూ పారశీభాషల్లో వున్న గజళ్ళ ప్రభావముందేమో. అతని శైలి తేటతెలుగులో సామాన్యులకు కూడా అర్థమయ్యేటట్లుగా వుంది.

# త్యాగయ్య

కాకర్ల త్యాగయ్య (క్రీ.శ 1756-1847) గొప్ప రామభక్తుడు. గొప్ప సంకీర్తన కారుడు. పోతన మొల్ల రామదాసుల వలె త్యాగయ్య రామభక్తి సంప్రదాయానికి చెందినవాడు. ఇతడు తంజావూరు నేలిన మహారాష్ట్ర రాజు రెండో శరభోజి కాలంవాడు. ఆంధ్రదేశం నుంచి వలసపోయి ఇతని వంశజులు తంజావూరు సమీపంలోని తిరువాయూరులో స్థిరపడినారు. త్యాగయ్య రాజాశ్రయాన్ని కోరలేదు. రాజులిచ్చిన గౌరవసత్కారాలను స్వీకరించలేదు. పోతన లాగానే ఈ కవి రాజాశ్రయాన్ని ఆశించలేదు. త్యాగయ్యకు రాముడు సాక్షాత్కరించాడట. త్యాగయ్య చెప్పిన కీర్తనలు 600 దాకా వున్నాయి. కొన్ని కీర్తనలను కవి సంస్కృతంలోను రచించాడు. త్యాగయ్య సంకీర్తనలు నాదసంపదతో కూడినవే కాక సాహిత్య సంపదతోను కూడినవి. అతని సంకీర్తనలు భక్తి సంగీతం సాహిత్యమాధుర్యం కలవి. అతని కవిత్వం సహజ సుందరమైంది. అందమైన భావాలను సరళసులభమైన భాషలో కూర్చాడు.

త్యాగయ్య చిన్ననాటనుంచే సంకీర్తనలు రచించాడట. చిన్నతనంలో అతడు పురందరదాసు, అన్నమాచార్యుల, రామదాసు కీర్తనలను పాడేవాడట. తండ్రి అతని ప్రతిభను గుర్తించి తంజావూరు రాజు ఆస్థాన సంగీతవిద్వాంసుడైన శొంఠి వేంటరమణయ్య శిష్యరికంలో చేర్చాడట. త్యాగయ్య ఏకసంథాగ్రాహి. వాల తొందరలోనే అతడు సంగీతసముద్రాన్ని ఆపోశనం పట్టాడు. త్యాగయ్య తన పదాలను భక్తి పారవశ్యంతో ఆత్మానందం కోసం పాడుకోడానికే రచించాడు కాని ధనార్జన కోసం పదవి కోసం కాదు. తాగయ్య సంకీర్తనలను వ్రాయడమేకాక రాగాలకు ముఖ్యంగా ఖరహరప్రియ, హరికాంభోజి రాగాలకు జీవంపోసాడు. ఈనాడు కీర్తనలను పాడుకునే తీరుకు మార్గదర్శకుడయ్యాడు.

తాగయ్య కీర్తనలేకాక ప్రహ్లాద విజయం, నౌకావిజయం, సీతారామ విజయం అనే యక్షగానాలను వ్రాసాడు. త్యాగయ్యది యక్షగానాల కాలం. త్యాగయ్య తాత (తల్లి తండ్రి) గిరిరాజకవి కూడా యక్ష గానాలను వ్రాసి

నవాడు. సంగీత సాహిత్యాలకు నిలయమైన యక్షగానప్రక్రియ సహజంగానే త్యాగయ్యను ఆకట్టుకొని వుంటుంది. ప్రహ్లాదవిజయంలో ప్రహ్లాదుని భక్తి కథ, నౌకావిజయంలో శ్రీకృష్ణుడు గోపికలతో యమునానది మీద నౌకావిహారం చేయడం గోపికల భక్తి వున్నాయి. సీతారామవిజయం ముద్రిత మైందట కాని దొరకడం లేదు.

కర్ణాటక సంగీత క్షేత్రంలో సంగీత త్రిమూర్తుల్లో త్యాగయ్య ఒకడు, మిగి లిన ఇద్దరు-ముత్తుస్వామిదీక్షితారు, శ్యామశాస్త్రి. దీక్షితారు సంస్కృతంలో పదాలు వ్రాసాడు. శ్యామశాస్త్రి త్యాగయ్యలు తెలుగులో సంస్కృతంలోనూ వ్రాసారు. ఈ ముగ్గురిలో త్యాగయ్య సంగీతశైలి సులభంగా పాడడానికి వినడానికి ఇంపుగా వుంటుంది. వాళ్ళను వాగ్గేయకారులని కూడా అంటారు.

## దక్షిణాంధ్రయుగ వైశిష్ట్యం

తంజావూరు, మధుర, జింజి, మైసూరు, పుదుక్కోట మొదలైన రాజ్యాలను తెలుగు రాజులు విజయనగర రాజులకు సామంతులుగా వుండి పాలించే వాళ్ళు. క్రీ.శ 1564లో తళ్ళికోటయుద్ధంలో విజయనగర సామ్రా జ్యాస్తమయంతో ఆ రాజులు స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకొని పాలించారు. ఆ రాజులు తెలుగువాళ్ళు కాబట్టి తెలుగు కవిపండితుల నాదరించి తెలుగుసాహిత్యాన్ని పోషించారు. కాబట్టి క్రీ.శ 17,18 శతాబ్దాలను 19 వ శతాబ్దం పూర్వభాగం వరకు తెలుగు సాహిత్య చరిత్రలోని ఈ కాలాన్ని దక్షి ణాంధ్రయుగం అనడం కూడా వుంది. ఈ రెండున్నర శతాబ్దాల కాలంలో తెలుగు సాహిత్యం మౌలికమైన ప్రబంధ రచనలతో అనేక నూతన ప్రక్రి యల ప్రత్యేకతతో వికసించింది.తంజావూరు మధురనేలిన నాయకరాజులు స్వయంగా కవి పండితులు. సంగీతజ్ఞులు. అభినయాభిమానులు. స్వయంగా ప్రబంధాలను యక్షగానాలను పదాలను ద్విపద వచనకావ్యాలను రచించారు. నాయక రాజులు తమ మాతృభాష మీద అభిమానాన్ని విడువకుండా తెలుగుభాషా సాహిత్యాలను పోషించారు. మహారాష్ట్రరాజులు కూడా

తమ మాతృభాష మరాఠీ అయినా తెలుగు మీద అభిమానంతో తెలుగులో రచనలు చేసారు. తెలుగు కవి పండితులను ఆదరించారు. ఈ కాలంలో రఘునాథనాయకుడు, శహాజీ రాజులు అపరభోజులుగా కీర్తింపబడినారు. రెండో శరభోజి (క్రీ.శ 1793-1833) తంజావూరునేలిన చివరి ప్రసిద్ధుడైన రాజు. ఆయన సంగీతసాహిత్యవిద్యా పోషకుడు. ఆయన తెలుగులో కాక సంస్కృతంలో 4 ఆశ్వాసాల కుమారసంభవ చంపూకావ్యాన్ని వ్రాసాడు. అతడు పుస్తక ప్రేమి. సరస్వతీ మహల్ అనే గ్రంథాలయాన్ని స్థాపించి అనేక తెలుగు తమిళ మరాఠీ గ్రంథాల తాళపత్రప్రతులను సేకరించి భద్రపరిచాడు. దీనిలో తెలుగు గ్రంథాల సంఖ్య ఎక్కువగా వుంది. కుమార సంభవం వంటి ఎన్నో మరుగునపడిన తెలుగు కావ్యాలు ఈ గ్రంథాలయంలో లభించాయి. దక్షిణాంధ్రయుగ విశిష్టతలో ఇది ఒకటి.

దక్షిణాంధ్రయుగంలో చేమకూరకవి వ్రాసినా విజయవిలాసం వంటి రసవంతమైన ప్రబంధాలు శుకసప్తతి వంటి చక్కని కథాకావ్యాలు, ఎన్నో ద్విపద వచన యక్షగాన రచనలు పదరచనలు గణితవేదాంత సంగీతశాస్త్ర సంబంధమైన రచనలు వచ్చాయి.నిఘంటువులు ఈ కాలంలో తెలుగులో రావడం విశేషం. లక్షణశాస్త్ర గ్రంథాలనేకం వ్రాయబడినాయి. అనేక శతకరచనలు జరిగాయి. మధురవాణి, రామభద్రాంబ కృష్ణాజి వంటి కవయిత్రులు సంస్కృతంలో కృతులు రచించారు. రఘునాథనాయకుడు సంస్కృతంలోను కృతులు రచించాడు. దక్షిణాంధ్రయుగంలో చాలామంది స్త్రీలు కవి పండితులై కావ్యరచనలు తెలుగు సంస్కృతంలో రచించడం ఒక విశిష్టత. ఈ యుగంలో కవయిత్రులు పదరచనలు యక్షగాన రచనలు కూడా చేసారు. ఈ కవయిత్రులు సంగీత సాహిత్యాభినయాల్లో నిష్ణాతలు. ఈ యుగంలో వున్నంత మంది కవయిత్రులు తెలుగులో మరేయుగంలోను లేరు.

దక్షిణాంధ్ర యుగంలో గణపవరపు వేంకటకవి (మధుర రాజు ముద్దళ గిరి ఆస్థాని) అవధాన విద్యలో ప్రవీణుడు. ఇరవై అవధానాలను చేసినట్లుగా ఆ కవి చెప్పకున్నాడు. దీన్ని బట్టి ఈ కాలంలో అవధాన ప్రక్రియ కూడా వెలిసిందని తెలుస్తున్నది. ఈ కాలంలో శేషము వేంకటపతి శశాంక

విజయము, ముద్దుపళని రాధికాసాంత్వనం వంటి శృంగారం మితిమీరిన కావ్యాలు కూడా వచ్చాయి. దక్షిణాంధ్రయుగంలో ఆశుకవిత్వం, చిత్రకవిత్వం కూడా బాగా సాగింది. ఎన్నో చాటు పద్యాలు దొరుకుతున్నాయి. కృష్ణాధ్వరి నైషధపారిజాతీయము, నెల్లూరి వీరరాఘవకవి యాదవపాండవీయము, ఎలకూచి బాలసరస్వతి రాఘవయాదవ పాండవీయము వంటి ద్వ్యర్థి త్ర్యర్థి కావ్యాలు కూడా వ్రాయబడినాయి.

ఈ విధంగా దక్షిణాంధ్రయుగం అనేక కవిపండితులచేత అనేక ప్రక్రియలతో విలసిల్లింది. ఈ యుగంలోని విశిష్టతలను మరికొంత విశదంగా పరిశీలిద్దాం - 1.ద్విపద కావ్యరచన - దక్షిణాంధ్రయుగానికి పూర్వమే పాల్కురికి సోమనకాలంలోనే తెలుగులో ద్విపద కావ్యరచన ఆరంభమైంది. గౌరన హరిశ్చంద్రోపాఖ్యానం వంటి కావ్యాన్ని శ్రీనాథయుగంలో వ్రాసాడు. కాని తంజావూరు మధురరాజుల ఏలుబడిలో అనేక ద్విపద కావ్యాలు రచన సాగింది. రఘునాథనాయకుడు విజయ రాఘవుడు స్వయంగా అచ్యుతాభ్యుదయం, రఘునాథాభ్యుదయం అనే ద్విపద కావ్యాలను వ్రాసారు. విజయరాఘవునికి ద్విపద రచన అంటె అభిమానం. ఆతడు నాలుగు ద్విపదకావ్యాలను వ్రాసాడు. పచ్చకప్పురపు తిరువేంగళకవి చొక్కనాథ చరిత్ర అనే ద్విపద కావ్యాన్ని వ్రాసాడు. ఈ కవి రఘునాథనాయకుని తండ్రి అచ్యుతదేవరాయల కాలంవాడు. దీనిలో సుందరేశ్వరుని లీలలు వర్ణింప బడినాయి. దీన్నే తర్వాత నీలకంఠదీక్షితులు శివలీలార్ణవమలే పేరుతో సంస్కృతమహాకావ్యంగా 22 సర్గలతో రచించాడు.

2. వచన కావ్యరచన - దక్షిణాంధ్రయుగంలో వచన కావ్య రచన విశేషంగా జరిగింది. ముఖ్యంగా మధురనాయక రాజులు వచనవాఙ్మయాన్ని ప్రోత్సహించారు. మధుర నేలిన విజయరంగ చొక్కనాథుని కాలం (క్రీ.శ17061732) వచనకావ్యాలకు స్వర్ణయుగం. తెలుగులో నన్నయనాటి నుంచి చంపూమార్గమే కావ్యాల్లో ప్రయోగింపబడింది. ఆ చంపూ కావ్యాల్లో శాసనాల్లో తెలుగు వచనరచన కన్పిస్తున్నది. శైవ వైష్ణవకవులు క్రీ.శ 12,13 శ.ల్లో భక్తిభరితమైన ఛందోఛాయలు కలిగిన "వచనం" "గద్యం" వ్రాసారు.కాని అచ్చమైన వచనకావ్యాలు చాలా తర్వాత కాలంలోనే

తెలుగులో వచ్చాయి. సంస్కృత గద్యకావ్యాలను కథలను కూడా తెలుగు కవులు చంపువులోనే వ్రాసారు. పూర్తి వచన రచన క్రీ.శ 16 వ శతాబ్దంలో వ్రాయబడింది. అది ఏకామ్రనాథుడు (క్రీ.శ 16వ శ.) వ్రాసిన ప్రతాపచరిత్ర. అది చారిత్రకకావ్యం. తర్వాత కాసె సర్వప్ప సిద్ధేశ్వర చరిత్ర కొంతభాగం వచనంలో వుంది. క్రీ.శ 1550 ప్రాంతంలో ఎల్లకర నరసింహకవి భారత సావిత్రిని వచనంలో వ్రాసాడు. ఈ కాలంలో కొన్ని వేదాంతగ్రంథాలు వచనంలో వ్రాయబడినాయి. ఈ కాలంలో రాయవాచకమనే చారిత్రక కావ్యం వచ్చింది. అది మధురనేలిన విశ్వనాథనాయకుని స్థానాపతి తన ప్రభువుకు శ్రీకృష్ణదేవరాయల ఆస్థానవిశేషాలను గురించి వ్రాసిన పత్రరూపమైన కావ్యం.

క్రీ.శ 17,18 శతాబ్దాల్లో మధుర తంజావూరు మైసూరు రాజ్యాల్లో వచన రచన చాలా జరిగింది. ముఖ్యంగా 18 వ శతాబ్దంలో వచన రచన విరివిగా జరిగింది. దక్షిణాంధ్రంలో వచ్చిన వచనకావ్యాల్లో లింగనమఖి కామేశ్వరకవి వ్రాసిన ధేనుమాహాత్మ్యం మొదటిది. ఈ కవి మధురరాజు ముద్దళగిరి ఆస్థానకవి. మధురరాజు విజయరంగచొక్కనాథుడు వచనరచనను ప్రోత్సహించడమేగాక స్వయంగా శ్రీరంగమాహాత్మ్యం, మాఘమాహాత్మ్యం అనే వచన కావ్యాలను వ్రాసాడు. అతని ఆస్థానకవి సముఖం వేంకటకృష్ణప్ప నాయకుడు జైమినిభారతాన్ని వచనంలో వ్రాసి ఆ రాజు కంకితంగా ఇచ్చాడు. అతని మరో వచనరచన సారంగధరచరిత్ర. అతని వచనశైలి రమ్యంగా సరళంగా వుంటుంది. దీర్ఘవాక్యాలున్నా అన్వయకాఠిన్యంలేదు.విజయరంగచొక్కనాథుని మరో ఆస్థానకవి కుందుర్తి వేంకటాచలకవి. భారతరామాయణాలను వచనంలో వ్రాసాడు. కాని అవి దొరకలేదు. చొక్కనాథుని కాలం వాడే శ్యామరాయకవి వచన రామాయణాన్ని వ్రాసాడు. మరోకవి శ్రీపతి రామభద్రుడు హాలాస్యమాహాత్మ్యం వచన కావ్యాన్ని వ్రాసాడు.

మైసూరు రాజుల ఆస్థానంలో చక్కని వచన కావ్యాలు వెలిసాయి. మైసూరు రాజుల సామంతుడు కళువె వీరరాజు (క్రీ.శ 1704-1731) మహాభారతాన్ని వచనంలో వ్రాసాడు. దీనిలో ఆది సభా భీష్మపర్వాలే దొరుకుతున్నాయి. వీరరాజు ప్రసిద్ధ కవి పోషకుడు చిక్కదేవరాయల

కాలంవాడు. వీరరాజు వ్యాసభారతాన్ని అనువదించాడు. అతని వచనరచన సరళ సులభంగా వుంటుంది. వీరరాజు కొడుకు కళలె నంజరాజు సంస్కృతాంధ్ర కన్నడ భాషల్లో కావ్యాలను వ్రాశాడు. తెలుగులో హాలాస్యమాహాత్మ్యం కన్నడంలో భారతం వచన కావ్యాలుగా వ్రాశాడు. అతని వచనరచన సులభమైంది. చంద్రగిరి రాజు కొడుకు [illegible] అనంతభూపాలుడు ప్రసిద్ధ వచన కావ్యకవి. విష్ణుపురాణం, భగవద్గీత, రామాయణంలో సుందరకాండాన్ని అతడు వచనంలో వ్రాశాడు. కళలె వీరరాజు భారతరచనలో అతడు సహాయపడినాడట. దక్షిణాంధ్రయుగంలో వచనరచన సరళ సులభమైన గ్రాంథిక భాషలో సాగింది. 19వ శ.లో ముద్రణాయంత్రాలు వచ్చినాక కూడా సరళవ్యావహారిక వచనంలో రచనలు జరిగాయి. విక్రమార్క కథలు, కాశీమజిలీకథలు, శుకసప్తతి మొదలయిన కథాకావ్యాలు ఈ కాలంలో సరళమైన వచనంలో వ్రాయబడినాయి. క్రమంగా ఆంగ్ల సాహిత్య ప్రభావంలో 19వ శతాబ్దం చివరలో 20వ శతాబ్దం ఆరంభంలో తెలుగులో నవల, కథానికలు, వ్యాసం వంటి వచన ప్రక్రియలు బయలుదేరి పత్రికాప్రవేశంతో వచన రచన తెలుగులో వ్యాప్తి చెంది స్థిరపడింది.

దక్షిణాంధ్రయుగంలో వెలసిన మరో ప్రత్యేకమైన ప్రక్రియ యక్షగానం. అది సంగీత సాహిత్యాభినయాల సమ్మేళన రూపం. నాయకరాజులు సంగీత ప్రియులు. నాట్యాభిమానులు. సాహిత్యాభిరుచికలవాళ్ళు. కాబట్టి ఈ మూడింటి సమ్మేళనమైన యక్షగానరచన ఈ కాలంలో విరివిగా సాగింది. ఈ యక్షగానాల్లో సంస్కృత నాటకలక్షణాలుకూడా చాలా ప్రవేశించాయి. ఇవి రంగస్థలం మీద ప్రదర్శింపబడేయి కూడా.

యక్షగాన ప్రక్రియ తెలుగులో క్రీ.శ. 15,16 శతాబ్దాల్లోనే ఆరంభమైంది. 16వ శ.వాడైన కందుకూరి రుద్రకవి సుగ్రీవ విజయం తెలుగులో మొదటి యక్షగానం. తర్వాత కొన్ని యక్షగానాలు రచింపబడినా ఈ ప్రక్రియ ఎక్కువ దక్షిణాంధ్రయుగంలోనే ప్రచలితమైంది. విజయ రాఘవ నాయకుని (క్రీ.శ. 1633-1673) కాలం యక్షగాన ప్రక్రియకు స్వర్ణయుగం. ఆ రాజు స్వయంగా కాళీయ మర్దనం, కృష్ణవిలాసం, విప్రనారాయణ

చరిత్ర, రఘునాథాభ్యుదయం, పూతనాహరణం, ప్రహ్లాదచరిత్ర అనే 20 యక్షగానాలు వ్రాసాడు. అతని కాలంలోనే యక్షగానాల్లో సంస్కృత నాటకాల్లో కనిపించే నాందీ ప్రస్తావనలు, భరత వాక్యం, పాత్రోచితమైన వ్యవహారిక భాషా ప్రయోగాలు ప్రవేశించాయి. రగడలకు బదులుగా సంగీత ప్రధానమైన దరువులను, పదాలను వాడడం, హాస్యరసపోషణ యక్షగానాల్లో వచ్చి చేరాయి. యక్షగానాన్ని యక్షగాన నాటకం, యక్షగాన ప్రబంధం అని పిలిచారు. విజయ రాఘవుని భార్య రంగాజమ్మ 'మన్నారుదాసవిలాస నాటకం వ్రాసింది. విజయరాఘవుని కొడుకు మన్నారుదేవుడు హేమాబ్జనాయికా పరిణయం, కోనేటి దీక్షిత కవి విజయరాఘవకళ్యాణం, పురుషోత్తమ దీక్షితుడు తంజాపూరాన్నదానం, కామరసు వేంకటపతి విజయరాఘవ చంద్రికా విహారం అనే యక్షగానాలు వ్రాసారు.

నాయకరాజుల తర్వాత తంజావూరునేలిన మహారాష్ట్ర రాజులు కూడా యక్షగాన ప్రక్రియనభిమానించారు. శహాజీ (క్రీ.శ. 1684-1712) స్వయంగా 20 యక్షగానాలను వ్రాసాడు. తులజాజి రెండు యక్షగానాలను రెండో ఏకోజి ఒక యక్షగానాన్ని వ్రాసారు. మేలత్తూరు వేంకటరామశాస్త్రి (క్రీ.శ. 1807-1860) 12 యక్షగానాలను వ్రాసాడు. కొన్ని యక్షగానాల్లో వీథిభాగవత లక్షణాలు, కొరవంజి నాట్యవిశేషాలు చేరాయి. ఈ విధంగా తెలుగులో యక్షగాన ప్రక్రియ విశిష్ట ప్రక్రియగా రూపొందింది.

దక్షిణాంధ్రయుగంలో సంగీతాభివృద్ధి కూడా బాగా సాగింది. భక్తిశృంగార రసాలతో కూడిన పదాల సంకీర్తనల రచన బాగా సాగింది. క్షేత్రయ్య, పెద్దదాసు, సభాపతయ్య, మేలత్తూరు వేంకటరామశాస్త్రి, రంగాజమ్మ, త్యాగయ్య వంటి వాళ్ళు పదరచనలు చేసారు. మహారాష్ట్ర రాజు శహాజీ "త్యాగేశ పదములు" పేరుతో అనేక పదాలు వ్రాసాడు. కర్ణాటక సంగీతం ఈ కాలంలోనే స్థిరపడింది. సంగీత శాస్త్ర గ్రంథాలు కూడా ఈ కాలంలో చాలానే వ్రాయబడినాయి. గోవిందకవి శహాజి తులజాజీ వంటి వాళ్ళెందరో సంగీతజ్ఞులు సంగీతశాస్త్ర సంబంధి గ్రంథాలను వ్రాసారు. నాట్యాభిమానయాభివృద్ధి కూడా ఈ కాలంలో బాగా జరిగింది. ఈ

యుగంలో కామశాస్త్రం, అశ్వశాస్త్రం, ఖడ్గలక్షణం వంటి శాస్త్రగ్రంథాలు సాంబనిఘంటువు, శహాజీ శబ్దరత్నాకరం నుదురుపాటి వెంకన్న ఆంధ్రభాషార్ణవం వంటి నిఘంటు గ్రంథాలు కూర్చబడినాయి.

తంజావూరు మధుర రాజులకు సమకాలికంగా ఆంధ్రదేశంలో సంస్థానాధీశ్వరుల ఆదరణలో వున్న కొందరు ప్రసిద్ధాంధ్రకవులు.

## అడిదం సూరకవి

18వ శతాబ్దం చివరి భాగంలో వున్నాడు. విజయనగరం ప్రభువు విజయరామ గజపతి (క్రీ.శ. 1760-94) కొలువులో వుండి కవిజనరంజనం, చంద్రమతీ పరిణయం ప్రబంధాలు వ్రాసాడు. ఆంధ్రచంద్రాలోకం అలంకారాల వర్ణనలతో కూడింది. ఆంధ్రనామ శేషం నిఘంటువు. ఆంధ్రనామ సంగ్రహమనే పేరుతో అచ్చ తెనుగు పదాలను కూర్చాడు. అచ్చ తెనుగు కావ్యాలు విశేషంగా రచింపబడడంతో ఈ నిఘంటువు అవసరమేర్పడింది. కవిజనరంజనం 3 ఆశ్వాసాల వసుచరిత్రను అనుకరిస్తున్న ప్రబంధం. ఈ కవి చాటువులనేకం దొరుకుతున్నాయి. అమోఘవాక్కు కలవాడని ప్రసిద్ధి.

18వ శతాబ్దంలో మరింగంటి వంశంలో చాలా మంది కవులున్నారు. వాళ్ళలో సింగరాచార్యులు దేవరకొండలో వుండి దశరథరాజనందన చరిత్ర అనే నిరోష్ఠ్యరామాయణం వ్రాసాడు. వేంకట నరసింహాచార్యులనే మరోకవి శ్రీ కృష్ణ శతానందీయం వ్రాసాడు. ఈ కవి "చిలువ పడిగరేని ప్రేరణము"లో దుర్యోధనుని వివాహాన్ని వర్ణించారు. ఇది అచ్చ తెనుగు కావ్యం. ఈ కవిది "తాళంకనందినీ పరిణయము" మరో ప్రబంధం ఈ యుగంలో సాగిన అచ్చ తెనుగు కావ్యాల రచన వీరేశలింగం యుగం వరకు సాగింది. వీరేశలింగం స్వయంగా శుద్ధాంధ్ర ఉత్తరరామాయణాన్ని రచించాడు. కాని పూర్తి చేయలేదు. 1872లో వీరేశలింగం శుద్ధాంధ్ర భారతాన్ని వ్రాయడానికి పూనుకొని పూర్తి చేయలేదు.

## ఏనుగు లక్ష్మణ కవి

ఈ కవి కవివంశంలో పుట్టాడు. పెద్దాపురం సంస్థానాధిపతి జగపతిరాజు (క్రీ.శ. 1759-93) కాలం వాడు. అతని "సుభాషితావళి" భర్తృహరి శతకానికి అనువాదం. ఎలకూచి బాలసరస్వతి, (క్రీ.శ. 1608-70) పుష్పగిరి తిమ్మన (క్రీ.శ. 1730-90) కూడా సుభాషితాలను అనువదించారు. కాని లక్ష్మణకవి అనువాదం లలితమధురంగా సరళంగా వుండి ప్రసిద్ధమైంది.

## కంకటి పాపరాజు

పాపరాజు (క్రీ.శ. 1750-1800) నెల్లూరు మండంలోని ప్రళయకావేరి పట్టణానికి అమీనుగా పనిచేసాడు. ఉత్తర రామాయణం, విష్ణుమాయావిలాసం వ్రాసాడు. తిక్కన నిర్వచనంగా వ్రాయగా పాపరాజు చంపువులో వ్రాసాడు. ఇష్టదైవం మదనగోపాలునికంకితంగా ఇచ్చాడు. పాపరాజు ఉత్తర రామాయణం కవిత్వం ఉదాత్తంగా వుంది.

## పుష్పగిరి తిమ్మన

ఈ కవికి కవిమిత్ర అనే బిరుదముంది. సమీరకుమారవిజయమనే 7 ఆశ్వాసాల కావ్యం రామునికంకితంగా వ్రాసాడు. ఈ కవి చాలా మందికి కృతి రచనల్లో సహాయపడినాడట.

## కూచి మంచి తిమ్మకవి

తిమ్మకవి (క్రీ.శ. 1700-56) పిఠాపురం సంస్థానంలోని కందరాడకు కరణం. రుక్మిణీ పరిణయం, రాజశేఖర విలాసం, నీలాసుందరీ పరిణయం, సారంగధర చరిత్ర రసికజనమనోభిరామం కుక్కుటేశ్వర శతకం మొదలయిన అనేక రచనలు చేసాడు. ఈ కవి నరాంకితాన్ని నిరసించాడు. అయినా పిఠాపురం రాజు రావుమాధవరాయలు ఈ కవికి కవి సార్వభౌమ బిరుదాన్ని

ఇచ్చాడు. తిమ్మకవి సంస్కృతంలో "సుజనమనఃకుముద చంద్రిక" కావ్యాన్ని రచించాడు. కల్పితకథతో కూడిన కథాకావ్యం చంపువులో వుంది.

## కనుపర్తి అబ్బయామాత్యుడు

అబ్బయ కవి (క్రీ.శ.1770-1840) అనిరుద్ధ చరిత్ర కవి రాజమనో రంజనం మొదలయిన పిల్ల వసుచరిత్రలనదగిన ప్రబంధాలు రచించాడు. అనుసరణలు అనుకరణలతో సాగిన కాలం ఇది. మౌలికత లేదు. దీన్నే తెలుగు సాహిత్య చరిత్రలో క్షీణకాలమని చెప్పాలి.

## కాసుల పురుషోత్తమ కవి

కాసుల పురుషోత్తమకవి (క్రీ.శ 1798-1819) చల్లపల్లి రాజా ఇమ్మడి అంకినీడు ఆస్థానకవి. ఇతని "ఆంధ్రనాయక శతకము" ప్రసిద్ధమైంది. కృష్ణాతీరంలోని శ్రీకాకుళంలో వున్న ఆంధ్ర విష్ణుదేవాలయం పూజలు లేకుండా పాడుపడి వుండడం చూచి దుఃఖితుడై కవి వ్యాజస్తుతి పూర్వ కంగా వ్యంగ్య చమత్కారంతో రచించాడు. "చిత్ర చిత్ర ప్రభావ దాక్షిణ్య భావ హతవిమత జీవ శ్రీకాకుళాంధ్ర దేవ" అనే మకుటంతో సీసపద్యాల్లో వ్రాసాడు. తన ఆలయాన్ని పునరుద్ధరించుకోలేని అసమర్థుడైన కవి దేవుడ్ని నిందిస్తూ- పైకి నిందగా కన్పించే స్తుతి-వ్యాజస్తుతిలో శతకం వ్రాసాడు. వ్యాజస్తుతి, స్తుతివ్యాజం అని రెండు విధాలు - పైకి నిందగా కన్పించి అంతరార్థం స్తుతిగాను పైకి స్తుతిగా కన్పించి అంతరార్థం నిందగానువుం టుంది. కవి శైలి ధారాళంగా మృదుమధురంగా వుంది. జాతీయమైన పదజాలం లోకోక్తులతో కవి వ్రాసాడు. ఈ కవి శతకం విని చల్లపల్లి రాజా ఆంధ్రనాయక ఆలయాన్ని పునరుద్ధరించాడట. ఈ కవి హంసల దీవి గోపాలశతకం భక్తికల్పద్రుమ శతకాలను కూడా వ్రాసాడు.

నిందా వ్యాజస్తుతి శతకాలు తెలుగులో ప్రత్యేకమైనయి. పురుషోత్తమ కవి తర్వాత గోగుల పాటి కూర్మనాథుడు (క్రీ.శ. 1750) సింహాద్రి

నారసింహ శతకం వ్రాసాడు. ఆంధ్రదేశం తురుష్కుల ఆగడాలకు నిలయమైనప్పుడు ఈ కవి సింహాద్రి నరసింహుని నిందా వ్యాజస్తుతిలో ప్రబోధిస్తూ ఈ శతకాన్ని వ్రాసాడు. "వైరి వరరంహ సింహాద్రి నారసింహ" అని దీనిలోని మకుటం ఇవేగాక భద్రగిరి శతకం మట్లపల్లి నరసింహ శతకం, వేంకటాచల విహారశతకం రామలింగేశ శతకం మొదలయిన నిందా వ్యాజస్తుతి శతకాలు.

తురుష్కుల చేతుల్లో ఆలయాలు ధ్వంసం అవుతున్నప్పుడు వాటిని రక్షించే సమర్థులైన రాజులు లేక ఫోవడం కవుల్లో ఒక నిరాశ నిస్పృహలను కలిగించింది. అదే విధంగా కొత్త విజాతీయ మతాల వ్యాప్తి సంక్రమిస్తున్న వర్ణ సంకరం నూతనాచారాలు సామాజిక పరివర్తనల చేత అసంతృప్తి చెందిన వాళ్ళ నిస్సహాయతలు అధిక్షేపశతకాల్లో ప్రతిబింబిస్తున్నాయి. సంఘ సంస్కరణలు వచ్చిం తర్వాత ఆ అసంతృప్తి పోయి సామాజికంగా సాహిత్యంగా కొత్త ఉత్సాహం చోటు చేసుకుంది.

## శతక సాహిత్యం

శతకాలు సంస్కృత సాహిత్యంలో ముక్తకకావ్య ప్రక్రియలో చేరుతాయి. ప్రాకృత ముక్తకకావ్యమైన గాథాసప్తశతిలో (క్రీ.శ. 1వ శ.) 700 గాథాలున్నాయి. అదే విధంగా సంస్కృతంలో గోవర్ధనాచార్యుని (క్రీ.శ. 1116) ఆర్యా సప్తశతిలో 700 ఆర్యా ఛందస్సులో శ్లోకాలున్నాయి. ఇవన్నీ శృంగారరసభరితమైనయి. వేంకటాధ్వరి (క్రీ.శ. 1650) లక్ష్మీ సహస్రంలో 1000 శ్లోకాలున్నాయి. లక్ష్మి విష్ణువుల స్తుతి భక్తి పూర్వకంగా వుంది. ఈ విధంగా ముక్తక కావ్యాల్లో వందలకొద్ది శ్లోకాలున్న రచనలున్నాయి. ఇవేగాక సంస్కృతంలో శతకం పేరుతో ముక్తకకావ్యాలున్నాయి. బాణుని (క్రీ.శ. 7వ శ.) చండీ శతకం, మయూరుని (క్రీ.శ. 7 వ శ.) సూర్య శతకం. చండీ శతకంలో 48 శ్లోకాలే వున్నాయి. సూర్య శతకంలో 100 శ్లోకాలున్నాయి. రెండూ స్రగ్ధరా వృత్తంలో వున్నాయి. తర్వాత భర్తృహరి రచనలకు శతకాలని పేరు. అవి నీతి శృంగార వైరాగ్య శతకాలు. వాటిల్లో క్రమంగా

నీతిని బోధించే శతకంలో 109,శృంగార వైరాగ్యాలను బోధించే శతకాల్లో 100 చొప్పున శ్లోకాలున్నాయి. అమరుకుని అమరుక శతకంలో 115 శ్లోకాలున్నాయి. ఇవి శృంగార రసభరితమైనయి. భల్లటకవి శతకంలో 100 శ్లోకాలున్నాయి. ఇది శృంగార రస భరితమైంది. ఆనంద వర్ధనుని (క్రీ.శ. 9వ శ.) దేవీ శతకంలో దేవీస్తుతితో కూడిన 100 శ్లోకాలున్నాయి. అప్పయ్య దీక్షితుని (క్రీ.శ. 16వ శ.) వైరాగ్య శతకంలో 100 శ్లోకాలున్నాయి. జగన్నాథ పండిత రాయల (క్రీ.శ. 17వ శ.) భామినీవిలాసం శతకంగా కాక ముక్తక కావ్యంగా ప్రసిద్ధి చెందింది. భామినీ విలాసం 4 విలాసాలుగా విభజింపబడింది. మొదటి విలాసంలో 129, రెండో విలాసంలో 184, మూడో విలాసంలో 19, నాల్గో విలాసంలో 46 శ్లోకాలున్నాయి. ఒక్క ఛందస్సు కాక అనేక ఛందస్సులున్నాయి. దీనిలో క్రమంగా నీతి శృంగార వైరాగ్యాలుండి భర్తృహరి శతకత్రయాన్ని పోలివుంది. విశ్వేశ్వర పండితుడు (క్రీ.శ. 18 వ శ.) శృంగార రసపూర్ణమైన రామావళీ శతకాన్ని వ్రాసాడు. తెలుగు కవి ఆదిభట్ల నారాయణదాసు (క్రీ.శ. 19 వ శ.) సంస్కృతంలో కాశీశతకం వ్రాసాడు. ఈ విధంగా సంస్కృత సాహిత్యంలో శతకాలు నీతి వైరాగ్య శృంగార భావాలతో కూడి వున్నాయి. కొన్ని భక్తి భావ భరితమై స్తుతిరూపంగా వున్న శతకాలు కూడా వున్నాయి. చాలా శతకాల్లో 100 శ్లోకాలున్నా కొన్నింటిలో నూటికి తక్కువ ఎక్కువ శ్లోకాలు కూడా వున్నాయి. తర్వాత తెలుగు శతకాల్లోవలె సంస్కృత శతకాల్లో మకుట నియమం లేదు.

తెలుగులో శతకరచన తెలుగు సాహిత్యారంభకాలం నుంచి జరుగుతూనే వుంది. సుమతి శతకం నన్నయకు పూర్వ రచన జైనుడెవరో వ్రాసాడని అంటారు. తిక్కన కృష్ణశతకం వ్రాసాడంటారు. కాని అది దొరకలేదు. పోతన నారాయణ శతకం వ్రాసాడంటారు. పోతన పేరుతోనే వంగూరి సుబ్బారావు గారు ప్రచురించారు. కాని దీనిలోని శైలి పోతన భాగవత శైలి కన్నా భిన్నంగా వుంది. శివకవి పండితారాధ్యుడు వ్రాసిన శివతత్త్వసారం శతకమని పాల్కురికి సోమన చెప్పాడు. కాబట్టి శివతత్త్వసారం తెలుగులో

మొదటి శతకమని తెలుగు సాహిత్య చరిత్రకారులు వ్రాస్తున్నారు. ఇది శతకమనబడినా దీనిలో శతక లక్షణాలు సంపూర్ణంగా లేవు. మొదటిది - దీనిలో వస్తువు వైవిధ్యంతో శివాచారం తెలిపే గ్రంథంగా వుంది. దీనిలో 489 పద్యాలున్నాయి. వాటిల్లో 191 పద్యాల్లో హరా, శివా, రుద్రా, అజా అనే 28 రకాల శివసంబోధనతో మకుటాలున్నాయి. కాని అన్నీ కంద పద్యాలే. కాని తెలుగులో సంపూర్ణ శతక లక్షణాలున్న మొదటి శతకం సోమనాథుని వృషాధిపశతకం. తెలుగు శతకాలను పరిశీలించి తెలుగు శతకలక్షణాలను ఈ కింది విధంగా నిర్ణయించవచ్చును.

## శతకలక్షణాలు

1. సంస్కృత లాక్షణికులు చెప్పినట్లుగానే తెలుగులో శతకాలు లఘుకావ్యాలు. ముక్తక కావ్యప్రక్రియకు చెందినవి. శతకమంటే 100 పద్యాల కూర్పు కలవి అని అర్థం కాని సంస్కృతంలో వలెనే భిన్నమైన పద్య సంఖ్య కన్పిస్తున్నది. భగవంతుని నామస్తుతి 108 పేర్లతో చేయడముంది. కాబట్టి చాలామంది కవులు తెలుగులో అష్టోత్తరశత సంఖ్యలో పద్యాలు కూర్చారు. కాని వందలు వేలు పద్యాలున్న శతకాలు కూడా తెలుగులో వున్నాయి.

2. ఛందస్సు ఒక్కటె వుండాలన్న నియమం తెలుగులో పాటించబడింది.

3. మకుటనియమం వుంది.

4. తెలుగు శతకాల్లో నీతి వైరాగ్య భక్తి భావాలు ఎక్కువగా వున్నాయి. శృంగార భావాలున్న శతకాలు లేవు. వున్నా అవి భగవత్పరమైన శృంగార విరహాలను వర్ణిస్తున్నాయి. అన్నమాచార్యుల (క్రీ.శ. 1425-1503) వేంకటేశ్వర శతకంలో అలివేలుమంగ వేంకటేశ్వరుల ప్రణయం వర్ణింపబడింది. రాధాకృష్ణుల గోపికాకృష్ణుల భక్తి శృంగారాన్ని వర్ణించే శతకాలు తెలుగులో వున్నాయి. గోగులపాటి కూర్మనాథకవి సుందరమణి శతకంలో తన ఉంపుడుగత్తె సుందరితో కలిగిన విరహశృంగారాన్ని వర్ణించాడు. ఇట్లా లౌకిక

శృంగారాన్ని చెప్పే శతకాలు తక్కువ. పొగమట్టి శతకం ఒకటి ఆధునిక కాలంలో హాస్యభరితమైంది వ్రాయబడింది.

5.పురాణేతిహాస కథలను శతకరూపంగా వ్రాయడం తెలుగులో ఒక విశేషం. సోమకవి శతకరామాయణం, లక్ష్మీకాంతమ్మ భారత కృష్ణ శతకం మొదలయినయి. మండపాటి పార్వతీశ్వర శాస్త్రి "ఆత్మ చర్య" శతకం ఆత్మకథా రూపంగా వుంది. తెలుగులో మొదటి శతకమైన శివతత్త్వసారంలో శైవ సిద్ధాంతాలు ఆచారాలు శివభక్తుల కథలు మహిమలున్నాయి. దీన్ని బట్టి తెలుగు శతకాల్లో వస్తువైవిధ్యం పాటించబడిందని చెప్పాలి.

శతకాలు ముక్తక పద్యాలతో కూడినయి. ప్రతి పద్యం స్వతంత్రార్థం కలవి. ప్రతిపద్యం భావపరిపూర్ణతతో పాఠకునికి భావరస స్ఫూర్తి కలిగిస్తాయి. శతకాల్లో కవి ఆత్మానుభూతికి ఎక్కువ స్థానముంటుంది. మహా కావ్యంలో ఇతివృత్తం పాత్రలు వర్ణనలు మొదలయిన వాటికి ప్రాధాన్యం కాగా శతకాల్లో కవి ఆత్మానుభూతికి ప్రాధాన్యం. ప్రాచీన సాహిత్యంలో ఆత్మాశ్రయ కవిత్వానికి శతకాలు చక్కని ఉదారణలు. విభావానుభావాల నిర్వహణ లేదు కాబట్టి శతకాల్లో రస నిర్వహణ లేదని చెప్పలేము. శతక కవి విభావాల వర్ణనతో భావాల తీవ్రతతో రసస్ఫూర్తిని కలిగించి అలరిస్తాడు. సంస్కృత లాక్షణికులు రసధ్వని ఉదాహరణలకు ముక్తక కావ్యాల నుంచే శ్లోకాలను ఇచ్చారు. దీన్ని బట్టి శతకాల్లో ముక్తకాల్లో రసధ్వనుల పోషణ చక్కగా జరిగిందని చెప్పవచ్చును.

## సుమతి శతకం

తెలుగు శతకాల్లో సుమతి శతకం ప్రశస్తమైంది. దీని కర్త ఎవరో తెలియదు. క్రీ.శ. 13వ శ. వాడైన బద్దెన తానొక సుమతి శతకాన్ని వ్రాసినట్లుగ తన నీతిశాస్త్రముక్తావళిలో చెప్పుకున్నాడు. వేములవాడ భీమకవి ఒక సుమతి శతకం వ్రాసినట్లుగా కూచిమంచి తిమ్మకవి తన సర్వలక్షణ సారసంగ్రహంలో చెప్పాడు. సుమతి అనే జైనముని సుమతి శతకాన్ని వ్రాసాడని వంగూరి సుబ్బారావు గారు అభిప్రాయపడినారు.

సుమతి శతకం సరళ సుందరమైన శైలిలో వుంది. భావాలు సూటిగా

వున్నాయి. "సుమతీ" అన్న మకుటం వుంది. అన్నీ కందపద్యాలు. చిన్న చిన్న ఉదాహరణలతో విషయాన్ని ప్రతిపాదించడం వుంది. దీనిలో 108 పద్యాలున్నాయి. "శ్రీరాముని దయచేతను....." అనే పద్యంతో ఆరంభమౌతున్నది. "నీతులు నోరూరగ చవులు బుట్ట నుడివెద సుమతీ" అని కవి చెప్పినట్లుగానే ప్రతి పద్యం నీతి బోధకంగా సరళసులభంగా వుంది. కవి అపారలోకజ్ఞానమున్నవాడు. నిత్య జీవితంలో అక్కరకు వచ్చే నీతులను కవి ఉపమాలంకారాల సహాయంతో చెప్పాడు. ఉదా.

ఎప్పుడు తప్పులు వెదకెడు
నప్పురుషునిఁగొల్వ కూడదది యెట్లన్నన్
సప్పంబు పడగ నీడను
కప్ప వసించు విధంబుగదరా సుమతీ !
కమలములునీటబాసిన
కమలాప్తుని రశ్మిసోకి కమలిన భంగిన్
తమ తమ నెలవులు దప్పిన
తమ మిత్రులు శత్రులౌటతథ్యము సుమతీ !

ఏ పాదానికాపాదం తెగిపోవడం తెలుగులో శతక పద్యాల్లోనే కన్పిస్తుంది. అటువంటి రచన ధారణకు సులభంగా వుంటుంది.

## వేమన శతకం

తెలుగులో ప్రసిద్ధమైన శతకాల్లో వేమన శతకం ఒకటి. దీని కవి వేమన. ప్రాచీనులు వేమనను యోగిగా భావించారు. ఆధునికులు వేమనను ప్రజాకవి మహాకవిగా భావిస్తున్నారు. కొందరతన్ని విప్లవ కవి తిరుగుబాటు కవి అని కూడా అన్నారు.

వేమన కాలం గురించి అభిప్రాయ భేదాలున్నాయి. సి.పి.బ్రౌను వేమన క్రీ.శ. 17వ శ. వాడని అన్నాడు. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వేమన క్రీ.శ. 1650 అన్నారు. వేమన కాలం క్రీ.శ. 14వ శ. నుండి 17వ శ. వరకు విమర్శకాభిప్రాయాల అనుసారం విస్తరించి వుంది. వేమన పద్యాల్లో నాథసంప్రదాయ సిద్ధాంతాలు కన్పిస్తున్నాయి కాబట్టి నాథసంప్రదాయం

లుప్తం కాకముందే అంటే క్రీ.శ. 13,14 శతాబ్దాల్లో వేమన వున్నాడనడం సమంజసం.

వేమన రాయలసీమ ప్రాంత వాడనడం అందరు అంగీకరించారు. వేమన అన్నగారు కడప జిల్లాలో గండికోట దుర్గాధిపతి అని సి.పి.బ్రౌను వ్రాసాడు. మూగ చింతపల్లి తన ఊరని వేమన ఒక పద్యంలో చెప్పుకు న్నాడు. అది చిత్తూరు జిల్లాలో వుంది. వేమన పుట్టింది చంద్రగిరి పెరిగింది కొండవీడు తిరిగింది కడప కర్నూలు ప్రాంతం అని ఆరుద్ర గారి అభిప్రాయం. మొత్తం మీద వేమన సంపన్న కుటుంబంలో జన్మించి మొదట్లో భోగాలను అనుభవించి ఏ కారణంచేతనో లౌకిక సుఖ విముఖుడై యోగి అయ్యాడని లోకంలో వ్యాప్తిలో వున్న కథలను బట్టి చెప్పవచ్చును. ఎందరో భక్తతత్త్వకవుల గురించి అటువంటి కథలు వ్యాప్తిలో వున్నాయి.

వేమన పద్యాలు 3000 పైగా దొరుకుతున్నాయి. అవి చాలా వరకు ఆటవెలదిలో వున్నాయి. కొన్ని కందం, సీసం, తేటగీతి, వృత్తాలు కూడా వున్నాయి. చాలా పద్యాల్లో "విశ్వదాభిరామ వినురవేమ" అనే మకుటం వుంది. కొన్నిట్లో "వేమా, విమల గుణ రాజయోగీంద్ర వేమ నార్య" మొదలయిన మకుటాలున్నాయి. ఈ పద్యాలన్నీ ఒక్క వేమన చెప్పాడని కాక ఆదివేమన పేరు పెట్టుకొని అతన్ని అనుకరిస్తూ ఇతరులు చెప్పిన పద్యాలెన్నో వున్నాయనవచ్చును. లభించే కొన్ని పద్యాల్లో స్వమత ఖండనలు అపరిపక్వ భావాలున్నాయి. కాబట్టి వేమన పేరుతో అర్ధ శిక్షితులు కూడా పద్యాలు వ్రాసారని చెప్ప వచ్చును.

వేమన పద్యాల్లో నీతి బోధన, వైరాగ్య భావాలు, యోగ తత్త్వ వివరణలున్నాయి. సమాజంలోని కుళ్ళును అవినీతిని అంధ విశ్వాసాలను బయట పెట్టి మొహమాటం లేకుండా విమర్శించాడు. మతాల పేరుతో పేరుకొని పోయిన మోసాన్ని డాంబికాన్ని నిరసించాడు. విగ్రహ పూజలను యజ్ఞయాగాది కర్మల నిరర్థకతను చెప్పాడు. "రాతి బొమ్మకేల రంగైన వలు...." అంటాడు. ఆత్మే పరమాత్మ అన్నాడు. మతాచార్యుల మాయ మాటలను ప్రజల అజ్ఞానాన్ని గురించి చెప్పాడు. వివాహ కర్మ, శ్రాద్ధకర్మ ముహూర్తాలు చూడడం జ్యోతిషం వంటి వాటిని కూడా విమర్శించాడు.

వేమన హేతువాది. కులభేదాలను నిరసించాడు. సమానతను బోధించాడు. "ఎరుక కలుగువాడె ఎచ్చయిన కులజుండు" అన్నాడు. వేమన లోకజ్ఞానం కలవాడు. కాబట్టి సూక్ష్మ విషయాలను కూడా చక్కగా వివరించాడు. ఏ విషయం చెప్పినా సులభంగా అర్థమయ్యేటట్లు చెప్పాడు.

వేమన కవిత్వం సుందరం. భాష సరళం. భావాలు సూటిగా వుంటాయి. సమాసరచన లేదు. తెలుగు పలుకుబడులతో పద్యాలు ధారాళంగా నడిచాయి. అతడు ఇచ్చిన ఉపమానాలు నిత్యజీవితంలోనివి. అతని పద్యాలు ఏ పాదానికా పాదం తెగిపోయి భావం కూడా ప్రతిపాదంతో పూర్తయి పొరకున్ని అలరిస్తాయి. ధారణకు ఆ పద్యాలు చాలా అనువుగా వున్నాయి.

వేమన పద్యాల్లో తక్కువ మాటల్లో ఎక్కువ అర్థాన్ని చెప్పేగుణం వుంది. వస్తుధ్వనిసౌందర్యంతో అతని పద్యాలు అలరిస్తాయి. వ్యంగ్యం హాస్యం కూడా అతని పద్యాల్లో వున్నాయి. దేన్ని విమర్శించినా వేమన వ్యంగ్య హాస్యంతో నొప్పించకుండా చెప్తాడు. వాక్పారుష్యం కన్పించదు.

తమిళంలో ప్రాచీనకవి తిరువళ్ళువరు కన్నడంలో సర్వజ్ఞుడు వేమనతో సాటిరాగాల కవులు.

* * *

# 10. వీరేశలింగం యుగం

కందుకూరి వీరేశలింగం 1848లో జన్మించాడు. 1846లో త్యాగయ్య మరణించాడు. అతనితో తెలుగు సాహిత్య చరిత్రలో నాయకయుగం అంతమై నూతన యుగారంభం జరిగింది.

1799లో టిప్పుసుల్తాను బ్రిటిషు వాళ్ళ చేతిలో ఓడిపోయాడు. కర్నాటక రాజ్య పునర్విభజనలో రాయల సీమలోని కొన్ని జిల్లాలు నిజాంకు వచ్చాయి. కాని యుద్ధంలో సైన్యం ఖర్చుల కిందికి నిజాం 1800 లో వాటిని బ్రిటిషు వాళ్ళకిచ్చివేసాడు. దాంతో తెలంగాణా తప్ప మిగతా ఆంధ్రదేశమంతా బ్రిటిషు వాళ్ళ కిందకు వచ్చింది. తెలంగాణా ప్రాంతం నిజాం నిరంకుశ పాలనలో వుండిపోయింది. కొంతకాలం ఈ రెండు తెలుగు ప్రాంతాలు చారిత్రక సంబంధాలను విస్మరించి సామాజిక సాంస్కృతిక సంబంధాలు లేకుండా వుండిపోయాయి. 1858లో భారతదేశం ఈస్టిండియా కంపెనీ పాలన రద్దయి విక్టోరియా మహారాణి పాలనలోకి వచ్చింది. 1835 లో ఆంగ్ల విద్యను భారతీయులకు నేర్పాలనే నిర్ణయం జరిగింది. దాని ఫలితంగా ప్రభుత్వంవారు మిషనరీలు నడిపే పాఠశాలలు కళాశాలలు స్థాపింపబడినాయి. 1857లో కలకత్తా మద్రాసు బొంబాయి నగరాల్లో విశ్వవిద్యాలయాల స్థాపన జరిగింది. 1827లో అచ్చు యంత్రాలు వచ్చాయి. శబ్దమంజరి ప్రథమగ్రంథం తెలుగులో అచ్చయింది. 1834లో తెలుగులో గ్రంథాలు చాలా అచ్చయ్యాయి. 1858లో చిన్నయసూరి నీతి చంద్రిక వ్రాసి 1860లో బాలవ్యాకరణం వ్రాసాడు. తెలుగువారిలో దేశాభిమానం భాషాభిమానం తలెత్తాయి.

విక్టోరియా రాణి పాలనలో భారతదేశంలో బందిపోటులు దోపిడీ దొంగల బాధలు పోయి అరాచకమేర్పడినదేశంలో శాంతిభద్రతలు ఏర్పడి నాయి. 1850లో ఆర్థర్ కాటన్ కృష్ణా గోదావరి నదుల మీద ఆనకట్టలు కట్టడంతో కోస్తా ఆంధ్రప్రాంతం క్షామం నుంచి బయటపటి వ్యవసాయి కంగా అభివృద్ధి చెందింది. అదే విద్యా సంస్కృతుల అభివృద్ధికి దోహదం చేసింది. దాంతో భావచైతన్యం కలిగి వీరేశలింగం వంటి సంస్కరణవాదులను సిద్ధం చేసింది. బ్రిటిషు వాళ్ళు భారతీయులకు మత సాంస్కృతికరంగాల్లో సంపూర్ణ స్వేచ్ఛనీయడమే కాక స్వయంగా ఎంతో మంది ఇంగ్లీషువాళ్ళు మత సాహిత్య సామాజికరంగాల్లో కృషి చేసి భారతీయుల పునరుజ్జీవనా నికి దోహదం చేసారు. 1879లో విశ్వమానవ సౌభ్రాతృత్వాన్ని బోధించే హిందూధర్మ సూత్రాలననుసరించే దివ్యజ్ఞాన సమాజం బొంబాయిలో స్థాపిం చబడింది. 1882లో మద్రాసులోని అడయారకు ఈ సమాజం మార్చబడింది. 1889లో అనీబిసెంటు ఈ సమాజంలో చేరింది. 1900లో రాజమండ్రి కాకినాడల్లోని సమాజాల్లో ఆమె ఉపన్యసించింది. ఆమె ఉపన్యాసం విని తెలుగు వాళ్ళు హిందూమత సంప్రదాయాల్లోని మూఢాచారాలను గుర్తించి మేల్కొన్నారు. బెంగాల్‌లో 1828లో రాజారామమోహన రాయలు బ్రాహ్మసమాజం స్థాపించాడు. దాన్ని కేశవ చంద్రసేన్ ప్రచారం చేసాడు. 1864లో ఆయన మద్రాసు వచ్చి ఉపన్యసించాడు. యువకులెందరో ఆయన ఉపన్యాసం చేత ప్రభావితులయ్యారు. 1870-80 మధ్య ఆంధ్రదేశంలో ముఖ్యపట్టణాల్లో బ్రాహ్మసమాజాలు వెలిసాయి. రఘుపతి వేంకటరత్నం నాయుడు బ్రాహ్మధర్మ దీక్షను గ్రహించాడు. 1895లో వీరేశలింగం పంతులు బ్రాహ్మసమాజం చేత ప్రభావితుడై సంఘ సంస్కరణోద్యమానికి పూనుకున్నాడు.

బెంగాల్‌లో సతీసహగమనాన్ని నిర్మూలించిన రాజారామమోహన రాయలు మరణించిన 15 సంవత్సరాలకు వీరేశలింగం జన్మించాడు. అప్పుడు ఆంధ్రదేశంలో మూఢాచారాలు అంధవిశ్వాసాలు వ్యాపించి వున్నాయి. స్త్రీల పరిస్థితి దయనీయంగా వుంది. రాజారామమోహన రాయుల వలె వీరేశలింగం స్త్రీజనోద్ధరణకు పూనుకున్నాడు. బెంగాల్‌లో ఈశ్వరచంద్ర

విద్యాసాగరుని వలె హితకారిణి సమాజం ఆస్తికోన్నత పాఠశాలను స్థాపించి సంఘసంస్కరణోద్యమాన్ని నడిపాడు. బ్రాహ్మసమాజం ఏకేశ్వరోపాసనను హేతువాదాన్ని బోధించింది. విగ్రహారాధనను నిరాకరించింది. కులమత భేదాలను వర్ణవ్యవస్థను నిరసించింది. వర్ణాంతర వివాహాలను సర్వవర్ణభోజనాలను ప్రోత్సహించి అనాథ శరణాలయాలను స్థాపించి సంఘసేవ చేసింది. బ్రాహ్మ సమాజం మత విషయకంగా వున్న మూఢాచారాలను అంధవిశ్వాసాలను మతం సనాతనధర్మం పేరుతో సాగే సాంఘిక దురాచారాలను పోగొట్టి కొత్త భావజాలాన్ని విశ్వాసాలను ధర్మాన్ని ప్రచారంలోకి తెచ్చి ఆంధ్రదేశాన్ని ప్రభావితం చేసింది. వీరేశలింగం విద్యార్థిగా వున్నప్పుడే ఆర్మ్యారు లక్ష్మీనరసింహం అనే పంతులుగారి బ్రాహ్మధర్మబోధనలచేత ప్రభావితమై తర్వాత జీవిత కాలంలో బ్రాహ్మమతాభిమానంతో సంఘసంస్కరణ స్త్రీజనోద్ధరణ ఉద్యమాలను నడిపాడు. 1874లో వీరేశలింగం 'వివేకవర్ధని' పత్రికను ప్రారంభించాడు. 1870లో "బ్రాహ్మ వివాహం" "వ్యవహార ధర్మ బోధిని" అనే ప్రహసనాలను రచించాడు.1878 లో తన సంఘసంస్కరణ దృష్టిని ప్రతిబింబింపజేసే "రాజశేఖర చరిత్ర" అనే నవలను వ్రాసాడు. వీరేశలింగం తన ఆచరణతో రచనలతో సంఘసంస్కరణోద్యమాన్ని చేపట్టి ఆంధ్రదేశంలో సాంస్కృతిక పునరుజ్జీవనాన్ని నడిపాడు. బెంగాల్‌లో రాజారామమోహన రాయులు ఈశ్వరచంద్ర విద్యాసాగరులు మహారాష్ట్రలో గోవిందరానడే కార్వేలు చేపిన సంఘ సంస్కరణలు స్త్రీ జనోద్ధరణ కార్యక్రమాలను ఆంధ్రదేశంలో ఒక్క వీరేశలింగం నడిపాడు.

వీరేశలింగం సంఘసంస్కరణకు సాధనంగా సాహిత్యాన్ని చేపట్టి సాహిత్య ప్రయోజన దృష్టిని మార్చివేసాడు. ఇంతకాలం సాహిత్యం సమాజం రెండూ పొత్తు లేకుండా నడిచాయి. సాహిత్యం సమాజ అభ్యున్నతికే అని చాటి చెప్పి వీరేశలింగం తెలుగు సాహిత్యంతో ఒక గొప్ప విప్లవాన్ని తెచ్చాడు. సామాజిక అభ్యున్నతిపాటు సాహిత్యాభున్నతికి తోడ్పడినాడు వీరేశలింగం అందుకే ప్రబంధానంతర కాలానికి భావకవితా కాలానికి మధ్య వున్న ఈ సాహిత్య యుగానికి వీరేశలింగం పేరు పెట్టడం జరిగింది. రాయప్రోలు, కట్టమంచి, నార్ల వేంకటేశ్వర రావు వంటి వాళ్ళు వీరేశలింగంను ఆధునిక

గా యుగపురుషుడిగా అంగీకరించారు. ఆయన కవిత్వంలో ముందంజ వేయలేదు. కాని "వర్తమానాంధ్ర భాషా ప్రవర్తక సమాజా"న్ని స్థాపించి భాషా ప్రచారం చేసాడు. రాబోయే కాలంలో గద్యానికున్న ప్రాధాన్యాన్ని గుర్తించి ఆయన నవల వ్యాసం వంటి గద్య ప్రక్రియలను రచించి భవిష్యత్తు సాహిత్యానికి బాటలు వేసాడు. "గద్య తిక్కన"గా ప్రస్తుతింపబడినాడు.

వీరేశలింగం 1870 ప్రాంతాల్లో శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధము, రసికజనరంజనము మొదలైన చిత్ర గర్భ కవిత్వాన్ని శుద్ధాంధ్ర కవిత్వాన్ని వ్రాసాడు. తర్వాత తన మార్గాన్ని గుర్తించి తెలుగు సాహిత్యానికే మార్గ నిర్దేశం చేసాడు. "సరస్వతీ నారద విలాపము"లో సరస్వతి వేదనరూపంగా సాహిత్య దుస్థితిని విమర్శించాడు. తెలుగు కవితా సరస్వతి తుప్పు పట్టిన సంకెళ్ళను తెంపేసి నూతన సాహిత్యసృష్టి చేసాడు. గురజాడ రాయప్రోలు కృష్ణశాస్త్రి వంటి భావితరాల కవులకు ఆదర్శమయ్యాడు. ప్రేరణనిచ్చాడు.

వీరేశలింగానికి సమకాలిక పండితులతో జరిగిన సాంఘిక సాహిత్య సంబంధమైన వివాదాలు ఆంధ్రభాషా సాహిత్యాలకు పథనిర్దేశం చేసాయి. స్త్రీపునర్వివాహాన్ని వీరేశలింగం సమర్థించగా వేదంవారు వ్యతిరేకించారు. కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి "సత్యావాదిని " పత్రికను నడిపి వీరేశలింగం సంఘసంస్కరణలను ఎదిరించాడు. భాషావిషయంలో గిడుగువారి వ్యావహారికాన్ని కొక్కొండ, కోలాచలం, వడ్డాది సుబ్బరాయుడు, జయంతి రామయ్యలు వ్యతిరేకించి గ్రాంథికాన్ని సమర్థించారు.వీరేశలింగం వ్యావహారికానికి వున్న ప్రాధాన్యాన్ని గుర్తించి తన వచనరచనను సరళశైలిలో సాగించాడు. వీరేశలింగం తన చర్చల్లో తర్కపూర్ణమైన చక్కని చిక్కని శైలిని వాడాడు. ప్రహసనాల్లో హాస్యవ్యంగ్యశైలిని వాడాడు. "హాస్య సంజీవని" అని పత్రికను వివేకవర్ధని పత్రికకు అనుబంధంగా నడిపి హాస్యవ్యంగ్యంతో మూఢాచారాలను అంధవిశ్వాసాలను అధిక్షేపించాడు. ముద్దు నరసింహానాయుడు 1862లో "హితసూచని" వ్యాసాలతో తెలుగులో వ్యాసప్రక్రియ ఆరంభమై సంఘసంస్కారానికి ఆయుధంగా ప్రయోగింప బడింది. వ్యాస ప్రక్రియకు సంఘసంస్కార దృష్టి సాహిత్యాభ్యున్నతి దృష్టిగల వీరేశలింగం ప్రచారాన్ని కలిగించాడు.

వీరేశలింగం సంఘసంస్కరణ భావాలు, వచనరచనాశైలి చేత పానుగంటి, చిలకమర్తి వంటి రచయితలు ప్రభావితులయ్యారు. చిలకమర్తి వీరేశలింగం చేత పూర్తిగా ప్రేరణను పొంది నవల మొదలైన ప్రక్రియలను చేపట్టి రచించాడు. కథానిక రచయిత శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి వీరేశలింగం గ్రంథాలవల్ల తనకు సంస్కరణ దృష్టి అలవడిందని చెప్పుకున్నాడు. ప్రకాశం పంతులు, దరిశి చెంచయ్య, కేసరి, కొండా వేంకటప్పయ్యలు పంతులుగారి చేత ప్రభావితమయ్యారు. సమకాలికుల్లో ఆ తర్వాతను వీరేశలింగం చేత పరోక్షంగానో అపరోక్షంగానో ప్రభావతులుకాని సాహితీవేత్తలు లేరని చెప్పవచ్చును. "ఆంధ్రులు తామొక జాతివారమని ప్రకృతము చెప్పుకొనుటకు ఆత్మగౌరవము మనలో నుద్భవింప జేసినది పంతులుగారే" అని కట్టమంచి 1919లో ఆంధ్రపత్రికలో వ్రాసారు. సుబ్రహ్మణ్య భారతి, ఉమాకాంత విద్యాశేఖరులు మొదలైన వాళ్ళు వీరేశలింగం మహనీయుతను ప్రశంసించారు. సామాజికంగా సాహిత్యకంగా సంధికాలంలో నవ్యత కోసం కొట్టుమిట్టాడుతున్న కాలంలో పథనిర్దేశం చేసిన సంఘసంస్కర్త సాహితీవేత్త వీరేశలింగం.

వీరేశలింగం జననానికి పూర్వం 19వ శతాబ్దారంభంలో తెలుగు సాహిత్యరంగంలో కొంత అభ్యున్నతిని సాధించిన తెలుగు కవులు పండితులు, ఆంగ్లేయులు వున్నారు. తెలుగు సాహిత్యం పునరుజ్జీవనానికి ఆధునికోన్ముఖంగా నడవడానికి వాళ్ళ కృషి స్మరించదగింది.

(వేంకటగిరిలో సర్వజ్ఞ కుమార యాచేంద్రుల ఆస్థానంలో వున్న గోపీనాథ వేంకటకవి (1820-90) రామాయణం, బ్రహ్మ వైవర్త పురాణం, కృష్ణజన్మఖండం, రాధికాపరిణయం వంటి రచనలు చేసాడు. గోపీనాథ రామాయణం వాల్మీకి రామాయణానికి ఉత్కృష్టమైన అనువాదం.)

అమరావతిలో వాసిరెడ్డి వేంకటాద్రినాయుని దానధర్మాలను పేర్కొంటు ఏనుగుల వీరాస్వామయ్య కాశీయాత్ర చరిత్ర (1830-31) వచన రచన చేసాడు. యాత్రాచరిత్రల ప్రక్రియలో ఇది మొదటి రచన. వేంకటాద్రినాయుని మరో ఆస్థానకవి ములుగు పాపయారాధ్యుడు దేవీ

భాగవతం, అహల్యాసంక్రందనము, ఇంద్రాత్మజా పరిణయం మొదలయిన అనేక కావ్యాలు వ్రాసాడు. వాటిలో దేవీభాగవతం ప్రసిద్ధి పొందింది.

ఈ కాలంలో ప్రసిద్ధి చెందిన కవిపండితుడు శిష్టు కృష్ణమూర్తి శాస్త్రి. (1800-1880) కోట రామచంద్రపురం సంస్థానాధిపతి రామచంద్రరాజు ఈ కవిని ఆస్థానకవిగా గౌరవించాడు. దామెర వేంకటపతిరాయల దగ్గర 16 సం. లు ఈ కవి ఆస్థానపండితుడుగా వున్నాడు. గోదావరి మండలం కలెక్టరు దగ్గర శిరస్తాదారు అయిన తుళ సింగశెట్టి ఇంట్లో పురాణం చెప్పేవాడు. ఈ కవి సర్వకామదా పరిణయం, వేంకటాచల మాహాత్మ్యం, పంచతంత్రం మొదలయిన కావ్యాలు రచించాడు. వసుచరిత్రకు సంగీత రహస్యాలను బయట పెడ్తూ వ్యాఖ్యానం వ్రాసాడంటారు. అది వెలుగులోకి రాలేదు. వీణ మీద వసుచరిత్ర పద్యాలను పలికించేవాడు. సంస్కృతంలో కాళిదాసు మేఘ సందేశానికి తర్వాత భాగంగా "యక్షోల్లాసం" అనే కావ్యం వ్రాసాడు. ఈ కవికి పిండిప్రోలు లక్ష్మణ కవికి పరస్పర పాండిత్య స్పర్ధ లుండేవట లక్ష్మణకవి (1780-1840) తిట్టు కవితకు పేరు పొందినవాడు. లంకావిజయమనే ద్వ్యర్థి కావ్యాన్ని వ్రాసాడు.

ఈ కాలంలో ప్రసిద్ధి చెందిన కవయిత్రి తరిగొండ వేంకమాంబ (1840) ప్రతిభ గలది. యోగరహస్యాలు గ్రహించింది. భక్తినభిమానించింది. ఆమె బాల వితంతువు. ఆనాటి ఆచారాన్ననుసరించి వెంట్రుకలు తీయించుకోమంటె మళ్ళీ మొలవవని అంటే తీయించుకుంటానని తిరుగుబాటు చేసిన స్త్రీ. జ్ఞానవాసిష్ఠం, రాజయోగసారం ద్విపదలో సరళశైలిలో వ్రాసింది. తర్వాత ఆమె మధురభక్తిని ఆశ్రయించి వేంకటాచలమాహాత్మ్యం విష్ణుపారిజాతం, పారిజాతాపహరణం మొదలయిన రచనలు చేసింది. ఆమె 17 వరకు కృతులు రచించింది. వాటిల్లో యక్షగానాలు కూడా వున్నాయి. యోగ తత్త్వాలను ఎంత సులభంగా వివరించిందో ప్రణయ కోపాలను నర్మగర్భోక్తులను, స్త్రీల ఎత్తిపొడుపు మాటలను సవతుల మాత్సర్యాలను ఆమె అంత సహజంగా రసవంతంగా వ్రాసింది. ఆమెకు సంగీతంలోను పాండిత్యముంది. ఎన్నో పెళ్ళి పాటలను మంగళారతి పాటలను వ్రాసింది.

ఒకవైపు సంస్థానాధీశ్వరుల ఆదరణలో కవులు ప్రాచీన సంప్రదాయంలో కావ్యాలు రచించారు. ఆ కావ్యాల్లో విచ్చలవిడిగా శృంగార వర్ణనలు స్త్రీ వర్ణనలు కనిపించవు. వస్తు భావాల్లో కొత్త దనాన్ని తేవాలనే ప్రయత్నం కన్పిస్తుంది. యాత్రాచరిత్ర వంటి కొత్త ప్రక్రియ ఈ కాలంలో వచ్చింది. ఇదే తరుణంలో కొందరు పాశ్చాత్యులు తెలుగు భాషా సాహిత్యాల్లో కృషి చేసి ఆధునికత వైపు నడిపించారు.

1810లో మద్రాసు రాష్ట్రానికి సర్వేయరు జనరలుగా కర్నల్‌గా కాలిన్ మెకంజీ నియోగింపబడినాడు. ఆయన అనేక యుద్ధాల్లో పాల్గొన్న యోధుడు. మధ్య మధ్య యుద్ధాల్లో పాల్గొంటూ ఆయన ఆ సర్వేయరు పనిని చేసాడు. 1816లో భారతదేశమంతటికి సర్వేయరు జనరలుగా నియమింపబడినాడు. మద్రాసులో వున్నపుడే మెకంజీ ఆంధ్రదేశంలోని కైఫియతులనబడే స్థానిక చరిత్రలను తాళపత్రప్రతులను శిలాతామ్రశాసనాలను నాణాలను సేకరించాడు. ఈ పనిలో అతనికి కావలి సోదరులు - కావలి బొర్రయ్య, కావలి లక్ష్మయ్య, కావలి రామస్వామి విశేషంగా తోడ్పడ్డారు. కావలి రామస్వామి 1829లో దక్కను కవుల చరిత్ర పేరుతో ఇంగ్లీషులో కవుల చరిత్ర వ్రాసాడు. దీనిలో సంస్కృత తమిళ మరాఠీ కవులతోపాటు తెలుగు కవులు కూడా చేర్చబడి 109 కవుల చరిత్రలు కూర్చబడినాయి. నన్నయ నుంచి శ్రీ కృష్ణదేవరాయల వరకు 46 తెలుగు కవుల చరిత్రలు దీనిలో వున్నాయి. కవులను గురించి లోకంలో వ్యాపించి వున్న గాథలు ఇందులో వున్నాయి. ఏదో చారిత్రక సత్యం ఆధారంగా కల్పింపబడిన ఈ గాథలు తెలుసుకోవడం సాహిత్య చరిత్రకారులకు చాలా అవసరం. దక్కను కవుల చరిత్ర మొట్టమొదటి తెలుగు కవులచరిత్ర కర్నల్ మేకంజీ సేకరించిన కైఫియతులు దేశ చరిత్రను, గ్రామాల చరిత్రను గ్రామనామాల చరిత్ర మొదలయిన పురాణచరిత్రలను, తెల్పుసుకోవడానికి ఉపయోగిస్తాయి. తర్వాత కైఫియత్తులనబడే గ్రామాల కవిలెల్లోని భాష సరళమైన వ్యవహారిక భాషలో వుండడం విశేషం మెకంజీ సేకరించిన కైఫియత్తులు ఆంధ్రదేశ చరిత్ర నిర్మాణానికి భాషా స్వరూపజ్ఞానానికి చాలా ఉపయోగించాయి.

ఆంధ్రభాష సాహిత్యవిమర్శ వికాసాలకు కృషి చేసినవాడు. చార్లెస్

ఫిలిప్ బ్రౌను. బ్రిటిషు ఉద్యోగిగా సి.పి. బ్రౌను 1817లో మద్రాసు వచ్చాడు. అతడు కడప, మచిలీపట్నం, రాజమండ్రి, గుంటూరు చిత్తూరు ప్రాంతాల్లో దండనాధికారిగా, విద్యా సంఘాధికారిగా పనిచేసాడు. అప్పుడే తెలుగును నేర్చుకొని పాండిత్యాన్ని సంపాదించి స్వదేశానికి వెళ్ళిపోయేంతవరకు అంటె 1855 వరకు తెలుగు భాషా సాహిత్యాల గురించి కృషి చేసాడు. 1840 లో పాశ్చాత్య పండితులు తెలుగు నేర్చుకోడానికి సులభతరమయ్యే తెలుగు వ్యాకరణాన్ని రచించి ప్రచురించాడు. తెలుగులో పాశ్చాత్య పరిశోధనా పద్ధతులను గ్రంథపరిష్కరణ విధానాన్ని ప్రవేశపెట్టినవాడు బ్రౌను. మూలపడి వున్న కావ్యాల తాళపత్ర ప్రతులను సేకరించి పాఠభేదాలను నిర్ణయించి కఠిన పదాలకు వివరణలు వ్రాయించి సులభరీతిలో ఉత్తమ వ్యాఖ్యానాలు రచింపజేసి ముద్రింపజేసాడు. ఈ బృహత్కార్యంలో అతనికి జూలూరి అప్పయ్య, రావిపాటి గురుమూర్తి శాస్త్రి సహాయకులుగా పనిచేసారు. బ్రౌను తెలుగు సాహిత్యాన్ని గురించి వీరశైవ సాహిత్యం గురించి తెలుగు ఛందస్సు భాషా వ్యాకరణాలను గురించి ఇంగ్లీషులో వ్యాసాలు ప్రకటించి తెలుగు గొప్ప తనాన్ని ఆంధ్రేతరులకు తెలిసేటట్లు చేసాడు. వేమన పద్యాలను సేకరించిన మొదటి పరిశోధకుడు బ్రౌను. వేమన పద్యాలను కొన్నిటిని ఏరుకొని బ్రౌను ఇంగ్లీషులోకి (1829) అనువదించాడు. వసుచరిత్ర టీక తాతాచార్యుల కథలు మొదలయిన గ్రంథాలకు ఆయన వ్రాసిన పీఠికలు అమూల్యమైనవి. బ్రౌను సిద్ధంచేసి ప్రచురించిన ఇంగ్లీషు - తెలుగు తెలుగు—ఇంగ్లీషు నిఘంటువు (1821) ఇప్పటికీ అమూల్యమైంది. బ్రౌను ప్రోత్సాహంతో పండితుల దృష్టి ప్రాచీన కావ్యాల ఉద్ధరణవైపుకు మళ్ళింది. చక్కని పాఠనిర్ణయాలు చేసి ముద్రించే కార్యం ప్రారంభమైంది. అచ్చ యిన కావ్యాలు అందరికి అందుబాటులో వుండడంతో సాహిత్యాధ్యయనం, పరామర్శ, విమర్శల మీద సాహిత్యాభిమానులు దృష్టిని కేంద్రీకరించారు. బ్రౌను కృషి సాహిత్య పునరుజ్జీవనానికి చాలా దోహదం చేసింది.

ఎ.డి.క్యాంబెల్ అనే ఆంగ్లేయ ప్రభుత్వోద్యోగి కూడా దేశీయపండితుల సహాయంతో తాళపత్ర ప్రతులను సేకరించి పరిష్కరించి సంపాదీకరించి తెలుగు ప్రాచీనకావ్యాలను టీకలతో ప్రచురించాడు. 1816లో ఆయన

తెలుగుకు "ఏ గ్రామర్ ఆఫ్ తెలుగు లాంగ్వేజు" అని ఇంగ్లీషులో వ్యాకరణం వ్రాసాడు. దానికి పీఠిక వ్రాస్తూ ఫ్రాన్సిస్ ఎలిస్ అనే పండితుడు తెలుగు సంస్కృత జన్యం కాదని అన్నాడు. క్యాంబెల్ కాక ఏ.హెచ్.ఆర్డెన్, విలియం బ్రౌను (1817) లు కూడా తెలుగుకు ఇంగ్లీషులో వ్యాకరణాలు రచించారు. 1856లో బిషప్ కాల్డ్వెల్ "ఏ కంపారిటివ్ గ్రామర్ ఆఫ్ ద్రవిడియన్ ఆఫ్ సౌత్ ఇండియన్ ఫామిలీ ఆఫ్ ల్యాంగ్వేజస్" అనే పుస్తకం వ్రాసి తెలుగు ద్రావిడ భాషాకుటుంబానికి చెందిందని నిరూపించాడు. టి.యం.శేషగిరి శాస్త్రి (1884) చిలుకూరి నారాయణ రావు (ఆంధ్రభాషా చరిత్ర 1937) లు తెలుగు ఆర్యభాషా కుటుంబానికి చెందిందని వాదించారు. గంటి జోగి సోమయాజి (ఆంధ్రభాషా వికాసము), కోరాడ రామకృష్ణయ్యలు తెలుగు ద్రావిడ భాష అని సమర్థించారు.. తెలుగుకు ద్రావిడ భాషలతో సంబంధం ఒకవైపు, వ్యావహారిక భాషోద్యమం మరోవైపు తెలుగు భాష సాహిత్యాల ప్రత్యేకత నిరూపణకు, పురోగమనానికి దోహదం చేసాయి. 1812 లో వావిళ్ళ రామస్వామి శాస్త్రులు ముద్రణాలయం స్థాపించి అనేక తెలుగు గ్రంథాలను ముద్రించి అందరికి అందుబాటులోకి తెచ్చి సాహిత్యోద్ధరణకు గొప్ప యోగదానం చేసాడు.

1857లో జరిగిన విశ్వవిద్యాలయాల స్థాపనకు పూర్వమే 18వ శతాబ్దం చివరలోనే మిషనరీలు చిన్నబడులు పెట్టి ఇంగ్లీషు నేర్పారు. 1804-05లో వెల్లస్లీ రాజప్రతినిధి కాలంలో ఇంగ్లీషు నేర్పేపాఠశాలలు చాలా స్థాపించబడినాయి. 19వ శతాబ్దారంభంలో కళాశాలలు కూడా వెలిసాయి. 1812లో మద్రాసులో సెయింటు జార్జి ఫోర్టు కళాశాల, 1817లో కలకత్తాలో హిందూ కళాశాల 1818లో పెరంబుదూరులో బాప్టిస్టు మిషన్ కళాశాలలు ఏర్పడి భారతీయులకు ఇంగ్లీషు విద్యను బోధించాయి. 1880లో స్థానిక పరిపాలన ప్రవేశించింతర్వాత మ్యునిసిపాలిటీ, తాలుకాబోర్డు, జిల్లా బోర్డులు కూడా పాఠశాలలను నడిపాయి. మెట్రిక్యులేషన్, ఎఫ్.ఏ, బి.ఏ.లు పట్టాలున్న కవి పండితులు అధ్యాపకులుగా ఉద్యోగాలు చేసారు. న్యాయరంగంలోను పనిచేసారు. దాంతో కవి పండితుల్లో రాజాదరణ అవసరం లేని స్వతంత్రంగా సంసారపోషణను సాగించే కొత్తతరం వచ్చింది.

వీరేశలింగం యుగంలోని కవిపండితులు పరాయి పాలనను విదేశీదా స్యాన్ని అంతగా గుర్తించినట్లు కన్పించదు. ఆ విషయంలో వాళ్ళు కొంత ఉదాసీనతనే కలిగివున్నారు. దానికి కొత్తగా వచ్చిన ఆర్థిక వసతులే కారణం కావచ్చును. చాలా మంది కవులీ కాలంలో ఇంకా సంస్కృతభాషావ్యా మోహాన్ని విడిచి పెట్టలేదు. తెలుగుతో పాటు వాళ్ళు సంస్కృతంలో పాండిత్యం సంపాదించారు. ఉద్యోగం కోసం ఇంగ్లీషునేర్చారు. సంస్కృత నాటకాన్ని అనువదించని కవి ఈ కాలంలో లేడేమో. నాటక ప్రదర్శనల చేత ప్రోత్సాహితులయ్యారు. అంతేగాక ఇంతవరకు సంస్కృతం నుంచి అనువాదం కాకుండా నాటకాలు మిగిలిపోయి వున్నాయి. ఆ కారణం చేత కూడా కవులు సంస్కృత నాటకానువాదాలకు పూనుకొని వుంటారు. సంస్కృతంలోని దేవీపురాణాదులను కూడా చాలా మంది కవులను వదించడంలో మునిగిపోయారు. కొక్కొండవారు బ్రిటిషు యువరాజు భారతదేశ పర్యటనను వర్ణిస్తూ "పోయం ఆఫ్ ది ప్రిన్స్ ఆఫ్ వేల్సు విజిట్ టు ఇండియా" అని రచించాడు. అట్లా కొందరు ఆంగ్లేయ పాలకుల మీద ప్రభుభక్తి చూపారు. కొందరు తటస్థంగా వుండిపోయారు. అంటే వాళ్ళను గురించి పట్టించుకోలేదు. విమర్శించలేదు. ప్రశంసించలేదు. కాశీభట్ల బ్రహ్మయ్య శాస్త్రి సనాతన ధర్మాభిమానం పరవస్తు వేంకటరంగాచార్యుల వంటి వాళ్ళు క్రైస్తవ మతప్రచారాన్ని ఎదిరించారు. అందులో వారి దేశాభిమానం ప్రకటమైంది. అయితే అక్కడక్కడ ఆంగ్లేయులను వ్యతిరేకిం చడం వాళ్ళను విమర్శించడం ఈ యుగంలో ఆరంభమై కాల్పనికయుగం నాటికి దేశభక్తి కవితా వస్తువైంది, కవులు స్వాతంత్ర్యోద్యమంలో చేరారు. వేషభాషల్లో దేశాభిమానాన్ని చూపారు. 1907లో బిపిన్ చంద్రపాల్ రాజమండ్రిలో ఇచ్చిన ఉపన్యాసాన్నివిని ప్రేరేపితుడై చిలకమర్తి -

భరత ఖండంబు చక్కని పాడియావు
హిందువులు లేగదూడలై యేడ్చుచుండ
తెల్లవారను గడుసరి గొల్లవారు
పితుకుచున్నారు మూతులు బిగియగట్టి

అని ఆంగ్లేయుల దోపిడిని చక్కగా వర్ణించాడు. ప్రభుత్వం దీని మీద

ఆంక్ష పెట్టగా "తెల్లవార"ను అనే పదానికి తెల్లవారగట్ల అనే అర్థం చెప్పి చమత్కరించి చిలకమర్తి తప్పించుకున్నాడట. ఈ యుగంలో కొన్ని చారిత్రక నాటకాలు నవలలు మహాపురుషుల జీవితచరిత్రలు కావ్యాలు ప్రజల్లో జాతీయభావనలను స్వాతంత్ర్యేచ్ఛలను రేకెత్తించాయి. రాబోయే కాల్పనిక యుగంలోని స్వేచ్ఛ దేశస్వాతంత్ర్యోద్యమ భావనలకు బీజావాప జరిగింది.

కళాశాలలో, చెన్నపురి రాష్ట్రీయకళాశాలలలోనూ ఆంధ్రోపాధ్యాయుడుగా పనిచేసిన ప్రౌఢవ్యాకరణం, శబ్దారత్నాకరం కూర్చిన బహుజనపల్లి సీతారామాచార్యులు చిన్నయసూరి శిష్యుడు. 1853లో చిన్నయసూరి "నీతి చంద్రిక"ను గద్యంలో అనువదించాడు. 1858లో బాలవ్యాకరణం వ్రాసి తెలుగు గ్రాంథికభాషకు స్థిర రూపాన్ని ఇచ్చాడు. బాలవ్యాకరణం ఇప్పటికీ తెలుగులో విద్యార్థులకు పండితులకు ప్రామాణికంగా వుంది. సుజనరంజని పత్రికను నడిపాడు.

కోరాడ రామచంద్ర శాస్త్రి (క్రీ.శ. 1816-1900) పండిత కవి. శతావధానాలు చేసేవాడు. బందరు నోబిలు కళాశాలలో ఉద్యోగం చేసాడు. 1860లో మంజరీమధుకరీయమనే కల్పిత కథలో కూడిన నాటకం వ్రాసాడు. అది తెలుగులో మొదటి స్వతంత్ర నాటకం. అది ప్రయోగయోగ్యంగాలేదని కొందరు విమర్శించారు. శాకుంతలం, వేణీసంహారం, ముద్రారాక్షసం నాటకాలను అనువదించాడు. కొక్కొండ వారి శైలి వలె ఈయన శైలి ప్రౌఢమైంది.

మతుకుమల్లి నృసింహకవి (క్రీ.శ. 1816-1873) మొదట్లో అజచరిత్ర వంటి పిల్లవసుచరిత్ర వ్రాసాడు. తర్వాత 1860లో "చెన్నపురీ విలాసం" అని మద్రాసునగరాన్ని వర్ణిస్తూ కావ్యాన్ని రచించాడు. వస్తువులో నవ్యత గల కావ్యం. దీనిలో కవి ఇంగ్లీషు పదాలను ప్రయోగించడం విశేషం.

మహామహోపాధ్యాయ పరవస్తురంగాచార్యులు (క్రీ.శ. 1822-1900) పండిత కవి. కాళిదాసు శాకుంతలాన్ని అనువదించాడు. తవ వక్తృత్వంతో

ఎందరో యువకులను క్రైస్తవులు కాకుండా చేసాడు. అతన్ని యుగ సంధికి ప్రతినిధిగా పరిగణించారు కొందరు.

మండపాక పార్వతీశ్వర శాస్త్రి (క్రీ.శ. 1833-1897) తన జీవిత విశేషాలను ఆత్మచర్య పేరుతో సీస పద్యాల్లో శతకంగా వ్రాసాడు. బొబ్బిలి రాజావారి ఆస్థానకవి. 20కి పైగా శతకాలు వ్రాసాడు.

మాడభూషి వేంకటాచార్య కవి (క్రీ.శ. 1835-1895) శతవధానాలు చేసినవాడు. శతావధానాలకు మార్గం చూపిన వాడు. ఏక సంథాగ్రాహి. నూజివీడు సంస్థానంలో ఆస్థానకవిగా వున్నాడు. ఆనందగజపతిని ప్రశంసిస్తూ పద్యాలు చెప్పాడు. భరతాభ్యుదయం, హంససందేశం వంటి ఖండకావ్యాలు వ్రాసాడు.

మహామహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్న శర్మ (క్రీ.శ. 1842-1915) కవి పండితుడు. సంస్కృతంలో "గీత మహానటం" గీత గోవిందం ఛాయలతో వ్రాసాడు. తెలుగులో బిల్వేశ్వరీయం కావ్యం ధనంజయవిజయం నరకాసుర విజయం అనే వ్యాయోగాలు వ్రాసాడు. గ్రాంథికాంధ్రంలో గింటలతరబడి ఉపన్యాసాలిచ్చేవాడు. వ్యవహారిక భాషోద్యమాన్ని సంఘసంస్కరణలను ఎదిరించాడు. వీరేశలింగంతో ఈయనకు వాదోపవాదాలు జరిగి వ్యక్తిదూషణవరకూ దిగాయి. బాణుని కాదంబరిలోని మహాశ్వేత కథననువదించి పత్రికలో ప్రచురించాడు. నిడదవోలు వేంకటరావు ఇదే తెలుగులో మొదటి నవల అని అన్నాడు.

వావిలాల వాసుదేవశాస్త్రి (క్రీ.శ. 1851-1917) 1872 లో బి.ఏ పట్టం తీసుకొని రాజమండ్రి ప్రభుత్వ కళాశాలలో ఆంగ్లోపాధ్యాయుడుగా పనిచేసాడు. జూలియసు సీజరు నాటకాన్ని ఇంగ్లీషు నుంచి తెనిగించాడు. ఇది ఇంగ్లీషు నుంచి మొదటి నాటకానువాదం. మృచ్ఛకటికం, ఉత్తర రామచరిత్ర నాటకాలను రఘువంశకావ్యాన్ని అనువదించాడు. వావిలాల వాసుదేవశాస్త్రి, వడ్డాది సుబ్బారాయుడు, వీరేశలింగం - ముగ్గురు రాజమండ్రిలో ప్రకృత కవిత్రయమనబడినారు.

గురజాడ శ్రీరామమూర్తి (క్రీ.శ. 1851-1899) మెట్రిక్యులేషను చదివి కాకినాడ సబ్ కోర్టులో పనిచేసాడు. తర్వాత 1830 నుండి ఆనంద గజపతి ఆస్థానంలో పండితుడుగా వున్నాడు. "కవిజీవితములు" పేరుతో తెలుగులో తెలుగు సాహిత్యచరిత్రను రచించాడు. "మర్చంట్ ఆఫ్ వెనిస్" అనే షేక్స్పియరు నాటకాన్ని అనువదించాడు.

ఆదిభట్లనారాయణదాసు (క్రీ.శ. 1864-1945) కవి పండితుడు. కావ్యాలు, నాటకాలు, శతకాలు, హరికథలు చాలా వ్రాసాడు. హరికథా పితామహుడుగా పేరు పొందాడు. సంస్కృతాంధ్రం ఇంగ్లీషులో పండితుడు. ఎఫ్.ఏ. వరకు చదివాడు. "ఉమరుఖయ్యాము"ను సంస్కృతం తెలుగులోకి అనువదించాడు. మొట్టమొదట ఉమరు ఖయ్యామును అనువదించిన కవి ఇతడే.

వడ్డాది సుబ్బారాయుకవి (క్రీ.శ. 1854-1938) ఆనాటి చాలామంది కవుల వలెనే ఈయన సంస్కృత నాటకాలను అనువదించాడు. శతకాలు వ్రాసాడు. కాని ఈయన కవిత్వంలో పాశ్చాత్య కవిత్వంలోని నూతన భావాలు చోటు చేసుకోవడం నవ్యత్వం. ఈయన పతిస్మృతి, సుతస్మృతి పాశ్చాత్య ప్రక్రియలకు చెందినయి. తర్వాత భావకవిత్వకాలంలో స్మృతి రచనలకివి నాంది పలికాయి.

ఆచంట వేంకటసాంఖ్యాయనశర్మ (క్రీ.శ.1864-1933) పండిత కవి. పత్రికా సంపాదకుడు విమర్శకుడు. మంచి వక్త. సంగీతం చిత్రలేఖనం తెలి సినవాడు. ఆంధ్రపద్యావళి పేరుతో కావ్యఖండికలను వ్రాసాడు. సంస్కరణ భావాలను ప్రకటించి నవ్యతను చూపాడు.

మహామహోపాధ్యాయ వేదం వేంకటరాయశాస్త్రి పండితుడు కవి. ప్రతా పరుద్రీయం, బొబ్బిలియుద్ధం, ఉష - అనే నాటకాలు స్వతంత్రమైనవి. మాళవికాగ్నిమిత్రం, ఉత్తర రామచరిత్ర, నాగానందం, విక్రమోర్వశీయం, రత్నావళి అనువాద నాటకాలు. శృంగార నైషధం, ఆముక్తమాల్యదను ఆయన వ్యాఖ్యానాలు రఘువంశం కుమార సంభవం మేఘ సందేశం

విజయవిలాసం కావ్యాలకు టీకలు పాండిత్య స్ఫోరకాలు. ఆయన చోడవరం స్కూలులో ప్రధానాంధ్రోపాధ్యాయుడుగా పనిచేసాడు. నాటకాల్లో పాత్రోచితభాషగా గ్రామ్యం వాడి కొత్త దనాన్ని చూపాడు.

తెలుగులో స్వతంత్ర నాటకం వ్రాసిన కవి, నటుడు ధర్మవరం రామకృష్ణమాచార్యులు (క్రీ.శ. 1853-1912) గద్వాల మహారాజు అతనికి 1910లో ఆంధ్రనాటక పితామహ బిరుదాన్నిచ్చి గౌరవించాడు. చిత్రనళీయం, విషాద సారంగధరం, ప్రహ్లాద, పాదుకాపట్టాభిషేకం మొదలైన ఎన్నో నాటకాలు వ్రాసి ప్రదర్శించాడు. వృత్తి చేత న్యాయవాది. కృష్ణమాచార్యుల సోదరుడు ధర్మవరంగోపాలాచార్యులు కూడా న్యాయవాదిగా వుండి 30 వరకు నాటకాలను వ్రాసి ప్రదర్శించాడు. ఆయన రామరాజుచరిత్ర నాటక ప్రదర్శనాన్ని ప్రభుత్వం నిషేధించింది.వాళ్ళిద్దరి వలె బళ్ళారి నివాసి రాఘవాచార్యులు తెలుగు నాటకరంగం వ్యాప్తికి కృషి చేసాడు. అనేక పాత్రల మనస్తత్వాలను కొత్త అభినయంతో రూపుదిద్దిన కళాకారుడు ఆయన దుర్యోధన ప్రాత్రకు సహజరూపాన్ని సృష్టించి నటించాడు. బలిజేపల్లి లక్ష్మీకాంతకవి కవి.నటుడు. (1881-1953) హరిశ్చంద్ర నాటక ప్రదర్శనతో తెలుగు నాటకరంగ వ్యాప్తికి దోహదం చేసాడు. తిరుపతివేంకటకవుల పాండవోద్యోగాదులు, శ్రీపాద బొబ్బిలివిజయం, చిలకమర్తి గయోపాఖ్యానం వేదం ప్రతాపరుద్రీయం నాటకాలు పండితులను పామరులను సమానంగా ఆకర్షించి ఉర్రూతలూగించాయి.

పానుగంటి లక్ష్మీనరసింహారావు (క్రీ.శ 1865-1940) రాధాకృష్ణ వంటి నాటకాలు వ్రాసాడు. కాని ఆయన సాక్షి వ్యాసాలు తెలుగులో వ్యాసప్రక్రియ వికాసానికి దోహదం చేసాయి. హాస్యవ్యంగ్యంతో కూడిన ఆయన శైలి తెలుగు వచన రచనను ఒక మలుపు తిప్పింది.

శ్రీపాద కృష్ణమూర్తి (క్రీ.శ 1866) భారతభాగవత రామాయణాలను ఒక్క చేతిమీదుగా ఆంధ్రీకరించిన కవి. అచ్చతెనుగు కావ్యం స్వతంత్రనాటకాలు ఆంధ్రీకరణ నాటకాలు మొదలయిన శతాధిక కృతులను రచించాడు. ఈయన వేదంవారి శిష్యుడు. చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి ఇతని శిష్యుడు.

లక్కవరం సంస్థానాధిపతి మంత్రిప్రగడ భుజంగరావు (క్రీ.శ1872-1948) శివపురాణం, మార్కండేయచరిత్ర మొదలయిన కావ్యాలను వ్రాసాడు. శాకుంతలం, ప్రసన్నరాఘవం, ఉత్తరరామచరిత్ర నాటకాలను అనువదించాడు. ఈయన ఇంగ్లీషులో తెలుగు సాహిత్యచరిత్రను వ్రాసాడు. మంజువాణి మాసపత్రికను నడిపాడు. ఈయన ఆస్థాన పండితులుగా ఆకొండి వ్యాసమూర్తి మొదలయిన వాళ్ళెందరో వున్నారు.

దాసు శ్రీరామకవి (క్రీ.శ 1864-1908) పండితుడు ఏకసంథాగ్రాహి. బహుగ్రంథకర్త. అచ్చతెనుగులోకి అభిజ్ఞాన శాకుంతాలాన్ని అనువదించాడు. మాలతీమాధవం, మహావీర చరిత్ర,ఉత్తర రామచరిత్ర మాళవికాగ్నిమిత్రం నాటకాలననువదించాడు. "తెలుగునాడు" స్వతంత్ర కావ్యం. సమకాలిక సమాజాన్ని చిత్రిస్తూ నవ్యతను చూపిన కవి. ఇతనికి కీర్తి తెచ్చిపెట్టింది దేవీభాగవతం. తెలుగులో దేవీభాగవతం మొట్టమొదటి అనువాదం ములుగు పాపయారాధ్యునిది. ఈ రెండేకాక తమ్మన దొర (1849-1890) తిరుపతి వేంకటకవులు దేవీభాగవతాన్ని అనువదించారు. దాసుశ్రీరామకవి 1880 లో కల్పవల్లి పత్రిక ద్వారా సంఘసంస్కరణకు కృషిచేసాడు.

ఈ యుగంలో తిరుపతి వేంకటకవులను గురించి తెలియని వాళ్ళు లేరు. జంటకవులు. తెలుగు సాహిత్యంలో అవధాన ప్రక్రియతో పాటు జంటగా కవిత్వం చెప్పే సంప్రదాయం ప్రత్యేకంగా కన్పించేది. తెలుగులో మొదటి జంటకవులు క్రీ.శ 15 వ శ. నందిమల్లయ ఘంటసింగయలు. ఆధునిక కాలంలో తిరుపతి వేంకటకవులు ప్రసిద్ధమైన జంటకవులు. వీళ్ళకన్నా ముందున్న జంటకవులు-దేవులపల్లి సోదరులు. దేవులపల్లి సుబ్బారాయశాస్త్రి (1853-1909) దేవులపల్లి తమ్మన శాస్త్రి (1856-1912). పిఠాపురం సంస్థానాధీశ్వరుల ఆదరణ పొందారు. అవధానాలు చేసేవారు. తమ్మన శాస్త్రి కొడుకే భావకవి కృష్ణశాస్త్రి.

ఆధునికయుగారంభంలో తెలుగు పద్యాన్ని జీవింపజేసిన జంటకవులు తిరుపతి వేంకటకవులు-దివాకర్ల తిరుపతి శాస్త్రి (1871-1919) చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రి (1870-1950) పాండవజననం, పాండవోద్యోగం, పాండవ

విజయం-వాళ్ళ మూడు నాటకాలు చాలా ప్రచారన్నందుకున్నాయి. వాటిల్లోని పద్యాలు ప్రజల నోటి మీద వుండేయి.వాళ్ళ పద్యాలు జనజీవి సంలోని భాషాపదాలు నుడికారాలతో సరళశైలిలో రసవంతంగా వుంటాయి. ముఖ్యంగా పాండవోద్యోగం ప్రదర్శింపబడి చాల ప్రజాదరణను పొందింది. ఆ కవులు నానా సంస్థానాలను దర్శించి తమ ఆశుకవిత్వం అవధానాలతో పాండిత్యంతో సంస్థానాధీశ్వరులను మెప్పించి గౌరవసత్కారాలు పొందారు. అనేక అవధానాలు చేసి ప్రజల మన్ననలు(?) పొందారు. వాళ్ళ పద్యవిద్యచేత ఆకర్షితులై అందరూ ఆ నాళ్ళల్లో వాళ్ళలాగా కవిత్వం వ్రాయలని మోజుపడే వాళ్ళు. ఆవిధంగా వాళ్ళు తెలుగు కవిత్వాన్ని మేల్కొలిపి ప్రచారాన్ని చేసి పద్యాలకు కొత్త నడకలు నేర్పిన కవులయ్యారు. ఆ కవులు దేవీభాగవతం, బుద్ధచరిత్రకావ్యం వ్రాసారు. వాళ్ళవలె జంటగా కవిత్వం చెప్పాలని చాలామంది బయలుదేరారు. వాళ్ళకు ఏకలవ్యశిష్యులమని గర్వంగా చెప్పుకునేవాళ్ళు. ఆస్థానాల్లో కాక బహిరంగసభల్లో అవధానాలు చేసారు. ఆంధ్రదేశంలో ప్రతి పట్టణం ప్రతిగ్రామం తిరిగి తెలుగు కవిత్వాన్ని వినిపించి ప్రజలను సాహిత్యాభిమానులుగా కవితోన్ముఖులను చేసిన ఘనత వాళ్ళకు దక్కింది. ఆ తర్వాత అదే పద్ధతిలో ఊరూరా తిరిగి కవితాగానం చేసి భావకవులు కవితాప్రచారం చేసారు. ఆ విధంగా సంస్థానాలను సంస్థా నాధీశ్వరులను విడిచిపెట్టి తెలుగు కవిత్వం ప్రజల సమ్ముఖానికి వచ్చింది. బహిరంగ సభల్లో కవితాగానాలు చేయడం జరిగింది..

తిరుపతి వేంకటకవులకు దీటుగా జంటగా అవధానాలు కవితాగా నాలు చేసినవాళ్ళు వేంకటరామకృష్ణకవులు. ఓలేటి వేంకటరామ శాస్త్రి (1883-1939) వేదుల రామకృష్ణ శాస్త్రి (1889-1918). వీరికి తిరుపతి వేంకట కవులతో వాగ్యుద్ధం జరిగింది. వయస్సులో చిన్నవారైనా ఆ కవుల కృతులలోని దోషాలను బయటపెడ్తూ "శతఘ్ని" అనే ఖండనగ్రంథాన్ని వ్రాసారు. వీరి వివాదాలు సాహితీలోకంలో సాహిత్యజిజ్ఞాసను కలిగించాయి. ఈ కవులు 30 వరకు కృతులు రచించారు. ఇందిరాదేవి, సుభద్ర, శకుంతల, దమయంతి అనే నవలలను కూడా వ్రాసారు. తిరుపతి వేంకటకవుల వలె జంటగా కవిత్వం చెప్పినవాళ్ళు-వేంకటరామకృష్ణకవులు, వేంకట పార్వతీశ్వర

కవులు; పింగళి కాటూరి కవులు, వేంకట శేష కవులు మొదలయిన వాళ్ళలో కొందరే ప్రసిద్ధమైనారు.

చెళ్లపిళ్ల వేంకటరావు (1880) ఓలేటి పార్వతీశం (1882)-ఇద్దరు వేంకట పార్వతీశ్వర కవులుగా జంటగా రచనలు చేసారు.వీరి "ఏకాంతసేవ" 1922 భావకవితాసూర్యుని ఉదయానికి ముందు అరుణోదయ రేఖల్లో ఒక రేఖ. చక్కని భావనాశక్తితో కూడింది. "వంగభాషకు రవీంద్రుని గీతాంజలి యెట్టిదో మన యాంధ్రమునకీ" కావ్యమట్టిదని కృష్ణశాస్త్రి పీఠికలో ప్రశంసించాడు. ఈ జంటకవుల మీద వంగభాషాప్రభావం చాలా కన్పిస్తుంది. ఈ జంటకవులు రాజసింహ, వీరపూజ, వసుమతీ వసంతం, మనోరమ,మాతృమందిరం, మాయావి, కృష్ణకాంతుని మరణశాసనం వంటి అనేక నవలలు వ్రాసి నవలా ప్రక్రియవ్యాప్తికి దోహదం చేసారు.

పింగళి లక్ష్మీకాంతం (1894) కాటూరి వేంకటేశ్వరరావు (1895) కవులు జంటగా సౌందరనందం, పౌలస్త్యహృదయం, తొలకరి అనే ఖండ కావ్యాలను రచించారు. వస్తువులో నవ్యతను చూపారు. ఈ కవులు వేరువేరుగా కూడా సాహిత్య వ్యాసంగం చేసారు. సాహిత్యబోధనలతో శిష్యులనలరించారు. ఈ యుగంలో ఖండకావ్య ప్రక్రియ ప్రారంభమైంది. ఖండకావ్య ప్రక్రియలో వీరి మూడు కావ్యాలు ఉత్కృష్టమైనయి.

చిలకమర్తి లక్ష్మీనరసింహం (1867-1946) నాటక రచయితగా నవలా కారుడుగా పేరు పొందాడు. తెలుగులో గోపాలకృష్ణమ శెట్టి, వీరేశలింగంతో ఆరంభమైన నవలా ప్రక్రియ చిలకమర్తి చేతిలో పూర్తిగా వికసించి ప్రజాదరణను సంపాదించుకుంది. ఈయన వ్రాసిన "హేమలత" తెలుగులో మొదటి చారిత్రక నవల. ఇంగ్లీషులో చారిత్రక నవలలు వ్రాసి పేరు పొందినవాడు స్కాటు. అదేవిధంగా తెలుగులో అహల్యా బాయి వంటి ఎన్నో చారిత్రక నవలలు వ్రాసిన ఇతనికి "ఆంధ్రాస్కాటు." అనే కీర్తి వచ్చింది. రామచంద్రవిజయం, కృష్ణవేణి, సౌందర్యతిలక, సుధాశరచ్చంద్రం వంటి నవలలెన్నో ఈయన వ్రాసాడు. ఈయన మహాపురుషుల జీవితములు, రాజాస్థాన కథావళి, రాజారామమోహనరాయి వంటి రచనలు

పాఠకుల్లో జాతీయభావాలను కలిగించాయి. ఈయన వ్రాసిన నాటాకాల్లో గయోపాఖ్యానం చాల ప్రదర్శనలతో వ్యాప్తినందుకున్నది.

చిలకమర్తితోపాటు ఈ యుగంలో విశేషంగా నవలా రచనలు చేసి నవలా ప్రక్రియకు వ్యాప్తిని కలిగించిన రచయిత ఖండవిల్లి రామ చంద్రుడు. ఈయన ధర్మవతీ విలాసం (1893) లక్ష్మీ సుందరవిజయం (1896) నవలలకు బహుమతులను గెల్చుకున్నాడు.

ఈ యుగంలో చిలకమర్తి, ఖండవిల్లి,వేంకట పార్వతీశ్వర కవులతోపాటు నవలా ప్రక్రియకు విశేషవ్యాప్తిని కలిగించిన రచయిత కేతవరపు వేంకట శాస్త్రి. మదాలస (1911) లక్ష్మీ ప్రసాదం (1911) అగ్రహారం, తారాబాయి, రాయచూరు యుద్ధం, బొబ్బిలి ముట్టడి మొదలయిన ఎన్నో నవలలు ఈయన వ్రాసాడు. 20 వ శతాబ్దం ఆరంభంలో విజ్ఞానచంద్రికాగ్రంథమాల, వేజుక్క గ్రంథమాల,ఆంధ్రప్రచారిణి గ్రంథమాల,ఆంధ్రభాషాభివర్ధనీ గ్రంథమాల, రామవిలాస గ్రంథమాల, సరస్వతీ గ్రంథమాలలు నవలల ప్రచురణకు నడుం కట్టుకొని నవలా రచనను ప్రోత్సహించాయి.పాఠకుల్లో నవలాపఠనాసక్తిని కలిగించి నవలాసాహిత్యాభివృద్ధికి దోహదం చేసాయి. జాతీయ భావాలను, స్వాతంత్ర్యేచ్ఛను నవలలు పాఠకుల్లో కలిగించి ఉత్తేజపరిచాయి.

కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రి (1863-1940)విమర్శకుడుగా పేరు పొందాడు. 1880 లో "భక్తసమాజము" ను స్థాపించి బ్రహ్మసమాజాన్ని ఎదిరించాడు.1883 లో "ఆర్యమతబోధిని" అనే మరో సమాజాన్ని నిలిపి ఆ పేరుతో పత్రికను నడిపాడు. "వివేకానంద పుస్తకభాండాగారాన్ని" స్థాపించాడు. హిందూమతప్రచారానికి తన శక్తినంతా ఉపయోగించిన కర్మఠుడు. వీరేశలింగం సంఘసంస్కరణలను ఎదిరించాడు.వీరేశలింగం నవల రాజశేఖర చరిత్ర మీద విమర్శనాగ్రంథాన్ని వ్రాసి గ్రంథరూప సాహిత్య విమర్శకు శ్రీకారం చుట్టాడు. ఈ విమర్శనాగ్రంథంలో ఆయన "నవల" అని నవలాప్రక్రియకు నామకరణం చేసాడు.

ఈ యుగంలో వర్ణవ్యవస్థను గురించి స్త్రీ మీద జరిగే అన్యాయాలను

గురించి హేతువాదంతో అనుకంపలో స్పందించిన కవి పండితులున్నారు. అటువంటి వాళ్ళల్లో పేర్కొనదగిన కవిపండితుడు జనమంచి వేంకటరామయ్య (1872-1933) మాలతీమాధవం ఉత్తరరామచరిత్ర విద్ధసాలభంజిక నాటకాలను అనువదించాడు. సుప్రభాతం, అమృతభాండమనే ఖండకావ్యాలను వ్రాసాడు. అమృతభాండం' ఆయన జాతీయదృక్పథానికి నిదర్శనం. "నాదారితోడు" ఖండికలో అంటరానివాళ్ళ మీద అనుకంపను ప్రదర్శించాడు. ఆ కాలంలో అంతమాత్రం అవగాహనతో అనుకంపను చూపడం విప్లవభావాలకిందనే పరిగణించాలి.

ఈ యుగంలో నవ్యవస్తువుతో మహాకావ్య రచనలను చేసిన కవులు దుర్భాక రాజశేఖర కవి (1888) గడియారము వేంకటశేషశాస్త్రి (1897) వీళ్ళిద్దరు జంటకవులుగా అవధానాలు చేసారు. కాని వాళ్ళకు కీర్తి తెచ్చింది వాళ్ళు వేరు వేరుగా రచించిన కావ్యాలు. దుర్భాకరాజశేఖర కవి రాణాప్రతాపుని చరిత్రను వస్తువుగా తీసుకొని "రాణా ప్రతాప చరిత్ర" అనే ఐదు ఆశ్వాసాల కావ్యం వ్రాసాడు. గడియారము వేంకటశేష శాస్త్రి శివాజీ చరిత్రను వస్తువుగా తీసుకొని "శివభారతము" అనే ఎనిమిది ఆశ్వాసాల కావ్యం వ్రాసాడు. పౌరాణిక గాథలను కాక మహావీరుల కథలను తీసుకొని కావ్యాలను వ్రాపి ఈ కవులు నవ్యసంప్రదాయానికి పునాదులు వేసారు. ఇద్దరి కవిత్వం సరసంగా ధారాళంగా వుంది.

ఈ యుగంలో భాషా సంబంధమైన ఉద్యమాన్ని నడిపి రచనాశైలిలో కృత్రిమతను తొలగించి సాహిత్యం అందరికీ అవగాహనరూపంగా వుండాలన్న పండితుడు గిడుగు వేంకటరామమూర్తి (1863-1940). వ్యావహారికభాషా ఉద్యమానికి సారథ్యం వహించాడు. అప్పుడు గ్రాంథిక వాదులకు వ్యావహారికవాదులకు వివాదాలు ఏర్పడినాయి. వాద వివాదాలు జరిగాయి. అప్పట్లో గ్రాంథికవాదం గెలిచినట్లనిపించినా కాలక్రమంగా వ్యావహారిక వాదమే బలపడింది. గిడుగువారు భాషాసంస్కరణవాదియే కాక వీరేశలింగం సంఘసంస్కరణలను సమర్థించాడు. వితంతు వివాహం హరిజనోద్ధరణను కోరాడు. గిడుగు గురజాడలు సహపాఠులే కాక సంస్కారవాదంలో ఇద్దరూ ఒకే అభిప్రాయాలతో ఉద్యమించారు. ఆంధ్రదేశం

ఆధునికత వైపు ప్రయాణించడానికి ఉద్యమించిన ఉదారవాదులు.

ఈ యుగంలో చెప్పుకోదగిన భాష, చరిత్ర, సాహిత్య సంబంధమైన పరిశోధనలు చేసి ఎన్నో సత్యాలను బయటపెట్టి తెలుగుజాతి సముద్ధరణకు పూనుకొన్న పరిశోధకులు పండితులు వున్నారు. జయంతి రామయ్య (186 0-1941) పరిశోధకుడు. విమర్శకుడు. అనేక శాసనాలు పరిశోధించి ఆంధ్రుల ప్రాచీనచరిత్ర రహస్యాలను వెలికి తీసాడు.ఆయనకు పిఠాపురం బొబ్బిలి వేంకటగిరి సంస్థానాధిపతులు ద్రవ్యసహాయం చేసారు. 1911లో జయంతి అధ్యక్షతలో ఆంధ్రసాహిత్య పరిషత్ స్థాపించబడింది. ఈయన సేకరించిన తాళపత్రప్రతులను శాసనాలను ఈ పరిషత్తు ముద్రించింది. పూండ్ల రామకృష్ణయ్య (1860-1904)అముద్రిత గ్రంథచింతామణి పత్రికను వెలువరించి అనేక అముద్రితగ్రంథాలను ప్రచురించాడు. ఆయన సాహిత్యసేవ చిరస్మరణీయమైంది.

కొమర్రాజు వేంకటలక్ష్మణరావు (1877-1927) ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము పేరులో 2 సంపుటాలు ప్రచురించాడు. ఆంధ్రుల చరిత్ర పరిశోధనలో అందె వేసిన చేయి. ఆంధ్రదేశచరిత్ర రచనకు శ్రీకారం చుట్టాడు.విజ్ఞాన చంద్రిక గ్రంథమాల పేరుతో విజ్ఞానశాస్త్రానికి సంబంధించిన గ్రంథాలను తెలుగులో ప్రచురించాడు. మహాపురుషుల జీవితచరిత్రలు, నవలలు ప్రచురించాడు. ఆయన భాషాసేవ గొప్పది. ఆయనకు వీరేశలింగం ఆదర్శంగా నిలిచాడు. లక్ష్మణరాయవ్యాసావళి పేరుతో లలితకళలు భాష సాహిత్యం విమర్శలకు సంబంధించిన చక్కని వ్యాసాలు ప్రచురించాడు. "ఏకశిలానగరమోరుగల్లే" "త్రిలింగమునుండి తెలుగు పుట్టెనా" అన్న ఆయన వ్యాసాలు సునిశిత విమర్శకు నిదర్శనాలు. "అబలా సచ్చరిత్ర రత్నమాల" రచించిన బండారు అచ్చమాంబ ,ఈయన సోదరి. 1901 లో లక్ష్మణరావు రావిచెట్టు రంగారావు, మునగాల రాజావారితో కలిసి హైద్రాబాదులో "శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం" స్థాపించి నిజాం పాలనలో వున్న తెలంగాణాలో తెలుగుభాషావ్యాప్తి ఆంధ్రోద్యమానికి బీజాలు నాటాడు. తర్వాత ఆయన అడుగుజాడల్లో నడుస్తూ మాడపాటి హనుమంతరావు (1885 జననం) సురవరం ప్రతాపరెడ్డి (1896 జననం) తెలంగాణాలో

ఆంధ్రభాషా సాహిత్యాభివృద్ధికి కృషి చేసారు. మాడపాటి చారిత్రక సాంఘికరమైన కథానికలు వ్రాసి సుల్లికాగుచ్ఛం మాలతీ గుచ్ఛం పేరుతో ప్రచురించాడు. సురవరం ప్రతాపరెడ్డి సంస్కృతాంధ్రం ఉర్దూపారశీక ఇంగ్లీషు భాషల్లో ప్రవేశం కలవాడు. గోలకొండ పత్రిక నడిపాడు. చరిత్ర పరిశోధనలు ఆయనకభిమాన విషయాలు. ప్రాచీన కావ్యాల ఆధారంగా ఆయన ఆంధ్రుల సాంఘిక చరిత్రను రచించాడు. కథానికలు నాటకాలు కూడా వ్రాసాడు. హిందువుల పండుగలు, హైందవ ధర్మవీరులు, రామాయణ విశేషములు ఆయన సునిశితపరిశీలన విమర్శనాపాటవానికి నిదర్శనాలు.

వేటూరి ప్రభాకర శాస్త్రి (1883 ) కార్యదీక్షగల పండితుడు. కవి పరిశోధకుడు. ప్రబంధ రత్నావళి, చాటు పద్యమణిమంజరి ఆయన పరిశోధన సేకరణలకు, తెలుగుమెరుగులు, శృంగార శ్రీనాథం ఆయన పరిశోధనకు సునిశిత విమర్శనాదృష్టికి నిదర్శనాలు. ఆయన రెడ్డిరాజ పరిశీలనం చారిత్రకులకు బాట చూపింది. ఆయన వ్రాసిన పీఠికలు గ్రంథాల వంటివి. అరసున్న, ఆంధ్రలిపి సంస్కారం మొదలైన విషయాల మీద ఆయన అభిప్రాయాలు శాస్త్రీయమైనయి. భాషా సారస్వతాల పరిశోధనలతోనే జీవితాన్ని గడిపాడు. నిరాడంబరుడు.

కాశీనాథుని నాగేశ్వరరావు (1867-1938) ఆంధ్ర పత్రిక (దిన,వార) భారతి సాహిత్యమాస పత్రికలను నడిపి ఆంధ్రభాషా సేవ చేసాడు. ఆంధ్ర గ్రంథమాల పేరుతో గ్రంథాలను ప్రచురించాడు. ఆయన దేశభక్తి వదాన్యతలు గొప్పవి.

మల్లంపల్లి సోమశేఖరశర్మ (1891) ఆంధ్రుల చరిత్రలోని ఎన్నో ఘట్టాలను తవ్వి బయటికి తీసిన చారిత్రకుడు. పరిశోధకుడు. (ఆంధ్రదేశ చరిత్ర సంగ్రహము, అమరావతి స్తూపం, ఇంగ్లీషులో రెడ్డిరాజుల చరిత్ర ఆయన ప్రసిద్ధ గ్రంథాలు) ఇటువంటి చారిత్రకుల చలువ వల్లనే ఆంధ్రుల చరిత్ర వైభవాలు బయటపడి అందరికీ తెలిసాయి. తెలుగు వ్యక్తిత్వం గర్వం ఏర్పడటానికి దోహదం చేసాయి.

మానవల్లి రామకృష్ణ కవి (1866-1957) ఇంగ్లీషులో ఎం.ఏ చేసాడు. పండితుడు. పరిశోధకుడు. అముద్రిత సంస్కృతాంధ్ర గ్రంథాలను సేకరించి పీఠికలతో ప్రచురించాడు. భరతుని నాట్యశాస్త్రం నన్నెచోడుని కుమార సంభవం వల్లభరాయని క్రీడాభిరామం సింగన సకలనీతి సమ్మతం బద్దెన నీతిశాస్త్ర ముక్తావళి మొదలయిన కావ్యాలను వెలికి తీసి ప్రచురించి ఆంధ్ర సాహిత్యసేవ చేసాడు. మృగావతి, వసంతవిలాసము, పాటలీపుత్రము అనే స్వతంత్ర కావ్యాలు వ్రాసాడు. కళింగసేన నాటకాన్ని వ్రాసాడు.

కట్టమంచి రామలింగారెడ్డి (1882-1951) పాశ్చాత్య దేశాలకు పోయి పాశ్చాత్య విద్యనభ్యసించినా చిన్ననాటి తెలుగు సాహిత్యాభిమానాన్ని విడిచి పెట్టలేదు. 1899 లోనే విద్యార్థిగా వున్నప్పుడే "కవిత్వ తత్త్వ విచారము" అనే విమర్శ వ్యాసాన్ని వ్రాసాడు. అదే తర్వాత విస్తరింపబడి పుస్తక రూపంగా వచ్చి ఆధునిక విమర్శనాధోరణికి ఆద్యమైంది. కట్టమంచి అనౌచిత్య శృంగార వర్ణనలను దుయ్యబట్టాడు. మౌలికతలేని రచనల మీద అసంతృప్తిని నిస్సంకోచంగా ప్రకటించాడు. కవి భావనాశక్తికి ఎక్కువ ప్రాధాన్యానిస్తూ సాహిత్య విమర్శలో "రొమాంటిక్" (కాల్పనిక) విమర్శను ఆరంభించాడు. విద్యార్థిగా వున్నప్పుడే ఆయన వ్రాసిన "ముసలమ్మ మరణం" (1899) ఖండకావ్యం నవ్యకవిత్వానికి వేగుజుక్క అని చెప్పబడ్తున్నది. వెర్రి పోకడలతో కూడిన ప్రబంధధోరణిని మలుపుతిప్పి వస్తునవ్యతతో తెలుగు సాహిత్యంలో నూతనశకానికి ఆహ్వానం పలికింది. కట్టమంచి అనేక తాళపత్ర గ్రంథాలను సేకరించి పండితులను పరిశోధనలకు ప్రోత్సహించాడు.

ఈ యుగంలో అనేక మంది స్త్రీలు విద్యావంతులైనారు. ప్రాచీన కాలంలో గణికలు రాజవంశాల్లోని స్త్రీలకు మాత్రమే విద్య విజ్ఞానార్జనలకవకాశముండేది. వీరేశలింగం వంటి సంస్కర్తల ప్రోత్సాహంతో ఈ యుగంలో స్త్రీ విద్య ప్రబలింది. స్త్రీలు కవయిత్రులుగా నవల నాటక రచయిత్రులుగా పత్రికా సంపాదకురాళ్ళుగా ఎదిగారు. కొటికలపూడి సీతమ్మ వంటి వాళ్ళు వీరేశలింగం అనుయాయినులై బ్రహ్మసమాజ ప్రభావంతో రచనలు చేసారు. సీతమ్మ పంతులుగారి చరిత్రను కావ్యంగా వ్రాసింది. పులుగుర్తి లక్ష్మీనరసమాంబ కాశీభట్ల బ్రహ్మయ్య శిష్యయై "సావిత్రి" అనే పత్రికను

సనాతన ధర్మ ప్రచారం కోసం నడిపింది. బండారు అచ్చమాంబ, వేమూరి శారదాంబ, సీరం సుభద్రాంబ కాంచనవల్లి కనకాంబ మొదలయిన వాళ్ళు ఈ కాలంలో ప్రసిద్ధ కవయిత్రులు.

వీరేశలింగం యుగం సామాజికంగా సాంస్కృతికంగానే కాక సాహిత్యం లోను పునరుజ్జీవనయుగం. సంఘ సంస్కరణలతో ఆంధ్రుల మనఃకవాటాలు తెరుచుకున్నాయి. భావ విప్లవం ఆరంభమైంది. సంస్కృతాంధ్రాలు తెలిసిన పండితులు అవధానాలతో ఆశుకవితలతో ప్రజలను సాహిత్యోన్ముఖులుగా చేసారు. పద్యం మీద కవిత్వం మీద మోజు పుట్టించారు. "బావా ఎప్పుడు వచ్చితీవు......","అదిగో ద్వారక అవిగో ఆలమందలు...."వంటి నిత్య జీవితంలోని భాషకు దగ్గరైన భాషలో పద్యాలు అల్లబడినాయి. ఆ పద్యాలు ప్రజల నాలుకల మీద ప్రతినిత్యం ఆడాయి. ఇంతకుముందు పద్యంలో వున్న "స్టిఫ్‌నెస్" పోయి మెత్తదనం ప్రవేశించింది. దాంతో పద్యం నూతన వస్తువుతో భాషతో పదాలతో భావాలతో నవ్యత్వాన్ని సంపాదించుకుంది.

ఈ యుగంలో నాటక రచనలకు ప్రదర్శనలకు ప్రాచుర్యం వచ్చింది. ప్రతి కవిపండితుడు వీరేశలింగం మొదలుకొని సంస్కృతం నుంచి నాటకా లను అనువదించారు. స్వతంత్ర నాటకాలు రచించారు. తెలుగులో నాటక ప్రక్రియ బాగా వికసించింది. 1860-80 మధ్య ఎక్కువగా సంస్కృతాను వాదానాలు, కొన్ని ఆంగ్లానువాదాలు రచింపబడినాయి. 1881 లో ధార్వాడ నాటకసమాజం వాళ్ళు ఆంధ్రదేశమంతటా సంచరించి నాటకాలు ప్రదర్శిం చారు. అది చూసి తెలుగులోను నాటకాల ప్రదర్శించాలనే ఉత్సాహం రేకెత్తింది. వీరేశలింగం, కొండుభొట్ల సుబ్రహ్మణ్యశాస్త్రి ధర్మవరం నాటకరచనలకు పూనుకున్నారు. తెలుగు నాటకచరిత్రలో 1897-1906 ప్రారంభ యుగం కాగా 1907-1920 వికాసయుగం. ఈ కాలంలో చాల పౌరాణిక చారిత్రక నాటకాలు వ్రాయబడి ప్రదర్శింపబడినాయి. వాటిల్లో చాల నాటకాలు సినిమాలు వచ్చిం తర్వాత సినిమాలకు ప్రేరణనిచ్చాయి. నాయకరాజుల కాలంలో దక్షిణాంధ్రంలో యక్షగానాల పేరుతో సంగీతా భినయాలతో కూడిన నాటక ప్రదర్శనలు జరిగాయి. భాగోతాల పేరుతో వీథినాటకాల ప్రదర్శనలు జరిగాయి. కాని ఈ యుగంలో ఉదాత్త

(క్లాసికల్) నాటకాల రచనలు ప్రదర్శనలు జరిగాయి. నాటకాల ప్రదర్శనలు చాలా జరిగి ప్రజల్లో ఉత్సాహాన్ని నింపి సాహిత్యోన్ముఖులుగా చేసాయి. ఎంతో మంది నటులుగా కీర్తిని పొందారు. ఈ యుగంలోనే వీరేశలింగం హాస్యవ్యంగ్యంతో కూడిన ప్రహసనాలు రచించి సంఘ సంస్కరణ భావాలను ప్రచారం చేసాడు. అంటె నాటకం కేవలం ఆనందం కోసం ధర్మం నీతి బోధ కోసమే కాక సామాజిక సమస్యలను చిత్రించి ప్రజల్లో సామాజిక చైతన్యాన్ని నింపేదిగా మారింది. ఈ నేపథ్యంలోనే ఈ యుగాంతంలో 1892 లో గురజాడ కన్యాశుల్కం సాంఘిక మహోన్నత నాటకం ఆవిర్భవించింది. మొదట ఇది సంస్కృత నాటకంలో వలె నాందీ ప్రస్తావనలతో ప్రదర్శింపబడి తర్వాత మార్చబడింది. మొత్తం మీద ఆ నాటి "క్లాసికల్" నాటకాల ప్రదర్శనలచేత అది ప్రభావితమై సాంఘిక నాటకంగా నూతన ప్రక్రియోన్ముఖంగా మలచ బడింది. తర్వాత కాల్పనిక యుగంలో ఇబ్సెన్, బెర్నార్డ్షాల పాశ్చాత్యనాటకాల ప్రభావంతో నాటికలు ఏకాంకికలు అనేకం వ్రాయబడినాయి.

ఈ యుగంలో పత్రికలు బయలుదేరి భాష సాహిత్యాలకు సేవ చేసాయి. సామాజిక పరివర్తనకు భావవిప్లవానికి దోహదం చేసాయి. కొందరు పరివర్తనను అడ్డుకున్నా భవిష్యత్ దృక్పథం దేశాభ్యుదయం కోరినవాళ్ళు పరివర్తన అవసరాన్ని గుర్తించారు. ఉదా.కు వీరేశలింగం మొదట్లో గ్రాంథికంలో వ్రాసాడు. తర్వాత వ్యావహారిక భాష అవసరాన్ని గుర్తించి ఆ భాషలోనే వ్రాసాడు. ఈ యుగంలో సాహిత్యవిమర్శ స్వతంత్ర ప్రక్రియగా తెలుగులో ఆవిర్భవించింది. గ్రంథపరిష్కరణలు, సాహిత్య విమర్శ వ్యాసాలు గ్రంథాలు కవులచరిత్రలు భాషా సంబంధమైన వ్యాసాలు గ్రంథాలు వచ్చాయి. 'వ్యాసము' ప్రక్రియగా ఆరంభమై వికసించింది. సామాజిక వ్యాసాలు విజ్ఞానశాస్త్ర వ్యాసాలు పత్రికా వ్యాసాలు సాహిత్య విమర్శ వ్యాసాలు - ఆ విధంగా వ్యాస ప్రక్రియ అనేకోన్ముఖంగా నడిచింది. సామాజిక పరివర్తనకు 'వ్యాస' ప్రక్రియ బాగా దోహదం చేసింది.

వీరేశలింగంతో ఆరంభమైన నవలా ప్రక్రియ ఈ యుగంలో చిలకమర్తి, వేంకట పార్వతీశ్వర కవులు, ఖండవిల్లి, కేతవరపు రచనలతో నవల బాగా

వ్యాప్తినందుకుంది.

ఈ యుగంలోనే గురజాడ మాడపాటి సురవరం వంటి రచయితల చేత కథానిక ప్రక్రియ ఆరంభమై ఒక ప్రత్యేక ప్రక్రియగా వికసించింది.

ప్రాచీన కవిత్వంలోని నవ్యత లేని పిల్ల వసుమను చరిత్రల ప్రబంధాలు పచ్చి శృంగారంతో కూడిన స్త్రీ వర్ణనాదులు ప్రాచీనకవితాప్రక్రియ నిరసనకు గురి అయ్యాయి. అర్థంలేని శ్లేషలు యమకాలు నిస్సారమైన ఉక్తి వైచిత్ర్యాలకు కాలం చెల్లిందని ఈనాటి కవులు గుర్తించారు. వీరేశలింగం 'సరస్వతి నారదగాన విలాపం'లో దీన్నే ప్రకటించాడు. ఇంగ్లీషు సాహిత్యంతో పరిచయం మేర్పడడం, బెంగాల్‌లో వీస్తున్న కొత్త భావ పరంపరలు సంఘ సంస్కరణలు ఆంధ్రదేశంలో సామాజిక సాంస్కృతిక సాహిత్య పునరుజ్జీవనానికి ప్రేరణ నిచ్చాయి.

ఈ యుగంలో మహాకావ్య రచన కన్నా ఖండ కావ్య ప్రక్రియ బాగా వ్యాప్తిలోకి వచ్చింది. ప్రక్రియాపరంగా ఆలోచిస్తే దీన్ని ఖండకావ్యయుగంగా చెప్పవచ్చును.

ఈ యుగలతకు పూసిన రెండు లతాంతాలు రాబోయే యుగాలకు నాందిని పలికి ప్రేరణనిచ్చిన మహాకవులు. ఒకరు-గురజాడ అప్పారావు. రెండు - రాయప్రోలు సుబ్బారావు.

గురజాడ అప్పారావు (1865-1915) కాలేజిలో చదివేటప్పుడే ఇంగ్లీషులో కవిత్వం వ్రాసాడు. బెంగాల్ కవి మైకెల్ మధుసూదన దత్తు అంటె అభిమానం తర్వాత రవీంద్రనాథ టాగోర్ అన్నా అభిమానమేర్పడింది. వాళ్ళ చేత ప్రభావితుడయ్యాడు. 1887-96 మధ్య విజయనగరం కళాశాలోపాధ్యాయుడుగా పని చేసాడు. విజయనగరరాజా ఆనంద గజపతికి అంతరంగ మిత్రుడుగా వున్నాడు. ఆ రోజుల్లోనే కన్యాశుల్కం, (1892) కొండుభట్టీయం నాటకాలు వ్రాసాడు. కన్యాశుల్కం నాటకం సామాజిక సమస్యతో చక్కని పాత్ర చిత్రణతో సహజమైన సంభాషణలతో హాస్యరసంతో వెంటనే కాకున్నా తర్వాత చాల ఆదరణ పొందింది. భాషా

విషయకంగా ఈ నాటకం గిడుగు వారి భాషోద్యమానికి అండగా నిలిచింది. గురజాడ కన్యాశుల్కం తెలుగులో మొదటి సామాజిక నాటకం. ఈ కోవలో వరవిక్రయం, కంఠాభరణం వంటి నాటకాలు వచ్చాయి. కాని ఇప్పటికీ దీన్ని మించిన సాంఘికనాటకం రాలేదనే విమర్శకుల అభిప్రాయం. రసధ్వని కన్నా వస్తుధ్వని దీనిలో చాలా వుంది. ఈ నాటకం జీవితమంత గొప్పదని శ్రీ శ్రీ అభినందించాడు. సంస్కృత నాటకాలు విపరీతంగా అనువదింపబడుతున్న కాలంలో సామాజిక సమస్యను చిత్రించే ఈ నాటకం వచ్చి నూతన యుగారంభాన్ని చేసింది.

గురజాడ సంస్కృతాంధ్ర ఆంగ్లభాషా సాహిత్యాలతోపాటు ప్రపంచ చరిత్ర ద్రావిడభాషా పరిణామాలు తెలిసినవాడు. సౌజన్య మూర్తి. సుభద్ర అనే పద్యకావ్యాన్ని ఆరంభించి పాతతోవలో కవిత్వం వ్రాయగలనని చాటాడు. 1910లో నీలగిరి పాటలను మాత్రా ఛందస్సులో ప్రకటించాడు. సమాసాలు లేని తేటతెలుగులో వ్రాసాడు. ఆయన కవితల్లో సామాన్య జనుల్లో వ్యాప్తిలో వున్న కథలను తన అనుభవంలోని వృత్తాంతాలను వస్తువుగా తీసుకోవడం ప్రత్యేకత. ఆయన రచనలు జాతీయభావాలతో సంస్కరణ భావాలతో అభ్యుదయమార్గంలో నడిచాయి.

కవిత్వంలోను గురజాడ నవ్యకవిత్వానికి నాంది పలికినవాడయ్యాడు. నవయుగ వైతాళికుడుగా కీర్తింపబడినాడు. చక్కని వాడుకభాషలో సరళమైన భాషా భావాలతో ముత్యాసరాలను "కొత్త పాతల మేలు కలయిక క్రొమ్మెరుంగులు చిమ్మగా" కూర్చాడు. అతని ముత్యాల సరాలు ఛందం తెలుగు కవితా లోకంలో సంచలనాన్ని రేపింది. అతని ఛందస్సును యువకవులు అనుసరించి నవ్యకవిత్వాన్ని రచించారు. దేశభక్తి, కన్యక, పూర్ణమ, లవణ రాజు కల మొదలయిన కవితల్లో గురజాడ దేశాభిమానం, సంఘసంస్కరణ భావాలు మానవతాభ్యుదయ దృక్పథాలు ప్రకటమయ్యాయి. ఈ కవితలు తెలుగులో కొత్త కవితాయుగాన్ని సృష్టించాయి. "దిద్దుబాటు" కథానికతో గురజాడ కథానిక ప్రక్రియను తెలుగులో ఆరంభించాడు. ఆ తర్వాత యుగంలో కథానిక చక్కనిశిల్పంతో సామాజికావగాహనతో ముందుకు

సాగింది.

గురజాడ లాగానే భావియుగానికి ప్రేరణనిచ్చినవాడు రాయప్రోలు సుబ్బారావు (1892-) అతన్ని గురజాడతోపాటు యుగకర్తగా సి.నారాయణ రెడ్డి, ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి మొదలయినవాళ్ళు అంగీకరించారు. రాయప్రోలు రవీంద్రుని కవిత్వంచేత బాగా ప్రభావితుడయ్యాడు. కొంతకాలం శాంతినికేతనంలో వుండి వచ్చాడు కూడా. రవీంద్రుని కవితా ప్రభావంతో పాటు అతనికి సంస్కృతభాషాభిమానముంది. యువకుడుగా వున్నప్పుడు అవధానాలు ఆశుకవిత్వం మీద మోజు చూపి ఆంగ్ల కవిత్వం చదివి దాని చేత ప్రభావితుడై హెర్మిటు, డోరా అనే ఆంగ్ల ఖండకావ్యాలననుసరిస్తూ తెలుగులో ఖండకావ్యాలు వ్రాసాడు. రాయప్రోలు దేశభక్తి సంఘసంస్కరణ భావాలతో కవిత్వాన్ని వ్రాసాడు". తృణకంకణంలో కవి అమలిన శృంగారం పేరుతో " ప్లాటోనిక్ లవ్" స్త్రీపురుషుల మధ్య కామవాసన లేని స్నేహం స్థాయిగా గలిగిన ప్రేమను వర్ణించాడు. ఈ శారీరకసంపర్కం లేని ప్రేమ తర్వాత భావకవిత్వంలో ప్రధాన వస్తువు అయింది. వీరేశలింగం,కట్టమంచి వంటి మహామహులు క్షీణదశలో వచ్చిన ప్రబంధాల్లోని శృంగారాన్ని విమర్శించారు. ఆ విధంగా ప్రేమ శృంగారతత్త్వంలో నవ్యతను రాయప్రోలు తెచ్చి ఆస్వాదయోగ్యం చేసాడు.

రాయప్రోలు భావాలు పదాలు మృదుమధురంగా వుంటాయి. సంస్కృత పదసమాస ప్రయోగాలు అతనిలో చాలా కన్పిస్తాయి. అతని కవితాగుణాలు భాషభావాలు భావకవులకు ఉపాదేయమయ్యాయి.కథానిక నాటకం కవిత్వంతో గురజాడ నవ్యరీతులను నూతన ప్రమాణాలను సృష్టించాడు. రాయప్రోలు కవిత్వాంతరంగానికి నూతన ప్రమాణాలను చేకూర్చాడు. అట్లా ఇద్దరూ రాబోయే యుగానికి చాల యోగదానం చేసినవాళ్ళయ్యారు.రాబోయే భావకవిత్వానికి బీజాలు ఈ యుగం చివరనే నాటబడినాయి. ఒక నూతనయుగానికి కవాటాలు తెరిచిన మహామహులైన కవులు ఈ యుగంలో జన్మించారు. రాబోయే ఉషస్సుకు అరుణోదయం ఈ యుగం చివరనే కట్టమంచి, గురజాడ, రాయప్రోలులో జరిగింది.

1856 నుంచి 1920 వరకు విస్తరించిన వీరేశలింగం యుగంలో తెలుగు సాహిత్యం స్వల్పకాలిక నిస్తబ్దతతో కూడిన మౌలికత లేని కవిత్వం నుంచి తేరుకొని పాశ్చాత్యభావసంపర్కంతో సామాజికంగా ఆర్థికంగా సాంస్కృతికంగా వ్యాపించిన అంధకారాన్ని చీల్చుకొని కొత్త నీటితో కొత్త విత్తనాలతో కొత్త పుష్పాలతో కొత్త పరిమళాలతో వికసించింది. భారతభూమి-ఆంధ్రభూమి సారమింకా చావలేదని నిరూపించిందీ యుగం.

*　　*　　*

# 11. కృష్ణశాస్త్రి యుగం

భావకవితాయుగం అని అనడం వుంది కాని భావకవిత్వంలో అందరి మనస్సులనేలిన కృష్ణశాస్త్రి పేరుతో ఈ యుగాన్ని పిలవడం సమంజసమని నాకనిపించింది. ఈ యుగంలో "భావకవులు" గా దేవులపల్లి కృష్ణశాస్త్రి, వేదుల సత్యనారాయణ శర్మ, నాయని సుబ్బారావు, నండూరి సుబ్బారావు, కవికొండల, బసవరాజు, అబ్బూరి, బాపిరాజు, దువ్వూరి, తల్లావఝల మొదలయిన వాళ్ళు ప్రసిద్ధమైనారు. వీళ్ళకన్నా పూర్వం వేంకట పార్వతీశ్వర కవులు, పింగళి కాటూరి, కట్టమంచి, ఖండకావ్యాల్లో ప్రాచీనకావ్యమర్యాదలు తొలగి పోయి ఆత్మాశ్రయత స్వానుభూతులు చోటు చేసుకున్నాయి. వస్తు నవ్యతతో వచ్చాయి. గురజాడ రాయప్రోలు కవిత్వం నుంచి భావకవులకు ఛందస్సు వస్తువు భాషాపదజాలం శైలీ విషయంలో నియమిత స్వరూపం నవ్య రూపం లభించింది. వాటి ఆధారంగా భావకవులు వస్తునవ్యతతో ఆత్మానుభూతుల అభివ్యక్తితో తెలుగు సాహిత్యంలో ఒక నూతన యుగాన్ని సృష్టించారు. ఈ కవులందరూ 19 వ శతాబ్దం చివర అంటే 1895-96 ప్రాంతంలో జన్మించిన వాళ్ళు.

1857 లో విశ్వవిద్యాలయాల స్థాపన అనేక కళాశాలల స్థాపనతో యువకులు ఎఫ్.ఏ, బి.ఏ లో ఇంగ్లీషు సాహిత్యాన్ని చదివారు. అప్పుడు వాళ్ళకు కీట్సు,షెల్లీ, వర్డ్స్ వర్తుల కవిత్వం ఆంగ్లసాహిత్యంలో కొత్త పోకడలుగా బోధింపబడింది. భారతీయ యువకులు ఆ ఇంగ్లీషుకవుల "రొమాంటిసిజం" చేత బాగా ప్రభావితులయ్యారు. ఆ కవిత్వం చేత ప్రేరణను పొంది కొత్త

పోకడలతో కవిత్వం వ్రాయాలని తహతహలాడారు. దేశంలో సాగుతున్న పునరుజ్జీవనోద్యమం వాళ్ళను నవ్యోన్ముఖులను చేసింది.

1878 లో వీరేశలింగం రాజమండ్రిలో సాంఘిక సంస్కరణసంస్థను స్థాపించి పత్రికారచనలతో స్త్రీవిద్య స్త్రీపునర్వివాహం బాల్యవివాహ నిర్మూలనం వంటి కార్యక్రమాలకు పూనుకున్నాడు. మూఢాచారాలను అంధవిశ్వాసాలను ఎదిరించాడు. అదే మార్గంలో సాహిత్యం ఆయుధంగా గురజాడ కృషి చేసాడు. గిడుగువారు వ్యావహారికభాషోద్యమాన్ని నడిపి భాషా సంబంధమైన ఛాందసవాదాన్ని ఎదిరించాడు. 1881లో రఘుపతి వేంకటరత్నం నాయుడు బ్రాహ్మసమాజంలో చేరాడు. 1895 లో వీరేశలిగం బ్రాహ్మధర్మ ప్రచారంతో సంఘసంస్కరణ కార్యక్రమాలతో విజృంభించాడు. రాజమండ్రిలో పిఠాపురంలో కాకినాడలో ఉన్నతలక్ష్యదృష్టి గల యువకులకు ఉత్తమ దృక్పథాన్ని చూపడానికి పాఠశాలలు కళాశాలలు బ్రాహ్మసమాజాభిమానులు స్థాపించారు. ఈ యుగంలో సింహత్రయం అని పేరుగాంచిన కృష్ణశాస్త్రి, చలం, చింతాదీక్షితులు మొదలయిన ఎంతోమంది యువరచయితల మీద బ్రాహ్మసమాజ మత ప్రభావం బాగా పనిచేసింది. విద్యావంతులైన యువకుల్లో ఛాందసభావాలను బ్రాహ్మసమాజం తుడి చేసింది. చాలామందిని క్రైస్తవులు కాకుండా నిరోధించింది. స్త్రీలకు సమానత కుల వర్ణవిభేదాన్ని వ్యతిరేకించడం బ్రాహ్మసమాజ ప్రభావం వల్ల వ్యాపించిన భావవిప్లవం. ప్రేమ సమానత భావాలకు ప్రేరణనిచ్చింది. చలం తన రచనల్లో స్త్రీలకు సమానత ప్రేమలను ప్రబోధించాడు. అట్టడుగు వర్గం మీద చాలామంది కవులు రచయితలు కారుణ్యాన్ని చూపారు. వర్ణవిభే దాన్ని వ్యతిరేకించారు.అంటరానితనాన్ని నిరసించారు. 1910 లో జరిగిన సర్వజాతి సహపంక్తి భోజనం దేశంలో దుమారాన్ని లేపింది. పత్రికలు ఈ భావచైతన్యాన్ని ప్రచారం చేసాయి. భావకవుల్లో స్త్రీమీద గౌరవం ప్రేమ కారుణ్యం మానవతాదృష్టి-ఇవన్నీ వీరేశలింగం సంఘసంస్కరణలు, బ్రాహ్మసమాజం ప్రభావంవల్లనే కలిగాయి.

1920 లో గాంధీజీ జాతీయోద్యమంలో ప్రవేశించాడు. హరిజనోద్ధ రణను చేపట్టాడు. దానిచేత భావకవులు ప్రభావితులై దేశాభిమానాన్ని

స్వాతంత్ర్యేచ్ఛను ప్రకటించారు. సంఘసంస్కరణలతో, జాతీయోద్యమ ప్రభావంతో స్త్రీలు గడపలు దాటి ఘోషాలను చింపేసి బయటికి వచ్చి పురుషులతో సమానంగా నడిచారు. దాంతో స్త్రీపురుష సంబంధాలను గురించి చాల చర్చలు జరిగాయి. ఆనాటి కవిత్వంలో స్త్రీ ఒక ప్రేయసిగా స్నేహితురాలుగా కీర్తింపబడింది. ఆనాటి నవలల్లో స్త్రీపురుషసంబంధాలు చర్చల్లోకి వచ్చాయి. అట్లా స్త్రీ జనోద్ధరణ ఆనాటి సాహిత్యం మీద చాలా ప్రభావాన్ని చూపింది. గాంధీజీ జాతీయోద్యమం, హరిజనోద్ధరణ, స్త్రీపురుష ప్రేమలు, గాంధీజీ అధ్యాత్మిక ఔన్నత్య బోధనలు - అవన్నీ 1921లో వచ్చిన ఉన్నవ వారి మాలపల్లిలో చిత్రించబడినాయి. సోవియట్ రష్యా విప్లవమార్గాన్ని గురించి కూడా ఉన్నవ చిత్రించి చివరకు భారతీయ ఆధ్యాత్మికవాదం గొప్పదని ప్రబోధిస్తూ నవలను ముగించాడు. జాషువా తుమ్మల వంటి కవులు గాంధీజీబోధనలతో ప్రభావితమై రచనలు చేసారు.

1850 లో ఆర్థర్ కాటన్ కృష్ణాగోదావరీ నదుల మీద ఆనకట్టలు కట్టడంతో కోస్తా ఆంధ్రప్రాంతం క్షామాల నుంచి విముక్తి పొందింది. వ్యావసాయికంగా అభివృద్ధి చెందింది. అది విద్యాసంస్కృతుల అభివృద్ధికి దోహదం చేసింది. 1857 తర్వాత ఈస్టిండియా కంపెనీ భారత దేశాన్ని విక్టోరియారాణి పాలనలోకి తెచ్చింది. ఆధునిక పరిశ్రమలు వచ్చాయి. రైలు టెలిఫోనులు ప్రవేశించాయి. ఆధునిక విద్య రవణా సౌకర్యాలు వచ్చాయి. పత్రికలు పెరిగాయి.. దాంతో వివిధ ప్రాంతాల ప్రజల మధ్య సాన్నిహిత్యం ఏర్పడింది. భావాల ఆదానప్రదానం జరిగింది. బెంగాల్‌లో వచ్చిన భావచైతన్యం ఆంధ్రులను బాగా ప్రభావితం చేసింది. సామాజికంగానే కాక సాహిత్యంలోను బెంగాలీసాహిత్య ప్రభావంతో ప్రేరణ కల్గింది. బ్రిటిషు వాళ్ళ వలసాధిపత్యాన్ని నిరోధించి పోరాడడం అనే ఉద్దేశంతో ప్రజల్లో జాతీయ భావన దేశప్రేమ అనేయి ఏర్పడ్డాయి. గత జీవితాన్ని తవ్వుకోవడం తమనుతాము పాశ్చాత్యులతో పోల్చుకొని తమ వెనుకబాటు తనాన్ని గుర్తించుకొని అభ్యుదయ సంస్కరణ ఉద్యమాలను చేపట్టడం జరిగింది. ఆధ్యాత్మికవేత్త అయిన వివేకానందుడు జాతి ఉద్ధరణను పేదతనం నిర్మూలనను సేవాభావాన్ని హిందూమతంలోకి తెచ్చాడు.

బందరులో స్థాపించబడిన జాతీయకళాశాల కృష్ణాపత్రిక రెండు సమానంగా ఆనాడు యువకుల్లో జాతీయ భావాలను ఉత్సాహాన్ని పెంపొందించాయి. ఆంధ్రుల వ్యక్తిత్వం వెల్లివిరిసింది. ఈ ఆంధ్రతాముద్రను భావకవుల వేషం భాష భావాల్లో మనం దర్శించవచ్చును. స్వదేశీయ విదేశీయ చరిత్ర సాహిత్యాల అధ్యయనం జరిగింది. దేశ విదేశాల్లో జరిగే ఆవిష్కరణలు అభివృద్ధులు మార్పులను గురించి వార్తా పత్రికల మూలంగా తెలుసుకొని దాంతో యువకులు ఉత్సాహంతో తమ భాషలో భావాల్లో కొత్త దనాన్ని తేవాలనే వ్యగ్రతను పొందారు. అప్పుడు వాళ్ళకు గిడుగువారి భాషా సంస్కరణం వీరేశలింగం సంఘ సంస్కరణలు, బ్రాహ్మసమాజం బోధనలు, గురుజాడ రాయప్రోలు రచనలు, కట్టమంచి కవిత్వతత్త్వవిచారం సాహితీ సమితి ఇవన్నీ ఒకటి తర్వాత ఒకటి ఒకే కాలంలో జరిగి ఆనాటి యువకులకు నూతనసృష్టికి ప్రేరణనిచ్చాయి.

భావ కవితార్భావం, భావ కవితా లక్షణాలు స్వరూపం తెలుసుకోవడానికి ముందుగా యూరోపులో వచ్చిన "రొమాంటిసిజం" ను గురించి తెలుసుకోవడం అవసరం.

18వ శతాబ్దారంభంలో యూరోపులో సామాజికమైన మార్పులు చాలా వచ్చాయి. విజ్ఞాన శాస్త్రం బాగా పురోగమించింది. పరిశ్రమలు అభివృద్ధి చెందాయి. పల్లెటూళ్ళ నుంచి జనం పట్నాలకు వలస ప్రారంభమైంది. భూస్వామ్యవర్గం స్థానంలో పట్నవాసపు బూర్జువాధనికవర్గం పుట్టుక వచ్చింది. విజ్ఞానశాస్త్రం ఆవిష్కరణలతో కొత్త యంత్రాలు పెరిగాయి. ఉత్పత్తి శక్తుల్లో మార్పులు వచ్చాయి. ఉత్పత్తి పెరిగింది. ఆ ఉత్పత్తికి ముడి సరుకులు, మార్కెటులు కావల్సి వచ్చాయి. దాంతో బక్కచిక్కిన రాజకీయ అస్థిరతతో కూడిన దేశాలు యూరోపియనుల వలస దేశాలుగా మారాయి. ఈ పారిశ్రామిక వలస విధానంలో అశాంతిలో దేనికోసమో వెతికే ఆరాటపడే అసంతృప్తి నుంచి యూరోపులో "రొమాంటిసిజం" భావజాలం లేచింది. మనిషికి ప్రకృతికి సమన్వయం కలిగించే పోరాటం నుంచి రొమాంటిసిజం కవిత్వం పుట్టింది. ప్రాచీనకవిత్వంలో మనిషికి దైవానికి మధ్య సంబంధం సృష్టించే ప్రయత్నం జరిగింది. "రొమాంటిసిజం"

కవిత్వంలో మనిషికి ప్రకృతికి మధ్య సామరస్యాన్ని (harmony) కలిగించే ప్రయత్నం జరిగింది.

భూస్వామ్యం నశించి పెట్టుబడిదారీవ్యవస్థ ప్రవేశించింది. రాచరికం నశించి పార్లమెంటరీ విధానంతో కూడిన పాలన వచ్చింది. దాంతో వ్యక్తులకు స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు లభించాయి. సామాన్యునికి పట్టం కట్టబడింది.ఉత్పత్తిశక్తుల వికాసంతో బూర్జువాసంస్కృతిలో మానవుని శక్తిసామర్థ్యాలు, మానవత్వం, స్వేచ్ఛాభావం ప్రస్ఫుటమయ్యాయి. స్వేచ్ఛను వినియోగించుకొని సామాజిక బంధనాల నుంచి విడిపోయి ప్రకృతిలోకి పోవాలనే తపన వర్డ్స్ వర్త్ వంటి కవుల పకృతి కవిత్వంలో కనిపించింది. ప్రజాస్వామ్యం వ్యక్తిస్వేచ్ఛతో పెట్టుబడిదారీ బూర్జువా వ్యవస్థలో స్త్రీలు అంతఃపురాలకు పరిమిత కాకూడదని స్త్రీసమానత ప్రబోధింప బడింది. అందుచేతనే "రోమాంటిసిజం" కవులు స్త్రీప్రేమ ఆరాధనలతో కూడిన కవిత్వం వ్రాసారు.

ఫ్రాన్స్‌లో రూసోవంటి మేధావుల ఆలోచనలు ఫ్రెంచి విప్లవానికి (క్రీ.శ 1789) కారణమయ్యాయి. రూసో (క్రీ.శ. 1712-88) కాల్పనికోద్యమ పితామహుడుగా చెప్పబడుతున్నాడు. రూసో తన 'న్యూ హెలాయిన్' లో ప్రేమతత్త్వాన్ని "సోషల్ కాంట్రాక్టు"తో మానవతావాదాన్ని ప్రబోధించాడు. ప్రజాస్వామిక భావన "కాల్పనికత" ప్రధాన లక్షణంగా భావించి విక్టర్‌హ్యూగో దాన్ని సాహిత్యంలో ప్రవేశపెట్టాడు. 18వ శతాబ్దారంభంలోని ఆంగ్ల కవులు రూసో భావజాలం ఫ్రెంచి విప్లవం చేత ప్రభావితులై రచనలు చేసారు. స్నేహం స్వేచ్ఛ సౌభ్రాతృత్వం ఫ్రెంచి విప్లవానికి నినాదాలయ్యాయి. ఆ నినాదాలే రొమాంటిక్ కవుల తాత్త్వికత అయింది. మనిషి స్వేచ్ఛా జీవిగా పుట్టాడు. కాని మనిషి అంతటా బంధితుడే - Man is born free but is bound evevery where in chains అన్న రూసో మాటలకు సామాజికమైన కట్టుబాట్లు ఆచారాలు సంప్రదాయం వంశపారంపర్యంగా వచ్చే హక్కులు మనిషిని బంధించి వేస్తున్నాయి అని అర్థం. అతని జీవితాన్ని అతడు నిర్ణయించుకునే హక్కు లేకుండా చేస్తున్నాయి. సహేతుకమైన శాస్త్రీయదృక్పథం మానవహక్కులు వ్యక్తిస్వేచ్ఛ మనిషికి కావాలన్నాడు

రూసో. స్వేచ్ఛారహిత సమాజం కవిని నిరాశావాదిగా వేదనకు గురిచేసింది. ఏమీ చేయలేని దిక్కుతోచని పరిస్థితిలో అసంతృప్తి ఏర్పడింది. రూసో భావజాలమే మానవతావాదానికి ప్రజాస్వామ్య హక్కులకు పునాదులు వేసింది.

పాలకులు, మతం కూడా మనిషి స్వేచ్ఛకు గొలుసులను బిగిస్తున్నాయి. ఆ తరుణంలో వలసదేశాలైన ప్రాచీనసంస్కృతి సాహిత్యాలు గల ప్రాచ్యదేశాల నుంచి ప్రాచీనవిజ్ఞానం భావజాలం పాశ్చాత్యదేశాల్లోకి ప్రవహించి భావ విప్లవాన్ని తెచ్చాయి. పారశీ సంస్కృత భాషల్లో వున్న ప్రేమ ప్రకృతిసౌందర్యం స్వేచ్ఛలను చిత్రించే కవిత్వం పాశ్చాత్యుల నాకర్షించాయి. కాళిదాసు ఋతుసంహారం మేఘ సందేశాల్లోని ప్రకృతి సౌందర్య వర్ణనలు బందీగావున్న యక్షుని ప్రేమ విరహం వర్ణనలు అభిజ్ఞాన శాకుంతలంలోని నిసర్గ సౌందర్యంగల శకుంతల వర్ణనలు వాళ్ళనాకర్షించాయి. అదే విధంగా పారశీసాహిత్యంలోని ముక్తక కవితలు, రుబాయీల్లోని మసీదు సంప్రదాయానికి చిహ్నంగా, మదిరాపానం స్వేచ్ఛాస్వాతంత్ర్యాలకు చిహ్నంగా వర్ణించడం, మతం నుంచి స్వేచ్ఛను కోరడం, ప్రేమభావాలు పాశ్చాత్యుల నాకర్షించాయి. పాత జీవితవిధానం సంప్రదాయాల ఉక్కు సంకెళ్ళ నుంచి రొమాంటిక్ కవులు విముక్తినాశించారు. ప్రాచ్య సాహిత్యాల్లోని నూతనమైన భావజాలం వాళ్ళకు నూతనోత్తేజాన్ని ఇచ్చింది. జర్మనీదేశంలోని కవిపండితులు పారశీ సంస్కృత సాహిత్యాలను మొదట మథించిన వాళ్ళు కాబట్టి "రొమాంటిసిజం" రచనలు అక్కడే ప్రారంభమై యూరోపు అంతటా అన్ని భాషా సాహిత్యాల్లోకి వ్యాపించాయి.

ఈ విధంగా యూరోపులో - స్థిరపడుతున్న పెట్టుబడిదారీ వ్యవస్థ ఫ్రెంచివిప్లవం వలసదేశాల భాషా సాహిత్యాలతో పరిచయం కొత్త భావ జాలాన్ని ఇచ్చాయి. వాటి చేత ప్రేరేపితులై ఇంగ్లీషులో బైరన్, కీట్సు, షెల్లి, వర్డ్సువర్తు మొదలయిన కవులు కవిత్వం వ్రాసారు. 1798 లో వర్డ్సు వర్తు కాల్‌రిజ్ కవులు "లిరికల్ బ్యాలడ్స్" ను అచ్చువేయడంతో ఇంగ్లీషులో "రొమాంటిసిజం" కు అంకురార్పణ జరిగింది. 1832 వరకు కొనసాగింది. ష్లెగల్ అనే జర్మన్ కవి 1808లో ఉపన్యసిస్తూ

"రొమాంటిసిజం" అనే పదాన్నీ ఆ తరహా కవిత్వానికి వాడాడు. ఆధునిక కళాచైతన్యం ప్రాచీన "క్లాసికల్" చైతన్యానికి భిన్నమైందని ఆయన అన్నాడు. "రొమాంటిక్" అనే పదం పాతదే. ఆ పదానికి సాహసం, స్వేచ్ఛ, అద్భుతం అని అర్థాలు. మధ్య యుగాల్లో సాహసవీరుల అద్భుత పర్వంతో కూడిన "రొమాన్సు" రచనలు వచ్చాయి. సాహసాద్భుత పర్వాలు స్వేచ్ఛా స్వాతంత్ర్య ప్రవృత్తితో కూడిన ధీరుడైన నాయకుని వీరగాథలు వాటిల్లో వున్నాయి. "క్లాసికల్" కవిత్వంలో కవులు సంయమనంతో నియమాలకు, ఛందస్సు వస్తువు సంప్రదాయం మతం తాత్త్వికతలకు లోబడి వ్రాసారు. 18వ శతాబ్దంలో "రొమాంటిసిజం" కవులు స్వేచ్ఛ ఉన్ముక్తతను కోరారు. సంప్రదాయ విలువలు నియమాలను ఉల్లంఘించి వ్రాసారు. అందుకే "స్వేచ్ఛ సాహసం" అర్థాలను బోధించే "రొమాంటిక్" పదం ఈ కవులకు కళకు సాహిత్యానికి ప్రయోగింపబడింది. 18వ శతాబ్దంలో పాశ్చాత్య దేశాల్లో వచ్చిన రొమాంటిసిజం ప్రధాన లక్షణాలను ఈ విధంగా సమీకరించి చెప్పవచ్చును - ఆత్మాశ్రయత రొమాంటిసిజం ప్రధాన లక్షణం. ఆత్మానుభూతిని కవి వ్యక్తీకరిస్తాడు. సంప్రదాయ శృంఖలాల నుంచి కవి విముక్తిని కోరుతాడు. అందుకే స్వేచ్ఛను కవి ప్రేమిస్తాడు. ఆత్మానుభూతి వ్యక్తీకరణలో భాష భావంలో సౌకుమార్యం కన్పిస్తుంది. రొమాంటిక్ - కాల్పనిక కవి విశ్వసౌందర్యంచేత ఉత్తేజితుడైనాడు. భౌతికాతీత శక్తి మీద ప్రేమ ఆధిభౌతికత మీద కవికి నమ్మకం భక్తి వుంది. దాని వల్ల మార్మికత ప్రవేశించింది. కాల్పనికకవి అసంతృప్తితో బాధపడ్డాడు. సమాజంలోని సంప్రదాయబంధనాలు సాహిత్యసంప్రదాయ బంధనాలు అతనికి బాధకు అసంతృప్తికి కారణాలు. ప్రకృతి, ప్రకృతి సౌందర్యం మీద ప్రేమ. స్వచ్ఛమైన ప్రశాంతమైన ప్రకృతిలోకి పోవాలనే తపన కన్పిస్తుంది. కాల్పనికకవి నిరాడంబరుడు. స్వచ్ఛమైన ప్రశాంత జీవితాన్ని కోరుకుంటాడు. ప్రాణుల మీద మమతానురాగాలు చూపాడు. ఆడంబరపూరితమైన ఫ్యూడల్ వ్యవస్థను కాల్పనిక కవి నిరసించాడు. మానవతావాదం అంటె అభిమానం. శ్రమజీవుల మీద సానుభూతి. ప్రాచీనసంస్కృతి మీద అనురాగం - పాశ్చాత్య కాల్పనిక వాదంలోని ఈ లక్షణాలన్నీ తెలుగు సాహిత్యంలో కాల్పనిక కవుల రచయితల మీద స్పష్టంగా కన్పిస్తున్నాయి.

పాశ్చాత్య దేశాల్లో వచ్చిన "రొమాంటిసిజం"ను కాల్పనికవాదం అని తెలుగులోకి అనువదించుకున్నాం. "రొమాంటిసిజం" ను హిందీలో మొదట "స్వచ్ఛంద వాదం, స్వేచ్ఛావాదం" - అని అనువదించుకొని పిల్చారు. కాని తర్వాత "ఛాయావాద" మనే పేరు స్థిరపడింది. తెలుగులోను "రొమాంటిసిజం" ను "కాల్పనికవాద" మని అనువదించుకున్నాం. కాని కవిత్వానికి "భావకవిత్వ" మనే పేరు స్థిరపడింది. యూరోపులో 18వ శతాబ్దం ఆరంభంలో "రొమాంటిసిజం" రావడానికి ఏ పరిస్థితులున్నాయో అచ్చంగా అటువంటి పరిస్థితులు భారతదేశంలో 20వ శతాబ్దం ఆరంభంలో ఏర్పడినాయి. యూరోపులో పారిశ్రామిక విప్లవం (1748) ఫలితంగా ఫ్రెంచి విప్లవం (1789) ఆదర్శాల ప్రభావంతో కాల్పనికోద్యమం రాగా భారతదేశంలో సాంస్కృతిక పునరుజ్జీవనం, సంఘ సంస్కరణల ఫలితంగా కాల్పనిక వాదం వచ్చింది. మొదట బెంగాల్‌లో పాశ్చాత్యుల జీవనసరళి పాశ్చాత్య విద్య ప్రభావంతో సాంస్కృతిక పునరుజ్జీవనం సంఘ సంస్కరణలు ప్రారంభమయ్యాయి. సాంస్కృతిక పునరుజ్జీవనం ఫలితంగా జాతి జాగృతం కావడం జరిగింది. బెంగాల్ విభజన ఫలితంగా జాతీయ భావన స్వాతంత్ర్యభావాలు మొదట బెంగాల్‌లో ఉద్భవించాయి. దీనంతటి ఫలితంగా బెంగాల్‌లో కాల్పనికోద్యమం మొదట ప్రారంభమైంది. టాగోర్ బంకిం చంద్ర మైకేల్‌మధుసూదనదత్తు మొదలయిన బెంగాల్ కవుల రచయితల సాహిత్యం ప్రభావంతో ఇతర భారతీయ భాషా సాహిత్యాల్లో కాల్పనికోద్యమం ప్రారంభమైంది. ప్రాచీనకాలంలో ఏ దేశంలోనైనా సాహిత్యం కళలు మతం ప్రభావంతో వికసించాయి. "రొమాంటిసిజం" కాలంలో అవి మతప్రభావం నుంచి విముక్తి పొందాయి. అంతేగాక సంప్రదాయ బద్ధమైన వస్తువు ఛందస్సు అలంకారాలు శైలి సమాసాలు భావాల నుంచి "రొమాంటిసిజం" కవిత్వం విముక్తి పొందింది. ప్రేమ ప్రకృతిసౌందర్యం స్వేచ్ఛ స్వాతంత్ర్యాలు వాళ్ళకు వస్తువులయ్యాయి. ఆరాధ్యమయ్యాయి. భారతదేశంలో సాంస్కృతిక పునరుజ్జీవన సమయంలో వచ్చిన సంఘ సంస్కరణలు మతసంస్కరణలు మతమే జీవితమన్న సత్యాన్ని మార్చాయి. పౌరాణిక ఇతివృత్తాలే కాక కవులు వేరే ఇతి వృత్తాలున్నాయని గుర్తించారు. పాశ్చాత్య సాహిత్యాల్లోను గ్రీకురోమను పౌరాణిక కథల పాత్రల ప్రభావం

పోయి ఇతివృత్తంలో నవ్యత ప్రవేశించింది. స్త్రీ అభ్యున్నతి కార్యక్రమాలు బ్రాహ్మసమాజం ఆర్యసమాజం వంటివి సమాజంలో సమానతను స్వేచ్ఛ ప్రేమలను ప్రబోధించాయి. సంస్కరణోద్యమరూపంలో వచ్చిన ఈ మతాలు ప్రాచీన సంకుచిత భావాలను నిరసించాయి. ఈ నూతన మతతత్త్వం కాల్పనిక కవులను రచయితలను బాగా ప్రభావితం చేసింది.

ఇంగ్లండు తన వలసాధిపత్యంలో తన సంస్కృతి సాహిత్యాలను భారతీయుల మీద రుద్దింది. ఉద్యోగాలతో పొట్టపోసుకోవడానికి భారతీయులకు ఇంగ్లీషు విద్య అవసరమైంది. విద్యావిధానం అమలు చేస్తూ భారతదేశంలో విశ్వ విద్యాలయాల్లో కళాశాలల్లో రొమాంటిక్ కవిత్వం బోధింపబడింది. ఆ కారణంగా మొదట బెంగాల్ ఆ తర్వాత భారతదేశమంతటా యువకుల మీద రొమాంటిక్ కవిత్వం తన ప్రభావాన్ని చూపింది. నవ్యత కోసం ఆరాటపడ్తున్న భారతీయ యువకులను ఇంగ్లీషు రొమాంటిక్ కవులు కీట్సు, షెల్లీ, బైరన్ వర్డ్సువర్తు మొదలయిన వాళ్ళ కవిత్వం ఆకర్షించి ప్రేరణ నిచ్చింది.

1828లో రాజారామమోహన రాయలు మొదలయిన వాళ్ళు సంఘ సంస్కరణోద్యమం ఆరంభించారు. బ్రాహ్మసమాజం ఆర్యసమాజాలతో మతసంస్కరణలు సాగాయి. ఈ ఉద్యమాలు సంస్కరణలు భారతదేశమంతటా వ్యాపించాయి. ఆంధ్రదేశంలో కందుకూరి వీరేశలింగం సంఘ సంస్కరణలను, స్త్రీ జనోద్ధరణను, సాహిత్యాభ్యుదయాన్ని చేపట్టాడు. ఇంకోవైపు ఇంగ్లీషు వలసపాలనకు వ్యతిరేకంగా స్వాతంత్ర్యాన్ని కోరుతూ జాతి అణచివేతకు దోపిడీకి పీడనకు వ్యతిరేకంగా విముక్తిని కోరుతూ ప్రజలు ఉద్యమాలకు పోరాటాలకు దిగుతున్నారు. భారత దేశంలో 1857లో జరిగిన ప్రథమ స్వాతంత్ర్యోద్యమం ఐక్యత, సరియైన అవగాహన లేక పోవడం చేత విఫలమై తిరిగి తిలక్ గోఖలే సావర్కార్ల పోరాటంతో సాగి గాంధీజీ నాయకత్వంలో ఏకోన్ముఖమైంది. జాతిభావన దేశభక్తి స్వాతంత్ర్యాభిలాషలు జాగృతమయ్యాయి. భారత స్వాతంత్ర్యోద్యమం మరోవైపు ఆంధ్రోద్యమం తలెత్తింది. ఆంగ్ల విద్యాసంస్కృతులతో సాంస్కృతిక సాహిత్య పునరుజ్జీవనంలో తెలుగు "జాతి" భావం తలెత్తింది. బ్రిటిషు

పాలనలో, నిజాం పాలనలో వున్న తెలుగు వాళ్ళంతా ఏకం కావాలనే కాంక్ష బలంగా తలెత్తింతి. జాతీయోద్యమం ఆంధ్రోద్యమాల ప్రభావంతో దేశభక్తి కవిత్వం భావకవిత్వంలో చోటు చేసుకుంది. 1905లో బెంగాల్ విభజనకు వ్యతిరేకంగా జరిగిన ఆందోళన ప్రభావం ఆంధ్రదేశం మీద కూడా పడింది. బంకించంద్రుని ఆనందమఠం నవలకు తెలుగు అనువాదాలు అనేకం వచ్చాయి. ఆ నవలలోనే వందేమాతరం ఉద్యమానికి శక్తిగా పని చేసిన వందేమాతరం గేయం వుంది. బెంగాల్ విభజన వల్ల పుట్టిన అసంతృప్తి స్వదేశీ ఉద్యమంగా రూపు దిద్దుకుంది. జాతీయవిద్య పట్ల కళల పట్ల ఆసక్తి పెరిగి ఎన్నో జాతీయ విద్యాలయాలు నెలకొన్నాయి. బందరులో ఏర్పడిన జాతీయకళాశాల భావకవిత్వోద్యమానికి కేంద్రంగా పని చేసింది.

సంస్కరణోద్యమంలో స్త్రీలకు సమాజంలో గౌరవం ప్రేమలు ఏర్పడ్డాయి. అందుకే భావకవులు స్త్రీ మీద ఆరాధనతో ప్రేమ కవిత్వాన్ని చెప్పారు. గాంధీజీ పిలుపుతో స్త్రీలు మగాళ్ళతో భుజం భుజం కలిపి ఉద్యమంలో పనిచేసారు. దాంతో స్త్రీపురుష సంబంధాల విషయంలో దృష్టికోణం మారింది. స్త్రీ పురుషుల మధ్య కేవలం "సెక్స్" సంబంధమేకాక ప్రేమ స్నేహాలుంటాయని ఆధునికులు గుర్తించారు. ప్రాచీన కావ్యాల్లోని సంభోగ శృంగారాన్ని కాక ప్రేమ సఖ్యతను ప్రబోధిస్తూ రాయప్రోలు తృణకంకణం వ్రాసాడు. గురజాడ కన్యకలో స్త్రీ మీద కాముకత్వంతో జరిగే అత్యాచారాన్ని ఎదిరించాడు. కన్యాశుల్కంలో కన్యలనమ్మే నీచకార్యాన్ని నిరసించాడు. కామతృష్ణలేని స్వచ్ఛమైన ప్రేమనే తర్వాత భావకవులు తమ కవిత్వంలో వ్యక్తం చేసారు.

పాశ్చాత్య "రొమాంటిక్" కవులు ప్రాచీన పాత్రలతో కథతో దీర్ఘంగా సాగే కావ్య ప్రక్రియను వదిలేసారు. కొత్త ఛందస్సులో కొత్త భావాలు అనుసరించారు. తమ హృదయానుభూతుల వ్యక్తీకరణ చేసారు. ప్రాచీనులది వస్త్వాశ్రయకవిత్వంకాగా వీళ్ళది ఆత్మాశ్రయకవిత్వం. ఇంగ్లీషులో మిల్టన్ వంటి ప్రాచీనకవులు ల్యాటిన్ భాషా సాహిత్యాల ప్రభావంతో కావ్యాలు వ్రాసారు. ఆ కావ్యాల్లో శైలి - రీతిసౌందర్యానికి ప్రాధాన్యం. కాని రాను రాను కవిత్వం సహజరామణీయకతను కోల్పోయి కృత్రిమంగా తయారైంది.

కవిత్వంలో శబ్దవ్యామోహం అలంకారాల చమత్కారం పెరిగి పోయింది. అటువంటి సమయంలో పాశ్చాత్యంకు ప్రాచ్య సాహిత్యాంతో పరిచయమై కొత్త గాలులను మోసుకొచ్చాయి. ప్రేమ ప్రణయం ఆత్మాశ్రయధోరణి మార్మికత్వం వాళ్ళనాకర్షించాయి. కావ్యాలు కాక ముక్తకాలుగా కవిత్వం వ్రాయడం ప్రారంభించారు. భారతీయుల సంస్కృత సాహిత్యంలోని ప్రేమ మానవప్రేమ నిసర్గ ప్రకృతిసౌందర్యం వాళ్ళనాకర్షించాయి. ఒకే విధంగా తెలుగు సాహిత్యంలోని ప్రాచీన కవిత్వం కొత్తదనం లేకుండా పోయిన తరుణంలో ఇంగ్లీషు సాహిత్య ప్రభావం కొత్త పరిమళాలు నింపింది. కావ్యప్రబంధాల ప్రక్రియను విడిచిపెట్టి ఖండకావ్యం, కవితాఖండిక ప్రక్రియలను చేపట్టారు. స్వానుభూతులను వ్యక్తీకరిస్తూ కొత్త ఛందస్సులను కొత్త భాషా సమాసాలను భావాలను ప్రయోగించారు. పింగళికాటూరి సౌందరనందం, పౌలస్త్యహృదయం వంటి ఖండ కావ్యాల్లో కొద్దిగా కథ, పాత్రలున్నాయి. కట్టమంచి ముసలమ్మ మరణం చిన్న కథ కొన్ని పాత్రలున్న ఖండకావ్యం. గురజాడ కూడ చిన్న కథలతో కూడిన కన్యక, పూర్ణమ్మ కవితలను, రాయప్రోలు స్నేహిలతాదేవి లేఖ, తృణకంకణం కష్టకమల వంటి కథనాత్మకమైన స్వల్ప సంఘటనంతో కూడిన ఒకటి రెండు పాత్రలున్న ఖండ కావ్యాలను వ్రాసారు. తర్వాత కృష్ణశాస్త్రి మొదలుకొని భావకవులు స్వానుభూతులకు ఆత్మాశ్రయభావవ్యక్తీకరణకు ప్రాధాన్యమిచ్చి కవితాఖండికలు వ్రాసారు. ప్రేమ మార్మికత ప్రకృతి సౌందర్యం, దేశభక్తి మొదలయిన భావాలు వాళ్ళ కవితల్లో కన్పిస్తాయి. అనుభూతి ఆవేశం ఆనందం సుందరం ఇవి ఈ కవిత్వ లక్షణాలు భావకవిత్వం కాలంలో కథనం పాత్రలు లేని, కేవలం భావాలతో కూడిన కవితాఖండికల సంకలనాలతో కూడిన ఖండకావ్యాలు వచ్చాయి. ఇటువంటి కవిత్వాన్ని వ్రాసిన కవులు - దేవులపల్లి కృష్ణశాస్త్రి, వేదుల సత్యనారాయణ శాస్త్రి, నాయని సుబ్బారావు, నండూరి సుబ్బారావు, అడవి బాపిరాజు, బసవరాజు అప్పారావు, దువ్వూరి రామిరెడ్డి మొదలయిన వాళ్ళు. వాళ్ళది ఆత్మాశ్రయ ధోరణి వాళ్ళ కవిత్వానికి "భావ కవిత్వం" అని నామకరణం జరిగింది. మొదట దాన్ని నవ్యకవిత్వం, అభినవ కవిత్వం అని పిలిచారు. చివరకు "భావ కవిత్వం" అన్న పేరు స్థిరపడింది. ఈ యుగంలోని సాహిత్యోద్యమాన్ని "రొమాంటిసిజం"

పదాన్ని అనువదించుకొని "కాల్పనికోద్యమం" అని అనడం కవులనేమో భావకవులని వాళ్ళ కవిత్వాన్ని "భావ కవిత్వ" మని అనడం వుంది. కవిత్వాన్ని కూడా కాల్పనిక కవిత్వమంటె ఈ గందరగోళంముండేది కాదు. కవిత్వం భావమయంగా వుండి ఆ భావాలు రసస్థాయికి చేరుకోలేకుండా వున్నాయి. కాబట్టి దాన్ని భావ కవిత్వం అనడం సమంజసంగానే వుంది. ప్రాచీన సాహిత్యంలో విభావాను భావాదుల్లేని శతకాల్లోని ముక్తకాలు స్థాయిభావానికి చేర్చి రసానుభవాన్ని కలిగించేవిధంగా వున్నాయి. కాని భావకవిత్వంలోని భావాలు పద చిత్రాలు అనుభూతి వ్యక్తతలు సౌందర్యాత్మకంగా అలరించే విధంగా వున్నాయి. కాని రస స్థాయికి చేర్చే విధంగా లేవు. కాబట్టి విశ్వనాథ వంటి వాళ్ళు ఈ కవిత్వాన్ని భావకవిత్వమనడం సమజంసంగా వుందని అభిప్రాయపడినారు. భావ ప్రధానమైంది - భావ కవిత్వమని నిర్వచనం. "కవి హృదయంలో తటిల్లతలాగా అప్రయత్నంగా మెరిసిపోయిన భావాల అక్షరాకృతి" అని శ్రీ శ్రీ భావకవిత్వాన్ని నిర్వచించాడు. "ఏదో ఒక భావాన్ని ఆధారము చేసుకొని అల్పావకాశంలో పూర్ణంగా రససిద్ధిని చేకూర్చే యత్నం నవ్యులు చేసా"రని భావకవిత్వాన్ని గురించి పంచాగ్నులవారన్నారు. పాత్రలతో ఇతి వృత్తం (ప్లాటు)తో కూడిన రామాయణాది కావ్యనాటకాలు రససిద్ధిని కలిగిస్తాయి. భావ కవిత్వంలో ఆ రస సామగ్రులేవి లేవు. దానిలో కేవలం భావాలున్నాయి. ఆ భావాలు భావానందాన్ని కలిగించవచ్చును. ఆ భావానుభూతులను రసానందంగా భ్రమపడవచ్చును. కాని అవి సంపూర్ణ రససిద్ధిని కలిగించి పాఠకులను ఆవేశితం చేసేయి కావు కాబట్టి తెలుగులో నవ్యకవిత్వానికి భావ కవిత్వమనే పేరు సార్థకంగా వుందని చెప్పవచ్చును.

## భావ కవిత్వ లక్షణాలు

ప్రాచీన కవిత్వం తార్కికబద్ధంకాగా భావకవిత్వం భావనాశక్తితో కూడింది. భావావేశం నుంచి పుట్టింది. కవి భావావేశానికి అనుభూతి ఆలంబనం. ప్రాచీన కావ్యాల్లోలాగా పాత్రలు రసాలంబనంగా భావకవిత్వంలో లేవు. కవి వ్యక్తీకరించిన భావాలతో పాఠకుడు భావతాదాత్మ్యం చెందడం దీనిలో వుంటుంది. పాఠకుడు కవితో సమానమైన అనుభూతి పొంది

భావతాదాత్మ్యంతో ఆనందాన్ని అనుభవిస్తాడు.

భావకవిత్వంలో కవి స్వేచ్ఛతో తనకు నచ్చిన ఆవేశానుభూతులను అభివ్యక్తీకరిస్తాడు. అదే "రొమాంటి సిజం" ముఖ్య లక్షణం. ఆ స్వేచ్ఛకు ప్రతీకగా సంప్రదాయాన్ని ధార్మికతను దాని కట్టుబాట్లను వ్యతిరేకిస్తూ పారశీక కవులు సాదీ, ఉమరు ఖయ్యాం మొదలయిన వాళ్ళు కవిత్వం వ్రాసారు. పర్షియాలో ఇస్లాం మతం వ్యాపించిన తర్వాత ధార్మికమైన కట్టుబాట్లు నియమాలెక్కువయ్యాయి. దాన్ని కొందరు వివేకంతో నిరసించారు. వాళ్ళ కవిత్వంలో మసీదు ధార్మికత కట్టుబాట్లకు ప్రతీక. పానశాల స్వేచ్ఛకు ప్రతీక. తాగడం వ్యక్తి స్వాతంత్ర్యానికి నియమరాహిత్యానికి ప్రతీక అయింది. అందుకే 20వ శతాబ్దంలో "రొమాంటిసిజం" ఆరంభకాలంలోనే పాశ్చాత్య దేశాలను ప్రభావితం చేసిన పారశీ "రొమాంటిసిజం" కవితలైన ఉమరుఖయ్యాం రుబాయీలను పానశాల పేరుతో ఆదిభట్ల నారాయణదాసు. దువ్వూరి రామిరెడ్డి తెలుగులోకి అనువదించారు.

భావకవిత్వంలో వస్తువు ఆరు విధాలుగా వుందని సి. నారాయణ రెడ్డిగారు విశ్లేషించారు. 1. ప్రణయ చిత్రణ. ఇంగ్లీషులో కీట్సు, షెల్లీ మొదలయిన కాల్పనిక కవుల్లో ప్రేమ, విరహభావాలున్నాయి. అది భావకవుల కాదర్శమైనాయి. అంతేగాక భారతీయ వైష్ణవభక్తి గీతాల్లో భగవంతుడు ఆలంబనగా ప్రణయం విరహంతో కూడిన గీతాలున్నాయి. ఆత్మపరమాత్మల మధ్య కలయికను కోరుతూ భక్తులు ఆరాటం వ్యక్తం చేసారు. రవీంద్రనాథ టాగోరు కవిత్వంలో వైష్ణవభక్తి గీతాల్లోని, సూఫీ భక్తుల కవిత్వంలోని మార్మికత చోటు చేసుకుంది. తెలుగు కవులు కూడా ఊహాప్రేయసిని సృష్టించుకొని ప్రేమ విరహాలను వర్ణించారు. బ్రాహ్మ సమాజంలోని ప్రేమతతత్వం కూడా వాళ్ళ మీద పని చేసింది. ఊహా ప్రేయసికి కవులు పేరు కూడా పెట్టుకున్నారు. కృష్ణశాస్త్రి - ఊర్వశి, నాయని - వత్సల బాపిరాజు - శశికళ. ఇది ఇంగ్లీషు రొమాంటిక్ కవుల్లోను కన్పిస్తుంది. సంప్రదాయ వ్యతిరేకతకు చిహ్నంగా భావకవులు దాంపత్య ప్రేమను కాక ప్రేయసీప్రణయాన్ని వర్ణించి వుంటారు. భావకవుల ప్రేమ ప్రణయవర్ణనల్లో ప్రాచీన కావ్యాల్లో వుండే అశ్లీల సంయోగ వర్ణనలు నఖశిఖ

పర్యంత స్త్రీ వర్ణనలుండవు. స్వచ్ఛమైన ప్రేమ మాత్రమే వుంటుంది. సంయోగం కన్నా భావ కవిత్వంలో వియోగం, విషాదభావన ఎక్కువగా చోటు చేసుకుంది. "దుర్భర శోక విషమగీతులేడ్చివైతు, ఎలుంగెత్తి ఏడ్చివైతు" అంటాడు కృష్ణశాస్త్రి. "ఎవ్వరను కుంటిరో నన్ను - ఏననంత శోకభీకర తిమిరలోకైక పతిని" అంటాడు ఇంకొక చోట. భావకవుల విరహ దుఃఖంలో నిరాశ చోటు చేసుకుంది. బాహ్య బంధాలన్నీ తెంచుకొని ఎక్కడికో ఎగిరిపోవాలనే స్వేచ్ఛ మీద ఇచ్ఛ కన్పిస్తుంది. దీన్ని కొందరు పలాయన వాదంగా చెప్పారు. కాని నవ్యతను సృష్టించాలనే కోరిక సంప్రదాయపు సంకెళ్ళ మధ్య ఈ నైరాశ్యం ఏర్పడివుంటుంది.

"ప్రేమ దాహాన నెడద తపించుకొలది
అమృత మొలకింతు స్మిత నయనాంచలముల"

అంటాడు వేదుల. కన్నీటి కెరటాలు, వెన్నెల చీకట్లు, నిట్టూర్పులు, హాలాహలం భావకవుల ప్రణయ కవిత్వంలో కన్పించే పదజాలం.

భావకవులు ప్రేయసిని ఆరాధించారు. వాళ్ళ అంగసౌందర్యాన్ని సంయోగాన్ని కోరలేదు. ఆత్మ సౌందర్యం హృదయ స్నేహం ఆశించారు.

"దైవతమవీవు నీదు ప్రత్యక్షమునకు
గడియ లెంచుచునుందు భక్తుడను నేను"

అంటాడు తల్లావఝల.

2. దేశభక్తి - వీరేశలింగం యుగంలో రాణా ప్రతాపచరిత్ర, శివభారతం కావ్యాలు జాతీయ భావాలతో దేశభక్తిని ప్రబోధించాయి. చిలకమర్తి "భరత ఖండంబు చక్కని పాడియావు" (1906) అన్న పద్యంలో దేశాభిమానం ప్రకటమైంది. బంకించంద్రుని వందేమాతరం గేయం, చంద్రపాల్ ఆంధ్రదేశ పర్యటన ఫలితంగా ఆంధ్రదేశమంతటా జాతీయ వాయువులు వీచాయి. బాల్ పాల్ లాల్‌ల జాతీయోద్యమం ప్రవేశించింది. 1907లో విద్యార్థులు సమ్మెలు చేసారు. వందేమాతరం పాడుతూ జెండాలను పట్టుకొని ఉరేగింపులు సాగించారు. 1912లో మంగిపూడి వేంకట శర్మ "భారత మాత" కవితల్లో భారతభూమి ప్రాచీన ఔన్నత్యాన్ని

గానం చేసాడు. 1915లో గోఖలే మరణించినప్పుడు రాయప్రోలు ఆంగ్ల ప్రభుత్వాన్ని నిరసిస్తూ "అస్తమయము" పద్యాలు వ్రాసాడు. రాయప్రోలు "జన్మ భూమి" పద్యాల్లో జాతీయాభిమానం ప్రదర్శింపబడింది. 1905 లో రవీంద్రుడు జాతీయోద్యమం చేత ప్రభావితుడైనాడు. దేశభక్తితో కవితలు వ్రాసాడు. అతని దేశభక్తి కవితలు తర్వాత కవులకు ఆదర్శమయ్యాయి. రాయప్రోలు "జన్మభూమి" గురజాడ "దేశభక్తి" కవితలు జాతీయగీతాలుగా పాడుకోదగినయి. దేశభక్తి జాతీయతను ప్రబోధిస్తూ దువ్వూరి రామిరెడ్డి నైవేద్యము మాతృమందిరము, ద్రౌపదీ సందేశము మొదలయిన కవితలు వ్రాసాడు.

1920లో గాంధీజీ జాతీయోద్యమంలో ప్రవేశించిందర్వాత "కాల్పనికోద్యమం" నాటి కవులు దేశాభిమానంతో కవితలు పాటలు వ్రాసారు. బసవరాజు అప్పారావు "కొల్లాయి గట్టితేనేమి" గరిమెళ్ళ "మా కొద్దీ తెల్లదొరతనమూ" అనే ఎన్నో పాటలు బాగా ప్రచారంలోకి వచ్చాయి. జాతీయోద్యమం చేతనే కాక, 1910 నుంచి ఆరంభమైన ఆంధ్రోద్యమం చేత ప్రభావితమై ఆనాటి కవులు రచయితలు ఆంధ్రుల చరిత్ర సంస్కృతీ వైభవాన్ని కీర్తిస్తూ చిత్రిస్తూ కవితలు నవలలు రచించారు. రాయప్రోలు "ఆంధ్రావళి", విశ్వనాథ "ఆంధ్రపౌరుషము" తుమ్మల "పరిగపంట, రాష్ట్ర గానము" జాషువా "తెలుగు వెలుగు" పుటపర్తి "పెనుగొండ లక్ష్మి" మొదలయిన ఖండకావ్యాల్లో ఆంధ్రాభిమానాన్ని ప్రబోధించారు. చిలకమర్తి, భోగరాజు, బాపిరాజు, నోరివంటి నవలాకారులు ఆంధ్రుల చరిత్ర నుంచి వివిధ ఘట్టాలను తీసుకొని ఆంధ్రాభిమానాన్ని జాతీయతను ప్రబోధిస్తూ నవలలు వ్రాసారు.

3. ప్రకృతి ప్రేమ - ఇంగ్లీషులో వర్డ్సువర్తు వంటి కాల్పనిక కవుల వలెనే భావకవులు ప్రకృతిని ప్రేమించారు. ఆరాధించారు. ప్రకృతి సౌందర్యాన్ని చూసి పులకించి గానం చేసారు. ప్రాచీన కావ్యాల్లోను రమణీయమైన ప్రకృతి వర్ణనలున్నాయి. కాని అవి ఆలంకారిక భావవైచిత్రితో వున్నాయి. కథాగతిలో ఆ వర్ణనలు ఇమిడి పోయి వున్నాయి. భావకవులు ప్రకృతి సౌందర్యానికి తన్మయులై దానిలోలీనమై పోవాలంటూ కవితలు వ్రాసారు.

కవికొండల "ప్రకృతి వచనము, నెలబాలుడు" కవితలు ప్రకృతి ప్రేమతో నిండి వున్నాయి. వర్డ్స్‌వర్త్, బర్న్ కవుల వలె కవికొండల, బసవరాజు, దువ్వూరి మొదలయిన కవులు పక్రృతి, పల్లెల సౌందర్యాన్ని సరళభావాలతో వర్ణించారు. 1916లో కవికొండల "కుసుమావళి" రచించాడు. బసవరాజు ప్రకృతి దృశ్యాలను నిసర్గ సౌందర్యాన్ని పాటలరూపంగా వ్రాసాడు.

"ఈ మావిపై నుంచి ఈవు కూకూ అంచు
నా మావిపై నుంచి ఆపె కూకూ యంచు
ఏల బాసలు చేతురే"

అని బసవరాజు కోకిల జంట నడుగుతాడు.

"కంటికంతా జలమయమై
మింటి దాకా యేకరాశై
జంట దొరకని మహాప్రళయపుటింటిలో
వట పత్రిక డోలిక నొంటిగా యుయ్యాలలూగితివా-"

అని బసవరాజు కనులకు కట్టేటట్లుగా సముద్రాన్ని వర్ణించి వటపత్రశాయి వర్ణనలో భక్తిప్రేమతత్వాన్ని ప్రబోధించాడు.

"ఆకులోనాకునై పూవులో పూవునై
కొమ్మలో కొమ్మనై నునులేత రెమ్మనై
ఈయడవి దాగిపోనా ఎట్లైన ఇచటనే యాగిపోనా"

అని ప్రకృతి ప్రేమతో ప్రకృతిలో లీనమైపోవాలని కృష్ణశాస్త్రి కాంక్షించాడు. దువ్వూరి గరిక అందాన్ని చూసి పరవశుడై కవిత్వం వ్రాసాడు ---

"దారి కోవల ప్రేవ దనరారు గరిక
యెంత మెత్తందన మెంతటి ప్రోది
యెంత క్రొత్తందన మిగురొత్త నీవు
మురిపాల గుబురువై పెరుగుచున్నావె"

భావకవులకు ప్రకృతి ప్రణయినిగా గోచరించింది. పింగళి కాటూరి, "సంక్రాంతి"లో పల్లా దుర్గయ్య "గంగిరెద్దు"లో దువ్వూరి "వనకుమారి,

కృషీవలుడు" (1919)లో అబ్బూరి "కాపు పాట"లో పల్లెజీవితాన్ని పల్లె సౌందర్యాన్ని చక్కగా వర్ణించారు. నండూరి "ఎంకిపాట"ల్లో నాయికా నాయకులు పల్లెవాళ్ళు. పల్లీయుల ప్రేమ జీవితం ఈ కవితల్లో ప్రతిబింబించింది. నండూరి భాషను కూడా జానపదుల యాసనుపయోగించి వ్రాసాడు.

4. సంఘ సంస్కరణ భావాలు - భావకవులు సంఘసంస్కరణ భావాలను కవితా వస్తువుగా చేసుకొని కవితలు వ్రాసారు. మానవతా వాదం మానవోద్యమం (Humanism) ప్రభావం ఈ కవుల మీద వుంది. విశ్వమానవ ప్రేమ వాళ్ళకు కవితా వస్తువు అయింది. బ్రాహ్మసమాజంలోని సమానత కుల మత వివక్షత లేకపోవడం, వీరేశలింగం సంఘ సంస్కరణోద్యమం గాంధీజీ హరిజనోద్యమం మత సహనం - ఇవన్నీ భావకవుల మీద ప్రభావాన్ని చూపాయి. ఆంగ్ల కాల్పనికకవుల్లో లేని ఈ భావసంపద భారతీయ కాల్పనికోద్యమం నాటి కవితలు నవలలు కథానికల్లో కన్పిస్తాయి. పాశ్చాత్యదేశాల్లో భూస్వామ్యవ్యవస్థ విచ్ఛిన్నమై బూర్జువా సంస్కృతిలో స్త్రీకి సమానత వ్యక్తిత్వం ఏర్పడింది. రూసో వంటి మేధావుల మానవతావాదంతో దాసులకు స్త్రీలకు సమానత సమాన హక్కులుండాలనే భావజాలం వ్యాపించింది. ఆంధ్రదేశంలో వీరేశలింగం స్త్రీ జనోద్ధరణ కోసం చేపట్టిన స్త్రీ పునర్వివాహం, బాల్యవివాహనిర్మూలన స్త్రీవిద్య బ్రాహ్మసమాజంలోని సమానత ప్రేమలచేత భావకవులు ప్రభావితమై స్త్రీని గౌరవాదారణలతో చిత్రించారు. స్త్రీని ప్రేమించారు. స్త్రీకి ప్రేమించే హక్కువుందని చలం స్త్రీవిముక్తిని ప్రబోధిస్తూ నవలలు వ్రాసాడు. కాల్పనికోద్యమం కాలంలో స్త్రీ ప్రేమ నిర్ణయాధికారాలను గురించి చలంతో పాటు బాపిరాజు విశ్వనాథలు కూడా నవలలు రచించారు. వాళ్ళల్లో విశ్వనాథది సంప్రదాయమార్గం.

భావకవులు కులమత వర్ణవ్యత్యాసాలను ఖండించారు. "గుణము లేని వానిదే కులమైతే నేమి" అంటాడు కృష్ణశాస్త్రి. తుమ్మల "ధర్మజ్యోతి, ఆత్మార్పణం"లో ధర్మం ప్రేమ మార్గాలను ప్రబోధించాడు. జాషువా "గబ్బిలము" ఖండ కావ్యంలో అరుంధతీసుతుల దుస్థితికి బాధపడినాడు. గురజాడ తన కవితల్లో స్త్రీ మీద జరిగే అన్యాయాలను ఖండించాడు.

కన్యాశుల్కాన్ని నిరసించాడు. అంటరానితనాన్ని దూషించాడు. రాయప్రోలు స్నేహలతాదేవిలేఖ కవితలో వరకట్నం సమస్యను హృదయవిదారకంగా చిత్రించాడు.

భావకవులు బుద్ధుని బోధనల ప్రభావంతో మానవప్రేమ జీవకారుణ్యాదిభావాలను తీసుకొని కవిత్వం వ్రాసారు. పింగళి కాటూరి "సౌందరనందము"లో కరుణశ్రీ ఖండకావ్యాల్లో ఈ భావాలను దర్శించవచ్చును. కరుణశ్రీ బుద్ధుని జీవకారుణ్యాన్ని కవితా వస్తువుగా తీసుకొని పద్యాలు రచించాడు. ఉన్నవ కాల్పనికోద్యమం కాలంలోనే అడ్డుగు వర్గం వాళ్ళ జీవితాలను అభ్యున్నతిని "మాలపల్లి" నవలల్లో చిత్రించి సమతను కాంక్షించాడు.

5. భక్తి మార్మికతలు - భావకవులు భక్తిభావాలతో కూడిన కవితలు వ్రాసారు. పాశ్చాత్య కాల్పనిక కవుల్లోనూ భక్తి, మార్మికత్వం (Mysticism) చోటు చేసుకున్నాయి. కూపర్, బ్లేకు కవితల్లో మనం వీటిని చూడవచ్చును. విశ్వకవి రవీంద్రుడు వైష్ణవం, సూఫీమతంలో వున్న మార్మికత్వం చేత ప్రభావితుడై "గీతాంజలి" వంటి కవితలు రచించాడు. తెలుగు భావకవులు కూడా మార్మికత చేత ప్రభావితులైనారు. వేంకట పార్వతీశ్వర కవులు "ఏకాంత సేవ" (1922)లో మధురభక్తి వుంది. ఇది రవీంద్రుని గీతాంజలి వంటిదని కృష్ణశాస్త్రి అన్నాడు. కృష్ణశాస్త్రి భక్తుడు. భక్తి కీర్తనలు వ్రాసాడు. అతని "మహతి"లో భగవద్భక్తి వస్తువు. అతని "కృష్ణపక్షము"లోని "పాప నా కాన్క, అన్వేషణము" గేయాల్లో భక్తిభావాలు, ఆత్మ పరమాత్మ కోసం అన్వేషణ వున్నాయి. వైష్ణవంలోని మధురభక్తి ప్రభావంతో భావకవులు ప్రేయసికి తమకు ఒక దివ్య సంబంధాన్ని సృష్టించుకొని సంయోగం కోసం ఆరాటపడ్తూ విరహభావాలను రచించారు. బసవరాజు "గోపికాగీతములు"లో భక్తిమార్మికతలున్నాయి. కరుణశ్రీ "ఉదయశ్రీ"లో చిత్రించిన రాధిక వేదన కూడా ఇటువంటిదే.

భావకవులు భక్తియేకాక తాత్త్వికతతో కూడిన కవితలు వ్రాసారు. దువ్వూరి "పిచ్చిబికారి" తాత్త్వికతతో కూడిన రచన. ఉమరు ఖయ్యాం

"రుబాయీలు" తాత్త్వికత గల కవితలు. అక్కడ పానం చేసే వాడు భక్తునికి ప్రతీక. పానం చేయడం భగవంతుని సేవకు ప్రతీక. అందుకే కవికి పానశాల పవిత్రస్థానం. పానశాల భగవన్మందిరానికి ప్రతీక. సాకీ (తాగించే వ్యక్తి ప్రత్యేకంగా సాకీ స్త్రీ) పరమాత్మ దగ్గరకు చేర్చే మంత్రం. పాన పాత్ర సాధనం. ఇటువంటి ప్రతీక తాత్త్వికతగల ఉమరుఖయ్యాం కవితలను ఆదిభట్ల, దువ్వూరి పానశాల పేరుతో తెనిగించారు. 1968 లో ముద్దుకృష్ణ కూడా ఉమరుఖయ్యాం పేరుతో రుబాయీలను అనువదించాడు. ఇంకా రామచంద్ర అప్పారావు, అమరుక పేరుతో మల్లవరపు విశ్వేశ్వరరావు గేయరూపంలో ఉమరుఖయ్యాం రుబాయీలను అనువదించారు.

6. స్మృతి కవితలు - భావకవులు తమకు ఆప్తులైన వాళ్ల మరణానికి తపిస్తూ దుఃఖిస్తూ తమ ఆత్మవేదనను కవితలుగా రచించారు. వాటిని ఇంగ్లీషులో "ఎలిజీ" (Elegy) అంటారు. తెలుగులో స్మృతిగీతం, స్మృతికావ్యం, శోకగీతం, శోకకావ్య మనాలి. ఇంగ్లీషులో బ్రౌనింగు "లా సేజియస్", టెన్నిసన్ "ఇన్ మెమోరియం" ఆర్నాల్డు "హెయిన్స్ గ్రేవ్", గోల్డ్‌స్మిత్ పిచ్చి కుక్కమీద వ్రాసిన స్మృతికవితలు ప్రసిద్ధమైనవి. బెంగాలీ భాషలో 1902 లో రవీంద్రుడు తన సతీనిర్యాణానికి దుఃఖిస్తూ "స్మరణ్" స్మృతికవిత వ్రాసాడు. వీరేశలింగం యుగంలోనే వావిలాల వాసుదేవశాస్త్రి "మాతృస్వరూప స్మృతి" రచించాడు. భావకవితాయుగంలో బాలాంత్రపువెంకటరావు "విరహగీతము", విశ్వనాథ "వరలక్ష్మీత్రిశతి" సతీస్మృతికావ్యాలు. బసవరాజు "నిర్యాణసుఖము" కూతురు స్మృతితో, నాయని "విషాదమోహనము" కొడుకు స్మృతితో వ్రాసిన ఖండకావ్యాలు. నాయని "మాతృగీతాలు" తల్లి స్మృతితో వ్రాసిన గీతాలు. దువ్వూరి "సోదరీస్మృతి", అబ్బూరి "సోదరస్మృతి" మొదలయినవి ప్రసిద్ధమైనవి.

7. విజాతీయత నిరసనం-భావకవితాయుగంలో కొందరు కవులు రచయితలు ఇంగ్లీషు నాగరికత వ్యామోహాన్ని నిరసించారు. జాతీయత నభిమానిస్తూ విజాతీయతను నిరసిస్తూ రచనలు చేసారు. హిందీలో ఛాయావాదంనాటి కవులు రచయితలు విజాతీయతను నిరసిస్తూ దేశీయ తనభిమానిస్తూ కవితలు నవలలు కథానికలు వ్రాసారు. జాతీయోద్యమం

సాంస్కృతికపునరుజ్జీవనంలో భాగంగా పాలకులైన ఆంగ్లేయుల సంస్కృతి మన సంస్కృతిని పాలించడాన్ని ద్వేషించారు. వీరేశలింగం యుగంలో ఖండవిల్లి రామచంద్రుడు "అగ్రహారం" నవలలో నాయకుడు చిన్ననాడు వివాహమాడిన భార్య వుండగా ఇంగ్లాండుకు పోయి ఇంగ్లీషువనితను భార్యగా తెస్తాడు. నాయకుని మొదటి భార్య సౌశీల్యాన్ని చూసి ఇంగ్లీషువనిత ఇంగ్లాండు వెళ్ళిపోతుంది. భావకవితాయుగంలో విశ్వనాథ ఉన్నవ బాపిరాజు మొదలయిన కవులు రచయితలు విజాతీయికరణను నిరోధించారు. ఉన్నవ విదేశాలకు వెళ్ళివచ్చి ఐర్లండు జాతీయవాదంచేత ప్రభావితుడై భారతదేశం రాగానే గాంధీజీ జాతీయోద్యమాన్ని సాంఘిక ఉద్యమాలను సమర్థించినవాడు. భారతజాతీయతకు చిహ్నంగా ఆయన పిలకజుట్టును వుంచుకున్న జాతీయవాది. మాలపల్లిలో భారతీయ ఆధ్యాత్మికతను ఉన్నతంగా చిత్రించాడు. విశ్వనాథ "వేయిపడగలు" లో పాశ్చాత్య సంస్కృతిని తిరస్కరిస్తూ సంప్రదాయాభిమానాన్ని ప్రకటించాడు. విజాతీయ తిరస్కారం ఈ నవలలో జరిగింది. అదేవిధంగా విశ్వనాథ చెలియలికట్ట, ఏ కవీర నవలల్లోను విజాతీయ సంస్కృతి ప్రభావాన్ని నిరసించాడు.అదేవిధంగా బాపిరాజు "నారాయణరావు" నవలలో శారద పాశ్చాత్యీకరణకు ఆమె తండ్రి విజాతీయ తిరస్కారానికి నారాయణరావు జాతీయతకు ప్రతీకలుగా చిత్రించాడు. భావకవుల కట్టుబొట్టు విజాతీయతను ఎదిరిస్తూ జరిగిందే. కవిత్వంలో కన్నా విజాతీయద్వేషం జాతీయతాభిమానం నవలల్లో వ్యాసాల్లో కథానికల్లో ,నాటకాల్లో ఎక్కువగా కన్పిస్తున్నది. కాల్పనికయుగంలోని ఈ ప్రవృత్తియే నవ్యసంప్రదాయసాహిత్యోదయానికి బాటలు వేసింది.

భావకవులు ఆంగ్లకాల్పనికకవులచేత ప్రభావితమైనా వాళ్ళలో కవితావస్తువు స్వతంత్రంగా దేశీయమై సమకాలిక ప్రభావంతో కన్పిస్తున్నది. భావకవుల శైలి సమాసరహితమై లలిత పదబంధంతో వుంది. శైలీ మాధుర్యం శైలీ సౌకుమార్యం వాళ్ళ ప్రత్యేకత. ప్రాచీన కావ్యప్రబంధాల్లో లేని కొత్త పదబంధాలను సమాసాలను, భావాలను ప్రయోగించారు "నును మబ్బు లేదున్క కొనలపై సోన లే, నెలవంక చిరునవ్వు చలువపాట.." ఇట్లా కొత్త పదాలు భావాలు భావకవిత్వంలో కన్పిస్తాయి."శర్వరీ శీతపవన పక్షముల

మలసి, స్వాదు యమునోర్మి సంగీత ఝురుల గలసి, కౌముదీధౌత శుభ్రదిక్తటుల సోలసి, మురళికామందమంద మాధురుల రుములు." ("కృష్ణశాస్త్రి అన్వేషణము") "తొలిప్రొద్దు తెమ్మెర త్రోవలో పయనమై పరువెత్తు కోయిలపాట" వంటి మృదుపదాలు కొత్త భావవ్యక్తీకరణలు కన్పిస్తాయి. "కరుణార్ద్ర వీక్షణ పరిమళములు, ప్రణయతరంగిణులు, అగమ్యతమస్వినీ గర్భకుహరాలు" మొదలయిన కొత్త సమాసాలు వచ్చాయి." నీలంపు సిగ్గు, దరహాసకౌముది, అశ్రుఝురులు, కొసరు తేనియలు, నెత్తావిగుసగుసలు, పూల వెన్నెలలు, వలపు నివాళి, పాటరెక్కలు, విరహ విపంచి, తెమ్మెరయూర్పు, ముదుసలి నిరాశలు, తుషారకణములు, తుషార తూలికలు, మంచుమంట"-వంటి ఎన్నో కొత్త పదబంధాలు ప్రయోగంలోకి వచ్చాయి.

భావకవులు ఛందస్సులోను నవ్యతను చూపారు. వృత్తాలను సీసాలను గీతాలను ప్రయోగించినా భావానుగుణంగా పాదాలను విరిచారు. మాత్రా ఛందస్సులను గేయాలను వాడుకున్నారు. ప్రాచీన కవుల పద్యగద్యమయమైన చంపూరీతి రాయప్రోలు గురజాడ మొదలయిన వారితోనే అంతరించింది. కృష్ణ పక్షము, ప్రవాసము ఊర్వశి, హృదయేశ్వరి, దీపావళి మొదలయిన పద్యగేయమిశ్రితమైనవి. కిన్నెరసానిపాటలు, యెంకిపాటలు, శశికళ మొదలయినవి కేవలం గేయాలు. శివశంకరశాస్త్రి వేంకటపార్వతీశ్వరులు, పింగళి కాటూరి వృత్తాల్లో సీసాల్లో రచించారు. ఆవిధంగా భావకవులు ప్రాచీన కవులమార్గంలో కాక నవ్యమార్గంలో నడిచారు. వస్తువు, ఛందస్సు, భావాలు, భాషలో నవ్యతను సాధించారు. ప్రాచీన సంప్రదాయమార్గం నుంచి తొలగి పోయి నూతన సంప్రదాయాన్ని సృష్టించారు. ఇంగ్లీషు "రొమాంటిసిజం" ప్రేరణ పనిచేసినా అధికప్రభావం వాళ్ళమీద కనిపించేది దేశీయమైందే. రవీంద్రుని కవిత్వం వ్యక్తిత్వం ప్రభావంవాళ్ళ మీద చాల వుంది. ఇంకా సమకాలిక సంఘసంస్కరణలు మానవతావాదం గాంధీవాదం జాతీయోద్యమం దేశాభిమానం వాళ్ళ కవిత్వాన్ని ప్రభావితం చేసాయి.

ఈ యుగంలోని భావకవులను గురించి పరిశీలిద్దాం- భావకవుల్లో అగ్రేసరుడు దేవులపల్లి కృష్ణశాస్త్రి (1897) కాల్పనికోద్యమానికి మార్గదర్శి రాయప్రోలు అయితే ఆ ఉద్యమంలో శిఖరంగా వెలిసిన వాడు కృష్ణశాస్త్రి.

భావకవులనగానే ఆయన గుర్తుకు వస్తాడు. కట్టులో జుట్టులో నడకలో ఆయన ప్రత్యేకత చూపాడు. చెవుల మీదుగా వేలాడే జుట్టు, నడిమి పాపట, వల్లెవాటుగా వేసుకునే కండువా, పొడుగాటి బెంగాలీ పద్ధతిలో లాల్చీ, మెరిసే కళ్ళజోడు, అత్తరుల పరిమళాలు–ఇవి భావకవి రూపం. ముఖ్యంగా కృష్ణశాస్త్రి జుట్టు కండువాలు అందరికీ అనుకరణీయాలైనాయి. ఆయన పద్యరచన, పద్యపఠనం ఆనాటి భావకవులకు ఆదర్శమైనాయి. భావకవి అనగానే కృష్ణశాస్త్రి స్ఫురించే పరిస్థితి ఏర్పడిందని నారాయణరెడ్డి గార న్నారు. కాబట్టి "కవీనాం కవిః" అయిన భావకవి కృష్ణశాస్త్రి పేరుమీదుగా ఈయుగానికి పేరుపెట్టడం జరిగింది.

శాస్త్రి ఇంగ్లీషు చదువు చదివాడు. రఘుపతి వేంకటరత్నం నాయుడు ప్రభావం ఆయన మీద వుంది. గురజాడవారి కవిత్వం, వీరే శలింగం సంస్కరణలు, గిడుగువారి వ్యావహారిక వాదం, జాతీయభావాలు అతన్ని ఆకర్షించాయి. దేవులపల్లి సోదరులనే పేరుతో ప్రసిద్ధి చెందిన జంటకవుల్లో దేవులపల్లి తమ్మనశాస్త్రి కొడుకు. విద్వత్కవివంశం. ఈ కవులు పిఠాపురం రాజుల ప్రాపును పొందారు. ఉగ్గు పాలతోనే కవితా రుచిని అలవరచుకున్నాడు కృష్ణశాస్త్రి. కాని తండ్రితాతల మార్గంలో కాక నవ్యమా ర్గంలో పయనించాడు. విద్యార్థిదశనుంచే భాష సంఘసంస్కారాలు రావాలని దృఢనిశ్చయంతో వున్నాడు. భవభూతి పెద్దన షెల్లీ రవీంద్రుల గురజాడల కవిత్వం ప్రభావం అతని మీద వుంది. ఈ ప్రభావాలన్నిటితో కృష్ణశాస్త్రి కవిత్వంలో నవ్యతను సృష్టించి సమకాలికులకు ఆదర్శమయ్యాడు. కృష్ణశాస్త్రి శాశ్వత ప్రేమికుడుగా హృదయానుభూతులను కవిత్వంలో వ్యక్తం చేసాడు. అతని మార్గంలోనే ఇతర భావకవులు పయనించారు. "మీరు మనసారగా నేడ్వనీరు నన్ను" అని అన్న విషాదమూర్తి. భక్తుడు. గాయకుడు. భక్తి సంకీర్తన లెన్నో వ్రాసాడు. ఆర్తి అనుతాపం ప్రపత్తి వంటి భక్తిభావాలు అతనిలో గాఢంగా కన్పిస్తాయి. కవిత్వాన్ని చక్కగా పాడి భావకవిత్వానికి ప్రచారాన్ని కలిగించిన కవి. అక్కిరాజు ఉమాకాంతం వంటి పండితులు భావ కవిత్వం లాక్షణికదృష్టితో ఆనందాన్నియ్యలేని కవిత్వమన్నారు. కొందరు భావకవిత్వాన్ని భావకవులను హేళనచేసారు. అయినా ఈ ఉద్యమం

ఆగలేదు. బ్రాహ్మమతం ప్రభావంతో మానవ ప్రేమను పంచాడు. స్వేచ్ఛను కోరాడు. వైష్ణవగీతాల్లోని భక్తి ఆవేదనలు అతని కవితలో కన్పిస్తాయి. కృష్ణపక్షము (1925), ప్రవాసము, ఊర్వశి, కన్నీరు, శ్రావణి, కార్తికి,మహతి అతని కృతులు.

తల్లావజ్ఝల శివశంకరశాస్త్రి (1832) పండితుడు. భావుకుడు. "హృదయేశ్వరి" (1925)కృతిని రచించాడు. 1919 లో సాహితీసమితిని తెనాలిలో స్థాపించాడు.1920లో నవ్యసాహిత్య ప్రచారానికి "సాహితి" అనే పత్రికను నడిపాడు. ఎవరి కవిత్వం బాగున్నా అభిమానంతో నవ్యసాహిత్యానికి ప్రోత్సాహమిచ్చేవాడు. మీమీ అనుభవాల్ని బట్టి రచించండని భావకవుల నాదేశించాడు. అదే ఆయనను నవకవులకు అన్నను చేసింది. ఊరూరా సభలుపెట్టి కవితాపాఠం చేయించి నవ్యకవిత్వానికి ప్రచారం కల్పించాడు. "సాహితీసమితి" నవ్యకవుల కవిత్వానికి మంచి ప్రచారాన్ని కల్గించింది. సాహితీసమితి ఆదర్శంగానే రాజమండ్రిలో సారస్వత సమాజం విశాఖలో కవితాసమితి హైద్రాబాదులో సాధన సమితి ఏర్పడి రాజుల ఆదరణలేని ఆకాలంలో కవిత్వాన్ని ఆదరించాయి.

అబ్బూరి రామకృష్ణారావు (1896) గీతాలు హుందాతనంతో నడుస్తాయి. కొత్తఛందస్సుల ప్రయోగం చేసాడు. దాదాపుగా రాయప్రోలు కాలంలోనే అబ్బూరి నవ్యరీతులను ప్రవేశపెట్టాడు. యువకులనేకులకు కవితాభిరుచి కలిగించి ప్రోత్సహించాడు. పాడటానికి వీలైనయి అతని కవితలు. ఊహాగానము, పూర్వప్రేమ, మల్లికాంబ, నదీసుందరి-అతని కృతులు.

కవికొండల వేంకటరావు (1892) ఆంగ్లకాల్పనిక కవి వర్డ్స్వర్తు వలె ప్రకృతి ప్రేమికుడు. కవిత్వంలో ఆవేశం వుంది. కొత్త ఊహలు చేయగల కవి. నెలబాలుడు, ప్రకృతి చందనము, మాతృదేవసంకీర్తన, జనపదములు అతని కృతులు.

నండూరి సుబ్బారావు (1895) యెంకిపాటలు పల్లెల్లోని అమాయకమైన స్వచ్ఛమైన ప్రణయాన్ని చిత్రించేయి. పల్లీయుల యాసలో రచించే సాహసం

చేసాడు. 1917 లో నండూరి మద్రాసులో చదువుతున్నప్పుడు ట్రాంబండిలో పోతుంటె కూనిరాగంగా "గుండె గొంతుకలోన కొట్లాడుతాది. కూకుండ నీదురా కూసింత సేపు" అని బయటికి వచ్చిన పాట యెంకిపాటలకు నాంది అయింది. 1920 ల్లో యెంకిపాటలు బాగా ప్రచారాన్నందుకున్నాయి. ఈ పాటలను అనుకరించి ఎందరో పాటలు వ్రాసారు కూడా.

నాయని సుబ్బారావు (1899) నిజప్రేమారాధనలను కవిత్వంలో వ్యక్తీకరించి విశ్వజనీనం చేసాడు. సౌభద్రుని ప్రణయయాత్ర, ఫలశ్రుతి, మాతృగీతాలు, విషాద మోహనము, జన్మభూమి మొదలయినయి ఇతని కృతులు. కృష్ణశాస్త్రి ప్రియురాలు ఊర్వశి కాగా ఇతని ప్రియురాలు వత్సల. ఉపనిషత్తులోని ఆత్మపరమాత్మల అనుసంధాన తత్త్వం ఇతని ప్రణయ కవిత్వంలో చోటు చేసుకుంది. ఇతని శైలి సంస్కృతపదభరితంగా వుంటుంది.

ఇంగ్లీషు సాహిత్యంలో "రొమాంటిసిజం" కవుల్లో కీట్సు, షెల్లీ, వర్డ్స్‌వర్తు మొదలయిన కవులు లండను సమీపంలో వున్న లేక్ డిస్ట్రిక్ట్ (జిల్లా) కు చెందిన వాళ్ళు. కాబట్టి వాళ్ళను "లేక్ పోయట్స్" అని పిలవడం వుంది. అదే విధంగా గురజాడ రాయప్రోలు కవిత్వం ప్రేరణగా ఆ తర్వాత తెలుగులో వచ్చిన నవ్యకవిత్వోద్యమాన్ని కాల్పనికోద్యమం అని ఆ సాహిత్యాన్ని కాల్పనిక సాహిత్యమని, తాత్త్వికతను కాల్పనిక వాదం (రొమాంటిసిజం) అని పిలవడం బాగుంటుంది. కాల్పనిక వాద లక్షణాలన్నీ ఆ నాటి కవిత్వం నవలలు కథానికలు విమర్శ నాటకం సంగీతం నాట్యం చిత్రకళ మొదలయిన అనేక ప్రక్రియల్లో కన్పిస్తున్నాయి. కాబట్టి విశాలార్థంలో కాల్పనికవాదం కాల్పనికోద్యమం అనడం బాగుంది. ఇకపోతె కవిత్వంలో కృష్ణశాస్త్రి, వేదుల, నాయని వంటి కవులు ఆత్మాశ్రయత్వాన్ని ఎక్కువగా ఆశ్రయించుకొని చెప్పినదాన్ని భావకవిత్వమని, వాళ్ళను భావకవులని పిలవడం ఉచితంగా వుంటుంది. అప్పుడు కాల్పనికవాదానికి భావకవిత్వానికి సమన్వయం కుదురుతుంది. ఆ రెండింటి మధ్య సాహిత్యకుల్లో విద్యార్థుల్లో వున్న అస్పష్టత దూరమౌతుంది.

వేదుల సత్యనారాయణశాస్త్రి (1900) గురుశుశ్రూష చేసి విద్యాభ్యాసం చేసిన పండితుడు. ఆశుపద్యాలు చెప్పేవాడు. శతావధానాలు చేసేవాడు. ఆంగ్లకవిత్వంతో పరిచయముంది. స్వాతంత్ర్యోద్యమం ప్రభావం, రాయప్రోలు, కృష్ణశాస్త్రిల మీద అభిమానం అతని కవితకు ప్రేరణలు. భాషలో భావంలో దేవులపల్లి ప్రభావం కన్పిస్తుంది. గౌతమి కోకిల, ఆంధ్రాషెల్లీ అని బిరుదాలు. ప్రణయ సుఖం కన్నా విరహవేదన అతనికిష్టమైన కవితా వస్తువు. దీపావళి, ముక్తఝరి అతని కృతులు భావాన్ని మార్మికంగా చెప్పగల కవి. అతని నిర్వేదభరితభావాలు పాఠకుల్లోను దుఃఖాన్ని కలిగిస్తాయి.

బసవరాజు అప్పారావు (1894) గేయాలు సహజ సరళమైన భాష భావాలతో కూడినయి. "నల్లవాడే గొల్లపిల్లవాడే" "కొల్లాయి గట్టితేనేమి" "గుత్తివంకాయ కూరోయి బావా" మొదలయిన గేయాలు పాటల రూపంగా అతిప్రచారాన్నందుకున్నాయి. అతని భార్య రాజ్యలక్ష్మమ్మ కూడా కవిత్వం వ్రాసింది. ఆమెతో పాటు ఈ యుగంలో చావలి బంగారమ్మ, తల్లాప్రగడ విశ్వసుందరమ్మ వంటి కవయిత్రులు భావకవిత్వం వ్రాసారు.

దువ్వూరి రామిరెడ్డి (1895) కర్షక కవి. పల్లె జీవితాన్ని ప్రకృతి సౌందర్యాన్ని కర్షక జీవితాన్ని నిసర్గభావాలతో వర్ణించాడు. "కవికోకిల" అని బిరుదముంది. దేశభక్తితత్పరుడు. తెలుగు నుడికారంతో కూడి అతని కవిత్వం అర్థకాఠిన్యం లేకుండా వుంటుంది. వనకుమారి, కృషీవలుడు (1919) జలదాంగన (1920) గులాబితోట, పానశాల మొదలయినయి అతని కృతులు. మాతృమందిరము అతని దేశభక్తిని చాటే కవిత.

అడవి బాపిరాజు (1895) కవి. నవలా కారుడు. చిత్రలేఖకుడు. పత్రికా సంపాదకుడు అతని ఉపాస్యదేవత ప్రేయసి పేరు శశికళ. తొలకరి, గోధూళి, శశికళ ఆయన కవితాకృతులు. విద్యార్థి దశలోనే నవ్యకవిత్వాన్ని వ్రాసాడు. కూల్డ్రే శిష్యుడై అభినవాంధ్రమనే పత్రికను నడిపాడు. హైద్రాబాదులో మీజాన్ పత్రికా సంపాదకుడుగా కూడా పనిచేసాడు. ఆంధ్రుల చారిత్రక వైభవాన్ని చిత్రిస్తూ బాపిరాజు రాగమాలిక, హిమబిందు, అడవి శాంతిశ్రీ, గోనగన్నారెడ్డి అనే చారిత్రక నవలలు వ్రాసాడు. సామాజికమైన

మార్పులను, సమస్యలను చిత్రిస్తూ నారాయణరావు, తుఫాను కోనంగి మొదలయిన నవలలు వ్రాసాడు. అతని నవలల్లో శైలి కవితామయంగా వుంటుంది.

ఆంధ్రుల చరిత్రలో వివిధ ఘట్టాలను తీసుకొని ఆనాటి సామాజిక చారిత్రక వైభవాన్ని చిత్రిస్తూ నోరి నరసింహశాస్త్రి (1900) నారాయణభట్టు, రుద్రమదేవి, ఎర్రాప్రెగడ, ధూర్జటి నవలలు వ్రాసాడు.

మల్లవరపు విశ్వేశ్వరరావు (1900) మొదట రవీంద్రుని, కృష్ణశాస్త్రి ప్రభావంతో కవితలు వ్రాసాడు. భావకవిగా ప్రసిద్ధి పొందాడు. మధుకీల, కళ్యాణకింకిణి కావ్యాలు రచించాడు. ప్రకృతిని చూచి పులకించి కవితలు వ్రాసాడు.

తుమ్మల సీతారామమూర్తి (1901) దేశభక్తి కవిత్వం వ్రాసాడు. తెనుగు లెంక,చుక్కలు, పరిగపంట, ధర్మజ్యోతి, ఆత్మార్పణం, రాష్ట్రగానము మొదలయినయి అతని కృతులు గాంధీవాది. జాతీయోద్యమ కవిగా ప్రసిద్ధి పొందాడు. తెలుగుభాష, తెలుగు పౌరుషం అతన్ని ఆవేశితున్ని చేస్తాయి. అంటరానితనం దురాచారమని నమ్మినకవి. చుక్కలు లో ప్రకృతి సౌందర్యాన్ని వర్ణించాడు. కవిత్వంలో సంప్రదాయం భావాల్లో ఆధునికత గల కవి. గ్రామీణ జీవనసౌందర్యాన్ని రమ్యంగా వర్ణించాడు. గాంధీజీ ఆత్మకథను తెనిగించాడు.

కట్టమంచి రామలింగారెడ్డి (1880-1951) ముసలమ్మ మరణం (18) ఖండ కావ్యం. నవ్యకవితారంభం దీనితో జరిగిందని విమర్శకులంటారు. "కవిత్వ తత్త్వవిచారము" (18) అనే విమర్శ గ్రంథాన్ని రచించి కట్టమంచి ఆత్మాశ్రయ విమర్శకు ఆద్యుడైనాడు. "రొమాంటిసిజం" విమర్శ అతనితోనే తెలుగులో ఆరంభమైంది. బ్రౌను వీరేశలింగంలతో ఆరంభమైన తెలుగు సాహిత్యవిమర్శ కాల్పనికయుగంలో కట్టమంచిలో కొత్తమలుపును తిరిగి వికసించింది. తెలుగు సాహిత్య విమర్శలో అనుభూతిని ప్రవేశపెట్టినవాడు కట్టమంచి. కవికుల గోత్రాదులుగా సాగకుండా బాహిరజగత్తు నుంచి

విమర్శను ఆంతరజగత్తుకు కట్టమంచి నడిపాడు. కట్టమంచి ఆరంభించిన సాహిత్య విమర్శను, వికసింపజేసినవాళ్ళు రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, పింగళి. రాళ్ళపల్లివారి సాహిత్యోపన్యాసములు, వేమన విమర్శగ్రంథాలు ప్రసిద్ధమైనయి.

కవిసమ్రాట్టు విశ్వనాథ సత్యనారాయణ (1895) ఆంధ్రపౌరుషము, గిరికుమారుని ప్రేమగీతాలు, కిన్నెర సాని పాటలు, వరలక్ష్మి త్రిశతి మొదలయిన ఖండకావ్యాలు వ్రాసాడు. విశ్వనాథ నవలాకారుడిగా మహాకావ్యకవిగా పేరు తెచ్చుకున్నాడు. "రామాయణ కల్ప వృక్షము" అతన్ని మహాకవిగా నిలబెట్టి జ్ఞానపీఠ బహుమతిని తెచ్చి పెట్టింది. ఇంకా మహాకావ్యప్రక్రియ తెలుగులో నిలచివుందని ఆయన నిరూపించాడు. "వేయి పడగలు" సాంఘిక నవల. విశ్వనాథ దీనిలో మారుతున్న విలువలను విమర్శించి సంప్రదాయపు విలువలకున్న శాశ్వతత్వాన్ని చాటాడు. జాతి మనుగడకు అవసరమయ్యే సత్యాలను మరచిపోకూడదని విశ్వనాథ వేయిపడగలు, చెలియలికట్ట, ఏకవీర నవలల్లో ప్రబోధించాడు. కాల్పనికవాదంలో స్వానుభూతులను ఆత్మాశ్రయంగా వస్త్వాశ్రయంగా కవులు వ్యక్తీకరించారు విశ్వనాథలాగానే వస్త్వాశ్రయంగా స్వానుభూతులను చెప్పిన కవి జాషువా కాల్పనిక యుగంలో సమత స్వేచ్ఛలను ప్రబోధించిన మహాకవి గుర్రం జాషువా (1895). అతని కవిత్వం సంప్రదాయబద్ధమైంది. భావాలు నవ్యమైనయి. ధారా శుద్ధిగల సరళ సుందర భావాలు గల కవిత్వం అతనిది. సామాజిక దురాగతాలను నిలదీసి ప్రశ్నించి మాతృదేశ ప్రేమను చాటిన మహాకవి జాషువా. ఖండకావ్య ప్రక్రియలో చక్కని కావ్యాలు వ్రాసాడు. ఫిరదౌసి (1932) గబ్బిలము (1940) బాపూజీ, నేతాజీ, కాందిశీకుడు, ముంతాజమహలు మొదలయినయి అతని కృతులు.

కాల్పనికత (రొమాంటిసిజం)లో గోర్కీ రెండు ధారలను లేదా రెండు శాఖలను గుర్తించాడు - 1. ఉదాసీన కాల్పనిక వాదం 2. క్రియాశీల కాల్పనిక వాదం. ఉదాసీన కాల్పనిక వాదంలో జీవితాన్ని ఆకర్షణీయంగా చిత్రిస్తూ రాజీధోరణిని లేదా నిరాశావాదాన్ని చేపట్టడం కన్పిస్తుంది. క్రియాశీల కాల్పనికవాదం అన్యాయాలను నిరసించి వ్యవస్థను ప్రగతిశీల

దిశగా మార్చడానికి ప్రేరణనిస్తుంది. జాషువా చలం ఉన్నవలను క్రియాశీల కాల్పనికవాదులని చెప్పవచ్చును.

కాల్పనిక యుగంలో కాల్పనికలక్షణాలన్నీ వున్నా కవిత్వం వ్రాయని వాడు గుడిపాటి వెంకటచలం. ఆయన నవలలు కథానికలు నాటికలు వ్రాసాడు. ప్రేమ, వ్యక్తి స్వేచ్ఛ, మానవ ప్రేమ, సమానతలు అతని రచనల్లో ప్రబోధించబడినాయి. అతడు స్త్రీ స్వేచ్ఛను అభ్యున్నతని ఆర్థికాధికారాలను సమర్థిస్తూ నవలలు కథానికలు వ్యాసాలు (మ్యూజింగ్స్) రచించాడు. అరుణ, మైదానం మొదలయిన నవలలు అతని రచనలు. ఉన్నవ, చలం ఇద్దరూ సరళ నిత్యవ్యావహారిక శైలిని ప్రయోగించి భాషా విప్లవాన్ని తెచ్చిన రచయితలు.

ఈ యుగంలో ఇంకా పేర్కొనదగిన కవులు పుట్టపర్తి నారాయణాచార్యులు (1914) కరుణశ్రీ (1912) వానమామలై వరదాచార్యులు. పుట్టపర్తికి సరస్వతీపుత్ర అనే బిరుదముంది. పెనుగొండ లక్ష్మి, శివతాండవము, మేఘదూతము, పండరి భాగవతము, జనప్రియ రామాయణము మొదలయిన రచనలు చేసాడు. కరుణశ్రీ పేరుతో ప్రసిద్ధమైన జంధ్యాల పాపయ్య శాస్త్రి కరుణశ్రీ, ఉదయశ్రీ, విజయశ్రీ మొదలయిన ఖండకావ్యాలు రచించాడు. సరళ సుందరమైన భావాలు ధారాశుద్ధిగల పద్యాలతో కూడింది అతని కవిత్వం. అతని పుష్పవిలాపము కుంతీకుమారి మొదలయిన కవితలు ప్రసిద్ధమైనయి. అతనిది వస్త్వాశ్రయమైన భావకవిత్వం. వానమామలై 12 ఆశ్వాసాలు "పోతన చరిత్రము" కావ్యం వ్రాసాడు. ఆయన "లక్ష్మి" ఖండకావ్యం మానవప్రేమను ప్రబోధిస్తున్నది.

కాల్పనిక యుగంలో నవల కథానిక ప్రక్రియలు తెలుగు సాహిత్యంలో నిలదొక్కుకొని నవ్యమార్గంలో నడిచాయి. 1921లో వచ్చిన ఉన్నవ మాలపల్లితో ఈ యుగారంభం జరిగింది. ఉన్నవ సంస్కరణ వాదంతోపాటు ఆధ్యాత్మికతను ప్రబోధించాడు. తక్కెళ జగ్గని పాత్ర ద్వారా రష్యా విప్లవ మార్గాన్ని చిత్రించాడు. కాని దాన్ని భారతీయులకు సమస్యాపరిష్కారంగా అతడు అంగీకరించలేదు. గాంధీజీ ఆధ్యాత్మిక మార్గాన్నే నవల చివర ఉన్నత

పరిష్కారంగా చూపాడు. ఆధ్యాత్మికత ఆత్మస్వత్వ సాధనతోనే సమాజం సాధింపబడుతుందని ఉన్నవ ధ్వనింపజేసాడు. ఈ యుగంలో విశ్వనాథ బాపిరాజు చలం ముగ్గురు గొప్ప నవలాకారులు. సమకాలిక సామాజిక పరిణామాన్ని స్త్రీ పురుష సంబంధాలను నిరూపిస్తూ వాళ్ళు రచనలు చేసారు. భావకవులు స్త్రీమీది వలపును గానం చేయగా చలం స్త్రీకి కూడా ప్రేమించే హక్కున్నదని ప్రబోధించాడు.

గురజాడ దిద్దుబాటుతో ఆరంభమైన తెలుగు కథానిక కాల్పనిక యుగంలో చింతా దీక్షితులు చలం శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి వేలూరి శివ రామశాస్త్రి చేతుల్లో శక్తిమంతంగా వికసించింది. ఈ యుగంలో అంకాలతో కూడిన దీర్ఘమైన నాటకాలు కాక నాటిక ఏకాంకిక ప్రక్రియలు వికసించాయి. ఏ రాత్రో మొదలై తెల్లవారుజాముదాకా ప్రదర్శింపబడే నాటకాల మీద మోజు క్రమంగా తగ్గింది. కొన్ని గంటలు మాత్రం ప్రదర్శింపబడే నాటిక ఏకాంకికలు ఈ కాలంలో బయలు దేరాయి. వాటిల్లో సామాజిక సమస్యలు చిత్రించబడినాయి. చలం, ముద్దుకృష్ణ, ఆత్రేయ, రాజమన్నారు, పినిశెట్టి - అనిశెట్టి, సుంకర, కొర్రపాటి గంగాధరరావు, డి.వి. నరసరాజు మొదలయిన వాళ్ళు నాటికలు ఏకాంకికలు రచించారు. ఇవి కొన్ని ప్రదర్శింపబడినాయి కూడా ఈ యుగంలో జాతీయోద్యమాన్ని ప్రబోధిస్తూ ప్రజలనుత్తేజ పరుస్తూ గరిమెళ్ళ సత్యనారాయణ, బుచ్చి సుందరరామ శాస్త్రి వంటి వాళ్ళు పాటలు వ్రాసారు.గరిమెళ్ళ 1920 లో చదువుమానేసి స్వదేశోద్యమంలోకి దూకాడు. “మా కొద్దీ తెల్లదొరతనము” “గరిమెళ్ళ పాట ఆ కాలంలో వందేమాతరం గేయమంత ఉత్తేజాన్ని ఆంధ్రదేశంలో కలిగించింది. “కల్లుమానండోయ్”, “దండాలండోయ్ మొముండలేమండోయ్ బాబు, ఉప్పుకును పన్ను పప్పుకును పన్ను” అనే గరిమెళ్ళ పాటలు అందరు పాడేవాళ్ళు. “అంటరాని వారెవరో కాదు మా వెంటరానివారు” అనే పాట సుందరరామశాస్త్రి రచన బహుళ ప్రచారాన్నందుకున్నది.

కృష్ణశాస్త్రి యుగంలో కాల్పనికవాదం ప్రబలంగా వుండి భావకవిత్వమనే పేరుతో ఆత్మాశ్రయకవిత్వం, విశ్వనాథ జాషువాల, తుమ్మల వంటి కవుల వస్త్వాశ్రయకవిత్వం రెండూ వచ్చాయి. నవలలు కథానికలు నాటికలు

ఏకాంకికలు వ్యాసాలు పాటలు మొదలయిన ప్రక్రియలెన్నో సాహిత్యంలో ప్రచారాన్నందుకున్నాయి. ఈ ప్రక్రియలన్నిటిలో వస్తువు, భాష, ఛందస్సు, భావం - అన్నింటిలో నవ్యత సాధింపబడింది. సమకాలిక సమస్యలు పరిష్కారాలు చిత్రింపబడినాయి.

*   *   *

# 12. శ్రీశ్రీ యుగం

1905లో మొదటిసారి రష్యాలో పెట్టుబడిదారీ విధానం మీద కార్మికవర్గం తిరుగుబాటు చేసింది. 1917 లో కార్మికులు విప్లవోద్యమంతో రాచరికాన్ని పడగొట్టి సోషలిస్టు వ్యవస్థకు పునాదులు వేసారు. 1918 లో మొదటి ప్రపంచయుద్ధం తర్వాత యూరోపులోని కళాప్రపంచంలో కొత్త ఉద్యమాలు బయలు దేరాయి. ఫ్రాన్సులో క్యూబిజం, ఇటలీలో ఫ్యూచరిజం, జర్మనీలో ఎక్స్‌ప్రెషనిజం, అమెరికాలో ఇమేజిజం మొదలయిన వాదాలు బయలుదేరి చిత్రకళను కవిత్వాన్ని ప్రభావితం చేసాయి. ఫ్రాన్సులో బయలు దేరిన డాడాయిజం యుద్ధకాలంనాటి అరాజకస్థితికి యువకుల మనస్సులు ఉద్రిక్తమై బయలు దేరిన వాదం. సామాజికమైన ఆదర్శాలను వాళ్ళు నిరసించారు. అది కొంతవరకు నిరాశనుంచి పుట్టిన గమ్యం లేని వాదం. దీన్నుంచే 1924లో సర్రియలిజం ఆవిర్భవించింది. వాళ్ళు సామాజికనియమాలను తెంచివేసి వ్యక్తిస్వేచ్ఛను కోరారు. సమాజంలోని పాతదనాన్ని సమూలంగా పెరికి వేయడమే వాళ్ళ ఉద్దేశ్యం-అభ్యుదయమార్గం. 1930లో ఇంగ్లీషు కవితాప్రపంచంలో ఒక నూతనావేశం ప్రవేశించింది. పై వాదాలన్నిటికి వ్యతిరేకంగా "లెఫ్ట్‌వింగర్స్" వామపక్షీయులు - బయలుదేరారు. ఆడెన్, స్టీఫెన్ స్పెండర్, డే లూయిస్ వంటి కవులు "న్యూసిగ్నేచర్స్" - "కొత్తసంతకాలు"- అనే కవితా సంపుటిని ప్రచురించారు. పెట్టుబడిదారీ విధానంలో కుంగిపోతున్న సమకాలిక మానవుని విముక్తికి ఆర్థిక అసమానతలు తొలగిపోయి వర్గరహిత సమాజం రావడానికి మార్క్సిజం మంచిసాధనమని వాళ్ళు విశ్వసించారు. "న్యూసిగ్నేచర్సు' ' కవితా సంపుటి

కవిత్వంలో అభ్యుదయ భావాలకు బాట చూపింది. కొత్త ఆవిష్కరణలతో పారిశ్రామిక విప్లవంతో వచ్చిన యాంత్రికతను నగరజీవితాన్ని మార్క్సిస్టు దృక్పథంతో సమర్థించారు. సమాజంలోని అసమానతలు మొదటి ప్రపంచ యుద్ధానంతరం ఏర్పడిన నిరాశానిస్పృహలు తొలగిపోవాలని ఆశిస్తూ కవిత్వం వ్రాసారు. ఈ వామపక్షీయుల మరో కవితా సంపుటి "న్యూకంట్రీ". మార్క్స్ఏంజెల్స్‌ల ఆర్థికసిద్ధాంతాలు, ఫ్రాయిడ్ మనస్తత్వసిద్ధాంతాలు వాళ్ళ అభ్యుదయ భావాలకు మూలకందాలయ్యాయి.

భారతదేశంలో 1920లో జాతీ యోద్యమంలో గాంధీజీ ప్రవేశంతో స్వాతంత్ర్యసమరం ఉద్ధృతమైంది. అంతవరకు ప్రాంతీయంగా ఏకోన్ముఖత లేకుండా నడుస్తున్న స్వాతంత్ర్య పోరాటం గాంధీజీ ప్రవేశంతో ఏకలక్ష్యంతో జాతీయరూపంగా ఏకోన్ముఖంగా నడిచింది. కాని గాంధీజీ సహనం అహింసామార్గం దేశస్వాతంత్ర్యాన్ని తేవడానికి జాప్యం చేస్తున్నాయని కొందరు యువకులు హింసామార్గంలో పోరాటం సాగించారు. కాంగ్రెసు పార్టీలోనూ గాంధీజీ అహింసావాదంతో సహమతించనివాళ్ళు అసంతృప్తితో విడిపోయారు. 1926లో కాంగ్రెసు నుంచి వామపక్షీయులు అతివాదులు బయలు దేరారు. కార్మిక కర్షక సంఘాలు ఏర్పడినాయి. అతివాదసంఘాలు బయలు దేరాయి. 1927లో బొంబాయి కార్మికులు మే డే ఉత్సవాన్ని జరుపుకున్నారు. 1928లో భగత్ సింగ్ యువతలో విప్లవోద్యమాన్ని నిర్మించడానికి హిందుస్థాన్ సోషలిస్టు రిపబ్లికన్ ఆర్మీని ఏర్పరిచాడు. అప్పుడే బెంగాల్‌లో రహస్యవిప్లవోద్యమం ఆరంభమైంది. జైలులో భగత్ సింగు మార్క్స్ పుస్తకాలను చదివి యువకులకు కార్మిక వర్గపోరాటంలో పాల్గొనవలసిందిగా విజ్ఞప్తి చేసాడు. కాంగ్రెసు గాంధీజీ నాయకత్వంలో జాతీయోద్యమం ప్రధానప్రవాహం ఒకవైపు సాగుతుండగా మరోవైపు కార్మికులరైతుల యువజనుల గిరిజనుల ఉద్యమాలు సామ్రాజ్య వ్యతిరేకతతో భూస్వామ్యవ్యతిరేకతతో సాగాయి. 1920 లో ప్రారంభమైన ఈ ఉద్యమాలు 1930లో విస్తరించాయి. 1928లో కలకత్తాలో కాంగ్రెసు సమావేశం జరుగుతుండగా వర్కర్స్ అండ్ పెజెంట్స్ పార్టీ సంపూర్ణ స్వాతంత్ర్యం కావాలని తీర్మానాలు చేసింది. 1920 దశకం నుంచే

గిరిజనులు తమ పోడువ్యవసాయం, స్వేచ్ఛలకు ఆంక్షలు అణచివేతలు పెట్టారని తిరుగుబాటులు చేసారు. ఆంధ్రదేశంలో ప్రసిద్ధమైన గిరిజన పోరాటానికి అల్లూరి సీతారామరాజు స్ఫూర్తి నిచ్చాడు. 1930 దశకం నుంచి భారతదేశంలోని వివిధ సంస్థానాల్లో ప్రజలు తమ పరిస్థితులు మెరుగు పడాలని ఉద్యమించారు. భాషాసంస్కృతులు అణచివేతకు విరుద్ధంగా నిజాంరాష్ట్రంలో గ్రంథాలయోద్యమంరూపంగా ఉద్యమం ప్రారంభమై క్రమంగా 1940 దశకంలో నిజాం వ్యతిరేక ఉద్యమంగా పరిణమించింది. నిజాం నిరంకుశ పాలనకు రైతుల పేదల అణచివేతకు శోషణకు విరుద్ధంగా కమ్యూనిస్టులు పోరాటాన్ని నడిపారు. ఈ పోరాటం అనేకమంది కవులకు రచయితలకు రచనాస్ఫూర్తినిచ్చింది. ఇస్తూనేవుంది.

యూరోపులో రెండవ ప్రపంచయుద్ధం తర్వాత 1930 ప్రారంభం నుంచి ఆర్థిక సంక్షోభం ఆరంభమైంది. యూరోప్లో సోషల్ డెమోక్రటిక్ పార్టీలు ఆ తరుణంలో ప్రజలకు, కార్మికులకు పోరాట నాయకత్వం నిర్వహించలేకపోవడంతో జర్మనీ ఇటలీదేశాల్లో హిట్లరుముసోలినీల ఫాసిజం విజయవంతమై అధికారం సాగించింది. దాంతో భారతదేశంలో సుభాష్ చంద్రబోసు వంటివాళ్ళు ఫాసిజంతో చేతులు కలిపి స్వాతంత్ర్యం సంపాదించవచ్చునని కలలు కన్నారు. 1917 లో రష్యాలో వచ్చిన కమ్యూనిస్టు విప్లవం యూరోపులో ఏ సంచలనాన్ని కలిగించలేకపోయింది. కాని ఆఫ్రికా ఆసియాఖండాల్లో ఫాసిజాన్ని నమ్ముకోలేని జనులకు రష్యా ఒక ఆశాకిరణంగా నిలిచింది. తూర్పు యూరోపులోని ప్రజలకు విముక్తిమార్గంగా కనిపించింది. ఆఫ్రికా ఆసియా ఖండాల్లో వలసపాలనలో అణచబడిన ప్రజలకు పేదలకు కార్మికులకు రైతులకు కూలీలకు రష్యావిప్లవం ఉద్యమస్ఫూర్తి నిచ్చింది.

యూరోపులో హిట్లరు ముసోలినీల విజృంభణలో వచ్చిన ఫాసిజం నుంచి సంస్కృతిని రక్షించాలంటూ రోమారోలా, వెల్స్, థామస్ మన్, మాక్సింగోర్కీ వంటి ప్రసిద్ధ రచయితలు 1935 లో ప్యారిస్‌లో ఒక మహాసభ జరిపారు. అదే సమయంలో పై చదువులకని ఇంగ్లండు లోవున్న భారతీయ మేధావులు, రచయితలు సజ్జాద్ జహీద్, ముల్కరాజ్ ఆనంద్, జె.సి.ఘోష్,

ప్రమోద్‌సేన్‌గుప్తా వంటివాళ్ళు ఆ మహాసభలో పాల్గొన్నారు. రాల్ఫ్ ఫాక్స్ సహాయంతో "ఇండియన్ ప్రోగ్రెసివ్ రైటర్సు గ్రూపు"ను ఆరంభించారు. 1935 డిసెంబరులో "ఇండియన్ ప్రోగ్రెసివ్ రైటర్స్ అసోసియేషన్" అలహాబాదు లో ఏర్పడింది. ప్రేమ్‌చంద్, రఘుపతి సహాయ్, ఫిరాక్, నిరాలా, సుమిత్రానందన్‌పంత్ వంటి రచయితల కవుల సంతకాలతో ఒక ప్రణాళిక తయారైంది. 1936లో ఏప్రెల్‌లో లక్నోలో ప్రేమ్‌చంద్ అధ్యక్షతలో అఖిలభారతస్థాయిలో అభ్యుదయ (ప్రోగ్రెసివ్) రచయితల మహాసభ జరిగింది. ఆ తర్వాత లక్నోలో జరిగిన కాంగ్రెసు సమావేశంలో నెహ్రూ అధ్యక్షోపన్యాసంలో సోషలిస్టు పదజాలం నిండివుంది. కాంగ్రెసు విదేశాంగ విధానంలో సామ్రాజ్యవాద వ్యతిరేకత ఫాసిజం వ్యతిరేకతలు కూడా కన్పించాయి. లక్నోలో జరిగిన అభ్యుదయ రచయితల మహాసభకు ఆంధ్రదేశం నుంచి అబ్బూరి రామకృష్ణారావు పాల్గొన్నాడు. విశాఖపట్నం వచ్చింతర్వాత ఆయన శ్రీశ్రీ పురిపండా వంటి యువరచయితలను ఒక్కచోటచేర్చి "ఆంధ్ర వర్ధమాన లేఖక సంఘం" అని పెట్టి ఒక ప్రణాళిక నేర్పరిచాడు. 1933 నాటికే శ్రీశ్రీ భావకవిత్వధోరణిలో కవిత్వం వ్రాస్తున్నాడు. ఇప్పుడు పీడిత ప్రజావిప్లవానికి అనుకూలంగా మహాప్రస్థాన గేయాలు వ్రాయడం ప్రారంభించాడు. 1936లో కాకినాడలో నవ్యసాహిత్యపరిషత్తులో శ్రీశ్రీ తనమహాప్రస్థాన గేయాన్ని చదివి వినిపించాడు.

1943లో జాతీయ అంతర్జాతీయ పరిస్థితుల్లో మార్పులు వచ్చాయి. రెండవ ప్రపంచయుద్ధం సాగుతూ వుంది. ఫాసిజం ఓడిపోయే రోజులు సమీపిస్తున్నాయి. సోవియట్ రష్యా యుద్ధంలో ప్రవేశించడంతో రెండవ ప్రపంచయుద్ధాన్ని ప్రజాయుద్ధంగా కమ్యూనిస్టులు వర్ణించారు. 1942లో భారతదేశంలో క్విట్ ఇండియా పోరాటం సాగింది. కమ్యూనిస్టులు కాంగ్రెసు నుంచి బాహాటంగా విడిపోయారు. 1943లో బొంబాయిలో ఆ పార్టీసభ జరిగి కమ్యూనిస్టు పార్టీ ఒక రాజకీయ శక్తిగా ఏర్పడింది. ఆ తరుణంలోనే ఆంధ్రప్రదేశ్‌లో "అభ్యుదయ రచయితల సంఘం" "ప్రజానాట్యమండలి" ఏర్పడినాయి.

1943 ఫిబ్రవరిలో తాపీ ధర్మారావు అధ్యక్షతలో అభ్యుదయ రచయితల సంఘం (అరసం) ఏర్పడింది. తెనాలిలో మొదట అరసం మహాసభ జరిగింది. దేవుడు, ప్రణయం, కర్మ అనే మూడుమాటలను అస్త్రాలుగా మార్చి ప్రజల ఆలోచనను అడ్డగించి అభివృద్ధిని నిరోధిస్తున్నారని వాటిని అరసం నిర్మూలించాలని తాపీధర్మారావు ఆ సభలో అన్నాడు. భావకవిత్వంలో పౌరాణిక వాసనలు వదలలేదని సర్వతోముఖ సాంఘిక అభివృద్ధి స్వేచ్ఛ స్వాతంత్ర్యం సమానత శాంతి - ఇవి అరసం మార్గాలు. ఆకలి, దరిద్రం, అవిద్య, బానిసత్వం, వర్గభేదాలు పోవాలి. నూతన సామాజికవ్యవస్థ రావాలి. నిస్తబ్దత కార్యశూన్యత హేతు వ్యతిరేకతను నిరోధించారు. సామ్రాజ్యవాదాన్ని, పరపీడనా తత్వాన్ని సామాజిక సంకుచితత్వాన్ని అభ్యుదయనిరోధక శక్తులుగా తిరస్కరించారు. ఆదర్శ ప్రపంచనిర్మాణానికి ప్రజాసంస్కృతి వ్యాప్తి జరగాలని వారి ఆకాంక్ష. అరసం ఆంధ్రదేశంలో నవయుగవైతాళికులైన వీరేశలింగం, గురజాడ, గిడుగుల ఉత్తమ సంప్రదాయాలను ప్రధానలక్ష్యంగా తీసుకుంది. ప్రాచీన ఆధునిక సాహిత్యాల్లోని ఉత్తమ లక్షణాలను గ్రహించింది. ఒక నూతన రచనా సంప్రదాయాన్ని ప్రవేశపెట్టింది. దేశీయమైన ఆయా కళారూపాలను బుర్రకథ, నాటక ప్రదర్శనవంటి రూపాలతో ప్రజానాట్య మండలి అరసం భావాలను ప్రచారం చేసింది. సామాజిక జీవితానికి దూరమైన వస్తువును విడిచిపెట్టి ప్రజాసామాన్యానికి పట్టం కట్టింది. సామాన్యుల సమస్యలు కావ్యవస్తువుగా మారాయి. ప్రగతిశీలమైన దృక్పథం అభ్యుదయ రచయితలకు ప్రధానమైంది. శిథిలమైపోతున్న పాతప్రపంచం స్థానంలో కొత్త ప్రపంచాన్ని నిర్మించడానికి సాహిత్యం కృషి చేయాలని వారి ఆశయం.

1944 లో బెజవాడలో అరసం రెండవ మహాసభ జరిగింది. 1945 డిసెంబరు చివరిరోజు 1946 జనవరి మొదటి రోజుల్లో అరసం మూడవ సభ జరిగింది. ఈ సభకు అధ్యక్షుడు దేవుపల్లి కృష్ణశాస్త్రి. ప్రారంభకుడు శ్రీశ్రీ. ఇదే సమయంలో తెలంగాణాసాయుధపోరాటం నిరంకుశపాలనను వ్యతిరేకిస్తూ ఉద్ధృతంగా సాగుతున్నది. 1943లో అరసం మొదటి సభతోనే భావకవితాయుగం అంతరించి అభ్యుదయయుగం ఆరంభమైందని చెప్పాలి.

1947 జనవరిలో అరసం నాల్గవ మహాసభ జరిగింది. 1948 తర్వాతనే చాలా అభ్యుదయ రచనలు రావడం జరిగింది. శ్రీశ్రీ "మహాప్రస్థానం", ఆరుద్ర "త్వమేవహం", సోమసుందర్ "వజ్రాయుధం", రమణారెడ్డి "అడవి", గంగినేని "ఉదయిని" మొ- కవితాసంపుటులు వెలువడ్డాయి.

జాతీయోద్యమం జరుగుతున్న కాలంలో ఉద్యమంతో సమకాలిక సంక్షోభంతో సంబంధం లేకుండా భావకవులు తమ వ్యథలోనే మునిగిపోయి దాన్నే అనుభూతులుగా వ్యక్తీకరించారని అభ్యుదయవాదులు విమర్శించారు. సాహిత్యంలో స్తబ్దత పోవాలని వారు కోరారు. భావకవిత్వం అర్థంకాని ప్రయోజనం లేని గందరగోళంతో నిండిపోయిందని వాళ్ళన్నారు.

"ఏదియొ అపూర్వ మధుర,రక్తి స్ఫురించుకాని అర్థముకాని, భావగీతమ్ములవి.-" అని "ఆమెకన్నులు" లో కృష్ణశాస్త్రి మాటల్లోనే భావకవిత్వం అంటే యేమిటో చెప్పబడిందని వాళ్ళన్నారు.

"పుడమి తల్లికి పురిటి నొప్పులు,కొత్త సృష్టిని,స్ఫురింపించాయి-" అని "అవతారం"లో శ్రీశ్రీ ఎలుగెత్తి అభ్యుదయ యుగావిర్భావాన్ని చాటాడు. 1930 తర్వాత ప్రపంచంలో వచ్చిన ఆర్థిక సంక్షోభం భారతదేశాన్ని ఆవరించింది. ఆ గడ్డురోజుల్లో యువకులు సమాజాభ్యుదయాన్ని కోరి రచనలు చేయాలని కోరారు. రసానందాన్ని ప్రణయభావాలను లలిత కోమలమైన పదభావజాలాన్ని ఈసడించుకున్నారు. ఛందస్సుల నియమాలను ఉల్లంఘించారు.

అభ్యుదయ పదానికి అభి+ఉదయం=అభ్యుదయం-విశేషమైన ఉదయమని అర్థం. కాని అభ్యుదయ పదానికి విశ్వశ్రేయస్సు, లోక కళ్యాణమనే అర్థాలున్నాయి. శ్రేయస్సు, అభివృద్ధి, ప్రగతి అనే అర్థాల్లోనే ఈ పదం గ్రహించబడింది. ప్రజాభ్యుదయం అంటె-ప్రజలశ్రేయస్సు, సమాజం ప్రగతి-ఇవి ఈ కవుల ఆదర్శం కాబట్టి నవ్యకవులు ఈ పదాన్ని గ్రహించారు. ఇంగ్లీషులో Progressive అనే పదానికి సమానంగా ఈ పదం తీసుకోబడింది.హిందీలో "ప్రగతివాద్" అని ప్రగతి పదాన్ని తీసుకున్నారు. తెలుగులో ప్రాచీన

కావ్యాల్లోని పీఠికల్లో షష్ఠ్యంతాల తర్వాత కథాప్రారంభాన్ని "అభ్యుదయ పరంపరాభివృద్ధిగా మా రచియింపబూనిన.........మహాకావ్యంబునకుం గథా సూత్రంబెట్టిదనిన"- అని ఆరంభించడంవుంది. అభ్యుదయపదం తెలుగులో ప్రయోగంలో వుండి "ప్రగతి" కన్నా తెలుగుభాషలో ఒదిగిపోయివున్న పదం కాబట్టి "అభ్యుదయ" పదం వాడకలోకి వచ్చింది. నవ్యసాహిత్యపరిషత్తు కార్యకలాపాలలో అలసత ప్రవేశించిన తరుణంలో అభ్యుదయ సాహిత్య సమితి పుట్టింది. ప్రాచీన సాహిత్యం మీద భావకవిత్వం విప్లవాన్ని తెచ్చింది. కాని భావకవిత్వం తన సామాజిక బాధ్యతను నెరవేర్చలేక పోయిందని అరసం వాళ్ళంటారు. భావకవిత్వం శాస్త్రీయమైన సహేతుకమైన దృక్పథంతో సమాజాన్ని విశ్లేషించలేదు. సమానత స్వేచ్ఛలను ప్రబోధించలేదు. చైతన్యస్ఫూర్తి భావకవిత్వంలో లేదని భావకవులు భూమిని ప్రజలను విడిచి పెట్టి ఆకాశంలో ఊహాలోకంలో సంచరించారని అభ్యుదయకవులు తమ అసంతృప్తిని ప్రకటించారు.

సాహిత్యంలో శాస్త్రీయమైన హేతువాదాన్ని సమర్థించడం అభివృద్ధికరమైన శక్తులకు చేయూత నియ్యడం, అభివృద్ధి నిరోధకత్వాన్ని అరికట్టాలనడం అభ్యుదయ సాహిత్యం ప్రధాన ధ్యేయం. కులమత కక్షలు జాతివిద్వేషం వర్గ దోపిడీలను ప్రతిఘటించాలంటారు. సామ్రాజ్యవాదుల పరపీడన నశించాలి, సామాజిక సంకుచితత్వాన్ని వ్యతిరేకించి ప్రజాసంస్కృతి వ్యాప్తి కోసం పోరాడాలంటారు. అభ్యుదయ సాహిత్యంలో వాస్తవికత-సోషలిస్టు వాస్తవికత చోటుచేసుకుంది. అభ్యుదయ సాహిత్యం జానపద రీతులను కళలను సముద్ధరించాలని నడుం కట్టింది. కవిత్వంలో గేయం, వచనం ప్రవేశించింది. కథానికల్లో నవల్లో మాండలికాల ప్రయోగం జరిగింది.

ప్రాచీనకవిత్వలో చెప్పిన భావాలను అలంకారాలను చెప్పడం వస్తువులో పాత్ర చిత్రణలో కొత్తదనం లేకపోవడం వికారం పుట్టించే శృంగారవర్ణనలు- వీటి మీద నవ్యకవులు ధ్వజమెత్తి భావకవిత్వావిర్భావానికి పూనుకున్నారు. ప్రాచీన సంస్కృతి, సంస్కృతభాష ధనికవర్గ విలాసజీవితాన్ని ప్రతిబింబింపజేసే ప్రబంధకవిత్వాన్ని అభ్యుదయ రచయితలు నిరసించారు.

అభ్యుదయ వాదులు చివరకు భావకవిత్వాన్ని కూడా సామాజికప్రయోజనం లేని కవిత్వంగా భావించి తిరస్కరించారు. వ్యక్తిచైత్యనంతోపాటు సంఘ చైతన్యం వాళ్ళ ధ్యేయం. మనోవికాసాన్ని ఉత్తేజాన్ని కలిగించేది అభ్యుదయ సాహిత్యం. హేతువాదం మానవతావాదనలను అనుసరిస్తూ, పాత సంప్రదాయంలోని కుళ్ళను తొలగించుకుంటూ ముందుకు పోవడం అభ్యుదయ సాహిత్యలక్షణం. సామాజిక ఆర్థిక సమానతలను సాధించడం దీని ధ్యేయం. అభ్యుదయ కవిత్వంలో రాజకీయాల చైతన్యం ప్రవేశించింది. అభ్యుదయసాహిత్యానికి మూలప్రేరణ మార్క్స్ ఏంగేల్సులు ప్రతిపాదించిన రాజకీయార్థిక సిద్ధాంతాలు. వర్గసంఘర్షణ, ఈ సంఘర్షణ ఫలితంగా పాతవ్యవస్థ విధ్వంసం జరిగి వినూత్న సృష్టి జరుగుతుంది. చారిత్రకంగా మానవసమాజం క్రమంగా ఆదిమకమ్యూనిస్టు వ్యవస్థ, బానిసయజమానుల వ్యవస్థ, పెట్టుబడిదారీ వ్యవస్థ, ఒకదాన్ని ఒకటి విధ్వంసం చేసి చివరకు కమ్యూనిస్టు వ్యవస్థ పుడ్తుందని మార్క్స్ అన్నాడు. ఉత్పత్తి శక్తులు పురోగమించడం వల్ల వర్గభేదం విధ్వంసం అవుతుందని కమ్యూనిస్టు వ్యవస్థ వర్గరహితమైందని వాళ్ళు అంటారు. మార్క్సిస్టు సిద్ధాంతం ప్రకారం ప్రాణులు క్రమాభివృద్ధి చెంది పెట్టుబడిదారీవ్యవస్థ నశించి కమ్యూనిస్టు వ్యవస్థ ఏర్పడుతుంది-దీనినంతటిని మార్క్స్ గతితార్కిక భౌతికవాదమని అన్నాడు. అభ్యుదయ రచయితలు గతితార్కిక భౌతికవాదం దృష్టితో మానవ జాతిని సమాజాన్ని చరిత్రను పరశీలించి అభ్యుదయ భావాలను ప్రబోధించారు. శ్రీశ్రీ రచించిన "దేశచరిత్రలు"గతితార్కిక భౌతికవాదాన్ని చక్కగా వ్యాఖ్యానిస్తూ వ్రాసిన గేయం. కార్మికుల శ్రమశక్తిని పెట్టుబడిదారీ వ్యవస్థ దోచుకుంటుంది. ఏ రకమైన దోపిడినైనా అభ్యుదయవాదులు ఎదిరిస్తారు. ఉత్పత్తి సాధనాలు వశం చేసుకున్న వాళ్ళు, శ్రమశక్తితో ఉత్పత్తిని చేస్తూ ఆ శ్రమఫలితాన్ని యజమానుల పాలు చేసి దోపిడీకి గురయి కష్టపడే వాళ్ళు- రెండు వర్గాలు అని మార్క్సిస్టులు విభజించారు. దోపిడీకి గురయిన శ్రామిక కార్మిక వర్గంలో చైతన్యం తేవడమే అభ్యుదయవాదుల ధ్యేయం. అందుకే శ్రీశ్రీ - "నాలో కదిలే నవ్య కవత్వం, కార్మికలోకపు కల్యాణానికి, శ్రామికలోకపు సౌభాగ్యానికి" - అంటాడు.

శ్రీశ్రీ అన్నట్లుగా- "కదిలేది కదిలించేది/మారేది మార్పించేది" నవకవిత ధ్యేయం. 1932 లో భావకవిత్వాన్ని వ్యతిరేకిస్తూ ముద్దుకృష్ణ జ్వాల అనే పత్రికను వెలువరించాడు. దీనిలో "తురాయి" అని ముద్దుకృష్ణ వచన కవిత ప్రచురించాడు. 1933-34 లో శ్రీశ్రీ జయభేరి, మహాప్రస్థానం కవితలను రచించాడు. "మహాప్రస్థానం" కవితతో అభ్యుదయకవితా ప్రస్థానం ప్రారంభమైంది. 1937-38 లో శ్రీశ్రీ "కవితా ఓ కవితా", "దేశచరిత్రలు" మొదలయిన కవితలు వ్రాసి అభ్యుదయ కవిత్వానికి స్వరూపనిర్ణయం చేసాడు. 1930-40 ల మధ్య శ్రీశ్రీ, శిష్టా, నారాయణబాబు, పఠాభి మొదలయిన అతినవ్యకవులు భావకవిత్వం మీద నిరసనను ప్రకటించి తిరుగుబాటు చేసి అతినవ్యకవిత్వాన్ని చేపట్టారు. వాళ్ళ కవిత్వాన్ని దూకుడు రచనలుగా కొందరు విమర్శించారు. ఆ కవిత్వాన్ని మొదట అతినవ్య కవిత్వ, ప్రాహ్లాద కవిత్వం అని పిలిచారు. చివరకు అభ్యుదయం అనే పేరు స్థిరపడింది.ఒకే కాలంలో భారతదేశమంతటా "రొమాంటిసిజం" మీద తిరుగుబాటుతో మార్క్సిజం ప్రభావం రష్యావిప్లవ ప్రభావంతో అభ్యుదయవాదం సాహిత్యంలో ప్రవేశించింది. ఒక్క కవిత్వంలోనే కాక కథానిక నవల విమర్శ నాటకం సినిమా మొదలయిన అన్ని ప్రక్రియల మీద అభ్యుదయవాదం తన ప్రభావాన్ని చూపింది.

1933 ప్రాంతాల్లో ఆరంభమై 1970లో మార్క్సిజం మావోయిజం ప్రభావంతో విప్లవవాదం ఆరంభమయ్యేంత వరకు అభ్యుదయవాదం రాజ్యమేలింది. ఇప్పటికి విప్లవ పంథాను హింసను కోరని అభ్యుదయ వాదులున్నారు. కవిత్వం ఒక భోగవస్తువు కాదని అది రసాస్వాదనకు సంబంధించింది కాదని-ఆ దృక్పథం మీద అభ్యుదయం విప్లవం తెచ్చిందని శ్రీశ్రీ అన్నాడు. సమాజంలో మార్పు వృద్ధి తేచ్చేది అభ్యుదయం అని రాజమన్నారు అన్నాడు. ధనికసమాజం పోవాలనుకోవడమే అభ్యుదయం అని అన్నాడు కృష్ణ శాస్త్రి. అభ్యుదయకవిత్వంలో కవులు చరిత్రను వర్గదృష్టితో ఆలోచించారు. శ్రీశ్రీతన "దేశచరిత్రలు" "మానవుడా" కవితల్లో చారిత్రకభౌతిక వాదాన్ని కవితామయంగా చెప్పాడు-

"ఏ దేశచరిత్ర చూచినా
ఏమున్నది గర్వకారణం
నరజాతి చరిత్ర సమస్తం
పరపీడన పరాయణత్వం"
"నైలునదీ నాగరితలో
సామాన్యుని జీవనమెట్టిది
తాజమహల్ నిర్మాణానికి
రాళ్ళెత్తిన కూలీలెవ్వరు"

అని అడుగుతాడు అభ్యుదయ కవి. చరిత్రలో రాజులు వాళ్ళ విజయాలకే స్థానం. ప్రజాజీవిత చరిత్ర నిజమైన చరిత్ర అని అభ్యుదయవాదుల అభిప్రాయం. ఇంతకాలం పాలకవర్గం తన చరిత్రనే సమాజ చరిత్రగా చెప్తున్నది.సమాజంలో అత్యధిక సంఖ్యలోవున్న పీడితవర్గ చరిత్రను చరిత్రగా పరిగణిస్తున్నది అభ్యుదయవాదం. సామాన్యమానవునికి మంచిరోజులు తెచ్చే మరో ప్రపంచంవైపు-

"పదండి ముందుకు/పదండి తోసుక పోదాం పోదాం పైపైకి" అంటాడు శ్రీశ్రీ. 1917 లో రష్యాలో సోషలిస్టు విప్లవంతో మార్క్సిస్టు సిద్ధాంతాల ప్రభావ సామర్థ్యాలు ప్రకటమయ్యాయి. యూరోపులో 1933 ప్రాంతాల్లో వచ్చిన ఆర్థిక మాంద్యం రష్యాలో లేదని దానికి కారణం సోషలిస్టు వ్యవస్థ అని భావించారు. ఆ వ్యవస్థ అభివృద్ధి అభ్యుదయానికి మార్గంగా పరిగణింపబడింది. శ్రీశ్రీ పేర్కొన్న మరో ప్రపంచం ఈ వ్యవస్థయే. రష్యా రెండవ ప్రపంచయుద్ధంలోకి దిగినపుడు సామ్రాజ్యవాదానికి ఫాసిస్టు శక్తులకు విరుద్ధంగా రష్యా యుద్ధంలోకి దిగింది. ప్రపంచత్రాతగా కీర్తిస్తూ శ్రీశ్రీ "గర్జించు రష్యా' ' కవితను 1941 లో వ్రాసాడు. శ్రమ చేసేవాడికే తిండి. దున్నేవాడికే భూమి. దోపిడి దౌర్జన్యాలకాలం నశించింది. సామాజిక భౌతికసంపదకు మూలం మానవశ్రమ. శ్రమను దోపిడి చేస్తూ శ్రమ ఉత్పత్తిని అనుభవిస్తూ వున్నారు కొందరు. ఆ కొందరి పెత్తనం దౌర్జన్యం సాగదని అభ్యుదయవాదులంటారు.

"సింధూరం రక్తచందనం/బంధూకం సంధ్యారాగం
పులుచంపిన లేడి నెత్తురూ/ఎగరేసిన ఎర్రని జెండా
రుద్రాలిక నయనజ్వాలిక/కలకత్తా కాళిక నాలిక
కావాలోయ్ నవనవనానికి"

అని నవకవనం-అభ్యుదయ కవిత్వం విప్లవధోరణికి ప్రతీకగా చైతన్య స్ఫూర్తిగా శ్రీశ్రీ గుర్తించాడు. రష్యాజెండాలోని ఎరుపు మార్పుకు, అభ్యుదయానికి ప్రతీకగా చెప్పబడింది. "పులు చంపిన లేడి నెత్తురూ" అన్నప్పుడు వస్తుధ్వని అపారంగా రచించాడు శ్రీశ్రీ..

"కదిలేది కదిలించేది/మారేదీ మార్పించేదీ
పాడేదీ పాడించేదీ/పెనునిద్దుర వదిలించేది
మునుముందుకు సాగించేది/పరిపూర్ణపు బ్రతుకిచ్చేదీ.
కావాలోయ్ నవకవనానికి"

అంటాడు శ్రీశ్రీ. ప్రపంచం నిరంతరం చలనరూపంగా వుండి మంచి వైపు సాగుతుందని మార్క్సు అంటాడు. "భిక్షువర్షీయసి" కవితలో శ్రీశ్రీ పేదతనం వికటరూపాన్ని వర్ణించాడు. ఆకలి దోపిడి దౌర్జన్యం సమాజంలో నశించి మంచిరోజులు రావాలని అభ్యుదయ కవుల ఆశయం. మార్పును విప్లవాన్ని రథచక్రాలుగా చిత్రిస్తూ శ్రీశ్రీ- "పతితులార భ్రష్టులార/బాధాసర్పదష్టులార దగాపడిన తమ్ములార/ఏడవకండేడవకండి వచ్చేశాయ్ వచ్చేశాయ్/జగన్నాథ జగన్నాథ జగన్నాథ రథచక్రాల్/ఈ లోకం మీదేనండి మీ రాజ్య మీరేలండి" అని సామాన్యుని లోకంగా చాటి చెప్పాడు. "పుడమి తల్లికి పురిటి నొప్పులు... మరోప్రపంచం పుదుతూవుంది, అదిగో కనపడలేదా, మరోప్రపంచపు అగ్నికిరీటపు ధగధగలు" అని యువకుల్లో శ్రీశ్రీ నూతనోత్సాహాన్ని నింపాడు. మానవసమాజానికి యువకవులకు అతినవ్య కవులకు నూతన లక్ష్యాలను నూతన లక్షణాలను నిర్దేశించాడు.

శ్రీశ్రీ (1910) శ్రీనాథ పెద్దనాదుల కవిత్వాన్ని ఒంటబట్టించుకు న్నాడు. ప్రాచీనకవిత్వ లక్షణసారాన్ని తెలిసినవాడు. వేంకటపార్వతీశ్వరుల ప్రభావంతో అపరాధ పరిశోధక నవలలు వ్రాసాడు. కృష్ణశాస్త్రి విశ్వనాథ

లను అనుకరించి కవిత్వం వ్రాసాడు. లలితమధురమైన బాష భావాలతో భావకవిత్వం వ్రాసాడు. 1928లో శ్రీశ్రీకి కొంపెల్లి జనార్ధనరావుతో పరిచయమైంది. 1929లో శ్రీశ్రీ "సుప్తాస్థికలు" కవిత వ్రాసాడు. దానిలో ఓజోగుణ భరితమైన శైలి ప్రయోగించబడింది. దాంతోనే శ్రీశ్రీ ప్రస్థానమారంభమైంది. 1931 లో "ఖండశశి" 1933 లో "విద్యున్మాలికలు" కవితతో శ్రీశ్రీ ప్రస్థానం స్థిరరూపం ధరించింది. 1933లో "జయభేరి" వ్రాసాడు. ఛందస్సుల సర్పపరిష్వంగం భావకవితాధోరణులు వదిలిపెట్టిన ఈ కవిత కొత్త. ఛందస్సు కొత్త వస్తువుతో అభ్యుదయ కవిత్వానికి "జయభేరి" అయింది. 1934 లో శ్రీశ్రీ "మహాప్రస్థానం" గేయం రచించాడు. ఇది అభ్యుదయ కవిత్వానికి "మార్చింగ్‌సాంగ్" అయింది.

"కుక్కపిల్లా/అగ్గిపుల్లా/సబ్బుబిళ్ళా
హీనంగా చూడకు దేన్నీ/కవితామయమేనోయ్" అన్నీ

అని శ్రీశ్రీ చుట్టూ వున్న ప్రపంచంలో కర్షకుడు కార్మికుడు భిక్షుకూ-అన్నీ కవితామయంగా చూసాడు. తెలుగు కవిత్వాన్ని ప్రేమ సౌందర్యం, భక్తి, మార్మికతలనుంచి అధివాస్తవికతవైపు అభ్యుదయమార్గంలోకి నడిపించాడు. అభ్యుదయకవితకు ప్రయోక్త ప్రవక్త అయినాడు. మహాప్రస్థానం వ్రాసేనాటికి మార్క్సిజం గురించి తెలియనే తెలియదని శ్రీశ్రీ చెప్పుకున్నాడు. 1930 లోని ఆర్థిక సంక్షోభం వ్యక్తిగత జీవితంలోని ఒడిదుడుకులతో దెబ్బతిన్న శ్రీశ్రీ పరిస్థితులచేత స్పందించి అధివాస్తవికత ప్రభావంతో "పదండి ముందుకు పదండి త్రోసుకు పోదాం పోదాం పైపైకి" అని ఉత్సాహాన్ని రేకెత్తిస్తూ పాడాడు.రెండు మూడు దశాబ్దాలు యువకులను నవకవులను ఉత్తేజపరిచాడు. యుగకర్తగా నిలిచాడు.

శ్రీశ్రీకి నవ్యదృక్పథంలో స్విన్‌బర్న్, ఎడ్గార్ ఆలెన్‌పో, బ్రౌనింగు, బాడ్లేర్, మపాసా, పో లు తనకు ఋషితుల్యులని శ్రీశ్రీ చెప్పుకున్నాడు. శ్రీశ్రీ మీద గురజాడ ప్రభావం అపారమైంది. గురజాడ అతనికి అభిమానకవి. మార్క్స్ సిద్ధాంతాలను ఫ్రాయిడ్ మనస్తత్త్వ శాస్త్రాన్ని శ్రీశ్రీ ఆకళింపుచేసుకున్నాడు. శ్రీశ్రీ కవిత్వం ఓజోగుణ భరితమైంది.

సంస్కృత పదభరితంగా కదంతొక్కుతూ నడిచింది. శ్రీశ్రీతన కవిత్వంలో తక్కువ మాటల్లో ఎక్కువ అర్థం వచ్చేలాగా రచించాడు. శబ్దాలను ఏరుకొని ప్రయోగించడంలో శ్రీశ్రీ నేర్పు చూపాడు. అతని కవిత్వంలో ప్రతీకలతో వస్తుధ్వనిభరితంగా చెప్పడం ఎక్కువ వున్నది. "జగన్నాథుని రథచక్రాలు, యముని మహిషపులోహఘంటలు, నరకలోకపు జాగిలములు, సూర్యుని సప్తహయములు, ఇంద్ర దేవుని మదపు టేనుగు, ఆది సూకరం, ధనంజయునిలా సాగండి" అని శ్రీశ్రీ సంప్రదాయక ప్రతీకలను ఉపమానాలను తీసుకున్నా వాటిని నూతనార్థసాధనకు వాడుకున్నాడు.కొత్త సృష్టిని స్ఫురింపజేసాడు. కవిత్వంలో భావసాంద్రత, భావతీవ్రత, భావస్పష్టత కోసం పౌరాణికసంబంధ వస్తువులను తీసుకోవడం అప్పటికి ఇప్పటికీ కన్పిస్తున్నది.అంత్యప్రాసలు అనుప్రాసలతో అతని కవిత్వం భావోద్వేగంతో వేగంగా నడిచింది.

శ్రీశ్రీ మహా ప్రస్థానం కవితలను వ్రాస్తున్న రోజుల్లోనే శ్రీరంగం నారాయణబాబు "రుధిరజ్యోతి"కవితలను వ్రాసాడు. స్వేచ్ఛాప్రవృత్తి కలవాడు. మాటలో వేషంలో విలక్షణత కలవాడు. ఆయనా శ్రీశ్రీ అహమహమికతో కవిత్వం వ్రాసారు. మొదట శ్రీశ్రీతోపాటు భావకవిత్వం వ్రాసాడు. తర్వాత శ్రీశ్రీతోపాటు జీవితగ్రీష్మాన్ని దర్శించిన కవి. 1937 లో "దేశమాత" గేయంలో "గుక్కెడు అన్నం గుక్కెడు నీళ్ళ" కోసం పరితపించే భిక్షుకస్త్రీని. వర్ణించాడు. "కదనకుతూహలరాగం" అనే గేయంలో విప్లవశంఖాన్ని పూరించాడు. సౌందర్యమొక్కటే ఆరాధ్యం కాదని సృష్టిలోని అసుందరవస్తువులను కూడా కవితావస్తువుగా తీసుకోవచ్చునన్నాడు. ఆదర్శవాదం మీద ఎదురు తిరిగి వాస్తవికతను ఆశ్రయించిన కవి. భావకవిత్వం లోని సౌందర్యకల్పనలు లలితమధురశైలి మీద తిరుగుబాటు చేసిన కవి.ఇసుకలో ఉష్ట్రపక్షి తలదూర్చి చుట్టూ ఏం జరుగుతుందో చూడనట్లుగా కవి వుండరాదని చాటాడు.

"రక్తపతాకం / శక్తినాలుక
అగ్నికిరీటం / ఆకాశమున
మునిమాపు/ కేకలు వేస్తూ పిలిచింది"

అని నారాయణబాబు "సామిధేని"కవితలో రష్యాపిలుపును వర్ణించాడు. పై కవితలోని "రక్తపాతం" శ్రీశ్రీ "నవకవిత"లో చెప్పిన "ఎగరేసిన ఎర్రని జెండా"యే శ్రీశ్రీ చెప్పిన "కలకత్తా కాళిక నాలిక" "అగ్ని కిరీటపు ధగధగ" లను ఈకవి "శక్తినాలుక, అగ్నికిరీటం" గా చెప్పాడు. రష్యాలోని శ్రామికవర్గచైతన్యానికి విప్లవ శక్తులకు ప్రతీకలుగా ఈ ఇద్దరుకవులు చెప్పినవే ఈ మూడు. శ్రీశ్రీతోపాటు నారాయణబాబు విప్లవశంఖాన్ని పూరించిన కవి. ఈ కవి తనను తాను విప్లవఋషిని, విద్రోహకవిని అని చాటుకున్నాడు. బెంగాల్‌లో విప్లవకవి నజురులిస్లాంను తలపించే కవి నారాయణబాబు.

శిష్టా ఉమామహేశ్వరరావు (1912) జీవితానుభవంగల కవి. హాస్యప్రియుడు. మాటకారి. 1938లో "విష్ణుధనువు" "నవమిచిలుక" కవితాసంపుటాలను ప్రచురించాడు. శ్రీశ్రీ నారాయణబాబుల వలెనే భావకవిత్వంమీద తిరుగుబాటు చేసిన కవి. తనది పూర్వకవిత్వం కాదు నవ్యకవిత్వం కాదు భావకవిత్వం కాదు బహునూతనకవిత్వమని చాటుకున్నాడు. తన కవిత్వాన్ని "ప్రాహ్లాద కవిత్వ" మన్నాడు- "ప్రాహ్లాద కవిత్వం ఆరిపోయే దీపాన్ని రగుల్చుతుంది పరుగేత్తే పామున్ని నిలేస్తుంది" అని నవమిచిలుక మున్నుడిలో కవి చాటాడు. "విష్ణుధనువు" లో కవి తనను తాను రాముడుగా తన ప్రేయసిని సీతగా భావించుకున్నాడు. సీత ప్రేమలో దేశప్రేమ కూడా ధ్వనించింది. శిష్టా భావకవిత్వం మీద తిరుగుబాటు చేసినా నూతనపంథాను నిర్దేశించలేకపోయాడని నారాయణరెడ్డిగారన్నారు. వస్తువులో చెప్ప కోదగిన నవ్యతను తేలేకపోయాడు. కాని ఛందస్సుల్లో అద్భుతమైన ప్రయోగాలు చేసాడు. విశ్రుంఖలత్వాన్ని ప్రదర్శించాడు. పూర్తి సంపుటిలో వచనగేయాలు ప్రచురించిన మొదటి కవి. "నవమి చిలుక" వచన గేయాలు శ్రీశ్రీమొదలయిన కవులకు ఆదర్శమయ్యాయి.

పఠాభి కలకత్తాలో చదువుతూ అక్కడి దారిద్ర్యాన్ని చూసి రవీంద్రుని భావకవిత్వం అర్థరహితమని భావించాడు. 1938 లో పాత కవిత్వపు విలువలను విధ్వంసంచేస్తూ "ఫిడేలురాగాల డజన్"ప్రచురించాడు. ఇది 1939లో పుస్తకరూపంలో వచ్చింది.

"నాఈ వచనపద్యాలనే దుడ్డుకర్రల్తో
పద్యాల నడుముల్ విరుగదంతాను
చిన్నయ్‌సూరి బాలవ్యాకరణాన్ని
చాల దండిస్తాను--" అన్నాడు.
1937 లో శ్రీశ్రీ
"శ్మశానాల వంటి నిఘంటువులదాటి
వ్యాకరణాల సంకెళ్ళు విడిచి
ఛందస్సుల సర్పపరిష్వంగం వదలి"-

కవిత్వం వ్రాస్తానన్నాడు. పఠాభి కూడా అదే తిరుగుబాటును ప్రబోధించాడు. పఠాభితో వచనకవిత్వం బాగా ప్రచారంలోకి వచ్చింది.

"అనుసరిస్తాను నవీనపంథా కానీ
భావకవిని మాత్రము కాన్నే
నహంభావ కవిని" అన్నాడు పఠాభి.

నిర్భయంగా నిరంకుశంగా వ్రాసాడీ కవి. అహంకారం, విశ్రృంఖలత్వం వైచిత్రి ఇతని కవిత్వంలో కన్పిస్తాయి. శిష్టావలెనే ఈ కవి గ్రాంథికం వ్యావహారికం ప్రయోగించాడు. ఇతని కవిత్వాన్ని "అహంభావకవిత్వ" మన్నారు కొందరు విమర్శకులు.భావకవిత్వంలోవి కామంలేని ప్రేమతత్వాన్ని హేళన చేస్తూ పఠాభి "సెక్స్"ను వర్ణించాడు. భావకవిత్వం వల్ల ఏర్పడిన జడతను పఠాభి తన అసంప్రదాయపు భావాలతో కదిలించాడు.

పై నలుగురితోపాటు నవ్యకవిత్వాన్ని చెప్పిన అభ్యుదయ కవులు పురిపండా, ముద్దుకృష్ణ, పాప. వాళ్ళు ఆదర్శవాదాన్ని నిరసించి వాస్తవికతనాదరించారు. ముద్దుకృష్ణ శిష్టా వలెనే వచనగేయాలు వ్రాసాడు. పురిపండా మొదట్లో భావకవిత్వం వ్రాసినా క్రమంగా శ్రీశ్రీ సాహచర్యంతో అభ్యుదయవాదంవైపు మళ్ళాడు. ఆయన వ్రాసిన "అనలపతాకం" శ్రీశ్రీ "మహాప్రస్థాన"గేయాన్ని పోలివుంది. పాపకూడా వచనగేయాలు వ్రాసి "ప్రతిభ" లో ప్రకటించాడు. శిష్టా పాప వచనగేయాలే తర్వాత కుందుర్తి తిలక్ వంటి అభ్యుదయకవుల వచన కవిత్వానికి ఆదర్శమయ్యాయి.

కుందుర్తి (1922) తోనే తెలుగులో వచనకవిత్వం బాగా ప్రచారంలోకి వచ్చింది. 1966లో కుందుర్తి "ఫ్రీవెర్స్ ఫ్రంటు" ను స్థాపించి 1967లో "వచనకవిత" వ్యాససంపుటిని ప్రచురించాడు. దీనిలో కెవిఆర్, సోమ సుందర్, వరవరరావు సుంపత్కుమార, సుప్రసన్న, కుందుర్తి, వేగుంట, శ్రీపాదల వ్యాసాలున్నాయి. వచన కవిత్వం భాషభావంలో నిరాడంబరతతో కూడి మానవునికి దగ్గరైంది. కుందుర్తి "కథావచనకవిత" లను అంటె "తెలంగాణా" వంటి కథతోకూడిన వచన కవితాకావ్యాన్ని వ్రాసాడు. కాని తర్వాత "కథ"ను ఎవరూ తీసుకోలేదు. వచన కవిత్వంలో ఒక తూగు లయ వుండాలని కుందుర్తి అంగీకరించాడు. కొందరు ఆది ప్రాసలను కొందరు అంత్యానుప్రాసలను పాటించి పద్యం నడకననుకరించారు. ప్రారంభదశలో పండితవిమర్శకులు వచనకవిత్వాన్ని వ్యతిరేకించారు. ఛందోబద్ధంగా వ్రాయడం చేతకాక వాక్యాలను పేర్చి వ్రాస్తున్నారని అన్నారు. కాని పద్యరచనలో ప్రవీణులైన వాళ్ళు వచనకవిత్వాన్ని వ్రాయడంతో వచనకవిత్వానికి గౌరవం పెరిగింది. యూరోపులో "ఇమేజిజమ్" "ఫ్రీవర్స్" ను ప్రచారంలోకి తెచ్చింది. తెలుగులో అభ్యుదయవాదం వచనకవితను ప్రచారంలోకి తెచ్చింది. "ఫ్రీవర్స్" ను తెలుగులో మొదట "వచన గేయం, వచన గీతం" అని శ్రీశ్రీ పిలిచాడు. పఠాభి "వచనపద్యం" అన్నాడు. సోమసుందర్ "ముక్తచ్ఛందం" అన్నాడు. వరవరరావు "స్వచ్ఛంద కవిత్వం" అన్నాడు. "వచనకవిత" అని కుందుర్తి కెవిఆర్ కోవెల సుప్రసన్నలు అన్నారు. సంపత్కుమార చేకూరి రామారావు (చేరా) చర్చలతో "వచనకవిత" అన్న పేరే స్థిరపడింది. రూపంవిషయంలో ఏ నిబంధనలు లేనిది వచనకవిత్వం. వచనంలో వ్రాసినా చదివేటప్పుడు తూగు ఊపు లయను పాటిస్తూ గొంతెత్తి కవులు చదువుతున్నారు. కాబట్టి వచనకవితకు లయ విరుపు ప్రధానమన్నారు. కాని వచనకవితలో విప్లవకవులు పాట పాడే గేయ పద్ధతిని తెచ్చారు. ఇప్పుడు వచనకవితలో భావచిత్రాలు, పదచిత్రాలు ప్రతీకలు ఎక్కువగా కన్పిస్తున్నాయి. భావప్రకటనలో మునుపున్న సరళతలేదు. క్లిష్టత ప్రవేశించింది. అర్థంలో నూతనత్వాన్ని సంక్షిప్తతను సాధిస్తున్నారు. చెప్పే పద్ధతిలో వక్రత ప్రతీకలు ప్రవేశించాయి. మరీ "వార్త" లాగా వున్న

వచనకవితలోని భావప్రకటన ఇప్పుడు ఊహకు ఆలోచనకు స్థానంగా వుంది. వచన కవిత్వంలో కావ్యం వ్రాయాలన్న ప్రయత్నం కుందుర్తి "తెలంగాణా" లో జరిగింది. ఇది 18 పర్వాలు గల తెలంగాణాభారతం.

శ్రీశ్రీ అతని అనుయాయుల అభ్యుదయధోరణులు తర్వాత 1944 లో "నయాగరా" కవితా సంపుటి అభ్యుదయ వాదానికి పట్టునిచ్చింది. బెల్లంకొండ రామదాసు, ఏల్చూరి సుబ్రహ్మణ్యంలతో కూడి కుందుర్తి ఆంజనేయులు ప్రకటించిన "నయగరా" తర్వాత చాలా మంది కవులు 1950 కి ముందే అభ్యుదయ కవిత్వాన్ని చేపట్టారు. దాశరథి- "అగ్ని ధార" (1949) రుద్రవీణ (1950) సోమసుందర్ "వజ్రాయుధం"(1949) ఆరుద్ర "త్వమేవాహం (1949) అనిసెట్టి "అగ్నివీణ" (1949) నారపరెడ్డి "అశ్రుమాల" (1950) రెంటాల "సంఘర్షణ", గంగినేని "ఉదయిని" (1950). 1950 లో శ్రీశ్రీ "మహాప్రస్థానం" గ్రంథ రూపంగా వెలువడింది. 1950 తర్వాత రమణారెడ్డి "భువనఘోష" (1955) నారపరెడ్డి "నావీణ" (1953) కుందుర్తి "తెలంగాణ" (1956) రెంటాల "సర్పయాగం" (1957) సోమసుందర్ "కాహళి" (1953) మొదలయినవి అభ్యుదయ కవిత్వోద్యమంలో ఎన్నదగిన కవితాసంపుటులు. ఈకవిత్వంలో శ్రీశ్రీ కవిత్వంలో వలెనే వర్గసంఘర్షణ, ధనవంతుల మఠాధిపతుల ఆధిపత్యం మీద నిరసన శ్రామికవర్గం అభ్యుదయాన్ని ఆశించడం వున్నాయి. విప్లవశక్తుల విజృంభణాన్ని పరవశించి "ఎవరాపుదురీ శక్తిని ఎవరడ్డుదురీ కత్తిని" అని రెంటాల ("సంఘర్షణ") గానం చేసాడు. ఆకలి దారిద్ర్యం అసమానతల్లేని సమసమాజ నిర్మాణం ఈ కవుల ఆశయం.

భారత జాతీయోద్యమం తర్వాత తెలంగాణా విమోచనం కోసం సాయుధ పోరాటం సాగింది. (1946-1951). ఈ పోరాటం కవులను రచయితలను ఆకర్షించింది. నిజాంప్రభువు నిరంకుశపాలనలో దొరల దేశముఖుల దౌర్జన్యాలు దోపిడీలు తెలంగాణాలో కొనసాగాయి. భూస్వామ్యవ్యవస్థ వికటాట్టహాసాన్ని నిజాంపాలనలో దర్శించవచ్చు. నిజాంకు వ్యతిరేకంగా కమ్యూనిస్టులు సాయుధ పోరాటం సాగించారు. ఇదంతా

కవులకు వస్తువు అయింది. కవిత్వం కథానిక నవలలు అనేకం వచ్చాయి. తెలంగాణా ఉద్యమంలో పాల్గొన్న వాళ్ళు దాశరథి, కాళోజి వంటి కవులు వట్టికోట ఆళ్వారుస్వామి వంటి నవలా కారులున్నారు. యాదగిరి, సుద్దాల హనుమంతు వంటి ప్రజాకవులెందరో పాటలు వ్రాసి ప్రజలనుత్తేజితులను చేసారు.

"నైజాంసరకరోడ నాజీల మించినోడ ఏమి బాధలు పెడ్తివి కొడుకో ! నైజాం సరకరోడా !" అని రైతుకూలీకుటుంబంలో పుట్టిన యాదగిరి గెరిల్లా పోరాటంలో పాల్గొన్నవాడు వ్రాసిన పాట. ప్రజాకవులు వ్రాసిన ఆ నాటి ఉద్యమం పాటలను సేకరించి విశాలాంధ్ర వాళ్ళు విరసంవాళ్ళు ప్రజాశక్తిప్రచురణ వాళ్ళు ప్రచురించారు.

"ముసలి నక్కకు రాచరికమ్ము దక్కునే" - అని దాశరథి నిజాంను ఎదిరించి జైలుకెళ్ళిన పోరాట వీరుడు. "తెలంగాణము రైతుదే" అని దాశరథి చాటాడు. "మా నిజాంరాజు జన్మజన్మాల బూజు" అని మహోద్వేగంతో అన్నాడు.

"వ్యక్తులు పరిపాలించే శక్తి నశించింది నేడు, రక్తంలో అణువణువూ శక్తి గడించింది నేడు" అంటాడు దాశరథి "అగ్నిధార"లో. "అయ్యా బానిసను అనిన పోరుడే, అయ్యగొంతుక నట్టె అదుమున్" - అని తిరుగుబాటును వర్ణించాడు కాళోజి. కాళోజీ నారాయణరావు (1904) చేతలోను వ్రాతలోను విప్లవకారుడు. రజాకార్ల దురంతాలను నిరసిస్తూ నిజాం ప్రభుత్వాన్ని ఎదురొడ్డి నిలిచిన కవి. అతని కవిత్వం సూటిగా తీవ్రంగా వుంటుంది. ప్రజాకవిగా పేరు పొందాడు.అతని "నాగొడవ" కవితా సంపుటిలో తెలంగాణాప్రజల గొడవలను బాధలను చెప్పాడు.

"నవయుగంబున నాజీవృత్తుల / నగ్ననృత్యమింకెన్నాళ్ళు

పోలీసు అండను దౌర్జన్యశక్తులు / పోషణ బొందేదెన్నాళ్ళు" అని ప్రజలగొంతుకతో గర్జించాడు కాళోజి. "తెలంగాణమ్మున గడ్డిపోచయును సంధించెన్ కృపాణమ్ము"- అని దాశరథి ప్రజల తిరుగుబాటును వర్ణించాడు. "నాతెలంగాణ కోటి రతనాల వీణ" అని చాటాడు. దాశరథి ఛందస్సు

ల్లోను, వచనంలోను కవిత్వం వ్రాసాడు. అతని ఛందస్సులు సరళసులభంగా నడిచాయి. "అగ్నిధార, తిమిరంలో సమరం, ఆలోచనాలోచనాలు" వచనక విత్వంలో వున్నాయి. అతని వచన కవిత్వం లయబద్ధంగా నడిచింది. ఉర్దూ పర్షియన్ భాషలు తెలిసిన కవి. గాలిబ్ గీతాలను తెనిగించాడు. ఉర్దూ గజల్ ప్రక్రియననుసరించి తెలుగు వచనగీతాలు వ్రాసాడు.

వట్టికోట ఆళ్వారు స్వామి తెలంగాణా ఉద్యమంలో పాల్గొన్నవాడు. ఉద్యమాన్ని చిత్రిస్తూ "ప్రజలమనిషి (1952- 55) గంగు (1961) అనే నవ లలు వ్రాసాడు. తెలంగాణా పోరాటకాలంలో సక్రియులై పనిచేస్తూ కథానికలు వ్యాసాలు పత్రికావ్యాసాల రచించిన వాళ్ళు సురవరం ప్రతాపరెడ్డి, మాడ పాటిహనుమంతరావు, దేవులపల్లి రామానుజరావు మొదలయిన వాళ్ళు . 1950-60 దశకంలో కూడా తెలంగాణా ఉద్యమంచేత ప్రభావితులై కవిత్వం నవలలు వచ్చాయి. కుందుర్తి "తెలంగాణా", ఆరుద్ర "త్వమేవాహం", సోమసుందర్ "వజ్రాయుధం", గంగినేని "ఉదయిని", రెవి ఆర్ "భువన ఘోష", రెంటాల "సంఘర్షణ", నారపరెడ్డి "మేలుకొలుపు" మొదలయినయి ఖండకావ్యాలు. హరీంద్రనాథ చటోపాధ్యాయ ఇంగ్లీషులో వ్రాసిన "టేల్స్ ఆఫ్ తెలంగాణా" కావ్యాన్ని ఆరుద్ర "వీరతెలంగాణా విప్లవగాథలు" పేరుతో తెనిగించాడు. తెలంగాణా ప్రజాపోరాటం తెలంగాణా బయటవున్న కవులను కదిలించి కావ్యరచనకు స్ఫూర్తినిచ్చింది. కవితలేకాక తెలంగాణా పోరాటాన్ని చిత్రిస్తూ- మహీధర "ఓనమాలు" (1956) "మృత్యువు నీడల్లో", బొల్లి ముంత శివరామకృష్ణ "మృత్యుంజయులు" (1947), లక్ష్మీకాంతమోహన్ "సింహగర్జన" (1951) నవలలు వచ్చాయి. తెలంగాణాలోని ఫ్యూడల్ వ్యవస్థ, ఆ వ్యవస్థలో పెత్తనం చేసిన దౌర్జన్య శక్తులు నలిగిపోయిన వ్యక్తులను పరిస్థితులను వస్తువుగా తీసుకొని 1970 లో దాశరథి రంగాచార్యులు "చిల్లర దేవుళ్ళు" 1994 లో సుజాతా రెడ్డి "మలుపు తిరిగిన రథ చక్రాలు" నవలలు వచ్చాయి.

"తొలివెలుగై మనభువిలో తెలంగాణ తెలుగుబిడ్డ తన రుధిరము ధారవోసి నూత్నపథము సృష్టించెను" అని "మేలుకొల్పు"లో నారపరెడ్డి

తెలంగాణా సృష్టించిన నూతన పథాన్ని గానం చేసాడు. ఇప్పటికింగా తెలంగాణా పోరాటం కవులకు రచయితలకు స్ఫూర్తినిస్తూనేవుంది.

1950 దశకంలో అభ్యుదయ వాదుల దృక్పథంలో మార్పు వచ్చింది. వాళ్ళ మీద జాతీయ అంతర్జాతీయ ప్రభావాలెన్నో పని చేసాయి. యం. యన్. రాయ్ నవ్యమానవవాదం నెహ్రూసోషలిస్టు భావాలు, అభివృద్ధి పథకాలు భారదేశాన్ని ఒక శక్తిగా మార్చాలనే అతని ఆకాంక్ష కవులకు ఒక జాతీయదృక్పథం, ఆదర్శభావాల మీద ప్రేమ, సత్యం అహింసల మీద అభిమానం, శాంతికాముకత ఏర్పడినాయి. భారతదేశ ప్రజల బీదతనం పోయి అభివృద్ధి వస్తుందనే ఆశ కలిగింది. భారతదేశం ఒక శక్తిగా శాంతిస్థాపన చేసి విశ్వమానచైతన్యాన్ని తెస్తుందనుకున్నారు. దేశ ప్రాచీన సంస్కృతి వైభవంవైపు మొగ్గుచూపారు. అభ్యుదయయుగంలోని రెండవ దశలోని ఈకవులకు రష్యావిప్లవం ప్రేరణనియ్యడం మానేసింది. నెహ్రూ రాజకీయాలు వాళ్ళకు ప్రేరణ. దానికి ఎర్రగులాబి ప్రతీక. జాతీయ దృక్పథం సంప్రదాయం మీద అభిమానం పెరిగింది. అట్లా అని వాళ్ళు హేతువాదం శాస్త్రీయ దృక్పథం నుంచి తొలగలేదు. వాళ్ళ ముఖ్యధ్యేయం మానవ వాదం, అభివృద్ధి శాంతిసమానతలు. అంతర్జాతీయంగా రెండవ ప్రపంచ యుద్ధం ముగిసిం తర్వాత 1945 లో లీగ్ ఆఫ్ నేషన్స్ ఐక్యరాజ్యసమితిగా మారి 1948 లో మానవహక్కుల పరిరక్షణకు నడుంకట్టింది. మానవత్వానికి మరోరూపం మానవహక్కులు. ఈ హక్కులు ప్రపంచ పౌరులందరి కోసం ప్రకటించబడినాయి. విశ్వమానవహక్కుల ప్రకటన విశ్వమానవుని కల్పనకు వసుధైకకుటుంబ భావనకు దోహదం చేసింది. ఇది 1950 దశకంలోని కవులకు ప్రేరణనిచ్చింది. నెహ్రూ పంచవర్ష ప్రణాళికలతో దేశంలో సమృద్ధి ఏర్పడుతుందని అతని పంచశీల సూత్రాలతో ప్రపంచ శాంతిభద్రతలు సమానతలు వస్తాయని అణచివేత పీడన దోపిడి దౌర్జన్యాలు వలసశక్తులు నశిస్తాయని స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు నెలకొంటాయని కవులు ఆశించి ఆ భావజాలంతో కవిత్వం వ్రాసారు. సామ్రాజ్యతృష్ణతో జాత్యహంకారంతో ఐశ్వర్య దాహంతో యుద్ధం వచ్చి వినాశనాన్ని తెచ్చింది. మారణాయుధాలు ప్రయోగింపబడినాయి. అదంతా చూసిన ఈ కవులు యుద్ధాన్ని వ్యతిరే

కించారు. శాంతిని కాంక్షించారు. ప్రధానంగా 1950 దశకంలో కవిగా స్థానం ఏర్పరచుకున్న సి.నారాయణరెడ్డి కవిత్వంలో ఈ భావజాలాన్నంతా దర్శించవచ్చును. అతని నాగార్జునసాగరం కావ్యంలో ఇదే ప్రతిఫలించింది. అంతకుముందే శ్రీశ్రీ అభ్యుదయపథంలో నడిచిన ఆరుద్ర సోమసుందర్ కుందుర్తి నారాయణరెడ్డి మార్గంలోకి చేరారు. ఈనాటి కవుల్లో తిలక్ కూడా ప్రముఖమైనవాడు ప్రజల బీదదనాన్ని చూసి బాధపడుతూ కవిత్వం వ్రాసాడు. కాని "పదండి ముందుకు పదండి తోసుక" అని విజృంభణతో వ్రాయలేదు. తెలంగాణాపోరాటకాలంలో మార్క్సిస్టుదృక్పథంతో ఉద్యమంలోకి దూకిన దాశరథి కూడా శాంతిగానం చేసాడు. అతని "మహేంద్రోదయం" లో "కపోతీసందేశము" నెహ్రూ శాంతిసందేశమే. కపోతం శాంతికి ప్రతీకగా గ్రహించబడింది. నెహ్రూ ఎర్రగులాబిని పొడగాటి కోటుకు అలంకరించుకొని తెల్లని కపోతాన్ని ఎగరేసిన చిత్రం ఈనాటి కవుల కాదర్శమైంది.

"కాస్త పశ్చిమాద్రికడగేగి నాబంధు'
జాలమునకు గూడ శాంతి నేర్పి,
ఇలను కాచుమోయిఈ అణుప్రోద్గత
ప్రళయవహ్నినుండి పక్షిరాజ్ఞ"

అంటాడు దాశరథి. సి.నారాయణరెడ్డి కూడా- "అమృతం పండించే అణుబీజాలనుండి, విషపూరిత మృత్యుసస్యాలను మొలపిస్తున్న, శాస్త్రజ్ఞులారా పరమాణువుల రగిల్చి, చరిత్రను పొగచూర నీయకండి" - అంటాడు. రెండవ ప్రపంచయుద్ధ బీభత్సం, భారత స్వాతంత్ర్యఉద్యమంనాటి అశాంతి పేదరికం నుంచి బయటపడటం, అహింసను కాంక్షించారీనాటి కవులు. యుద్ధం మాకొద్దని చాటారు. 1930,40 దశకంలోని అభ్యుదయ కవుల వలె ఈ కవులు తిరుగుబాటులు, విజృంభణలను ప్రబోధించలేదు. శ్రీశ్రీ ఓజోగుణంతో కూడిన కవిత్వాన్ని చేపట్టలేదు. గంగినేని, రమణారెడ్డి, నారపరెడ్డి వంటి విప్లవాన్ని ఆశించిన కవులు కూడా ఈ కాలంలో శాంతిగీతాలు రచించారు.

"ఎంతవల్లని కన్నులమ్మా, ఎంత ఎర్రని పెదవులమ్మా, వంతలను మరపించు నీదర, హాసచంద్రిక లేవి శాంతీ !-" అంటూ "కాహళి" లో సోమసుదర్ శాంతి నన్వేషించాడు. ఈ కవులు హింసను రక్తపాతాన్ని నిరసించారు. ఒకనాడు విప్లవశంఖాన్ని పూరించిన దాశరథి బుద్ధుని బోధనలను ప్రబోధిస్తూ "మహాబోధి" ఖండకావ్యం వ్రాసాడు. శాంతి సౌభ్రాతృత్వం విశాలాంధ్రనాశిస్తూ దాశరథి రంగాచార్య "చిల్లర దేవుళ్ళు" నవల వ్రాసాడు. 1956 లో ఆంధ్రుల 1910 నాటి నుంచి సాగిన ఉద్యమం ఫలించి విశాలాంధ్ర ఏర్పడింది. దాంతో ఈ నాటి కవులు విప్లవ ధోరణిని హింసామార్గాన్ని విడనాడి అభివృద్ధిని సాధించాలనే దృక్పథం కలిగి వున్నారు. "ఏది విప్లవం" కవితలో దాశరథి హింసను విడనాడాలని చెప్పాడు. రక్తపాతంలేని విప్లవం కావాలన్నాడు.

"విప్లవమంటే మృత్యువు / విలయతాండవం కాదు
విప్లవమంటే బాంబుల / వికటాట్ట హాసం కాదు
విప్లవమంటే రక్తం / వెదజల్లుట కాదర్రా

పీన్గుల గుట్టలనుండి / విప్లవాలు రావర్రా." అంటాడు దాశరథి. ఈ నాటి కవులది కారుణ్యావాదదృక్పథం. అంతేగాక ఈనాటి కవులు పీడితవర్గం మీద కన్నా మధ్యతరగతి వాళ్ళ సమస్యలను పట్టించుకున్నారు. ఆరుద్ర "సినీవాలి", సి.నారాయణరెడ్డి "మధ్యతరగతి మందహాసం" మధ్యతరగతి వాళ్ళ బాధలను చిత్రించే ఖండకావ్యాలు. ఈ నాటి నవలల్లో కథానికల్లో కూడా మధ్యతరగతి వాళ్ళ ఆర్థికబాధలు నిరుద్యోగ సమస్యలే చిత్రించబడినాయి. నారాయణరెడ్డి తెలంగాణా పోరాటం తర్వాత కవి. తెలంగాణాలో పుట్టిన అతని మీద పోరాటం ప్రభావం కన్పించదు. భావకవితాసౌందర్యం నెహ్రూ కలలతో పుట్టిన కవి నారాయణ రెడ్డి, తిలక్‌లు. నారాయణరెడ్డి "మనిషి", "విశ్వంభర", "భూమిక" ఖండకావ్యాల్లో వస్తువు మనిషి. మనిషిలో అంతర్నిహితంగా వుండే శక్తి దాని పేరు చైతన్యం. ఆ చైతన్యశక్తి మనిషి పురోగమనానికి పునాది- భూమిక అంటాడు నారాయణరెడ్డి. "మనిషి ఆరిపోని పరిణామజ్యోతి", "చైతన్యమే భూమిక సకల జీవనసంస్కృతికి" అంటాడు నారాయణరెడ్డి.

మార్క్సిజం మనిషి చుట్టూవున్న జడపదార్థాలకిచ్చినంత శక్తిని మానవుని మనస్సుకు, మనస్సులోని చైతన్యానికియ్యలేదు. అదే మార్క్సిజంలోని లోపమని యం. యన్. రాయ్ "" "నవ్యమానవవాదం" లో గుర్తించాడు. చుట్టూ వున్న పరిస్థితుల నుంచి మనిషి ముందడుగు వెయ్యాలని ప్రగతితో ఎదగాలని నారాయణరెడ్డి తపన. నవ్యమానవవాదం ప్రభావం గోపీచంద్ "పరమేశ్వరశాస్త్రి వీలునామా" వంటి నవలల్లో కన్పిస్తుంది. గోపీచంద్ ప్రాచీనసంస్కృతి మీద ఆధునిక ప్రగతికి పునాదులుండాలంటాడు. ఆధ్యాత్మిక వాదాన్ని అంగీకరించాడు. కుహనా కమ్యూనిస్టులను నిరసించాడు. కొడవటిగంటి కుటుంబరావు అభ్యుదయ దృక్పథంతో చదువు, అరుణోదయం, గడ్డురోజులు మొ.న నవలలు వ్రాసాడు. జి.వి. కృష్ణారావు "కీలుబొమ్మలు" ఉప్పల లక్ష్మణరావు "అతడు ఆమె" నవలల్లో మనిషి అభ్యుదయ పథంలో నడవాలంటె అతనిలోని కుళ్ళు నశించాలని చాటారు. అభ్యుదయ దృక్పథంతో నవలలు వ్రాసిన వాళ్ళు-రావిశాస్త్రి, బీనాదేవి, వాసిరెడ్డి సీతాదేవి, రంగనాయకమ్మ మొ. అభ్యుదయ యుగం నవలల్లో మధ్యతరగతి కుటుంబాల సమస్యలను పేదతనం ఎక్కువగా చిత్రింపబడినాయి. అట్టడుగు వర్గం దుస్థితిని ఎవరూ వర్ణించలేదు. రావిశాస్త్రి బీనాదేవి నవలల్లో కొంత వరకు కన్పిస్తుంది. కాని కథానికల్లో అభ్యుదయ దృక్పథం అట్టడుగు వర్గం వాళ్ళ బ్రతుకులు బాగా ప్రతిబింబించాయి. చాసో, కొకు, అవసరాల, రావిశాస్త్రి, పొట్లపల్లి రామారావు, తిలక్, బీనాదేవి, సత్యం శంకరమంచి, ఇల్లిందల సరస్వతీదేవి, మధురాంతకం రాజారాం, తాళ్ళూరి నాగేశ్వరరావు గోపీచంద్ కరుణకుమార మొదలయిన వాళ్ళు కథానికలు వ్రాసారు. నాజర్ బుర్రకథలకు ప్రసిద్ధుడైనాడు. సుంకర "మా భూమి" నాటకం చాల ప్రదర్శనలనందుకున్నది. ఆత్రేయ, రాజమన్నారు నార్ల వంటి వాళ్ళు తెల్లవారేంతవరకు ప్రదర్శించే నాటకాలు కాక కొన్ని గంటలకు పరిమితమైన నాటకాలు, నాటికలు రచించారు. అభ్యుదయ దృక్పథం కల వాళ్ళు ప్రజానాట్యమండలితో సంబంధమున్నవాళ్ళు 1950 దశకంలో సినిమారంగం లోకి వెళ్ళి పోవడంతో అభ్యుదయ సాహిత్యంలో నాటకరచనకు నాటక ప్రదర్శనలకు అంతగా ప్రోత్సాహం లేకుండా పోయింది.

# దిగంబర కవులు

భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చి చాన్నాళ్ళయినా అభివృద్ధి ఎక్కడ వేసిన గొంగడి అక్కడే వుందన్నట్టు అయిపోయింది. నెహ్రూ ప్రణాళికలు కన్నకలలు ఫలించే కాలం వస్తుందనుకున్నవాళ్ళకు నిరాశ ఎదురయింది. 1957-58 లో ప్రపంచ బ్యాంకు అంతర్జాతీయ ద్రవ్యనిధులనుంచి తీసుకున్న డబ్బును చెల్లించే మార్గం కనపడలేదు. ఆహారపదార్థాల కొరత ఏర్పడింది. దారిద్ర్యం పెరుగుతూ వుంది. భూదానోద్యమాలు భూసంస్కరణలు పేరుకే నడిచాయి కాని పేదవాళ్ళ ఉద్ధరణ జరుగలేదు. భూస్వాముల ధనికుల దౌర్జన్యాలతో పాటు రాజకీయనాయకుల స్వార్థాలు దోపిడీలు పెరిగి పోయాయి. ఈ ఆర్థికసంక్షోభం అవినీతిని ప్రతిఘటిస్తూ దిగంబర కవులు తమ కవిత్వంలో అసంతృప్తిని ప్రకటించారు. సమాజంలో తద్వారా సాహిత్యంలో ఏర్పడిన స్తబ్దతను బద్దలుకొట్టే ప్రయత్నం దిగంబరకవులు చేసారు. సమాజం లోని కృత్రిమతను మోసాలను ఖండించారు. అసలు రూపంతో ముసుగు లేకుండా బతకాలనడమే దిగంబరకవుల దిగంబరత్వం. సమాజంలోని కుష్ఠువ్యవస్థ మారాలన్నది వాళ్ళ ఆశయం. 1965-68 మధ్య దిగంబర కవులు కవిత్వం వ్రాసారు.మూడు కవితా సంపుటాలు ప్రచురించారు. 1965 లో మొదటి సంపుటాన్ని హైద్రాబాదులో ఒక రిక్షావానిచేత, రెండవ సంపుటాన్ని విజయవాడలో హోటల్ క్లీనరుచేత, మూడవ సంపుటాన్ని విశాఖపట్టణంలో బిచ్చగత్తెచేత అర్థరాత్రి ఆవిష్కరింపజేసి సంచలనాన్ని సృష్టించారు. తమ కవితా ఖండికలను "దిక్" లని పిలవాలన్నారు.నగ్నముని, నిఖిలేశ్వర్, చెరబండరాజు, జ్వాలాముఖి, మహాస్వప్న, భైరవయ్య-అనే ఆరుగురు-(అవి వాళ్ళ స్వంత పేర్లు కావు కలం పేర్లు) దిగంబర కవులుగా ఏర్పడి కవితా సంపుటులు ప్రచురించారు. సమాజం అసమానతలకు అన్యాయాలకు నిలయమని దాని స్థానంలో సమానత న్యాయమున్న వ్యవస్థ రావాలని అభ్యుదయ కవులు కోరుకున్నారు.శిథిలమైపోతున్న నాటి సమాజం నశించి ఉజ్జ్వలమైన సమాజం సృష్టింప బడుతుదని కలలుగన్నారు. కాని ఆ కలలన్నీ కల్లలై పోయాయి.

ఆ అసంతృప్తి ఫలితంగా కలిగిన కోపంతో తిట్లకు పరుషపదప్రయోగాలకు దిగారు.

పుళ్ళుపడి కుళ్ళిపోయిన వక్షం, పుచ్చి పోయిన పిండం,
మెదడు పురుగు తినేసింది, చర్మం కుళ్ళిపోయింది,
అవయవం పుచ్చిపోయింది, కళ్ళకి కన్నం పడింది-

వంటి పదజాలం వాళ్ళ కవిత్వంలో వుంది. దిగంబర కవుల కవిత్వంలో సౌందర్యం కాని శ్రవణ సుభగమైన పదయోజన గాని లేదు. దిగంబరక వులు ప్రజల అంతరంగంలో వ్యాపించిన ఆరాటానికి విసుగుకు విషాదానికి స్పందించారు. సమాజంలోని రాజకీయాల్లోని కుళ్ళును దిగంబరం చేసి చూపారు. షాక్ ట్రీటుమెంటు పద్ధతిలో బూతులతో తిడుతూ వాళ్ళ కవిత్వం వ్రాసారు. వాళ్ళ కవిత్వంలో ఆవేశం వేగం వుంది. వచన కవిత్వాన్ని వాడుకున్నారు. అయినా తమ కవిత్వంలో "వచనంలేదు, కవిత్వం అంతకంటే లేదు" అని ప్రాచీనకవిత్వం నుంచి వచనకవిత్వం వరకు తెలుగు కవిత్వం మీద ధ్వజమెత్తారు.

1950 ల్లో అమెరికాలో బీట్నిక్స్ కవుల ఉద్యమం ప్రపంచ యువకుల నాకర్షించింది.బ్రిటన్‌లో "ఆంగ్రీ యంగ్‌మన్" పేరుతో ఉద్యమం వచ్చింది. జార్జి ఓర్వెల్ వాళ్ళకు నాయకుడు.1958 లో బెంగాల్‌లో ఆకలితరం కవులు తిరుగుబాటు చాటారు. దిగంబర కవులు వాళ్ళనుంచి ప్రేరణ పొందివుంటారు. అందుకే కోపంతో సమాజంలోని కుళ్ళును కసితో బయటపెట్టిన "ఆంగ్రీ యంగ్‌మన్" అయినారు. ఈ కవుల మీద మార్క్స్ సిద్ధాంతాల, సార్త్రే అస్తిత్వవాదం ప్రభావాలు కన్పిస్తాయి. ప్రాచీనత దేనిమీదా - ప్రాచీన సమాజంమీద గాని ప్రాచీన సాహిత్యం మీదగాని వాళ్ళకు అభిమానం లేదు. దిగంబర కవుల మొదటి కవితా సంపుటి 1965 లో వచ్చింది. ఆ తర్వాత రెండు సంపుటాలు వచ్చాయి. ఆ తర్వాత ఆకవుల మార్గాల్లో విభేదాలు వచ్చాయి. చెరబండరాజు నగ్నముని జ్వాలాముఖి నిఖలేశ్వర్‌లు విప్లవరచయితలుగా మారారు. మహాస్వప్న భైరవ య్యల మార్గం వేరే అయింది. దాంతో దిగంబరకవిత్వం ఝంఝూనిలంలా

వీచి ఆగిపోయింది.

దిగంబర కవులు సమాజంలోని నిస్తబ్దతను సంప్రదాయాలను నిరసించి విరుచుకపడ్డారు. ఈ విషయంలో పరాభికి వీళ్ళకు సామ్యం కన్పిస్తున్నది. పదవుల కోసం డబ్బుకోసం తెగించే వాళ్ళను ఈ కవులు నిరసించారు. కుష్ఠువ్యవస్థను దుర్గంధ సంస్కృతిని వ్యాపింప చేస్తున్న వాళ్ళను నిరసించారు. దాన్నంతా ధ్వంసంచేయమని యువతరానికి పిలుపునిచ్చారు. పాతవిలువలను ధ్వంసంచేయాలన్నది వాళ్ళ ఆకాంక్ష-

"అంటు వ్యాధిలాంటి / అజగరం లాంటి
గొంగళి పురుగు భావాలు భస్మం చేయాలి

నిర్మలమైన భావవీచికల్ని / హాయిగా ప్రసరింపజెయ్యాలి" అంటారు. సమాజంలోని నల్లబజార్లను, అవినీతి దోపిడిని ఆత్మవంచన పరవంచనలను అసహ్యించుకున్నారు. "వందేమాతరం" కవితలో చెరబండరాజు ఆవేదనతో "అమ్మా భారతీ నీ గమ్యం ఏమిటి తల్లీ!"అని ప్రశ్నించాడు. సాంస్కృతికంగా సమాజం పొందిన కృతకరూపాన్ని ఈ కవులు ప్రశ్నించారు. మతమౌఢ్యాన్ని గురువుల మోసాలను ప్రశ్నించారు. ఆధునిక నాగరికతలోని దుర్మార్గానికి అక్రమాలకు బాధపడ్డారు. వాళ్ళకు భావంలో దాపరికం లేదు. వాళ్ళ కవిత్వం చదివినప్పుడు సమాజంలోని హేయమైన మనుషులమీద వాళ్ళు సృష్టించిన పరిస్థితుల మీద జుగుప్స కల్గుతుంది. దిగంబరకవులు లైంగిక ప్రతీకలను వాడి కొంత అశ్లీలతను సృష్టించారు. లైంగికం అశ్లీలం కాదు. కాని దాన్ని చెప్పే తీరులో అశ్లీలతను సృష్టించి ఈ కవులు గ్రామ్యసంస్కృతిని తెచ్చి సమాజం మీదనే కాక ప్రాచీనకవుల సంప్రదాయాల మీద కూడా నిరసనను ప్రకటించారు. అభ్యుదయ సాహిత్యంలో ఏర్పడిన స్తబ్దతను విదిలించి దిగంబరకవులు సాహితీలోకాన్ని ఒక ఊపు ఊపారు. వాళ్ళ కవిత్వంలోని తిట్లు బూతులు ఆటవిక ఆవేశం కవిత్వం కాదని కొందరు విమర్శకులు విమర్శించినా శిల్పం లోపించిందని అన్నా వాళ్ళ ఆశయాలు లక్ష్యాలు మంచివే అని వాళ్ళ కవిత్వంలోని నిజాయితీని ధర్మక్రోధాన్ని కొందరు శ్లాఘించారు. దిగంబర కవులననుకరిస్తూ పైగంబర కవులు,

తిరుగబడుకవులు, చేతనావర్తకవులు బయలుదేరారు. 1970 లో విప్లవ కవిత్వం ఆవిర్భావంతో దిగంబర కవిత్వం దానిలో లీనమైపోయింది. 1970 లో విరసం ఏర్పడినప్పుడు నగ్నముని చెరబండరాజు జ్వాలాముఖి నిఖిలేశ్వర్‌లు విప్లవరాజకీయాలను అంగీకరించారు. అరసం కవుల ఆరాటం దిగంబర కవుల ఆవేదన విప్లవకవుల సాయుధవిప్లవంగా మారింది.

## నవ్యసంప్రదాయ సాహిత్యం

నవ్యసంప్రదాయవాదం ముద్ర వేసుకొని సాహిత్యం విమర్శలు కన్పిస్తున్నాయి. కొందరు నవ్యసంప్రదాయవాదం ఒక రూపాన్ని పొందలేదంటారు. నవ్యసంప్రదాయవాదులు మాత్రం నవ్యసంప్రదాయవాదం సంపూర్ణంగా వికసించిన మార్గమంటారు."నవ్యసంప్రదాయ" పదానికి "నియోట్రాడిషనిలిజం" అని అర్థం కాక "నియోక్లాసికల్" అని అర్థం అంటారు. ఇంగ్లీషు సాహిత్యంలో వచ్చిన నియోక్లాసికల్ యుగలక్షణానికి నవ్యసంప్రదాయానికి సంబంధం లేదని దాని చరిత్ర దీని చరిత్ర వేరని అంటారు. 1920-75 మధ్య వచ్చిన భావ, అభ్యుదయ కవిత్వాలతో పాటు సంప్రదాయమార్గంలో నవ్యవస్తువుతో కవిత్వం వచ్చింది. భావ, అభ్యుదయ కవులు మాత్రాఛందస్సులు గేయాలు వచన కవిత్వాలు వ్రాస్తుండగా నవ్యసాంప్రదాయవాదులు మహాకావ్యప్రక్రియనెన్నుకొని వ్రాసారు. వీరేశలింగం కాలంలోనే శ్రీపాద, వడ్డాది వంటి కవులు భారతాదుల ననువదించారు. నన్నయ కావ్యమార్గం ఆ విధంగా 20 వ శతాబ్దం వరకు కొనసాగుతూనే వుంది. కాని విశ్వనాథ వంటి కవులు ఆధునిక దృక్పథంతో విజాతీయతను తోసిపుచ్చి జాతీయ దృక్పథంతో వ్రాసారు. అదే నవ్యసంప్రదాయ వాదమని చెప్పాలి.

వీరేశలింగం యుగంలోని కవుల రచనల వలె వీళ్ళ రచనలు సంస్కృతానువాదాలు కావు. అయితే ఈ యుగంలో వస్తునవ్యతతో శివభారతం, రాణాప్రతాపచరిత్ర పోతనచరిత్ర తిరుపతి వేంకటకవుల బుద్ధ చరిత్ర వేదాంతాచార్యుల జగదీశ చంద్రబోసు చరిత్ర వంటి కావ్యాలు వ్రాయబడినాయి.

మహా కావ్యప్రక్రియ పాతబడిన ప్రక్రియ. గతించిన గతానికి ఫ్యూడల్ వ్యవస్థకు చిహ్నం అని కొందరు తలంచగా దుర్భాక రాజశేఖరకవి, గడియారం వేంకటశేషశాస్త్రి, పానమూమలై వరదాచార్యులు వస్తువులో నవ్యతను, భావాల్లో ఆధునికతను ఆధునిక సామాజిక బాధ్యతను ప్రదర్శిస్తూ మహాకావ్యరచనలు చేసారు. పద్యరచనను చేపట్టి వస్తునవ్యతతో జాషువా తుమ్మల సీతారామమూర్తి కరుణశ్రీ,ఇంద్రగంటి ఖండకావ్యాలు వ్రాసారు. 1967లో "చేతనావర్తకవులు" పేరున్న పేర్వారం జగన్నాథం, కోవెల సంపత్కుమార, కోవెల సుప్రసన్న, నరసింహారెడ్డి అనే నలుగురు కవుల్లో నవ్యసంప్రదాయ ఛాయలున్నాయి. నవ్యసంప్రదాయంలో చెళ్ళూరి శ్రీనివాసరావు "వివేకానంద చరిత్ర" వఝల కాళిదాసు "ఆంధ్రమహావిష్ణువు" (ద్విపద)లు చెప్పుకోదగినయి. దేవులపల్లి రామానుజ రావు, పల్లాదుర్గయ్య, ఉత్పల సత్యనారాయణచార్యులు బోయిభీమన్న మొ.న కవులెందలో నవ్య సంప్రదాయంలో ఎన్నదగిన కవులున్నారు. 20 వ శతాబ్దారంభంలో మహాకావ్యం అంతరించి పోయేప్రమాదం నుంచి సాహిత్యాన్ని రక్షించాలని "క్లాసిజం" ను పునరుజ్జీవింపజేయాలనే తపన కొందరు కవుల్లో కలిగింది.

నవ్య సంప్రదాయం విమర్శలో బాగా బలంగా కన్పిస్తున్నది. కట్టమంచి రామలింగారెడ్డి పాశ్చాత్యవిమర్శ పద్ధతులను ఆలోచనలను పదజాలాన్ని తెలుగు విమర్శలోకి తెచ్చి కాల్పనికవిమర్శకు ఆధునికవిమర్శకు పునాదులు వేసాడు. అయితే ఆయన ప్రాచీన భారతీయసంప్రదాయానికి చెందిన అలంకారాలు రసం ధ్వని మొదలయిన అంశాలను విమర్శించాడు. అది కొందరికి నచ్చ లేదు. భారతీయవిమర్శవా సూత్రాలు సిద్ధాంతాలు నిత్యనూతనమైనయి. మారుతున్న కవితాధోరణులకు ప్రక్రియలకు వాటిని ఇంకా ముందుకు తీసుకెళ్ళి అన్వయించవచ్చునని నవ్యసంప్రదాయవాదుల అభిప్రాయం. అటువంటి విమర్శలోను విశ్వనాథ ముందు నడిచాడు. అతని మార్గంలో కురుగంటి,జి.వి. కృష్ణారావు, వింజమూరి మొదలయిన విమర్శకులు నడిచారు.

ప్రపంచం భిన్నజాతులతో భాషాసంస్కృతులతో కూడింది. ఒక్కొక్కజాతికి దాని భౌగోళిక చారిత్రక నేపథ్యంలో దానికి స్వంతమైన జీవనతాత్త్వికత ఎదుగుతుంది.మార్క్స్ ఆర్థికశక్తి దాన్ని మార్చి వేస్తుందని ఏ ఎల్లలు లేని ప్రపంచమానవత సృష్టింపబడుతుందని చెప్పాడు. అతని ఊహలు కల్లలయినాయి. తూర్పు యూరోపు దేశాలు రష్యా 1980 దశకంలో భాషజాతి మతం ప్రాతిపదికగా చీలి పోయాయి. స్వతంత్ర రాజ్యలేర్పడినాయి. రష్యా సోషలిస్టు సామ్రాజ్యం కూలిపోయింది. 1990 దశకంలో ఆర్థికరంగంలో వచ్చిన ఓపెన్ మార్కెటులు, గ్లోబలైజేషన్, టెలికమ్యూనికేషన్ల అభివృద్ధితో భూగోళంలో సరిహద్దులు దగ్గరై దూరాలు అధిగమించడం వంటివి కూడా "జాతి" భావనను చంపలేకపోయాయి. ఏ విధంగాను విజాతీయ "డామినేషన్" ను ఒక జాతి అంగీకరించడం లేదు. అటువంటప్పుడు ఆధునికత పేరుతో ఇతరుల సిద్ధాంతాలను కవిత్వాలను దిగుమతి చేసుకుంటె ఆ జాతి మనుగడకే ముప్పు వస్తుంది. ప్రపంచ వ్యాప్తంగా ఒకే సారి ప్రసారం చేయబడుతున్న దూరదర్శన్ ప్రోగ్రాములు, సినిమాలు తమ జాతి సంస్కృతిని నాశనం చేస్తున్నాయని ఎన్నో దేశాల ప్రజలు ఎదిరిస్తున్నారు. ఆలోచన లేకుండా సిద్ధాంతాలను భావజాలాన్ని దిగుమతి చేసుకుంటె జాతి సృజనాత్మకత నశిస్తుంది. భారతజాతి ప్రాచీనమైంది. దానికి ప్రాచీనమైన సాహిత్యం, విమర్శ సూత్రాలు అభివృద్ధి చెందాయి. విమర్శవిజ్ఞానంలో పాశ్చాత్యులు ప్రభావితమవుతుండగా వాళ్ల విమర్శ సూత్రాలను మనం దిగుమతి చేసుకుంటె జాతి ఆలోచనాసూత్రంలో "కంటిన్యుటీ" అనేది లేక జాతి మేధస్సు సృజనాత్మకత నశించే అవకాశముంది. కాబట్టి మన సంప్రదాయంలోని విమర్శ సూత్రాల కనుగుణంగా నూతన పద్ధతులను వికసింపజేసుకోవాలన్నది నవ్యసంప్రదాయవిమర్శ ముఖ్యోద్దేశం . ప్రాచీన భారతీయవిమర్శ సిద్ధాంతాలను ఆధునిక ఆర్థిక మనస్తత్త్వసామాజిక శాస్త్రాల ఆధారంగా ఇంకాముందుకు తీసుకెళ్ళి వికాసాన్ని కలిగించవచ్చును. అందులో దోషం లేదు. ప్రాచీనాచార్యులు

అట్లా సిద్ధాంతాలను వికసింపజేసారు కూడా. రసధ్వని అలంకారాల వంటి ప్రాచీనాచార్యుల సిద్ధాంతాల మీద అనురక్తితో సామాజికస్ప్ృహ మానవ తావాదంతో కూడిన నవ్యసంప్రదాయవిమర్శ సాగుతున్నది. అది ప్రగతికి విరుద్ధం కాదు. ఛాందసవాదం కాదు. వాళ్ళది జాతీయవాద దృక్పథం. తద్వారా విశ్వదృక్పథం. వాళ్ళ దృష్టిలో సాహిత్యం భౌతికఆధ్యాత్మిక స్థితు లకు వారధి. సమాజ దర్శనాన్ని మార్చే శక్తి సాహిత్యదర్శనానికుందని వాళ్ళంటారు. సమకాలిక పరిస్థితుల కతీతంగా ఆలోచించి భవిష్యద్దర్శనాన్ని చేయాలనే భారతీయ సాహిత్యదృక్పథమే వాళ్ళ దృక్పథం.

కవిత్వం రచనలు ఏవైనా భావకవిత్వం నుంచి విప్లవవాద స్త్రీవాద దళి తవాదాల కవిత్వం వరకు దేనినైనా సంప్రదాయ విమర్శనా దృష్టితో చూడ వచ్చునని నవ్యసంప్రదాయవాదులంటారు.రామాయణ కల్పవృక్షం నుంచి కొయ్యగుర్రం వరకు ఏదైనా మహాకావ్యమే. జాతికి స్వతఃసిద్ధంగా వుండే కళాసంస్కారంతో ఆవిష్కరించాలని వాళ్ళంటారు. కవిత్వంలో ఏ కొత్త ప్రయోగమైనా జాతి జీవనాడిని స్పందింపజేయాలన్నది వాళ్ళ ఆశయం. సాహిత్యసాంస్కృతిక సంరక్షణ భారం బాధ్యత విప్లవం హింస, హత్యలను మార్గంగా బోధించేవాళ్ళ మీదనేవుందనే భావజాలాన్ని వ్యతిరేకిస్తుంది నవ్య సంప్రదాయం.అది మరోప్రపంచానికి మరోమార్గం. లింగవివక్షత కులతత్త్వం తలెత్తిన నేపథ్యంలో ప్రగతివాదంతో కూడిన నవ్యసంప్రదాయం జాతి అభ్యుదయానికి చాలా అవసరం. నవ్యసంప్రదాయవిమర్శలో శేషేంద్రశర్మ, జి.వి. సుబ్రహ్మణ్యం, కోటేశ్వరరావు,కోవెల సుప్రసన్నాచార్య, కోవెల సంపత్కుమారాచార్య,యశోదారెడ్డి, ఎచ్.ఎస్.బ్రహ్మానంద, వడలి మందేశ్వ రరావు,కసిరెడ్డి పేర్లు బాగా వినిపిస్తున్నాయి. ముదిగొండ వీరభద్రయ్య "రావిశాస్త్రి ధర్మేతిహాసం" (మూడుకథలబంగారం నవల మీద విమర్శ) అనుమాండ్ల భూమయ్య "వేయిపడగలు-ఆధునికేతిహాసం", సుజాతారెడ్డి "నవల-రససిద్ధాంతం" వంటి విమర్శ గ్రంథాలు వ్యాసాలు చెప్పుకోదగినయి.

# విప్లవవాద సాహిత్యం

1956 నుంచి రష్యాలో కమ్యూనిస్టు పార్టీలో "రివిజం" ప్రవేశించింది. కమ్యూనిస్టు పార్టీలోని రివిజనిజాన్ని పెట్టుబడారీ మార్గానుయాయులను అంతమొందించాలనే ఉద్దేశంతో చైనాలో 1966 లో శ్రామిక వర్గ సాంస్కృతిక విప్లవం వచ్చింది. అసలు 1949 నుంచే చైనాలో సోషలిస్టు ఆర్థికవిధానాన్ని సాధించే ప్రయత్నాలు జరుగుతూ వున్నాయి. ఆ ప్రయత్నాలే క్రమంగా 1966 లో కార్మికవర్గానికి రాజ్యాంగయంత్రం మీద అధికారం ఏర్పడి విప్లవం సంపూర్ణమైంది. ఆ సమయంలోనే భారతదేశంలో రివిజనిస్టు మార్గంలో పార్లమెంటరీ పంథాలో పడిపోయిన కమ్యూనిస్టుపార్టీ నుంచి విప్లవశక్తులు వేరయిపోయి నక్సల్బరీ శ్రీకాకుళోద్యమాలు లేచాయి. 1967 లో పశ్చిమ బెంగాల్‌లోని డార్జిలింగు జిల్లాలోని సిలిగుడి డివిజన్‌లోని నక్సల్బరీ గ్రామంలో రైతులు సాయుధులై భూస్వాముల భూములను ఆక్రమించుకొన్నారు. అప్పులను రద్దుచేస్తూ దళాలుగా సంఘటితమై పోరాడారు. మేధావివర్గం, విద్యార్థులు కూడా ఈ పోరాటానికి మద్దతును ప్రకటించారు.కలకత్తా కలాశాల విద్యార్థులు ఈ పోరాటాన్ని సమర్థించారు. కమ్యూనిస్టు పార్టీలో చీలికవచ్చి సాయుధపోరాటాన్ని సమర్థించే మార్క్సిస్టు లెనినిస్టు పార్టీ అనుయాయులు నక్సల్బరీ రైతుల సాయుధ పోరాటాన్ని ఇతర ప్రాంతాలకు కూడా వ్యాపింప జేసారు.

భారతదేశంలో స్వాతంత్ర్యానంతరం అభివృద్ధి అంతగా జరుగకపోగా 1960-67 లో పారిశ్రామికరంగంలో స్తబ్దత ఏర్పడింది. ఆర్థికంగా సంక్షోభం ద్రవ్యోల్బణం ఏర్పడింది. అమెరికా తన పెట్టుబడులతో అప్పులరూపంగాను మన దేశంలోకి ప్రవేశించింది. వలససామ్రాజ్యవాదం స్థానంలో కొత్త సామ్రాజ్యవాదం ప్రారంభమైంది. ప్రపంచబ్యాంకు అప్పులతో దేశం దేశప్రయోజనాలకు విరుద్ధమైన చర్యలకు పూనుకుంది. ఈ పరిస్థితుల్లో విద్యార్థుల్లో నిరుద్యోగులైన యువకుల్లో అశాంతి ప్రవేశించింది విద్యార్థుల ఆందోళనలు పెరిగాయి. ఆ తరుణంలో నక్సల్బరీ సాయుధ పోరాటం

వాళ్ళ నాకర్షించింది. ఎంతో మంది యువకులు తమ ఉన్నత విద్యలను విడిచిపెట్టి పోరాటంలో చేరి పోయారు. 1969 ఏప్రిల్ 22 వ తేదినాడు లెనిన్ జయంతి రోజు మార్క్సిస్టు లెనినిస్టు పార్టీ అవతరించింది. భూస్వాముల పెట్టుబడిదారుల చేతుల్లో రాజ్యాధికారముందని దున్నేవానికే భూమి కావాలని, వ్యవసాయవిప్లవం ప్రజావిప్లవం రావాలని, దీర్ఘకాలిక సాయుధ పోరాటంతో అది సాధింప బడుతుందని పార్టీ తీర్మానం జరిగింది. 1970 మే నెలలో కలకత్తాలో జరిగిన పార్టీ సమావేశంలో ఆంధ్రప్రదేశ్ నుంచి కొందరు వ్యక్తులు పాల్గొన్నారు. ఆ వ్యక్తుల్లో వెంపటాపు సత్యనారాయణ, ఆదిభట్ల కైలాసం, మల్లికార్జునుడనే వాళ్ళు శ్రీకాకుళ పోరాటానికి నాయకత్వం వహించారు.

నక్సల్బరీ గ్రామంలో ప్రారంభమైన సాయుధ పోరాటం బీహార్, మధ్య ప్రదేశ్, ఆంధ్రప్రదేశ్, కేరళ, పంజాబ్ మొదలైన రాష్ట్రాలకు వ్యాపించింది. 1967 లో ఆంధ్రప్రదేశ్‌లో సాయుధ విప్లవం శ్రీకాకుళంజిల్లాలోని పార్వతీ పురం ఏజన్సీప్రాంతాల్లో ప్రారంభమైంది. 1968 లో సాయుధవిప్లవం గెరిల్లా యుద్ధతంత్రాలతో ఇతర ప్రాంతాలకు కూడా వ్యాపించింది. ప్రభుత్వం సాయుధవిప్లవం జరిగే ప్రాంతాలను కల్లోలిత ప్రాంతాలుగా ప్రకటించి ఉద్యమాన్ని అణచివేయడానికి పూనుకుంది.

నక్సల్బరి శ్రీకాకుళపోరాటం తెలంగాణాలోని గిరిజన ప్రాంతాలైన ఆదిలాబాదులో ప్రవేశించి క్రమంగా కరీంనగర్, నిజామాబాదు, వరంగల్ మొదలైన ఉత్తర తెలంగాణాప్రాంతాలకు పాకింది. నిజాంకాలంలో తెలంగాణా సాయుధ పోరాటాన్ని కమ్యూనిస్టు పార్టీ నడిపింది. 1948 సెప్టెంబరులో పోలీసుచర్యతో ఆ పోరాటం విరమించబడడం సమర్థించని వాళ్ళు అసంతృప్తిచెందిన వర్గం నక్సల్బరీ పోరాటాన్ని సమర్థించి సాయుధ పోరాటాన్ని కొనసాగించారు. పార్లమెంటు పంథాను ఛేదించాలనే ఉద్దేశంలో సాయుధ పోరాటంతో రాజ్యాధికారాన్ని చేజిక్కించుకోవాలనే లక్ష్యంలో నక్సల్బరీ పోరాటం మావో ఆలోచనా విధానాన్ని అనుసరించింది. నక్సల్బరీ శ్రీకాకుళఉద్యమం స్ఫూర్తితో తెలుగులో విప్లవకవిత్వం వెలువడింది.

1968 లో శ్రీకాకుళ ఉద్యమం ప్రారంభం నుంచి 1977 లో అత్యవసర పరిస్థితి ఎత్తేసేంత వరకు ఒక దశగా అత్యవసర పరిస్థితి ఎత్తేసింతర్వాత నుంచి చైనాలో మావో మరణం వరకు రెండోదశగా చెప్పవచ్చును. విప్లవ కవులు చాలామంది సాయుధ పోరాటంలో స్వయంగా పాల్గొన్నవాళ్లు.

సోషలిస్టు విప్లవగమ్యానికి ప్రజాపోరాటానికి సాయుధ మార్గాన్ని ఎన్నుకున్న రచయితలు మార్క్స్ లెనిన్ మావోల ఆలోచనల మీది విశ్వాసంతో విప్లవరచయితల సంఘం-విరసం-పేరుతో హైద్రాబాదులో 1970 జులై 4వ తేదిన సంఘటితమైనారు. మార్క్సిస్టు సిద్ధాంతాలను విశ్వసించిన అభ్యుదయ రచయితలు క్రమంగా ఆ మార్గానికి దూరమై ప్రభుత్వాన్ని పొగిడేవాళ్ళుగా మారారని విరసంవాళ్ళు తమ అసంతృప్తి వెలిబుచ్చారు. అభ్యుదయ కవులు రచయితలు మార్క్సిజంపట్ల తమ అభిమానాన్ని బాహాటంగా చాటలేదని విప్లవకవులు రచయితలు అంటారు. 1943 లో అభ్యుదయ రచయితల సంఘం-అరసం-ఏర్పడి నప్పుడు తమది రాజకీయసంఘం కాదు కాని రాజకీయాలను స్పృశించడం మహాపరాధంగా భావించమని అన్నారు. సాహిత్యం రాజకీయాలు వేరుకావని విరసంవాళ్ళు చాటారు. సాహితీవేత్తలు అంతఃపురాల్లో కాక ఆచరణలో వుండాలని అన్నారు. చాలా మంది అరసం కవులు పార్టీతో సంబంధం లేకుండా వ్రాసిన వాళ్ళే అని అరసంను విమర్శించారు. క్రమంగా ఏకాస్తో కూస్తో అభ్యుదయ భావాలున్న వాళ్ళంతా అభ్యుదయరచయితలుగా చలామణి అయ్యారని విరసం అరసంవాళ్ళను నిరసించింది. ప్రపంచశాంతి, అంతర్జాతీయ సంఘటన, సర్వతోముఖమైన జాతీయాభివృద్ధి, కార్మికుల శ్రేయస్సు, సమానత సాధన, సోషలిస్టు సమాజస్థాపన, మానవతా దృక్పథం, హేతువాదం, సాంఘిక ప్రయోజనంగల కళల అభివృద్ధి, సాంఘిక సామరస్యం, జీవకారుణ్యం-మొదలైనయి అరసం ఆశయాలు. ఆ ఆశయాలు బాగానే వున్నాయి కాని మహత్తరమైన మరో వ్యవస్థను ఏర్పరిచేయి కావని సాయుధ పోరాటమే మరోప్రపంచానికి చేరుస్తుంతని విరసం ప్రకటించింది. పార్లమెంటులాంటి సంస్థలు బూర్జువావ్యవస్థను నిలబెట్టే మాయోపకరణాలని దాన్ని

కూలదోస్తేనే మార్పు వస్తుందని విరసంవాళ్ళంటారు. అందుచేత వాళ్ళు బాహాటంగా విప్లవాన్ని తమ లక్ష్యంగా ప్రకటించారు. సాహిత్యంకూడా విప్లవాన్ని చిత్రించాలని విప్లవానికి తోడ్పడాలని వాళ్ళంటారు. సాహిత్యం జీవితాన్ని నిర్వచించేది కాక అస్తవ్యస్తమైన జీవితాలను సమాజాన్ని మార్చేదిగా వుండాలని విరసం ఆశయం. అరసం కాలంతోపాటు నడువలేక వెనుకబడి పోయిందని అరసంవాళ్ళకు సోషలిస్టు భావస్పర్శ లేదని విరసం ఆరోపణం అరసం పాలకవర్గాన్ని ఎదుర్కొలేదు. స్వాతంత్రపోరాటం తెలంగాణా విమోచనోద్యమం కాలంలో అభ్యుదయ రచయితలు ఉచ్ఛస్థితిలో వున్నారు. 1952 ఎన్నికల్లో కమ్యూనిస్టు పార్టీ గెలుపు అరసంకు గౌరవప్రతిష్ఠలను తెచ్చింది. అదే 1955 నాటి ఎన్నికల్లో పార్టీ ఓటమితో అరసం క్షీణదశ ఆరంభమైందనిచెప్పాలి. శ్రీశ్రీ వంటి వాళ్ళు అభ్యుదయ రచయితలు సినిమాల నాశ్రయించడంతో అరసం నిర్వీర్యమైంది. 1970 వరకు అరసం మానవతా వాదం, దిగంబర కవిత్వం రూపాలతో కొనసాగింది. 1970 లో విరసం శ్రీశ్రీ అధ్యక్షతలో అవతరించింది. విరసంకు కూడా యుగ ఆరంభకుడు యుగనాయకుడు, యుగకర్త శ్రీశ్రీయే అయినాడు.

1943 లో ఆంధ్రదేశంలో అరసం ఏర్పడినప్పుడు అందులోని కవులకు రచయితలకు మార్క్సిస్టు అవగాహన, నిర్మాణక్రమం, కార్యాచరణ లేదని అవగాహన చైతన్యదృక్పథం లేకుండానే ఎంతో మంది అరసంలోకి రావడం జరిగిందని అరసం పేరులోనే అభ్యుదయం వుంది కాని పీడిత వర్గదృక్పథం లేదని అట్టడుగు వర్గాన్ని అంతగా పట్టించుకోలేదని అరసం విమర్శకు గురయింది. మధ్యతరగతి దృక్పథం అరసంలో బాగా చోటు చేసుకుందని చైతన్యం భౌతికశక్తిగా మారి ఆచరణరూపాన్ని అరసం పొందలేదని విరసం విమర్శించింది. 1970 లో విరసం విశాఖపట్టణం లో జరిగిన శ్రీశ్రీ షష్ఠిపూర్తి సభలో విశాఖవిద్యార్థులు "రచయితలకు సవాల్" పేరుతోపంచిన కరపత్రంతో పుట్టిందని చెప్పాలి. "శ్రీకాకుళ విప్లవపోరాటంలో వీరమరణం చెందిన సుబ్బారావుపాణిగ్రాహిలా సాహిత్యం జీవితాన్ని మార్చే శక్తిగా మీరెందుకు చెయ్యలేదు " అని ఆ కరపత్రం అభ్యుదయ రచయితలను

ప్రశ్నించింది. ఆ కరపత్రం 'సాహితీవేత్తల్లో ఒక పెద్ద సంచలనాన్ని సృష్టించింది. శాంతితో మరో ప్రపంచాన్ని సృష్టించలేము సాయుధ పోరాటం కొత్తవ్యవస్థను సృష్టిస్తుందని కరపత్రం చాటింది. దాంతో శ్రీశ్రీ అరసం సభను బహిష్కరించి విరసంకు 1970 జులై 4 వ తేదినాడు శ్రీకారం చుట్టాడు. విప్లవకవులకు నాయకుడయ్యాడు. 1970 జులై 4,5 తేదీల్లో అభ్యుదయ సాహిత్యసదస్సు నిర్వహించడానికి నిర్ణయమైంది. అదే విరసం ఆవిర్భావానికి ముహూర్తమైంది. దానిలో కొకు, రావిశాస్త్రి, కారా, కె.వి.ఆర్ మొ.న వాళ్ళు చేరారు. సాహితీమిత్రులు నడిపే "సృజన" పత్రిక విరసంవాణిగా మారింది. ప్రభంజనం, అరుణతార, జీవనాడి పిలుపు, విద్యుల్లత వంటి పత్రికలు విరసంకు ప్రచారసాధనాలయ్యాయి. జననాట్యమండలి అరుణోదయ వంటి సంస్థలు అండగా నిలిచాయి. 1970 అక్టోబరులో విరసం మొదటి మహాసభలు ఖమ్మంలో జరిగాయి. 1996 జనవరిలో విరసం నాల్గవ మహాసభలు హైద్రాబాదులో జరిగాయి. దళితవాదులు స్త్రీవాదులు ఆ సభలకు హాజరుకాలేదు."సాహిత్యం ఒక ఆయుధవిశేషం.సమగ్రమైన మానవస్వాతంత్ర్యం వైపే విప్లవ సాహిత్యం జరిపే మహాప్రస్థానం" అని ప్రథమమహాసభల్లో విరసం తన పంథాను చాటింది. శ్రీశ్రీ సాయుధపోరాటాన్ని సమర్థిస్తూ విరసంకు అధ్యక్షుడయ్యాడు. "సాయుధ విప్లవబీభత్సుని సారథినై భారత కురుక్షేత్రంలో నవయుగ భగవద్గీతా ఝుంఝుని ప్రసరిస్తాను" అని శ్రీశ్రీ తన దీక్షను ప్రకటించి విప్లవసాహిత్యయుగకర్త అయ్యాడు. విరసం కవులకు రచయితలకు మార్క్సిజం- లెనినిజం ఆదర్శం. మావో ఆలోచనావిధానం ఆచరణీయం. చైనాలో మావో "లాంగ్‌మార్చ్" పేరుతో నడిపిన విప్లవపోరాటం వీళ్లకు ధ్యేయమైంది. మావో నడిపిన "లాంగ్ మార్చ్" లాగానే భారత దేశంలో విప్లవం దీర్ఘకాలికమైన సాయుధ పోరాటం వల్ల సిద్ధిస్తుందని వీళ్ళ నమ్మకం. ఎన్నికలు, సంస్కరణల వల్ల మరోప్రపంచం రాదని వీళ్ళ విశ్వాసం. దోపిడి నుంచి విముక్తిని కలిగించే మార్గం విప్లవమార్గమని వీళ్ళు నమ్ముతారు. ఏ తిరుగుబాటునైనా సమర్థిస్తారు. క్యూబాలో ఫిడెల్ కాస్ట్రో నాయకత్వంలో విప్లవపోరాటం విజయవంతం కావడం వీళ్ళకు ధైర్యాన్నిచ్చింది. అర్జంటీనాలోని గెరిల్లా

పోరాటం వీళ్ళకు ఆవేశాన్నిచ్చింది. జాతీయం కన్నా అంతర్జాతీయం మీద వీళ్ళకు దృష్టి ఎక్కువ.

1950 దశకంలో మానవ హక్కుల ప్రకటన నెహ్రూ పంచవర్ష ప్రణాళికలు పంచశీలల మీద నమ్మకం పెట్టుకున్న కవుల రచనలు విప్లవరచయితలకు నిస్తబ్దతగా కన్పించాయి. శాంతికాముకత యుద్ధ విముఖతలను వీళ్ళు తిరోగమనంగా భావించారు. భావకవులు ప్రేమ సౌందర్యం, గోపికాఅన్వేషణ, గోపికావిరహం గడ్డిపోచ అందాలను వస్తువుగా చేసుకున్నారు. అభ్యున్నతి సమానతలను అభ్యుదయ కవులు కాంక్షించినా రావలసిన చైతన్యాన్ని వాళ్ళు తేలేక పోయారు. భావకవిత్వం మత్తువదిలినా అభ్యుదయకవులు రెండవదశలో మధ్యతరగతి మీద సానుభూతి చూపుతూ కవిత్వం వ్రాసారు. అట్టడుగు వర్గాలను వాళ్ళను వదిలేసారు. విప్లవం సాయుధ పోరాటం రక్తపాతం-ఇవే దోపిడీని పీడనను దౌర్జన్యాన్ని బానిసత్వాన్ని అసమానతలను నశింపజేస్తాయని విప్లవ రచయితలు విశ్వసించారు. విప్లవ కవిత్వానికి ఆద్యులుగా చెప్పదగినవాళ్ళు సుబ్బారావు పాణిగ్రాహి, వెంపటాపు సత్యం. వాళ్లు విప్లవాన్ని ప్రబోధిస్తూ పాటలు వ్రాసారు. ఆ తర్వాత శివసాగర్, చెరబండరాజు, శ్రీశ్రీ, కె.వి.ఆర్, గద్దరు, వంగపండు ప్రసాదరావు, నగ్నముని, జ్వాలాముఖి, కె.శివారెడ్డి, వరవరరావు, నిఖిలేశ్వర్ విప్లవకవులు వ్రాసిన పాటలు పల్లెపల్లెలకు వ్యాపించాయి. సుబ్బారావు పాణిగ్రాహి "కష్టజీవులం మేము కమ్యూనిస్టులం ఔనన్నా కాదన్నా అదే ఇష్టులం" అని వ్రాసిన "మార్చింగ్ సాంగ్" చాల ప్రచారాన్నందుకుంది. విప్లవ సిద్ధాంతాలను ఆశయాలను పాణిగ్రాహి సరళమైన మాటల్లో పాటగా వ్రాసాడు. శివుడు, శివసాగర్, రెంజిమ్ మొదలయిన పేర్లతో కె.జి.సత్యమూర్తి కవిత్వం వ్రాసాడు. జానపద రీతుల్లో ఆయన పాటలు వ్రాసి విప్లవభావాలను ప్రచారం చేసాడు. ఆయన కూడా పాణిగ్రాహి లాగానే స్వయంగా గిరిజన పోరాటంలో పాల్గొన్న కవి. "నా చెల్లీ చెంద్రమ్మ, తోటరాముడు, ఏటి కెదురీదు వాళ్ళమురా" మొదలయిన ఆకవి పాటలు ప్రసిద్ధమైనయి. "నర్రెంకచెట్టు కింద నరుడో భాస్కరుడా" అనే శివసాగర్

పాటతో విప్లవగేయాలకు శ్రీకారం చుట్టబడిందంటారు. ఈ పాటను శివసాగర్ విప్లవవీరుడు చాగంటి భాస్కర్ మీద వ్రాసాడు. శివసాగర్ కవితలు "ఉద్యమం, నెలబాలుడు" పేర్లతో సంపుటాలుగా వచ్చాయి.

విప్లవకవుల మొదటి కవితాసంకలనం "ఝంఝ" విరసం మొదటి మహాసభలనాటికే వచ్చింది. ఇది శ్రీకాకుళ గిరిజనోద్యమంలో మరణించిన సుబ్బారావు పాణిగ్రాహి స్మృతికి అంకితమియ్యబడింది. దీనిలో శ్రీకాకుళం సాయుధ పోరాటంలో మరణించిన నక్సలైట్ నాయకుల మీద వ్రాసిన స్మృతిగేయాలు వున్నాయి. ఆతర్వాత "మార్చ్,లే" అనే కవితాసంపుటాలు వెలువడినాయి. వాటిని ప్రభుత్వం దేశద్రోహకరమని నిషేధించింది. దానిలోని కవితలు యువకులను విప్లవకవిత్వంవైపు ఆకర్షింపజేసాయి. అన్యాయాలను ఎదిరిస్తూ సాయుధపోరాటాన్ని సమర్థిస్తూ యువకులు ఆవేశంతో కూడిన కవితలు వ్రాసారు.

విరసంకు అధ్యక్షత వహించింతర్వాత శ్రీశ్రీ జట్కావాలా, భూమ్యాకాశాలు, తుది పయనం, తొలివిజయం మొదలయిన విప్లవగీతాలు రచించాడు. "తెల్లవాడు నిన్ను నాడు భగత్సింగు అన్నాడు.

నల్లవాడు నువ్వు నేడు నక్సలైటువన్నాడు. ఎల్లవారు నిన్ను రేపు వేగుజుక్క అంటారు." అని శ్రీశ్రీ "ఊగరా ఊగరా ఉరికొయ్య అందుకొని ఊగరా" అనే గేయంలో అన్నాడు. చెరబండరాజు "దిక్సూచి, ముట్టడి, గమ్యం, పల్లవి ఊరుమేలుకుంది, గౌరమ్మకలలు, శాంతి యుద్ధం" మొదలయిన కవితాసంపుటాలు రచించాడు. చెరబండరాజు వలెనే దిగంబరకవుల్లో ఒకడైన నగ్నముని "తూర్పుగాలి, కొయ్యగుర్రం" కావ్యాలను ప్రచురించాడు. ప్రభుత్వ వ్యవస్థ కొయ్యగుర్రం వంటిదని చెప్తూ నగ్నముని "కొయ్యగుర్రం" కావ్యాన్ని రచించాడు. కొయ్యగుర్రం ఆధునిక "మహాకావ్య"మని పీఠికలో చేకూరి రామారావు (చేరా) అన్నాడు.జైలు జీవితాన్ని అనుభవించిన విరసంకవి కెవి ఆర్ "జైలు కోకిల" జైలులో వుండగా వ్రాసిన కవితలు. చిలీదేశపు కవి పాబ్లో నెరూడా మరణిచినప్పుడు కెవి ఆర్ వ్రాసిన

స్మృతి గీతం ప్రసిద్ధమైంది. వంగపండు ప్రసాదరావు విశాఖ శ్రీకాకుళం మాండలికంలో విప్లవ గీతాలు రచించాడు. "ఏరువాక, పాలి కేక " ఆయన గేయసంపుటాలు. "ఏం పిల్లో ఎల్ద మొత్తవా,శ్రీకాకుళములో సీఁవ కొండకీ, సిలకలు కత్తులు దులుపరిత్తయట, ఏంపిల్లో ఎల్ద మొత్తవా" అనే ఆయన పాట చాల ప్రచారాన్నందుకుంది. గద్దరు "రాజకీయ వీధిబాగోతం" ప్రచారం పొందిన రూపకం. తెలంగాణ మాండలికంలో ఆయన వ్రాసిన పాటలు ప్రజల్లో వ్యాపించాయి. అభినయంతో, గొంగడి గజ్జెలవేషంతో ఆయన పాడే పాటలు ప్రజలను బాగా ఆకర్షించాయి. ఉత్తేజ పరిచాయి. గద్దరు ఆధ్వర్యంలో జననాట్యమండలి రాష్ట్రమంతా పర్యటించి అనేక ప్రదర్శనలిచ్చింది. విప్లవభావాలతో కె.శివారెడ్డి "రక్తం, సూర్యుడు, ఆసుపత్రి గీతం" మొదలయిన అనేక కవితాసంపుటాలు ప్రచురించాడు. వరవరరావు తిరుగబడుకవుల్లో ఒకడుగా వుండి విరసంలో చేరి జైలు కెళ్లాడు. "శిశిరోషస్సు,జీవనాడి, స్వేచ్ఛ" కావ్యసంపుటాలుగా అతని కవితలు వచ్చాయి. వరవరరావు "సృజన" కు సంపాదకుడుగా పని చేసాడు.

విరసం కవులతో గేయం పాడుకోడానికి వీలైన పాటగా ప్రచారంలోకి వచ్చింది. తమ భావాలు సిద్ధాంతాలు ప్రజల వరకు చేరాలంటే సరళమైన భాష, పాట అనువైనవని విప్లవకవులు గుర్తించి ఆవిధంగానే వ్రాసారు. ప్రాచీన శివకవులు కూడా ఇదేవిధంగా తమ మతప్రచారానికి జానుతెనుగును, ద్విపదలను చేపట్టారు. ఎంతోమంది భక్తతత్త్వ కవులు తమ భావాలను ప్రజలకు చెప్పడానికి గేయాలను పాటలను మాధ్యంగా తీసుకున్నారు. ఆ మార్గంలోనే విరసం కవులు పాటను తూటాలాగా మార్చుకొని వ్రాసారు. స్వాతంత్ర్య పోరాటం సమయంలో తెలంగాణా పోరాటం కాలంలో చాలావరకు పాట ప్రధాన పాత్రవహించింది. ఉద్యమాలతో పుట్టిపెరిగిన పాట నక్సల్బరీ ఉద్యమం కాలంలో బాగా ఆదరణను సంపాదించుకుంది.విప్లవకవులు మాత్రాఛందస్సులనుగాని వచనకవిత్వాన్ని గాని వాడలేదు. భావకవుల, అభ్యుదయకవుల మార్గానికి భిన్నంగా ఈ కవులు పాడుకోడానికి వీలైన జానపదుల బాణీల్లో వుండే పాటను గేయాన్ని

ప్రయోగించారు. సుబ్బారావు పాణిగ్రాహి,వంగపండు, గద్దరు వంటి కవుల పాటలు జానపదుల బాణీలో భాషలో వుండి అతి ప్రచారాన్నందుకున్నాయి. గద్దరు శ్రీకాకుళం నుంచి ఉత్తర తెలంగాణం వరకు పయనించి పాటలు వ్రాసాడు. వ్రాయడమేగాక అతనికి మంచి పాడే గొంతు వుంది. జానపదు లబాణీలో పాడే అతని పాటలను చాలామంది అనుకరించారు కూడా. కె.వి. ఆర్ కవిగానే కాక వ్యాసకర్తగా విమర్శకుడుగా పేరుపొందాడు. కాళీపట్నం రామారావు, రావిశాస్త్రి విప్లవభావాలుగల కథానికలు నవలలు రచించారు. కాళీపట్నం రామారావు (కారా) "యజ్ఞం" మొదలయిన కథలు ప్రసిద్ధ మైనయి. రావిశాస్త్రి "ఇల్లు" నవల నక్సలైటుల ఆవిర్భావాన్ని చిత్రిస్తున్నది. "గోవులొస్తున్నాయి జాగ్రత" లో తిరుగుబాటును చిత్రించాడు.కేశవరెడ్డి "ఇన్‌క్రెడిబుల్ గాడెస్, స్మశానం దున్నేరు" నవలలు భూస్వాముల దోపిడీని గ్రామీణ ప్రజల సంఘర్షణను చిత్రిస్తున్నాయి. అల్లం రాజయ్య సాహూలు రచించిన "కొమురం భీము" నవల గోండుజనుల ఉద్యమాన్ని చిత్రిస్తున్నది. వసంతరావు దేశపాండే "అడవి", సాధన "సరిహద్దు", పులి ఆనందమోహన్ "వసంతగీతం" ఉద్యమస్ఫూర్తితో వ్రాసిన నవలలు. సాహు విప్లవ వీరుడే కాక కథలు పాటలు వ్యాసాల్లో ఆదివాసుల పోరాటాలను గురించి వ్రాసాడు. బోయ జంగయ్య కాలువ మల్లయ్యల కథలు కూడా విప్లవ చైతన్యాన్ని చిత్రిస్తున్నాయి. సృజనాత్మక ప్రక్రియలన్నిటిలోను విప్లవ ఉద్యమ చైతన్యం విశ్లేషింపబడింది. ప్రబోధింపబడింది. విప్లవ రచయితల వ్యాసాలు, సాహిత్యవిమర్శలు భావతీవ్రతతో తెలుగునుడికారంతో చక్కని వచనశైలి వికాసానికి దోహదం చేసాయి.

విప్లవసాహిత్యం ప్రధానలక్ష్యం విప్లవచైతన్యప్రబోధం. విప్లవ చైతన్యంతో వ్యక్తిని పోరాటానికి ఉన్ముఖున్ని చేయడం విప్లవరచయితల లక్ష్యం. సమకాలిక సమాజాన్ని విశ్లేషించి దానిలోని కుళ్ళును మూలకారణాలను అర్థం చేసుకొని వ్యవస్థను మార్చడం వాళ్ల ధ్యేయం. పార్లమెంటరీ ప్రజాస్వామ్యం పేరుతో భూస్వాముల నియంతృత్వం సాగుతున్నదని విప్లవ రచయితలంటారు. భూస్వాముల శ్రమదోపిడిని ఆడవాళ్ళ మానభంగాలను

దౌర్జన్యాలను తమ సాహిత్యంలో చిత్రించి ప్రజాసామాన్యంలో చైతన్యం తేవాలని చూసారు.

"ఈ దొంగల రాజ్యాంగం/రచనే ఒక కుట్ర అనీ
శ్రమ జీవుల శ్వాసలతో/ పాడుతాం పాడుతాం"

అంటాడు చెరబండరాజు. "సోషలిజం సామ్రాజ్యవాదం ముద్దుపేరని, ఆగస్టు 15 రాకపోతే, మాకు అర్థమయ్యేదే కాదు"- అంటాడు వరవరరావు.

"పాపాలకు మేలిముసుగు / పార్లమెంటు అసెంబ్లీలు
మోసానికి మారుపేరు / దగా కోరు ఎలక్షన్లు"-

అని విప్లవకవులు అభిప్రాయం. మతంలోని కర్మసిద్ధాంతం పూర్వజన్మలు వర్ణాశ్రమ ధర్మాల పేరుతో భూస్వాములుదోపిడీని కొనసాగించారు. దున్నేవాడిదే భూమి కావాలి.

"విద్రోహుల మట్టుపెట్టి రైఫిళ్ళను చేతబట్టి,
ఎర్రసేన నిర్మించదగ్గ ఎర్రప్రాంతమేర్పరచగ,
అన్నలతో చేయి కలిపి నేల తల్లి చెరను విడిపించగ
రావాలోయోతమ్ముడా జాగేలోయ్‌తమ్ముడా ? " - అని శివసాగర్

పోరాటానికి ఉత్తేజాన్ని కలిగిస్తూపిలుపునిచ్చాడు. విప్లవ పోరాటంలో మరణించిన విప్లవవీరుల సంస్మరణ కవిత్వాన్ని పోరాటం ఉద్దీప్తి కోసం విప్లవకవులు చాలా వ్రాసారు. కమ్యూనిస్టు పార్టీలో ప్రవేశించిన రివిజనిజమే తెలంగాణా సాయుధ రైతాంగపోరాటం విరమణకు కారణమని విరసం భావించింది. అందుకే విరసం కవులు రివిజనిజంను నిందించారు -

జడత్వం జరీ అంచుచీర కట్టినవారు
ఆయుధం చేపట్టలేరు
విప్లవాన్ని ముస్తాబుచేసి

ఎన్నికల దొమ్మరి సంతలో అమ్ముకోనేర్చిన బేహారులు, బారికేడ్లు కట్టలేరు" అంటాడు శివసాగర్. రష్యాలో రవిజినజం ఏర్పడిన ప్రమాదాన్ని గుర్తించి మావో చైనాలో సాంస్కృతిక విప్లవానికి పిలుపునిచ్చాడు. రష్యా సోషలిస్టు సామ్రాజ్యవాదంగా పరిణమించింది. అప్పుడు చైనా ప్రపంచ

విప్లవకేంద్రంగా ఉత్తేజాన్నిచ్చింది.

"ఓల్గా ఘనీభవించెను / యాంగ్సీనది పొంగెను" అని శివసాగర్ దీన్ని దృష్టిలో పెట్టుకునే అన్నాడు.

"అదనపు విలువల దొంగలు రాజ్య భవిష్యత్తును నిర్ణయించారు, మానవ జాతి భవితవ్యం సమస్తం, పిడికెడు మంది చేతుల్లో చిక్కిపోయింది....."

అంటాడు విప్లవకవి.

దిక్కుమొక్కులేని జనం/ ఒక్కొక్కరు అగ్నికణం
సింహకంఠనాదంతో/వస్తారిక కాచుకొండి

అని విప్లవకవి విప్లవశంఖారావం చేసాడు.

1996 జనవరిలో విరసం తన నాల్గవ మహాసభలు జరుపుకున్నా ఉత్తేజం ఊపుతగ్గిందనే చెప్పాలి. దానికి అంతర్జాతీయ జాతీయకారణాలున్నాయి. 1980 దశకంలో రష్యాలో వచ్చిన మార్పులు "రష్యాలో ప్రకటించబడిన "పెరస్ట్రోయికా". రష్యా సోషలిస్టు సామ్రాజ్యవాదానికి దోపిడీకి వ్యతిరేకంగా తూర్పు యూరపు దేశాల్లో ఉద్యమాలు లేవడంతో మార్క్సిస్టు మూల సిద్ధాంతాలనే ప్రశ్నించడం జరిగింది. పార్టీ పేరుతో నియంతృత్వాన్ని నడపడం సవాలు చేయబడింది. జాతిభేదాలతో తూర్పుయూరపు రష్యాలు చిన్న చిన్న దేశాలుగా విడిపోయాయి. మళ్ళీ జాతి భాషాభిమానాలు పడగలు విప్పాయి. పోలెండు మొదలయిన దేశాలెన్నో పెట్టుబడిదారీవిధానం ఫ్రీమార్కెటు వైపు మళ్ళాయి. జర్మనీ ఏకీకరణంతో జాతీయవాదం ప్రబలమైంది. బెర్లిన్ గోడ పగిలిపోవడం మార్క్సిజం దుర్బలతకు ప్రతీకగా నిలిచింది. ఆ తర్వాత చైనాలో మావో మరణం నక్సలైటు ఉద్యమానికి గొడ్డలిపెట్టు అయింది. చైనా పెట్టుబడిదారీ విధానం ఫ్రీమార్కెటువైపు మళ్ళింది. 1989లో బీజింగులోని తియానామెన్ స్క్వేయర్‌లో చైనా ప్రభుత్వం ప్రజాస్వామ్యాన్ని స్వేచ్ఛను అర్థించే విద్యార్థుల హత్యాకాండను జరిపి స్వేచ్ఛ ప్రజాస్వామ్యాల గొంతు నులమడానికి ప్రయత్నించినా

ఆర్థిక విధానాల్లో చైనా మార్క్సిస్టు దృక్పథం నుంచి దూరమౌతుందనడం మాత్రం జరుగుతున్న సత్యం.

నక్సలైటు ఉద్యమంలో సిద్ధాంతాల అవగాహన లేని వాళ్ళు ప్రవేశించారు. నాయకత్వంలో చీలికలు వచ్చి పార్టీ విడిపోయింది. మారుతున్న భూమి చట్టాలు, భూమి పంపకాలు మారుతున్న ఆర్థిక విధానాలు, యాంత్రికతతో పెరిగిన ఉత్పత్తులు, వస్తుసమృద్ధి, కన్‌ష్యూమరిజం, ఒకవైపు పేదరికం అట్లాగే వుండగా ఇన్‌ఫ్లేషన్‌తో పెరిగిన డబ్బు - నల్లధనం, పెరిగిన ఉద్యోగావకాశాలు మొదలయినవి మార్క్సు సిద్ధాంతాలను పుస్తకాలకే పరిమితం చేసాయి. అంతేగాక విప్లవకారులు వారి మద్దతుదారులు హింసను హత్యలను గుడ్డిగా సమర్థించడం, ముఠాతత్త్వాలు, పరస్పర అహంకార ప్రదర్శనలు, ఈర్ష్యాద్వేషాలు, ప్రతి అతివాదాన్ని మంచిదనడంతో విప్లవఉద్యమం ప్రజల సానుభూతిని కోల్పోతున్నది. ఈ విధమైన అంతర్జాతీయ జాతీయ తత్త్వాలు విప్లవఉద్యమాన్ని సాయుధపోరాటాన్ని బలహీన పరిచాయి. దాంతో విప్లవ సాహిత్యంతో క్షీణత ప్రవేశించింది. కాని విప్లవోద్యమం స్ఫూర్తితోనే ఆంధ్రదేశంలో స్త్రీవాద దళితవాదాలు ఊపునందుకున్నాయి. లింగవివక్ష స్పృహతో స్త్రీలు, కులవివక్ష స్పృహతో దళితులు ఉద్యమ మార్గంలో నడిచారు. సాహిత్య సృష్టి చేసారు. స్త్రీవాద దళితవాద ఉద్యమాలు 1960-70 దశకాల్లోనే ఇతర ఖండాల్లో ప్రాంతాల్లో ప్రబలంగా వున్నా, ఆంధ్రదేశంలో మాత్రం ఆ రెండు ఉద్యమాలు 1980 దశకంలోనే ప్రవేశించి సాహిత్యానికి స్ఫూర్తినిచ్చాయి.

## స్త్రీ వాద సాహిత్యం

ఇంగ్లీషులో "ఫెమినిజం" పదాన్ని తెలుగులో 'స్త్రీ వాదం' అని అనువాదం చేసుకొని వాడుతున్నాం. ఫ్రెంచి విప్లవం తెచ్చిన వ్యక్తివాదం వ్యక్తి స్వేచ్ఛ సమానత సౌభ్రాతృత్వం భావాల నుంచి పీడిత జనాభ్యుదయం భాగంగా స్త్రీ అభ్యుదయ భావన పుట్టింది. రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత మానవ హక్కుల ప్రకటన స్త్రీ అభ్యుదయ భావానికి బీజాలు

వేసింది. స్త్రీ అభ్యుదయ విముక్తి పోరాటం అనేది యూరోపు అమెరికాల్లో ఓటుహక్కు కోసం పోరాడడంతో ప్రారంభమైంది.

ప్రాచీన సమాజాల్లో ఏ కొద్దిమందికో అధికారాలు ఆధిపత్యాలుండేయి. చాలా మంది కుటుంబంలోగాని సమాజంలోగాని దేశంలోగాని అణచివేతకు గురయ్యే వాళ్ళు. అట్లా అణచివేతకు గురయిన వాళ్ళల్లో జనాభాలో దాదాపు యాభైశాతం వుండే స్త్రీలు కూడా వున్నారు. స్త్రీలు కుటుంబం నడపడంలో వ్యవసాయం పనుల్లో పరిశ్రమలు వచ్చింతర్వాత పరిశ్రమల్లో శ్రమపడడం వాళ్ళ వంతుగా వుంది. శ్రమ పడ్డా వాళ్ళకు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలుగాని శ్రమ విలువను అనుభవించడంలో భాగంగాని లేవు. పాతి వ్రత్యం, త్యాగం, సహనం, శాంతం స్త్రీలకుండాలనే భావజాలం స్త్రీల అణచివేతకు తోడ్పడినాయి. భారతదేశంలో అనాదికాలం నుంచి స్త్రీలు సంపూర్ణ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు సుఖశాంతులు లేకుండానే వున్నారు. క్రమంగా బాల్య వివాహాలు, విధవల దుస్థితి, పునర్వివాహం హక్కుల్లేండా వుండడం, ఆస్తిహక్కు నుంచి వంచితురాలిని చేయడానికి పుట్టిన సతీసహగమనం వంటి దురాచారాలతో స్త్రీల పరిస్థితి అధ్వాన్నమైంది. రాజారామమోహనరాయల వంటి మత సంస్కరణవాదులు స్త్రీ జనోద్ధరణను చేపట్టారు. ఆంధ్రదేశంలో వీరేశలింగం, వేంకటరత్నం, ఉన్నవ మొదలయిన సంఘసంస్కర్తలు స్త్రీ అభ్యుదయానికి కృషి చేసారు. కేసరి గృహలక్ష్మి పత్రిక ద్వారా స్త్రీ అభ్యున్నతి స్త్రీ శరీరారోగ్యం గురించి కృషిచేసాడు. సంస్కరణలతో సాంస్కృతిక పునరుజ్జీవనంతో భారతదేశంలో స్త్రీ అభ్యుదయం స్త్రీవిముక్తికి ఉద్యమాలు ఆరంభమయ్యాయి. భారత స్వాతంత్ర ఉద్యమ కాలంలో గాంధీజీ పిలుపు నందుకొని ఎందరో స్త్రీలు పోరాటంలోకి దిగి పురుషులతో సమానంగా పని చేసారు. స్త్రీ అభ్యుదయ కార్యక్రమాలు స్వాతంత్ర్యోద్యమంలో భాగంగా జరిగాయి. దువ్వూరి సుబ్బమ్మ దుర్గాబాయి దేశముఖు వంటి సంఘసేవపరాయణలు స్వాతంత్ర్య యోద్ధలు స్త్రీలు ఆర్థికంగా నిలుదొక్కుకొని, దీనత్వం నుంచి బయటపడి వ్యక్తిత్వం స్వాతంత్ర్యం ఆత్మవిశ్వాసం సంపాదించుకోడానికి కృషిచేసారు.

స్వాతంత్ర్యానంతరం దేశంలో పీడితవర్గం ఉద్ధరింపబడుతుంది దారిద్ర్యనిర్మూలన జరుగుతున్న కల నిజం కాలేదు. అదేవిధంగా స్త్రీల అభ్యున్నతి అట్లాగే నిలిచి పోయింది. 1960-70 దశకంలో యూరోపులో ముఖ్యంగా ఫ్రాన్సు ఇంగ్లండు దేశాల్లో స్త్రీవిముక్తి ఉద్యమం ఒక సైద్ధాంతికతతో బయలు దేరింది. అదే "ఫెమినిజం" - స్త్రీవాదంగా పరిణమించి ప్రపంచదేశాలన్నిటిలోను క్రమంగా వ్యాపించింది. 1970లో కేట్ మిల్లెట్ "సెక్సువల్ పాలిటిక్స్"అనే పుస్తకంలో స్త్రీల అణచివేతకు పితృస్వామ్యం కారణమని తేల్చింది. 1972 లో జర్మయిన్ గ్రీయర్ వ్రాసిన "ద ఫిమేల్ యూనక్" లో వ్రాసిన స్త్రీవాదధోరణి అందరి కళ్ళను తెరిపించింది.తర్వాత స్త్రీ పురుషుల మధ్య అసమానతను "సెక్సు" పదంతో కాక "జండర్" పదంతో సూచించిడం జరుగుతున్నది. సామాజికశాస్త్రాల ఆధారంగా సెక్సును జండర్‌కు మధ్య స్పష్టమైన భేదం నిరూపించబడింది. సెక్సు అనే పదంకన్నా జండర్ పదం స్త్రీ ఆడతనాన్నే కాక స్త్రీ సంబంధి భావజాలాన్నంతా ప్రతిబింబిస్తున్నది. స్త్రీపురుషుల మధ్య అసమానతతో కూడిన సంబంధాలను లైంగికరాజకీయాలు అని మిల్లెట్ పేర్కొన్నది. షులామిత్ ఫైర్‌స్టోన్ "ది డయలెక్టిక్స్ ఆఫ్ సెక్స్" అనే పుస్తకం వ్రాసింది. మిల్లెట్, ఫైర్ స్టోన్‌లు సాంఘిక ఆర్థిక అణచివేతలతో పాటు పురుషాధిక్యత భావాన్ని ప్రతిపాదించారు. లైంగికతనుబట్టి పనివిభజన స్త్రీల ఇంటిపనుల శ్రమకు విలువకట్టకపోవడం వంటి సమస్యలను లేవదీసారు.

తెలుగు సాహిత్యంలో 1960-70 లో దశకంలో చాలా మంది స్త్రీలు నవలారచనలు చేసారు. వాళ్ళు ప్రేమ, పెళ్ళిళ్లు, వర్ణాంతర వివాహాలు వంటి ఇతివృత్తాలు తీసుకొని ఉబుసుపోకనవలల వంటివే చాలా వ్రాసారు. కాని ఆ తరుణంలో యూరోపులో తలెత్తిన స్త్రీవాదాన్ని పట్టించుకోలేదు. కొందరు నవలా రచయిత్రులు కులాంతర వివాహాలు, కట్నం సమస్యలు, కుటుంబసమస్యలు ఉమ్మడి కుటుంబాల్లోని బాధలు ఉద్యోగినులైన స్త్రీల కష్టాలను గురించి వ్రాసారు కాని స్త్రీ విడాకులు స్త్రీపురుషసంబంధాల్లో ఆధిక్యతా న్యూనతాభావాలను స్త్రీల ఆర్థిక సమస్యలను అణచి వేతలను

గురించి పట్టించుకోలేదు స్త్రీవాద ధోరణిని చిత్రిస్తూ తెలుగులో మొట్టమొదటి రచన రంగనాయకమ్మ "జానకివిముక్తి" అనేనవల 1978 లో వచ్చింది. స్త్రీ అణచివేతను స్వేచ్ఛారాహిత్యాన్ని పురుషాధిక్యతను రంగనాయకమ్మ ఈ నవలలో చిత్రించింది. ఈ నవలలో నాయిక జానకి తన అన్న చైతన్య సాహచర్యంతో భర్త అణచివేతను ప్రశ్నించి ఎదురు తిరిగే వ్యక్తిగా ఎదిగినట్లుగా రచయిత్రి చిత్రించింది.

స్త్రీసమస్య అంతా లైంగికమని ఫ్రాయిడ్ అంటాడు. స్త్రీసమస్య అంతా ఆర్థికమే అని ఏంగెల్స్ వాదం. స్త్రీకి పారిశ్రామికుడికి సమస్యల్లో భేదం లేదని సోషలిస్టులంటారు. సోషలిస్టు సమాజస్థాపన స్త్రీలసమస్యలను పరిష్కరిస్తుందని విశ్వసిస్తారు. స్త్రీ సమస్య లైంగికంగాని ఆర్థికంగాని కాదని మానవ వాస్తవికతలో ఒక భాగం కావాలని అప్పుడే స్త్రీ అణచివేత నశిస్తుందని సైమన్ డి బావురే అనే స్త్రీవాదిని అంటుంది. స్త్రీల సమస్యలను మానవవాస్తవికతతో మానవహక్కులసాధనతో ముడిపెట్టిన వాళ్ళున్నారు.

స్త్రీవాదంలో అనేక ధోరణులు ఏర్పడినాయి. అయినా స్త్రీవాద తాత్త్వికతలో ప్రధానంగా మూడు విధాలైన ధోరణులు కన్పిస్తున్నాయి- ఒకటి-లిబరల్ ఫెమినిజం. స్త్రీలకు పురుషులతో సమానమైన హక్కులు అవకాశాలు కావాలనడం. విద్య ఉద్యోగం రాజకీయ ఆర్థికరంగాల్లో స్త్రీలు పాల్గొనాలని వీళ్ళు కోరుతారు. స్త్రీ పురుషులు ఎవరి భాధ్యతలు వాళ్ళు నిర్వహిస్తూ సామరస్య ధోరణిలో జీవించాలన్నది వీళ్ళ వాదం. ఇక రెండోది-రాడికల్ ఫెమినిజమ్.వీళ్ళు స్త్రీలను ఒక ప్రత్యేక వర్గంగా భావిస్తారు. స్త్రీ అణచి వేతకు పితృస్వామ్యం మూలకారణమని అంటారు. స్త్రీలకు తమ శరీరాల మీద జీవితాల మీద మతం, రాజ్యం అధికారం చలాయిస్తాయి. పితృస్వామికసమాజం మతం రాజ్యాలను స్త్రీ అణచివేత కనుకూలంగా భావజాలాన్ని సృష్టించి తరతరాలుగా వ్యాపింపజేసింది. స్త్రీ పురుష సంబంధాల్లో పురుషుడు అనుభవించేవాడుగా అంటే భోగిగా స్త్రీ అనుభవింపబడే వస్తువు అంటే భోగ్యంగా చూసారని మగవాన్ని ప్రేమించ

డానికి సేవించడానికి కనడానికి తయారు చేయబడింది స్త్రీ శరీరం అని చెప్పి స్త్రీవాదంలో స్త్రీ శరీరాన్ని ద్వేషించడం కన్పిస్తున్నది. మగవాళ్ళను వర్గశత్రువులుగా మగపిల్లలను శత్రువర్గపు మొలకలుగా భావించడం వంటి ధోరణులు దీనిలో వున్నాయి. ఇంటిపని - స్త్రీల జీవితసారాన్ని మేధోశక్తిని సృజనాత్మకతను నశింపజేసేదిగా వీళ్ళు భావించారు. ఇల్లు స్వర్గసీమ ఇల్లాలు గృహలక్ష్మి వంటి భావజాలాన్ని వీళ్ళు ద్వేషించారు. పితృస్వామ్యం నుంచి ఏర్పడింది కుటుంబవ్యవస్థ అనీ, పితృస్వామ్యం, కుటుంబవ్యవస్థ కుళ్ళు ప్రైవేటుఆస్తులు నశించాలని వీళ్ళు అంటారు. స్త్రీ వాదంలో మూడోది - సోషలిస్టు ఫెమినిస్టు ధోరణి. మార్క్స్ ఏంగెల్స్ లెనిన్ భావాలతో కూడిన స్త్రీ వాద ధోరణి ఇది. సోషలిస్టు విప్లవకాలంలో రష్యాలో చైనాలో సామాజిక శ్రమవిభజనకు అంటె స్త్రీ వంటింటికి అంకితంగా కావడం పురుషుడు కార్మిక కర్షక వృత్తికి అంకితం కావడాన్ని నిర్మూలించి స్త్రీ కర్మాగారాల్లో శ్రామిక ఉత్పత్తి శక్తిగా మార్చబడింది. దాంతో స్త్రీ విముక్తి అభ్యుదయం సమానతలు సాధింపబడినాయని అన్నారు. అందువల్లనే సోషలిస్టు ఫెమినిజం లిబరల్ ఫెమినిజంకు దగ్గరగానే దాని చెల్లెలుగానే కన్పిస్తున్నది. కాని అంతగా స్త్రీ అభ్యుదయాన్ని రాజకీయ ఆర్థిక స్వేచ్ఛను సాధించలేక పోయింది. దాంతో స్త్రీ వాదంలో రాడికల్ ఫెమినిజం తలెత్తింది. ఈ మూడు కాక స్త్రీవాదంలో మరో ధోరణి కన్పిస్తున్నది. వాళ్ళు స్త్రీ స్వేచ్ఛను సంప్రదాయపరిధిలోనే న్యాయపరంగా సామాజికపరంగా ఏ రాజకీయాలు లేకుండా నిజాయితీగా అమలులోకి తెచ్చేందుకు స్త్రీలు ఉద్యమించాలంటున్నారు. స్త్రీ తనకుతాను మారాలి. ఎదగాలి. తన హక్కులను తాను తెలుసుకొని అమలులోకి తెచ్చుకునే మనోధైర్యం ఆత్మవికాసం రావాలన్నది వాళ్ళ వాదన. అన్ని రంగాల్లో స్త్రీలు చొచ్చుకొని ముందుకు రావాలి. పురుషున్ని ఒక శత్రువుగా తన బలహీనతలకు కారణంగా చూడడం కుటుంబ వ్యవస్థను ఛిన్నాభిన్నం చేయాలనడం వాళ్ళు వ్యతిరేకిస్తున్నారు.

ఆంధ్రదేశంలో 1970 దశకంలో వ్యాపించిన సాయుధ పోరాటం

గిరిజనోద్యమం విప్లవశక్తుల విజృంభణ స్త్రీలకు ఉద్యమించడానికి ప్రేరణ శక్తిగా పని చేసాయి. విప్లవోద్యమం స్త్రీలకు న్యాయం చేయార్చలేదనే అసంతృప్తి స్త్రీలల్లో కలిగింది. విప్లవోద్యమంలో పని చేసిన స్త్రీల పట్ల గౌరవ భావం సమభావం లేకపోవడం సబార్డినేషన్‌కు గురిచేయడం వంటి కారణాలవల్ల స్త్రీలు ప్రత్యేక వర్గంగా ఉద్యమాన్ని చేపట్టారు.

పోరాటానికి ప్రేరణ విప్లవోద్యమం నుంచి వచ్చినా స్త్రీ వాదంలోని భావ జాలమంతా సిద్ధాంతాలన్నీ పాశ్చాత్య దేశాలనుంచి పాశ్చాత్య రచనలనుంచి తీసుకున్నాయనే చెప్పాలి. 1980 దశకం నుంచి స్త్రీ వాదధోరణులతో తెలుగులో రచయిత్రులు రచనలు. చేయడం ప్రారంభించారు. స్త్రీలు తమ బాధలను కష్టాలను తామే అనుభవపూర్వకంగా తెలుసుకొని ఆ అనుభూతులను బాగా వ్యక్తీకరించగలమనే ప్రధాన ఆశయం స్త్రీల రచనల్లో కన్పిస్తుంది. తమ గోడులను పురుషులు వ్యక్తం చెయ్యడంగాని సానుభూతి చూపడంగాని వీళ్ళు కోరుకోలేదు అయినా చేరా, త్రిపురనేని శ్రీనివాస్ వంటి విమర్శకులు పత్రికా రచయితలు స్త్రీవాద సాహిత్యాన్ని బాగా "ఎక్స్ పోజు" చేసి పాఠకుల దృష్టికి తేచ్చేంత వరకు స్త్రీవాదం అందరి దృష్టిని ఆకర్షించలేదని చెప్పాలి. స్త్రీవాద సాహిత్యం విశ్లేషణలో విమర్శకురాలిగా కాత్యాయనీవిద్మహే, ఓల్గా పేరు సంపాదించుకున్నారు.

20వ శతాబ్దారంభంలో సంస్కరణలతో పాటు స్త్రీ మీద జరిగే అన్యాయాలను చిత్రిస్తూ కవితలు నాటకం నవలలు కథానికలు వ్రాయ బడినాయి. గురజాడ 'కన్యక' కవితలో, స్త్రీ మీద పురుషాహంకారం చేసే దౌర్జన్యాన్ని 'పూర్ణమ' కవితలో, 'కన్యాశుల్కం' నాటకంలో స్త్రీలను అమ్మడం వాళ్ళ మీద జరిగే దురాచారాలు చిత్రింపబడినాయి. రాయప్రోలు "స్నేహలతాదేవి లేఖ" కవితలో, కాళ్ళకూరి "వరవిక్రయం" నాటకంలో స్త్రీలు వరకట్నాలతో బాధపడడం గురించి వ్రాసారు. భావకవులు స్త్రీకి గౌరవాన్నిచ్చి ఆరాధ్యదేవతగా చేసారు. చలం స్త్రీ స్వేచ్ఛకోసం తపనపడ్తూ నవలలు, కథానికలు, నాటికలు, వ్యాసాలు వ్రాసాడు. తర్వాత తెలుగులో స్త్రీవాదులకు చలం భావజాలం రచనలు చాల ప్రేరణనిచ్చాయి. భావకవులు

కాల్పనికయుగంలోని రచయితలు నవలాకారులు స్త్రీని స్త్రీ సమస్యలను పట్టించుకున్నంతగా అభ్యుదయకవులు దిగంబరాది కవులు విప్లవకవులు పట్టించుకోలేదు. వాళ్ళకు వర్గ సమస్య దీనుల ఉద్ధరణ ప్రధానమైంది. దాంతోనే స్త్రీసమస్యలు జోడింపబడినాయని ఆ సమస్యలతో స్త్రీ సమస్యలు తీరుతాయని భావించారు. కాని అభ్యుదయకవుల్లో జాషువా ఒక్కడు "వంచిత" అనే కవితలో పురుషులు "వంటియింటి కొరముట్టుగ నిన్ను గణించుమండ" అని బాధపడుతూ "స్త్రీలను పుట్టు బానిసల చేసిన సంస్కృతి"ని నిరసిస్తూ స్త్రీల అణచివేతను గురించి వ్రాసాడు. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి "కీలెరి గినవాత, అన్నంతపనీ జరిగింది. కొత్త చూపు" మొదలయిన కథానికల్లో ముద్దు కృష్ణ "కాలం కల్పించే మార్పు, తెలివి" మొదలయిన కథానికల్లో స్త్రీ ఆత్మస్థైర్యాన్ని ప్రబోధించారు. విప్లవ కవుల్లో చెరబండరాజు, గద్దర్, వరవరరావులు స్త్రీ విముక్తిని కోరుతూ కొంతవరకు స్పందించారు. స్త్రీ పురుషులిద్దరు కలిసి ఉద్యమించాలని విప్లవకవులు కోరారు.

"ఆకాశంలో సగం నీవు సగం నేను
మనిద్దరం కలసి ఉద్యమిస్తే ఉప్పెన
విప్లవిస్తే విజయం" (శివసాగర్)

1980 దశకం నుంచి స్త్రీలు స్త్రీవాద దృక్పథంలో సైద్ధాంతికతాత్త్విక నిబద్ధతతో రచనలు చేయడం మొదలుపెట్టారు. 1960, 70 దశకంలో స్త్రీలు నవలారచయిత్రులుగా చాలా మంది కన్పిస్తున్నారు. కాని కవయిత్రులుగా ఏ కొద్దిమందో కన్పిస్తారు. సౌదామిని, రాజ్య లక్ష్మమ్మ వంటి వాళ్ళు భావ కవితాయుగంలో కవిత్వం వ్రాసారు. ఆ తర్వాత కనుపర్తి వరలక్ష్మమ్మ ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ మొదలయిన వాళ్ళు కవిత్వం వ్రాసారు. అంతకుముందు ప్రాచీనకాలంలో మొల్ల, సుభద్ర, వేంకమాంబ, రంగాజమ్మ, ముద్దుపళని వంటి వాళ్ళు వేళ్ళమీద లెక్కబెట్టిదగినంత మంది మాత్రమే కన్పిస్తున్నారు. ఆధునిక కాలంలో స్త్రీవాద ధోరణితో చాలా మంది చేవగల కవిత్వం వ్రాసే కవయిత్రులు, రచయిత్రులు బయలుదేరారు.

1984లో ఆంధ్రజ్యోతి వారపత్రికలో సావిత్రి అనే కవయిత్రి "బంది పోట్లు" అనే కవితను ప్రకటించింది. "గృహిణి" అనేది ఆమె మరో కవిత. ఈ రెండు కవితలు స్త్రీవాద ధోరణిని పాఠకుల దృష్టికి తెచ్చాయి. 1980లోనే రేవతీదేవి "శిలాలోలిత" అనే కవితాసంపుటిని ప్రచురించింది. శీలం పాతివ్రత్యం స్త్రీకి ఒక్క దానికే - అనే ద్వంద్వనీతిని ఆమె ప్రశ్నించింది -

"మగకీ ఆడకీ శీలాన్నీ ఆస్తినీ / సమంగా వర్తింపించండి / కాగితాల మీద వేదికల మీద కాదు / నిజంగా సమంగా వర్తింపించండి"

1980లో జయప్రభ "సూర్యుడు కూడా ఉదయిస్తాడు" అనే కవితా సంపుటిని ప్రచురించింది. "యుద్ధోన్ముఖంగా" (1986) "వామనుడి మూడో పాదం" (1988) "ఇక్కడ కురిసిన వర్షం ఎక్కడి మేఘానిది" (1991) "యశోధరా వగపెందుకే" (1993) మొదలయిన స్త్రీవాద ధోరణులతో జయప్రభ కవితా సంపుటాలను ప్రచురించింది. 1991లో కవయిత్రి సావిత్రి క్షయరోగంతో అకాల మరణం చెందగా ఆమె అభిమానులు ఆమె కవితలను "సావిత్రి" పేరుతో ప్రకటించారు. 1988లో కొండేపూడి నిర్మల "సందిగ్ధ సంధ్య" కవితా సంకలనాన్ని ప్రచురించింది. 1990లో "నడిచే గాయాలు" అనే మరో కవితా సంకలనాన్ని ప్రచురించింది. అదే సంవత్సరం త్రిపురనేని శ్రీనివాస్ "గురిచూసి పాడే పాట" పేరుతో స్త్రీవాద కవితల సంకలనాన్ని కూర్చి ప్రచురించాడు. 1993 లో స్త్రీలే స్త్రీవాద కవితల సంకలనాన్ని "నీలిమేఘాలు" పేరుతో ప్రచురించారు. ఆడపిల్లల పెంపకంలోని పక్షపాతం, స్త్రీల మీద జరిగే హింస, మానభంగాలు, భ్రూణహత్యలు వరకట్నాలు - చావులు, స్త్రీల ఇంటి చాకిరి, స్త్రీ ఉద్యోగిగా పడే శ్రమ, స్త్రీల అణచివేతలు సంప్రదాయ నిరసనలు మొదలయిన స్త్రీవాద కవిత్వంలో వస్తువుగా కన్పిస్తున్నది. జయప్రభ పైటను పితృస్వామ్యానికి ప్రతీకగా తీసుకొని

నామీద తరాల నుంచి మోపిన
అపనిందల పెట

నన్ను అబలను చేసిన పితృస్వామ్యపు అదృశ్యహస్తం
నేను నడిచే శవాన్ని కాకుండా వుండాలంటె
పైట - ముందుగా పైటని తగలెయ్యాలి.

అని వ్రాసింది. పాశ్చాత్య స్త్రీలు 'బ్రా'లను తగిలేసినఉద్యమం స్ఫూర్తితో జయప్రభ పైటను తగిలెయ్యాలని వ్రాసింది. హిందీలో స్త్రీవాద కవయిత్రులు "ఘూంఘట్" (మేలిముసుగు)ను తగిలెయ్యాలని వ్రాసారు.

ధయ క్షమ శాంతం సహనం త్యాగం మొదలయిన సంప్రదాయం స్త్రీకి తగిలించిన ఆభరణాలను వదిలి సమానతన సాధన కోసం ఉద్యమించాలని అని స్త్రీవాద కవయిత్రులంటారు.

"నా స్వాతంత్ర్య సాధనకై
సాటి స్త్రీలతో చేతులు కలిపి

పిడిగిలి బిగిస్తున్నాను" అని స్త్రీలు సంఘటితులై స్వేచ్ఛను తెచ్చుకోవాలని స్త్రీవాదుల కోరిక

"ఈ వ్యవస్థ మీ అమూల్య సృష్టి
ఈ సంఘం మీది అధికారం మీది

ఈ ఆచారాలు మీ ధర్మశాస్త్రాలకు నకళ్ళు" అని జయప్రభ పురుషాధిపత్యాన్ని ప్రశ్నించింది. కొండేపూడి నిర్మల స్త్రీ భ్రూణహత్యను ప్రశ్నించింది.

"ఆటవికమైన శిశు హత్యల్ని
దశలవారిగా సులభతరం చెయ్యడానికేనంటే
మీ మరుగుజ్జుతనం ఏమిటో తెలుస్తుంది
నేనెంత గొప్ప శత్రువునో కూడా అర్థమవుతుంది"

స్త్రీ అణచివేతకు ఆమె ఏమీ తెలియనితనం కారణమని కవయిత్రి గ్రహించింది

"అన్నీ తెలిసిన నరకం నుంచి
నా ఏమీ తెలీని తనాన్ని రక్షించండి"

ఇంటి చాకిరి వంటగదికి అంకితమయ్యే స్త్రీ సమస్యలను విమల "వంటిల్లు"లో చక్కగా చిత్రించింది. "అసలు మా అమ్మే నడుస్తున్న వంటి గదిలా వుంటుంది"......"మా అమ్మ మా అమ్మమ్మ ఇంట్లో అమ్మలంతా ఇక్కడే స్త్రీలయ్యారట" అంటుంది.

"ఈ వంటింటి సామ్రాజ్యానికి మా అమ్మేరాణి
అయినా చివరకు వంటింటి గిన్నెలన్నిటిపైనా నాన్న పేరే"
అని పురుషాధిపత్యాన్ని ఎత్తి చూపింది.
"మనం ఏమైనా మన అంతిమ కర్తవ్యం
గరిట తిప్పటంగా చేసిన ఈ వంటిళ్ళను
ధ్వంసం చేద్దాంరండి......."

"మన పిల్లల కోసం వంటరి వంటగదులు కూల్చేందుకు రండి"అని పాటిబండ్ల రజని భావితరాలవాళ్ళు కూడా వంటింటి కంకితం కాకూడదని వంటింటిని ధ్వంసం చేద్దాం అంటుంది. స్త్రీ అణచివేత వ్యవస్థకు వంటిల్లు ఒక ప్రతీక. దాన్ని ధ్వంసం చేయమనడం వ్యవస్థను ధ్వంసం చేయాలనడమే.

"వేరు వేరు స్వంత పొయిలను
పునాదులతో సహా తవ్వి పాద్దాంరండి"

అని వ్యవస్థ ధ్వంసం కోసం విమల పిలుపు నిచ్చింది.
"పెళ్ళంటె పెద్ద శిక్ష అని
మొగుడంటె స్వేచ్ఛా భక్షుడని
మేం పాలిచ్చి పెంచిన జనంతో సగమే

మమ్మల్ని విభజించి పాలిస్తోందని......." పెళ్ళిని గురించి సావిత్రి అన్న మాటలు. వ్యవస్థ స్త్రీస్వేచ్ఛకు కల్పించిన అడ్డంకులను ప్రశ్నిస్తూ ద్వంద్వనీతిని బద్దలు కొట్టాలంటూ కవయిత్రులు భావతీవ్రతగల కవితలు వ్రాసారు. అస్పష్టతగాని దుర్గ్రాహ్యతగాని వాళ్ళ భావాల్లో భాషలో లేవు. వాళ్ళ భావప్రకటన విధానాలు తెలుగు కవిత్వంలో ఒక కొత్త దనాన్ని ప్రవేశపెట్టాయి. 1960-70 దశకంలో స్త్రీలు నవలలు కథలే వ్రాసారన్న అపవాదాన్ని తొలగిస్తూ స్త్రీవాద కవయిత్రులు స్త్రీలకున్న కవితా ప్రతిభను

చాటారు.

స్త్రీవాద ధోరణులను చిత్రిస్తూ నవలలు కథానికలు కూడా చాలా వచ్చాయి. ఓల్గా వ్రాసిన "స్వేచ్ఛ, మానవి, ఆకాశంలో సగం" అనే నవలలు స్త్రీవాద దృక్పథంతో సాగాయి. 'స్వేచ్ఛ' నవలలో అరుణ ఇంట్లో ప్రతి ఒక్కరి ఆంక్షలతో పెరుగుతుంది. పెళ్ళయింతర్వాత భర్త పెత్తనం దుర్భర మౌతుంది. చివరకు అరుణ భర్తను ఒదిలేసి వెళ్ళడమే ఈ నవలలో స్వేచ్ఛ. స్త్రీ పురుషులు వివాహబంధం లేకుండా కలిసి జీవించడాన్ని పెళ్ళయిన పురుషుడితో స్త్రీ సంబంధాన్ని పెట్టుకోవడాన్ని సమర్థిస్తూ ఓల్గా మానవి నవలను రచించింది. ఈ నవలల్లో సంఘటనలు పేర్చినట్లుగా వున్నాయి. ధ్వని స్ఫోరకతతో ఊహాశక్తికి పదనుపెట్టే విధంగాగాని నేపథ్య వర్ణనలతో కూడిన విషయవిజ్ఞానంగాని లేదు. చలం తిరుగుబాటు ధోరణితో రాజేశ్వరి అరుణ శశిరేఖ లాలసల వంటి స్త్రీ పాత్రలను సృష్టించాడు. అరుణ తన కిష్టమైన పురుషున్ని ప్రేమించి మైదానంలో కాపురం పెట్టినట్లుగా చలం చిత్రించాడు. చలం 'ప్రేమ' గురించి వ్రాసాడు. స్త్రీకి ప్రేమించే అధికారం కావాలంటాడు. స్త్రీవాదరచయిత్రులు "స్వేచ్ఛ"ను గురించి వ్రాసారు. కాని స్త్రీ వ్యక్తిత్వం ఆత్మవికాసం గురించి ఎవరూ పట్టించుకోవడం లేదు. స్వేచ్ఛతో కూడిన లైంగిక సంబంధాలు ఉత్తమమైనవనడం, స్వేచ్ఛ కోసం పెళ్ళి చేసుకోకుండా స్త్రీ పురుషులు కలిసి జీవించడం స్త్రీసమానత సమస్యలకు స్వేచ్ఛకు పరిష్కారంకాదు. కుటుంబవ్యవస్థ అవసరం లేదనడం పితృస్వామ్య వ్యవస్థకు కుటుంబాన్ని ప్రతీకగా చూడడం అందరూ సమర్థించలేరు. ఎందరో ఆడవాళ్ళు కుటుంబవ్యవస్థ ఛాయలో శాంతి భద్రతల ననుభవిస్తున్నారు. ఆ శాంతిభద్రతలు సంకెళ్ళతో కూడినవని దాన్ని వ్యతిరేకించే తీవ్రధోరణులు విపరీత ఫలితాలను తేవచ్చును. స్త్రీముందుగా వ్యక్తిత్వాన్ని ఆత్మస్థైర్యాన్ని సంపాదించాలి. చైతన్యవంతురాలు కావాలి. అధికార దుర్వినియోగంతో అమాయకత్వంతో ప్రేమ పవిత్రతల పేరుతో వ్యక్తిత్వాన్ని చంపుకోవద్దు, ప్రకృతికి విరుద్ధంగా పోయి ఆత్మవినాశాన్ని తెచ్చుకోవద్దు. వ్యక్తులను సమాజాన్ని నిందిస్తూ కూర్చోకుండా ధైర్యసాహ

సాలతో అవసరమైతే విప్లవించాలి-అని చిత్రిస్తూ స్త్రీపురుషసంబంధాల్లో స్నేహం విశ్వాసాలుండాలని ధ్వనింప జేస్తూ సుజాతారెడ్డి "ఆకాశంలో. విభజన రేఖల్లేవు" అనేనవలను (1995) వ్రాసింది. సాధన "రాగో" నవలలో స్త్రీవాదాన్ని విప్లవోద్యమంలో భాగంగా చిత్రించింది. రాగో విప్లవోద్యమంలో కార్యకర్తగా వుంటూ స్త్రీలసమస్యలను పరిష్కరిస్తుంటుంది.

స్త్రీల శారీరక మానసిక హింసలను చిత్రిస్తూ 1980 దశకం నుంచి చాలా కథానికలు వచ్చాయి. కొండేపూడి నిర్మల, రావులపల్లి సునీత, పి.సత్యవతి, ఓల్గా స్త్రీవాద కథానికలు వ్రాసిన వాళ్ళలో ప్రముఖులు. "స్త్రీవాద కథలు" అనే పేరుతో కథాసంపుటి వచ్చింది. పి. సత్యవతి కథలు "ఇల్లలుకగానే పండగేనా" సంపుటిగా వచ్చాయి. ఓల్గా కథానికలు "రాజకీయ కథలు" రెండు సంపుటాలుగా వచ్చాయి. జయధీర్ తిరుమలరావు స్త్రీవాద కథానికలను ఎంపికచేసి సంపుటిగా ప్రచురించాడు. కథానికలు స్త్రీవాదం లోని వివిధ భావజాలన్ని చక్కగా చిత్రించాయి. దాంపత్య సంబంధాలు, స్త్రీ స్వయంప్రతిపత్తి, స్త్రీ శ్రమ దోపిడి, పురుషాధిపత్యం, భర్త అధికారం, తల్లిదండ్రుల దృక్పథం, వరకట్నాల బాధలు-హత్యలు, స్త్రీల ఉన్నత చదువులు ఉద్యోగాలు ఇంటిచాకిరి మొదలయిన ఎన్నో సమస్యలు కథానికల్లో ప్రతిఫలించాయి. విషయాన్ని కళాత్మకంగా ధన్యాత్మకంగా చెప్పడం ఈ కథానికల్లో కన్పిస్తుంది.

1990 దశకంలో యూరోపు అమెరికాల్లో స్త్రీవాదంలో మార్పులు వచ్చాయి. 1960-70 దశకంలో సెక్స్‌పరంగా స్వేచ్ఛ వుండాలన్న స్త్రీవాదులు ఆ స్వేచ్ఛ పురుషులు అలుసుగా అవకాశంగా తీసుకోవడం వరకు పోకూడదంటున్నారు. ఎరికాజాంగ్, జెర్మయిన్ గ్రీర్, మేరియన్, టటల్ మార్ట్సోట్ మొదలయిన స్త్రీవాదుల దృక్పథంలో మార్పు వచ్చింది. జెర్మయిన్‌గ్రీర్ "సెక్స్ అండ్ డెస్టినీ" పుస్తకంలో ఉద్యమాలకు అతీత మైంది మాతృత్వం అని వ్రాసింది. అది వ్యక్తిచేతనను ఉన్నత పరిచే ఒక మహత్తర అనుభవం అని ఆమె వ్రాసింది. పాశ్చాత్యదేశాల్లో 'బ్రాలు' తగిలేసి వివాహానికి కాలం చెల్లిపోయిందన్న స్త్రీవాదులు జెర్మయిన్ గ్రీర్,

జేన్‌ఫొండా వంటివాళ్ళు ప్రేమ పెళ్ళిళ్ళు అని స్థిరపడిపోయారు. ప్రేమించే పురుషునితో జీవితాన్ని పంచుకోవడంలో ఆనందముందని చాటింది జేన్ ఫొండా. బిల్ జీన్స్ కింగు వంటి స్త్రీవాదులు లెస్బియన్‌లుగా మారారు. దాంతో సామాన్య స్త్రీలు స్త్రీవాదంలోని అతివాదధోరణిని ఎదుర్కొన్నారు. అదేవిధంగా తెలుగులోను స్త్రీవాదంలోని అతివాద ధోరణిని ప్రశ్నిస్తూ సుజాతారెడ్డి వ్రాసిన "స్త్రీవాదం ఎక్కడిది? ఎందుకు?" (ఆంధ్రప్రభ దినపత్రిక 1-3-1993) అన్నవ్యాసం అందరినీ ఆకర్షించింది. ప్రపంచంలోని ప్రజాస్వామిక దేశాలన్నీ సమర్థించిన బంగ్లాదేశ్‌కు చెందిన ఫెమినిస్టు తస్లీమా నస్రీన్‌ను భారతదేశంలో స్త్రీవాదులు సమర్థించక పోవడం రాజకీయాల ప్రభావమంటారు.

1995 లో చైనాలో బీజింగు పట్టణంలో జరిగిన అంతర్జాతీయ స్త్రీ సమ్మేళనంలో ఎటువంటి నిర్మాణాత్మకమైన నిర్ణయాలు తీసుకోలేకపోవడం లెస్బియన్ హక్కులు కావాలని కొందరు స్త్రీలు ప్రదర్శనలు జరపడం మొదలయిన స్త్రీవాద ధోరణికి అంతగా స్త్రీలనుంచే సానుభూతి దొరికినట్లుగా కన్పించలేదు. స్త్రీవాదంలోని పురుషద్వేషం సమాజంలో కుటుంబవ్యవస్థ వినాశానికి దారితీసే ధోరణులు అందరి మన్ననలు పొందలేదు. మార్క్స్ ఆర్థికవ్యవస్థయే మానవుని జీవితాన్ని నియంత్రిస్తుందన్నాడు. కుటుంబ వ్యవస్థకు కూడా అదే సూత్రాన్ని అన్వయింపజేసి పెట్టుబడి మీదనే బూర్జువా కుటుంబవ్యవస్థ నిలిచివుందని ప్రైవేటు ఆస్తులతో కుటుంబవ్యవస్థ కూడా వినాశం కావాలన్నది మార్క్స్ అభిప్రాయంగా వ్యాఖ్యానం చేసి చెప్పారు. మార్క్స్ భావజాలాన్ని ఆదర్శంగా తీసుకొని సోవియట్ రష్యాలో మామూలు స్త్రీ పురుషుల సంబంధాలను తోసిపుచ్చి ప్రయోగాత్మకంగా మగవాళ్ళు ఆడవాళ్ళు గుంపుగా ఒకచోట నివసించేటట్లు చేసారు. ఏ మగవాడైనా ఏ స్త్రీతోనైనా సంబంధం పెట్టుకోవచ్చు. భర్త భార్య అనే సంబంధం లేకుండ చేసారు. వాళ్ళకు పుట్టిన పిల్లలు వ్యక్తులకు కాక రాజ్యానికి చెందుతారని అన్నారు. కాని ఆ ప్రయోగం ప్రజల మెప్పును పొందలేదు. పైగా దాన్ని వాళ్లు హీనంగా భావించారు.

దాంతో ఆ ప్రయోగం అంతటితో ఆగిపోయింది. ఆడమగను గుంపుగా చేర్చినా అనధికారంగా వాళ్ళు ఒకరి మీద ఒకరు అభిమానంతో జంటలుగా విడిపోయారు. తలిదండ్రుల ప్రేమ పెంపకం లేని దుస్థితిని రాజ్యం గుర్తించింది. అందుకే సోవియట్ రష్యాలో రాజ్యం ప్రయేయంతో ప్రైవేటు ఆస్తులు నశించినా కుటుంబవ్యవస్థ మాత్రం నశించలేదు. అటు వంటి కుటుంబ వ్యవస్థను తిరస్కరించి వ్యక్తిస్వేచ్ఛను కోరే స్త్రీవాదంలోని తీవ్రభావజాలం కొన్ని విమర్శలకు గురయింది. ఎంతయినా స్త్రీవాదం ఒక్కసారి స్తబ్దతతో కూడిన అణచివేతతో దిక్కుతోచని స్త్రీలల్లో చైతన్యాన్ని తీసుకొని వచ్చిందని అంగీకరించాలి. సమాజంలో స్త్రీల సమస్యలతో పాటు ఎన్నో సమస్యలున్నాయి.వృద్ధుల సమస్య, వీధి పిల్లల సమస్య, చిన్నపిల్లల చాకిరి, పర్యావరణం సమస్యల వంటివి ముందుకు వచ్చాయి. వ్యావసాయిక దేశమైన భారత దేశంలో అతివృష్టి అనావృష్టివల్ల రైతుల బాధలు, పంటలు పండించిపోసే రైతుల పేదరికం మొదలయిన సమస్యలుండగా స్త్రీవాదం పెద్ద సమస్యగా కొందరికి కనిపించలేదు. 1994 ను యు ఎన్ ఓ కుటుంబ సంవత్సరంగా ప్రకటించి కుటుంబ వ్యవస్థకున్న ప్రాధాన్యాన్ని గుర్తించింది. మానవసమాజానికి మానవ మనుగడకు ఆరోగ్యవంతమైన పిల్లల పెరుగుదల వుండాలంటె కుటుంబ వ్యవస్థ స్థిరంగా వుండాలంటె ఆచరణసాధ్యమైన సంబంధాలు స్త్రీపురుషుల మధ్య సాగాలి. కాని కుట్రలు కుతంత్రాలతో కూడిన రాజకీయాలు కాదు. స్త్రీలు పురుషులు మా హక్కులంటె మాహక్కులనే పోరాటాన్ని అశాంతిని ఆపవలసి వుంటుంది. అసౌమనస్య వాతావరణంలో మానవజాతి మనుగడ సాగించలేదు.

తెలుగులో వచ్చిన స్త్రీవాద కవిత్వంలోని కొన్ని భావాలు పదజాలం కొంత విమర్శకు గురయినాయి. ఒకప్పుడు దిగంబర కవిత్వం జుగుప్సను కలిగించే కవిత్వంగా విమర్శింపబడిందో అదేవిధంగా స్త్రీవాదకవిత్వం విమ ర్శకు గురయింది. యస్వీ, జ్వాలాముఖి వంటి అభ్యుదయ విప్లవభావాలు గల విమర్శకులు స్త్రీవాదధోరణిలోని అశ్లీలతను గురించి ప్రశ్నలు లేవనె త్తారు. రతి, ప్రసవం, అంగప్రవేశం, వీర్యవర్షం, స్వప్న స్ఖలనం వంటి పదాల

ప్రయోగం అవసరమా అని, జుగల్‌బంది, లేబర్‌రూం మొదలయిన కవితల్లో కవయిత్రులు పురుషుని మీద చూపిన పగ కసిని ప్రశ్నించారు. స్త్రీకి ప్రకృతి సహజమైన పిల్లల్నికనే శక్తిని స్థితిని అసహ్యించుకోడం, మగవాళ్ళను ఒక వర్గంగా ఆడవాళ్లను ఒక వర్గంగా భావించడం, మగ పిల్లలను శత్రువర్గపు మొలకలుగా చెప్పడం, పురుషుని సుఖంకోసమే స్త్రీ శరీరం తయారు చేయబడిందని స్త్రీ శరీరాన్ని ద్వేషించుకోవడం, అవసరాల వేడి మాత్రమే దంపతుల మధ్య లైంగికసంబంధాలకు ప్రాతిపదిక అవుతుం దనడం మొదలయిన విపరీత భావజాలం సహృదయుల సహృదయతను సంపాదించుకోలేక పోయింది. మొత్తం మీద తెలుగు స్త్రీవాద కవిత్వం ఒక ఊపు ఊపింది. దళితవాద సాహిత్యం ఆవిర్భావంతో స్త్రీవాదం దళితవాదంతో పొత్తు కలిపింది. స్త్రీవాద దళిత వాదాలతో కూడిన కవితా సంపుటాలు ప్రచురింపబడినాయి.

## దళితవాద సాహిత్యం

సంఘసంస్కరణోద్యమాల కాలంలో కులభేదం నిరసించబడింది. కులభేదాన్ని నిరసించే బ్రహ్మసమాజం ఆర్యసమాజం వంటి మతసంప్రదాయాలు వచ్చాయి. గాంధీజీ జాతీయోద్యమంతోపాటు జాతివివక్షతను ముఖ్యంగా అస్పృశ్యతను నిరసించి హరిజనోద్ధరణ కార్యక్రమాలను నడిపాడు. అస్పృశ్యులుగా పంచములుగా నీచంగా చూడబడ్తూ పల్లెలకు దూరంగా నివసిస్తూ వుండే జనులను గాంధీజీ హరిజనులని పిలిచాడు. హరిజనోద్ధరణోద్యమాన్ని గాంధీజీ నడిపాడు. గాంధీజీ సిద్ధాంతాలను నమ్మినవాళ్ళు హరిజనోద్ధరణను చేపట్టారు. ఆంధ్రదేశంలో 12 వ దశాబ్దంలో బ్రహ్మనాయుడు అన్ని కులాలు కలిసి భోజనం చేసే "చాపకూడు" ను నడిపాడు. అదే పద్ధతిలో 1910 లో ఆంధ్రప్రదేశ్ తెనాలిలో చాపకూడు జరిగి సంచలనాన్ని సృష్టించింది. ఉన్నవ గాంధీజీసిద్ధాంతాల కనుగుణంగా హరిజనుల సమానతను ప్రబోధించాడు. జాషువా గబ్బిలం వంటి ఖండకావ్యాల్లో పంచముల దురవస్థను చిత్రించి సమానతను ప్రబోధించాడు. స్వాతంత్ర్యానికి పూర్వం వచ్చిన పై ఉద్యమాలు

కొంత పరిస్థితిని మెరుగుపరిచాయి. కాని దేశాభివృద్ధి ఆర్థికాభ్యున్నతి కుంటుపడినట్లులాగానే దేశజనాభాలో చాలా భాగమైన దళితుల పరిస్థితి కుంటుపడింది.

పరిస్థితుల మీది అసంతృప్తితో పంచములు దళితులనే పేరుతో ఉద్యమాన్ని సాగించారు. గాంధీజీ పెట్టిన హరిజనులనే పేరు వాళ్ళకు నచ్చలేదు. అది పైవర్ణాల ఉదారవాదంగా వాళ్లకు కనిపించింది. పూర్వం దళిత శబ్దం దైన్యాన్ని హైన్యాన్ని సూచించేది. ఇప్పుడు దళితులంటె సాంఘికశ్రమను చేసే వాళ్ళనే అర్థంలో వాడబడుతున్నది. నిత్యపీడితులు నిత్యతాడితులు దళితులనబడ్తున్నారు. చివరకు మైనారిటీలైన ముస్లింలను కూడా చేర్చుకొని "దళిత" పదానికి బదులుగా "బహుజను" లనే పదాన్ని కూడా కొందరు ప్రయోగిస్తున్నారు. దానిలో హరిజనులే కాక వెనుకబడిన వర్ణం వాళ్ళు శ్రమమీద ఆధారపడిన వాళ్ళంతా చేరుతారు. దళితశబ్దం, తాత్త్వికత విస్తృతార్థంలో వున్నా ఈ ఉద్యమంలో పంచములదే ప్రధాన పాత్రగా కన్పిస్తున్నది. దళితులకు ప్రధాన ప్రేరణ డా. అంబేద్కరు, మహాత్మా ఫులేలు. 1924 లో అంబేద్కరు అస్పృశ్యతా నివారణోద్యమాన్ని ఆరంభించాడు. "దళితులు తమ స్థితిని తాము గుర్తెరిగి తమను తామే ఉద్ధరించుకోవాలి. తమ సమస్యలను తామే పరిష్కరించుకోగలగాలి. సవర్ణుల కన్నా తాము ఎందులోనూ తక్కువ కాదని గ్రహించా" లని అంబేద్కరు ప్రబోధం దళితోద్యమానికి మూలమంత్రమైంది.

దళితవాదంలో అంబేద్కరు దృక్పథం, మార్క్సిస్టు దృక్పథం రెండు దృక్పథాలు కన్పిస్తున్నాయి. రెండింటిని సమన్వయం చేయాలనే వాళ్ళున్నారు. ఇంకొకవర్గం వాళ్ళు రెండింటినీ నిరాకరించి కొత్త దృక్పథాన్ని సిద్ధాంతాన్ని అన్వేషించాలనే వాళ్ళు కూడా వున్నారు. అంబేద్కరు సామాజికవిప్లవ వర్గకుల దృక్పథాన్ని పునాదిగా చేసుకునే తెలుగులో దళితవాదుల తాత్త్వికత ఎక్కువగా సాగుతున్నది.

స్వాతంత్ర్యానంతరం స్వేచ్ఛ సమానతలు వస్తాయని న్యాయం జరు

గుతుందని ఆశించిన దళితులకు ఆశాభంగమైంది. విద్యావ్యాప్తి, నగరవాతావరణం, ఉద్యోగాలు మొదలయినవయి సామాజిక సమానతను తెస్తాయని ఆశించిన హరిజనులకు ఆశాభంగమైంది. ప్రజాజీవన స్రవంతిలో భాగమవుతామన్న వాళ్ళ ఆశ నెరవేరలేదు. ప్రభుత్వం రాజ్యాంగం ప్రకటించిన రిజర్వేషన్లు రాయితీలు దళితుల జీవితంలో అభివృద్ధిని తేలేదు. వాళ్ళు ప్రతిదానికి అధికారవర్గంపైన ఆధారపడవలసి వచ్చింది. ఈ పరిస్థితి వాళ్ళను నిరాశకు గురిచేసింది. అందుకే దళితులు విప్లవోద్యమం వైపు దృష్టి సారించారు. విప్లవపోరాటంతో తమకు సమానావకాశాలు సమాన ప్రతిపత్తి వస్తుందని ఆశించిన దళితులకు నిరాశ మళ్ళా ఎదురైంది. విప్లవోద్యమం వర్గవినాశంకోసం పోరాడింది కాని వర్ణవిభేదాన్ని నాశనం చేయలేక పోయింది. పల్లెల్లో పట్టణాల్లో సజీవంగావున్న కులభేదాన్ని అస్పృశ్యతను వాళ్ళు గుర్తించలేదు. సామాజిక వ్యవస్థలో భాగంగా దళితుల సమస్యలను విప్లవోద్యమం చూసింది. కాని దళితుల సమస్యలను ప్రత్యేకంగా తీర్చలేకపోయిందని సాహిత్యంలోను ఉద్యమంలోను ప్రతిరంగంలోను పై వర్ణాలవాళ్ళు దళితులకృషికి గుర్తింపునియ్యడం లేదనే అసంతృప్తితో దళితులు ఆగ్రహానికి గురయినారు. ఇస్తే తీసుకోడం, ఎవరో ఉద్ధరిస్తారనే భావన నుంచి దళితులు దూరం కావాలని తమకు తాముగా ఉద్యమించి చైతన్యవంతులు కావాలని గుర్తించారు. దాంతో సామాజిక సాంస్కృతిక రంగంలో దళిత చైతన్యం విస్తరించించి. దళిత చైతన్యంతో దళిత సాహిత్యం వికసించింది. దళితులు తమ ఆవేదనను ఆర్తిని యుగయుగాలుగా అనుభవించినదాన్ని అక్షరరూపంలో పెట్టిందే దళిత సాహిత్యం అనబడుతున్నది. దళితుల మీద సానుభూతితో దళితేతరులు వ్రాసిందాన్ని దళిత సాహిత్యంగా దళితులు పరిగణించడం లేదు. మా వేదికను మేమే నిర్మించుకుంటామంటున్నారు. దళిత అనుభవంతో దళిత స్పృహతో వ్రాసిందే నిజమైన దళిత సాహిత్యమంటున్నారు.

మరాఠీ కన్నడ భాషల్లో దళితోద్యమం దళితులసాహిత్యం ముందుగా వికసించింది. మరాఠీ దళిత సాహిత్యానికి మహాత్మాజ్యోతి ఫులే ఆద్యుడుగా

పరిగణింపబడ్తున్నారు. 1950 దశకంలో బుద్ధసాహిత్య పరిషత్తుతో మరాఠీ దళితసాహిత్యోద్యమం పుట్టింది. 1967 వరకు మరాఠీలో దళిత సాహిత్యం తనదైన సిద్ధాంతాన్ని ఏర్పరుచుకుంది. జ్యోతిబాపులే, శాహూమహారాజ్, డా. అంబేద్కరు, కార్ల మార్క్సు మావో ఆలోచనలు సిద్ధాంతాలతో అమెరికాలో వచ్చిన బ్లాక్ లిటరేచర్ ప్రభావం ప్రేరణలతో మరాఠీలో దళిత సాహిత్యం పుట్టి వికసించింది. 1969 నుంచి దళితసాహిత్యం అనేపదం విస్తృతవ్యవహారంలోకి వచ్చింది. ఔరంగాబాదులో మిళింద సాహిత్య పరిషత్తు ఏర్పడింది. అస్మిత అనే దళిత త్రైమాసిక పత్రిక దళిత తాత్త్వికత ప్రచారానికి దోహదం చేసింది. తర్వాత కన్నడం హిందీ బెంగాలీ భాషల్లో దళిత సాహిత్యం ఆవిర్భవించింది. దళిత సాహిత్యవ్యాప్తికి తోడ్పడే పత్రికలు వచ్చాయి. 1970 దశకంలో దళిత సాహిత్యం ఉద్యమ రూపంగా వికసించింది. 1980 దశకంలో పెద్ద ప్రవాహంగా రూపొందింది. తెలుగులో దళితసాహిత్యం 1980 దశకంలో ఒక ఉద్యమ రూపాన్ని ధరించింది. ఆంధ్రదేశంలో దళితుల మీద జరిగిన కొన్ని అత్యాచారాలు విప్లవోద్యమం చేత నిరాశాతప్తులైన కార్యకర్తల ఆగ్రహం తెలుగులో దళిత సాహిత్యం ఉప్పొంగడానికి దోహదం చేసాయి. 1978 లో కృష్ణా జిల్లా కంచికచర్లలో దొంగతనం చేసాడని దళితున్ని కట్టేసి కాల్చడం, కారంచేడు చుండూరుల్లో దళితులపైన జరిగిన అత్యాచారాలు దౌర్జన్యాలు తెలుగులో దళితోద్యమానికి దళితసాహిత్య వికాసానికి ఊపునిచ్చాయి.

దళితసాహిత్యం భావకవిత్వం, అభ్యుదయకవిత్వం వలె వ్యక్తి అనుభూతిని కాక సామూహికానుభూతిని వ్యక్తం చేసింది. దళిత కవులు రచయితలు ఉత్పత్తిరంగంలో జరిగే శ్రమదోపిడిని ఎదుర్కోవడం సామాజికంగా సాంస్కృతికంగావున్న ఆధిక్యతాభావాన్ని అహంకారాన్ని బద్దలు కొట్టడం, సాహిత్యం కళల్లో వున్న వర్గదృక్పథాన్ని విచ్ఛిన్నం చేయడం, భాష శిల్పంలో వున్న ఉచ్చనీచభావాలను ఎదిరించడం, సనాతన సంస్కృతి ఉన్నత సంస్కృతి పేరుతో పై వర్గాల వాళ్ళ సంస్కృతి చలామణి కావడాన్ని దళితులు ప్రశ్నించారు. ఉన్నత వర్గ సంస్కృతిని ప్రతిఘటించడం, ఉన్నత మధ్యవర్గాల

సంస్కృతి ఆదర్శీకరణను ఎదిరించడం, కింది వర్ణాలవాళ్ళ దృక్పథాలను సాహిత్యంలో ప్రతిబింబించడం దళిత రచయితలు చేసారు. ఇంతవరకు ఉన్నత వర్గాల మధ్యతరగతి వర్గాల అనుభూతులు భావజాలం మాత్రమే తెలుగు కవిత్వంలో వచ్చింది కాని శ్రమించే అట్టడుగు వర్గాల దృక్పథం భావజాలం దళిత కవిత్వంలోనే వ్యక్తమయిందని దళితవాదులంటారు.

అనేక రాష్ట్రాల్లో రాష్ట్ర స్థాయిలో దళిత సాహిత్య అకాడమీలు ఏర్పాటై దళిత సాహిత్యాన్ని ప్రోత్సహించాయి. 1984లో ఢిల్లీలో భారతీయ దళిత సాహిత్య అకాడమీ ఏర్పాటయింది. వాళ్ళు దళిత సాహిత్యానికి అవార్డులను కూడా ప్రకటించారు. 1987లో హైదరాబాదులో అఖిల భారత దళితరచయితల ప్రథమ మహాసభలు జరిగాయి. "మానవ విలువలు స్వేచ్ఛ సమానతలు సౌభ్రాతృత్వం - వీటి మీద ఆధారపడిన వర్ణరహిత సమాజనిర్మాణం జరగా"లనేది ఈ మహాసభల్లో దళిత రచయితల ఆశయంగా ప్రకటించబడింది. "దళితులకు సమాజంలో సాహిత్యంలో సముచిత స్థానాన్ని సంపాదించడానికి పోరాటాలు నిర్వహించాలని అట్లాంటి సాహిత్యాన్ని సృజించా"లనే, లక్ష్యాన్ని ఈ సభ ప్రకటించింది. "దళిత చైతన్యాన్ని దళితుల్లో కలిగించడం దళిత సాహిత్య ప్రధానోద్దేశం కావాలి" అని ఈ సభ పిలుపునిచ్చింది. 1993 ఫిబ్రవరిలో హైదరాబాదులో "ఆంధ్రప్రదేశ్ దళితరచయితల కళాకారుల మేధావుల ఐక్యవేదిక" మొదటి మహాసభలు జరిగాయి. దళితుల్లో ఆత్మాభిమాన చైతన్యాన్ని ప్రతిఘటన చైతన్యాన్నీ రేకెత్తించాలని సాహిత్యాన్ని ఆయుధంగా వినియోగించుకోవాలని ఈ మహా సభలు ప్రకటించాయి. ఈ మహాసభ ప్రేరణతో కరీంనగర్ వరంగల్ రంగారెడ్డి అనంతపురం రాజమండ్రి జిల్లాల్లో దళిత సభలు దళిత సాహిత్యం మీద సదస్సులు జరిగాయి. 1990 దశకంలో తెలుగులో అనేక ప్రక్రియల్లో దళితస్పృహ వున్న రచనలు వచ్చాయి.

మానవతావాది గురజాడ కవితలో గరిమెళ్ళ మొదలయిన జాతీయవాదకవుల పాటల్లో దళితుల మీద పూర్తి సానుభూతి కన్పిస్తున్నది. అరసం కవుల రచనల్లో దళితస్పృహ వ్యక్తమైంది. కాని దళితస్పృహను దళితుడే

వ్యక్తీకరించడానికి సమర్థుడని దళితవాదుల వాదన. విరసం ప్రచురించిన "మానవస్మృతి" కవితా సంపుటిలో దళిత స్పృహ వుంది. కాని తెలుగులో జాషువా దళిత ప్రతిఘటనచైతన్యానికి ఆద్యుడుగా భావింపబడ్తున్నాడు. జాషువా దళిత సాహిత్యానికి ప్రతినిధిగా నిలిచాడు. "దళిత రాజ్యం, ఎదురీత, నలుపు, వాయిస్" మొదలైన పత్రికలు దళితతాత్త్వికతను దళిత సాహిత్యాన్ని ప్రచారం చేస్తున్నాయి. "దళిత రాజ్యం" దళిత బహుజన విముక్తి పత్రికగా చెప్పబడ్తున్నది. ఆ పత్రికలో కత్తిపద్మారావు దళిత వాదం దృక్పథంతో "మన చరిత్ర సంస్కృతి" పేరుతో దేశచరిత్రను వ్రాస్తున్నాడు. సమకాలీన సామాజిక ఆర్థిక రాజకీయ సాంస్కృతిక సమస్యలను అవగాహన చేసుకోడానికి గతం చాలా ప్రధాన పాత్ర వహిస్తుందని మన మూలపునాది గతంలో వుంటుందని అందుకని భారతదేశ చరిత్రను ఆంధ్రదేశ చరిత్రను కొత్త వెలుగులో విశ్లేషించవలసిన అవసరముందని గుర్తించి పద్మారావు వ్రాస్తున్నాడు. ఆయన దళిత స్పృహతో కవితలు వ్యాసాలు గ్రంథాలు ప్రకటించాడు. బోయ జంగయ్య "జాతర", బి.ఎస్. రాములు "బ్రతుకుపోరు" దళిత నవలలు. హైద్రాబాదు బుక్ ట్రస్టు వారు "దళిత కథలు" పేరుతో కథానికల సంపుటిని ప్రచురించారు. బి.ఎస్. రాములు "పాలు" కథల సంపుటి వచ్చింది. బి.ఎస్. రాములు, జి.లక్ష్మీనరసయ్యలు మంచి సాహిత్యవిమర్శ వ్యాసాలు రచించారు. దళిత వాదానికి సైద్ధాంతిక తాత్త్వికభూమికను తెలుగులో ఏర్పరచిన వాళ్ళల్లో కె.ఐలయ్య, బి.ఎస్.రాములు, లక్ష్మీనరసయ్య, కత్తి పద్మారావు మొదలైన వాళ్ళున్నారు. శివసాగర్, గద్దరు, మాస్టార్జీ, జి. అంజయ్య, సతీష్ చందర్, మిత్ర, కృష్ణ, గవ్వరాజు, పాడేటి జాన్సన్, యు. సాంబశివరావు, సాహూ, కొలకలూరి స్వరూపరాణి, ఎండ్లూరి సుధాకర్, చెరుకు సుధాకర్, బొజ్జాతారకం, కత్తి పద్మారావు మొదలయిన కవులు దళితవాదంతో కూడిన కవితలు వ్రాసారు. ఈ కవుల్లో శివసాగర్ గద్దరు సతీష్‌చందర్ ఎండ్లూరి సుధాకర్‌లు మార్క్సిస్టు దృక్పథం చేత ప్రభావితులై మొదట్లో కవితలు వ్రాసి తర్వాత దళిత స్పృహతో కవితలు వ్రాసారు. దళిత కవిత్వంతో జాషువానాడు ఆవేదనతో దళితస్పృహ వ్యక్తంకాగా ఈ కవుల కవిత్వంలో ఆగ్రహంతో వ్యక్తమవుతున్నది. ఈ కవులు పురాణాల్లోని

వ్యాస వాల్మీకి ఏకలవ్య కర్ణ అరుంధతి శంబూకులను ప్రతినిధులుగా తీసుకున్నారు. ఏసుక్రీస్తును దళిత ఉషస్సుకు ప్రతీకగా, దళిత యోధునిగా వాడుకున్నారు. బుద్ధుని వెలుగుకు ప్రతీకగా గ్రహించారు. దళిత కవిత్వంలో ఆవేశం ఆవేగం ఆవేదనలు ఆగ్రహంతో కూడిన చక్కని భావాల చిక్కదనం కన్పిస్తున్నది. చైతన్యస్ఫూర్తిని కలిగించే భావాలు వున్నాయి. అనేక కవుల దళిత కవితా సంపుటాలు వెలువడినాయి. కళామండలి పాటలు (1992), కరీంనగర్ జిల్లా దళిత పాటలు (1993) వంటివి కూడా వచ్చాయి. "ఎదురీత" కావ్య సంపుటిలో "పంచమ వేదం" కవితలో సతీష్‌చందర్ ఈ విధంగా ప్రశ్నించాడు.

"నిజం చెప్పండి

పంచముడంటె అయిదో వేలు లేనివాడనేనా అర్థం

మా ముత్తాత ఏకలవ్యుడు చెప్పాడు"

ఎండ్లూరి సుధాకర్ "వర్తమానం" కవితా సంపుటిలోని "పాదముద్రలు" కవితలో------

"నేను బద్దలవుతున్న అగ్ని పర్వతాన్ని

నన్నెవ్వరూ ఆపలేరు ---" అంటాడు. దళితులు ఈ భూమ్మీద పుట్టిన వాళ్ళు (aborigins) మూలవాసీ సిద్ధాంతం (Theory of aboriginism) ను దృష్టిలో పెట్టుకొని మాస్టార్జీ ఈ విధంగా అంటాడు.

"ఈ దేశ వాసులం - ఈ భూమి పుత్రులం
మేం మూలవాసులం - ఆది అసలు జాతులం
భారతాది జనుల బట్టి - బానిసలు మీరంటూ
వీళ్ళ దోపిడేందిరో - వీళ్ళ దగా ఏందిరో
వీళ్ళ నీల్గుడేందిరో - వీళ్ళ నిక్కుడేందిరో......."

ఇటువంటి చారిత్రక సత్యాలు దళితుల ఆత్మగౌరవాన్ని చైతన్యాన్ని ఉద్దీపింజేస్తున్నాయి.

"నాకు చరిత్ర లేదు నాలుగు వేదాలలోంచి
నాలుగు పాదాలలోంచి నన్ను తొలగించారు"

అని బొజ్జాతారకం ఆవేదన వ్యక్తం చేయగా కత్తి పద్మారావు "దేశం డైరీ" కవితా సంపుటిలో

"దేశ వ్యాప్తంగా రక్త తర్పణం చేసిన దళితుల పీడనల
విముక్తికి పోరాటాలకు స్వాగతం సుస్వాగతం" - పలికాడు
"అంటరాని పల్లెల్లో మంటరాజుకుందిరో
నివురు గప్పినా నిప్పు గుప్పునంటుకుందిరో
మా ఆత్మగౌరవాన్ని మీరు గౌరవించకుంటే
ఈ అంటరానిమంటే మీ ఎంటదగులుతుందిరో"
అని సాంబశివరావు హెచ్చరించాడు.
"నా దేశంలో నా ప్రజలు ఎంతకాలం
మనుష్యులుగా గుర్తింపబడరో
అంత కాలం
ఈ తిరుగుబాటు గీతం
పాడుతూనే వుంటాను --" అంటాడు దళిత కవి

పీపుల్‌వార్‌గ్రూపు పార్టీ నుంచి గద్దర్‌ను 1996లో తొలగించిన పార్టీ దళితులను ఇంకా దూరంచేసిందంటాడు "స్వీయ చరిత్రకు ముందు మాట" అనే కవితలో గద్దరు -

ఎర్రజెండాను / ఎదుకు అద్దుకొని
జనం గుండెల చప్పుడునై / గొంతెత్తి గోవులా అర్చినపుడు
గుండె విలికి పోయి / నోటి నిండా పారిన రక్తం రంగుమీద
ఇది ఎరుపా నలుపా అని / చర్చలు లేవనెత్తి
దానికి చరిత్రనే లేకుండా చేశారు.
ఎవ్వడో ఓ మహానుభావుడు" - అని అన్నాడు.

దళిత సాహిత్యం ఇతరకులాల మీద విద్వేషం ప్రకటించేదిగా మాత్రమే కాక కులనిర్మూలన వైపుగా ఉద్యమాన్ని సాగించాలి. ధనికులైన దళిత వర్గం ఏ అవకాశాలను అనుభవించని దళితుల చైతన్యానికి పిలుపునియ్యాలి

అప్పుడే దళితోద్యమం సత్ఫలితాలను ఇయ్యగలుగుతుంది.

దళితులు రాజకీయాధికారం చేజిక్కించుకోవాలి అప్పుడే దళిత సమస్యలు తీరుతాయని ఒక అవగాహన వుంది. అందుకే దళితులు బహుజన సమాజ్ పార్టీ, రిపబ్లికన్ పార్టీ మొదలైన రాజకీయ పార్టీలు వచ్చాయి. పెరియార్ రచనలు భావజాలం కూడా దళితులకు ప్రేరణనిస్తున్నది. బహుజన సమాజ్ పార్టీ కాన్షీరాం మాయవతి నాయకత్వంలో ఉత్తర్ ప్రదేశ్‌లో అధికారంలోకి రావడం దళితవాదానికి ఉత్తేజాన్ని ఉత్సాహాన్నిచ్చింది. ఆంధ్రప్రదేశ్‌లో "దళిత సంఘర్షణ సమితి", మహారాష్ట్రలో "దళిత పాంథర్స్" తమిళనాడులో "దళిత కల్చరల్ ఫ్రంట్" మొదలైన సంస్థలు దళితవాదానికి ప్రచారాన్ని కలిగిస్తున్నాయి.

అయితే దళితవాద కవిత్వం కొంత విమర్శకు కూడా గురయింది. కులవాదాన్ని రగుల్చుతున్నదనే నింద దాని మీద వుంది. అదిపోగా దిగంబర కవులు కుళ్ళుసమాజం మీద నాయకులమీద కసితో తిట్టు పదజాలంతో కవిత్వం వ్రాసారు. స్త్రీవాదులు బట్టబయలుగా అశ్లీల పదాలను వాడారు. అదేవిధంగా దళిత కవులు "నకిలీ గోత్రాలు మడిబట్టల తడి పొగరు, మనువుగాడు, మేం పొల్గొన్న రహస్య రతులు, వృషణాలు, చలం చంకలు" వంటి అశ్లీల పదజాలాన్ని ప్రయోగించి విమర్శకు గురయ్యారు.

*　　*　　*

# పురోగమనం

తెలుగు సాహిత్యంలో ఒకవైపు స్త్రీవాద దళిత వాదాలతో కూడిన సాహిత్యం సృష్టింపబడుతుండగా ఇంకోవైపు మానవతావాదం దృక్పథంతో కవిత్వం ఇతర ప్రక్రియలు వస్తున్నాయి. నిత్య జీవితంలోని సమస్యలకు మానవ సంబంధాల్లో ప్రవేశించిన అమానుషమైన వ్యాపార ధోరణికి స్పందిస్తూ సమాజంలోని రాజకీయాల్లోని అవినీతికి నిస్పృహ చెందుతూ ఆత్మానుభూతికి ప్రాధాన్యమిస్తూ ఏ 'ఇజం'ల జోలికి పోకుండా కొంత మంది కవులు తెలుగులో మంచి కవిత్వం వ్రాస్తున్నారు. శ్రీకాంత శర్మ, వేగుంట మోహన్ ప్రసాద్, ఇస్మాయిల్, ఆశారాజు, అద్దేపల్లి, నాయని కృష్ణకుమారి జె. బాపురెడ్డి ఎన్.గోపి, వంటి కవులెందరో వున్నారు. వాళ్ళ కవిత్వంలో భావవ్యక్తీకరణ కొత్త మెలికలు తిరుగుతున్నది. సిద్ధాంతాలను వల్లించడం, వాక్యాలను పాదాలుగా పేర్చడం, వార్త లాగా వున్న కవిత్వం ఇప్పుడు మెటఫర్ (రూపకం) భంగ్యంతరంగా చెప్పడం, ప్రతీకాత్మతను ఆశ్రయించడం, విరోధాభాసంగా కన్పించే భావ వ్యక్తీకరణలు, ప్రశ్నార్థకాల్లో కన్పించే నిశ్చయార్థాలు మొదలైన కొత్త నుడికారాలతో సాగుతున్నది. భావ శిల్పానికి భావ వైచిత్రికి కవులు ప్రాధాన్యాన్ని ఇస్తున్నారు.

వాషింగ్టన్‌లో వర్షంపడితే
ఇక్కడ మన భూములు ఏరువాకలై
విత్తునాటితే
ఏడు సంద్రాల కవతల కాపుకాస్తుంది

"దిష్టిబొమ్మ" - పేరుతో ఒక యువకవి పెట్టుబడిదారుల కొత్త సామ్రాజ్యవాదం దోపిడీని గురించి తన ఆవేదన వ్యక్తం చేసాడు.

సమకాలిక రాజకీయ పరిణామాలు ఆర్థిక సంస్కరణలను గురించి తెలిస్తేనే పై కవిత్వంలోని భావం అవగతమౌతుంది. నిరుద్యోగం, దోపిడి, ఆకలి, ఆక్రోశాలను అనుభూతులుగా చేసి ఈనాటి కవులు కవిత్వం వ్రాస్తున్నారు. పర్యావరణ కాలుష్యం గురించి మంచి కవితలు వస్తున్నాయి. వేగుంట "ఆఖరి ఆశ్రమం", దీప వృక్షం" ఇస్మాయిల్ "మృత్యువృక్షం, చిలుకలు వాలిన చెట్టు", శ్రీకాంత శర్మ "అనుభూతి గీతాలు" నాయని కృష్ణకుమారి "అగ్ని పుత్రి" ఎన్.గోపి "చిత్ర దీపాలు" చెప్పుకోదగిన కొన్ని కవితా సంపుటాలు. సి. నారాయణ రెడ్డి కలం ఊట ఇంకిపోనిది. అతని కవితావేశం చల్లారనిది. విశ్వనాథ తర్వాత జ్ఞానపీఠ పురస్కారాన్ని అందుకొని తెలుగు కవిత్వ కీర్తిని దేశవ్యాప్తం చేసిన కవి సినారె నవ్యకవుల భావవ్యక్తీకరణలతో పోటీ పడుతూ "దృక్పథం" అనే కవితా సంపుటిని వెలువరించాడు. మధ్యలో నవల కథానికలు విమర్శలు తెలుగుకవిత్వాన్ని కొంత వరకు వెనుకకు నెట్టాయి. మళ్ళీ కవిత్వం స్తబ్దత నుంచి బయటపడి విజృంభిస్తున్నది. ఆధునిక కాలంలో నవలలు కథానికలు కూడా పత్రికల ప్రోత్సాహం లేకున్నా మౌలికమైనవి. చెప్పుకోదగినవి వస్తున్నాయి. ఎన్నో కథానిక సంపుటాలు ప్రచురించబడి నాయి. వేదగిరి రాంబాబు కథానిక వ్యాప్తికి వేదికను నడుపుతున్నాడు. కేతు విశ్వనాథ రెడ్డి మునిపల్లె రాజు వంటి ప్రసిద్ధ కథానిక రచయితలున్నారు. పత్రికల్లో అశ్లీలతతో కూడినవి ప్రచురింపబడినా స్వతంత్రంగా మంచి నవలలు ప్రచురింపబడుతూనే వున్నాయి. నాటకమే మౌలికమైన రచనలు ప్రదర్శనలు లేక కొడిగట్టింది.

* * *

# పరామర్శ గ్రంథాలు


1. ఆంధ్రరచయితలు - మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి, 1983
2. ఆంధ్రవాఙ్మయారంభదశ (రెండు సంపుటాలు) - దివాకర్ల వేంకటావధాని, 1960
3. ఆంధ్రసాహిత్యచరిత్ర - పింగళి లక్ష్మీకాంతం, 1985
4. ఆంధ్రసాహిత్యచరిత్ర సంగ్రహము - ఖండవల్లి లక్ష్మీరంజనము, 1955
5. ఆంధ్రుల చరిత్ర - డా.బి.యస్.యల్ హనుమంతరావు, 1983
6. ఆంధ్రుల సాంఘిక చరిత్ర - సురవరము ప్రతాపరెడ్డి, 1950
7. ఆధునిక తెలుగు కవిత్వంలో విప్లవ ధోరణులు - ఒక విశ్లేషణ డా. ఎమ్ గంగాధర్, 1994
8. ఆధునిక సాహిత్యం : దళితస్పృహ - యువ భారతి ప్రచురణ, 1994
9. ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయము - ప్రయోగములు డా.సి.నారాయణరెడ్డి, 1977
10. ఆధునికాంధ్ర సాహిత్య చరిత్ర - కె.వి.ఆర్, 1992
11. అర్ధశతాబ్దపు ఆంధ్రకవిత్వము - శ్రీపాద గోపాలకృష్ణమూర్తి, 1994
12. ఆరు యుగాల ఆంధ్రకవిత - ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి, 1986
13. ఉష : కిరణాలు - యండమూరి సత్యనారాయణరావు, 1960
14. కన్నడ సాహిత్య చరిత్ర - డా. ఆర్వీయస్ సుందరం, 1977
15. కాకతీయ శాసన సాహిత్యము - పి.వి. పరబ్రహ్మశాస్త్రి, 1981
16. తమిళ సాహిత్య చరిత్ర - చల్లారాధాకృష్ణ శర్మ, 1976
17. తెలుగు కవితా వికాసం - కడియాల రామమోహనరాయ్, 1982
18. తెలుగు భాషాచరిత్ర - సం :భద్రిరాజు కృష్ణమూర్తి, 1979
19. తెలుగు భాషా చరిత్ర - తులనాత్మక పరిశీలన - వాయువి కృష్ణకుమారి, తమ్మారెడ్డి నిర్మల, 1984
20. తెలుగు శాసనాలు - జి. పరబ్రహ్మ శాస్త్రి, 1975
21. తెలుగు సాహిత్యం - చారిత్రక భూమిక - కె.కె. రంగనాథాచార్యులు, 1990
22. తెలుగు సాహిత్యసమీక్ష (రెండు సంపుటాలు) - జి.నాగయ్య, 1983
23. తెలుగులో కవితావిప్లవాల స్వరూపం - వెల్చేరునారాయణరావు, 1978
24. నవ్యాంధ్ర సాహిత్యవీథులు - కురుగంటి సీతారామయ్య, 1994

25. ప్రబంధ మణిభూషణము - సం : నిడదవోలు వేంకటరావు, పోణంగి శ్రీరామ అప్పారావు, 1971
26. ప్రబంధ రత్నావళి - సం :వేటూరి ప్రభాకరశాస్త్రి, 1976
27. వేములవాడ చరిత్ర - శాసనములు - బి.ఎన్. శాస్త్రి, 1991
28. వీరేశలింగం - సమగ్ర పరిశీలన - అక్కిరాజు రమాపతిరావు, 1972
29. శివార్పణమ్ - నిడదవోలు శివ సుందరేశ్వరరావు, 1995
30. సమగ్ర ఆంధ్రసాహిత్యం - ఆరుద్ర, 1965
31. సాహిత్యచరిత్రలో చర్చనీయాంశాలు - జి.వి. సుబ్రహ్మణ్యం, 1991
32. స్త్రీవాద ధోరణులు - సమకాలీన సాహిత్యం - యువ భారతి ప్రచురణ, 1994
33. Abhilekhamala (Collection of Ancient inscriptions) Edi-Ramakant Jha Harihar Jha 1972.
34. Early Telugu Inscriptions (upto 1100 A.D) Edi- Budaraju Radhakrishna
35. The Ancient History of the Near East - H.R. Hall 1963
36. The Eastern Chalukyas - N. Venkataramanayya 1950.